**జటాయువు**, సం. వి. ఉ. న్. పుం. 1: చూ, మహిసాక్షి*; 2. రూ-జటాయుస్సు. సంపాతి తమ్ముఁడు: చూ, దాక్షాయ్యము.
**జటాలము**, సం. విణ. జడలుగలది: జటిలము.
**జటావల్లి**, సం. వి. ఈ. స్త్రీ: చూ, రుద్రజడ*.
**జటి**, సం. వి. న్. పుం. 1. రూ-జటినము, జువ్వి *: చూ, ప్లక్షము; 2: చూ, మఱ్ఱి; 3. జడలుగల సన్యాసి: చూ, సన్యాసి. 1.
**జటిల**, సం. వి. అ. స్త్రీ. 1; చూ, మాంసి*; 2: చూ, పిప్పలి. 1.
**జటిలము**, సం. వి. అ. పుం. 1: చూ, సింహము; విణ. 2: చూ, జటాలము.
**జటులము**, సం. వి. అ. పుం. చూ, రూ-జడులము.
**జఠరంకోనబిభ ర్తికేవలమ్**, న్యా. ఎవఁడు తన పొట్టనుమాత్రము నింపుకొనఁడు.
**జఠరకోశము**, పా: చూ, అన్నకోశము.
**జఠరక్రియలు**, అం. ఖల్వము. క్షామము, పూర్ణము. (౩)
**జఠరము**, సం. వి. అ. పుం. 1. రూ - జఠరము-కడుపు: చూ, భ్రూణము. 1; 2. రూ-జఠరము. అన్నకోశము (జాఠరిక రసము ఊరెడు తిత్తి): చూ, భ్రూణము. 1; విణ. 3. ముది సినది, వృద్ధినొందినది: చూ, వృద్ధము. 2. 4. కఠినమైనది: చూ, బెడిదము.
**జఠరాగ్ని**, సం. వి. ఇ. పుం. అన్నకోశమందలి వేడిమి: చూ, వహ్ని. 1-౧౬.
**జడ**, సం. వి. ఆ. స్త్రీ: చూ, శూకశింబి*.
**జడత**, సం. వి. ఆ. స్త్రీ. 1. = జడను. మనస్సును అంగములను చేష్ట లుడిగియుండుట, జాడ్యము: చూ, విలంబము. 1; అం. 2. (జాడ్యము) (అవసరమునకై పరికించి పరికించి యాతఁడు చెంగటం జేరునంతనే యేమిచేయుటకుం దోఁచక యూర కుండెను.): చూ, సంచారిభావములు
**జడత్వము**, సం. వి. అ. పుం: అచేతనత్వము. జడిమ, జడిమము.
**జడధి**, సం. వి. ఇ. పుం: చూ, సముద్రము.
**జడము**, సం. వి. అ. న. 1. రూ-జలము. నీరు: చూ, సలిలము; విణ. 2. చల్లనిది: చూ, శీతలము. ౧; 3. తెలివి లేనిది: చూ, మఱపు. 2; 4. మూఁగది; 5. ప్రాణములేనిది: అచిత్తు, అచేతనము, అచేతస్కము, అచైతన్యము, అప్రాణి.
**జడల**, సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ*: చూ, దొండ.
**జడాత్మ**, సం. వి. న్. పుం: చూ, మహిషము.
**జడిమ**, సం. వి. న్. పుం. చూ, జడత్వము.
**జడిమము**, సం. వి. అ. పుం. —పై.—
**జడుఁడు**, సం. విణ. 1. తెలివిలేనివాఁడు, మందుఁడు: చూ, మూర్ఖుఁడు; 2. మంచుచేతఁ గొట్టఁబడినవాఁడు: చూ, హిమగ్రస్తుఁడు.
**జడులము**, సం. వి. అ. పుం. పుట్టుమచ్చ: రూ-జటిలము: చూ, లక్షణము. 1-౨౭.
**జడ్జి**, వా. వి. తీర్పుక ర్త; 2. విమర్శకుఁడు.
**జడ్జిమెంటు**, వా. వి. తీర్పు.
**జతుక**, సం. వి. ఆ. స్త్రీ. 1. = చిపుక: చూ, తైలపాయిక; 2. చూ, సురలి*; 3. కోరింద*: చూ, ముచపత్ర.
**జతుకము**, సం. వి. అ. న. 1: చూ, లక్క; 2. ఇంగువ: చూ, హింగువు.
**జతుకాష్ఠన్యాయము**, న్యా. లక్కపుల్ల యొక్కడ విఱిచిన నక్కడ విఱిగి మరల అతికిన నతుకుకొని మరల విఱిచిన విఱుగు నను రీతి.
**జతుకి**, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-జతుక. 2*.
**జతుకృత్తు**, సం. వి త్. స్త్రీ. రూ-జంతుకృత్తు. కోరింద*: చూ, ముచపత్ర.
**జతుని**, సం. వి. ఈ. స్త్రీ. గుల్లగూబ: చూ, పకినంపుఁబులుఁగు.
**జతుపుత్రము**, సం. వి. అ. పుం, న. ద్యూతవిశేషము; నయము: చూ, సొగటాలు.
**జతురక్తము**, సం. వి. అ. పుం: చూ, లక్క.
**జతువు**, సం. వి. ఉ. న 1: చూ, లక్క; 2: చూ, రూ-జతూక. 2.
**జతూక**, సం. వి. ఆ. స్త్రీ. 1. కోరింద*: చూ, ముచపత్ర; 2. = చిపుక, రూ-జతుక-జమూక: చూ, తైలపాయిక.
**జతూకము**, సం. వి. అ. న. రూ-జతుక-జతువు: చూ, లక్క.
**జతూముఖము**, సం. వి. అ. పుం. వ్రీహిధాన్యము: చూ, ధాన్యము.
**జత్రువు**, సం వి. ఉ. న. 1. మూఁపులయొక్క సంధియెముకలు, మెడకొంకులు: చూ, శల్యము. 1; అం. 2. పురుష లక్షణాంగములలో నొకటి. (గూఢములైన ప్రశస్తములు): చూ, లక్షణాంగములు; 3. స్త్రీలక్షణాంగములలో నొకటి (గూఢములై నరములు కానరాకున్న పుణ్యాత్మురాలగు): చూ, స్త్రీలక్షణాంగములు. (బ. జత్రులు.)
**జదూధము**, సం. వి. అ. న: చూ, మాంసము.
**జనంగముఁడు**, సం. వి. అ. పుం. మాలవాఁడు: చూ, మాల(1).
**జనక**, సం. వి. అ. పుం: చూ, సహదేవి*.
**జనకము**. అం. జన్యతాళములలోనొకటి: చూ, జన్యతాళములు.
**జనకరాగమునందుఁ బుట్టిన భాషాంగములు**, అం. ఇవి 98— (1. సౌవీరజ 4, 2. కకుజ 7, 3. టక్కజ 21, 4. పంచమజ 10, 5. భిన్నపంచమజ 4, 6. ఉత్కలకైశికిజ 2. 7. హిందోళజ 9, 8. భోటజ 1, 9. మాళవకైశికిజ 13, 10. గాంధారపంచమిజ 1, 11. భిన్నషడ్జకజ 17, 12. వేసరషాడవజ 2, 13. మాళవపంచమిజ 3, 14. తానజ 1, 15. పంచమషాడవజ 3. = మొత్తము సౌవీరాది పదునైదుభాషాంగములు 98. (వీని నాయా శీర్షికా పదములకడను జూచుకొనవలెను.): చూ, భాష. 1. (96 అనికొందఱు.)
**జనకుఁడు**, సం. వి. అ. పుం. 1. తండ్రి: చూ, పితరుఁడు. 1; 2. జనకమహారాజు: చూ, రాజు. 1—౫౪.
**జనత**, సం. వి. ఆ. స్త్రీ. జనసమూహము: చూ, సమూహము; 2. బ్రాహ్మణసమూహము: చూ, సూత్రము. 1—౬౯.
**జననము**, సం. వి. అ. న. 1: చూ, పుట్టుక; 2. వంశము, గోత్రము: చూ, వంగడము.
**జనని**, సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి: చూ, మాత. 1; 2: చూ, దయ; 3. కోరింద*: చూ, ముచపత్ర.
**జననీయము**, సం. వి. అ. న. నెయ్యి: చూ, హవిస్సు.2.

జనపదము, సం. వి. అ. పుం. 1. మండలము: చూ, దేశము; 2. పల్లెటూరు: చూ, దేశము.
జనపదుఁడు, సం. వి. అ. పుం: చూ, మనుష్యుఁడు.
జనము, సం. వి. అ. పుం. 1: చూ, ప్రజ; 2: చూ, జనలోకము.
జనమేజయసంజ్ఞికుఁడు, సం. వి. అ. పుం. జనమేజయుఁడు: చూ, రాజు. 1.—౫౫.
జనమేజయుఁడు, —పై.—
జనయిత, సం. వి. ఋ. పుం. తండ్రి: చూ, పితరుఁడు. 1.
జనయిత్రి, సం. వి. ఈ. స్త్రీ. రూ-జనిత్రి. తల్లి: చూ, మాత. 1.
జనలోకము, అం: చూ, ఊర్ధ్వలోకములు: (చూ, లోకము. 1.)
జనవాక్యంచ కర్తవ్యమ్. న్యా. పదుగురిమాటను పాటింపవలయును.
జనశ్రుతి, సం. వి. ఈ. స్త్రీ. నానుడి: చూ, శబ్దము. 2.
జనాంతము, సం. వి. అ. పుం. మండలము: చూ, దేశములు.
జనాంతికము, సం. వి. అ. న. చాటుమాటు: చూ, శబ్దము. 2.
జనాభా, వా. వి. జనసంఖ్య.
జనార్దవము, సం. వి. అ. న: చూ, సొంటి; అం. 2: చూ, క్షేత్రములు.
జనార్దనుఁడు, సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. యముఁడు: చూ, హరి. 5; 3: చూ, శివుఁడు.
జనార్దనాయ నమః, అం. (జనార్దనః = జన్మమరణాన్యర్థయతి = నాశయతీతి.) జననమరణముల బోఁగొట్టు వస్తువుకొఱకు నమస్కారము: చూ, ఓమ్.
జని, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. పెండ్లాము: చూ, భార్య; ఈ. స్త్రీ. 3. కోడలు: చూ, స్నుష; 4. కోరింద*: చూ, ముచపత్రి; ఇ. పుం, స్త్రీ. 5. రూ-జన్మ - జన్మము-జననము-జనుస్సు: చూ, పుట్టుక.
జనించు, సం. అ. క్రి. కలుగు: చూ, పుట్టు. 2.
జనితము, అం. 1: చూ, భూచారులు; 2: చూ, కరణములు.
జనువు, సం. వి. ఉ, న్. న: చూ, పుట్టుక.
జనుషాంధుఁడు, సం. విణ. పుట్టుగుడ్డి: చూ, రేచీఁకు.
జన్మకీలుఁడు, సం.వి. అ. పుం: చూ, విష్ణువు. 1.
జన్మభూమి, సం. వి. ఇ. స్త్రీ. పుట్టినచోటు: చూ, భూమి. 1.
జన్మము, సం. వి. అ. పుం, న. న్. న. 1: చూ, పుట్టుక; అం. 2: చూ, తారలు.
జన్మవర్త్మ, సం. వి. న్. న. ఆఁడుగుఱి: చూ, భగము. 12.
జన్మి, సం. వి. న్. పుం: చూ, శరీరి.
జన్మించు, సం. అ. క్రి. కలుగు: చూ, సంభవించు.
జన్య, సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లిచెలికత్తె; 2. తోఁడిపెండ్లికూఁతురు; 3. సుఖము: చూ, సంతోషము.
జన్యతాళములు, అం. ఆదితాళము, దర్పణము, చర్చరి, సింహలీలము, కందర్పము, సింహవిక్రమము, శృంగారము, రతిలీలము, రంగతాళము, పరిక్రమము, ప్రత్యంగము, గజలీలము, త్రిభిన్నము, వీరవిక్రమము, హంసలీలము, వర్ణభిన్నము, రాజచూడామణి, రంగద్యోతము, రాజతాళము, సింహవిక్రీడితము, వనమాలి, వర్ణతాళము, రంగప్రదీపకము, హంసనాదము, సింహనాదము, మల్లికామోదము, శరభలీలము, రంగాభరణము, తురంగలీల, సింహానందనము, జయశ్రీ, విజయానందము, ప్రతితాళము, ద్వితీయకము, మకరందము, కీర్తితాళము, విజయము, జయమంగళము, రాజవిద్యాధరము, మత్యము, జయతాళము, హంసుక్కకము, నిస్సారకము, క్రీడాతాళము, త్రిభంగి, కోకిలప్రియము, శ్రీకీర్తి, బిందుమాలి, సమతాళము, నందనము, దురీక్షణము, మల్లిక (మత్తిక), డెంకిక, వర్ణమత్తిక, అభినంది, ఉత్తరక్రీడ, మల్లతాళము, దీపకము, అనంగలీలము, విషమము, నాంది, కుందము, ముకుందము, ఏకతాళము, కంకాళము, చతుస్తాళి, ఝుంపజమ్మ (దొంబళిక), అభంగము, రాజబంగాళము, లఘుశేఖరము, ప్రతాపశేఖరము, గజఝంప, చతుర్ముఖము, ఝంప, ప్రతిమర్ఠము, తృతీయకము, వసంతము, లలితము, రతి, కరణము, యతి, షట్తాళము, వర్ధనము, వర్ణయతి, రాజనారాయణము, మదనము, పార్వతీలోచనము, గరుడము, శ్రీనందనము, లీలావిలోకితము, లలితప్రియము, లసితము, ప్రియము, జనకము, లక్ష్మీశము, రాగవర్ధనము, ఉతవము. (96,: (చూ, తాళము. 2.): (చూ, వీణ.)
జన్యము, సం. వి. అ. న. 1. పోరు: చూ, యుద్ధము; 2. అంగడి: చూ, దుకాణము; 3. దూఱు: చూ, నింద. 1.
జన్యుఁడు, సం. వి. అ. పుం. 1. తండ్రి: చూ, పితరుఁడు. 1; 2. తోడిపెండ్లికొడుకు; విణ. 3. పుట్టఁదగినవాఁడు; 4. పుట్టించువాఁడు.
జన్యువు, సం. వి. ఉ. పుం. 1. జంతువు: చూ, శరీరి; 2. అగ్ని: చూ, వహ్ని. 1; 3. నలువ: చూ, బ్రహ్మ. 1.
జప, సం. వి. ఆ. స్త్రీ 1. దాసనము *: చూ, హయజీవనమారకము; 2. మంకెన *: చూ, రక్తకము.
జపమాల, సం. వి. అ. న. అక్షమాల, అక్షసరము, అక్షసూత్రము: చూ, మాల. 1.
జపము, సం. వి. అ. పుం. రూ-జాపము. 1. మంత్రావృత్తి: చూ, తపము; 2. వేదాధ్యయనము: అధీతి, అధ్యయనము, ఉపక్రమము.
జపవటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, జపమాల.
జపాస్ఫటికన్యాయము, న్యా. మంకెనపువ్వు స్ఫటికము దగ్గఱఁ బెట్టిన స్ఫటికమంతయు నెఱ్ఱఁబడినరీతి.
జపించు, సం. స. క్రి: చూ, తపించు. 2.
జప్యము, సం. వి. అ. న. గాయత్ర్యాదిమంత్రము: చూ, మంత్రము. 1: (చూ, ఓమ్: చూ, గాయత్రి): విణ. 2. జపింపఁదగినది.
జబరు, జబరుదస్తీ. వా. వి. బలాత్కారము.
జమదగ్ని, అం: చూ, మహర్షులు.
జమదగ్నిజుఁడు, సం. వి. అ. పుం: చూ, పరశురాముఁడు.
జమాయించు, వా. క్రి. డమాయించు, బుకాయించు.
జయ, సం. వి. ఆ. స్త్రీ. 1. = జే. దుర్గ: చూ, పార్వతి. 1; 2. పార్వతియొక్క చెలికత్తె; 3. తదియ: చూ, తిథి. 1; 4. అష్టమి: చూ, తిథి. 1; 5. త్రయోదశి: చూ, తిథి. 1; 6. కరక*: చూ, హరీతకి; 7. రూ-జయంతి. తక్కలి*: చూ, వైజయంతి; 8. నెల్లి*. చూ, శ్రీపర్ణము. 1;

9. గంజావి*: చూ, త్రిశూలిని; 10. అరఁటి*: చూ, రంభ. 2; 11. బ్రమ్మి*: చూ, సోమెద; 12. బౌద్ధదేవి: చూ, స్వాహా. 2; అం. 13: చూ, సంవత్సరములు (రూ-జయము); 14: చూ, దీవన; 15: చూ, హణిగలు.

**జయంతి**, సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రుని కూఁతురు: చూ, సూన. 1-౩; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. చెక్కెము: చూ, విడము; 4. తక్కలి*: చూ, వైజయంతి; 5. పండుగతోఁ గూడిన తిథి (నృసింహజయంతి. శ్రీకృష్ణజయంతి మొ.)

**జయంతిక**, సం. వి. అ. స్త్రీ: చూ, సోమెద *.

**జయంతుఁడు**, సం. వి. అ. పుం. 1. ఇంద్రునికొడుకు, కాకాసురుఁడు: చూ, సూనుఁడు. 1-౨౫; 2: చూ, భీముఁడు; 3: చూ, శివుఁడు; 4: చూ, హిమాంశువు.

**జయఘంట**, సం. వి. అ. స్త్రీ. = జేగంట. 1. డెంగురు: చూ, వీణ. 1-౪౬; అం. 2. ఘనవాద్యము లాతింటిలో నొకటి; చూ, ఘనవాద్యములు; 3: చూ, పంచమహావాద్యములు.

**జయతాళము**, అం: చూ, జన్యతాళములు.

**జయద్రువు**, సం. వి. ఉ. పుం: చూ, స్పృష్టక్షీరము *.

**జయనము**, సం. వి. అ. న. 1. జయించుట: చూ, విజయము; 2. గుఱ్ఱము లోనగువాని కవచము: చూ, హయము: (చూ, వారవారణము.)

**జయపద**, అం: చూ, క్షుద్రప్రబంధము.

**జయపెట్టు**, మి. అ. క్రి: చూ, దీవించు.

**జయభేరి**, అం: చూ, స్వరము. 2-౪౬—(3).

**జయమంగళము**, అం. 1: చూ, జన్యతాళములు; 2. జయమంగళ వృత్తము: చూ, వృత్తము. 1.

**జయము**, సం. వి. అ. పుం 1: చూ, రూ-జయనము. 1; అం. 2: చూ, జయ. 13.

**జయనామము**, అం: చూ, క్షేత్రములు.

**జయవారము**, సం. వి. అ. పుం. మంగళవారము: చూ, వారము. 1.

**జయవాహిని**, సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రునిభార్య: చూ, భార్య. 1-౭.

**జయశ్రీ**, అం: చూ, జన్యతాళములు.

**జయాజీవుఁడు**, సం. వి. అ. పుం. మేకముకట్టి జీవించెడువాఁడు: చూ, శైలూషుఁడు.

**జయించు**, సం. స. క్రి. గెలుచు: చూ, విజయమునొందు.

**జయుఁడు**, సం. వి. అ. పుం: చూ, జయంతుఁడు. 1; 2. యుధిష్ఠిరుఁడు: చూ, విజయుఁడు. 1; 3. విష్ణువుయొక్క ద్వారపాలకుఁడు: చూ, విజయుఁడు. 2; అం. 4: చూ, వసువులు.

**జయువు**, సం. వి. ఉ. పుం. మందు. 1.

**జర**, సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-జర్జరము: చూ, ముసలితనము; అం. 2: చూ, ఊర్ములు.

**జరంతము**, సం. వి. అ. పుం: చూ, మహిషము.

**జరంతుఁడు**, సం. వి. అ. పుం: చూ, వృద్ధుఁడు.

**జరఠ**, సం. వి. ఆ. స్త్రీ. రూ-జఠరము, కడుపు, పొట్ట: చూ, ఘ్రాణము. 1.

**జరఠము**, సం. విణ. 1. ముదిసినది: చూ, వృద్ధము. 2; 2. కఱకైనది: చూ, జెడిదము; 3 పసుపు కలిసిన తెలుపువర్ణము గలది; చూ, వర్ణము. 6.

**జరణము**, సం. వి. అ. న. 1. జీలకఱ్ఱ: చూ, సుషవి. 2; 2. తెల్లజీలకఱ్ఱ: చూ, సుషవి. 2; 3. ఇంగువ: చూ, హింగువు. 2; పుం. 4. సౌవర్చలవణము: చూ, లవణము. 1.

**జరత్కారుఁడు**, సం. వి. అ. పుం. ఒకానొకరాజు: చూ, రాజు. ౧-౫౬.

**జరత్కారువు**, సం. వి. ఊ. స్త్రీ. మనసాదేవి, జరత్కారుని భార్య: చూ, భార్య.

**జరద్గవము**, సం. వి. అ. పుం. ముసలియెద్దు: చూ, వృషభము. 1.

**జరాభీరువు**, సం. వి. ఉ. పుం: చూ, మన్మథుఁడు.

**జరాయుజము**, సం. విణ. మావివలనఁ బుట్టినది.

**జరాయుజములు**, అం: చూ, సృష్టిభేదములు.

**జరాయువు**, సం. వి. ఉ, న్. పుం. రూ-జరాయుస్సు. 1: చూ, మావి. 2; 2: చూ, జటాయువు. 2.

**జరాసంధజిత్తు**, సం. వి. త్. పుం: చూ, భీమసేనుఁడు.

**జరాసంధుఁడు**, సం. వి. అ. పుం: చూ, బార్హద్రథి,

**జరుఁడు**, సం. విణ: చూ, వృద్ధుఁడు. 1.

**జరూథము**, సం. వి. అ. న. వంజుడు: చూ, మాంసము.

**జర్జరము**, సం. వి. అ. న. 1. పాఁచి: చూ, శైవాలము; 2. ఇంద్రుని చెక్కెము: చూ, విడము; 3. ఇంద్రనీలమణి: చూ, రత్నములు. 1-౬; పుం. 4. కోయిల: చూ, పికము; విణ. 5. శిథిలమైనది: చూ, శ్లథము; 6. జీర్ణమైనది: చూ, యాతయామము.

**జర్జరితము**, సం. విణ: చూ, జర్జరము. 5.

**జర్జరీకము**, 1.—పై—: 2. పెక్కుతూంట్లుగలది.

**జర్ఝరము**, సం. వి. అ. పుం. 1: చూ, జర్జరము. 2; విణ. 2. చల్లఁబడినది: చూ, ప్రోక్షితము.

**జర్ఝరికము**, సం. వి. అ. న. 1: చూ, జల్లెడ; పుం. 2: చూ, ముసలితనము.

**జర్ణము**, సం. వి. అ. పుం. చెట్టు: చూ, వృక్షము.

**జర్ణుఁడు**. సం. వి. అ. పుం: చూ, హిమాంశువు

**జర్తిలము**, సం. వి. అ. పుం. బ. అడవినువ్వులు: చూ, నువ్వులు.

**జల**, వా: చూ, జలలు. (నీటియూఁట).

**జలకంటకము**, సం. వి. అ. పుం. 1. మొసలి: చూ, మత్స్యము. 1; 2. పరికె, త్రిశృంగము: చూ, శృంగాటము 2.

**జలకపి**, సం. వి. ఇ. పుం. శింశుమారమను చేఁప: చూ, మత్స్యము. 1.

**జలకరంకము**, సం. వి. అ. పుం. 1. టెంకాయ: చూ, ముక్కంటిపండు; 2. మబ్బు: చూ, మేఘము. 1; 3 శంఖము: చూ, సంకు. 1; 4. అల: చూ, వీచి. 1.

**జలకల్కము**, సం. వి. అ. పుం. చూ, బురద.

**జలకాంక్షి**, సం. వి. న్. పుం: ఏనుఁగు: చూ, హస్తి.

**జలకామము**, సం. వి. అ. పుం: చూ, ప్రబ్బలి*.

**జలకిరాటము**, సం. వి. అ. పుం. గుఱ్ఱపుమూతిచేఁప: చూ, మత్స్యము. 1.

జలకుక్కుటము, సం. వి. అ. పుం. నీరుకోడి: చూ, పుంజు.
జలకుక్కుటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, చీరపిట్ట:
జలకుక్కుభము, సం. వి. అ. పుం. కోయష్టి: చూ, బకము. 1—౫.
జలకూపి, సం. వి. ఈ. స్త్రీ. కోనేరు: చూ, సరస్సు. 1—౪.
జలకూర్చిక, సం. వి. ఆ. స్త్రీ. ఒకరకము తోఁటకూర*: చూ. మారిషము.
జలకూర్మము, సం. వి. అ. పుం. ఉలచమీను: చూ, మత్స్యము. 1.
జలకేశము, సం. వి. అ. పుం. పాఁచి*: చూ. శైవాలము. (నాఁచు అనియు.)
జలక్రీడ, సం. వి. ఆ. స్త్రీ: చూ, విలాసము. 1.
జలగము, సం. వి. అ. న. మద్యవిష్టము: చూ, సుర. 2—౮.
జలగుల్మము, సం. వి. అ. పుం. 1: చూ, తాఁబేలు; 2. నీటి సుడి: చూ, సుడి. 1; 3: చూ, ముంగిలి. 2; 4. నాలుగు కాలువలు కలియుచోటు: చూ, స్థానము. 1.
జలగ్రహము, సం. వి. అ. న. నెగడు: చూ, సీటిపయ్యము.
జలచరము, సం. వి. అ. పుం. జలజంతువు: చూ, మత్స్యము. 1.
జలజ, సం. వి. ఆ. స్త్రీ. 1. నీరుపట్టుదోమ: చూ, మశకము; 2. రమ: చూ, లక్ష్మి.
జలజంబువు, సం. వి. ఉ. పుం. నీరునేరేడు*: చూ, సురభిపత్ర. 1—౩.
జలజము, సం. వి. అ. న. 1. తామర*: చూ, పద్మము. 1; 2. శంఖము: చూ, సంకు. 1.
జలజిహ్వము, సం. వి. అ. పుం. మొసలి: చూ, మత్స్యము. 1.
జలజుఁడు, సం. వి. అ. పుం: చూ, హిమాంశువు.
జలడింభము, సం. వి. అ. పుం. నత్తగుల్ల: చూ, సంకు. 1.
జలతండులీయము, సం. వి. అ. పుం: చూ. చెలిమిడి*.
జలతర్పణము, సం. వి. అ న: చూ, అంబుతర్పణము.
జలతస్కరుఁడు, సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు.
జలతాలము, సం. వి. అ. పుం. ఇల్లిశమను చేఁప: చూ, మత్స్యము. 1.
జలతైలబిందున్యాయము, న్యా. నీళ్లమీఁదవేసిన నూనెచుక్క నీరంతటఁగలియఁబాఱుననురీతి.
జలత్ర, సం. వి. ఆ. స్త్రీ. వానలో నుపయోగించు గూడ: చూ, వారిత్ర.
జలదము, సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. ముస్తె*: చూ, ముస్తకము; పా. 3. ఒకానొక వృత్తము. ఒక్కొక్క పాదమునందు భ-ర-న-భ గురువులుగలిగి పదింట యతిగల త్రయోదశ ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉదా:— "బంగరుచుంగు పచ్చడము-పైఁగల యా, తంగెడదేశవాసు జల-దంబులచే, తం గడు సన్నుతింతు నవ-తారయతిన్, బొంగుచు సారె ఛర్నభగ-ముల్ గదియన్.": చూ. వృత్తము. 1.
జలదస్యుఁడు, సం. వి. అ. పుం: చూ. సూర్యుఁడు.
జలదివ్యము, అం: చూ, దివ్యములు.
జలద్రోణి, సం. వి. ఈ. స్త్రీ. నూతియొద్దగాఁడి: చూ, నిపానము.
జలధరమాల, అం. ఒకానొక వృత్తము. ఒక్కొక్క పాదమునందు మ-భ-స-మ గణములుగలిగి తొమ్మిదింట యతిగల ద్వాదశఛందసునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.— "దీరుల్ మెచ్చం గృతులన 1. తి శ్రీదంబై, మారా, కారా జలధర మాలావృత్తంబై రాజిల్లున్, భువిఁ జతుః రాస్య క్రాంతుల్, సారంజేరన్ మభసమ ః సంయుక్తంబై.": చూ, వృత్తము. 1.
జలధరము, సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.
జలధి, సం. వి. ఇ. పుం. 1. కడలి: చూ, సముద్రము; 2. నక్క: చూ, సృగాలము.
జలధిజ, సం. వి. ఆ. స్త్రీ: చూ, లక్ష్మి.
జలనకులము, సం. వి. అ. పుం. నీటిపిల్లి: చూ, మత్స్యము. 1.
జలనిధి, సం. వి. ఇ. పుం. కడలి: చూ, సముద్రము.
జలనిర్గమము, సం. వి. అ. పుం. తూము: చూ, భ్రమము. 4.
జలనీలి, సం. వి. ఈ. స్త్రీ. పాఁచి*: చూ, శైవాలము.
జలనూపురము, సం. వి. అ. పుం. నీరుకనుము*: చూ, మహాకదంబము.
జలపిప్పకము, సం. వి. అ. పుం. చేఁప: చూ, మత్స్యము. 1.
జలపిప్పలి, సం. వి. ఈ. స్త్రీ: చూ, కచ్చటము*.
జలపోటనము, సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.
జలప్రదుఁడు, సం. వి. అ. పుం. ఒకానొక పితృదేవత: చూ, హరి. 5—౪.
జలప్రియము, సం. వి. అ. పుం. పంది: చూ, సూకరము.
జలప్లవము, సం. వి. అ. పుం: చూ, జలనకులము.
జలబిందువు, సం. వి. ఉ. పుం. 1. నీటిచుక్క: చూ, బొట్టు. 6; 2. దుంపగడ్డ*: చూ, శృంగాటకము.
జలబిడాలము, సం. వి. అ. పుం: చూ, జలనకులము.
జలబిల్వము, సం. వి. అ. పుం. 1: చూ, తాఁబేలు; 2. ఎండ్రకాయ: చూ, పీత; 3. నీళ్లలోనిపాద; 4. నీళ్లనిలుచుతావు: చూ, స్థానము. 1.
జలబ్రహ్మి, సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలి*: చూ, బచ్చలి.
జలమంటపము, సం. వి. అ. పుం: చూ, పాకుఁడు.
జలమక్షిక, సం. వి. ఆ. స్త్రీ. జలగ: చూ, బుడ్డపేఁడు.
జలమద్గువు, సం. వి. ఉ. పుం. మత్స్యరంకమనుపక్షి: చూ, మత్స్యరంకము.
జలమయము, సం. విణ. జలవికారము: చూ, సలిలము. 1—౨.
జలమసి, సం. వి. ఇ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.
జలమార్జా(ర)లము, సం. వి. అ. పుం: చూ, జలనకులము.
జలము, సం. వి. అ. న. 1. = జలకము. నీరు: చూ, సలిలము. 1; 2. ఉచ్చ: చూ, మూత్రము; 3. గోగర్భస్థ పిండము: చూ, ప్రజనము. 1; 4: చూ, హ్రీబేరము*; 5. ఎఱ్ఱతామర, ఎఱ్ఱకలువ*: చూ, సహస్రపత్రము. 1—౩; విణ. 6. జడము: చూ. మఱపు. 2; అం. 7: చూ, స్వామ్యములు.
జలముచము, సం. వి. చ్. పుం. మబ్బు: చూ, మేఘము. 1.
జలయంత్రనికేతనము, సం. వి. అ. పుం. సముద్రగృహము: చూ, సదనము. 1.
జలరంజి, సం. వి. ఈ. స్త్రీ: చూ, దాత్యూహము.
జలరాగము, సం. వి. అ. పుం. కెంపులలో భేదము: చూ, రత్నములు. 1—౨—(3).

జలరాశి, సం. వి. ఇ. పుం: చూ, సముద్రము.
జలరుండము, సం. వి. అ. పుం. 1. నీటిసుడి: చూ, సుడి. 1; 2. పాము: చూ, సర్పము; 3. నీటితుంపురులు: చూ, సలిలము. 1—౩౦.
జలరూపము, సం. వి. అ. పుం. మొసలి: చూ, మత్స్యము. 1.
జలరోహితుఁడు, సం. వి. అ. పుం: చూ, మూలభేఁడు.
జలలత, సం. వి. ఆ. స్త్రీ. అల: చూ, వీచి. 1.
జలలు, వా. వి. బ. కొండలలోఁతున కొన్ని కొన్ని నియత మార్గములవెంబడి పాఱుచుండు ప్రవాహములకు జలలని పేరు: చూ, జల.
జలవరంటము, సం. వి. అ. న: చూ, మోగము.
జలవర్ధనము, సం. వి. అ. పుం: చూ, బరివెంక*.
జలవర్షుకము, సం. వి. అ. పుం. పుష్కలమను మేఘము: చూ, మేఘము. 1.
జలవల్కలము, సం. వి. అ. పుం: చూ, శైవాలము*.
జలవల్లి, సం. వి. ఈ. స్త్రీ. నీరుగొలిమిడి*: చూ, సహస్రపత్రము. 1—౪.
జలవాపికము, సం. వి. అ పుం. 1. కాకోచియను చేఁప: చూ, మత్స్యము. 1; 2. ఇల్లీశమను చేఁప: చూ, మత్స్యము. 1.
జలవికారము, సం. విణ: చూ, జలమయము.
జలవృశ్చికము, సం. వి అ. పుం. నీరుతేలు: చూ, మత్స్యము. 1.
జలవేతసము, సం. వి. అ. పుం. నీరుప్రబ్బలి*: చూ, ప్రబ్బలి.
జలవ్యధము, సం. వి. అ. పుం. గద్దముక్కుచేఁప: చూ, మత్స్యము. 1.
జలవ్యాళము, సం. వి. అ. పుం. నీటిపాము: చూ, సర్పము. 1—౪—(౨౩).
జలశాయి, సం. వి. ఇ. పుం: చూ, విష్ణువు. 1.
జలశుక్తి, సం. వి. ఇ. స్త్రీ. కప్పచిప్ప: చూ, సంకు. 1.
జలసూకరము, సం. వి. అ. పుం: చూ, జలరూపము.
జలసూచి, సం. వి. ఈ. స్త్రీ. 1. జెలగ: చూ, బుద్దపిడుఁదు; ఇ. పుం. 2. నక్క: చూ, సృగాలము; 3. శింశుమారము: చూ, మత్స్యము. 1; 4. కంకశేటి యను చేఁప; చూ, మత్స్యము. 1; 5. రాఁబులుగు ముక్కు; 6. నాలుగు వీధులు కలియుచోటు: చూ, మార్గము. 1.
జలస్తంభన, అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.
జలహము, సం. వి. అ. న స్వల్పజలయంత్రగృహము: చూ, సదనము. 1.
జలహస్తి, సం. వి. న్. పుం: చూ, నీటిదయ్యము.
జలహాసము, సం. వి. అ. న: చూ, ఫేనము.
జలాంచలము, సం. వి. అ. న. 1. తూము: చూ, భ్రమము. 4; 2. నాఁచు*: చూ, శైవాలము.
జలాంజలిన్యాయము, న్యా. పోయిన దానికై నీళ్లు వదలుట.
జలాంటకము, సం. వి. అ. పుం. గుఱ్ఱపుమూతిచేఁప: చూ, మత్స్యము. 1.
జలాండకము, —పై.— (చిఱుచేఁపలగుంపు అని కొందఱు.)
జలాంబిక. సం. వి. ఆ. స్త్రీ. నుయ్యి, బావి: చూ, సరస్సు. 1—౧౩.(1—౧౫).
జలాకరము, సం. వి. అ. పుం: చూ, సముద్రములు. (ఇదె మంచినీళ్లసంద్రము.)
జలాక్షరన్యాయము, న్యా. నీటిపైవ్రాలు (నిలుకడలేనిది.)
జలాఖు(ఘు)వు, సం. వి. ఉ. పుం. నీటిపిల్లి: చూ, మత్స్యము. 1.
జలాగ్నిన్యాయము, న్యా. అగ్ని జలము కలియునప్పుడు అగ్ని తక్కువయైన నగ్నియు, నీరు తక్కువయైన నీరును హరించు నను విధము.
జలాటని, సం. వి. ఈ. స్త్రీ. జెలగ: చూ, బుద్దపిడుఁదు.
జలాత్మ, సం. వి. ఆ. స్త్రీ. పూర్వాషాఢానక్షత్రము: చూ, రిక్క. 1.
జలాధారము, సం. వి. అ. పుం. మడుగు: చూ, సరస్సు. 1—౧.
జలారము, సం. వి. అ. పుం. నీటిగుఱ్ఱము: (చూ, మత్స్యము. 1.): చూ, హయము. 1—౧౫.
జలారుండము, సం. వి. అ పుం. 1. నీటిసుడి: చూ, సుడి. 1; 2. నీటితుంపర: చూ, సలిలము. 1-30; 3. పాము: చూ, సర్పము. 1.
జలార్ణవము, సం. వి. అ. పుం. 1. శ్రావణభాద్రపదమాసములు, వర్షర్తువు: చూ, మాసద్వయము; 2: చూ, సముద్రములు.
జలార్ద్రము, సం. వి. అ. న. తడిబట్ట: చూ, వస్త్రము.
జలాశయము, సం. వి. అ. న. 1. నీరువట్టివేరు, పుం. తెల్లవట్టివేరు (అని కొందఱు) *: చూ, వట్టివేరు; పుం. 2. మడుగు: చూ, సరస్సు. 1.
జలాశ్రయము, సం. వి. అ. పుం. 1. గుండ్రతుంగ *: చూ, తృణము. 1; 2. శూలతృణము *: చూ, తృణము. 1.
జలాష్ఠీవి, సం. వి. ఈ. స్త్రీ. కోనేరు: చూ, సరస్సు. 1.
జలూక, సం. వి. ఆ. స్త్రీ. 1. = జలగ. రూ-జలౌక-జలౌకస-జలౌకసము: చూ, బుద్దపిడుఁదు; 2. అంతరదామర*: చూ, సహస్రపత్రము.
జలేంద్రము, సం. వి. అ. పుం. 1: చూ, నిమ్మ*; 2. అడుసు: చూ, నుబ్బలి.
జలేంద్రుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, వరుణుఁడు. 1; 2: చూ, సముద్రము.
జలేశయము, సం. వి. అ. పుం. కరండి, శంబరము, జలేశయ మను చేఁప; చూ, మత్స్యము. 1.
జలేశుఁడు, సం. వి. అ. పుం: చూ, జలేంద్రుఁడు.
జలోచ్ఛ్వాసము, సం. వి. అ. పుం. కలుఁజు: చూ, మరిగొమ్మ. 1.
జలోద్ధతగతి, అం. ఒకానొక వృత్తము. ఒక్కొక్క పాదము నందు జ-స-జ-స గణములు గలిగి ఎనిమిదింట యతి గల ద్వాదశఛందస్సునందుఁ బుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1.
జలోచ్ఛ్వవ, సం. వి. ఆ. స్త్రీ: చూ, లముబ్రహ్మ *.
జలోద్ర, సం. వి. ఆ. స్త్రీ: చూ, సురటి.
జలౌక, సం. వి. ఆ. స్త్రీ. = జెలగ: చూ, జలూక. 1.
జలౌకసము, సం. వి. అ. న్. స్త్రీ. 1. = జెలగ: చూ, జలూక. 1. (ఈ యర్థమందు సకారాంత స్త్రీలింగ నిత్యబహువచనాంత మని కొందఱు.); 2. జలజంతువు: చూ, మత్స్యము. 1.

జల్పనము, సం. వి. అ. న. పనికిరానిమాటలాడుట: చూ, శబ్దము. 2.

జల్పము, సం. వి. అ. పుం. ఊరకమాటలాడెడి యుపయుక్తము కానిమాట: చూ, శబ్దము. 2-౩౭.

జల్పాకుఁడు, సం. విశే. ఉపయుక్తముకాని పెక్కుమాటలాడు వాఁడు: చూ. వక్త. 1.

జల్పితము, సం. విశే. 1. ఉపయుక్తముకాక మిక్కిలి చెప్పఁబడినది: చూ, శబ్దము. 2—౭౧—(౨); 2. చెప్పఁబడినది. చూ, శబ్దము. 2—౭౧.

జవ, సం. వి. ఆ. స్త్రీ: చూ, జప. 1*.

జవనము, సం. వి. అ. న. 1. వడి: చూ, వేగము. 3; పుం. 2. వడిగల గుఱ్ఱము: చూ, హయము. 1-30; 3. యవనదేశము: చూ, దేశము; విశే. 4. వడిగలది: చూ, స్యదము.

జవనిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-యవనిక.

జవనుఁడు, సం. వి. అ. పుం. జవుఁడు. త్వరితముగాఁ బోవు వాఁడు: చూ, సందేశహరుఁడు.

జవము, సం. వి. అ. పుం. 1. వడి: చూ, వేగము. 3; 2. వడిగలది: చూ, వేగము. 3.

జవాది, సం. వి. ఇ. పుం. 1. = జవ్వాజి: చూ, సంకుమదము; అం. 2: చూ, గంధములు.

జవాను, వా. వి. 1. బంటౌత్రోతు; 2. బలశాలి; 3. పొగడిరి. (జమాను అనియు వాడుక.)

జవాహిరి, వా. వి. రత్నములుపొదిగిన నగలును, విలువగల వస్త్రాములును.

జవి, సం. వి. న్. పుం. గాలికెదురునడిచెడు వాతమృగము. వాతప్రమి: చూ, హరిణము. 1-౬.

జవుఁడు, సం. వి. అ. పుం: చూ, జవనుఁడు.

జశ్శులు, అం. జ, బ, గ, డ, ద. సరళములు. (గ జ డ ద బ ల మార్పు అని కొందఱు.)

జసురి, సం. వి. ఇ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2 వజ్రాయుధము: చూ, బాణము. 1.—౬౨.

జహ, సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి*: చూ, శూకశింబి.

జహత్, అం: చూ, లక్షణలు.

జహదజహత్, అం.—పై.—

జహరము, సం. వి. అ. పుం. పిల్లి: చూ, మార్జాలము.

జహ్నుతనయ, సం. వి. ఆ. స్త్రీ. గంగ: చూ, నది.

జహ్నువు, సం. వి. ఉ. పుం. 1. ఒకానొక రాజర్షి: చూ, సన్న్యాసి. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

## జా

జాంగలబిడాలము, సం. వి. అ. పుం: చూ, జంగలబిడాలము.

జాంగలము, సం. వి. అ. న. 1. చేఁతిబీఱ*: చూ, బీఱ. 2; 2. పొలసు: చూ, శుక్తము, 2; పుం. 3. జాంగలి, చంద్రకి, చిత్రపక్షము: చూ, కౌఁజు: 4. మెరకనేల: చూ, భూమి. 1-౪; 5. = జగిలె తిన్నె: చూ, వేదిక.

జాంగలి, సం. వి. ఇ. స్త్రీ. 1. రూ-జాంగులము. విషముఁ బోఁగొట్టు విద్య: చూ, మాయము. 1; 2: చూ, దూలగొండి*; పుం. 3: చూ, జాంగలము. 3; ఇ. న. 4. పొట్లకాయ: చూ, పొట్ల.

జాంగలికుఁడు, సం. వి. అ. పుం. రూ-జాంగులికుఁడు. 1. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2. ఇంద్రజాలికుఁడు: చూ, ప్రాతిహారకుఁడు.

జాంగులము, సం. వి. అ. పుం: చూ, రూ-జాంగలి. 1.

జాంగులికుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-జాంగలికుఁడు.

జాంఘికుఁడు, సం. వి. అ. పుం: చూ, జంఘాకరికుఁడు.

జాంబవంతుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-జాంబవుఁడు.

జాంబవతి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, దంతి. 1*; 2. జాంబవతి యను కృష్ణునిభార్య: చూ, భార్య.1—౨౦.

జాంబవము, సం. వి. అ. న. 1. నేరేడుపండు: చూ, నేరేడు; 2. బంగారు: చూ, లోహము. 1.

జాంబవి, సం. వి. ఈ. స్త్రీ: చూ, దంతి. 1*.

జాంబవుఁడు, సం. వి. అ. పుం. భల్లూకపతి, జాంబవంతుఁడు, ఋక్షరాజు.

జాంబూనదము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.

జాగర, సం. వి.ఆ. స్త్రీ. = జాగారము.రూ-జాగరణము. జాగరము-జాగర్య.1. రాత్రి మేలుకోలు: చూ, మేలుకోలు; అం. 2: చూ, అవస్థలు: (చూ, దశావస్థలు); 3: చూ, అవస్థలు: (చూ, ద్వాదశావస్థలు.)

జాగరణము, —పై.—

జాగరము: —పై.—; 4. కవచము: చూ, వారవారణము.

జాగరికుఁడు, సం. విశే. రూ-జాగరకుఁడు-జాగరూకుఁడు: చూ, మేలుకొని యుండువాఁడు.

జాగరిత, సం. విశే. —పై.—

జాగరూకుఁడు, —పై.—

జాగర్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-జాగర.

జాగీరు, వా. వి. రాజుగారి బహుమానాదికము.

జాగుడము, సం. వి. అ. న. కుంకుమము: చూ, వహ్నిశిఖము.

జాగ్రత్, జాగ్రత్తు. అం. 1: చూ, అవస్థలు: 1; 2: చూ, అవస్థలు. 4; విశే. 3: చూ, మేలుకోలు.

జాఘనము, అం: చూ, స్థితకరణబంధములు.

జాఘని, సం. వి. ఈ. స్త్రీ. 1. యజ్ఞపశువుయొక్క తోఁక: చూ, వాలము. 1; 2. తొడ: చూ, సక్థి.

జాజీఫలము, సం. వి. అ. న: చూ, జాతికోశము.

జాఠరము, సం. వి. అ. పుం. 1. ముత్తియములోని దోషవిశేషము: చూ, రత్నము. 1; 2: చూ, వహ్ని. 1-౧.

జాడ్మాలీ, వా. వి. దాసి. (ఝాడ్మాలీ.)

జాడ్యము. సం. వి. అ. న = జడ్డు. 1. అలస్యము: చూ, విలంబము. 1; అం. 2. (జడత) (ఆ సరసునకై పరికించి పరికించి యాతఁడు చెంగటం జేరునంతనే యేమిచేయుటకుం దోఁచక యూరకుండెను): చూ, సంచారీభావములు.

జాతకము, వా. జన్మపత్రిక. కోటి.

జాతకర్మము, అం. పుట్టినపుడు చేయు క్రియ: చూ, కర్మములు.

జాతకుఁడు. సం. విశే: చూ, పుట్టినవాఁడు.

జాతఘాతకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, సురుగుడు*.

జాతపత్య, సం. వి. ఆ. స్త్రీ. 1. బిడ్డలుగన్న ఆఁడుది: చూ, స్త్రీ. 1-ఉం—(ా); 2. బాలెంతరాలు: చూ, స్త్రీ. 1-ఉం.

జాతము, సం. వి. అ. న. 1. గుంపు: చూ, సమూహము; 2: చూ, సమానము. 2; 3: చూ, పుట్టుక; 4: చూ, పురుషు; విణ. 5. పుట్టినది: చూ, సంభూతము.

జాతరూపము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము; 3. పుట్టినరూపము; విణ. 4. పుట్టినరూపము కలది: చూ, సంభూతము.

జాతవేదుఁడు, సం. వి. స్. పుం. నిప్పు: చూ, వహ్ని. 1.

జాతిస్మరాలింగనము, అం: చూ, ఆలింగనములు.

జాతస్మరాలింగనములు, అం. లతావేష్టితము, వృక్షాధిరూఢము, తిలతండులము, నీరక్షీరము, ఊరూపగూహనము, జఘనోపశ్లేషము, కుచాశ్లేషము, లాలాటము (8): (చూ, రతిబంధములు).

జాతస్య మరణం ధ్రువమ్, న్యా. పుట్టినవాఁడు గిట్టక మానఁడు.

జాతాపత్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-జాతపత్య.

జాతాశౌచము, సం. వి. అ. న. 1: చూ, పురుఁడు; అం. 2: చూ, ఆశౌచములు.

జాతి, సం. వి. ఇ. స్త్రీ. 1. కులము: చూ, వంగడము; 2: చూ, పుట్టుక; 3: చూ, సమానము. 2; 4. ఒకానొక అర్థాలంకారము: చూ, హేతువు. 2: (చూ, అలంకారము. 3); 5. పద్యభేదము. (ఒకానొక ఛందస్సు): చూ, జాతులు; 6. ప్రొయ్యి: (చూ, హసంతి.) 1-ా-అం; 7. జాజికాయ, జాతిఫలము, మాలతీఫలము: చూ, సుమనస్సు. 2; 8. = జాజి*: చూ, సుమనస్సు. 2; 9. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1; 10. కంపిల్లము*: చూ, రోచని. 11. మాలతి*: చూ, హసంతి. 2.ా; 12. చేఁతరాని: చూ, శకుల; 13. ఇంగిలీకము: చూ, హింగుళము; అం. 14: చూ, తాళప్రాణములు: (చూ, తాళము. 2.); 15: చూ, అష్టాదశపదార్థములు.

జాతికము, సం. వి. అ. పుం. = (తె. ప.) జాపత్రిరి - జాపత్రి - జాజిపత్తిరి - జాజిపత్రి. (సం. ప.) — రూ - జాతిపత్రి - జాతిపత్రిక.

జాతికోశము, సం. వి. అ. న. జాజీఫలము: జాతిఫలము; (తె. ప.):—జాజికాయ.

జాతిక్రియలు, అం. ఇవి 5: చతురశ్రము, త్ర్యశ్రము, మిశ్రము, ఖండము, సంకీర్ణము.

జాతిదైత్యుఁడు, సం. వి. అ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

జాతిధర్మములు, అం: చూ, ధర్మములు.

జాతిపత్రి, సం. వి. ఈ. స్త్రీ: చూ, జాతికము.

జాతిపత్రిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—

జాతిఫలము, సం. వి. అ. న: చూ, జాతికోశము.

జాతిరసము, సం. వి. అ. పుం: చూ, బోళము.

జాతిలింగము, సం. వి అ. పుం. ఇంగిలీకము: చూ, హింగుళము.

జాతివైద్యము, సం. వి. అ పుం. కుబేరుని శంఖము: చూ, శంఖు. 1.

జాతీయము, వా. దేశీయము (ఇడియమ్) శబ్దమందున్న యర్థము గాక ప్రయోగరూఢిచేత మఱియొక యర్థమును స్ఫురింపఁజేయుచు ననేకులచేతఁ జిరకాలమునుండి యథాస్థితిగా నుపయోగింపఁబడునది. (ఇవి తెనుఁగుభాషయం దనేకములు గలవు. వాని నౌచిత్యమెఱింగి ప్రయోగించిన కావ్యమునకు వన్నెవచ్చును.)

జాతిరసము, సం. వి. అ. పుం. రూ-జాతిరసము: చూ, బోళము.

జాతు, సం. అవ్య. కదాచిత్, ఒకానొకప్పుడు.

జాతుధాతకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మంజిటి*.

జాతులు, అం. 1. బ్రాహ్మణాది:— బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పిక, పంచాల, కుంభకార, క్షౌరిక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాత, లుబ్ధక, చండాల, మాతంగజాతులు (18); 2. పురుషజాతులు. 4:—శశుఁడు, దత్తుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు; 3. స్త్రీజాతులు 4:— పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి; 4. రాగాధ్యాయమునోని అంశములు 13. అందు జాతులు 11 కి వివరణము:— షడ్జకైశిక 5, షడ్జోదీచ్యవ 4, షడ్జమధ్యమ 7. గాంధారోదీచ్యవ 2, రక్తగాంధారి 5, కైశికి 6, మధ్యమోదీచ్యవ 1, కర్మారవి 4, గాంధారపంచమి 1, ఆంధ్రి 4, నందయంతి 1: చూ, అంశములు 5. ఛందో లక్షణమునందు — పద్యములు:— "వృత్తములు - జాతులు" నని యిరుదెఱంగులు. అందు జాతు లొకవిధము. సర్వగణబద్ధములు వృత్తములు (పంచచామరాదులు): ఉపగణవిహితములు జాతులు; జాతులు ఉపజాతులునని జాతి ద్వివిధమైనది; జాతులు:— కందము లాఱు- ఉత్సాహ. తరువోజ. అక్కఱలైదు, మంజరి, ద్విపద, త్రిపద, చతుష్పద, పంచదశ, షట్పద, నవవిధరగడలు, కళిక, ఉత్కళిక; ఉపజాతులు:— గీతములు తొమ్మిది, సీసము లేదు; కొందఱు చంపకోత్పలశార్దూల మత్తేభములు జాతులని, కందగీతసీసము లుపజాతులని, తక్కినవి వృత్తములని వాడుచున్నారు. ప్రతి పద్యమునకు నాలుగేసి చరణములు (పాదములు), కొన్నిటికైదు పాదము లుండును, అదె పంచపాది; పెక్కు చరణములుంచి చెప్పినదానిని మాలిక యందురు. తఱుచుగ నీ మాలికలు గీత, సీస, చంపక, ఉత్పల, ద్విపద, రగడలయందె కన్పట్టుచున్నవి. కందము, ఆటవెలఁది తప్ప దక్కిన పద్యములం దొక పాదమునకుఁ జెప్పిన లక్షణము తక్కిన పాదములకు నగును. వృత్తములందు గణముల వరుస తప్పరాదు: (చూ, ఛందస్సులు: చూ, వృత్తము. 1: చూ, పద్యములు: చూ, కందము.)

జాతుషము, సం. విణ. జతువువలనఁ గలిగినది. (జతువు = లక్క.)

జాతోక్షము, సం. వి. అ. పుం. కాలుపట్టిన యెద్దు, (మోయఁదగిన వయస్సు గలిగి బహుగొట్టము (చిక్కిపోని) కోడె) (అని కొందఱు): చూ, వృషభము. 1.

జాత్యము, సం. వి. అ. పుం. 1. ఉత్తమాశ్వము: చూ, హయము 1-ఆ; విణ. 2. మంచికులమునఁ బుట్టినది; 3. చక్కనిది, మేలైనది: చూ, హృద్యము.

జానకము, సం. వి. అ. పుం: చూ, సరవెంద*.

జానకి, సం. వి. ఈ. స్త్రీ. 1. సీతాదేవి: చూ, సీత; ఇ. పుం: 2. జానకి యను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.-ళ.

జానపదన్యాయము, న్యా. ఒకానొక న్యాయము.
జానపదము, సం. వి. అ. పుం: చూ, రూ-జనపదము.
జానపదుఁడు, సం. వి. అ. పుం: చూ, మనుష్యుఁడు.
జాని, సం. వి. ఇ. స్త్రీ. 1. ముదిమి: చూ, ముసలితనము; 2. పెండ్లాము: చూ, భార్య; 3. తన పెండ్లాముకంటె యితరమైన ఆఁడుది: చూ, స్త్రీ. 1-౧౫౫; 4. ఆఁడుది: చూ, స్త్రీ. 1; 5. నక్షత్రము: చూ, రిక్క. 1; 6. రాజుల బవంతి: చూ, సదనము. 1. (వృత్తియందు జాయాశబ్దమునకు ఆదేశముగా వచ్చిన రూపము. "జానకిజానికథల్" మొ.)
జానుకూర్పరము, సం. వి. అ. న: చూ, ఉద్దిత కరణబంధములు: (చూ, రతిబంధము.)
జానువు, సం. వి. ఉ. పుం, న. 1: చూ, మోఁకాలు; 2. స్త్రీల దేహమునందు శోణితసంచార స్థానము: చూ, భగము. 12.
జానువులు, అం. 1. పురుషలక్షణాంగములలో నొకటి. (మోఁకాళ్లు) నునుపుగలిగి వర్తులములై సమములై బలిసియున్న నుత్తముఁడగు: చూ, లక్షణాంగములు; 2. స్త్రీ లక్షణాంగములలో నొకటి. (మోఁకాళ్ళు) గుండ్రముగనున్న పుత్రవతియగు: చూ, స్త్రీలక్షణాంగములు.
జాపకము, సం. వి. అ. న. రూ-జాషకము. పచ్చవంటి గంధము: చూ, రాజార్హము. 1-౧౫.
జాపకుఁడు, సం. విణ. వ్రతి: చూ, తపస్వి: (చూ, సన్న్యాసి. 1.)
జాపిరము, వై. వి. = జావ్యము: చూ, విలంబము. 1.
జావ్యము, సం. వి. అ. న. = జాపిరము. — పై. — (గ్రామ్యమని శ. ర; ప్రకృతి అని పురుషోత్తమ కవీయము.)
జాఫరా, పా. వి. చాయతగ్గిన యెఱుపురంగు: చూ, వర్ణము. 6 -౪-(౧౨.)
జాబరా, —పై.—(తెనుఁగున వాడుక.)
జాబాలుఁడు, సం. వి. అ. పుం. 1. రూ-జావాలుఁడు. మేఁకల మేపువాఁడు, కంబళ్ళు నేయువాఁడు (అని కొందఱు): చూ, మేఁకలఁ గాపరి; 2: చూ, మనుష్యుఁడు.
జాభా, పా. వి. హెచ్చు.
జామ, సం. వి. ఆ. స్త్రీ. 1. అంగి: చూ, వస్త్రము; 2. తల్లి: చూ, మాత, 1; 3. తోలు: చూ, బెరడు; 4. కులము: చూ, వంగడము.
జామదగ్ని, సం. వి. ఇ. పుం. 1; చూ, పరశురాముఁడు; 2: చూ, బొడ్డు; 3. చూపు: చూ, వీక్షణము; 4. వేదప్రణిధానాగ్ని: చూ, వహ్ని. 1-౫; 5. ఇంటిముందువాకిలి: చూ, ముంగిలి. 2.
జామాత, సం. వి. ఋ. పుం. 1. అల్లుఁడు: కూఁతురుమగఁడు: చూ, స్వస్త్రీయుఁడు. 1-౨; 2. మగఁడు: చూ, భర్త. 1; 3. ప్రొద్దుతిరుగుడు*, సూర్యమండలము (అని కొందఱు): చూ, సూర్యానువర్తిని; 4. ఒకానొక శాకము*: చూ, శాకము. 1.
జామాతా దశమో గ్రహః, న్యా. అల్లుఁడు పదవగ్రహము.
జామి, సం. వి. ఇ స్త్రీ. 1. కులకాంత: చూ, స్త్రీ. 1-౩౮; 2. తోడఁబుట్టినది: చూ, సహోదరి; ఈ. 3. = జామ*: (దీని చెక్క కషాయము చంటిపిల్లల విరేచనములు కట్టును); విణ. 4: చూ, సోమరి.
జామిషము, సం. వి. అ. న. అరణము: చూ, హరణము.
జాయ, సం. వి. ఆ. స్త్రీ: చూ, భార్య.
జాయతే, అం: చూ, భావవికారములు. (క్రి. అగుచు.)
జాయమానము, సం. విణ. కలుగుచున్నది.
జాయాజీవుఁడు, సం. వి. అ. పుం. 1. నట్టువుఁడు: చూ, శైలూషుఁడు; 2. దరిద్రుఁడు: చూ, బీదవాఁడు.
జాయానుజీవుఁడు, సం. వి. అ. పుం. —పై.—
జాయువు, సం. వి. ఉ. స్త్రీ: చూ, మందు. 1.
జార, సం. వి. ఆ. స్త్రీ: చూ, జారిణి.
జారిణి, సం. వి. ఈ. స్త్రీ. = బజారి: చూ, అంకులాఁడి.
జారుఁడు, సం. వి. అ. పుం: చూ, అంకుమగఁడు.
జాలకము, సం. వి. అ. న. (లేఁత) పసరుమొగ్గలగుత్తి: చూ, మొగ్గ. 1; 2. పసరుమొగ్గ: చూ, మొగ్గ. 1; 3. మొగ్గల గుంపు: చూ, మొగ్గ. 1; 4. కసుగాయ: చూ, శలాటువు. 2; 5. వల: చూ, వల. 1; 6. పక్షిగూఁడు: చూ, సదనము 1; 7. కపటము: చూ, వ్యాజము. 1; 8. మునగకాయ: చూ, శిగ్రువు 1; పు, న. 9. కిటికి: చూ, వాతాయనము; 10. అల్లితీఁగె, వల్లి *. చూ, సహస్రపత్రము. 1-౮.
జాలకిని. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె: చూ, మేషము.1.
జాలకుఁడు, సం. విణ: చూ, రూ-జాలికుఁడు. 2.
జాలకృత్తు, సం. వి. త్. స్త్రీ: చూ, సాలెపురుగు.
జాలగోణిక, సం. వి. అ. పుం. పెరుఁగుత్రచ్చు కడవ: చూ, భాండము. 3.-౫.
జాలద్రుమము, సం. వి. అ. పుం: చూ, దొండ *.
జాలపటము, సం. వి. అ. న: చూ, సాలెగూఁడు.
జాలపాదము, సం. వి. అ. పుం. 1. బాతు: చూ, బకము; 2. అంచ: చూ, హంస. 1.
జాలమత్స్యన్యాయము, న్యా. వలలోఁబడిన చేఁప లోపలనుండి సర్వమును జూచుచుండునుగాని యీవలికి రాలేదనురీతి.
జాలము, సం. వి. అ. న. 1. కిటికి: చూ, వాతాయనము; 2. = జాల. వల: చూ, వల. 1; 3. గుంపు: చూ, సమూహము; 4. పూమొగ్గ: చూ, మొగ్గ. 1; 5. కపటము: చూ, వ్యాజము. 1; 6. = జాలము, ఆలస్యము: చూ, విలంబము. 1; పుం. 7. మాయ: చూ, మాయము. 1; 8. కడప *: చూ, నీపము.
జాలవృక్షము, సం. వి. అ. పుం: చూ, దొండ *.
జాలాంధరము, అం: చూ, బంధనములు.
జాలి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పొట్ల *.
జాలిక, సం. వి. ఆ. స్త్రీ. 1. దోమతెర: చూ, వస్త్రము. 1-౫౩; 2. వల: చూ, వల. 1; 3. ఇనుపకవచము: చూ, వారవారణము; 4. వితంతువు: చూ, స్త్రీ; న. పుం. 5. గర్వభేదము: చూ, హంకారము; 6. పలురంగుల కమలము: చూ, సహస్రపత్రము. 1; 7. పునుగు*. చూ, రాజార్హము. 1-౨౫.
జాలికపటము, సం. వి. అ. పుం, న. = సాలెపట్టు: చూ, సాలెగూఁడు.
జాలికము, సం. వి. అ. న. ఊరివసుకు: చూ, పసుకు.

శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

## విజ్ఞప్తి

" వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

I. సంస్కృతభాషలోని శబ్దార్థజ్ఞానమునకుమాత్రము అమరసింహప్రణీతమగు నామలింగానుశాసనము మున్నగు పెక్కు నిఘంటువులు గలవు. వీనిలో కవిచౌడప్ప "చౌడప్పసీసము", శ్రీ వేంకటేశాంధ్రము, ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రరత్నాకరము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రపదాకరము, ఆంధ్రదీపిక, బ్రౌణ్యనిఘంటువు, చిన్నయసూరి నిఘంటువు, శబ్దరత్నాకరము, ఆంధ్రపదపారిజాతము, శబ్దార్థచంద్రిక, లక్ష్మీనారాయణీయము, వావిళ్ళనిఘంటువు (మొదటి సంపుటము) వెలువడినవి. వీనిలో కొన్ని పద్యనిఘంటువులు, కొన్ని అకారాది నిఘంటువులు. అకారాది నిఘంటువులు పర్యాయపదముల నీయవు. పద్యనిఘంటువులు పర్యాయపదములం గొంతవరకు దెలుపునుగాని అకారాదిగఁ జూపఁ జాలవు. వీనియం దిట్టి చిక్కులు గలవు.

II. అందుపయిన నేను పర్యాయపదములందెలుపు నిఘంటువిధ మెట్లని చింతించి 25 సం॥రములు పరిశ్రమచేసి " ఆంధ్రవాచస్పత్యము " వ్రాసి అచ్చొత్తించి ప్రథమముద్రణము పూర్తి గావించితిని. అచ్చుపూర్తియగు సరికి 2 వేల సెట్లును లోకము స్వీకరించినది. ద్వితీయముద్రణమునకు యత్నింపఁగా కాగితములకఱవు కలిగినది. చందాదార్లతొందర హెచ్చినది. నా స్వప్రయత్నములు వృథాయైనవి. అందు చాలనష్టము కష్టము పొందితిని. పరమేశ్వరానుగ్రహమున "ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి" యజమానులు ము॥ సుబ్రహ్మణ్యశర్మగారు తోడ్పడి ద్వితీయముద్రణమునకు మార్గదర్శకులైరి. వారు విశేషపరిశ్రమకు ఓర్చి " స్టీరియో " పద్ధతిని నిఘంటువునకు శాశ్వతగౌరవము నొసంగిరి. వారి యెడల నేనును నాకుటుంబమును చిరస్థాయిగా కృతజ్ఞులమైయుందుము. పరమేశ్వరుఁడు శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారిని వారికుటుంబమును సదారక్షించుగాకయని ప్రార్థించుచున్నాను.

కరప, కాకినాడ
15–12–1952

ఇట్లు
నిఘంటుకర్త

# నియమవిధాన క్రమము



1. ఈ నిఘంటువునందలి పదములన్నియు అకారాది హకారాంతము వఱకు ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును.

2. ప్రతి అర్థమునకును అకారాది హకారము వఱకు గల పర్యాయ పదములు తద్విశేషములతో ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును. (చూ : ధేనువు, నది, మత్స్యము, యుద్ధము, వాయువు, సదనము, సర్పము, స్వరము, హయము మొ.)

3. కకారము తరువాత క్ష కారమును, ల కారము తరువాత ళ కారమును వ్రాయఁబడును.

4. సంస్కృతపదములకు ప్రత్యయములఁ జేర్చి (తత్సమరూపములు) వ్రాయఁబడును.

5. ఇందు నిర్దుష్టమగు సంస్కృతపదములు రమారమి 50,000 ను, తెనుఁగుపదములు మున్నగునవి 50,000 ను కలసి ఒక లక్ష పదములవఱకు కలవని అంచనా వేయఁబడెను.

6. ప్రతి పదమునకును భాషాభాగమును, అర్థమును, గూఢపదములకు ప్రయోగములును, నానార్థములును, ప్రత్యర్థమునకు పర్యాయపదములును, విశేషించి తద్విశేషాదులును వ్రాయఁబడును. (చూ: అ, అంకము, అంగము, వాయువు, వీణె, సదనము, సర్పము, స్వరము, స్త్రీ, హయము మొ.)

7 మఱియు తత్సమము (వికృతి) లకు తద్భవము (వైకృతి) లును, తద్భవములకు తత్సమములును = గుర్తుతోను, రూపాంతరములు — గుర్తుతోను గనుపఱుపఁబడును. (చూ: కుడ్యము = గోడ, బమ్మ = బ్రహ్మ: అంబా-అంబేద మొ.)

8. పర్యాయపదములు శీర్షికాపదము లయినపుడు పైన వ్రాయఁబడిన వివరణాదులను వ్రాసి పర్యాయపదములకుతుదిని, తద్విశేషాదులను గనఁగొనుటకై తద్గణాద్యపద తదర్థసంఖ్యలను :చూ, అను గుఱుతుతో సూచింపఁబడును. (:చూ, అ. అమ్. అంకము. అంగము. మొ.)

9. వేఁట. యుద్ధము మొ. (వివిధవృత్తులకును, ప్రకృతి శాస్త్రములు, గణితము, ధర్మశాస్త్రము, జ్యోతిషము, వైద్యము, భూగోళము, వ్యాకరణము, సంజ్ఞావివరణములు, న్యాయములు, జాతీయములు మున్నగు వివిధశాస్త్రములకును సంబంధించిన పారిభాషిక పదములును, వ్యావహారిక పదములును, అకారాదిగ సాహిత్యపదములతో కలఁబోసి కూర్పఁబడును. (చూ : అలంకారము, అంగము, అంకోలబీజన్యాయము, అందెవేసిన చేయి మొ.)

10. చెట్టునకు * గుఱుతు చూపఁబడినది. చూ: కొబ్బరి, మామిడి మొ.)

11. ఇందుఁ గ్రియాపదములకు ధాతురూపములును, నామపదములకుఁ బ్రథమైకవచనరూపములును వ్రాయఁబడును.

12. సంస్కృత, వైకృత, దేశ్య, గ్రామ్య, వాడుక, పారిభాషిక, జాతీయ, ఉపసర్గ వీని కాయాయిసంజ్ఞ లిడఁబడును. నిర్దిష్టమగు అన్యదేశ్యము దేశ్యముగాఁ జేర్పఁబడినదిగావ దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.

13. ద్వయమునకు అవయవములైన పదముల యొక్క సంజ్ఞలను ఆయా శబ్దములకడఁ జూచునది. అనఁగా "అందాఁక" అనుచో అంత శబ్దముయొక్క సంజ్ఞను అంతకడను, దాఁక శబ్దముయొక్క సంజ్ఞను దాఁకకడను జూడవలయునని యర్థము. ఇట్లు తక్కినచోట్లను దెలియవలయును. (వైకృతమును దేశ్యమును మిశ్రమమైన పదము.)

14. ఒక్కొకచో నించుక రూపభేదముగల శబ్దము దాని మొదటి రూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ: అకటవికటము, ఒకతె మొ.)

15. ఒక్కొకయెడ 'ముపర్ణాంత' రూపము మువర్ణములేని శబ్ది రూపముకడనే రూ-అని వ్రాయఁబడును. (చూ: అగ్గలిక మొ.)

16. కొన్నిచోట్ల తెనుఁగు పదమునకు ఇయాంతరూపము, ఏదంత రూపము రెండును వ్రాయఁబడును. కొన్ని యెడల ఇయాంత రూపముకడ ఏదంత రూపమును, ఏదంత రూపముకడ ఇయాంతరూపమును వ్రాయఁబడును. (చూ: అందకత్తియ; అగిసియ మొ; మఱియు అటె - అటొ - మొదలగువాని భేదములను గుర్తింపవలయును.)

17. ఉకారలోపముగల అల్లు లోనగు వాడుకలోని పదములు ఒక్కొకయెడ ప్రత్యేకముగ వ్రాయఁబడవు. (చూ: అలుఁగు మొ.)

18. దేశ్యక్రియలయందు ఇంచుకు వచ్చెడు సామాన్యప్రేరణ రూపములు ప్రత్యేకముగా వ్రాయఁబడును. చూ : (అడఁగించు, ఇప్పించు మొ.)

19. తేటగాఁ దెలియఁదగుచోట్ల తఱుచుగ దెనుఁగు పదములకు సంస్కృతపదములతోడను, సంస్కృతపదములకుఁ దెనుఁగు పదములతోడను అర్థములతో వ్రాయఁబడెను.

20. ఒకపదము సంస్కృతముగాను తెనుఁగుగాను నున్నయెడల ముందు సంస్కృతార్థములను వెనుక తెనుఁగర్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడిఅంకెలును, తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలును గుఱుతిడఁబడును. (చూ: అ, అంకము, అంగము. మొ.) ఇటులనే ఒక పదము తెనుఁగుగాను సంస్కృతముగాను నున్నయెడల ముందు తెనుఁగర్థములను వెనుక సంస్కృతార్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలును, సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడి అంకెలును గుఱుతిడఁబడును. చూ: స్రుక్కు.

21. ఒక పదము విశేష్యము, విశేషణము, సర్వనామము, అవ్యయము, క్రియ అగునెడల ముందు విశేష్యార్థములను, వెనుక విశేషణార్థములను, నా వెనుక క్రియార్థములను వ్రాయఁబడును. (చూ: అంటు, ఎత్తు, ఒడ్డు మొ.)

22 ఇందుఁ గొన్నిటికి గ్రంథవిస్తరభీతిచే ప్రయోగములు సంగ్రహముగ వ్రాయఁబడి యుండుటవలన ఇందు వ్రాయఁబడిన అర్థములకు సందేహములు కలిగినయెడల ఆ యుదాహరణములకు ముందు వెనుకలను ఆ గ్రంథములయందు విశదముగఁ జూచుకొనవలయును.

23 ప్రయోగములు దొరకియు పాఠభేదములతోఁ గూడి యుండుటవలన నట్టిచోట్ల ఆశ్వాసాదిపద్యసంఖ్యలు వ్రాయఁబడును.

24. చదివెడివారికిఁ జక్కఁగా దెలియుటకై యిందు అర్థము లోనగునది తఱుచుగ సంధిలేక వ్రాయఁబడును. నియమబాహుళ్యముచే నీక్రమము కొన్నియెడలఁ దప్పినను దప్పియుండును.

25. కొత్తగ నచ్చటచ్చటఁ జేరిన నియమవిధానాదులను వాటి లా యా సందర్భాదులంబట్టి గ్రహించుకొనవలయును.

26. తెనుఁగున వాడుకలోనికివచ్చిన యన్యదేశీయాది శబ్దము లు కొన్ని చేర్పఁబడినవి. ఇట్టి పదములకు గ్రంథదృష్టాంతములు దొరకుట దుస్సాధ్యము. అవి వాడుకయందున్నవి యున్నట్లే గ్రహింపవలయును.

27. రూపాంతరములలో కొన్నిమాత్ర మచ్చటచ్చట శీర్షికాపదములుగ నీయక నాయా పదములకడనే చూపఁబడినవి.

28. గ్రంథసంకేతాది పట్టికయందుఁ జేరని గ్రంథములు పెక్కుండును. అట్టిచోట్ల నా యా గ్రంథముల పేర్లు వ్రాయఁబడును.

29. సంజ్ఞావివరణ పట్టికయందుఁ జేరని గుఱుతులు మెండుగ నుండును. అట్టిచోట్ల వాడుకనుబట్టి తెలిసికొనవలయును.

30. ప్రబంధాదులు పెక్కు ముద్రణాలయములయందు ముద్రింపఁబడిన కారణమున పాఠభేదములు వ్రాయ నలవికానన్ని గాన్పించుచున్నవి. తాళపత్ర గ్రంథములు పెద్దలు పెక్కుమంది వ్రాసిన కారణమున వాటియందు పాఠభేదములు విశేషముగఁ గాన్పించుచున్నవి. ఆ కారణమునఁ గొన్నిచోట్ల సుశబ్దాపశబ్దనిర్ణయమును, అర్థనిర్ణయమును దుస్సాధ్యముగ నున్నది. అట్టిచోట్ల అట్టి పదములుగల పద్యము లుదాహరింపకయే నా బుద్ధికిఁ దగినరీతిని అర్థనిర్ణయాదులను వ్రాసితిని. అట్టిచోట్ల పాఠకులకు గ్రంథపరిశీలన మవసరమగు నేని చూచుకొనుట కనువుగ నట్టి ప్రబంధాదులయొక్క ఆశ్వాసాదులను పద్యములయొక్క సంఖ్యను వివరించి పాఠకమహాశయుల కా పరిశ్రమ వదలివేసితిని. (ఉ॥ నేను స్వయముగ నాలువిధములగు తాళపత్రప్రతుల, నాలు విధములగు అచ్చు భారతప్రతుల నొకదానితో నొకటి పరిశీలింపఁగ నైదువేల పదములకు పాఠభేదములుఁ గాన్పించినవి.)

31. మొదటి ముద్రణము రెండువేల ప్రతులను అచిరకాలములోనే ఆంధ్రమండలమంతయు స్వీకరించుటవలనను, రెండవ ముద్రణమునకు ఆంధ్రమండలమంతయు ద్విగుణీకృతముగ ప్రోత్సహించుటంబట్టియు నీ పునర్ముద్రణమునకు సాహసించితిని.

32. బుద్ధిమంతు లిందుల పొరపాట్లు తెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుం జేయుదురని ప్రార్థించెద.

ఇట్లు

నిఘంటు కర్త

# సంజ్ఞా వివరణ పట్టిక

| సంకేతము | వివరణములు | సంకేతము | వివరణములు |
|---|---|---|---|
| అ. | అకారాంతము. (ఇట్లు అ, ఇ. ఈ, ఉ, ఊ, ఋ, | నాట్య. | నాట్యశాస్త్రము. |
| | ఐ, ఓ, ఔ, చ్, జ్, ల్, డ్, ఫ్, న్,ప్, ర్,వ్,శ్, | ని. | నిపాతము. |
| | ళ్, ష్, స్, హ్. అనువర్ణములు గలచోట్ల ఆయా | న్యా. | న్యాయము. |
| | అంతములుగా చెప్పుకొనవలెను, ఉదా.— అకా | పర. | పరస్మైపది. [ఫలము.! = అనాస. మొ) |
| | రాంతము, ఇకారాంతము, ఈకారాంతము, చకా | పా. | పారిభాషికపదము. (ఉదా:. పుష్పసమూహ పరిణామ |
| | రాంతము జకారాంతము, తకారాంతము అని.) | పాఠా. | పాఠాంతరము. |
| (అ ఆ. | పుంలింగవిశేషణ మైనప్పుడు, అకారాంతము. | పీ. | పీఠిక. |
| ఆ.) | (స్త్రీలింగ విశేషణ మైనప్పుడు) ఆకారాంతము | పు. | పుంలింగము. |
| | లేక ఈకారాంతము. (నపుంసకలింగ విశేషణ | పుం. న. | పుంనపుంసకలింగము. |
| అం. | అంకము [మైనప్పుడు) అకారాంతము. | పుం. స్త్రీ | పుంస్త్రీలింగము. |
| అం. ప్రే. | అంతర్భావిత ప్రేరణము. | —పై.— | పైయర్థములే. |
| అ. క్రి. | అకర్మక క్రియ. | ప్ర. | ప్రత్యయము. |
| అనౌ. | అనౌపవిభక్తికము. | ప్రా. | ప్రాకృతము. |
| అప. | అపదము (ఆగమము మొ॥) | ప్రే. | ప్రేరణము. |
| అప్ర. | అప్రసిద్ధము. | బ. | బహువచనాంతము. |
| అలం. | అలంకారములు. | బీజగ. | బీజగణితము. |
| అవ్య. | అవ్యయము. | మంత్ర. | మంత్రశాస్త్రము. |
| ఆత్మ. | ఆత్మనేపది. | మి. | మిశ్రము (సంస్కృతాంధ్రములు కలిసిన శబ్దము) |
| ఆమ్రే. | ఆమ్రేడితము. | ము. | మువర్ణకాంతము. |
| ఉదా. | ఉదాహరణము. | మొ॥ | మొదలైనవి. |
| ఉప. | (తెనుఁగు పదములకు ముందున్నచో) ఉపపదము | యు. | యుగళము. (కొన్ని యర్థములయందు దేశ్యమును |
| | (అపి, ఉద్ద, ఎగ, మొ.) (సంస్కృతపదములకు | యోగ. | యోగశాస్త్రము. [కొన్ని యర్థములయందు వైకృతమును |
| | ముందున్నచో) ఉపసర్గము. (ప్ర. మొ.) | రూ. | రూపాంతరము. |
| ఉభ. | ఉభయము. (కొన్నిట అచ్చ తెనుఁగును, కొన్నిట | వా. | వాడుక. |
| ఏ. | ఏకవచనాంతము. [సంస్కృతమును.) | వి. | విశేష్యము. |
| ఔ. | ఔపవిభక్తికము. | విశే. | విశేషణము. |
| క్రి. | క్రియ. | వు. | వువర్ణకాంతము. |
| క్రి. విశే. | క్రియావిశేషణము. | వై. (లేక | వైకృతము(తద్భవము)ప్రాకృతసమమును సంస్కృత |
| గ్రా. | గ్రామ్యము. (అనింద్యము.) | తద్భ.) | ప్రాకృత భవము నైన పదము. |
| చూ. | చూడుము. (సంస్కృత, తెనుఁగు పర్యాయపదముల | వైద్య. | వైద్యశాస్త్రము. |
| ఛం. | ఛందశ్శాస్త్రము. కొఱకు.) | వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| జా. | జాతీయము. (దేశీయము.) | వ్యవ. | వ్యవహారము. |
| జ్యో. | జ్యోతిశ్శాస్త్రము. | వ్యు. | వ్యుత్పత్త్యర్థము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. | వ్యాక. | వ్యాకరణము. |
| తద్వి. | తద్విశేషములు. | శత్ర. | శత్రంతము. |
| తర్క. | తర్కశాస్త్రము. | శప్. | శబ్వికరణము. |
| (తె. ప.) | తెలుఁగు పర్యాయపదములు. | సం. | సంస్కృతసమము. (తత్సమము.) |
| దే. | దేశ్యము. | సంగీత. | సంగీతశాస్త్రము. |
| ద్రు. | ద్రుతాంతావ్యయము. | సర్వ. | సర్వనామము. |
| ద్రు. | ద్రుతాంతము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| ద్వ. | ద్వయము(వైకృతమును దేశ్యమును మిశ్రమైనపదము) | (సం. ప.) | సంస్కృత పర్యాయపదములు. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో | సా. | సామెత. |
| ధర్మ. | ధర్మశాస్త్రము. [అంతర్భూతము) | స్త్రీ. | స్త్రీలింగము. |
| ధా. లేక క్రి. | ధాతువు (క్రియాపదము) | = | ప్రకృతి వికృతులు గుఱుతు. |
| న. | నపుంసకలింగము. | * | వృక్షలతాది వాచకమగుటను తెలియఁజేయును. |
| నాటక. | నాటకపరిభాష. | ... | ఈ గుఱుతు నడుమ కొన్ని యక్షరము లుండును. |

☞ అచ్చతెనుఁగు పదములలో చకార-జకారపదము లుండవు. ౘ ౙ కారములు గలిగిన పదములే యుండును.

# విమర్శక గ్రంథ సంకేతాది వివేచన పట్టిక

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| | | **సంస్కృతనిఘంటువులు** |
| 1 | ఆ. ని. | ఆప్టి సంస్కృతాంగ్ల నిఘంటువు. |
| 2 | అభి. | అభిధానరత్నమాల. |
| 3 | అమర. | అమరకోశము. |
| 4 | అ. పా. | అమరపదపారిజాతము. |
| 5 | త్రి. శే. | త్రికాండశేషము. |
| 6 | ధన్వ. ని. | ధన్వంతరి నిఘంటువు. |
| 7 | నా. ర. | నానార్థరత్నమాల. |
| 8 | నా. సం. | నానార్థ సంక్షేప నిఘంటువు. |
| 9 | బ్రౌ. ని. | బ్రౌన్యానిఘంటువు. |
| 10 | మే. కో. | మేదిని కోశము. |
| 11 | రా. ని. | రాజనిఘంటువు. |
| 12 | వాచ. ని. | వాచస్పత్య (తారానాథతర్క) నిఘంటువు. |
| 13 | విశ్వ. | విశ్వకోశము. |
| 14 | వై. ని. | వైజయంతి నిఘంటువు. |
| 15 | శ. క. త. | శబ్దార్థకల్పతరువు. |
| 16 | శ. కల్ప. | శబ్దకల్పద్రుమము. |
| 17 | శా. ని. | శాశ్వతనిఘంటువు |
| 18 | సం. ఆం. | సంస్కృతాంధ్ర నిఘంటువు. |
| 19 | స. సం. | సర్వశబ్ద సంబోధిని. |
| 20 | హారా. | హారావళి. |
| | | **మిశ్రాంధ్ర నిఘంటువులు** |
| 21 | ఆం. వా. | ఆంధ్ర వాచస్పత్యము (మొదటి ముద్రణము |
| 22 | ఆం. దీ. | ఆంధ్ర దీపిక. |
| 23 | పురు. క. | పురుషోత్తమ కవీయము. |
| 24 | శబ్ద. ర. | శబ్దరత్నాకరము. |
| 25 | శ. చం. | శబ్దార్థచంద్రిక. |
| 26 | సూ. ని. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| | | **అచ్చతెనుఁగు నిఘంటువులు** |
| 27 | లక్ష్మీనా. | లక్ష్మీనారాయణీయమను ఆం. ప. ప.) నిఘంటువు |
| 28 | వై. కృ. | వైకృత దీపిక. |
| 29 | శు. పా. | శుద్ధాంధ్రపద పారిజాతము. |
| 30 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము. |
| 31 | ఆం. ప. | ఆంధ్ర పదాకరము. |
| 32 | ఆం. శే. | ఆంధ్రనామశేషము. |
| 33 | ఆం. సం. | ఆంధ్రనామ సంగ్రహము. |
| 34 | వేం. ఆం. | వేంకటేశ్వరాంధ్రము. |
| 35 | సాంబ. | సాంబనిఘంటువు |
| 36 | చి. సూ. | చిన్నయసూరివ్రాతప్రతి. |
| 37 | బాల. | బాలచంద్రోదయము |
| 38 | ఆం. భూ. | ఆంధ్ర భాషాభూషణము. |
| 39 | ఆం. సర్వ. | ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము. |
| | | **ప్రకృతిశాస్త్రములు** |
| 40 | భౌ. | భౌతికశాస్త్రము (మై. న.). |
| 41 | రసా. | రసాయన ,, (వే. వి. శర్మ). |
| 42 | మ. మ. | మహమ్మదీయ మహాయుగం (కొ. వె. ల.) |
| 43 | ప. వి. | పదార్థవిజ్ఞాన శాస్త్రము (మం. సా.) |
| 44 | ఆం. చ. | ఆంధ్రుల చరిత్ర (చి॥ వీ॥) |
| 45 | వ్య. శా. | వ్యవసాయశాస్త్రము (గో. జో.) |
| 46 | ప. వా. | పరిణామవాదము (చి॥ దీ॥) |
| 47 | వృ. శా. | వృక్షశాస్త్రము (టి. సా.) |
| 48 | శా. శా. | శారీరశాస్త్రము (వి. చం.) |
| 49 | జం. శా. | జంతుశాస్త్రము (ఆ. ల.) |
| 50 | స్వీ. చ. | స్వీయచరిత్ర (కం॥ వీ॥) |
| 51 | హిం. మ. | హిందూ మహాయుగము (కొ. వె. ల.) |
| 52 | అ. శా. | అర్థశాస్త్రము (క. రా. రెడ్డి.) |
| 53 | శా. పరి. | శాస్త్రపరిభాష (దీ. వెం. శి.) |
| | | **గ్రంథస్థమగు వేదములు శాస్త్రములు మొదలగునవి** |
| 54 | వ్యా. | వ్యాకరణము. |
| 55 | వేద | వేదములు. |
| 56 | నిరు. | నిరుక్తము. |
| 57 | జ్యో. | జ్యోతిషము. |
| 58 | కల్ప. | కల్పము. |
| 59 | ఛంద | ఛందస్సు. |
| 60 | మీమాం. | మీమాంస. |
| 61 | న్యాయ. | న్యాయశాస్త్రము. |
| 62 | పురా. | పురాణములు. |
| 63 | ధర్మ. | ధర్మశాస్త్రము. |
| 64 | ఆయు. | ఆయుర్వేదము. |
| 65 | పాక. | పాకశాస్త్రము. |
| 66 | అర్థ. | అర్థవేదము. |
| 67 | కామ. | కామశాస్త్రము. |
| 68 | ధను. | ధనుర్వేదము. |
| 69 | మల్ల. | మల్లశాస్త్రము. |
| 70 | గజ. | గజశాస్త్రము. |
| 71 | వ్యూహ. | వ్యూహశాస్త్రము. |
| 72 | అశ్వ. | అశ్వశాస్త్రము. |
| 73 | పురు. సా. | పురుషసాముద్రికము. |
| 74 | స్త్రీ. సా. | స్త్రీసాముద్రికము |
| 75 | గాంధ. | గాంధర్వవేదము (రాగ - తాళ). |
| 76 | భావా. | భావావ్యాయ ప్రమేయము. |
| 77 | అలం. | అలంకారములు. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 78 | నాటక. | నాటకలక్షణము. |
| 79 | కావ్య. | కావ్యలక్షణము. |
| 80 | ఛందో. | ఛందోలక్షణము. |
| 81 | భరత. | భరతశాస్త్రము. |
| 82 | చతు. | చతుష్షష్టి విద్యావివరణము. |
| 83 | క్షే. గ. | క్షేత్రగణితము. |
| | | **ఆంధ్రలక్ష్య గ్రంథములు** |
| 84 | అచలా. | అచలాత్మజా పరిణయము. |
| 85 | అచ్చ. భా. | అచ్చతెనుఁగుభారవి. |
| 86 | అచ్చ. రా. | అచ్చతెనుఁగు రామాయణము. |
| 87 | అధ్యా. | అధ్యాత్మ రామాయణము. |
| 88 | అని. | అనిరుద్ధచరిత్రము. |
| 89 | అప్ప. | అప్పకవీయము. |
| 90 | అ. మ. క. | అష్టమహిషీకళ్యాణము. |
| 91 | అహ. | అహల్యాసంక్రందనము. |
| 92 | ఆం చం. | ఆంధ్ర చంద్రాలోకము. |
| 93 | ఆము. | ఆముక్తమాల్యద. |
| 94 | ఇందు. | ఇందుమతీపరిణయము (ధూ.) |
| 95 | ఇందు. రా | ,, (రామభద్రకవి) |
| 96 | ఉ. రా. | ఉత్తరరామాయణము. |
| 97 | ఉ. హరి | ఉత్తరహరివంశము. |
| 98 | ఉ. హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము. |
| 99 | కకు. | కకుత్స్థవిజయము. |
| 100 | కలు. శ. | కలుహాయిశతకము. |
| 101 | కవిక. ర. | కవికర్ణరసాయనము. |
| 102 | క. చౌ. | కవిచౌడప్పశతకము. |
| 103 | క. రం. | కవిజనరంజనము. |
| 104 | క. జ. | కవిజనాశ్రయము. |
| 105 | క. రాజ. | కవిరాజ మనోరంజనము. |
| 106 | క. స. | కవిసర్ప గారుడము. |
| 107 | క. పూ. | కళాపూర్ణోదయము. |
| 108 | కా. సం. | కావ్యాలంకారసంగ్రహము. |
| 109 | కాశీ. | కాశీఖండము. |
| 110 | కాళ. | కాళహస్తి మాహాత్మ్యము. |
| 111 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. |
| 112 | కిరా. | కిరాతార్జునీయము. |
| 113 | కుచే. | కుచేలోపాఖ్యానము. |
| 114 | కువల. | కువలయాశ్వచరిత్రము. |
| 115 | కుమార. | కుమారసంభవము (నన్నెచోడుఁడు) |
| 116 | కృ. క. | కృష్ణకర్ణామృతము. |
| 117 | కృష్ణాభ్యు. | కృష్ణాభ్యుదయము. |
| 118 | కృ. శకుం. | కృష్ణకవిశకుంతలా పరిణయము. |
| 119 | కృ. వి. | కృష్ణరాయవిజయము. |
| 120 | కృ. శ. | కృష్ణశతకము. |
| 121 | కే. బా. | కేయూరబాహు చరిత్రము. |
| 122 | క్రీడా. | క్రీడాభిరామము. |
| 123 | గం. వ. | గంధవహము. |
| 124 | గాధే. | గాధేయోపాఖ్యానము. |
| 125 | గో. రా. | గోపీనాథ రామాయణము. |
| 126 | ఘ. మ. | ఘటికాచలమాహాత్మ్యము. |
| 127 | చం. హా. | చంద్రహాస చరిత్రము. |
| 128 | చం. భా. | చంద్రభానుచరిత్రము. |
| 129 | చం. రే. | చంద్రరేఖావిలాసము. |
| 130 | చం. చ | చంద్రాంగదచరిత్రము. |
| 131 | చం. ప. | చంద్రికాపరిణయము. |
| 132 | చం. రా. | చంపూరామాయణము. |
| 133 | చమ. | చమత్కారమంజరి. |
| 134 | చి. భా. | చిత్రభారతము. |
| 135 | చె. పు. | చెన్నబసవపురాణము. |
| 136 | జా. మా. | జాహ్నవీమాహాత్మ్యము. |
| 137 | జై. భా. | జైమిని భారతము. |
| 138 | తపతీ. | తపతీ సంవరణోపాఖ్యానము. |
| 139 | ద. రా. చ. | దశరథరాజనందన చరిత్రము. |
| 140 | ద. కు | దశకుమార చరిత్రము. |
| 141 | ద. చ. | దశావతారచరిత్రము. |
| 142 | దా. శ. | దాశరథీ శతకము. |
| 143 | ది. చ. | దిలీపచరిత్రము. |
| 144 | ద్వా. క. | ద్వాత్రింశిక (కథలు). |
| 145 | ద్వి. భాగ. | ద్విపదభాగవతము. |
| 146 | ద్వి. సా. | ద్విపదసారంగధర. |
| 147 | ద్వి. నల. | ద్విపద నలచరిత్ర. |
| 148 | ద్వి. పర. | ద్విపద పరమయోగివిలాసము. |
| 149 | ద్వి. భా. | ద్విపద భాగవతము. |
| 150 | ద్వి. భార. | ద్విపద భారతము. |
| 151 | ద్వి. హరిశ్చ. | ద్విపద హరిశ్చంద్ర. |
| 152 | ధనాభి. | ధనాభిరామము. |
| 153 | ధర్మ. | ధర్మఖండము. |
| 154 | ధాతు. | ధాతుమాల (ఆంధ్రము). |
| 155 | నరప. | నరసభూపాలీయము. |
| 156 | న. నాథ. | నవనాథచరిత్రము. |
| 157 | నల. చ. | నలచరిత్రము. |
| 158 | నా. పం. | నారాయణకవి పంచతంత్రము |
| 159 | నార. పు. | నారసింహపురాణము. |
| 160 | నిరం | నిరంకుశోపాఖ్యానము. |
| 161 | నిర్వ. రా | నిర్వచనోత్తరరామాయణము. |
| 162 | నీతి. శ. | నీతిశతకము (సీసము). |
| 163 | నీ. సుం. | నీలాసుందరీపరిణయము. |
| 164 | నృ. పు. | నృసింహపురాణము. |

గ్రామములోనుండు కాలము.)
అంతఃపాపి, సం. విణ. లోపలఁజేరినది.
అంతఃపురకాంత, సం. వి. ఆ. స్త్రీ. రాణివాసము: చూ, స్త్రీ. 1-ా.
అంతఃపురపాలకుఁడు, సం. వి. అ. పు. కొజ్జా: చూ, సౌవిదల్లుఁడు. [1-౧.
అంతఃపురము, సం. వి. అ. న. = అంతిపురి: చూ, సదనము.
అంతఃపురి, సం. వి. ఇ. న. —పై.—
అంతఃపురికుఁడు, సం. వి. అ. పు. కంచుకి: చూ, సౌవిదల్లుఁడు.
అంతఃపురోద్యోగి, వా. విశ: చూ, అంతర్వంశికుఁడు.
అంతఃప్రకృతి, సం. వి. ఇ. స్త్రీ. అమాత్యాదికము; 2. లోపలి స్వభావము.
అంతఃప్రజ్ఞుఁడు, సం. విణ. తన్నుఁదానెఱింగినవాఁడు.
అంతఃప్రవాహ, సం. వి. ఆ. స్త్రీ. సరస్వతినది: చూ, నది. 1-(3).
అంతకంతకు, దే. క్రి: చూ, అంతంత. 2.
అంతకము, సం. వి. అ. పు. 1. ఎల్ల: చూ, సీమ. 1; 2. (గణిత) అంతు, టోకు: చూ, వెరసి; పై. వి. (1) = అఘ, అంతు, టోకు, మొత్తము: చూ, వెరసి. 1. (అని కొందఱు)
అంతకరము, సం. విణ. అంతము చేయునది.
అంతకాలము, సం. వి. అ. పు. 1. తుదికాలము: చూ, సావు. 1-ఒ; 2 మరణకాలము: చూ, సావు. 1-ా.
అంతకుఁడు, సం. వి. అ. పు. 1. జముఁడు: చూ, యముఁడు; 2. భరణీ నక్షత్రము: చూ, రిక్క. 1-౨; విణ. 3. చెఱుచువాఁడు, నాశకుఁడు: చూ, వేరువిత్తు. 2.
అంతగమనము, సం. వి. అ. న. 1. చావు: చూ, సావు; 2. నాశము: చూ, సంస్థ. 3; 3. నెఱవేర్చుట: చూ, సమాప్తి.
అంతగుఁడు, సం.విణ. దరిఁజేరనివాఁడు: చూ, పారంగతుఁడు
అంతట, పై. క్రి. 1: చూ, పిమ్మట; 2: చూ, వెనుక.
అంతటికి, పై. క్రి: చూ, సర్వము.
అంతదనుక, ద్వ. క్రి. రూ-అంతదాఁక-అందనుక-అందాఁక, అంతవఱకు: చూ, తావత్. 2.
అంతదాఁక,—పై—
అంతపాలుఁడు, సం. వి. అ. పు. రాష్ట్రముయొక్క ప్రాంతములను పాలించువాఁడు: చూ, రాజు. 1-౪.
అంతము, సం. వి. అ. న. 1. అలవాటు: చూ, స్వభావము; పుం. న. 2. రూ - అంత్యము. చివర: చూ, సుద. 1; 3. ఏర్పాటు: చూ నత్యము. 2; 4. మరణము: చూ, సావు; విణ. 5. ఒప్పిదమైనది: చూ, హృద్యము. 2; 6. సమీపించినది: చూ, సమీపము. 1-౨; 7. కడపటిది: చూ, వెరసి.2; వి. 8. ఎల్ల: చూ, సీమ. 1; 9. దగ్గఱ: చూ, సమీపము. 1; 10: చూ, సమాప్తి; 11. నాశము: చూ, సంస్థ. 3. విణ. 12. తక్కువైనది: చూ, హీనము; వి. 13: చూ, స్వరూపము. 1-౧; 14. మొత్తము; చూ, పంకలవము; 15. లోపలిభాగము.

అంతరంగము, సం. వి. అ. న. 1. అంతఃకరణము-అంతస్సు, గుండె: చూ, హృదయము. 2; విణ. 2. హృదయములో నుండునది: చూ, హృదయము. 1-౪.
అంతరంగుఁడు, సం. వి. అ. పు. ముఖ్యస్నేహితుఁడు: చూ, స్నేహితుఁడు. 1.
అంతరఖురి, సం. వి. ఈ. స్త్రీ. గుఱ్ఱపునడకలలో భేదము: చూ, హయము. 1-౬౪-(౬).
అంతరగ్ని, సం. వి. ఇ. పు. జఠరాగ్ని: చూ, వహ్ని. 1-౧౬.
అంతరజాతిత్రయము, అం. శశజాతి, వృషభజాతి, తురగజాతి. (3)
అంతరజ్ఞుఁడు, సం. విణ. 1. తారతమ్యము నెఱిఁగినవాఁడు: చూ, ఇంగితజ్ఞుఁడు.
అంతరదామర, వా. మి. వి. (అంతరము+తామర) నాఁచువగ*: చూ, సహస్రపత్రము. 1-౪.
అంతరదము, సం. విణ. 1. హృదయమును చీల్చునది; 2. హృదయమునిచ్చునది.
అంతరదిశ, సం. వి. ఆ. స్త్రీ. మూలదిక్కు: చూ, విదిక్కు.
అంతరపల్లటి (టీ), వా. మి. వి. నడుమపల్లటులుగొట్టు పావురము: చూ, సురఁటీ. 1-౪.
అంతరప్రభవుఁడు, సం. వి. అ. పు. సంకీర్ణజాతివాఁడు.
అంతరభాషలు, అం. అష్టాదశపదార్థములు; 2. కకుబధ్భాషాంతరభాష: చూ, పాలవాహనిక: 3. పంచమషాడవజాంతరభాషలు : లలిత, కిరణావళి, శకద్యావళి (3).
అంతరము. సం. వి. అ. వ.. అవ్య 1. = అంతరపు. భేదము: చూ, వ్యత్యయము. 1; 2. అవకాశము, తెఱపి : చూ, సందు. 6; 3: చూ, సన్మానము; 4. బహిఃప్రదేశము, మయిదానము: చూ, వెలుపల. 1; 5. చిల్లి: చూ, రంధ్రము. 1; 6. అడ్డపాటు: చూ, వ్యవధానము. 3; స. 7. అభ్యంతరము: చూ, మండలము. 1-౧; 8. అదను: చూ, సమయము. 1; పుం. 9. కట్టుఁగోక: చూ, వస్త్రము. 1-౨; 10. అతిశయము: చూ, హెచ్చు. 2; 11. ఆత్మ: చూ, హంసుఁడు. 2; విణ. 12. తనది: చూ, స్వతంత్రము; 13. అన్యము: చూ, వేఱు. 3; 14. వెలుపలిది: చూ, వెలుపల. 2; న. 15. ఈడు: చూ, సమానము. 2; అవ్య. 16. తనది. చూ, స్వతంత్రము; వి. 17. ఒకలెక్కలోనుండి మఱియొక లెక్క తీసివేయుట: చూ, రహితము. 1; 18. క్రతువు: చూ, యజ్ఞము. ; వా. 19. వీణ తంతుల ధ్వని భేదము: చూ, విప్రకృష్టము. 1-౫.
అంతరమూర్ఛన, అం: చూ, అవాంతర భేదములు.
అంతరవకాశము, వా. వి. గుండ్రని మంటిరేణువుల మధ్యనుండు ఎడముల మొత్తము.
అంతరవల్లి, సం. వి. ఈ స్త్రీ: చూ, అంతరదామర *.
అంతరహితుఁడు, సం. విణ: చూ, అపారుఁడు.
అంతరా, సం. అవ్య. మధ్యమున, నడుమను.
అంతరాకాశము, సం. వి. అ. పు. హృదయాకాశము: చూ, బ్రహ్మము. 4.
అంతరాత్మ, సం. వి. న్. పు. 1. జీవాత్మ, పరమాత్మ: చూ,

హంసుఁడు. 2; 2. మనస్సు: చూ, హృదయము. 2; అం. 3; చూ, ఆత్మలు; పా. 4. ఆత్మతోషము; 5. జీవాణువు లతోఁగూడినది.

అంతరాపత్య, సం.వి.ఆ.స్త్రీ. చూలాలు: చూ, స్త్రీ. 1-౨౫౨.

అంతరాభవదేహము, సం. వి. అ. పు. మరణమునకును తర్వాతి జన్మమునకును, నడిమియవస్థయందున్న ప్రాణి: చూ, ప్రాణి. 3:

అంతరాభవసత్త్వము, న. —పై.—

అంతరాయము, సం. వి. అ. పు. 1. పని చెఱుపు: చూ, విఘ్నము; 2. అడ్డు: చూ, సంరోధము; 3. నడుమనడుమను వచ్చు రాబడి: చూ, వచ్చుబడి. 1-౧.

అంతరారాముఁడు, సం. విఱ. 1. పరమాత్మయందు క్రీడించువాఁడు; బ్రహ్మానంద మనుభవించువాఁడు; 2. భక్తులను దరిఁ జేర్చువాఁడు.

అంతరాదిక్కు, సం. వి. క్. స్త్రీ: చూ, విదిక్కు.

అంతరాల(ళ)ము, సం. వి. అ. న. 1: చూ, అంతరము. 7; 2: చూ, నడిమి చోటు; 3. సంకీర్ణజాతి. (సూ. ని.)

అంతరాలోక్యానువిధము, అం: చూ, సమాధులు,

అంతరాశబ్దానువిధము, — పై. —

అంతరించు, సం. అ. క్రి. 1. చచ్చు: చూ, నమయు, 1; 2. చెడు: చూ, సమయు. 3; స. క్రి. 3. కడచు: చూ, దాఁటు. 8.

అంతరింద్రియము, సం. వి. అ. న. మనస్సు: చూ, హృదయము. 1.

అంతరిక్షము, సం. వి. అ. న. రూ-అంతరీక్షము. 1. ఆకసము: చూ, సురవర్త్మము; 2. అభ్రికము, బేగడ: చూ శుభ్రిము. 1.

అంతరీక్షము. —పై.—

అంతరిక్ష్యము, సం. విఱ. ఆకాశమందుండునది. (రూ - అంతరీక్ష్యము).

అంతరీక్ష్యము, —పై.—

అంతరితము, సం. విఱ. నశించునది: చూ, ప్రమృతము 2; 2. నడుమఁజొచ్చినది: చూ, అంతర్గతము; 3. కప్పఁబడినది: చూ, స్థగితము; 4. ఎడము కలుగఁజేయఁబడినది: చూ, వ్యవధాపితము; 5. తిరస్కరింపఁబడినది: చూ, హేళనము. 1-౧; 6. విడువఁబడినది: చూ, పోఁగొట్టఁబడినది: చూ, హీనము. 3; 7. (గణిత) శేషము: చూ, శేషము. 1-౧.

అంతరీపము, సం. వి. అ. పు. నీటినడిమిదిబ్బ, ద్వీపము: చూ, లంక. 1.

అంతరీయము, సం. వి. అ. న. కట్టుఁగోక: చూ. వస్త్రము. 1-౨.

అంతరువు. వై. వి. 1. = అంతరమ్. భేదము: చూ, అంతరము. 1; 2. మఱుఁగుచోటు: చూ, స్థానము. 1-౩౪.

అంతర్గడువు, సం. విఱ. పనికిమాలినది: చూ, వ్యర్థము.

అంతర్గడుఁడు, సం. విఱ. లేకివాఁడు: చూ, వ్రాజె.

అంతర్గతజ్వరము, సం. విఱ: చూ, అంతర్వేదము.

అంతర్గతము, సం. విఱ. 1. నడుమఁబొందఁబడినది: చూ, అంతరితము. 2; 2. లోపఁజేరినది, లోపలనున్నది, కప్పఁబడినది: చూ, స్థగితము; 3. మఱువఁబడినది: చూ, విస్మృతము; 4. దాఁచఁబడినది: చూ, దాఁచుట; 5. శరీరమునఁ బుట్టినది, చిరస్థాయియైనది.

అంతర్గర్భము, సం. విఱ. చూలుగలది, కడుపుతోనున్నది: చూ, ఘూణము. 1-౯.

అంతర్గామి, సం. విఱ. అంతర్గతమగునది.

అంతర్గిరము, సం. అవ్య. అ. న. పర్వతములోపల: చూ, అంతర్గిరి.

అంతర్గిరి. సం. అవ్య. ఇ. న. —పై.—(సూ. ని)

అంతర్గుదవలయము, సం. వి. అ. పు. (వైద్య) మలమూత్ర విసర్జన నాళములను మూయు మాంస చక్రము. (సూ.ని.)

అంతర్గృహము, సం. వి. అ. న. 1. కాశీయందలియొకానొక పుణ్యక్షేత్రము; విఱ. 2. రాణివాసము: చూ, సదనము. 1-౧; 3. ఇంటి లోపలియిల్లు: చూ, సదనము. 1-౧౯.

అంతర్జఠము. సం. వి. అ. పు. న. 1. ప్రాకారమునకు లోపలను, ఇంటికి ముందఱను ఉండు కోష్ఠకము: రూ-అంతర్జనము; 2. బాహ్లీక దేశమందలి గ్రామము: అంతర్జనము. (సూ. ని.)

అంతర్జనము, —పై.—

అంతర్జ్యోతి, సం. వి. స్. న. లోపలితేజస్సు, బ్రహ్మతేజస్సు: చూ' వెలుతురు. 1-౨౧.

అంతర్జ్వలనము, సం. విఱ. 1. లోపలమంటకలది; వి. అ. న. 2. జఠరాగ్ని: చూ, వహ్ని. 1-౧౬; 3. మనస్తాపము: చూ, సంతప్తము.

అంతర్ధత్, సం. (శత్ర). 1. లోపలధరించుచున్న; 2. అంతర్ధాన మగుచున్న, మఱుఁగుపడుచున్న. (సూ. ని.)

అంతర్ధమము, సం. వి. అ. న. పదార్థములను మధ్యముగాఁ జేయు వస్తువు.

అంతర్ధానము, సం. విఱ. 1. లోపలధరించుచున్నది: చూ, స్వీకృతము. 1-3; 2. అంతర్ధాన మగుచున్నది, కానరానిది: చూ, కంచుమించు. 2; 3. లోపలనణఁగినది: చూ, స్తబ్ధము. 1-౧.

అంతర్దశ. సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి) మహాదశ నడుమవచ్చు నవగ్రహముల వరుసలోని ఒకానొక దశ.

అంతర్దశాహము, సం. అవ్య, అ. న. పది దినముల మధ్యమున. (సూ. ని.)

అంతర్దృష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. లోనిచూపు, దివ్యదృష్టి: చూ, వీక్షణము. 1-౬; విఱ. 2. లోకజ్ఞానము లేనిది.

అంతర్ద్వారము, సం. వి. అ. న. 1. పెద్దగుమ్మము నడుమ నుండు చిన్న గుమ్మము: చూ, వాకిలి. 1-౪; వా. 2. ఇంటి నడుమ వాకిలి; చూ, 1-౫౩.

అంతర్ధ, సం. వి. ఆ. స్త్రీ. రూ-అంతర్ధి, మఱుఁగు: చూ, స్థగనము. 1.

అంతర్ధి. సం. వి. ఇ. పు.—పై.—

అంతర్ధాత, సం. విఱ: చూ. అంతర్ధాయకుఁడు.

అంతర్ధానము. సం వి.అ.న. మఱుగుపాటు: చూ, స్థగనము. 1.

అంతర్ధానముచేయు, మి. అ. క్రి. మఱుఁగు పడఁజేయు (సూ.ని.)

అంతర్ధాపయితవ్యము, సం. విశ. అంతర్ధానము పొందింపఁ దగినది: అంతర్ధాపితము, అంతర్ధాప్యము.
అంతర్ధాపితము,—పై.—
అంతర్ధాప్యము,—పై.—
అంతర్ధాయకుఁడు, సం. విశ. 1 కనిపించుచునే కనఁబడకుండ మాయమగువాఁడు; 2. మాయముచేయువాఁడు (సూ.ని.)
అంతర్ధ, సం. వి. ఆ. స్త్రీ. రూ-అంతర్ధి. మఱుఁగు: చూ, స్థగనము. 1.
అంతర్ధి. సం వి. ఇ. పు.—పై.—
అంతర్నగరము, సం. వి. అ. న. అంతఃపురము: చూ: సదనము. 1-౧.
అంతర్బాష్పము, సం. వి. అ. న. 1. వెలికి రాకుండ ఆపఁబడిన కన్నీరు: చూ, సలిలము. 1-౩౨-౧; వి. 2. లోపలనే అడఁపఁబడిన కన్నీరుగలది.
అంతర్భవము. సం. విశ. 1. లోపలిది; 2. లోపలనున్నది: చూ, స్థగితము.
అంతర్భవించు, సం. అ. క్రి. (లోన) చొచ్చు: చూ, సోఁకు. 4.
అంతర్భావన, సం. వి. ఆ. స్త్రీ. లోపలి యోచన: చూ, యోచన. 1-౩.
అంతర్భావము, సం. వి. అ. పు.—పై.—
అంతర్భావితము, సం. విశ. లోపల భావింపఁబడినది: చూ, సంసక్తము. = 1-౬.
అంతర్భూతము, సం. విశ. లోపల నడఁగినది: చూ, స్తబ్ధము. 1-౩.
అంతర్భూమి, సం. వి. ఇ. స్త్రీ. భూగర్భము: చూ, భూమి. 1-౧౧౧.
అంతర్భేతము, సం. వి. అ. పు. లోపలి కలహము: చూ, యుద్ధము. 1-౯౩.
అంతర్మనస్కుఁడు, } సం. విశ. ముచ్చిరి: చూ, విమ
అంతర్మనుఁడు, } నుఁడు.
అంతర్మాతృక, సం. వి. ఆ. స్త్రీ. (తంత్ర) దేహములోని ఆఱుపద్మములందు న్యాసముచేయఁబడు అకారాది వర్ణ సమూహము.
అంతర్మీలితము, అం: చూ, దృష్టిక్రియలు.
అంతర్ముఖము, సం. వి. అ. న. (వైద్య)వ్రణస్రావణశస్త్ర భేదము.
అంతర్ముఖుఁడు, సం. విశ. బయటికి సారివలె గనఁబడు చుండియు లోపల బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుఁడైనవాఁడు, భక్తులలో శ్రేష్ఠుఁడు.
అంతర్మృతము, సం. విశ. కడుపులోనే మరణించినది. (శిశువు).
అంతర్యాగము, సం. వి. అ. పు. మానసికపూజ: చూ, సపర్య.
అంతర్యామము, సం. వి. అ. పు. ఊపిరి బిగఁబట్టుట.
అంతర్యామి, సం. వి. న్. పు. ఆత్మ: చూ, హంసుఁడు. 2; 2. గాలి: చూ, వాయువు. 1; విశ. 3. లోపలనుండు వాఁడు; 4. మనస్సులోని భావములను తెలిసికొనువాఁడు.
అంతర్యామిబ్రాహ్మణము, వా. వి. పరమాత్మ తత్వమును గూర్చిఁ జెప్పు నొకానొక వేదభాగము: చూ, వేదము. 1-౧౮.
అంతర్యోగము, సం. వి. అ. పు: చూ, సమాధి. 1.
అంతర్లంబము, సం. వి. అ. పు. 1. లంబకోణ త్రిభుజము; విశ. 2. లంబకోణములు గలది.
అంతర్లాప, సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్నోత్తరములు లోపలనే గూఢముగానుండునట్టి పద్యము (సమస్య అని కొందఱు)
అంతర్లాపిక, అం: చూ, శబ్దాలంకారములు
అంతర్వంశము, సం. వి. అ. పు: చూ, అంతఃపురము.
అంతర్వంశికుఁడు, సం. వి. అ. పు: చూ, అంతఃపురోద్యోగి. (కుబ్జవామనాది): చూ, సౌవిదల్లుఁడు.
అంతర్వణము, సం. అవ్య, అ. న. అడవి లోపల.
అంతర్వత్ని, సం. వి. ఈ. స్త్రీ. చూలాలు: చూ, భ్రూణ. 1.
అంతర్వమి, సం. వి. ఇ. న. అజీర్ణి: చూ, రోగము. 1-౨.
అంతర్వర్తి, సం. విశ. లోపలనుండునది.
అంతర్వాణి, సం. విశ. (ఇ) 1. శాస్త్రములు నెఱిఁగినవాఁడు: చూ, సమర్థుఁడు; 2. పండితుఁడు: చూ, సుధి.
అంతర్వాహిని, సం. వి. ఈ. స్త్రీ. భూమి అడుగున పాఱు నది: చూ, నది. 1-(౩).
అంతర్వేగము, సం. వి. అ. పు. అంతర్గత జ్వరము: చూ, రోగము. 1-౩౩.
అంతర్వేది, సం. వి. ఈ. స్త్రీ. 1. గంగాయమునల నడిమి దేశము. (ఇదియే బ్రహ్మావర్తము అనియు కుశస్థలి అనియు కొందఱు); 2. గోదావరీశాఖయగు వశిష్ఠయను నదీతీర మందలి పుణ్యక్షేత్రము; ఇ. న. 3. వేదీ మధ్యభాగము; 4. పుణ్యక్షేత్రము: చూ, భూమి 1-౧; విశ. 2. లోనిది తెలియువాఁడు, గుట్టు తెలిసినవాఁడు.
అంతర్వేశము, సం. వి. అ. పు: చూ, అంతర్వంశము.
అంతర్వేశికుఁడు, సం. వి. అ. పు: చూ, అంతర్వంశికుఁడు.
అంతర్వేశ్మము, సం. వి. న్. న: చూ, అంతర్వేశికుఁడు.
అంతర్వేశ్మికుఁడు, సం. వి. అ. పు: చూ, అంతర్వేశికుఁడు.
అంతర్హాసము, సం. వి. అ. పు. లోనవ్వు: చూ, హాస్యము. 1-౮.
అంతర్హితము, సం. విశ. మఱుఁగుపడినది, కప్పఁబడినది: చూ, స్థగితము. 1.
అంతర్హితుఁడు, సం. విశ: కానరానివాఁడు: చూ,అగోచరుఁడు.
అంతలపొంతలవాఁడు, ద్వ. వి. చూ, దూరపుఁజుట్టము: చూ, సంబంధి. 1-౨.
అంతవంతము, సం. విశ. అంతముకలది, నశించునది, నశ్వరము: చూ, భంగురము. 1-౧.
అంతవట్టు, ద్వ. స. (అంత+పట్టు) 1. అంతయు: చూ, సర్వము; 2. అకొఁది: చూ, అంత. 2.
అంతవట్టువాడు, ద్వ. స. అందఱు. 1. 2.
అంతవాసి, సం. వి. న. పు. రూ-అంతేవాసి. 1: చూ, శిష్యుఁడు. 1; 2. చండాలుఁడు: చూ, సురియాళువు; 3. దగ్గఱనుండు వాఁడు: చూ, సన్నిహితుఁడు; 4. పొలిమేరయొద్దనుండు వాఁడు.
అంతశయ్య, సం. వి. ఆ. స్త్రీ. రూ - అంతశ్శయ్య. - అంత

శయ్య. 1. మరణము: చూ, శ్మశానము; 4: చూ, శవయానము.

అంతశ్శయ్య, —వై.—

అంతశ్శల్యము, సం. వి. అ. న. 1. లోపలనుండుశల్యము: చూ, శల్యము; 1-౧౭; విణ. 2. లోపల శల్యము కలది; వా. శల్యమువలె హెూక్కి లోపల పొడిచెడి పరుషవాక్యము.

అంతస్తాపము, సం.వి.అ.పు.1.లోపలితాపము:చూ,సంజ్వరము. 1-౯; విణ. 2. లోపలతాపముగలది: చూ, సంతప్తము. 1.

అంతస్తు- వై. వి. 1. అంతరువు, పైమూఁగు చోటు: చూ, స్థానము. 1-౩౪; 2. తొట్టికట్టు: చూ, ముంగిలి. 2; 3. మేడ: చూ, సదనము. 1-౬౫; 4. గుండె: చూ, హృదయము 1; 5. ఇంటికప్పు: చూ, సదనము. 1-౧౭; 6. నిలుమన్నావా? చేతిపొడవు: చూ, నిలువు 2.

అంతస్థ, వా. వి. రహస్యపు లంచము: చూ, సూకిద. 1-౧.

అంతస్థము. సం. విణ. 1. లోపలనుండునది: చూ, స్థగితము; 2. నడుమ నుండునది: చూ, మధ్యమము. 4

అంతస్థములు, అం. (వ్యాకరణ) య-ర-ల-వ అను అక్షరములు.

అంతస్సంగము. అం: చూ, సంగములు.

అంతస్సంజ్ఞము, సం. విణ. లోపలచై తన్యము గలది, గూఢమైన సుఖాద్యను భవము గలది, (వెజ్జుమొ.): చూ, చైతన్యము. 3-౧.

అంతస్సత్త్వ, సం. వి. ఆ. స్త్రీ. 1. చూలాలు: చూ, స్త్రీ. 1-౨౫౨; 2. నల్లజీడిగింజ: చూ, స్ఫోటకోఫ. 1-౨-(౧).

అంతస్సత్త్వము, సం. వి. అ. న. 1. లోపలిబలము: చూ, శక్తి. 1; విణ. 2. లోపలశక్తిగలది: చూ, స్థౌల్యము. 1-౨.

అంతస్సలిలము. సం. విణ. 1. లోపలనీరుగలది: చూ, సలిలము: 1-౪౦; 2. భూమియడుగునఁ బ్రవహించునది (నది): చూ, సలిలము. 1-౪౧. (సూ.ని.)

అంతస్సారము, సం. వి. అ. పు. 1. లోపలనుండు సారము: చూ, శక్తి. 1; 2. లోపల సారముగలది: చూ, సౌల్యము. 1-౩.

అంతశరము, వా. సం. వి. అ. న. ఒకానొక ఆయుధము: చూ, బాణము. 1-౧౮.

అంతాది, సం. వి. ఇ. పు. ఒకఁడు చెప్పిన శ్లోకముయొక్క కొనలోనుండు అక్షరమును ఆదియందు కలుగునట్లు మఱియొకఁడు శ్లోకమును జెప్పుట.

అంతావశాయి, సం. వి. న్. పు. 1-రూ-అంతావసాయి. క్షౌరకుఁడు: చూ, మంగలి. 1; 2. మాల: చూ, సురియాళువు.

అంతావసాయి,—వై.—

అంతి, సం. అవ్య. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. సంతోషము: చూ, హ్లాదనము.

అంతిక, సం. వి. ఆ. స్త్రీ. 1. రూ - అత్తిక. నాట్యపరిభాషయందు అక్క, చూ, జ్యేష్ఠ. 4; 2. శాతల*: చూ, సంబరేను; 3. ప్రొయ్యి: చూ, హసంతి. 1-౧; దే. వి. (1).= అంతికె. తడిక, గడ్డిచాఁప: చూ, చాఁప. 3. (అంతికలు= గడ్డితడకలు) [1-౩.

అంతికతమము. సం. విణ. అతిసమీపము: చూ, సమీపము.

అంతికము, సం. వి. అ. న. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; విణ. 2. దగ్గఱది: చూ, సమీపము. 1-౨; 3. పొదవఱకు సాగునది.

అంతిమఁడు, సం. విణ. దేశము చేతగాని కాలము చేతగాని దగ్గఱనున్నవాఁడు: చూ, సన్నిహితుఁడు.

అంతిపురము, వై. వి. = అంతఃపురము. 1: చూ, సదనము. 1-౧; 2. అంతఃపురజనము, రాణివాసము: చూ, స్త్రీ. 1-౮.

అంతిపురి, వై. వి: చూ, రూ-అంతిపురము 1.

అంతిమము, సం. విణ. 1. కడపటిది: చూ, వెరసి. 2; 2.దగ్గఱది: చూ, సమీపము. 1-౨.

అంతియ, వై. స. రూ-అంతి-అంతె-అంతివట్టు, అకొలఁది: చూ, అంత. 2. [సుద. 1.

అంతు, వై. వి. 1. వెరసి: చూ, సంకలనము; 2. చివర: చూ,

అంతుకము. సం. వి. అ. పు. 1. గర్వము: చూ, హంకారము; అం. 2: చూ, అలంకారము. 3.

అంతె, వై. స: చూ, రూ-అంతియ.

అంతేవసాయి, సం. వి. న్. పు. 1: చూ, రూ-అంతావశాయి. 1; 2: చూ, రూ-అంతావశాయి. 2; 3. బెస్త: చూ, బోయ. 3; 4. ఒకానొక ముని: చూ, సన్యాసి. 1-౧౯.

అంతేవాసి; చూ, రూ - అంతవాసి.

అంత్య, సం. వి. ఆ. స్త్రీ. 1. కడజాతిస్త్రీ: చూ, స్త్రీ. 1-౨౫౩; 2. తుంగ*: చూ, ముస్తకము. 1.

అంత్యఋణ(ర్ణ)ము, సం. వి. అ. న. దేవర్షి పితృఋణములలో కడపటిఋణము, పితౄణము (ఇది పుత్రోత్పాదనముచే తీరును) (సూ. ని.)

అంత్యకర్మము, సం.వి.న్.న. అంత్యక్రియ: చూ, కర్మములు

అంత్యక్రియ, సం. వి. ఆ. స్త్రీ. మృతునకుఁజేయు దేహసంస్కారము, ఉత్తరక్రియ: చూ, కర్మములు.

అంత్యజాతుఁడు, సం. వి. అ. పు. మాల: చూ, అంతావశాయి. 2.

అంత్యజుఁడు. సం. వి. అ. పు. 1.—వై.—; 2: చూ, శూద్రుఁడు; 3. రజకాదు లేడ్వుర యందొకఁడు: అంత్యయోని.

అంత్యనియమము, అం: చూ, శబ్దాలంకారములు.

అంత్యప్రతిజ్ఞ, వా. వి: చూ, అంత్యసందేశము.

అంత్యభము, సం. వి. అ. న. 1. రేవతి: చూ, దిక్కు 1-౨౮; 2. మీనరాశి: చూ, రాసులు. ౧౨.

అంత్యము, సం. వి. అ. న. 1: చూ, రూ - అంత్య. 2. *; 2: చూ, అంత్యము. 1; 3: చూ, అంత్యభము. 2; 4. (తర్క) నిత్యద్రవ్యవృత్తి ధర్మవిశేషము; న. 5. పదార్థమను సంఖ్యలో నూఱవవంతు; విణ. అ. తక్కువైనది: చూ, హీనము; 7. కడపటిది: చూ, వెరసి. 2.

అంత్యయోని, సం. ఇ: చూ, అంత్యజుఁడు. 1, 2, 3.

అంత్యసందేశము, వా. వి. యుద్ధారంభమునకు ముందు కడసారిచేయు సందేశము: అంత్యప్రతిజ్ఞ.

అంత్యానుప్రాసము, అం: చూ, శబ్దాలంకారములు.

అంత్యావసాయి, సం. వి. న్. పు. 1. చండాలునికి నిషాదస్త్రీ యందుఁ బుట్టినవాఁడు: చూ, సురియాళువు. 1;

2. చండాలాదులు ఏడ్వురు యందొకఁడు: చూ, సురి యాపవు, 1-౫. (సూ. ని.)

అంత్యావసాయిని, సం. వి. ఈ. స్త్రీ. చండాలునకు నిషాద స్త్రీ యందుఁ బుట్టిన స్త్రీ: చూ, స్త్రీ. 1-౨౫౩.

అంత్యాహుతి, సం. వి. ఇ. స్త్రీ. ఆహితాగ్నికి చేయు ఉత్తర క్రియ; అంత్యేష్టి.

అంత్యుఁడు, సం. వి. అ. పు: చూ, అంతావశాయి. 2; 2: చూ, మ్లేచ్ఛుఁడు.

అంత్యేష్టి: చూ, అంత్యాహుతి.

అంత్రతంధమి, సం. వి. ఇ. స్త్రీ. పేగులను నొక్కు-అజీర్ణ రోగము: చూ, రోగము. 1-౩౮.

అంత్రకూజనము, సం. వి. అ. న. పేగులలో గుబ్బుగుబ్బుమను ధ్వని: రూ-అంత్రకూజము.

అంత్రకూజము, పు.—పై.—

అంత్రమాంసము, సం. వి. అ. న. ప్రేగుల సంబంధమైన పక్వమాంసము.

అంత్రము, సం. వి. అ. న. రూ-ఆంత్రము. పేగు: చూ, ప్రేవు. 1-౧.

అంత్రవృద్ధి, సం. వి. ఇ. స్త్రీ: చూ, వట్టవాఁపు.

అంత్రాదము, సం. వి. అ. పు. ప్రేగులను తినునది (నులి పురుగు): చూ, పురుగు. 1-౪.

అంత్రి, సం. వి. ఈ. స్త్రీ. కడుపునొప్పి పోఁగొట్టు ఒకానొక ఓషధి*.

అందంద, వై. అవ్య. (అందు+అందు+అ) 1. అత్యంతము. జై. 7, ఆ. 58; స్వా. 4. ఆ. 98: చూ, మఱిమఱి; 2. అచ్చటచ్చట. కాశీ. 1. ఆ. 131: చూ, అక్కడక్కడ; 3. అప్పటికప్పుడే; 4. మిగుల: చూ, మిగిలి. ౧.

అందంబుగూడుకొను, దే. అ. క్రి. కలసికొను: చూ, సంయుక్తమగు.

అందకత్తె(కత్తియ), వై. విఙ. (అందము+కత్తియ): చూ, సౌందర్యవతి.

అందగాఁడు, ద్వ. విఙ (అందము+కాఁడు): చూ, సౌందర్యవంతుఁడు.

అందగించు, వై. అ. క్రి. 1: చూ, రమ్యమగు; స. క్రి. 2. ఇచ్చు: చూ, పెట్టు. 9; 3. అలంకరించు: చూ, సింగారించు; 4. పుట్టించు: చూ, సృజించు.

అందగింపు, వై. వి: చూ, సౌందర్యము.

అందచందములు, వై. వి. బ. 1. సొగసులు రీతులు; 2. ముద్దుముచ్చటలు; విఙ. 3. సొగసైనది: చూ, హృద్యము. 2.

అందఁజేయు, దే. స. క్రి: చూ, అందించు.

అందదుకు, దే. విఙ. (అదుకు+అదుకు) 1. మిక్కిలి అదుకులు గలది. హరి. ఉ. 1. ఆ. 15; 2. సంపూర్ణము కానిది: చూ, అసంపూర్ణము.

అందనుక, ద్వ. ద్ర. (అంత+దనుక) అంతవరకు. రూ-అందాఁక. చంద్రా. 5, ఆ. 37: చూ, తావత్. 2.

అందపడు, వై. అ. క్రి. (అందము+పడు): చూ, అందగించు.

అందపఱుచు, వై. స. క్రి. (అందము+పఱుచు): చూ, అందపడు.

అందము, సం. వి. అ. పు. కట్టుట: చూ, బంధము. 1; వై. వి. (1): చూ, అందగింపు; (2): చూ, విధము. 1: (3) నగ: చూ, భూషణము. 2; విఙ. (4) అందమైనది: చూ, హృద్యము. 2; (5) తగినది: చూ, యోగ్యము. 2.

అందఱు, వై. స. బ. (అంత+వారు) రూ-అందొఱు (అంత శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము). 1. అంతసంఖ్యగలవారు: చూ, ఎల్లవారు. 2; 2. స్త్రీపురుషులెల్లరు: చూ, ఎల్లవారు. 1.

అందలము, వై. వి. = ఆందోళిక. పార్శ్వముల మఱుఁగు లేని పల్లకి. కళా. ౮-౨౬: చూ, సవారి.

అందలములు, వై. వి. బ. బాలబాలికల పల్లకీలవంటియాట. వి. పు. 7, ఆ. 202: చూ, బాలక్రీడ.

అందలి, దే. విఙ. అందున్న.

అందాఁక, ద్వ. వి. (అంత+దాఁక) అంతవఱకు. హరి. ఉ. 5, ఆ. 248; స్వా. 5, ఆ. 24: చూ, రూ-అందనుక.

అంది, వా. వి. 1: చూ, రూ-అందియ. 1; 2; వా. క్రి. విఙ. 2. అనినది, అన్నది. చెప్పినది.

అందించు, దే. స. క్రి. రూ-అందిచ్చు-అందియిచ్చు. 1: చూ, అందఁజేయు; 2. పొందించు: చూ, సక్తమగు; 3. చేరఁజేయు, చేరుచు - చేర్చు. ఇచ్చు: చూ, దయచేయు. 2.

అందిక, దే. విఙ. దగ్గఱది, అధ్యాత్మ. బాల. కాం. 19: చూ, సమీపము. 1-౨.

అందికొను, దే. స. క్రి: చూ, రూ-అందుకొను.

అందికోలు, దే. వి. 1. రూ-అందుకోలు. దగ్గఱ: చూ, సమీపము. 1; విఙ. 2. రూ-అందుకోలు. అతిసమీపము: చూ, సమీపము. 1-౩.

అందిచాఁపు, దే. వి. అందుపాటులోనున్న వానిని చేయిచాఁచి కొట్టుదెబ్బ: చూ, హతి. 1.

అందిచ్చు, దే. స. క్రి: చూ, రూ-అందించు.

అందిపొందనివాఁడు, ద్వ. విఙ. మఱియొకఁడు, అన్యుఁడు: చూ, వేఱయినవాఁడు.

అందిపొందినట్టివాఁడు, ద్వ. విఙ. రూ-అందిపొందువాఁడు, దూరపుచుట్టము: చూ, సంబంధి. 1-౨.

అందిపొందువాఁడు, —పై.—

అందియ, వై. వి. = అందువు. రూ-అందె - (వాడుకలో:— అంది). 1. గండపెండేరము: చూ, భూషణము. 2-౧౦-(౧); 2. ఆఁడుదాని కాలినగ. (బ. అందియలు-అందెలు): చూ, భూషణము. 2-౧౦-(౧౩).

అందియిచ్చు, దే స. క్రి: చూ, రూ-అందించు. 1, 2, 3.

అందు, దే.స.క్రి.1. గ్రహించు: చూ, స్వీకరించు; 2. పొందు: చూ, సక్తమగు; 3. అంటు, తాఁకు: చూ, స్పృశించు; 4. ప్రసవించు: చూ, సంభవించు. 1-౩; 5. ప్రభవించు: చూ, సంభవించు; ద్ర. 6. అచ్చోట: చూ, తత్ర; అవ్య. 7. సప్తమీవిభక్తి ప్రత్యయము. (అందు- ఇందు - న); 8. వానిలో, వారిలో, 9. వారియందు, దానియందు; 10. తృతీయార్థమును తెలుపును; 11. "వలన"అను నర్థము నిచ్చును;

అంధ్రకోసలము, సం. వి. అ. పు. రూ - ఆంధ్రకోసలము, ఆంధ్రమండలము - ఆంధ్రమండలము, త్రిలింగక్షేత్రము: చూ, దేశము. దేశము. 1-౮౫.
అంధ్రమండలము, —పై—
అంధ్రము, రూ-ఆంధ్రము. 1.—పై.—; 2. తెనుఁగుభాష: చూ, భాషలు. 1-౧.
అంధ్రుఁడు, సం. వి. అ. పు. రూ - ఆంధ్రుఁడు. 1: చూ, తెలుఁగువాఁడు; 2. తెలుఁగుదేశపు రాజు: చూ, ఆంధ్రుఁడు. 2; 3. ఒకానొక సంకీర్ణజాతివాఁడు. (సూ. ని.)
అంప, ద్వ. వి. రూ-అంపలు-అంబు-అమ్ము, అంపకోల: చూ, బాణము. 1.
అంపకట్టె, —పై.—
అంపకము, దే. వి. 1. పంపుట: చూ, ప్రేషణము; వా. వి. 2. పంపకము: చూ, భాగము. 1.
అంపకయ్యము, ద్వ. వి. బాణయుద్ధము: చూ, యుద్ధము. 1-౨౮.
అంపకాఁడు, ద్వ. విశ. (అమ్ము+కాఁడు) 1. ధ్వని: చూ, వింటివాఁడు; 2. గురితప్పక అమ్ము వేయువాఁడు: చూ, సూటుకాఁడు. 2.
అంపకోల, వై. వి. = అంబకమ్ (అమ్ము+కోల): చూ, అంప.
అంపగరి, ద్వ. వి. బాణమునకుఁ గట్టిన యీఁకలు. రూ - అంపగఱి: చూ, బాణము. 1-౨౪.
అంపగఱి,—పై.—
అంపతప్పు. ద్వ. వి. బాణముతగులకుండఁగ తప్పించుకొను శక్తి: చూ, వెరవు. 1-౪.
అంపదొన, ద్వ. వి. అంబులపొది: చూ, బాణము. 1-౩.
అంపపొది.—పై.—
అంపపోకడ, ద్వ. వి. 1. బాణముపోవుట; 2. బాణవ్యయము.
అంపములికి, ద్వ. వి. అంపముల్కి. బాణపుటలుఁగు: చూ, బాణము. 1.
అంపముల్కి,—పై.—
అంపలు, వై. = అంబకమ్. 1: చూ, అంప; 2. బాణసమూహము: చూ, బాణము. 1-౨౬.
అంపవెల్లి, ద్వ. వి: చూ, అంపలు. 2.
అంపశయ్య, సం. వి. ఆ. స్త్రీ. 1. భీష్ముని బాణముల శయ్య: చూ, బాణము. 1-౮౫; వా. 2. బాణముల శయ్య.
అంపసాల, వై. వి. ఆయుధశాల: చూ, సదనము. 1-౯.
అంపాచారము, వై. వి. = అంబుశ్చారః-అంబ్వాసారః-అంభ ఆసారః. తనంతట పాఱుచున్న ప్రవాహము: చూ, వెల్లువ.
అంపి, వై. వి. = ఆపః. నీరు: చూ, సలిలము.
అంపించు, దే.స.క్రి. రూ-అంపు, ఆజ్ఞాపించు: చూ, సెలవిచ్చు.
అంపించుకొను, దే. స. క్రి. 1.—పై.—; వా. 2. మాట అనిపించుకొను. (చీవాట్లు తిను.)
అంపియ, దే. వి. రూ - అంపె. చింపిగుడ్డ: చూ, వస్త్రము. 1-౬౨.
అంపు, దే. వి. 1. వివాహము, సంక్రాంతి, జాతర, సప్తాహాది పండుగుల వేడుక విశేషము: చూ, సంబరము, 3; స. క్రి. 2: చూ, అంపించు; 3. అరుగఁజేయు: చూ, పంపు. 11.
అంపుట, దే. వి: చూ, అంపకము. 1.
అంపుదోడు, దే.విశ. పయనమందలి తోడు: చూ, సహాయుఁడు.
అంపె, దే. వి: చూ, రూ-అంపియ.
అంబ, సం. వి. ఆ. స్త్రీ. 1. = అప్ప - అమ్మ, తల్లి: చూ, మాత. 1; 2. కాశీరాజు ముగ్గురు కొమార్తెలలో నొకతె. (ముగ్గురు:-అంబ, అంబిక, అంబాలిక); 3. చేఁదుఆనప*: చూ, సొర. 1-౧; 4. పులిచింత *: చూ, సునిషణ్ణకము; అం. 5. అంబాత్రయము:-జ్ఞానాంబ, భ్రమరాంబ, మూకాంబ; స్త్రీ. 6. జననీజనకులతల్లి: చూ, అవ. ( ), (2), (3); 7. జననీజనకుల తల్లి తల్లి: చూ, ముత్తవ్వ; 8. గౌరి: చూ, పార్వతి; 9. చెయ్యి: చూ, హవిస్సు. 2; 10. నల్లమామిడి*: చూ, అంబరీషము. 1.
అంబకము, సం. వి. అ. న. 1. కన్ను: చూ, లోచనము. 1; పు. 2. = అమ్ము-అంబు: చూ, బాణము. 1.
అంబకశము, ద్వ. వి. 1. పరిసూకంజావ: చూ, సూపము. (1)-౨౩-(౨); 2. చోడపిండి జావ, అంబలి: చూ, సూపము (1)-౨౩-(౨).
అంబటిచేయి, వా. వి. 1. అంబలిత్రాగువాఁడు; 2. అంబలి త్రాగిన చెయ్యి (కుడిచెయ్యి.)
అంబటిజోరిగాఁడు, ద్వ. వి. ఒకానొక పిట్ట: చూ, పక్షి.
అంబటితారిగాఁడు, వా. వి. —పై.—
అంబటిప్రొద్దు, ద్వ. వి. అంబలిత్రాగువేళ, మధ్యాహ్నసమయము. (సూ. ని.) చూ, వాసరము. 1-౩.
అంబరదము, సం వి అ. న. (అంబరములను ఇచ్చునది) దూది: చూ, సముద్రాంత. 2.
అంబరమణి, సం. వి. ఇ. పు. వినుకెంపు: చూ, సూర్యుఁడు.
అంబరము, సం. వి. అ. న. 1. ఆకసము: చూ, సురవర్త్మము; 2. బట్ట: చూ, వస్త్రము. 1; 3. ఏడుపు: చూ, శోకము. 1-౨; 4. = అంబరు. సుగంధద్రవ్యము: చూ, రాజార్హము. 1; 5. సున్న: చూ, శూన్యము. 1; 6. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; 7. అభ్రకము: చూ, శుభ్రము. 1; 8. దూది: చూ, అంబరదము; 9. ద్యూతాది వ్యసనము: చూ, వ్యసనములు; 10. మబ్బు: చూ, మేఘము. 1.
అంబరాంతము, సం. వి. అ. పు. 1. బట్టకొంగు: చూ, మైజాఱు; 2: చూ, దిక్చక్రము.
అంబరీషము, సం. వి. అ. 1. నల్లమామిడి*: చూ, మామిడి. 1-౨; 2. గుఱ్ఱపుపిల్ల (పిల్లజంతువు అని సూ. ని): చూ, హయము. 1-౨౯; అం. 3: చూ, నరకములు; పు. 4. వగపు: చూ, శోకము. 1; 5. పశ్చాత్తాపము: చూ, విప్రతీసారము; న. 6. జగడము: చూ, యుద్ధము. 1; 7. మంగలము: చూ, పాత్రము. 6-౪౧; కిక్కిసగడ్డి*: చూ, తృణము. 1; 8. వర్షము: చూ, వాన. 1.
అంబరీషుఁడు, సం. వి. అ. పు. 1: చూ, అంబరమణి; 2. వినుసిగదేవర: చూ, శివుఁడు; 3. మాంధాత కొడుకు: చూ, రాజు. 1-౮౧; 4. వెన్నుఁడు: చూ, విష్ణువు; 5. బాలకుఁడు: చూ, శిశువు. 1-౨; 6. సూర్యవంశ్యుఁడైన

యొక రాజర్షి: చూ, సన్యాసి. 1-౧౫; అం. 7: చూ, షోడశ మహారాజులు.

అంబరు, వై. వి. =అంబరమ్. ఆగరువు: చూ, రా ర్ష ు 1.

అంబలము, దే. వి. కలకల ధ్వని: చూ, స్వరము 2 ౖ౩.

అంబలి, దే. వి. జావ: చూ, అంబకళము. 1, 2.

అంబష్ఠ, సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల*: చూ, హరికి. 5; 2. చిఱుబొద్ది*: చూ, విద్ధకర్ణి; 3. పులిచింత*: చూ, సునిషణ్ణకము; 4. నల్లతెగడ*: చూ, సర్వాను గాతి. 1-౧; 5. సరస్వతితీఁగె*: చూ, సరస్వతి. 7; 6. అడవి మామిడి*: చూ, మామిడి. 1-౪; 7. అంబాలిక*: చూ, మాచిక.

అంబష్ఠకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, అంబష్ఠ. 2.

అంబష్ఠము, సం. వి. అ. పు. 1. ఒకానొక దేశము: చూ, దేశములు. 1-౫౬-౨; 2. ఐరుసద్దసరము*: చూ, సింహాస్యము. 1-౧.

అంబష్ఠి, సం. వి. ఈ స్త్రీ. అంబష్ఠుని భార్య: చూ, భార్య. 1-౬౩.

అంబష్ఠుఁడు, సం. వి. అ. పు. 1. బ్రాహ్మణునకు వైశ్యకన్య యందు పుట్టినవాఁడు. (వీనివృత్తిచికిత్స); 2. మావటి: చూ, హస్తారోహుఁడు; 2. మంగళధ్వని చేయువాఁడు: చూ, మంగలి. 1.

అంబస్తు, దే. వి. కపటములేనివాఁడు: చూ, నిష్కపటి. 2.

అంబా, వై. వి. = అమ్బా. రూ- అంబే-ఉంబ గోజాతియఱపు: చూ, వ్ ు. 2-౧౨౪.

అంబారము, దే. వి. రూ-అంబారు. వడ్లరాశి: చూ, ధాన్యము. 1-౨౫.

అంబారి(రీ), దే. వి. హౌదా. ఏనుఁగుమీది పీఠము: చూ, హస్తి. 1-(౬౧).

అంబారు, దే. వి: చూ, రూ-అంబారము.

అంబారపిడుఁజు, దే. వి. పశువులమేన నంటుకొని రక్తము పీల్చెడు జంతువిశేషము: చూ, బుద్దపిడుఁదు. 1.

అంబార్థవాచక, సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి*: చూ, మాంసి. 1.

అంబాలిక, సం. వి. ఆ. స్త్రీ. 1. కాశిరాజు చిన్నకూఁతురు (విచిత్రవీర్యుని భార్య. పాండురాజుతల్లి): చూ, అంబ. 2; 2. తల్లి: చూ, అంబ. 1; 3: చూ, అంబష్ఠ. 7*.

అంబాళము, వై. వి. = ఆమ్రాతకః. నల్లమామిడి*: చూ, మామిడి. 1-౪.

అంబిక, సం. వి. ఆ. స్త్రీ. = అమ్మిక. 1. గౌరి: చూ, పార్వతి; 2. కాశిరాజు నడిమికూఁతురు (విచిత్రవీర్యుని పెద్దభార్య. ధృతరాష్ట్రుని తల్లి): చూ, అంబ. 2; 3. తల్లి: చూ, అంబ. 1; 4: చూ, మే ; 5. మగనితల్లి: చూ, అత్త (1); 6. భార్యతల్లి: చూ, అత్త (2) 7. మేనమామ భార్య; చూ, అత్త (4); 8. కటుక రోహిణి*: చూ, కటుకరోహిణి.

అంబు, సం. వి. ఉ. న. 1. నీరు: చూ, సలిలము. 1; వై. వి. (1). = అంబుమ్. రూ-అమ్ము: చూ, బాణము. 1; 2. మేదరవాని అమ్మువంటి యొక యినుప పనిముట్టు: చూ, బాణము. 1-౧౫.

అంబుకంటకము, సం. వి. అ. పు. (నీటిలో కంటకమువలె నుండునది) మొసలి: చూ, మత్స్యము. 1-౩.

అంబుకణము. సం. వి. అ. పు. గాలిచేత చెదరినట్టి నీరు లోనగు వానిబొట్టు: చూ, శీకరము.

అంబుకిరాతము, సం. వి. అ. పు: చూ, అంబుకంటకము.

అంబుకీశము, సం. వి. అ. న. ఉలచమీను: చూ, మత్స్యము. 1-౨.

అంబుకూర్మము, పు. —వై.—

అంబుకేశరము, సం. వి. అ. పు. మాదీ ఫలము*: చూ, సుపూరము.

అంబుక్రియ, సం. వి. ఆ. స్త్రీ. జలతర్పణము: చూ, తర్పణము. ౯-౧.

అంబుగజము, సం. వి. అ. పు: చూ, అంబుకంటకము.

అంబుగర్భుఁడు, సం. వి. అ. పు. తమ్మిచూలి: చూ, బ్రహ్మ. 1.

అంబుఘనము, సం. వి. అ. పు: చూ, వడగల్లు.

అంబుచత్వరము, సం. వి. అ. న. చెఱువు: చూ, సరస్సు. 1.

అంబుచరము, సం. విణ. (నీటవరించునది) చేఁప: చూ, మత్స్యము. 1.

అంబుచామరము, సం వి. అ. న. నాఁచు*: చూ, శైవలము. 1-౨.

అంబుజన్మము, సం. వి. న్. న. 1. పద్మము: చూ, సహస్రపత్రము 1; పుం. 2. బెగ్గురుపక్షి: చూ, సారసము. 2; 3. నిప్పు: చూ, వహ్ని. 1; 4. శంఖము: చూ, సంకు. 1.

అంబుజన్ముఁడు, సం, వి. న్. పు. 1. నీరుపుట్టువు, చంద్రుఁడు: చూ, హిమాంశువు; 2. నీరుపావ, నిప్పు: చూ వహ్ని. 1.

అంబుజము, సం. వి. అ. న. 1. తామర*: చూ, సహస్రపత్రము. 1; పు. 2. ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము. 1-౧; 3. వాన కోయిల: చూ, స్తోకము. 2; 4. హారతి కర్పూరము: చూ, సిరము. 2-౨; 5: చూ, అంబుజన్మము. 2; 6: చూ, అంబు న్మ ు. 4; 7. వజ్రాయుధము: చూ, బాణము. 1-౬౨; అం. 8. ఒకానొక వృత్తము: చూ, వృత్తము. 1.

అంబుజాసన, సం. వి. ఆ. స్త్రీ. (పద్మమునుగద్దెగా గలది) పద్మిని: చూ, లక్ష్మి. 1.

అంబుజాసనుఁడు, సం. వి. అ. పు. (పద్మముగద్దెగాగలవాఁడు) తమ్మిగద్దియదొరవాయి: చూ, బ్రహ్మ. 1.

అంబుజుఁడు, సం. వి. అ. పు: చూ, అంబుజన్ముఁడు. 1, 2.

అంబుతస్కరుఁడు, సం. వి. అ. పు. (నీటిని కిరణములచే అపహరించువాఁడు) పగుమేఁపరి: చూ, సూర్యుఁడు.

అంబుతాలము, సం. వి. అ. పు. (నీటియందుండునది) నాఁచు*: చూ, అంబుచామరము.

అంబుదఫలి, సం. వి. ఈ. స్త్రీ. శిఖని*: చూ, మూలుగు. 2.

అంబుదము, సం. వి. అ. పు. (నీ ఇచ్చునది) మబ్బు: చూ, మేఘము. 1.

అంబుధరము, సం. వి. అ. పు. 1. —వై.—; 2. తుంగ*: చూ, ముస్తకము. 1; 3. బేగడ: చూ, శుభ్రము. 1.

అంబుధి, సం. వి. ఇ. పు. 1. కడలి: చూ, సముద్రము; సర్వ. 2: చూ, నాలుగు.

అంబుధిప్రసవ, సం. వి. ఆ. స్త్రీ: చూ, గృహకన్య*.

అంబుధీషధి, సం. వి. ఇ. పు: చూ, శివుఁడు.

అంబునిధి, సం: చూ, అంబుధి. 1.

అంబుపక్కెర, ద్వ. వి. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1-౬౫.

అంబుపత్ర, సం. వి. ఆ. స్త్రీ. ఉచ్చట, వట్రువముస్తె*: చూ, తృణము. 1-౩౨-౩౩.

అంబుపము, సం. వి. అ.పు. 1: చూ, అంబునిధి; 2. తగిరస*: చూ, పరిపున్నాటము; విణ. 3. జలమును త్రాగునది.

అంబుపాతము, సం. వి. అ. పు. 1. సెలయేటి ప్రవాహము: చూ, వెల్లువ; 2. కొండసెలయేఱు ధారగాఁ గ్రిందఁబడుట; 3. సెలయేఱుపడు చోటు: చూ, స్థానము. 1-౩౯.

అంబుపుఁడు, సం. వి. అ. పు: చూ - వరుణుఁడు; విణ. 2. జలములకు రాజు; 3. నీరుత్రాగువాఁడు.

అంబుప్రసాదకము, సం వి. అ. పు. చిల్ల*: చూ, సల్లకి.

అంబుప్రసాదనము, —పై. —

అంబుప్రసాదము, —పై. —

అంబుప్రసాధనము, 1. —పై.—; 2. కుంకుడు*: చూ; ఫేనిలము. 2.

అంబుబాష్పము, సం. వి. అ. న. నీరుతోఁటకూర*: చూ, మారిషము. 1-౧.

అంబుభూషణుఁడు, సం. వి. అ. పు. రూ-అంబుభూషితుఁడు-అంబుభూషుఁడు: చూ, వరుణుఁడు.

అంబుభూషితుఁడు, వా. — పై. —

అంబుభూషుఁడు, వా. —పై.—

అంబుభృత్తు, సం. వి. త్. పు. 1 మబ్బు: చూ, మేఘము. 1; 2. బేగడ: చూ, శుభ్రము. 1; 3. ముస్తె*: చూ, ముస్తకము. 1; 4. కడలి: చూ, సముద్రము.

అంబుమర్కటము, సం. వి. అ. పు. మొసలి: చూ, మత్స్యము. 1-౩.

అంబుముక్కు, సం. వి. చ్. పు. (నీటినివిడుచునది) మబ్బు: చూ, మేఘము. 1-౧౯. (రూ-అంబుముచము.)

అంబుముచము;—పై.—

అంబురాశి, సం. వి. అ. పు. కడలి: చూ, సముద్రము.

అంబురుహ. సం. వి. ఆ. స్త్రీ. రూ-అంబురుహము. 1. మెట్టతామర*: చూ, సహస్రపత్రము. 1-౧; 2. తామర*: చూ, సహస్రపత్రము. 1; అం. 3. ఒకానొక వృత్తము: చూ, వృత్తము. 1.

అంబురుహము, స. వి. అ. పు. —పై. —

అంబురుహిణి, సం వి. ఈ. స్త్రీ. తామరతీఁగె*: చూ, సహస్రపత్రము. 1-౯.

అంబులపొది, ద్వ. వి: చూ, అంపదొన.

అంబువాచి, సం.వి. ఈ. స్త్రీ. ఆషాఢ బ ౧౦మొ॥ ౧౩ వఱకును భూమికిఁగలపేరు. (ఈకాలమున భూమిఋతుమతియనియు, అంటుదియనియు అనెడి వాడుకను బట్టి సేద్యము జరుపఁబడదు. (సూ. వి.)

అంబువాసి, సం. వి. ఈ. స్త్రీ. రూ-అంబువాసిని. పాటలి*: చూ, స్థాలి. 2.

అంబువాసిని —పై. —

అంబువాహము, సం. వి. అ. పు. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. చెఱువు: చూ, సరస్సు. 1; 3. ఒకరకపుగడ్డి*: చూ, తృణము. 1 ౪౬; విణ. 4. నీరుమోయునది: చూ, మేఘము. 1-౨౦

అంబువాహి. సం. వి. న్. పు. 1. మబ్బు: చూ, అంబువాహము. 1; 2. ముస్త*: చూ, ముస్తకము. 1; (చూ. అంబువాహము.3)); విణ. 3. నీళ్ళుమోయువాఁడు. మేఘమందు వర్షించును (అనికొందఱు): చూ మనుష్యుఁడు. 1-౫.

అంబువాహిని, సం. వి. ఈ. స్త్రీ. 1. తెప్పచేఁద: చూ, పాత్రము. 6-౨౫ (౧); 2. ఎత్తునీరు పోయుటకై కాలువ మొదట నుంచెడు దొలుపుపట్టె: చూ, హోమము. 1-౮; 3. ఏఱువాఁకెడు పుట్టి: చూ, హోమము. 1-౨; 4. నీళ్ళుమోయు ఆఁడుది: చూ, స్త్రీ. 1-౨౫౪.

అంబువిస్రవ, సం. వి. అ. స్త్రీ: చూ, రూ-అంబుధిప్రసవ*.

అంబువు, సం. వి. ఉ. న. 1. నీరు: చూ, సలిలము; 2. లగ్నమునకు నాలుగవ స్థానము: చూ, అంభస్సు; 3. ఒకానొక వృత్తము: చూ, వృత్తము. 1.

అంబువేతసము, సం. వి. అ. పు. నీరుప్రబ్బలి*: చూ, సహస్రవేధి. 2-౧.

అంబుసరణము, సం. వి. అ. న. అనంతట పాఱుచున్న ప్రవాహము: చూ, వెల్లువ. 1.

అంబుసేచని, సం. వి. ఈ. స్త్రీ. ఓడనుండి నీళ్ళెత్తి పోయు బొక్కెన: చూ, పాత్రము. 6-౨౫-౨.

అంబుస్ఫోటము, సం. వి. అ. న. నీరుబుగ్గ: చూ, స్ఫోటము. 2.

అంబూకృతము, సం. వి. అ. న. 1. తుంపరలతోఁ గూడిన మాట: చూ, సనిష్ఠీవము; 2. తుంపరలతోఁ గూడినధ్వని: చూ, సర్వము. 2-౧౪౮; విణ. 3. నిష్ఠీవముతోఁగూడినది (మాట-ధ్వని); 4. (నీరుగాఁ జేయఁబడినది) మబ్బు: చూ, మేఘము. 1-౨౧; వి. 4. మబ్బు: చూ, మేఘము. 1.

అంబే, వై. వి. 1. = అమ్మా: చూ, రూ-అంబా. (వి. పు. 7, ఆ. 141.); వా. 2. నిరాకరణమందగుధ్వన్యనుకరణము, రూ-అబ్బె-అబ్బే: చూ, హూహూ.

అంబేద, దే. విణ. (అంబే + పేద) పిఱికి. దిట్టతనములేనివాఁడు: చూ, వ్రాజె.

అంబ్లము, సం. వి. అ. పు: చూ, అమ్లము-ఆమ్లము. 1. పుల్లన: చూ. శుక్తము. 3; విణ. 2. పుల్లనిది. రూ-అమ్లము-ఆమ్లము: చూ, శుక్తము. 4.

అంభ, సం. వి. ఆ. స్త్రీ. = అంబా-అంబే-ఉంబ: చూ, అంబే. 1.

అంభశ్చారము, సం. వి. అ. న: చూ, రూ-అంపాచారము:

అంభసాంభ్రమము, సం. వి. అ. పు. నీటిసుడి: చూ, సుడి. 1-౪.

అంభస్సారము, సం. వి. అ. న. 1. ముత్యము: చూ, రత్నము. 1; 2. నీటిసారము: చూ, సలిలము. 1-౪౨.

అంభస్సు, సం. వి. స్. న. 1. నీరు: చూ, సలిలము. 1;

2. కురువేరు*: చూ, హ్రీవేరము; 3: చూ, అంబువు. 2; 4. (యోగ) నవవిధతుష్టులయందుఁ బ్రకృతియను అధ్యాత్మికతుష్టి. (సూ. ని.)

అంఘా, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-అంఘ.

అంభోజజనని, సం. వి. ఇ. పు. నలువ: చూ, బ్రహ్మ. 1.

అంభోజజన్ముఁడు, సం. వి. అ. పు. —పై.—

అంభోజము, సం. వి. అ. న. తామర*: చూ, సహస్రపత్రము. 1; 2. తామరపువ్వు: చూ, సహస్రపత్రము. 1-౧౦; 3. బెగ్గురు: చూ, సారసము. 2; విణ. 4. నీటఁ బుట్టినది.

అంభోజిని, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, అంభోజము; 2: చూ, అంభోజము. 2; 3. తామరగుంపు: చూ, సహస్రపత్రము. 1-౭; 4. తామరకొలను: చూ, సరస్సు. 1-౯-(౧); 5. నీరు బ్రబ్బలి*: చూ, సహస్రవేధి. 2-౧.

అంభోజుఁడు, సం. వి. అ. పు. 1. చంద్రుఁడు: చూ, హిమాంశువు; 2. అగ్ని: చూ, వహ్ని. 1; విణ. 3. నీటఁ బుట్టినవాఁడు: చూ, సలిలము. 1-౪౩ (చూ, మేఘము. 1-౧౮.)

అంభోదము, సం. వి. అ. పు. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. ముస్త*: చూ, ముస్తకము. 1; విణ. 3. నీటినిచ్చునది: చూ, మేఘము. 1-౧౭.

అంభోధరము, సం. వి. అ. పు: చూ, అంభోదము. 1. 2.

అంభోధి, సం. వి. ఇ పు. కడలి: చూ, సముద్రము.

అంభోధివల్లభము, సం. వి. అ. పు. పగడము: చూ, రత్నములు. ౪.

అంభోనిధి, సం. వి. ఇ. పుం: చూ, రూ-అంభోధి.

అంభోభ్రమము, సం. వి. అ. పు: చూ, అంభసాంభ్రమము.

అంభోరాశి, సం. వి. ఇ. పు: చూ, అంభోనిధి.

అంభోరుహము, సం. వి. అ. న. 1. తామర*: చూ, సహస్రపత్రము. 1; పు. 2. బెగ్గురు: చూ, సారసము. 2.

అంశకము, సం. వి. అ. పు. 1: చూ, భాగము. 1; న. 2. సౌరదినము: చూ, రోజు. 1-౪.

అంశకుఁడు, సం. వి. అ. పు. జ్ఞాతి: చూ, సగంధుఁడు. 1.

అంశనము, సం. వి. అ. న. పంపకము: చూ, విభజనము.

అంశభాక్కు, సం. విణ. (జ్). భాగస్వామి: చూ, సగంధుఁడు. 2.

అంశము, సం. వి. అ. పు. 1: చూ, అంశకము. 1; 3. పాలు: చూ, వంతు. 5; 3. కిరణము: చూ, హాయనము. 2; 4. గడ్డి మొ॥ వానిప్రోవు: చూ, మేటి. 2.

అంశయిత, సం. విణ. పంచిపెట్టువాఁడు: చూ, విభజనకర్త.

అంశలుఁడు, సం. విణ: చూ, అంశభాక్కు.

అంశసవర్ణనము, సం. వి. అ. న. (గణిత) భిన్నాంశములను (హారములను) సమాంశములుగాఁ జేయుట (సూ. ని.)

అంశస్వరము, సం. వి. అ. పు. (సంగీత) ముఖ్యస్వరము: చూ, స్వరము. 2. ౧౪౯. [అంశభాక్కు.

అంశహారుఁడు, సం. విణ. భాగముపుచ్చుకొనువాఁడు: చూ,

అంశహారి, సం. వి. భాగము పంచుకొనువాఁడు: చూ, అంశభాక్కు.

అంశి, సం. విణ. భాగము (దాయభాగము) గలవాఁడు: చూ, సగంధుఁడు. ౨-౩.

అంశిక, సం. వి. ఆ. స్త్రీ. దాయభాగము గల ఆఁడుది: చూ, స్త్రీ. 1-౨౫౫.

అంశుఁడు, అం. పన్నిద్దఱు సూర్యులలో నొకఁడు: చూ, సూర్యుఁడు. 1-౨.

అంశుకము, సం. వి. అ. న. 1. ఉత్తరీయము: చూ, వస్త్రము. 1-౧౧; 2. సన్ననిబట్ట: చూ, వస్త్రము. 1-౩౮; 3. మృదుకాంతి: చూ, వెలుతురు. 1-౧౭; 4. బట్ట: చూ, వస్త్రము1; 5. ఆకుపత్రి*: చూ, రోమశము. 3.

అంశుధరుఁడు, సం. వి. అ. పు: చూ, సూర్యుఁడు. 1.

అంశుపట్టము, సం. వి. అ. న. సన్ననిపట్టుబట్ట: చూ, వస్త్రము. 1-౮౧-(౧).

అంశుపతి, సం. వి. ఇ. పు: చూ, అంశధరుఁడు.

అంశుభృత్తు. త్. —పై.—

అంశుమంతము, సం. వి. త్. పు. 1. ఒకానొకకొండ: చూ, పర్వతము. 1-౨౮; విణ. 2. ప్రకాశముగలది: చూ, వెలుతురు. 1-౧౮; 3. మొనగలది: చూ, సుద. 1-౮

అంశుమంతుఁడు, సం. వి. త్. పు. 1: చూ, అంశుధరుఁడు; 2 ఒకరాజు: చూ, రాజు. 1. (ఇతఁడు సగరుని మనుమఁడు, దిలీపుని తండ్రి); 3. చంద్రుఁడు: చూ, హిమాంశువు; 4. నైర్భతి: చూ, సోఁకులఱేఁడు; 5. వెన్నుడు: చూ, విష్ణువు; అం. 6: చూ, ఆదిత్యులు; విణ. 7. కనికరము గలవాఁడు: చూ, సురకుఁడు; 8. ధనికుఁడు: చూ, సంపన్నుఁడు.

అంశుమతి, సం. వి. ఈ. స్త్రీ. 1. ముయ్యాకుపొన్న*: చూ, సాలపర్ణి; 2. యమునానది: చూ, 1-౩.

అంశుమత్తు, అఁ: చూ, ఆగమములు.

అంశుమత్ఫల. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి *: చూ, రంభ. 2.

అంశుమాలి, సం. వి. న్. పు: చూ, అంశుధరుఁడు.

అంశులము, సం. విణ. ప్రకాశమానమైనది: చూ, వెలుతురు. 1-౧౮.

అంశులుఁడు, సం. వి. అ. పు. 1. చాణక్యముని: చూ, సన్యాసి. 1-౧౦; విణ. 2. అంశువును గ్రహించువాఁడు.

అంశువు, సం. వి. ఉ. పు. 4. కిరణము: చూ, హాయనము 2; 2. కాంతి: చూ, వెలుతురు. 1; 3. కొన, మొన: చూ, సుద. 1; 4. అణువు: చూ, స్వల్పము; 5. దారము: చూ, సూత్రము. 1.

అంశుహస్తుఁడు, సం. వి. అ. పు. రవి: చూ, సూర్యుఁడు.

అంశ్యము, సం. విణ. విభాగమునకు తగినది, పంచుకొనఁదగినది (సూ. ని.): చూ, విభాజ్యము.

అంసకూటము, సం. వి. అ. పు. ఎద్దు మూఁపురము: చూ, స్కంధము. 1-౧.

అంసత్రము, సం.వి.అ.న. భుజకవచము: చూ, వారవాణము.

అంసదక్షిణావర్తము, వా. వి. సంతానవృద్ధిగల స్త్రీ లక్షణము: చూ, లక్షణము. 1-౪౮.

అంసపాది, వా. వై. వి. = హంసపాది, కీటపాది*: చూ, హంసపాది.

**అంసభారము**, సం. వి. అ. పు. రూ-అంసేభారము. 1. (బుజముల బరువు) కావడి: చూ, స్కంధాటిక. 1; 2. (మూఁపు మీఁది బరువు) కావడి: చూ, స్కంధాటిక. 1-౨.

**అంసభారి**, సం. విణ. 1. బుజమునబరువు మోయువాఁడు:రూ-అంసభారికుఁడు; 2. మూఁపునకాఁడి మోయునది.

**అంసభారికుఁడు**: చూ, రూ-అంసభారి. 1.

**అంసము**, సం. వి. అ. పు. 1. మూఁపు: చూ, స్కంధము. 1; 2. పాలు. చూ, వంతు. 5; 3. పంపకము: చూ, భాగము. 1.

**అంసరంగికము**, సం. వి. అ. పు. జాడిద*: చూ, సూక్ష్మ దారువు. 1-౧.

**అంసలుడు**, సం. విణ. బలిమికాఁడు: చూ, శక్తుఁడు.

**అంసేభారము**, సం. వి. అ. పు: చూ, రూ-అంసభారము. 1, 2.

**అంస్యము**, సం.విణ. అంసమునందుండునది: చూ, స్కంధము. 1-౬.

**అంహతి**, సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఈవి: చూ, స్పర్శము, 3; 2. తెవులు: చూ, రోగము; 3. విడుపు: చూ, విమోచనము. 1.

**అంహస్సు**, సం. వి. స్. న. పాపము, దోషము: చూ, వృజినము. 1.

**అఁట**, దే. అవ్య. 1. వృత్తాంతము చెప్పుటను తెలుపును. "క. తామఁటదలఁపఁగఁదలఁటఁట" భాగ. ౧౦, స్కం. ఉ: చూ, సమాచారము. 2; 2. మహత్వమును తెలుపును. "క. రావణుఁడఁటరిపుఁ డానెలకువఁజొచ్చి పొదివితఁట కయ్యమునం జేనెత్తురుగా కుండఁగ, వానింజఁపితఁట" నిర్వ. ౨. ఆ: చూ, మహత్తు. 4; ద్ర. 3. అచ్చట, అంద: చూ, తత్ర; 4. ఆక్షేపమును తెలుపును: చూ, నెగ్గింపు. 1-౧; 5. ఆశ్చర్యమును తెలుపును: చూ, వింత. 1; 6. ముందుచెప్పఁబడిన విరుద్ధమైనయర్థమును తెలుపును: అయిన - ఐన; 7. అర్థవిశేషము లేకయే కొన్నిచోట్ల ప్రయోగింపఁబడును; వా. 8. పూర్వాచారపు బ్రాహ్మణులలో కొందఱు అఁటకు బదులుగ "అష"నుపయోగింతురు. "తిన్నారష, వచ్చారష," ఇత్యాది.

**అఋణి**, సం. విణ. ఇ. రూ-అనృణి-అప్పు లేనివాఁడు: చూ, ధనగ్రాహకుఁడు. 1-౧.

**అక**, వై. వి. = అర్కా. రూ-అక్క. 1. అప్ప: చూ, సహోదరి; 2. పాచకి: చూ, వంటలక్క; 3. పూజ్యస్త్రీ: చూ, స్త్రీ. 1-౭; 4. అఁడుది: చూ, స్త్రీ. 1.

**అకంటకము**, సం. విణ. అ. న. 1. ముండ్లులేనిది; 2. శత్రువులు లేనిది.

**అకట**, వై. అవ్య. = అక. రూ-అకటకట-అకటకటా-అకటా-అక్కట-అక్కటకట-అక్కటకటా-అక్కటక్కట - అక్కటక్కటా-అక్కటా-కట-కటకట-కటకటా-కటా-కట్ట-కట్టా-1. అయ్యో, సంతాపమును తెలుపును: చూ, సంతాపము. 1-౫; 2. అహహ. ఆశ్చర్యమును తెలుపును: చూ,వింత. 1.

**అకటకట**, వై. అవ్య. —పై.—

**అకటకటా**, —పై.—

**అకటవికటము**. దే. విణ. రూ-అకటావికటము. తాఱుమాఱు: చూ, వ్యత్యయము.

**అకటా**, వై. అవ్య: చూ, రూ-అకట.

**అకటావికటము**, దే. విణ: చూ, రూ-అకటవికటము.

**అకము**, సం. వి. అ. పు. న. వెత: చూ, శోకము. 1-౧; 2. దోషము: చూ, వృజినము. 1; 3. వృశ్చిగరాశి: చూ, రాసులు.

**అకర**, సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక*: చూ, శ్రీఫలి.

**అకరణము**, సం. వి. అ. న. 1. పనిచేయమి. రూ-అకరణి 2. ఆత్మ: చూ, హంసుఁడు; వా. విణ. 3. ఇంద్రియములు లేనిది; 4. సాధనములేనిది; 5. స్వభావముచేత కలిగినది: చూ, స్వభావము. 1-౪.

**అకరణి**, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, అకరణము. 1. (ఇది తిట్టునపుడేయుపయోగింపఁ బడును. "తస్యాకరణిరేవాస్తు" అని వాచస్పత్రి; పు. 2. తిట్టు: చూ, శాపము. 1.

**అకరికుఁడు**, సం. వి. అ. పు: చూ, సుంకరి.

**అకరిణి**, సం. వి. ఇ. స్త్రీ. చేయనిది: చూ, అకృతము.

**అకరు**, దే. వి. రూ-అకరు - అకరువు - కరులు. (తామరదుద్దు లోనగు వానిని చుట్టునుండునది) కింజల్కము. కుమారసం. 3-౩౫౧; భీమ. 3-౫౦: చూ, సహస్ర పత్రము. 1-౧౦ - (౩).

**అకరువు**, —పై.— కాశీ. ౧-౨; ఆంభా. 1-౧౬౫.

**అకరోటు**, వా. వి. రూ-అక్రోటు*: చూ, మృదుద్రుమము. 2.

**అకర్ణము**, సం. వి. అ. పు. 1. చక్షుశ్రవము,కంటివినికి: చూ, సర్పము. 1; విణ. 2. చెవులుకలది; 3. చెవులులేనిది.

**అకర్తనుఁడు**, సం. విణ. 1. కత్తిరింపని వాఁడు; 2. పొట్టివాఁడు: చూ, వామనుఁడు. 2.

**అకర్మకఠినకరము**, అం. రాజ్యలక్షణము: చూ, లక్షణము. 1-౪౩.

**అకర్మకము**. సం: చూ, అకర్మము. 6.

**అకర్మకర్తృప్రయోగము**. అం: చూ, ప్రయోగములు.

**అకర్మము**, సం. వి. న్. న. 1. పనిలేమి: 2. విహితకర్మములు లేకుండుట; 3. పాపకార్యము: విణ. న్. 4. పనిలేనిది; 5. కర్మాధికారములేనిది, భ్రష్టము; వా. 6. (వ్యాక) కర్మపదములేని క్రియ: అకర్మకము.

**అకర్మశీలుఁడు**, సం. విణ. ఏపనియు లేకుండఁగ నున్నవాఁడు: చూ, సోమరి.

**అకర్మి**, సం. విణ. న్. —పై.—

**అకల్క**, సం. వి. అ. స్త్రీ. (మాలిన్యములేనిది) రేయెండ: చూ, వెన్నెల. 1.

**అకల్కనుఁడు**, సం. విణ. డంబములేనివాఁడు: చూ, వీతదంభుఁడు.

**అకల్కము**, సం. విణ. స్వచ్ఛమైనది: చూ, సమీచీనము. 2.

**అకల్పము**, సం. విణ. 1. అధికారమునకుగాని విధులకుగాని లోఁబడనిది; 2. బలములేనిది; అబల, అవీర; 3. పోల్ప శక్యముకానిది.

**అకల్యము**, సం. విణ. 1. రోగముగలది: చూ, రోగము. 1-౩౫; 2. సత్యమైనది: చూ, సత్యము. 5.

**అకస్మాత్తు**. సం. క్రి. విణ. అవ్య : చూ, దబ్బాటు.

అకస్మికము, వా. విశే. చూ, అకాండము. 2. (రూ-ఆకస్మికము.)
అకాండపాతము, సం. వి. అ. పు. ఆకస్మికముగా సంభవించుట. (సూ. ని.)
అకాండము, సం. విశే. 1. సమయోచితముకానిది; 2. ఉన్నట్టుండి కలిగినది: చూ, ఆకస్మికము; 3. కాండముమ లేనిది (సూ. ని.)
అకామము, సం. విశే. 1. కోరిక లేనిది; 2. వలపులేనిది, మన్మథవికారము లేనిది; 3. బుద్ధిపూర్వకము గానిది.
అకాముడు, సం. విశే. 1. కామములేనివాడు: చూ, నిష్కాముడు; 2. కోరికలేనివాడు: చూ, నిరాశుడు.
అకాయుడు, సం. వి. అ. న. 1. కారణము లేమి; క్రి. విశే. 2. కారణము లేక వ్యర్థముగా; విశే. 3. శరీరము లేనివాడు.
అకారణము, సం. క్రి. విశే. 1. కారణము లేక, వ్యర్థముగా. భార. ఉ. ౨-౨౪౦; విశే. 2. కారణములేనిది; తనంతటనే కలిగినది; వి. అ. న. 3. కారణములేమి.
అకారణముగా, క్రి. విశే. ద్రు. అకారణముగా. (సూ. ని.) (వా. అనిగొందఱు).
అకార్యకారి, సం. విశే. 1. చెడుపనిచేయువాడు; 2. విహితకృత్యము మానువాడు; 3. కార్యకారికానిది.
అకార్యం, సం. వి. అ. న. 1. చెడ్డపని: చూ, వ్యళీకము. 2; విశే. 2. చేయఁదగనిది: చూ, ఆగ్రహము. 4.
అకాలము, సం. వి. అ. పు. 1. సరికాని కాలము: చూ, అసమయము; విశే. 2. కాలములేనిది; 3. తెల్లనిది (నలుపు కానిది).
అకించనత, సం. వి. ఆ. స్త్రీ. 1. దారిద్ర్యము: చూ, సీదరము 1; 2. సర్వద్రవ్యమును పరిత్యజించుట (ఇదిసన్న్యాసమునకు అంగము.)
అకించనిమము, సం. వి. న్. పు: చూ, అకించనత. 1.
అకించిజ్ఞుడు, సం. విశే. జ్ఞానశూన్యుడు: చూ, ప్రాజ్ఞె.
అకించిత్కరము, సం. విశే. పనికిమాలినది.
అకీర్తి, సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. అపకీర్తి: చూ, నడి. 3; విశే. (ఇ) 2. కీర్తిలేనివాడు.
అకుంచనము. అం: చూ, కర్మములు. 2.
అకుంఠము, సం. వి. అ. పు. లోహపాషాణాదులచే నఱుఁగనిది; విశే. 2. వాఁడియైనది; 3. అడ్డులేనిది; 4. చెడఁగొట్టఁబడనిది; 5. ప్రతిబంధము లేనిది; 6: చూ, స్థిరము.
అకుంఠితము, సం. విశే. 1. మొక్కవోనిది; 2: చూ, స్థిరము.
అకుతోభయుడు, సం. విశే: చూ, నిర్భయుడు.
అకుప్యము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1-౫; 2. వెండి: చూ, లోహము. 1-౪.
అకులజుడు, సం. విశే: చూ, సంకరుడు.
అకులత, సం. విశే. నీచజన్మము: చూ, సంకరము.
అకుశలము; సం. వి. అ. న. క్షేమము లేక యుండుట.
అకూపారము, సం. వి. అ. పు. రూ - అకూవారము. కడలి: చూ, సముద్రము: 2. ఆదికూర్మము: చూ, తాఁబేలు. ౧; 3. గుఱ్ఱపుమూతి మీను, కూర్మరాట్టు: చూ, మత్స్య - . 1-౫.
అకూపారుడు, సం. వి. అ. పు: చూ, సూర్యుడు.
అకూవారము: చూ, రూ-కూపారము.
అకృతకృత్యుడు, సం. విశే. తనకు విధాయకమగు పనిని చేయువాడు.
అకృతబుద్ధి, సం. విశే. ఇ. 1. శిక్షితము కాని బుద్ధికలవాడు. మూర్ఖుడు; చూ, స్తబ్ధుడు; వి. ఇ. స్త్రీ. 2. అశిక్షితమగు బుద్ధి: చూ. హృల్లేఖము. 1-౧౬.
అకృతము, సం. వి. అ. న. 1, చేయకుండుట; 2. చేయఁబడని కార్యము; విశే. 3. చేయఁబడనిది: చూ, అచీర్ణము; 4. తప్పుగాఁ జేయఁబడినది; 5. సిద్ధము చేయఁబడనిది, అయితము కానిది (అన్నము మొ॥); 6. సృజింపఁబడినిది; 7. అక్షితము.
అకృతశ్రముడు, సం. విశే. శ్రమనొందిన వాడు.
అకృతసాక్షులు, అం: గ్రామస్థులు, ప్రాడ్వి వాకిలేఖ సభ్యులు, రాజు, కార్యాధికారి, వారిచే పంపఁబడినవాడు, కులము వారు (6).
అకృతాత్ముడు, సం. విశే. 1: చూ, అకృతబుద్ధి. 1; 2. బ్రహ్మానుసంధానము లేనివాడు.
అకృతాస్త్రుడు, సం. విశే. విలువిద్యయందు ఆరితేఱనివాడు.
అకృతోద్వాహుడు. సం. వి. అ. పు. పెండ్లిలేనివాడు: చూ, కుంటుడు.
అకృత్యము, సం. వి. అ. న. 1. తగని పని; విశే. 2. చేయరానిది.
అకృష్టపచ్యము. సం. విశే. దున్నకయే పండునది (నివ్వరిమొ): అకృష్టరోహి.
అకృష్టము, సం. వి. అ. న. 1. నివ్వరివడ్లు: చూ, ధాన్యము. 1-౨౫; విశే. 2. దున్నఁబడనిది; 3. లాగఁబడనిది.
అకృష్టరోహి, సం. విశే. (న్-ఈ.న్): చూ, అకృష్టపచ్యము.
అకృష్టకర్ముడు, సం. విశే: చూ, సదాచారుడు.
అకృష్టిక, సం. వి. ఆ. స్త్రీ. ఆఁడు ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక.
అకేశవుడు, సం. విశే. వెంట్రుకలు లేనివాడు.
అకో, దే. అవ్య. రూ-అకో-ఒకో-ఒక్కొ-ఒకో-ఒక్కో-ఓ. సంశయార్థకము : చూ, సంశయము. 1.
అకో, దే. అవ్య. —పై.—
అకోటము, సం. వి. అ. పు: చూ, పోఁక*
అకోపుడు. సం. విశే: చూ, నిష్కోపి.
అకౌటిల్యుడు, సం. విశే: చూ, నిష్కపట
అకౌశల్యుడు, సం. విశే. నేర్పులేనివాడు: చూ, వాఠెజె.
అక్క, సం. వి. ఆ. స్త్రీ. 1. అమ్మ: చూ, మాత. 1; వై. వి. (1)=అర్క. రూ-అక. అప్ప, తనకు పైనపుట్టిన ఆఁడుది. సీలా. 3-౫౩: చూ, సహోదరి; (2): చూ, వంటలక్క; (3). పూజ్యస్త్రీ. నై. ౫-౧౨౨, కళా. ౩-౯౬: చూ, స్త్రీ. 1-౭ (4). ఆఁడుది. వేణుగో. ౧౩: చూ, స్త్రీ. 1: వా. ఉప. (5) స్త్రీల పేర్లకు "అమ్మ" అనునది చేర్చినటుల "అక్క" అని చేర్పఁబడుట. ("సీతక్క, రామక్క మొ॥); (6) బ. దేవతాత్వమును బొంది శుభకార్యారంభముల యందుఁ గొంథఅచేఁ బూజింపఁబడు పూజ్య స్త్రీలు (ద్వార.

ఆఱుగురును అక్కచెల్లెండ్రు అయినను సుగుణములచే దేవతాత్వమును పొందిరని ప్రసిద్ధి) (సూ.ని.); వై. అవ్య. (7) అహో. ఆశ్చర్యార్థకము. శుక. ౧. ౨౨౩: చూ, వింత. 1.

అక్కజపడు, వై. అ. క్రి. = ఆశ్చర్యపడు (అక్కజము+పడు) వింతనొందు. వైష. ౫-౧౩౩: చూ, వెఱఁగొందు.

అక్కజము, వై. వి. 1. = ఆశ్చర్యమ్. అచ్చెరియము. పి. శకుం. ౨-౪౯: చూ, వింత. 1; విశ. 2. అధికము. హెచ్చైనది. భార. ఆది. ౬-౨౦౩: భార-అర. ౪-౧౧౯; భార-భీష్మ ౮-౨౫౩: చూ, హేరాళము; 3. శక్యముకానిది. భార-అర. ౩-౫౫౫; భార: భీష్మ. ౧-౩౫౫. నై. ౨-౨౯: చూ, లావు. 7; 4. ఆశ్చర్యము. భార. విరా. ౩, ౮౮: చూ, వింత. 1.

అక్కజుఁడు, వై. విశ. అధికుఁడు. భార. అర. ౧-౧౦౨; శివ. సా. ౩౪౯: చూ, హేమాహేములు.

అక్కజురాలు, వై. విశ. (అక్కజ+ఆలు) అధికురాలు: చూ, స్త్రీ. 1-౯. [చూ, సంతాపము.

అక్కట, వై. అవ్య. = అక. రూ - అకట. సంతాపార్థకము:

అక్కటకట, —వై.—

అకటకటా, —వై.—

అక్కటక్కట, —వై.—

అక్కటక్కటా, —వై.—

అక్కటపడు, వై. అ. క్రి. సంతాపపడు. పండితా. దీక్ష. ౩౫. పొరట: చూ, సంతాపించు.

అక్కటా, వై. అవ్య: చూ, రూ-అక్కట. వైష. ౨-౧౨౩.

అక్కటి, దే. విశ. 1. దయాళువు: చూ, సురతుఁడు. 1; 2. దయకలది: చూ, సురతుఁడు. 1-౨.

అక్కటిక, దే. వి. రూ-అక్కటికము. కనికరము. మార్క. ౨-౧౨౭; భాగ. ౪-౪౮౬: చూ, దయ. [౭-౯౦.

అక్కటికము, —వై.— భార. శల్య: ౨. ౩౨౧; నైష.

అక్కటికించు, దే. అ. క్రి. కరుణించు. శ్రీరంగ.మా ౧౦-౭౩: చూ, దయచేయు.

అక్కడ, దే. ద్ర. వి. (అ+కడ) (అక్కడనుండి, అక్కడకు మొ॥ వృత్తియందు ఔపవిభక్తిక మగును. ఉదా:— అక్కడివారు-అక్కడిది మొ॥ అని సూ. ని.) అంట, అచ్చట: చూ, తత్ర. 1; వి. ఏ. 2. అస్థలము: చూ, తత్ర 1; 3. ఆవలికొన, అవుల: చూ, రోదస్సు.

అక్కడక్కడ, వై. ద్ర. (అక్కడ+అక్కడ) కొంతదూరమున: అంతంత, అందంద, అచ్చటచ్చట, ఆడాడ.

అక్కమ్మ, వా. వి. పూజ్యార్థమందు అక్కనుపిలిచెడి పిలుపు. ఇట్లుఅక్కయ్య. మఱియు అత్తయ్య మొ॥.

అక్కర, అం: చూ, వృత్తము 1. (ఇది మధ్యాక్కర, మహాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కరఅని అయిదు విధములు. అక్కర శబ్దము సంజ్ఞావాచకముగాన సంస్కృత పదముతో సమసించినది. అప్ప ౪-౨౭౯); రూ-అక్కరము.

అక్కరము, వై. వి. 1. = అక్షరమ్. అచ్చరము: చూ, వర్ణము. 1; 2: చూ, రూ-అక్కర. కవిజనా. జాతి. ౨౬.

అక్కఱ, దే. వి. 1. అపేక్ష. ఆము. ౫-౫౩; భార. అర. ౭-౩౪౨: చూ, వాంఛ. 1; 2: చూ, అవశ్యకము. హరిశ్చం. ౧-౨౦౫; 3. పని: చూ, వ్యాపారము. 1; 4. సబబు, కారణము: చూ, హేతువు. 1; 5. కర్మము: చూ, వ్యాపారము. 1-౧; 6. వేగిరపాటు: చూ, సంభ్రమము. 1; 7. కొఱత, లోటు. నైష. ౧-౧౧౩: చూ, సొద్దు. 1; 8. ఇబ్బంది, కష్టము. హరి. పూ. ౪-౧౨౪; ద్వి. హరిశ్చ. ఉ-౨౦౮; ఘటికా. ౧-౧౦౩: చూ, శోకము. 1; 9. పూజ్యులయందలి అనురాగము. సారంగ. ౩-౨౬౪; సారంగ. ౩-౨౬౫; 10. చెలిమి: చిత్రభా. ౫-౧౮౨: చూ, స్నేహము 1; అం. 11: చూ, అక్కఱలు.

అక్కఱకత్తె, దే. విశ. 1. అక్కఱగలది (స్త్రీ): చూ, స్త్రీ. 1-౮౮; 2. అక్కఱతీర్చునది, తోడ్పడునది.

అక్కఱకాఁడు, దే.విశ.మేలుచేయువాఁడు: చూ,శుభంకరుఁడు.

అక్కఱగండఁడు, దే. విశ. అక్కఱఁదీర్చువాఁడు. ద్వి. హరిశ్చ. ఉ ౪౭౭: చూ, శ్రద్ధధానుఁడు.

అక్కఱగొను, ద్వ. అ. క్రి: చూ, వాంఛించు.

అక్కఱపడు, ద్వ. అ. క్రి. 1. ఆశపడు. భార. అర. ౭-౩౬౬; దశ ౪-౬: చూ, వాంఛించు; 2. కష్టపడు. హరి. ఉ. ౮-౭: చూ, శోకించు.

అక్కఱపాటు, ద్వ. వి. 1. వేగిరపాటు: చూ, సంభ్రమము. 1. 2. లోపము, కొఱత. వేంక. పం. ౧-౪౧౫: చూ, సొద్దు. 1; 3. ఇబ్బంది, కష్టము: చూ, శోకము. 1. భాస్కరశతకము.

అక్కలకర(ఱ)(ఱ్ఱ). వై. వి. = అక్రారా. జ్వరదోషాదులను పోఁగొట్టునట్టిమూలిక*.

అక్కలవాడ, వై. వి. వంటలక్కలుండు వీథి. క్రీడా. ౧౧౪: చూ, మార్గము. 1-౧.

అక్కలి, దే. వి. అల. కాశీ. ౧-౧౩౩: చూ, వీచి. 1.

అక్కలు, దే. అ. క్రి. ఉపశమించు, ముడుఁగు. క్రీడా. ౪౬: చూ, స్రుక్కు. (9).

అక్కళించు, దే. స. క్రి. పొట్ట బొమ్మ లోనగునవి ముడుఁగఁ జేయు, అడఁగు మను. ౧. ౫౯: చూ, స్రుక్కు. (4).

అక్కవాడ, వై. వి: చూ, రూ- అక్కలవాడ. ఆము. ౬-౬౯; క్రీడా ౧౮౯.

అక్కసము, దే. వి. 1: చూ, దయ. అం, భాషా. ౧-౧౩౧; 2: చూ, సంతాపము; 3. కోపము. అచ్చ. రా. యు. కాం. ౨౦౦-౨౦౧: చూ, వృజినము.

అక్కసి, దే. విశ. కోపి: చూ, రోషణుఁడు.

అక్కసు,* దే. విశ. రూ-అక్కస్సు. కోకము: చూ, అక్కసము. ౩.

అక్కస్సు, — వై. —

అక్కసుకాఁడు: చూ, రూ-అక్కసి.

అక్కి, దే. వి. ఒకానొక చర్మవ్యాధి: చూ, రోగము. 1.

అక్కిబిక్కిదండ, 1. ఒకానొక బాలక్రీడ. హంస. ౩-౧౪౬: చూ, బాలక్రీడ.

అక్కిలి, దే. వి. కలఁత (రూ-అంకిలి అని కొందఱు) మార్క. ౮. అ. ౬౬: చూ, సంతాపము.

అకిజలిపడు, ద్వ. అ. క్రి. 1. కలఁతపడు: బస. పు.

౨-౯౬౧: చూ, సంక్షోభించు; 2. పోవు, చెడు. పండితా. పు. రా. ౧౦౧ పోరట: చూ, సమయు 3.

అక్కు, వై. వి. = అంకః. 1. రొమ్ము. అచ్చ. బాల, కాం. ౬౨: చూ, వక్షము; 2. గుండె. దశా. ౨. ౩౮; బస. పు. ౨-౧౮౧: చూ, హృదయము.

అక్కుగొల్లు, ద్వి. వి. హృదయశల్యము. మార్క. ౨-౨౭౯: చూ, శల్యము. 1-౧౨.

అక్కుపక్షి, వా. వి. బలహీనుఁడు: చూ, స్తబ్ధుఁడు.

అక్కుముల్లు, ద్వి. వి: చూ, అక్కుగొల్లు. రంగ-రా. ఉ. ౧౦౨ పుట-౯పంక్తి.

అక్కులు, (వ్యాకరణ) అం:- అ, ఇ, ఉ, ఋ, ఌ. (5).

అక్కుళ్ళు, దే. వి. బ. ఒకరకము ధాన్యము: చూ, ధాన్యము. (సన్నక్కుళ్ళు, తూర్పుఅక్కుళ్ళు లోనగునవి ఈజాతిలోనివి.)

అక్తము, సం.విణ.1. చేరినవి: చూ, స్వీకృతము. 2; 2.పోయినది: చూ, విమోచనము. 2; 3. స్పష్టమయినది: చూ, సమాలంభము. 1-౧౫; 5. వన్నెపెట్టఁబడినది; 6.వ్యాప్తము; 7. గతము; 8. పరిమితము. (సూ.ని.)

అక్త్రము, సం. వి. అ. న. కవచము: చూ, వారవారణము.

అక్రమము, సం. వి. అ. పు. 1. క్రమము తప్పుట: చూ, ఆగ్రహము. 4; 2. గమనములేమి; 3. మర్యాదలేమి; విణ. 4. క్రమముతప్పినది; 5. పాదములు లేనిది; వా. 6. అబద్ధము: చూ, వితథము; అం. 7. క్రమభ్రష్టము: చూ, వాక్యదోషములు.

అక్రమాతిశయోక్తి, అం: చూ, అలంకారము. 3.

అక్రాంత, సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు*: చూ, స్పృశి.

అక్రియ, సం. వి. ఆ. స్త్రీ. 1. పనిలేకుండుట; 2. ముఖ్యకృత్యములు మానుట; అం. 3: చూ, వాక్యదోషములు.

అక్రియుఁడు, సం. విణ. 1. పనిచేయనివాఁడు: చూ, సోమరి; 2. ముఖ్యకృత్యములు లేనివాఁడు; 3. విహితాచారములు అనుష్ఠింపనివాఁడు.

అక్రూరుఁడు, సం. వి. అ. పు. 1. విష్ణునిబంధువగు ఒకానొక యాదవుఁడు; విణ. 2: చూ, సౌమ్యుఁడు; అం. 3. చూ, భక్తులు.

అక్రోటు, వా. వి: చూ, రూ-ఆకరోటు*.

అక్రోధనము, అం: చూ, సాత్త్వికగుణములు.

అక్రోధము, అం: చూ, మానసిక పూజాకుసుమములు.

అక్రోధనుఁడు, సం. వి. అ. పు 1. అయుతాయువు పుత్త్రుఁడగు నొకరాజు; విణ. 2: చూ, నిష్కోపి. భార. ఆది. 3, ఆ. ౧౪౬.

అక్లిక, సం. వి. ఆ. స్త్రీ. నీలిమొక్క*: చూ, శ్రీఫలి. 2.

అక్లిన్నవర్త్మము, సం. వి. న్. న. ఒకానొక కంటి తెవులు: చూ, లోచనము. 1-౧౩.

అక్లిష్టము, సం. వి. అ. న. 1. కుదువయుంచి యొరువు తెచ్చుకొనిన వస్తువు: చూ, వినిమయము; విణ. 2. అలయిక చెందనిది; 3. శిథిలముకానిది; 4. క్రొత్తది: చూ, నూతనము; 5. క్లిష్టముకానిది: చూ, సుబోధము.

అక్లిష్టకర్ముఁడు, సం. వి. న్. పు: చూ, సదాచారుఁడు.

అక్షకము, సం. వి. అ. పు. నెము*: చూ, స్యందనము. 3.

అక్షకూటము, సం. వి. అ. పు. కంటిపాప: చూ, లోచనము 1-౧౧.

అక్షగ్లహము, సం. వి. అ. పు. జూదము: వ్యవహారము. 4.

అక్షచరణుఁడు, సం. వి. అ. పు: చూ, బుద్ధుఁడు. 1.

అక్షజము, సం. వి. అ. న. 1. నృత్యము, వ్యాకార్థము నభినయించుట: చూ, వ్యంజకము. 1; 2. ప్రత్యక్షజ్ఞానము: చూ, హృల్లేఖము. 1-౧౨; 3. వ[illegible] ముఖము: చూ, బాణము. 1-౭౨. 4. వజ్రము: చూ, రత్నములు. 3.

అక్షజప్రభ, సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు చూ, విద్యుత్తు. 1.

అక్షణము, సం. విణ. 1. 1. కాల[illegible]ము కానిది; 2. తెఱపి లేనిది.

అక్షత, సం. వి. ఆ. స్త్రీ. కర్కటకశృంగి*: చూ, విష. 1-౮.

అక్షతత్త్వము, సం. వి. అ. న. ద్యూతకళ: చూ, వ్యవహారము. '-౨౦.

అక్షతము, సం. వి. అ. న. 1. కొజ్జా: చూ, సౌవిదల్లుఁడు. (అక్షతుఁడు-అక్షితుఁడు అని కొందఱు); పు. 2. బ. తండులము: చూ, బియ్యము; 3. యవధాన్యము: చూ, ధాన్యము 1-౩౫; వా. 4. పసుపుకలిపిన పూజ అక్షతలు: చూ, నేసఁబ్రాలు 1-౨; న. బ. 5. వడ్లు: చూ, ధాన్యము. [illegible]. క్షయములేమి: చూ, శాశ్వతము. 1; 7. శుభస్థితి: [illegible], శుభాగతము; విణ. 8. నొప్పింపఁబడనిది; 9. గాయపడనిది; 10. విఱువఁబడనిది; 11. పగులఁగొట్టఁబడనిది; 12. దంపఁబడనిది.

అక్షతయోని, సం. వి. ఇ. స్త్రీ. సంభోగ మెఱుఁగని స్త్రీ: చూ, స్త్రీ. 1-౨౫౬.

అక్షతలు, సం. వి. అ. పు. బ. రూ - అక్షతములు. 1. తలఁబ్రాలు. వసు. ౧-౧౫౨. మనుచ. ౫-౯౫: చూ, బియ్యము. 1-౧; 2. తండులీయము: చూ, ధాన్యము. 1. న. బ. 3. పేలాలు: చూ, లాజలు; 4. యవలు: చూ, ధాన్యము. 1-౩౫; 5. మూఁడుమూర్లు దున్నిననేల: చూ, భూమి. 1-౨; 6. హింసచేయకుండుట: చూ, అహింస; ఏ. 7. సమ్మెటతోఁగొట్టినను బ్రద్దలుకాని వజ్రగుణము; అం. 8: చూ, అర్ఘ్యములు; 9: చూ, అర్చనలు; అ. పు. బ. 10: చూ, అక్షతము. 4.

అక్షతుఁడు, సం. వి. అ. పు. 1. ముక్కంటి: చూ, శివుఁడు. 1; 2. నపుంసకుఁడు: చూ, సౌవిదల్లుఁడు.

అక్షదర్శకుఁడు, సం. వి. అ. పు. 1. న్యాయాధికారి: చూ, స్వామి. ౩-౧; 2. జూదమునందలి న్యాయాన్యాయములను పరిష్కరించువాఁడు: చూ, స్వామి. ౩-౪.

అక్షదృక్కు, సం. విణ. —పై.—

అక్షదేవి, సం. వి. న్. పు. జూదరి: చూ, హారకుఁడు. 2.

అక్షద్యువు, సం. వి. ఊ. పు. —పై.—

అక్షద్యూతము, సం. వి. అ. న. జూదము: చూ, వ్యవహారము. 4.

అక్షద్యూతికము, సం. వి. అ. న. జూదమునందలి జగడము: చూ, యుద్ధము. 1-౨.

అక్షధుర్గుఁడు, సం. విణ. జూదమున ఓడినవాఁడు: చూ, వ్యవహారము. 4-౨౧.

అక్షధరము, సం. వి. అ. పు. 1. శాఖోటమను ముండ్లచెట్టు:

చూ, శాఖోటః; 2. చక్రము: చూ, చక్రము. 10.

అక్షధరుఁడు, సం. వి. అ. పు: 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; విణ. 2. అక్షముధరించువాఁడు.

అక్షధూర్తలము, } సం. వి. అ. పు. ఎద్దు: చూ, వృషభము.
అక్షధూర్తిలము, } 1-(బండిలాగుఎద్దు).

అక్షధూర్తుఁడు, సం. వి. అ. పు: చూ, అక్షదేవి.

అక్షపటలము, సం. వి. అ. పు. 1. న్యాయసభ: చూ, సభ. 2; 2. వ్యవహార పత్రములుంచుకొను పెట్టె: చూ, సందుకా.

అక్షపటలుఁడు. సం. వి. అ. పు. న్యాయాధికారి: చూ, స్వామి. 3.

అక్షపాదుఁడు, సం. వి. అ. పు. (పాదమునకన్నుఁగలవాఁడు) గౌతముఁడు: చూ, సన్న్యాసి. 1-౫; (ఇతఁడు న్యాయశాస్త్ర కర్త.)

అక్షపీడ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రియములకుఁ గలుగు బాధ: చూ, హాని. 2; 2: చూ, యవతిక్త*.

అక్షఫలము, సం. వి. అ. పు. గర్భండము: చూ, పుత్రజీవి.

అక్షమ, సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-అక్షమము. ఈర్ష్య: చూ, హంస. 7; 2. ఓర్పులేమి: అక్షమము; విణ. 3: చూ, రూ-అక్షమము. 3; 4: చూ, రూ-అక్షమము. 4.

అక్షమదము, సం. వి. అ. పు. 1. ద్యూతవ్యసనము: చూ, వ్యసనము. 4-౨౨; 2. ఇంద్రియముల మత్తత.

అక్షమము, సం. వి. 1: చూ, రూ-అక్షమ. 1; 2: చూ, రూ-అక్షమ 2; విణ. 3. శక్తిలేనిది: చూ, ఈచ. 3; 4. ఓర్పులేనిది: చూ, అకను. 4.

అక్షమాల, సం. వి. ఆ. స్త్రీ. 1. అరుంధతి, వశిష్ఠునిభార్య (శ్రీరాముదులకు ఉపనయనమునకు తలయంటినమహాదేవి): చూ, రిక్క. 1-౪; 2. అకారాది క్షకారాంతమైన మాల. ఈనిఘంటుకర్త గత జన్మములో కావేరీతీరమందు అక్షర మాల జపించుటచే యీజన్మములో నిఘంటుకర్తయయ్యెనని ఒకజ్యోతిష్కుఁడు వ్రాసియుండెను) (రూ-అక్షరమాల; 3. స్ఫటికాదులు గ్రుచ్చినమాల: చూ, మాల 1; 4.రుద్రాక్ష మాల: చూ, హవణిక. 2-(౧౪); 5. ఇంద్రియముల సమూహము: చూ, ఇంద్రియములు; అం. 6: చూ, హస్త రేఖలు.

అక్షమీలనకేళి, సం. వి. ఇ. పు. స్త్రీ. ఒకరకము బాలికల ఆట: చూ, బాలక్రీడ.

అక్షము, సం. వి. అ. పు. 1. తాండ్రః: చూ, విభీతకము; 2.జూదమాడెడు అడ్డసాళ్లు: చూ,వ్యవహారము. 4; 3.బండి: చూ, శకటము. 1-౧౫; 4. చాయమేకు: చూ, బండికన్ను; 5. రుద్రాక్షపూస: చూ, రుద్రాక్షము. 1; 6. ఇంద్రాక్షపూస: చూ, ఇంద్రాక్షము. 1; 7. పదునాలుగు మాషములయెత్తు: చూ, కర్షము. 1; 8. ధనాములనిమిత్తమైన కలహము: చూ, యుద్ధము: 1-౩; 9. ఒకరకము తాడిః: చూ, తాడు. 2; 10. తాడిచెట్టులోనగువాని యందు పుట్టెడు మురుత పీడని లేత యాకు మొలక, కోటాకు: చూ, మొవ్వు; 11: చూ, వెలఁగుబంటి; 12. కత్తులసాన: చూ, సాన. 2; 13. వ్యాపించుట: చూ, వ్యాప్తి 1; 14. ఆత్మ: చూ, హంసుఁడు. 15. కేశము: చూ, వెండ్రుక. 1; 16. కణఁత: చూ, పార్శ్వము. 2; 17. పురుషుని రేతస్సు: చూ, రేతస్సు. 1; 18. సౌవర్చలవణము: చూ,లవణము. 1; 19. తుత్తగు: చూ, రసాంజనము. 1-౧; 20: చూ, ఇరుసు; 21. జ్యోతిశ్చక్రముయొక్క అక్షదండము; 22. తేరు: చూ, శకటము. 1; 23. బండిచక్రము: చూ, చక్రము. 10; 24. ఊఁక: చూ, తుషము, 1: 25. తులా దండము: చూ, తునినోల; 26. దక్షిణోత్తరధ్రువప్రదే శము; 27. పాము: చూ, సర్పము. 1; 28. జూదము: చూ, వ్యవహారము. 4; 29. న్యాయము: చూ, సత్యము.1; 30. కణఁత క్రిందిభాగము.

అక్షముఁడు. సం. విణ. ఓరిమిలేనివాఁడు: చూ, ప్రాజె.

అక్షయ, సం. వి. ఆ. స్త్రీ. 1. అక్షయపుణ్యమును గలిగించు నొకతిథి; అం. 2: చూ, సంవత్సరములు.

అక్షతృతీయ, సం. వి. ఆ. స్త్రీ. వైశాఖశుద్ధతదియ. (అక్ష తృతియ్య.)

అక్షయపాత్రము, సం. వి. అ. న. బిచ్చగానిగిన్నె: చూ, పాత్రము. ౬-౫౬.

అక్షయము, సం. వి. అ. పు. 1. పరమాత్మ: చూ,హంసుఁడు; విణ; 2. స్థిరమైనది: చూ, శాశ్వతము; 3. ఇల్లులేనిది: చూ, వదనము. 1-౭౩.

అక్షయలోకము, సం. వి. అ. పు. నాకము: చూ, స్వర్గము.

అక్షయ్యనవమి, సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజశుద్ధ నవమి (సూ. ని.)

అక్షయ్యము, సం. విణ. క్షయింపఁజేయుటకు శక్యముగానిది.

అక్షయ్యోదకము. సం. వి. అ. న. శ్రాద్ధమున పిండదానము నకుఁ బిదపతేనెయును నువ్వులును గలిపి యిచ్చెడి జలము.

అక్షరచణుఁడు, సం. వి: చూ, వ్రాతకాఁడు.

అక్షరచంచువు, సం. విణ. —పై.—

అక్షరఛందస్సు, సం. వి. స్. న. అక్షరగణములచే నేర్పడు వృత్తములఁ గూర్చి చెప్పెడి ఛందస్సు. (సూ. ని.)

అక్షరచ్యుతకము, సం. వి. అ. న. పదములలో నొకయక్ష రము తీసివేయుటచే మిగిలినదానికి మఱియొక యర్థము స్ఫురింపఁ జేయు చిత్ర కవిత్వము. (సూ. ని.)(కట్టుపద్య ములయువాడుక.)

అక్షరజనని, సం. వి. ఈ. స్త్రీ. (అక్షసములను పుట్టించునది) లేఖని (తాటాకుపై వ్రాయునది = గంటము; కాగితముపై వ్రాయునది. = కలము; బొమ్మపై వ్రాయునది = కుంచె మొ॥) (సూ. ని.)

అక్షరజీవకుఁడు, సం. విణ. రూ-అక్షరజీవి-అక్షరజీవికుఁడు. వ్రాఁత వృత్తిచే బ్రతుకువాఁడు.

అక్షరజీవి, } —పై.—
అక్షరజీవికుఁడు, }

అక్షరజ్ఞుఁడు, సం. వి. అ. పు. పండితుఁడు: చూ, సుధి. 1.

అక్షరతూలిక, సం. వి. ఆ. స్త్రీ. అక్షరములు వ్రాయుకుంచె: చూ, లేఖిని. 1.

అక్షరన్యాసము, సం. వి. అ. పు. 1. లిపి: చూ, వ్రాఁత. 1; 2. వ్రాయుట; 3. వ్రాయఁబడిన పత్రిక; 4. వర్ణసము దాయము; 5.తంత్రశాస్త్రప్రకారము అక్షరము లుచ్చరించుచు

(సమాహార ద్వంద్వము) (సూ.ని.)

అక్షియోనికుఁడు, సం. వి. అ. పు: చూ, వేలుపుఱేఁడు.

అక్షివికూణితము, సం. వి. అ. న. కడగంటి చూపు: చూ, వీక్షణము. 1-౪.

అక్షీకము, సం. వి. అ. పు: చూ, రూ-అక్షికము. *

అక్షీణము, సం. విణ: చూ, శాశ్వతము.

అక్షీబము, సం. వి. అ. పు: చూ, రూ-అక్షిబము. 1, 2, 3; విణ. 4. మత్తిల్లనిది, క్రొవ్వనిది: రూ-అక్షీవము.

అక్షీయమాణము, సం. విణ. తఱుఁగనిది.

అక్షీవము, సం. వి. అ. పు. విణ: చూ. రూ-అక్షీబము. 1, 2, 3, 4.

అక్షుఁడు, సం. వి. అ. పు. 1. అక్షయకుమారుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1. (రావణుని కొడుకులలో నొకఁడు) (సూ. ని.); 2. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు; 3. ఆత్మ: చూ, హంసుఁడు. 1; 4. ఆత్మజ్ఞాని: చూ, సుధి. 1.

అక్షుణ్ణము, సం. విణ. వాడుకొనఁ బడనిది.

అక్షులు, అం: కంచికామాక్షి, కాశీవిశాలాక్షి, మధురమీనాక్షి.(3)

అక్షేత్రము, సం. వి. అ. న. 1. పండని పొలము, ఉషర క్షేత్రము: చూ, భూమి. 1-౩; 2. అనుపపన్నక్షేత్రము; విణ. 3. చేనులేనిది. (సస్యము)

అక్షోటము, సం. వి. అ. పు. రూ-అక్షోడము. కొండగోఁగు*: చూ, వరగోఁగు. 1-౨.

అక్షోడము, —పై.—

అక్షోభము, సం. వి. అ. పు. 1. ఏనుఁగును కట్టు కంబము, ఆలానము: చూ, స్తంభము. 1; 2. కలఁతలేమి.

అక్షోహిణి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ - అక్షౌహిణి. భార. ఉ. ౧-౨౩౬.

అక్షౌహిణి,—పై.—(౨౧౮౭౦ రథములు, అన్నియేనుఁగులు, ౬౫౬౧౦ అశ్వములు, ౧౦౯౩౫౦ పదాతులును గలిగిన సేన.)

అక్ష్యము, సం. వి. అ. న: చూ, అక్షర లవణము. 1.

అఖండగౌతమి, సం. వి. ఈ. స్త్రీ. రాజమహేంద్రవరము మీఁదుగా ప్రవహించుచున్న గోదావరీనదికి పేరు: చూ, గౌతమి. 1. (రాజమహేంద్రవరమున వంతెన, ధవళేశ్వరమున అనకట్ట యీనదిపైన కలవు.)

అఖండద్వాదశి, సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష శుద్ధ ద్వాదశి.

అఖండము, సం. విణ. = ఏకాండము. 1. అంతయు: చూ, సర్వము; 2. ఖండముకానిది: అఖండితము, అవికలము.

అఖండితము, సం. విణ: చూ, అఖండము. 2.

అఖండుకము, సం. విణ. చెన్నంగి (తొబ్బరి) చెట్టు: చూ, స్కంధఫలము.

అఖట్టము, సం. వి. అ. పు. మోరట*: చూ, పన్నకద్రువు.

అఖర్వము, సం. విణ. 1. పొట్టిది గానిది; 2. అధికము: చూ, హేరాళము. 1.

అఖాతము, సం. వి. అ. పు. న. = అగడిత. 1. (మనుష్యులచేఁ ద్రవ్వఁబడనికోనేఱు మొ॥ నీరుచెంకి) పరిఖ: చూ, స్వర్ణది; 2. కోటచుట్టును త్రవ్వఁబడిన జలాధారము, పరిఖ: చూ, ప్రాదిని.. 2-౧౪; విణ. 3. త్రవ్వఁబడనిది.

అఖిలము, సం. వి. అ. న. 1. దూఱు: చూ, సెగ్గి పు; విణ. 2. అంతయు: చూ, సర్వము; 3. దున్నఁబడినది (నేల).

అఖ్యాతి, సం. వి. ఇ. స్త్రీ. అపఖ్యాతి: చూ, నది. 3.

అగంద్రపాకు, ద్వ. వి: చూ, అగ్గివేంద్రపాకు*.

అగచరము, సం. వి. అ. పు. చెట్టుద్రిమ్మరి, కోఁతి: చూ, వానరము.

అగచాటులు, దే. వి. బ. రూ-అగచాట్లు. (అగ్గము + చాటులు) ఆపద. పార్వ. ౪-౧౫౪; ఉ, రా.-౬-౩౯౩: చూ, విపత్తు.

అగచాట్లపోతు, ద్వ. విణ. రూ-అగచాట్లమారి - అగసాట్లమారి. 1. ఆపదలఁబొందుట యేస్వభావముగాఁగలవాఁడు. హంస. ౩.౧౧౩: చూ, కడగండ్లమారి; 2. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2. ౧.

అగచాట్లమారి,<br>అగసాట్లమారి, } —పై.—

అగజము, సం.వి. అ. న. 1: చూ, సిలాజతు; విణ. 2. పర్వతము నుండి పుట్టినది; చెట్టునుండి పుట్టినది.

అగజాత, సం. వి. ఆ. స్త్రీ 1. గౌరి: చూ, పార్వతి. 1; 2.వసురాజుభార్య, గిరిక (కోలాహల పర్వతమునకును శుక్తిమతి నదికినిఁ బుట్టిన ఆఁడుది): చూ, స్త్రీ. 1-౧౫౫.

అగడత, వై. వి. = అఖాతమ్. రూ-అగడిత-అగడ్త. 1. పరిఖ. రా. వి. ౫-౩౨; 2. బురదగుంట: చూ, సరస్సు. 1-౧౪-౯. (సూరపచాటువు).

అగడాడు, దే. అ. క్రి. ప్రేలు: చూ, వదరు. 5.

అగడారు, దే. వి. నింద: చూ, నెగ్గింపు.

అగడిత, వై. వి. = అఖాతమ్: అగడత. 1-2 రం, రా-యు. ౨౮౧. పోరట. ౩౧ పంక్తి.

అగడు, దే. వి. 1. రూ-అవడు-అవనడి-అవసరి-అగడారు-అవదూఱు, నింద; వసు. ౧-౧౦౩: చూ, నెగ్గింపు; విణ. 2. నింద్యము: చూ, నెగ్గింపు. 1-౫; 3. బెదరినది, చెదరినది. వసు. ౨. ౨౨; ఉ, హరిశ్చ. 3—౬౩.

అగడుఁగాకి, దే. విణ: చూ, నిందితుఁడు. హర. ౫-౧౦.

అగడుగాఁడు, దే. విణ. —పై.— హర. ౫-౧౦.

అగడుచేయు, ద్వ. స. క్రి. రూ-అగడుసేయు. 1. నిందించు. నై. ౩-౭౮: చూ, నెగ్గించు: 2: చూ, అల్లరిచేయు. శక. ౪-౪౬; విజ. 3-౨౮; 3. చిన్నపుచ్చు. ఉ-రా. ౬-౧౦౪. (చీఁకటి వర్ణనము); పి. శకుం. ౨-౧౮౨: చూ, తక్కువపఱచు.

అగడుపడు, ద్వ. అ. క్రి. రూ అగడ్పడు. 1. నిందపడు. వి. ప్ర. 3-౧౩: చూ, వీటఁబోవు; 2. కలఁతనొందు. వసు. ౬-౬౨; అచ్చ. రా. యు. కాం. ౧౬౨: చూ, సంక్షోభించు; 3. తొట్రుపడు: చూ, సంభ్రమించు. [౪-౨౨౩.

అగడుపఱుచు, ద్వ. స. క్రి: చూ, అగడుచేయు. ఉ. రా.

అగడుసేయు, ద్వ. స. క్రి. —పై.—

అగడ్త, వై. వి. = చూ, రూ-అగడత.

అగణితము, సం. విణ: చూ, అసంఖ్యేయము.

అగణ్యము, సం. విణ. లెక్కింపశక్యముగానిది: చూ, అమితము; 2. ఎన్నఁదగినది.

అగతి, సం. విశ. ఇ. 1: = చూ, అగతికము 1; వి. ఇ. స్త్రీ. 2. గతిలేమి (ఉపాయములేమి, దిక్కులేమి, ఆధారము లేమి, గమనములేమి.) (సూ. ని.)

అగతికము, సం. విశ. 1. గతిలేనిది (దిక్కుమాలినది, ఆధారములేనిది): చూ, అగతి. 1; 2. ఉపాయాంతరములేని యపుడు చేయఁదగినది. యజ్ఞ. ౧. ౩౪౬; 3. గమనము లేనిది.

అగత్యము, వా. సం. విశ. 1. ఆవశ్యకము, అనివార్యము, తప్పనిది: చూ, భృశము; వి. 2. ఆవశ్యకత: చూ, భృశము.

అగదంకారుఁడు, సం. వి. అ. పు: చూ, వైద్యుఁడు.

అగదము, సం. వి. అ. పు. 1: చూ, మందు. 1; 2. ఆరోగ్యము, అనామయము, కల్యత్వము; 3. యజుర్వేదమున విషాదుల విరుగుడును దెలుపు భాగము; విశ. 4. తెవులు లేనిది; 5. భాషింపనిది. (సూ. ని.)

అగప, వా. వి. 1. రూ-అపక. చుక్కాను (అనికొందఱు): చూ, పీలి. 2; 2. రూ-అపక-అబక. కొయ్యకు టెంకాయ చిప్పను గ్రుచ్చి గరిటెవలెఁ జేసినది: చూ, డోకి; 3. పెద్దతెడ్డు, కొయ్యగరిటె: చూ, రూ-అబక. ఆము. ౧-౮౦; ఆం, భా. ౨-౨౪౪; 4. ఓడలముటికిని గోఁకి శుభ్రముచేయు కొయ్య. గుద్దలి. ఆం, భా. ౧. ౧౫౭.

అగపడు, ద్వ. అ. క్రి. (అగ్గము+పడు) రూ-అగ్గపడు. 1. కనఁబడు. భాగ. ౧౦. పూ. ౧౨౯౯; భీమ. ౩, ఆ. ౩౦: చూ, ప్రత్యక్షమగు; 2: చూ, లోఁబడు. భార. శాం. ౩-౭౩; భార. అశ్వ. ౧-౨౧; 3. దొరకు. భార. శాం. ౪-౩౮౨. భార. ద్రో. ౧-౨౩౭: చూ, సంభవించు; 1. తెలియు. భార. విరా, ౨-౭౦; ద్వి. తి. సా. ౨-౨౭ పా; (తిమ్మకవిద్విపదసారంగధర చరిత్రము): చూ, విదితమగు.

అగపాటు, ద్వ. వి. రూ-అగబాటు-అగ్లపాటు-నగపాటు-నటబాటు. 1. ఆధీన్యము, లొంగుట, చిక్కుట. భార. శల్య. ౨-౨౭౩; భా. రా. అర. ౨-౫౮: స్వాధీనము. 1; 2. ఎఱుకవడుట, తెలియుట. భార. విరా. ౧-౧౫౮. ద్విపదబాణాలశంభుదాసుని సారంగధరచరిత్ర. ౨-౯౨ పొా. పంక్తి: చూ, స్పష్టము. 1.

అగబాటు, ద్వ. వి. 1: చూ, రూ-అగపాటు. 1, 2; 3. కష్టము: చూ, శోకము (నగబాట్లు అగబాట్లయ్యెనని కొందఱు; నవ్వుతాలుపువ్వుతాలయ్యెనన్నట్లు).

అగమము, సం. వి. అ పు. 1. కొండ: చూ, పర్వతము. 1; 2. పాము: చూ, సర్పము. 1; 3. చెట్టు: చూ, వృక్షము.1. వసు. ౩-౧౩౪.

అగము, సం. వి. అ. పు. —పై—; 4. విషవిశేషము: చూ, వసనాభి; 5: చూ, ఉత్తకము. 1; 6. సంచరించుటకు అశక్యమైన పర్వత శిఖరముయొక్క క్రిందిచోటు, తటము: చూ, పర్వతము. 1-౧౧.

అగమ్యము, సం. విశ. 1. నడువఁదగనిది, పోవఁదగనిది; 2. పొందఁదగనిది, చేరరానిది (పర్యతాది); 3. సంగమింపఁజూడనిది (పరకళత్రాది. ఉదా:- అగమ్యాగమన దోషము); 4. తెలియరానిది, గ్రహింపరానిది.

అగరి, సం. వి. ఈ స్త్రీ. 1. విషమునుహరించు వస్తువు; 2. దేవతాళము.* (మూషిక విషమును హరించును): చూ, విషనాశని.

అగరు, సం. వి. అ. న. = అగలు-అగులు. రూ-అగరువు-అగురు-అగురువు. చందన విశేషము, అగరు చెట్టు కఱ్ఱ నుండి తీసిన పరిమళద్రవ్యము. యయా. ౧-౪౭; ఆం, భా. ౨-౧౬౨: చూ, రాజార్హము. 1; అం. 2: చూ, గంధములు; దే. వి. (1) తీక్ష్ణము: చూ. సంజ్వరము. 1.

అగరుచెక్క, ద్వ. వి. చందనపుచెక్క: చూ,అనామయము. 2.

అగరుమ్రాను, ద్వ. వి. గంధము*: చూ, సుగంధము. 1.

అగరువు, సం. వి. ఉ. న. = అగలు 1. చందనవిశేషము: చూ, రాజార్హము. 1; పుం. 2. ఇరుగుడు*: చూ, శింశుప.

అగర్భము, అం: చూ, ప్రాణాయామములు.

అగలించు, దే. స. క్రి. రూ-అగలించు - ఆగలు-అగులు-అగల్చు, చిటులు: చూ, స్ఫోటించు.

అగళించు, —పై.—

అగలు, వై. వి. = అగరువు. 1: చూ, అగరు. 1; భార. ఆను. ౪-౧౨; 2. బొట్టుపెట్టుకొనుటకై నూకలు మున్నగునవి మాడ్చి పరిమళ ద్రవ్యములను జేర్చిచేయు పదార్థము: చూ, రూ-అగులు; దే. స. క్రి. 2. రూ-అగలుచు-అగల్చు. 1. తగులు, ఛేదిల్లు. భార. ద్రో. ౧-౩౫౩; మనుచ. ౫-౩౦; చంద్రా. ౪-౯౯: చూ, స్ఫోటించు; 3. క్షీణమగు, చెడు. భా-రా-యు. ౧౩౮౭; పాండు. ౪-౨౯౭: చూ, సమయు. 3; 4. దుఃఖించు. ద్వి.హరిశ్చ. ఉ.౨-౩౭౪: చూ, శోకించు. 1-3; 5. చీలు: చూ, వేఱుపడు.

అగలుచుట, దే. వి. పెల్లగించుట: చూ, ఉత్పాదనము.

అగలుసత్తు, వై. వి. చందనవిశేషము: చూ, రాజార్హము. 1.

అగలుసొంటి, వై. వి. చిఱుబొద్ది*: చూ, విద్ధకర్ణి.

అగలుచు (ల్చు) దే. స. క్రి: చూ, రూ-అగలు. 2, 3, 4, 5. (పగులఁగొట్టుటకు:-భా,రా. బాల-౪౧౪; ఉ. రా. ౪-౩౦౨; పెల్లగించుటకు:- భార, స్త్రీ. ౨-౯.

అగలుబగలు, వా. వి. ఇరుతట్టులు. రూ-అగులుబగులు.

అగవాళ్ళు, దే. వి. బ. (అగ్గము+వాఱులు) తేలికయైన ఓరట్ల చెప్పులు; చూ, సమ్మాళిగలు. 1-౧.

అగవు, దే. వి. 1. పని: చూ, వ్యాపారము. 1; వా. 2: చూ, తగవు. 4.

అగవుతగవులు, దే. వి. బ. శుభకార్యమందలి బహుమానములు, ఆఁడుబిడ్డ మున్నగువారికి ఇచ్చెడి బహుమానాదులు. కువల. ౩-౬౫; దశా. ౯-౭౩: చూ, రూ-అగువు తగువులు.

అగసాట్లమారి, దే. విశ: చూ, రూ-అగవాట్లమారి.

అగసాలి, ద్వ. వి. (అగ్గము+సాలె) రూ-అగసాలె - కమసాల-కమసాలె కంసాల - కంసాలి-కంసాలె. బంగారుపని వానిదుకాణము. బస. ౩-౪-౬౭; వైజ. ౪-౭౨. ఆం, భా. ౨-౨౮౪: చూ, స్వర్ణకారుఁడు.

అగసాలె, —పై.—ఆము. ౪-౭౫.

అగసి, వై. వి. = అతసి-అగస్తి. రూ - అగసియ - అగసె: చూ, శుకనాసము. 1.*.

**అగస్తి**, సం. వి. ఇ. పు. 1. అగస్త్యుఁడను ముని: చూ, సన్న్యాసి (౭); 2. = అగసి-అగిసియ-అగిసె - అవిసె.*: చూ, శుకనాసము. 1; 3. అగస్త్యుఁడను పేరు గల ఒకా నొక నక్షత్రము: చూ, రిక్క. 1-౧౨; స్త్రీ: 4. అగస్త్యుని వంశమునఁ బుట్టిన ఆఁడుది. (సూ. ని.)

అగస్త్యకము, అగస్త్యము, } సం. వి. అ. పు. = : చూ, అగసి*.

అగస్త్యభ్రాత, వా. వి. 1. అగస్త్యుని తోడఁ బుట్టినవాఁడు; 2. పనికిరాని వాఁడు: చూ, వ్రాజె.

అగస్త్యమాత్రము, సం. వి. అ. న. కడలి: చూ, సముద్రము.

అగస్త్యవ్యాకరణము, అం: చూ, వ్యాకరణములు.

అగస్త్యుఁడు, సం. వి. అ. పు. 1: చూ, అగస్తి. 1; 2: చూ, శివ్వుఁడు. 1; అం. 3. సప్తఋషులు: చూ, సప్తకము. ౧-౩౩; 4. ఒకానొకఋషి (ప్రవరకర్తలలో నొకఁడు): చూ, గోత్రము. 13.

అగస్త్యోదయము, సం. వి. అ. పు. 1. అగస్త్య నక్షత్రయొక్క ఉదయము. (ఇది భాద్రపద మాసాంతమున నగును. అప్పుడు జలములు తేఱును.)

అగాదు, దే. వి. 1. తుపాకి పిరంగి పిడుగులోనగువాని ధ్వని: చూ, స్వరము. 2; 2. తుపాకి పిరంగిలోనగు వానియందు నిప్పుఁదగిలించుట. (నిప్పుతగులఁ గానే ధ్వని వెడలును) రసిక. ౪-౯౫.

అగాధము, సం. వి. అ. పు. న. 1. పెద్ద. బొత్త: చూ, రంధ్రము. 1-౧౨; 2. లోఁతైన బిలము: చూ, రంధ్రము. 1-౧; విణ. 3. మిక్కిలిలోఁతు గలది: చూ, లోఁతు. 2; 4. తెలియరానిది: చూ, దురవగాహము.

అగారము, సం. వి. అ. న. ఇల్లు: చూ, సదనము. 1.

అగావు, దే. వి. 1. తాకట్టు: చూ, వారకము. తద్వి-పెట్టుబడి సొమ్మునకు: చూ, సంచకరము; 2. ఆరోపితమైన నింద: చూ, సెగ్గింపు; వా. 3. పైపెచ్చు, అదనము. (అగావు మాటలు).

అగిని, వై. వి. = అగ్ని. రూ-అగ్గి: చూ, వహ్ని. 1. కవిజనా. సం. ౫౦; ద్వి. సిం. భాగ. ౨.

అగిసియ, వై. వి. = అగస్తి*. యయా. ౪-౧౧: చూ, రూ-అగిసి.

అగిసె, —వై.—

అగిసెయాకుబొట్టు, ద్వ. వి. అవిసెయాకు వంటి ఆకారముగల బొట్టు: చూ, బొట్టు. 1-౧౩.

అగు, దే. అ. క్రి. రూ-అవు-ఔ. అగుదెంచు. 1. నిర్వర్తిల్లు: చూ, రవణించు; స. క్రి. 2. పొందు: చూ, సక్తమగు; అ. క్రి. 3. కలుగు. భార. సభా. ౧-౧౪౦; భార. భీష్మ. ౧-౮౫: చూ, సంభవించు; 4. పుట్టు. కవిరా. ౧-౭౧: చూ, అగు. 3; 5. ప్రాపించు - భార. ఆది. ౧-౧౧౯; భార. ఉద్యో. ౩-౩౩౨; కవిక. ౪-౨; విప్ర. ౫-౨: చూ, అగు. 3; 6. ప్రవర్తిల్లు. రాఘవ. ౨-౩౨: చూ, వర్తించు; 7. గతించు, కడచు. కాళ. శ. ౧౪; పరమ. ౨-౧౩౩: చూ, వసు. 3; 8. వెలవేఱు. భార. ఉద్యో. ౩-౮౩; కువల. ౨-౨౬: చూ, సిద్ధించు; 9. తగు. భార. ఆది. ౧-౧౨౪; భాగ. ౧౦. ఉ. ౧-౩౬: చూ, సరిపడు. 2; 10. చాలియుండు. భార. ఉద్యో. ౧-౧౧౧; భా. రా. కిష్కిం. ౯౪: చూ, సమర్థమగు; 11. ధాతువుల తుమున్నర్థక రూపముల కనుప్రయుక్తమై విధ్యర్థమును అనఁగా "వలయు"అను నర్థమును తెలుపును. భార.శాం. ౫-౫౦౫; జై. భా. ౭-౨౦౬; 12. మాఱు, మార్పడు. సుమతీ. శ. ౧౪ (సూ. ని.): చూ, వేఱుపడు, 13: చూ, శక్యమగు. భార. ఆది. ౧-౯౬; భార.ద్రో. ౨-౯౯; భర్తృ-మూర్ఖ. ౧౧; 14. పొందుపడు. భార. ఉద్యో. ౧-౩౫౯; భార.మౌ. ౨౨౦; కవిక. ౪-౩౮: చూ,సరిపడు. 1; 15; కలియు, ఏకమగు. భార.అర.౧-౩౯౪; కు. సం. ౨. ౧౪౧: చూ, సక్తమగు (చూ, అగు. 2); 16. నిజమగు: చూ, రూ-అవు-ఔ, అగుదెంచు, సత్యమగు. భార. ద్రో. ౩-౨౯౬; 17: చూ, సిద్ధమగు. పాండు. ౪-౧౫౩; ఆము. ౪-౧౨౮; 18. తోఁచు: చూ, స్ఫురించు. 2. కవిరా. ౫. ౨౬౬; 19. కలదియగు, కలిగియుండు, కు. సం. ౮-౭౯౬; భార. ద్రో. ౫-౧౧౨; హర. పీఠి. ౨౨; హర. ౨-౬౦; 20. అధీనమగు. భా. రా. యు. కాం. ౯౮౦; శుక. ౨-౩౬౦. (ఈయర్థమందిది షష్ఠీవిభక్తితోనే యన్వయించును): చూ, లోఁబడు; 21: చూ, సంబంధించు. కవిరా. ౧-౧౫౨; ప్రభా. ౨-౮౧; 22. ఉండు. భార. భీష్మ. ౨-౩౦; పారి. ౧-౪౦: చూ, వసించు; 23. వ్యతిరేకార్థక రూపములపై అర్థములేకయే అనుప్రయుక్త మగును. అట్టిచో దీనికి ప్రాయికముగా భూతకాలిక ప్రయోగములే కలవు. కాని కొన్నిచోట్ల తద్ధర్మార్థక ప్రయోగములు కూడఁ గనఁబడుచున్నవి.—౧. భూతకాలికమునకు.— భార. ఆది. ౬-౫౯; భార. ఆది. ౨-౧౫౭; ఆము. ౩-౫౩; ౨. తద్ధర్మార్థకమునకు:- భార. మహా.౮౦; పారి.౧-౮౩; 24.ముగియు: చూ,సరిపోవు; 25: చూ,వ్యయించు; 26. వివాహపర్యాయముల కనుప్రయుక్తమై "చేసికొను" అను నర్థమునిచ్చును. భార. ఆది. ౧-౧౩౦; 27. వివాహమగు. ఆము. ౧-౧౪; 28. కొన్నిపట్ల అభేదమును తెలుపును. భార. ద్రో. ౩-౮౩; కవిరా. ౧-౧౫౨; విణ. 29. సంఖ్యావాచకములపై పూరణార్థమున వచ్చు "అవ" ఆగమమునకు పూర్వరూపము. దీనికి "అవు" అను రూపమును గలదు. ప్రాచీనశాసనములందు "అవ"కు మాఱుగా "అగు" "అవు"అను రూపములే కనఁబడు చున్నవి. దీనికిఁ గవిత్రయ ప్రయోగములును కొన్ని ప్రతులందుఁగలవు. తర్వాతి కవుల గ్రంథములలో "అవ" అనియే, కలదు; దశా. ౪. ౬౮౭; దశా. ౪. ౧౦౫౦; భార. ఆది. ౬. ౨౭౧; భార. విరా. ౧-౪౮; హరి. ఉ. ౫-౫౮ (సూ. ని.): చూ, అవ; ద్ర. 30. అంగీకారార్థకము. భార. ద్రో. ౫. ౯౯. (ఇట ఆక్షేపసూచకము.) దశా. ౨-౩౫౪ (సూ. ని.) సరే, సరేకాని: చూ, సమ్మతి. 1; 31. అస్లే, సత్యమే. విజ. వి. ౩-౫౧; 32. ప్రశంసార్థకము. ఔ. భార. విరా. ౧-౧౧౪; దశా. ౫-౬. "ఔ లెమ్మ-ఔ లెంతు". (సూ. ని.): చూ, సెబాసు.

అగుఁగదే, దే. అవ్య. (అగును+కదే) రూ- అవుఁగదే-ఔఁగదే. ఆశ్చర్యార్థకము. భాగ. ౭. ౩౦౫: చూ,వింత. 1

అగుఁగా, దే. అవ్య. రూ-ఔఁగా-అవుఁగా. 1. అదియుక్తమే; 2. సరేకాని. విజ. ౨-౧౬-౨; 3. ప్రశంసాద్యోతకము. కువల. ౨-౬౯.

అగుఁగాక, దే. అవ్య. (అగును+కాక) రూ-అవుఁగాక-ఔఁగాక: చూ, అగు. 30.

అగుఁగావను, దే. అ. క్రి. స. క్రి. రూ - అవుఁగావను - ఔఁగావను. ఇదియుక్తము ఇది అయుక్తము అని యాలోచించు, ఆలోచించు. రాఘ. ౩-౧౮; మార్క. ౧-౧౩౮: చూ, విమర్శించు.

అగుఁబొమ్మ, దే. అవ్య. (అగును+పొమ్మ) 1: చూ, అగుగాక; 2. నిజము: చూ, సత్యము. 1.

అగుగాములు, దే. వి. బ. రూ - అవుగాములు - ఔగాములు. 1. కలిమిలేములు: చూ, కష్టసుఖములు; 2. తగినది తగనిది: చూ, యుక్తాయుక్తములు; 3. మంచిచెడ్డలు: చూ, మేలుగీళ్ళు; 4. సత్యాసత్యములు. (అగుగాములని సూ.ని.)

అగుట, దే. వి. ఒప్పిదమగుట: చూ, కావుట.

అగుణము, సం. వి. అ. పు. 1. తప్పు: చూ, సొంటు; విణ. 2. గుణరహితము. (బ్రహ్మము); 3. సుగుణములులేనిది.

అగుణవాది, సం. విణ. తప్పులు పట్టువాఁడు.

అగుదెంచు, దే. అ. క్రి. (అగు+తెంచు): చూ, రూ - అగు. (7. గతించు:—భార. ఆర. ౪-౭; భార. విరా. ౪-౧౭౧. 19. కలదియగు.—నిర్వ. ౬-౧౭.)

అగునఁటే, దే. అవ్య. రూ-అవునఁటే— ఔనఁటే — ఔనే. (సూ.ని.)

అగునగుఁగదే, దే. అవ్య. రూ-అవునగుఁగదే - ఔనౌఁగదే - ఔఁగదే. (ప్రశంసావాచకము) (సూ. ని.)

అగునె, దే. అవ్య. రూ-అగునే-అవునే నీచమిత్ర స్త్రీ సంబోధనంబున నుపయుక్తము. (సూ. ని.)

అగుర, దే. అవ్య. (అగును+ర)రూ-అగురా-అవుర-అవురా. ఆమ్రేడిత మందు అగురగుర. రామా. ౭-౩౯. 1. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; 2. ప్రశంసను దెలుపును: చూ, ప్రశంసార్థకములు.

అగురా, దే. అవ్య.—పై.—

అగురు, దే. వి. 1. రూ - అవురు - ఔరు. వీరణము*: చూ, తృణము. 1-౫; పై. వి. 2: చూ, అగరువు. 1.

అగురువు, సం. వి. ఉ. పు. న. = అగలు. 1: చూ, అగురు.2; న. 2. ఇరుగుడు*: చూ, శింశుప; పు. 3. ఇంగిలీకము: చూ, హింగుళము; 4. లఘ్వక్షరము: చూ, వర్ణము. 1-౬; పు. 5. గురువుకానివాఁడు. (వ్యు-గురువు); విణ. 6. చిన్నది: చూ, హ్రస్వము; 7. తేలికయైనది: చూ, లఘ్వి. 2.

అగుప్ప, దే. విణ. 1. శ్రేష్ఠము. కు. సం. ౧౨-౯౭౨; కు. సం. ౧-౩౮: చూ, శ్రేష్ఠ్యము. 1.౧; వా. 2. అధికము: చూ, హేరాళము. 1.

అగులు, దే.అ.క్రి.1. చీలు. భాగ. ౬-౩౭౧: చూ, స్ఫోటించు; 2. ఊడు: చూ, సడలు. 4.

అగులుబగులు, వా. వి: చూ, రూ-అగలుబగలు. (గోదావరీ ప్రాంతమున వాడుక.)

అగువు, సం. వి. ఉ. 1: చూ, రాహువు; 2. చీఁకటి: చూ, శ్యామిక. ; విణ. 3. గోవులులేనివాఁడు; 4. పచ్చినది: చూ, సావు. 1-౯.

అగువుతగవులు, వా. వి. బ: చూ, రూ-అగవుతగవులు.

అగూఢగంధము, సం. వి. అ. న. 1. ఇంగువ: చూ, హింగువు; విణ. 2. దాఁచరాని పరిమళముగలది.

అగోచరము, సం. విణ. (పంచేంద్రియములకును) గ్రహింపరానిది: చూ, కంచుమించు.

అగోచరుఁడు, సం. విణ: చూ, కానరానివాఁడు. 2.

అగోద, సం. వి. ఆ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరుని హస్తమునఁ గట్టిన మేఁకు, కిరతోయ: చూ, నది. 1-(౩).

అగౌకసము, సం. వి. స్. పు. (అగము నివాసముగాగలది) 1. పిట్ట: చూ, పక్షి; 2. సింగము: చూ, సింహము. 1; 3: చూ, శరభము 1.

అగౌరవము, సం. వి. అ. న. అపకీర్తి: చూ, నడి. 3.

అగ్గగ్గలాడు, వా. అ. క్రి. 1. గడగడలాడు; 2. వశపడు; 3. భయపడు. (గోదావరీప్రాంతమున వాడుక).

అగ్గడి, దే. వి. ముందఱ, అగ్రభాగము. కప. ౩-౧౦౨ (సూ. ని): చూ, ముందర. 1.

అగ్గపడు, ద్వ. అ. క్రి. (అగ్గము+పడు): చూ, రూ-అగపడు.

అగ్గపాటు, ద్వ. వి: చూ, రూ-అగపాటు.

అగ్గము, దే. విణ. 1. అధీనము. భార. ద్రో. ౨-౨౧; హరి. పూ. ౮-౪౯ మను౨. ౩-౧౦: చూ, వశము. 1; 2. కనఁబడినది. హరి. ఉ. ౨-౭౯; భోజ. ౩-౧౧౭: స్పష్టము 1-౨; 3. సమీపించినది. భార. శాం. ౩-౧౫౧: చూ, సమీపము. 1-౨.

అగ్గలము, దే. విణ. 1. అధికము, ఎక్కువది. భార. ఆది. ౬-౨౧౭; భార. ఆది. ౫-౨౩౯; భార. ద్రో. ౧-౮౦; కు. సం. ౪-౪౦౦; హరి. ఉ. ౧-౧౧౪. (అగ్గలములు=పెద్దమాటలు); భాగ. ౧౦. పూ. ౨-౨: చూ, హేరాళము. 1-౯; 2. అతిశయము, ఆధిక్యము. భార. విరా. ౨-౨౧౬; ప్రబంధ. ౪౦: చూ, హేరాళము. 1; క్రి. విణ. 3. మిగుల అధికముగా. హరి. పూ. ౨-౪౬: చూ, హేరాళము. 1-౭.

అగ్గలించు, దే. అ. క్రి. 1. అతిశయించు; భార. శాం.౫-౫౮౦; నిర్వ. ౬-౩౯: చూ, సంవదించు; 2. ఉత్సహించు, పూను. భార. విరా. ౨-౩౧: చూ, సమకట్టు.

అగ్గలింపు, పై. వి. = అర్థ. పొగడిక: చూ, స్తోత్రము.

అగ్గలిక, దే. వి. రూ-అగ్గలికము. 1. తహతహ: చూ, వ్యసనము; 2. పూనిక: చూ, సన్నాహము; 3. యౌవనాదుల వలనఁ గలుగు గర్వచేష్ట: చూ, విలాసము 2; 4. శౌర్యము: చూ, శౌర్యము. 1; 5. ఆధిక్యము: భార. విరా. ౪-౧౮౧: చూ, హేరాళము. 1-౬; 6. ఎగసిపాటు. భార-ఉద్యో. ౪-౧౫౫; భార. ద్రో. ౫-౧౩౩: చూ, విజృంభణము.

అగ్గలికము, దే. వి. —పై.—(విజృంభణమునకు.—బస. పు. ౬-౭౬౩; భార. కర్ణ. ౨-౧౯౧).

అగ్గి, పై. వి. = అగ్ని. రూ-అగిని, నిప్పు. భార. భీష్మ. ౨-౧౬౩: చూ, వహ్ని. 1; 2. చేతనాచేతనాగ్ని: చూ, వహ్ని. 1-౩౭.

అగ్గించు, దే. స. క్రి. పొగడు. భార. విరా-౪-౨౨౩: చూ, స్తుతించు.

అగ్గింపు, వై. వి. = అర్ఘ. పొగడిక: చూ, స్తోత్రము.

అగ్గికంటి, ద్వ. వి. వేఁడికంటి, ముక్కంటి: చూ, శివుఁడు.

అగ్గికోల, ద్వ. వి. ఆగ్నేయాస్త్రము. అచ్చ. బా. ౫-౧౬: చూ, బాణము. 1-౧౩.

అగ్గిచూలి, ద్వ. వి. 1. (అగ్నినుండి పుట్టినవాఁడు) కుమారస్వామి: చూ, స్కందుఁడు; 2. నీరు: చూ, సలిలము.

అగ్గిటిక, వా. వి. చెకుముకిరాయి: చూ, రత్నములు. 1-౧౨-౧.

అగ్గితత్తడి, వై. వి. అగ్నివాహనము, పొట్టేలు: చూ, మేషము. 1.

అగ్గితూపు, ద్వ. వి: చూ, అగ్గికోల. రామా. ౬-౨౧౦.

అగ్గిపిడుగు, వా. వి. 1. నిప్పుతోఁగూడిన పిడుగు: చూ, పిడుగు. 1-౨; 2. దిట్టరి: చూ, దిట్టఁడు.

అగ్గిపుల్ల, ద్వ. వి. నిప్పుపుట్టించెడి పుడక.

అగ్గిపుల్లగాఁడు, వా. వి. 1. నారదుఁడు; తగవులఁబెంచువాఁడు; 2. తంత్రగొట్టు, కొండీయుఁడు: చూ, సూచకుఁడు.

అగ్గిపెట్టె, వై. వి. నిప్పుపుల్లలపెట్టె.

అగ్గిబొడి, వై. వి. కరదీపిక: చూ, దివిటీ.

అగ్గిబొద్దు, ద్వ. వి. రాయి ఉక్కుముక్క వీని యొరపిడివలనఁ గలిగిన నిప్పును ఆకర్షించెడి నూలుత్రాడు: చూ, సూత్రము. 1-౬౦.

అగ్గిమీఁదిగుగ్గిలము, జా. అతిశయమును సూచించునది.

అగ్గిములికి, ద్వ. వి: చూ, అగ్గికోల. అచ్చ. రా. యు. కాం. ౩౧౬.

అగ్గిమేడి, ద్వ. వి: చూ, అగ్నిమేడి*.

అగ్గివాన, వా. వి. (కోపోక్తియందు వర్తించును.) అగ్నివాన: చూ, వాన. 1-౧౩.

అగ్గివేంద్రపాకు, ద్వ. వి: చూ, అగంద్రపాకు*.

అగ్గివేలుపు, వా. వి. అగ్నిహోత్రుఁడు: చూ, వహ్ని. 1.

అగ్గువ, వై. వి. = అర్ఘమ్. రూ- అగ్గువు. (వ్యు-వెలతక్కువయైనది). 1. చౌక: చూ, వెల. 1; 2. కిమ్మత్తు: చూ, వెల. 2.

అగ్గువు, వై. వి. —పై.—విజ్ఞా. ప్రా. ౭౩.

అగ్గెడ, వై. వి. ద్ర. (అ+గెడ)అక్కడ. ఆము. ౫. ౧౨౨: చూ, తత్ర.

అగ్నాయి, సం. వి: ఈ. స్త్రీ. రూ-అగ్నాయి. అగ్నిదేవుని భార్య. స్వాహా: చూ, భార్య. 1-౨.

అగ్ని, సం. వి. ఇ. పు. = అగిని - అగ్గి. 1. నిప్పు: చూ, వహ్ని. 1; 2. గార్హపత్యము దక్షిణాగ్ని ఆహవనీయము అనుమూఁడు విధములగు శ్రౌతాగ్ని, గృహ్యాగ్ని: చూ, వహ్ని 1-౫; 3. అగ్న్యధిష్ఠాన దేవత; 4. జఠరాగ్ని: చూ, వహ్ని. 1-౧౯; 5. పిత్తము: చూ, రోగము 1-౯; 6. బంగారు: చూ, లోహము. 1-౫; 7. మూఁడు అను అంకె: చూ, రెండొకటి; 8. చిత్రమూలము*: చూ, వహ్నిశిఖము; 9. నల్లజీడి*: చూ, స్ఫోటశోఫ; 10. ఇంద్రుఁడు: చూ, వేలుపు ఱేఁడు; 11. పరిశుద్ధుఁడు: చూ, పూతాత్ముఁడు; 12: చూ, నిమ్మ*; 13. జీడి*: చూ, స్ఫోటశోఫ; అం. 14: చూ, దిగధిపతులు.

అగ్నికణము, సం. వి. అ. పు. నిప్పుక, మిణుఁగురు: చూ, వహ్ని. 1-౧౪.

అగ్నికము, సం. వి. అ. పు. 1. పిన్ననెల్లి*: చూ, శ్రీపర్ణము. 1-౧; 2. ఎఱ్ఱచెన్నంగి*: చూ, స్కంధఫలము. 1-౨; 3. ఆపుద్రవపురుగు: చూ, పురుగు. 1-౧.

అగ్నికర్మము, సం. వి. న్. న. 1. వేలిమి: చూ, హోమము. 1; 2: చూ, వాఁత; 3. అగ్నిచేయుపని (కాల్చుట): అగ్నికార్యము.

అగ్నికార్యము, సం. వి. అ. న. —పై.—

అగ్నికుండము, సం. వి. అ. పు. నిప్పులగుంట.

అగ్నికుక్కుటము, సం. వి. అ. పు. కొఱవిచుప్ప. నిప్పుతొంట: చూ, వహ్ని. 1-౨౪.

అగ్నికుమారుఁడు, సం. వి. అ. పు: చూ, అగ్గిచూలి. 1.

అగ్నికేతువు, సం. వి ఉ. పు. ధూమము: చూ, పొగ. 1.

అగ్నికోణము, సం. వి. అ. పు. ఆగ్నేయమూల: చూ, దిక్కులు.

అగ్నిక్రియ, సం. వి. ఆ. స్త్రీ. 1. దహనకర్మాది; 2. వాఁత వేయుట: చూ, వాఁత.

అగ్నిక్రీడ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, బాణసంచు: 2. దీపోత్సవము: చూ, దివిటీ. 1-౨.

అగ్నిగర్భ, సం.వి.ఆ.స్త్రీ. 1. జమ్మి*: చూ, శమి; 2. పుడమి: చూ, భూమి. 1; 3. మూనెము*: చూ, స్వర్ణవల్లి.

అగ్నిగర్భము, సం. వి. అ. పు. 1. అగ్నిజార*: అగ్నిజము; 2. సూర్యకాంతమణి: చూ, రత్నములు. 1-(౧౦)-(౭); 3. త్రచ్చినిప్పుముట్టించుకొయ్య: అరణి; విణ. 4. లోపల అగ్నికలది.

అగ్నిగృహము, సం. వి. అ. న. అగ్ని హోత్రశాల: చూ, సదనము. 1-౭౨.

అగ్నిచయనము, సం. వి. అ. న: చూ, రూ-అగ్నిచయము.

అగ్నిచయము, సం. వి. అ. పు. రూ- అగ్నిచయనము. 1. అగ్న్యాధానము, అగ్నిని మంత్రపూర్వకముగా నిలుపుట; 2. అగ్నిహోత్రమంత్రము; 3. నిప్పులకుప్ప: చూ, వహ్ని. 1-౧౩.

అగ్నిచిత్తు, సం. వి. త్. పు. 1. రూ-అగ్నిచిత్తుఁడు. మంత్రపూర్వకముగా అగ్నిని స్థాపించుకొన్నవాఁడు. అగ్నిహోత్రి - ఆహితాగ్ని, గాతువు: చూ, వహ్ని. 1-౩౪; 2. బొగ్గు: చూ, వహ్ని. 1-౨౯; అం. 3: చూ, రిహీనతానములు.

అగ్నిచిత్తుఁడు, సం. వి. త్. పు: చూ, రూ-అగ్నిచిత్తు. 1.

అగ్నిచిత్య, సం. వి. ఆ. స్త్రీ. అగ్నిని నిలుపుట: అగ్న్యాధానము.

అగ్నిజము, సం. వి. అ. పు. 1. చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞికము; 2. మంట: చూ, వహ్ని 1-౨౬; న. 3. బంగారు: చూ, లోహము. 1-౫; 4. నీరు: చూ, సలిలము విణ 4. అగ్నినుండి పుట్టినది.

అగ్నిజాతము, —పై.—

అగ్నిజారము, —పై.—

అగ్నిజిహ్వ, సం. వి. ఆ. స్త్రీ. 1. పిన్నచెలుకు, లాంగలికి*: చూ, హలిని. 2; 2. పెన్నచెలుకు*: చూ, హలిని. 1;

(అని కొందఱు) (విటపమను తఱిగొట్టి, శక్రపుష్పి యను తఱిగొట్టి, కలికాలి యను తఱిగొట్టి అని మూఁడు విధము లుగ కొందఱు); 3. అగ్నిజ్వాల, అగ్నియొక్క నాల్క. (ఇవియేవు—"కరాలీ ధూమినీ శ్వేతా లోహితా నీలలోహితా సువర్ణా పద్మరాగాచ జిహ్వాస్సప్త విభావసోః").

అగ్నిజిహ్వుఁడు, సం. విణ. 1. పరుస వాక్కుగలవాఁడు; 2. అగ్నియే జిహ్వలుగాఁ గలవాఁడు: చూ, వరాహమూర్తి.

అగ్నిజుఁడు, సం. వి. అ. పు. 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

అగ్నిజ్వాల, సం. వి. ఆ. స్త్రీ. 1. నిప్పుమంట: చూ. వహ్ని. 1-౨౬; 2. ఆరె*: చూ, సుభిక్ష.

అగ్నిదగ్ధుఁడు, సం. విణ. 1. బ్రతికియున్నప్పుడు నిత్యాగ్ని హోత్రము చేసిన పిమ్మట ఆయగ్నిచేతనే దహనసంస్కా రము నందినవాఁడు. (పితృదేవతలలో నొక తెగవాఁడు); విణ. 2. నిప్పుచేఁ గాల్పఁబడినవాఁడు; 3. చితిమీఁదఁ గాల్పఁ బడినవాఁడు.

అగ్నిదమని, సం. వి. ఈ. స్త్రీ. వాకుఁడు*: చూ, స్పృశి.

అగ్నిదము, సం. విణ. 1. అగ్నిని ఇచ్చునది; 2. ఆఁకలి పుట్టునది.

అగ్నిదాత, సం. వి. ఋ. పు. యథాశాస్త్రముగా దహనకర్మము చేయువాఁడు.

అగ్నిదాయకుఁడు, సం. విణ: చూ, అగ్నిదుఁడు.

అగ్నిదివ్యము, సం. వి. అ. పు: చూ, అగ్నిపరీక్ష.

అగ్నిదీపనము, సం. వి. అ. న. 1. ఆఁకలి హెచ్చించుట; విణ. 2. ఆఁకలి పెంచునది.

అగ్నిదీప్త, సం. వి. ఆ. స్త్రీ. మానేరుతీఁగ*: చూ, స్వర్ణవల్లి.

అగ్నిదీప్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. అగ్నియొక్క ప్రకాశము: చూ, వహ్ని. 1-౨౩; 2. చుఱుకుగా ఆఁకలివేయుట.

అగ్నిదుఁడు, సం. విణ. 1. నిప్పు ఇచ్చువాఁడు; 2. ఇల్లు మొదలగువానిని కాల్చువాఁడు; అం. 3: చూ, ఆతతాయిలు.

అగ్నిదూషితము, సం. విణ. వాఁతవేయఁబడినది.

అగ్నిదృక్కు, సం. వి. శ్. పు. ముక్కంటి: చూ, శివుఁడు.

అగ్నిదేవ, సం. వి. ఆ. స్త్రీ. కృత్తిక: చూ, రిక్క. 1-౩.

అగ్నినక్రజరాయువు, సం. వి. ఉ. పు. మంట: చూ, వహ్ని. 1-౨౬.

అగ్నినిర్యాసము, సం. వి. అ. పు. 1. —పై.—; 2. చిత్ర మూలము*: చూ, వహ్నిసంజ్ఞకము.

అగ్నిపరిక్రియ, సం. వి. ఆ. స్త్రీ. హోమరూపమైన అగ్ని పరిచర్య.

అగ్నిపరీక్ష, సం. వి. ఆ. స్త్రీ. అగ్నిచే దోషాదోషములను పరీ క్షించుట; అగ్ని దివ్యము:

అగ్నిపర్వతము, సం. వి. అ. పు. నిప్పుకొండ: చూ, పర్వ తము. 1-౨౮.

అగ్నిపురాణము, అం: చూ, పురాణములు. 1-౮.

అగ్నిప్రతిష్ఠ, సం. వి. ఆ. స్త్రీ. గృహ్యాగ్నిని (వివాహాగ్నిని) నిల్పుట.

అగ్నిప్రస్కందనము, సం. వి.అ. న. అగ్నిహోమకార్యములు మానుట.

అగ్నిప్రస్తరము, సం. వి. అ. పు. చెకుముకిఱాయి: చూ, స్థూలోచ్చయము. 1-౭.

అగ్నిబాహువు, సం. వి. ఉ. పు. 1: చూ, పొగ. 1; 2. ప్రథమ మనువుయొక్క పుత్త్రుఁడు; 3. ప్రియవ్రతునకు కామ్య యందుఁ బుట్టినవాఁడు.

అగ్నిబీజము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1-౫; 2. "రం" అను బీజాక్షరము (రేఫాక్షరము): చూ, బీజాక్షరములు.

అగ్నిభము, సం. వి. అ. న. 1: చూ, అగ్నిబీజము. 1; 2: చూ, అగ్నిదేవ.

అగ్నిభాస, సం. వి. ఆ. స్త్రీ. మానేరుతీఁగ*: చూ, స్వర్ణవల్లి.

అగ్నిభువు, సం. వి. ఊ. పు. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

అగ్నిభైరవము, అం: చూ, తంత్రములు.

అగ్నిమంథనము, సం. వి. అ. న. 1. రాయిడివలన నిప్పును పుట్టించుట. రూ-అగ్నిమంథము: చూ, వహ్ని. 1-౩౮; 2. నెల్లి*: చూ, శ్రీపర్ణము.

అగ్నిమంథము, —పై.—(పుం. అనికొందఱు).

అగ్నిమంథని, సం. వి. అ. స్త్రీ. తక్కలి*: చూ, వైజయంతి.

అగ్నిమఖము, సం. వి. అ. పు. అగ్నిహోత్రునారాధించు వేద భాగము: చూ, వేదము. 1-౧౭.

అగ్నిమణి, సం. వి. ఇ. పు. సూర్యకాంతమణి: చూ, రత్న ములు. 1-౧౦-(౭).

అగ్నిమథుఁడు. సం. వి. థ్. పు. నిప్పుకొఱకు అరణిమథించు వాఁడు.

అగ్నిమాంద్యము, సం. వి. అ. న. ఆఁకలితగ్గుట: చూ, మందాగ్ని.

అగ్నిమాత, సం. వి. ఋ. స్త్రీ. చిత్రమూలము*: చూ, వహ్ని సంజ్ఞకము.

అగ్నిమారుతి, సం. వి. ఇ. పు. అగస్త్యుఁడు: చూ, సన్న్యాసి 1-(౮).

అగ్నిమాలుఁడు, సం. వి. అ. పు. ఒకానొక పితృదేవత: చూ, హరి. 1-౪.

అగ్నిమిత్రము. సం. వి. అ. పు. గాలి: చూ, వాయువు. 1.

అగ్నిమిత్రుఁడు, సం. వి. అ. పు. 1.—పై.—; 2. శూద్రకుఁ డను రాజు: చూ, రాజు. 1-౧౭.

అగ్నిముఖము, సం. వి. అ. పు. 1. జీడి*: చూ, స్ఫోటకోఫ; 2: చూ, అగ్నిమాత*; 3. బలకరమైన యౌషధచూర్ణము; 4. సల్లి: చూ, రక్తాంగము. 4; న. 5. అగ్నిసాధ్యమగు కర్మములకు పూర్వమందుచేయు అంగకర్మ సముదాయము. భార. ఆది. ౨-౨౧౦; భార. ఆది. ౭-౧౬౩.

అగ్నిముఖి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, అగ్నిముఖము. 1. *; 2. నల్లజీడి*: చూ, స్ఫోటకోఫ. 1-౨; 3: చూ, అగ్ని ముఖిదీప్త.*

అగ్నిముఖిదీప్త, సం. వి. అ. స్త్రీ. విటపమనుతఱిగొట్టి, చెన్న చెఱకు*: చూ, హలిని. 1.

అగ్నిముఖుఁడు, సం. వి. అ. పు. 1. బ్రాహ్మణుఁడు: చూ, స్వస్తిముఖుఁడు. 1; 2. దేవుఁడు: చూ, వేలుపు; 3. అగ్ని

హోత్రి: చూ, వహ్ని. 1-౩౪.
అగ్నిమూల, మి. వి. ఆగ్నేయమూల: చూ, ఆగ్నేయి.
అగ్నిమేడి, మి. వి: చూ, అగ్గిమేడి.
అగ్నిరజము (స్సు), సం. వి. స్. పు. ఆరుద్ర పురుగు: చూ, పురుగు. 1-౧.
అగ్నిరుహా, సం. వి. ఆ. స్త్రీ: చూ, మాంసాదని*.
అగ్నిరేతస్సు, సం. వి. స్. న. బంగారు: చూ, లోహము. 1-౫
అగ్నిరోహిణి, సం. వి. ఈ. స్త్రీ. నొప్పితోను మంటతోను గూడిన చంకలోని కురుపు (సూ. ని.): చూ, వ్రణము. 1-౨౮.
అగ్నిలింగము, సం. వి. అ. న: చూ, పొగ. 1.
అగ్నివత్రిన్యాయము, అం. అగ్గికి చెదలు బట్టవను రీతి.
అగ్నివర్షకము, సం. వి. అ. పు. అవర్త మనెడి మేఘము: చూ, మేఘము. 1.
అగ్నివల్లభము, సం. వి. అ. పు. 1. మద్ది*: చూ, సాలము. 3; 2. మద్దిజిగురు.
అగ్నివాహనము, సం.వి.అ.న. రూ-అగ్నివాహము. 1. గొఱ్ఱె: చూ, మేషము. 1-౮; 2. మేక: చూ, మేషము. 1.
అగ్నివాహము, సం. వి. అ. పు. —పై.—
అగ్నివాహనుడు, సం. వి. అ. పు: చూ, అగ్నిపూలుడు.
అగ్నివీర్యము, సం. వి. అ. న: చూ, అగ్నిరేతస్సు.
అగ్నివృక్షము, సం. వి. అ. పు. కానరేగు*: చూ, స్వాదుఫల. ౩. (౧).
అగ్నివేండ్ర, మి. వి: చూ, దావాగ్ని*:
అగ్నివైద్య మతఃపరమ్, న్యా. అగ్నివైద్యములు నైనపిమ్మట నగ్నివైద్యము. (వాతలుపెట్టుట లేక దహనమొనర్చుట).
అగ్నిశాల, సం. వి. ఆ. స్త్రీ. అగ్నిహోత్రముంచు గృహము లేక అగ్ని హోత్రముంచెడు స్థానము. రూ-అగ్నిశాలము: చూ, సదనము. 1-౬.
అగ్నిశాలము, వా. సం. వి. అ. న. —పై.—
అగ్నిశిఖ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, అగ్నిముఖిదీప్త*; 2. కలికాలయను తఱిగొట్టు*: చూ, హలిని: 2; 3. శక్రపుష్పియను తఱిగొట్టు*: చూ; హలిని. 3; 4. మంట: చూ, వహ్ని. 1-౨౬.
అగ్నిశిఖము, సం. వి. అ. న. 1, కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; 2. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 2; 3. పసుపు: చూ, వర్ణము. 1-౭; 4. బంగారు: చూ, లోహము. 1-౫; పు. 5. దీపము: చూ, స్నేహాశము. 1; 6. అమ్ము: చూ, బాణము. 1; 7. అగ్నిబాణము: చూ, బాణము. 1-౧౩; 8. కుసుంభవృక్షము: చూ,కుసుంభము. 6; 9. దూలగొండి*: చూ, శూకశింబి; విణ. 10. నిప్పువంటి కొనలుగలది.
అగ్నిశేఖరము, సం. వి. అ. పు. 1: చూ, అగ్నిశిఖము. 8.*; 2. కుంకుమ*: చూ,కుంకుమము. 2; 3: చూ,అగ్నిశిఖ. 2; న. 4. బంగారు: చూ, లోహము. 1-౫.
అగ్నిష్టోమము, సం. వి. అ. పు. 1. వసంతకాలమందు జేయఁబడు నొకయాగము (ఇది జ్యోతిష్టోమ సంస్థలలో మొదటిది); 2. అగ్నిష్టోమ విధానమును దెలుపుకల్పము.
అగ్నిష్ఠము, సం. వి. అ. పు. 1. సువర్ణాదిలోహములు కరఁగు మూస: చూ, మూస. 1; న. 2. పెనము: చూ, పాత్రము. 6-౩౭; 3. ఇనుపపేఁపుడుచట్టి: చూ, పాత్రము. 6-౪౧; విణ. 4. అగ్నియందుఁగాని దాని సమీపమున గాని యుండునది.
అగ్నిష్వాత్తులు, సం. వి. అ. పు. బ. ఒకానొక పితృదేవతల గణము: చూ, హరి. 1-౪.
అగ్నిసంభవము, సం. వి. అ. పు. 1. అరణ్యకుసుంభ*: చూ, కుసుంభము. 6-౧; విణ. 2. అగ్నినుండిపుట్టినది.
అగ్నిసంస్కారము, సం. వి. అ. పు. 1. శవమును పండించుట (కాల్చుట): చూ, దహనసంస్కారము; 2. అగ్నిని సంస్కరించుట; 3. అగ్నిచేతసంస్కరించుట.
అగ్నిసఖుఁడు, సం. వి. అ. పు. గాలి: చూ, వాయువు. 1.
అగ్నిసహము, సం. వి. అ. పు. కప్ప: చూ, హరి. 1-౧౨.
అగ్నిసాక్షి, సం. విణ. (న్. జీ. న్.) వివాహాదులయందు అగ్నియెదుట జరిగిన ప్రమాణము: చూ,ప్రమాణము. 9-౧.
అగ్నిసాక్షికము, సం. విణ. —పై.—
అగ్నిసాదము, సం. వి. అ. పు. అజీర్ణవ్యాధి: చూ, రోగము. 1-౨.
అగ్నిసారము, సం. వి. అ. న. ఒకరకము కంటిమందు.
అగ్నిసూత్రము, సం. వి. అ. న. ఉపనయనమునందు బ్రాహ్మణుఁడు ధరించు ముంజిదర్భ మొలత్రాడు, మౌంజీమేఖల (సూ. ని.): చూ, సూత్రము. 1-౪౬.
అగ్నిస్తంభన, అం: చూ, కళలు.
అగ్నిస్తంభనము, సం. వి. అ. పు. రూ-అగ్నిస్తంభము. 1. న. అగ్నియొక్క దహనశక్తి నాఁపుట కుపయోగించు మంత్రము; 2. అగ్నిస్తంభ నౌషధము.
అగ్నిస్తంభము, —పై.—
అగ్నిస్తోకము, సం. వి. అ. పు. నిప్పుక: చూ, అగ్నికణము.
అగ్నిహోత్రము, సం. వి. అ. పు = అగిని-అగ్గి. నిప్పు: చూ, వహ్ని. 1; 2. ఆహితాగ్నులు ప్రాతస్సాయంకాలములయందుఁ జేసెడి హోమము. దశా. ౩-౨౩: చూ, హోమము; 3 దధి పయోరూపమైన హవిస్సు, అగ్నిహోత్రమునందు వ్రేల్చుటకు ఇవుడఁబెట్టిన యన్నము: చూ, హవిస్సు. (చూ, సాదము. (1)-౪).
అగ్నిహోత్రి, సం. వి. న్. పు. అగ్నిహోత్రమును జేయువాఁడు: చూ, వహ్ని. 1-౩౪.
అగ్నిహోత్రుఁడు, సం. వి. అ. పు. = అగిని-అగ్గి: చూ, అగ్నిహోత్రము. 1.
అగ్నీధ్రుఁడు, సం. వి. అ. పు. బ్రహ్మగణములలో నొకఁడు, పదియాఱుగురు ఋత్విజులు యాజకులు అనువారలలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.
అగ్నీయము, సం. విణ. అగ్నిసమీపమున నున్నది, అగ్ని సంబంధమైనది.
అగ్నీషోమీయము, సం. విణ. అగ్నియును సోముఁడును దేవతలుగాఁ గలది (యాగము మొ॥)
అగ్నులు, అం. 1 గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము, సభ్యము, అసభ్యము (౫); 2. పూర్వాగ్ని, దక్షిణాగ్ని,

పశ్చిమాగ్ని, ఉత్తరాగ్ని, సూర్యుఁడు. (ఇ); 3. అగ్ని భేదములు:- అనలము, కుకూలము, భగలము. (చూ, వహ్ని 1.)

అగ్న్యాధానము, సం. వి. అ. న. అగ్నినినిలుపుట: చూ, అగ్నిచిత్య.

అగ్న్యాధేయుఁడు, సం. వి. అ. పు: చూ, అగ్నిహోత్రి.

అగ్న్యాహితుఁడు, —పై.—

అగ్న్యుత్పాతము. సం. వి. అ. పు. ఉల్కాపాతము, ధూమకేతువు (తోఁకచుక్క) మొ: చూ, రిక్క. 1-౨.

అగ్న్యుద్ధరణము, సం. వి. అ. న. 1. అరణినుండి నిప్పుపుట్టించుట: చూ, వహ్ని. 1-౩౭; 2. అగ్నిహోత్రమును జేయుటకు ముందు బూడిదతొలఁగించి అగ్నిని పైకిఁజేయుట: చూ, వహ్ని. 1-౪౦.

అగ్న్యుద్ధారము, —పై.—

అగ్న్యుపస్థానము, సం. వి. అ. న. 1. అగ్న్యుపాసనము; 2. అగ్న్యుపాసన మంత్రము.

అగ్రకేశము, సం. వి. అ. పు. 1: చూ, కేశాగ్రము; ఐ. 2. ముంగురులు: చూ, వెంట్రుక. 1.

అగ్రగణ్యము, సం. విణ. అత్యుత్తమమైన దానిగా పరిగణింపఁబడినది: చూ, శ్రేష్ఠ్యము. 1-౩,

అగ్రగణ్యుఁడు, సం. విణ. అత్యుత్తమమైన వానిగా పరిగణింపఁబడినవాఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

అగ్రగము, అం: చూ, హస్తప్రచారములు.

అగ్రగామి, సం. వి. న్. పు: చూ, ముందునడచువాఁడు.

అగ్రగుఁడు, —పై.—

అగ్రజ, సం. వి. ఆ. స్త్రీ. అక్క, అప్పు: చూ, సహోదరి. 1-౨.

అగ్రజంఘ, సం వి. ఆ. స్త్రీ. పిక్కయొక్క ముందుభాగము: చూ, పిక్క. 1-౧.

అగ్రజన్ముఁడు, సం. వి. న్. పు. 1. బ్రాహ్మణుఁడు: చూ, స్వస్తిముఖుఁడు. 1; 2. అన్న: చూ, సహోదరుఁడు. 1-౧; 3. నలువ: చూ, బ్రహ్మ. 1; విణ. 4. ప్రధానుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

అగ్రజాతుఁడు, సం. వి. అ. పు. 1: చూ, అగ్రజన్ముఁడు. 1; 2: చూ, అగ్రజన్ముఁడు. 2; విణ. 3. మొదటపుట్టినవాఁడు: చూ, అగ్రజుఁడు.

అగ్రజుఁడు, —పై.—

అగ్రణి, సం. విణ. ఈ. 1: చూ, శ్రేష్ఠ్యము; 2: చూ, అగ్ర[illegible]డు.

అగ్రత, సం. అవ్య. అభిముఖము: చూ, ముందర. 1.

అగ్రతలసంచరము, అం: చూ, చరణక్రియలు.

అగ్రతస్థలము, అం: చూ, హస్తప్రచారములు.

అగ్రతస్సరుఁడు, సం. విణ. 1: చూ, అగ్రగామి; 2: చూ, అగ్రగణ్యుఁడు.

అగ్రధన్వుఁడు, సం. వి. న్. పు. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు.

అగ్రనిరూపణము, సం. వి. అ. న. భవిష్యత్తుచెప్పుట: చూ, భవిష్యత్తు. 1-౧.

అగ్రపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. అజలోమ*: చూ, కేశి. 10.

అగ్రపాణి, సం. వి. ఇ. పు. 1. చేతిచివరభాగము: చూ, హస్తము. 1-౩౩; 2. తుండాగ్రము: చూ, హస్తి. 1-(౧౬).

అగ్రపాతి, సం. విణ. ముందు సంభవించునది.

అగ్రిపాదము, సం. వి. అ. పు. పాదాగ్రము: చూ, పజ్జ. 1-౧౩.

అగ్రిపూజ, సం. వి. ఆ. స్త్రీ. మొదటి సత్కారము: చూ, సన్మానము. 1-౪.

అగ్రిబీజము, సం. వి. అ. పు. జీడిమామిడి*: చూ, మామిడి. 1-౧౩.

అగ్రభుక్కు, (అగ్రభుఁజు). సం. విణ. చ్. 1. మొదట తినువాఁడు: చూ, భక్షకుఁడు. 1-౩; 2. తిండిపోతు: చూ, భక్షకుఁడు. 1.

అగ్రభువు, సం. వి. ఊ. పు. 1. అన్న: చూ, సహోదరుఁడు. 1; 2. బ్రాహ్మణుఁడు: చూ, స్వస్తిముఖుఁడు; స్త్రీ. 3. అక్క: చూ, సహోదరి (సూ. ని.)

అగ్రమాంసము, సం. వి. అ. న. 1. హృదయమునందు పద్మాకారమున నున్న మాంసవిశేషము. (సూ. ని.); 2. పెద్దయుసిరిక వంటు ప్రమాణము కలిగి కోలగానుండి పశువుయొక్క పార్శ్వమున నుండు క్రౌతమందు ప్రసిద్ధమైన వృక్క యను మాంసము: చూ, వృక్క. ; 3. కారిజము పొంగు వ్యాధి: చూ, రోగము. 1-౩౬.

అగ్రము, సం. వి. అ. న. 1. చివర: చూ, సుద. 3; 2. ఎదురు: చూ, ముందర. 1; 3. దగ్గఱ: చూ, సమీపము. 1; 4. గుంపు: చూ, సమూహము; 5. మానవిశేషము, నాలుగు కళ్ళ కొలఁదిభిక్ష, నాలుగు కబళముల భిక్ష; 6. పైభాగము: చూ, మీఁదు. 2; 7. పలమనెడి పరిమాణము: చూ, పలము. 1; 7. పెచ్చు, హెచ్చు: చూ, హెరాళము. 1 ౬; 9. ఆశ్రయము: చూ, సన్నిధానము "ఏకాగ్రచిత్తుఁడు" (సూ. ని.); విణ. 10. ప్రథమము: చూ, మొదలు. 4; 11. ప్రధానము: చూ, శ్రేష్ఠ్యము; 12. అధికము: చూ, హెరాళము. 1-౬; అం. 13: చూ, హస్తక్షేత్రములు.

అగ్రయానము, సం. వి. అ. న. 1. ముందు నడచునది.

అగ్రయాయి, సం. విణ. న్. సీ. న్. 1: చూ, అగ్రగామి; 2: చూ, శ్రేష్ఠుఁడు. 2; 3: చూ, మొదటివాఁడు. 3.

అగ్రయోధి, సం. వి. న్. పు. 1. వీరులలో ముఖ్యుఁడు; చూ, హంవీరుఁడు. 2; 2. శూరులకెల్ల శూరుఁడు, గండరగండఁడు: చూ, హంవీరుఁడు. 2,౨.

అగ్రలోహిత, సం.వి.ఆ. స్త్రీ. చిట్టికూర*: చూ, భండీరము. 2.

అగ్రసంధాని, సం. వి. ఈ. స్త్రీ. ప్రాణివర్గముయొక్క పూర్వకర్మను సారముననఁగలుగు శుభాశుభములను దెలుపునట్టి యముని కవిలె (పొత్తము) (సూ. ని.): చూ, యమపట్టిక.

అగ్రసంధ్య, సం. వి. ఆ. స్త్రీ. తొలిసంజ: చూ, ప్రాతస్సంధ్య. 2.

అగ్రసరి, సం. విణ: చూ, అగ్రయాయి. 1, 2.

అగ్రసరుఁడు, —పై.—

అగ్రస్థానము, వా. వి. 1. మొదటిస్థానము: చూ, స్థానము.

1-౪౧; 2. నఖలయం దగ్రస్థానము, మొట్టమొదటి స్థానము: చూ, స్థానము. 1-౪౨; 3. సంస్థలయం దగ్రస్థానము: చూ, స్థానము. 1-౪౩.

అగ్రహస్తము, సం. వి. అ. పు: చూ, అగ్రపాణి. 1-2

అగ్రహాయణము, సం. వి. అ. పు. రూ-ఆగ్రహాయణికము. మార్గశీర్షమాసము: చూ, మాసములు. ౯.

అగ్రహాయణేష్టి, అం. రూ - ఆగ్రహాయణేష్టి - ఆగ్రయణము, నవసస్యేష్టి: చూ, హవిర్యజ్ఞములు.

అగ్రహారము, సం. వి. అ. పు. 1. బ్రాహ్మణుల యిండ్లవరుస, నల్లిండ్లు: చూ, దేశములు. 1-(౬)-3; అం. 2: చూ, సంతానములు; 3: చూ, దానములు; 4: చూ, మహాదానములు; పు. 5. పోషణమునకై రాజు బ్రాహ్మణులకిచ్చెడి గ్రామము లేక వసతిగల పుడమి.

అగ్రాంశువు, సం. వి. ఉ. పు. కిరణములుకూడు స్థలము.

అగ్రాక్షి, సం. వి. ఇ. న. క్రేఁగన్ను: చూ, లోచనము. 1-౧.

అగ్రానీకము, సం. వి. అ. న. ముందఱిగల సేన: చూ, సేన. 1-౮.

అగ్రామ్యము, సం. విణ. 1. గ్రామ్యముకానిది, నగరమందలిది; 2. అపభ్రంశము కానిది, శాస్త్రసమ్మతము (పదము మొ॥); 3. వన్యము (మృగాది). (సూ. ని.)

అగ్రామ్యుఁడు, సం. విణ. నేర్పరి: చూ, సమర్థుఁడు. 1.

అగ్రాహ్యము. సం. విణ. 1. గ్రహింపఁదగనిది, పుచ్చుకొనఁదగనిది; 2. తెలిసికొనఁదగనిది; 3. అంగీకరింపఁదగనిది; నమ్మఁదగనిది; 5. పరిగణింపఁ దగనిది, లెక్కసేయఁదగనిది.

అగ్రిమ, సం. వి. ఆ. స్త్రీ. అప్ప: చూ, సహోదరి. 1-౨.

అగ్రిమము, సం. విణ. ముఖ్యము: చూ, శ్రేష్ఠము.

అగ్రిముఁడు, సం. వి. అ. పు. 1. అన్న: చూ, సహోదరుఁడు. 1; విణ. 2: చూ, మొదటివాఁడు. 3; 3: చూ, శ్రేష్ఠుఁడు; 2; 4. పెద్దవాఁడు: చూ, స్థవిరుఁడు.

అగ్రియము, సం. విణ. రూ-అగ్రీయము. ముఖ్యమైనది: చూ, శ్రేష్ఠము. [2, 3, 4.

అగ్రియుఁడు, సం. రూ-అగ్రీయుఁడు: చూ, అగ్రిముఁడు. 1,

అగ్రీయము, సం. విణ. 1: చూ, రూ-అగ్రియము; 2. ప్రధానమైన వస్తువు; చూ, రూ-అగ్ర్యము.

అగ్రీయుఁడు, సం: చూ. రూ-అగ్రియుఁడు.

అగ్రేదిధిషువు, సం. వి. ఉ. పు. 1. బిడ్డలుగన్న మాఱుమనువుదాని మొదటి బ్రాహ్మణ స్త్రీయొక్క భర్త: చూ, సామి. 1-౩; 2. మాఱుమనువుదాని మొదటి మగఁడు: చూ, సామి. 1-3; స్త్రీ. 3. అక్కకు ముందు పెండ్లాడిన చెల్లెలు. (సూ. ని.)

అగ్రేసరుఁడు, సం. విణ: చూ, అగ్రతస్సరుఁడు.

అగ్ర్యము, సం. విణ: చూ, రూ-అగ్రీయము.

అగ్ర్యుఁడు, సం. విణ: చూ, అగ్రతస్సరుఁడు.

అగ్న్యుత్పాతము, సం. వి. అ. న. ఆకాశాదుల యందుఁ బుట్టిన అగ్నిఆకారము, తోఁకచుక్క: చూ, రిక్క. 1-(౨)-౨.

అఘటమానము, సం. విణ. ఘటిల్లనిది. భార. అర. ౧-౩౩౧.

అఘటనము, సం. వి. అ. న. దధివిశేషము: చూ, స్తన్యము. 1-౨౬-౧.

అఘభోజి, సం. విణ. దేవపితృవ్యతిథులకు పెట్టక తాను తినువాఁడు. (సూ. ని.)

అఘమర్షణము, సం. వి. అ. న. సర్వపాపములనుపోఁగొట్టెడి మంత్రము. ("అఘమర్షణస్నానము" ఇది ఋగ్వేదమున ౧౯౦ వ సూక్తము. జలములయందు మూఁడుమాఱులు దీనిని జపింపఁగా గురుతల్పగమనాది మహాపాతకములు గూడ నశించును.): చూ, మంత్రము. 1.

అఘము, సం. వి. అ. న. 1. పాపము: చూ, వృజినము; 2. దుఃఖము: చూ, శోకము. 2; 3. ఆశౌచము: చూ, మయిల. 4; 4. ద్యూతాదివ్యసనము: చూ, వ్యవహారము. 1-౨౨.

అఘశంసి, సం. విణ. ఇతరుల దోషములను ప్రకటించువాఁడు.

అఘాటము, సం. వి. అ. పు. 1 = అగడిత-అగడ్త: చూ, స్వర్ణది; విణ. 2: చూ, నిరాఘాటము.

అఘాతము, సం. వి. అ. పు. 1: చూ, రూ-అఖాతము. 1; 2: చూ, అఖాతము. 2; 3. కొండపగులు: చూ, పర్వతము. 1-౧౨; 4. కొండనడుము: చూ, పర్వతము. 1-౧౧.

అఘాయువు, సం. వి. ఉ. పు. 1. పాము: చూ, సర్పము. 1; 2. పాపాలముద్ద: చూ, వ్యాధుఁడు. 2; 3. కాకి: చూ, వాయసము. 1; 4. చామరము: చూ, సురఁటి. 1-౧; 5. కత్తి: చూ, రిష్టి. 2; విణ. 6: చూ, అఘాయువు. 2.

అఘాహము, సం. వి. అ. పు. ఆశౌచదినము: చూ, రోజు. 1-౨.

అఘుఁడు, సం. వి. అ. పు. 1. అఘుఁడనెడు రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2: చూ, అఘాయువు. 2; 3: చూ, మైలవాఁడు: 4. దుఃఖాన్వితుఁడు: చూ, విమనుఁడు.

అఘృణి, సం. విణ: చూ, కాంతిహీనుఁడు.

అఘో, సం. అవ్య. దుష్టునిఁ బిలుచుటను దెలుపును: చూ, సంబోధనము.

అఘోర, అం; చూ, శివాననములు. (రూ-అఘోరము.)

అఘోరప్రమాణము, సం. వి. అ. న. పెద్దఒట్టు: చూ, శపథము. 1-౧.

అఘోరము, సం. వి. అ. న. 1. ఈశ్వరుని దక్షిణముఖము: చూ, శివుఁడు (చూ, అఘోర); 2. నక్క: చూ, సృగాలము; విణ. 3. భయములేనిది: చూ, నిర్భయము; 4. దేనికంటె ఘోరములేదో అది, అతిభయంకరము, గోరగింత: చూ, రౌరవము. 2-౩.

అఘోరుఁడు, సం. వి. అ. పు. 1. రుద్రుఁడు: చూ, శివుఁడు. 1; 2. రుద్రుని దుర్గము అర్చించువాఁడు: చూ, శివుఁడు 1-౩; విణ. 3. అఘోరసాంప్రదాయమునకుఁ జెందినవాఁడు; 4. అసహ్యముగ నుండు వ్యక్తి; 5. అసహ్యకరమగు వస్తువుల నుపయోగించువాఁడు; 6. భక్ష్యాభక్ష్య విచారణ లేనివాఁడు.

అఘోషము, సం. వి. అ. పు. 1. (వ్యాక) వర్ణోత్పత్తికైన బాహ్యప్రయత్నభేదము. అల్పప్రయత్నముతోఁ గూడినవర్ణము. (క-ఖ-చ. మొ॥); విణ. 2. ధ్వనిలేనిది: చూ, స్వరము. 1-(౧౫౦).

యకములు. అచ్చనగుండ్లాను చిన్నచిన్నగుండ్లు. (బ. అచ్చనగల్లు). కళా. ౬-౨౫౯: చూ, రత్నములు 1-౧౨-(౨).

అచ్చనగాయలు, దే. వి. బ: చూ, అచ్చనగుండ్లు. (బాలికా క్రీడకు-రుక్మి. ౧౮౯.)

అచ్చనగుండ్లు, —పై.— (గిరియకములకు.—రామా. ౫. ౧౨౧)

అచ్చనలు, వై. బ. = అచ్చ. (వృత్తియందే కవచనాంత మగును). 1: చూ, అచ్చన గండ్లు; 2: చూ, అచ్చన గండ్లు. 2; 3. నృత్యము. పండితా. ౧౬౧ పొ; జై. భా. ౧. ౫౫: చూ, వ్యంజకము. 1-౧౩.

అచ్చబంగారు, ద్వ. వి. 1. మేలిమివన్నె బంగారు: చూ, లోహము. 1-౫-(౧); 2.ముద్దుపలుకు: చూ. శబ్దము.1-౭౫.

అచ్చము, వై. విశ. = అచ్చమ్. (దీనికి వృత్తియందంత్య వర్ణలోపము వికల్పముగ నగును). 1. నిశ్చలమయినది: చూ, సత్యము. 1; 2. తేరినది: చూ, సమీచీనము. 2; 3. నిర్ణయింపఁబడినది: చూ, స్థాపితము. 2; 4. తెల్లనిది: చూ, వర్ణము 6-౫-(౧); 5. దట్టము: చూ, సాంద్రము. 1; వా. 6. ఇష్టానుసారము.

అచ్చముగ, వా. అవ్య. సంశయములేకుండఁగ, స్వేచ్ఛగ, ఇచ్చవచ్చినటుల.

అచ్చర, వై. వి. = అప్సరస్. దేవవేశ్య. మనుచ. ౨-౩౮: చూ, దేవతాభేదములు: (చూ, స్త్రీ. 1-౫౬.)

అచ్చరనది, మి. వి: చూ, అచ్చరవాఁక.

అచ్చరము, వై. వి. = అక్షరమ్. వైజ. ౨-౯౫: చూ, వర్ణము. 1.

అచ్చరవాఁక, వా. వి. ఆకాశగంగ: చూ, నది. 1.

అచ్చరువడు, వై. అ. క్రి: చూ, వెఱఁగొందు. కు. సం. ౧౧. ౪౮౬.

అచ్చరువు, వై. వి. ఆశ్చర్యమ్-రూ-అచ్చెరువు. కు. సం. ౧౧. ౭౬౮: చూ, వింత. 1.

అచ్చలము, దే. వి. 1. కోపము: చూ, రోషము; 2. పట్టుదల. భార. సభా. ౨. ౧౭౦: చూ, సన్నాహము. 2.

అచ్చలించు, దే. అ. క్రి: చూ, రోషించు.

అచ్చాకారము, వై. వి. = అచ్ఛంకారమ్: చూ, రూ-అచ్చ [కారము.

అచ్చాజె, వా. విశ. 1. ఆణిముత్తెముఁబోలునది, శ్రేష్ఠ వాచకము; 2. శ్రేష్ఠమైనది: చూ, శ్రేష్ఠ్యము. 1-౧.

అచ్చారము, వై. వి. = అచ్ఛంకారమ్: చూ, రూ-అచ్చకారము.

అచ్చావు, దే. వి. 1. తెల్లయావు: చూ, ధేనువు. 1-౧౨; 2. నైచికి, శ్రేష్ఠమైనయావు: చూ, ధేనువు. 1-౨౩.

అచ్చాళి (కు), దే. విశ. (అచ్చము + ఆళు) జంజాటములేని వాఁడు "ద్వి. ఆరూఢబలయుక్తి నచ్చాళుగాగ" పతివ్రతా మాహాత్మ్యము (బ్రౌణ్య. ని.)

అచ్చి, దే. వి. 1. అచ్చిమట్టమను దేశము: చూ, దేశములు. 1-౫౭; వా. 2. తుమ్ముయొక్కధ్వని. (వా. రూ-అచ్చి. అనియు); 3. ఒకానొక స్త్రీవాచకము. (అచ్చమ్మ).

అచ్చిక, దే. వి. రూ-అచ్చికము. 1. కొఱఁత, లోపము. హంస. ౧-౮౯: చూ, వెలితి. 2; 2. క్షోభము. హరి. పూ. 3-౧౭౪: చూ, సంతాపము. 1.

అచ్చికబుచ్చిక, దే. వి. రూ-అచ్చికబుచ్చికము. 1. ఇచ్చకము, బుజ్జగింపు. విజ. ౩-౩౦; వేం. పంచ. ౨-౬౮: చూ, సమరసము 2; బ. 2. బెల్లింపుమాట, ఇచ్చకపుమాట. ద్వి. హరిశ్చ. ఉ. ౬౩౬: చూ, శబ్దము. 1-౧౧; విశ. 3. చెవులకు విననింపయినది: చూ, సాంత్వము. 3.

అచ్చికబుచ్చికము, దే. వి. విశ. —పై.—

అచ్చికబుచ్చికలు, దే. వి. విశ. బ. —పై—

అచ్చికబుచ్చికలాడు, దే. స. క్రి: చూ, బుజ్జగించు.

అచ్చికము, దే. వి. 1: చూ, రూ-అచ్చిక. 1; 2: చూ, రూ-అచ్చిక. 2; 3: చూ, అచ్చికబుచ్చిక. 1; విశ. 4. తేటినది: ఆం, భా. ౧-౧౫౮: చూ, సమీచీనము. 2-౧.

అచ్చికలుబుచ్చికలు, దే. వి. బ: చూ, రూ-అచ్చికబుచ్చికలు (కలుపుకోలు తనమునకు-చంద్రా. ౩-౪౫.

అచ్చిమట్టము, దే. వి: చూ, అచ్చి. 1.

అచ్చియుండు, వా. స. క్రి. 1. ఇచ్చుకొనవలసి యుండు; 2. చచ్చినను తరువాతిజన్మమున తీర్చవలిసియుండు.

అచ్చివచ్చు, దే. అ. క్రి: చూ, మేలైవచ్చు.

అచ్చు, వై. వి. 1. బెల్లము: చూ, శర్కర. 1-౧; 2. నీడ. భార. స్త్రీ. ౧-౫౧; ఆం, భా. ౩-౩౦౨: చూ, వికారము. 1; 3. కీర్తి. భోజరా. ౭. ౧౫: చూ, విధము. 1; 4. సంజ్ఞాక్షరములుచెక్కిన ఉంగరములోనగునది. భాగ. ౧౦, ఉ. ౩౩౦: చూ, ముద్ర. 2; 5. సాలివానినేఁతసాధన విశేషము: చూ, మగ్గము. 1 ౧; 6. నాణెములు కాగితములులోనగు వానిపై అక్షరములు బొమ్మలు మొ॥ వానినిఒత్తుసాధనము (చూ, అచ్చు. 4.); 7. చెంబు మొ॥ పోఁతపోయుటకును, ఇటిక మొ॥ తీయుటకును కూర్చిన మొగటియాకృతి. భార. విరా. ౨-౫౨: చూ, పోఁతఅచ్చు; 8. మొదటిదృష్టాంతము, ఆదర్శము. కు. సం. ౭. ౮౬౭: చూ, వృత్తాంతము. 7; 9. గుఱుతు. కు. సం. ౪-౩౬౭; బస. ౬-౫౯౯; పి. శ. ౪. ౧౭౫: చూ, లక్షణము. 1; 10. ముద్ర వేసిన తూనికబాయి మొ॥ విజ్ఞా. ప్రా. ౫౬: చూ, రత్నములు. 1-౧౨-(౬౧); 11: అచ్చునఁబోసి తీసినవస్తువు (చూ. అచ్చు. 7.); 12. పరిశుద్ధి: చూ, సమీచీనము. 2; 13. పాచిక. ద్వా. ౧౦-౮౮: చూ, వ్యవహారము. 4-౬; 14. ఇరుసుమ్రాను: చూ, ఇరుసు. 1. (బ్రౌణ్య.); విశ. 15. దోషములేనిది. విజ్ఞా. ప్రా. ౯౧; శుక. ౪-౪౬: చూ, సమీచీనము. 2; 16. తెల్లము. హరి. పూ. ౭-౩౮: చూ, స్పష్టము; 17 సరియైనది, యథార్థము. ఉ. రా. ౨-౩౧౬ (అచ్చుగ=సరిగా). ఉ. రా. 3-౯౨: చూ, సత్యము. 1; 18. తగినది. భాగ. ౧౧-౧౩ (అచ్చుగ = ఒప్పుగా): చూ, యోగ్యము. 2; దే. అ. క్రి. 19: చూ, బాకీపడు. శేష. 3-౨౧౧; ద్వి. హరిశ్చ. ఉ. ౭౨౮; 20: అచ్చుకొను, జామీనుండు, పూచిపడు, పూచీపడు, పూఁటపడు, హామీపడు. కాశీ. ౫-౧౨౫; స.క్రి. 21. ఇచ్చుకొను: చూ, దయచేయు. 2; 22. నష్టమిచ్చు. విజ్ఞా. ప్రాకాం ౪౮; విజ్ఞా. ప్రా. కాం. ౯౧; దశా. ౪-౧౨౮౮; దశా. ౪-౧౧౬౩: చూ, దండుగిచ్చు; 23. విధిగా ఇచ్చుకొను: చూ, చెల్లించు.

అచ్చుకట్టు, ద్వా. స. క్రి. 1. ఏర్పఱచు. హరి. ఉ. ౯. ౧౫౭; పాండు. ౧-౧౧; నృసింహపితిక. ౧-౭: చూ, సృజించు; 2. (పొలము) మడిమడిగాయేర్పఱచు. పైజ. ౧-౭౫; వా. 3. సాగెవానిపనికి సంబంధించినది.

అచ్చుకట్టువాఁడు, ద్వా. వి. 1. బట్టలనేఁత కుపయోగించు అచ్చులుకట్టు వాఁడు; వా. 2. ముద్రణాలయమున అక్షర ములఁ గూర్చువాఁడు. (1900 సం॥రములో సివాచస్పత్ర కర్త తండ్రిగారి యాజ్ఞను శిరసావహించి "లక్ష్మీనారాయణీయము"నకు తాను లేఖరియై పూర్తిగా వ్రాసినపిదప 1906 సం॥లో "సకలానంద"అను స్వంత ముద్రాక్షరశాలయందు అక్షరసంధానోద్యోగియై దానిని రోజునకు ఎనిమిది పేజీల వంతున అచ్చు కూర్చుచు పూర్తిఁగావించెను.)

అచ్చుకుప్ప, దే. వి. ధనికుఁడు: చూ, సంపన్నుఁడు.

అచ్చుకూటము, ద్వా. వి. ముద్రాశాల: చూ, సదనము. 1-౪.

అచ్చుకొట్టు, వా. స. క్రి: చూ, ముద్రించు. 1.

అచ్చుకొను, దే. అ. క్రి. 1: చూ, అచ్చు. 20; 2. ఇచ్చుకొను: చూ, దయచేయు. 2; వా. 3: చూ, సమ్మతించు.

అచ్చుగుద్దు, వా. స. క్రి: చూ, అచ్చుకొట్టు.

అచ్చుటెద్దు, ద్వా. వి. (అచ్చు+ఎద్దు) అచ్చుపోసి స్వేచ్ఛగాఁ దిరుగ విడిచిన వృషభము, ఆఁబోతు; చూ, వృషభము. 1.

అచ్చుదల, దే. వి. 1. అప్పు. (అప్పునకు ఒప్పుదల అని కొందఱు): చూ, వారకము. (౧)-౧; 2. ఒప్పుదల. కాశ. ౨-౧౨౦ చూ, సమ్మతి. 1; 3. అప్పుపడుట; 4. అచ్చి (సక్రమముగా) వచ్చుట; చూ, శుభాగతము.

అచ్చుపడు, వై. అ. క్రి. 1. తెల్లమగు. భార. ద్రో. ౫-౩౧౫; హరి. ఉ. ౩-౧౫౯; భాగ. ౧౦. పూ. ౧౧౭౪: చూ, విశదమగు; 2. ముద్రితమగు; 3. అలవడు. కాశ. ౪-౧౩; విక్ర. ౬-౯౭: చూ, సిద్ధించు; 4. ఉచితమగు. భార.విరా. ౫-౧౬౫: చూ, సార్థకమగు; 5. ఏర్పడు: చూ, పాలుపోవు. 2; 6. (కాల్చిన) రక్ష ఏర్పడు, ముద్రాంకితమగు; 7. (ఆఁబోతునకు) రక్ష ఏర్పడు: అచ్చుపోయు.

అచ్చుపఱ(ఱు)చు, ద్వా. స. క్రి. 1. నియమించు. భార. విరా. ౪-౨౭: చూ, నెలవిచ్చు; 2. కలిగించు. భార. అను, ౫-౨౩౪: చూ, సృజించు; 3. ఏర్పఱచు. పద్మ. ౨-౯: చూ, నిర్దేశించు. 2.

అచ్చుపాటు, వై. వి. 1. ఏర్పాటు. భార. శల్య. ౧-౧౧: చూ, సత్యము. 2; 2. అచ్చుపడుట: చూ, స్పష్టత.

అచ్చుఁబోడిచినయాఁబోతులు, జా. స్వేచ్ఛగా (హద్దులేక) తిరుగువాండ్రు. "రాజభటుల నచ్చుఁబొడిచిన యాఁబోతుల రీతిని" (ధర్మజ రాజసూయము.)

అచ్చులు, వై. వి. బ. 1: చూ, అచ్చు. 1; 2: చూ, అచ్చు. 2; వా. బ. 3. పోఁతపోయు అచ్చులదిమ్మలు.

అచ్చువేయు, వై. స. క్రి: చూ, అచ్చుకొట్టు.

అచ్చుపోఁత, వా. వి. కరిగిన లోహాదులపోఁత: చూ, పోఁత.2.

అచ్చుపోయు, వా. అ. క్రి: చూ, అచ్చుపడు. 6.

అచ్చెరియము. వై. వి. = ఆశ్చర్యమ్. రూ-అచ్చెరువు అచ్చెరుపాటు-అచ్చెరువుపాటు.1.ఆశ్చర్యము. కృ.శకుం.౨-౧౭౯: చూ ,వింత. 1; విశే. 2. ఆశ్చర్యకరము: చూ, వింత 1-౧.

అచ్చెరుపడు, వై. అ. క్రి. రూ-అచ్చెరువడు. నిర్వ. ౧౧-౧౫౬; భార. ఉ. 3-౧౧: చూ, వెఱఁగొందు.

అచ్చెరువడు: చూ, రూ-అచ్చెరుపడు:

అచ్చెరుపాటు, వై. వి. రూ-అచ్చెరువాటు-అచ్చెరువుపాటు: చూ, వింత. 1. భార. శాం. ౩-౪౪౬.

అచ్చెరువాటు, వై. వి. —పై.—

అచ్చెరువు, వై. వి. రూ-అచ్చెర్వు. 1: చూ, రూ - అచ్చరువు. ఉ. రా. ౪-౩౨౯; విశే. 2. ఆశ్చర్యకరము. భీమ.౧-౭౨; అహ. ౧-౧౦౨: చూ, వింత. 1-౧.

అచ్చెర్వు,—పై.—

అచ్చెరువుపడు, వై. అ. క్రి: చూ, రూ-అచ్చెరుపడు.

అచ్చెరువుపాటు, వై. వి: చూ, రూ-అచ్చెరుపాటు. భార. భీష్మ. ౨-౩౩.

అచ్చోటు, దే. వి. ఏ. (ఆ+చోటు) రూ-అచ్చోటు. 1. ఆస్థానము. భార. ద్రో. ౨-౨౫౧; ఆము. ౪-౧౪౫: చూ, రూ-ఆచోటు; 2. ఆఁడుగుఱి. హరి. ఉ. ౯-౪౨: చూ, భగము. 12.

అచ్చొత్తు, ద్వా. స. క్రి. (అచ్చు+ఒత్తు): చూ, ముద్రించు. బస. పు. ౫-౩౧. హరి. ఉ. ౭-౯౩.

అచ్చో, దే. క్రి. 1: చూ, రూ-అచట; మనుచ. 3-౩; 2. ఆ కాలమున. దశా. ౧-౩౦౧: చూ, రూ-అచ్చోటు. 3.

అచ్చోటికి, దే. అవ్య. 1: చూ, అందులకు; వా. 2. రహస్యస్థలమునకు.

అచ్చోటు, దే. వి. ఏ. 1: చూ, రూ-అచ్చోటు. 1. శుక. ౧-౧౦౬; 2: చూ, రూ-అచ్చోటు. 2; 3. ఆ కాలమున: చూ, రూ-అచ్చో- 2.

అచ్ఛంకారము, సం. వి. అ. న. = అచ్ఛకారము: చూ, అచ్ఛకారము.

అచ్ఛత, సం. వి. అ. న. అచ్చుపాటు: చూ, స్పష్టత.

అచ్ఛదనుఁడు, సం. వి. అ. పు. యతి: చూ, సన్న్యాసి. 1.

అచ్ఛపింద, సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరము*: చూ, మధుఖర్జూరిక. 1-౩.

అచ్ఛఫల్లము, సం. వి. అ. పు. రూ-అచ్ఛభల్లము: చూ, వెలుఁగుబంటి.

అచ్ఛభల్లము, —పై.—

అచ్ఛము, సం. వి. అ. పు. 1. —పై.—; 2. పటికపుఱాయి: చూ, రత్నములు. 1-౧౨-(3); 3. వై. వి. = అచ్ఛన: చూ, బాలక్రీడ; విశే. 4. అచ్చు, తెల్లనిది: చూ, వర్ణము. 5-(౧); 5. ఇంపితము: చూ, హృద్యము. 2; 6. అచ్ఛము: చూ, సమీచీనము. 2.

అచ్ఛాచ్ఛము, సం. విశే. మిక్కిలి స్వచ్ఛము: చూ, సమీచీనము. 2.

అచ్ఛావాకుఁడు, సం. వి. అ. పు. సోమయాగమందు శంసన కర్తయై హోతకు సహకారిగానుండు ఋత్విజుఁడు. పదియార్వురు ఋత్విజులు యాజికులు అనువారలలో నొకఁడు: చూ, ఋత్విజులు.

అచ్ఛిద్ర, సం. వి. ఆ. స్త్రీ. చేఁతిబీఱ*: చూ, హ్రస్వగవేధుక.

అచ్ఛిద్రము, సం. విశే. 1. రంధ్రములులేనిది; 2. దృఢమై

నది: చూ, ఔడిదము. 5; 3. యజుర్వేదమునందలి పరాయితన్నలో మూఁడవ అట్టమునందుఁగల ఒకపన్నము: చూ, వేదము. 1-౨౧; 4. లోపము లేనిది: చూ, సంపూర్ణము; 5. ప్రాయశ్చిత్తము సంపూర్ణమైనదనుట.

అచ్ఛిన్నపత్రము, సం. వి. అ. పు. బరివెంక*: చూ, శాఖోటి.

అచ్ఛిన్నము, సం. విణ. 1. ఎడతెగనిది: చూ, సాంద్రము. ౪; 2. ఛేదింపఁబడనిది: చూ, విచ్ఛిన్నము. 3. ౮; 3. తొలగింపఁబడనిది: చూ, హీనము. 3-౫; 5. అనవరతము: చూ, సంతతము. 2.

అచ్ఛీకృతము, సం. విణ. నిర్మలముగాఁ జేయఁబడినది: చూ, నిర్మలము. ౩.

అచ్ఛేద్యము, సం. విణ. 1. చొరరానిది: చూ, సాంద్రము. 2; 2. ఛేదింపశక్యముగానిది: చూ, విచ్ఛిన్నము. ౩-౮; 3. ఛేదింపఁదగనిది: చూ, విచ్ఛిన్నము. ౩-౯.

అచ్ఛోదము, సం. వి. అ. పు. 1. కుబేరుని క్రీడాసరస్సు: చూ, సరస్సు. 1; విణ. 2. నిర్మలమైన నీళ్ళుగలది: చూ, సలిలము. 1-౪౪.

అచ్యుతము, సం. విణ. 1. జాఱనిది, పడనిది: చూ, స్ఖలనము. 2-౪; 2. నాశములేనిది: చూ, స్థిరము. ౪; 3. భ్రమము కానిది: చూ, విభ్రమము. 1-౧; 4. కారనిది: చూ, స్రవము. 1-౫.

అచ్యుతవాసము, సం. వి. అ. పు. రావి*: చూ, శ్యామలము .2.

అచ్యుతాగ్రజుఁడు, సం. వి. అ. పు: చూ, బలరాముఁడు.

అచ్యుతాయనమః, అం. అన్నియు నశించినను తాను నశింపని వస్తువుకొఱకు నమస్కారము: చూ, ఓమ్. 4-౨౦.

అచ్యుతుఁడు, సం. వి. అ. పు. 1: చూ, విష్ణువు. 1; 2. శనిగ్రహము: చూ, శని; 3: చూ, శివుఁడు. 1.

అజ, సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి: చూ, మాయ. 1; 2. ఆఁడుమేక: చూ, మేషము. 1-౧.

అజంభము, సం. వి. అ పు. 1. కప్ప: చూ, హరి. 12; విణ. 2. పండ్లులేనిది, దంతములులేనిది: చూ; పల్లు. 1-౫.

అజంభుఁడు, సం. వి. అ. పు. 1. రవి: చూ; సూర్యుఁడు.

అజక, సం. వి. ఆ. స్త్రీ. అజకాజాతము అను ఒకానొక కంటి రోగము: చూ, లోచనము. 1-౧౩:

అజకర్ణము, సం. వి. అ. పు. 1. నల్లమద్ది*: చూ, సాలము. ౩-౨; 2. వేఁగిస*: చూ, సర్జకము. 2; 3. మిరియము*: చూ, వేల్లజము.

అజకవము, సం. వి. అ. న. 1. రూ-అజకావము-అజగావము-అజగవము-ఆజగవము-అజీగవము-అజీగావము. శివునివిల్లు, పినాకము: చూ, బాణము. 1-౩౪; పు. 2. అజగంధ*: చూ, వాయింట.

అజకాజాతము, సం. వి. అ. పు: చూ, అజక.

అజకావము, సం. వి. అ. న. 1: చూ, రూ-అజకవము. 1; పు. 2. శివునియెద్దు: చూ, వృషభము. 1-౩౧.

అజగంధ, సం. వి. ఆ. స్త్రీ: చూ, అజకవము. 2. *.

అజగంధిక, —పై.—

అజగంధిని, ఈ. స్త్రీ. —పై.—

అజగరన్యాయము, న్యా. కొండచిలువ నిద్రఁబోవుచున్నట్లేయుండి జంతువులను అకాత్తుగా మ్రింగినరీతి. (కొండచిలువ స్థూల శరీరముగుటఁ గదలక మెదలక యొక్కచోఁబడియుండును. చలనము లేమి దానినిఁ గాష్ఠప్రాయముగాఁ దలఁచి దగ్గఱకు జంతువులురాఁగా వానిఁబట్టి భక్షించును.)

అజగరము, సం. వి. అ. పు. (మేఁకను మ్రింగునది) కొండచిలువ: చూ, సర్పము. 1-౨౦.

అజగరి, సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యోషధి.

అజగరోపవాసము, జా. కొండచిలువయుపవాసము చేయుట: చూ, ఘోటకబ్రహ్మచర్యము.

అజగర్దము, సం. వి. అ. పు. 1. నీరుపాము: చూ, సర్పము. 1-౨౩; 2. నల్లత్రాఁచు: చూ, సర్పము. 1-౨.

అజగలుఁడు, సం. వి. అ. పు. జూదరి: చూ, హారకుఁడు. 2.

అజగల్లిక, సం. వి. ఆ. స్త్రీ. శిశురోగవిశేషము: చూ, రోగము. 1-౪౦.

అజగవము, సం. వి. అ. న: చూ, రూ-అజకవము. 1.

అజకుఁడు, సం. వి. అ. పు. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

అజఘన్యుఁడు, అం: చూ, ఆదిత్యులు.

అజజీవికుఁడు, సం. వి. అ. పు. మేఁకలవలన బ్రదుకువాఁడు. రూ-అజజీవుఁడు-అజాజీవుఁడు: చూ, మేఁకలఁగాఁపరి.

అజజీవుఁడు, —పై.—

అజట, సం. వి. ఆ. స్త్రీ. 1. రూ - అజ్ఝట. నేలయుసిరిక*: చూ, శివ. 4; 2. దూలగొండి*: చూ, శూకశింబి; 3. ఎలుకచెవి*: చూ, స్ఫోటశోఫ. 1-౧.

అజత, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, అజట. 1.*; 2: చూ, అజట. 2.*; 3: చూ, అజట. *3.

అజధ్య, సం. వి, ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల: చూ, హరిణి. 5; 2. మేఁకలమంద: చూ, మేషము. 1-౨.

అజన్మము, సం. వి. న్. పు. 1. జన్మములేమి: చూ, మోక్షము. 1; విణ. (న్. న్. ఆ. న్.) 2. జన్మములేనిది: చూ, సంభవము. 1-౩.

అజన్యము, సం. వి. అ. న. 1: చూ, యూ-అజన్యము; విణ. 2. పుట్టనిది: చూ, సంభవము. 1-౩; 3. పుట్టింపఁదగనిది: చూ, సంభవము. 1-౪; 4. జనులకు హితముకానిది: చూ, హితము. 4-౧; 5. నిందకానిది: చూ, ఉపదూషితము. 2.

అజప, సం. వి. ఆ. స్త్రీ. 1. ఉచ్ఛ్వాస నిశ్వాసముల చేతనే అక్షరములను పుట్టించుట అనఁగా బలికించునట్టి మంత్రము. (అజపాగాయత్రి. ఇదియే "హంసః" అనుమంత్రము. కాశీ. ౫-౨౪౪): చూ, మంత్రము. 1-౧౩; 2. సగము మగపోలికయు సగము ఆఁడుపోలికయుఁ గలరూపము.

అజపథము, సం. వి. అ. పు. 1: మేఁకల త్రోవ: చూ, మార్గము. 1-౨౯; 2. ఆకాశమునందలి ఛాయాపథవిశేషము (ఇది మొదలుకొని అగస్త్యాశ్రమము వఱకు పితృయానపథము): చూ, మార్గము. 1-౩౦.

అజపాదము, అం. రూ - అజైకపాత్తు. పూర్వాభాద్ర: చూ, రిక్క. 1-౨౬.

అజపాదుఁడు, అం: చూ, రుద్రులు.

అజపుఁడు, సం. వి. అ. పు. 1. వైదికములుకాని గ్రంథములఁ

జమవువాఁడు, కుపాతకుఁడు, మంత్రములు క్రమముగాఁ జమవనివాఁడు: చూ, పాతకుడు. 1-౧; 2: చూ, మేకలఁ గాపరి.

అజభక్షము, సం. వి. అ. పు. 1. బొబ్బిలి*: చూ, విట్టచిరము; 2. వర్వరి*: చూ, అజగంధ.

అజమారము, సం. వి. అ. పు. అజ్మీరు అను దేశము: చూ, సీమ. 1-౪౦.

అజమారుఁడు, సం వి. అ. పు. 1. కటికివాఁడు: చూ, సంహారకుఁడు.

అజమీఢము, సం: చూ, అజమారము.

అజమీఢుఁడు, సం.వి.అ.పు. ధర్మరాజు: చూ, యుధిష్ఠిరుఁడు.

అజమేరుఁడు, సం. వి. అ. పు. పాతాళలోకములోని సర్ప వనమునం దుండు శివుఁడు: చూ, శివుఁడు. 1-౨.

అజము, సం. వి. అ. పు. 1. మేఁకపోతు: చూ, మేషము. 1; 2. మూఁడేండ్ల క్రిందటివడ్లు: చూ, ధాన్యము. 1-౩౪; 3. ఆత్మ. చూ, హంసుఁడు. 1; 4. ఆకాశము: చూ, సుర వర్త్మము. 1; 5. గొఱ్ఱెపోఁతు: చూ, మేషము. 1-౮; 6. మాక్షికధాతువు: చూ, సారఘము. 1-౧-(౧); 7. మేష రాశి: చూ, రాసులు. ౧; విణ. 8. ఉత్పత్తిలేనిది (లేక) జన్మములేనిది: చూ, సంభవము. 1-౩.

అజముఖుఁడు, సం. వి. అ. పు. గొఱ్ఱెతల తలగా నమర్పఁ బడినవాఁడు: చూ, దక్షప్రజాపతి.

అజమోద, సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-అజామోదము, ఒకానొక రకము ఓమము: చూ, యవాని. 1; 2. బూరుగుబంక: చూ, శాల్మలీవేష్టము.

అజమోదిక, —పై.—

అజయ, సం వి. ఆ. స్త్రీ. 1. గంజాయి*: చూ, బంగి. 1; 2. దుర్గాదేవి చెలికత్తెలలో నొకతె: చూ, పార్వతి. 1-3; 3. అజ, మాయము: చూ, మాయ. 1; 4. తీఁగెగఱిక*: చూ, తృణము. ౧-౨౨.

అజయము, సం. వి. అ. పు. రూ-అపజయము: చూ, వీఁక. 7.

అజయుఁడు, సం. వి. అ. పు. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3. ఒకానొక సంస్కృత నిఘంటుకర్త; విణ. 4. గెలుపులేనివాఁడు: చూ, విముక్తుఁడు.

అజయ్యము, సం. విణ. జయింపశక్యముఁగానిది.

అజర, సం. వి. ఆ. స్త్రీ. 1. కలబంద*: చూ, గృహకన్య; 2. బొద్ది*: చూ, శ్యామము. 7; 3. బల్లి: చూ, హాలా హలము.

అజరము, సం. వి. అ. న. 1. పరమాత్మ: చూ, హంసుఁడు; పు. 2. బొద్ది*: చూ, అజర. 2; విణ. 3. ముదిమిలేనిది: చూ, యౌవనభేదములు; 4. క్షీణింపనిది: చూ, శాశ్వతము. 1.

అజరుఁడు, సం. వి. అ. పు. ముదిమిలేనివాఁడు, దేవత: చూ, వేలుపు. 1.

అజర్యము, సం. వి. అ. న. 1. చెలిమి: చూ, స్నేహము. 1; విణ. 2. క్షీణింపనిది: చూ, శాశ్వతము. 1. (మైత్రీవాచకము నకు విశేషణమైనప్పుడే యీ రూపము సిద్ధించును. ఇతర స్థలములయందు ఋకారాంతమునకు "అజరిత" అగును.)

అజలంబనము, సం. వి. అ. న. సౌవీరాంజనము (సుర్మా) సౌవీరము. 2.

అజలోమ, సం. వి. ఆ. స్త్రీ: చూ, అగ్రపర్ణి*.

అజలోమము, సం. వి. న్. పు. 1. దూలగొండి*: చూ, శూకశింబి; 2. మేఁకవెంట్రుక: చూ, వెంట్రుక. 1-౨౪.

అజవాహనము, సం. వి. అ. పు. తెలిపిట్ట: చూ, హంస. 1.

అజవీథి, సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. మేఁకలత్రోవ: చూ, మార్గము. 1-౨౫; 2. ఆకాశమునందలి ఛాయాపథవిశేషము: చూ, మార్గము. 1-౩౦. (ఇదిమొదలుకొని అగస్త్య స్థానమువఱకు పితృయానపథము)

అజశృంగి, సం. వి. ఈ. స్త్రీ. జుట్టుపు: చూ, విషాణి 2: చూ, వద్ది*.

అజస్రము, సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు: చూ, సంతతము. 2.

అజహ, సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి*: చూ, శూకశింబి.

అజహత్, అం: చూ, లక్షణలు.

అజహ్మము, సం. విణ. రూ-అజిహ్మము. ఋజువు: చూ, హృద్యము. 2-౪.

అజాంత్రి, సం. వి. ఈ. స్త్రీ: చూ, నీలబుహ్నా*.

అజాకృపాణీయన్యాయము, న్యా. మేఁకవచ్చినది. హఠాత్తుగా మెడపైఁగత్తియునుబడినది. అతర్కితోపనతమగు కీడును గూర్చి తెలుపుటకు దీనినుపయోగింతురు. (తత్సమచంద్రిక.)

అజాగవము, సం. వి. అ. న: చూ, రూ-అజగవము.

అజాగళస్తనన్యాయము, న్యా. మేఁక మెడక్రింద స్తనముల పుట్టుక నిష్ప్రయోజనము.

అజాగళస్తనము, సం. వి. అ. పు. బ. మేఁకమెడక్రిందిచన్నులు: చూ, స్తనము. 1-౧౦.

అజాగ్రత, సం. వి. ఆ. స్త్రీ. రూ-అజాగ్రత్త, జాగ్రత్తలేమి.

అజాగ్రత్త, —పై.—

అజాజి, సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.

అజాజీవి, సం. వి. ఇ. పు. రూ-అజాజీవుఁడు: చూ, మేఁకలఁ గాఁపరి.

అజాజీవుఁడు, సం. వి. అ. పు. 1. —పై.—; 2: చూ, గొంగళ్ళు నేయువాఁడు.

అజాతశత్రువు, సం. వి. ఉ. పు. 1: చూ, అజమీఢుఁడు; విణ. 2. శత్రువులు లేనివాఁడు.

అజాతస్మరాలింగనము, అం: చూ, ఆలింగనములు. 2.

అజాతస్మరాలింగనములు, అం: చూ, ఆలింగనములు. 2-౧.

అజామోద, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-అజమోద. 1-*.

అజాపత్య, సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మపట్టణము: చూ, దేశము. 1-౧౪.

అజాపుత్రనామోత్కీర్తన, న్యాయము. న్యా. పుట్టని బిడ్డలకుఁ బేరుపెట్టినరీతి.

అజామోదము, సం. వి. అ. పు: చూ, రూ-అజమోద. 1*.

అజాయువు, సం. వి. ఉ. పు. ఒకరకముమందు: చూ, మందు. 1.

అజావయుక్కు, సం. వి. క్. పు. బాణమునకుఁ జిక్కని మృగము; చూ, విషమము. 2.

అజితము, సం. విణ. 1. అడ్డగింప నశక్యమైనది; అం. 2: చూ, ఆగమములు.

అజితుఁడు, సం. వి. అ. పు. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. నలువ: చూ, బ్రహ్మ. 1; 3. ముక్కంటి: చూ, శివుఁడు. 1; విణ. 4: చూ, అపరాజితుఁడు.

అజినపత్ర, సం. వి. ఆ. స్త్రీ. జివురుపిట్ట: చూ, చీకుపువాయి.

అజినము, సం. వి. అ. న. రూ-ఆజినము. చర్మము: చూ, బెరడు. 1.

అజినయోని, సం. వి. ఇ. పు. స్త్రీ. జింక: చూ, హరిణము. 1.

అజిరము, సం. వి. అ. న. 1. అంగణము: చూ, ముంగిలి. 2; 2. కప్ప: చూ, హరి. 12; 3. గాలి: చూ, వాయువు. 1; 4. దేహము: చూ, శరీరము. 1; 5. శబ్దాదివిషయము; 6. తెప్ప: చూ, హోడము; 7: చూ, వట్టివేరు*.

అజిహ్మగము, సం. వి. అ. పు. అమ్ము: చూ, బాణము. 1.

అజిహ్మము, సం. వి. అ. పు. 1. కప్ప: చూ, అజిరము. 2; విణ. 2: చూ, రూ-అజిహ్మగము.

అజిహ్వము, సం. వి: అ. పు. 1. కప్ప: చూ, రూ-అజిహ్మము. 1; విణ. 2. నాలుకలేనిది.

అజీగవము, సం. వి. అ. న: చూ, రూ-అజకవము.

అజీగావము, —పై.—

అజీర్ణము, సం. వి. అ. న. 1. అజీర్తి: చూ, రోగము. 1-౨; విణ. 2. జీర్ణముకానిది.

అజీర్తి, సం. వి. ఇ. న: చూ, అజీర్ణము. 1.

అజీవుఁడు, సం. వి. అ. పు. జీవుఁడులేఁడను మతము నేర్పరచినవాఁడు.

అజుఁడు, సం. వి. అ. పు. 1: చూ, అజితుఁడు. 1; 2: చూ, అజితుఁడు, 2; 3: చూ, అజితుఁడు. 3; 4. దశరథుని తండ్రి: చూ, రాజు. 1; 5: చూ, మన్మథుఁడు; 6. మూర్ఖుఁడు: చూ, స్తబ్ధుఁడు.

అజుష్టము, సం. విణ. సేవింపఁబడినది: చూ, ఆసేవితము.

అజైకపాత్తు, సం. వి. ద్. పు. 1. పూర్వాప్రోష్ఠపదానక్షత్ర దేవత: చూ, వేలుపు. 1-౬; స్త్రీ. 2: చూ, అజపాదము; అం. 3: చూ, రుద్రులు.

అజౌఘము, సం. విణ. మేఁకలమంద: చూ, మేషము. 1-౨.

అజ్జుక, సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు వేశ్య: చూ, రూ-అర్జుక.

అజ్ఝట, సం. వి ఆ. స్త్రీ. నేలయుసిరిక*: చూ, శివ. 4.

అజ్ఝటాఫల, సం. వి. ఆ. స్త్రీ. గురివెంద*: చూ, శ్వేతపాకి.

అజ్ఝల, సం. వి. ఆ. స్త్రీ. బొగ్గు: చూ, వహ్ని. 1-౨౯.

అజ్ఞత, సం. వి. ఆ. స్త్రీ. తెలివిలేనితనము: చూ, స్వాపము. 3.

అజ్ఞత్వము, సం. వి. అ. న. —పై.—

అజ్ఞాతవాసము, వా. సం. తన పేరు ఊరు ఇతరులకు తెలియనియ్యక మాఱుపేరుతో దాఁగియుండుట.

అజ్ఞానదాయకములు, అం: క్రోధము, హింస, అభోజ్యభోజనము, అసత్యవాదము, అసత్ప్రలాపము, పరనారీపరత్వము, శఠత్వము, అనాచారము, అకార్యకరణము. (౯).

అజ్ఞానము, సం. వి. అ. న. 1: చూ, అజ్ఞత; అం. 2: చూ, హేయగుణములు.

అజ్ఞాని, అజ్ఞుఁడు, } సం. విణ: చూ, అజుఁడు. 6.

అజబాజురేటు, వా. వి. సరిహద్దు ధర.

అజాఅంబారా, వా. విణ. రూ-అజాఅంవారా; అంతులేనిది, దిక్కు మొక్కులేనిది.

అజాపజా, —పై.—

అజారము, దే. వి. రూ - హజారము-హజాఅము-హాజారము-హాజాఅము. 1.నగరితలవాకిలిచావడి: చూ, రూ-హజారము; 2. ఆస్థానమండపము. రా, వి. 2, ఆ. ౩౯: చూ, సభ.2.

అజ్జ, దే. వి. 1. కాలుచాఁచిపెట్టిన యడుగు: చూ, రూ-హజ్జ. 1; 2. అదను. "అజ్జపాటించి మదివెఱపుజ్జగించి" భార. శల్య. ౧, ఆ: చూ, సమయము. 1; వై. అవ్య. 3. ఆశీ. రూ-అజ్జా-అజ్ఝారె-అజ్జారే-అజ్ఝా - అజ్ఝారె - అజ్ఝారే. "ద్వి. అజ్జగాఁ దిలకంబు హవణించి నుదుట". (అజ్జగా-అజ్జయను శబ్దము పుట్టఁగా ఆశీయనఁగా ననుట. భ.రా.పు. చరిత్రము: చూ, సేబాసు; వి. 4. నైపుణ్యము: చూ, సమర్థనము. 1.

అజ్జము, వై. వి. = అధ్యాయము. 1. అనువాకము, కొన్ని పనసలుగల వేదభాగము. పాంచా. ౪-౧౨౫: చూ, వేదము. 1-౧౫-(3); 2. గ్రంథభాగవిశేషము: చూ, సంపుటము. 3-౧౦.

అజ్జరె, ద్వ, అవ్య, (అజ్జ+రె) అజ్జరే: చూ, అజ్జ. 3.

అజ్జరే, —పై.—

అజ్జవాలు, ద్వ. వి. కోడి, చరణాయుధము: చూ, పుంజు.

అజ్జాంబారా, వా. వి: చూ, రూ-అజాఅంబారా.

అజ్జారె, ద్వ. అవ్య. (అజ్జా+రె) రూ-అజ్జారే: చూ, అజ్జ. 3.

అజ్జారే, —పై.—

అజ్ఝా, మి. అవ్య. —పై.—

అజ్ఝారె, —పై.—

అజ్ఝారే, —పై.—

అట, దే. వి. ఏ. 1. అక్కడ "క. అంత నట నక్కుమారుం డెంతయు." సిర్వ. ౨. ఆ. (అట ఇట శబ్దములకు వృత్తియందు అంత ఇంత అను నర్థము కలుగుచున్నది. అట మున్ను అంతకుముందు. ఇటమున్ను ఇంతకుముందు): చూ, తత్ర; ద్ర. 2. అవుల. అవల. "అవల హేమకూటంబును నట నిషధంబు నొప్పు" భార.భీష్మ. ౧. ఆ: చూ, రోధస్సు; అం. 3. రూ-ఆట: చూ, అటతాళము.

అటక, దే. వి. రూ-అటుక-అట్టుక-అట్టువ-నట్టుక, మనెల (చిట్టి అటక అనియు పెద్దమిద్దెక్రింది చిన్నమిద్దె అనియు వాడుక): చూ, సదనము. 1-౫.

అటకమామిడి, దే. వి. రూ-అటికమామిడి. మండలచ్ఛదము*: చూ, మామిడి. 1-౩

అటకలి, దే వి. నూనెజిడ్డును పోఁగొట్టెడివస్తువు, ఉత్పాదనము: చూ, వలుఁగుఁబిండి.

అటకాఁవు, వా. వి. అడ్డము: చూ, సంరోధము.

అటకాయించు, వా. స. క్రి. అడ్డగించు

అటకావు, వా. వి: చూ, రూ-అటకాఁవు.

అటట్య, సం. వి. ఆ. స్త్రీ. రూ-అటాట్య. భిక్షలోనగువాని కొఱకు తిరుగుట: చూ, సంచారము. 1-౪.

అటతాళము, సం. వి.అ.పు. తాళభేదము-(౧౪ అక్షరకాలము): అట-అట. (వా. అటతాళము): చూ, తాళము. 1-౮:(చూ, సూచకములు: చూ, స్వరము. 2-౧౪౧-(౨).)
అటని, సం. వి. ఇ, ఈ. స్త్రీ. కోటి: చూ, వింటి కొప్పు.
అటమట, దే. వి. 1. మఱుఁగుమాట: చూ, శబ్దము. 2-౫; 2. దుఃఖము: చూ, శోకము. 1-౧; 3. మోసము: చూ, వంచన; విశే. 4. రూ-అటమటము. నిరుపయోగము: చూ, వ్యర్థము. 1; 5. కల్ల: చూ, వితథము.
అటమటకాఁడు, దే. విశే. రూ - అటమటీఁడు: చూ, వంచకుఁడు. 1.
అటమటము, దే. విశే. 1: చూ, రూ-అటమట. 4; 2. చూ, రూ-అటమట. 5.
అటమటించు, దే. అ. క్రి. 1. కదలు. స్వా. ౫-౧౦౧: చూ, సలించు; స. క్రి. 2: చూ, వంచించు; 3. దొంగిలించు. వి. పు. 6-౩౦౫: చూ, సడపు.
అటమటింపు, దే. వి. 1. చలనము: చూ, లోలము. 1; 2. మోసము: చూ, అటమట. 3; 3. వ్యథ: చూ, అటమట. 2; 4. దొంగతనము: చూ, హరణము. 1.
అటమటీఁడు, దే. విశే. (అటమట+ఈఁడు) మోసకాఁడు. ఉ. హరి. 3. ఆ: చూ, రూ-అటమటకాఁడు.
అటమర, దే. వి. 1: చూ, రూ-అటమటము. 2; 2. యుద్ధము వలనఁబాఱుట: చూ, సంద్రావము.
అటమరింపు, దే. వి: చూ, అటమర. 2.
అటమున్ను, దే. అవ్య. అంతకుముందు.
అటరుషము, సం. వి. అ. పు. = అడ్డసరము. రూ - అటరూషము*: చూ, వైద్యమాత.
అటరూషము, —పై.—
అటవి, సం. వి. ఈ. స్త్రీ. = అడవి: చూ, విపినము.
అటాట్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-అటట్య.
అటి, దే. విశే. అటువంటి. స్వా. 3-౭౪: చూ, రూ-అట్టి.
అటిక, దే. వి. రూ-అట్టిక. ఎసల, చట్టి: చూ, పాత్రము. 6-౨.
అటికమామిడి, వా. వి: చూ, రూ-అటకమామిడి*.
అటికము, సం. వి. అ. పు. బకపుష్పము*: చూ, శ్రీవల్లి.
అటు, దే. అవ్య. రూ-అటులన్ - అటులు - అట్టు - అట్టులన్ - అట్టులు. అలాగు. కళా. ౧-౮౩: చూ, తథా. 2.
అటుక, దే. వి: చూ, రూ-అటక.
అటుకులు, దే. వి. బ. రూ-అడుకులు: చూ, సాదము. (౧)-౪౮.
అటుగాన, దే. క్రి. హేత్వర్థకము: చూ, హేతువు 1-(౧).
అటుమొన్న, వా. వి. ఆవలిమొన్న. మొన్నటికి పూర్వదినము: చూ, రోజు. 1-౬.
అటులన్, దే. క్రి. రూ-అట్టులన్: చూ, రూ-అటు.
అటులు, దే. అవ్య: చూ, రూ-అటు.
అటువంటి, దే. విశే. అవ్య. —పై.—విపు. ౭-౩౬౦.
అటువలె, దే. అవ్య.—పై.—
అటువోలె, వా. అవ్య.—పై.—
అటె, దే. అవ్య. రూ-అటే-అట్టె-అట్టే. 1. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; 2. దుఃఖార్థకము: చూ, శోకము. 1-౧౪; 3. సంశయార్థకము: చూ, సంశయము. 1.

అటే, —పై.—
అటో, —పై.—
అటో. —పై.—
అట్ట, దే. వి. 1. చర్మము: చూ, బెరడు. 1-౩; వా. 2. తల తెగిన శరీరము: చూ, మొండెము; 3. మృగచర్మము: చూ, బెరడు. 1-౧౨; 4. చెప్పులకొలకుఁ బిక్కఁబడువఁబడిన చర్మఖండము. పట్టెడ: చూ, బెరడు. 1-౮; 5. అత్తడము: చూ, కాకితపుఅట్ట.
అట్టచెమ్మ, వ్యా. వి. నాలుగు గవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొక బాలికల ఆట: చూ, బాలక్రీడ.
అట్టడి, వై. వి.= అట్టః. రూ-అట్టెడి. అట్టము. యుద్ధార్థము వాకిటి మంటపముమీఁదఁగాని కొత్తడముమీఁదఁగాని యేర్పఱచినగడి: చూ, సదనము. 1-౭.
అట్టము, సం. వి. అ. పు. 1. = అట్టడి.—పై.—; 2. మేడ; చూ, సదనము. 1-౧. (అట్టహాసమని కొందఱు); 3. అతిశయము. చూ, హేరాళము. 4: చూ, వంటచెఱకు; 5. ప్రవాహము: చూ, వెల్లువ; 6. అన్నము: చూ, సాదము. (1); 7. తొడవు: చూ, భూషణము. 2; వై. వి. (1)=అష్టకమ్. రూ-మి. అట్టము. వేదభాగము; (2)=అట్టము. అట్టడి: చూ, అట్టము. 1. (వైకృతము అని కొందఱు.)
అట్టయోధి, సం. వి. ఇ. పు. ఒక రకము పక్షి: చూ, పక్షి.
అట్టశాల, సం. వి. ఆ. స్త్రీ. = అడసాల. పాకస్థానము: చూ, సదనము. 1-(౪౭).
అట్టహాసకము, సం. వి. అ. పు. కుంద*: చూ, కూటపుష్పము.
అట్టహాసము, సం. వి. అ. పు. 1. వీరరౌద్రరసములవలనఁ బుట్టెడి పెద్దనవ్వు: చూ, హాస్యము. 1-౭; 2: చూ, అట్టము. 3.
అట్టాలకము, సం. వి. అ. పు. 1. = అట్టడి: చూ, అట్టడి; 2. మేడ: చూ, అట్టము.
అట్టి, దే. విశే: చూ, రూ-అటి.
అట్టిఁడు, దే. విశే. (అట్టి+వాఁడు) రూ-అట్టివాఁడు-అట్టీఁడు, అటువంటివాఁడు.
అట్టిక, దే. వి: చూ, రూ-అటుక.
అట్టియ, దే. వి. గుంపు: చూ, సమూహము. 1.
అట్టు, దే. వి. 1. అప్పచ్చి: చూ, భక్ష్యము. 1-౪; అవ్య. 2: చూ, రూ-అటు; వా. 3. తట్టు, దెబ్బ: చూ, హతి. 1.
అట్టుక, దే. వి: చూ, రూ-అటక:
అట్టుపుట్టానవాలు, వా.వి. తొల్లింటికత: చూ, సమాచారము. 2.
అట్టుప్పు, దే. వి. (అట్టు+ఉప్పు) పాక్యమను లవణము: చూ, రూ-అంటుప్పు.
అట్టుల, దే. క్రి: చూ, రూ-అటుల.
అట్టులు, దే. వి: చూ, రూ-అటులు.
అట్టువ, దే. వి: చూ, రూ-అటక.
అట్టువోలె, దే. క్రి. (అట్టు+పోలె): చూ, రూ-అటువోలె.
అట్టె. దే. అవ్య: చూ, రూ-అటె.
అట్టెడ, దే. వి. 1. కవవులోనగునవికోయువారు దానినుంచుకొనుటకై పిఱుఁదులమీఁద జాఱఁగట్టుకొనెడి సంచి: చూ, సంచి, 1-౭; 2. అధకమితగోణి. తూమెఁడు గింజలు

పట్టెపి గోనె: చూ, సంచి. 1-౬; 3. వంతెన: చూ, సేతువు. 1-౫; 4. ఈఁతబ్రద్దలులోనగు వానితో అల్లినతట్ట: చూ, సజ్జ. 1; 5. కాయధాన్యముల యందలి మంటి గడ్డలు మొద లగువాని వెలువరించుటకుఁ గట్టిన గోఁగుకట్టెలు లోనగు వాని మోఁపు; 6. నెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడ వంటి తడిక.

అట్టె, దే. అవ్య: చూ, రూ-అటె.

అట్లతద్దె, వా. వి. ఆశ్వయుజబహుళ తదియనాఁడు బాలికలు తమ భర్త చిరాయువగుటకు భక్తిగలిగి అట్లతో నోచుకొను మహాలక్ష్మీవ్రతము, అట్లనోము, తద్దె: చూ, సంబరము 1-౯: (చూ, ఉండ్రాళ్ళతద్దె)

అట్లనోము, వా. వి. —పై.—

అట్లాం (త్లాం) టి(తి)క్కు మహాసముద్రము, ఆం: చూ, సము ద్రము. 1-౪.

అట్లాగు, వా. అవ్య: చూ, అటు.

అట్లు, దే. అవ్య. —పై.—

అట్లుపుకుట, జా. 1. కల్లోలమును బొందుట; వా. 2. పెన ముపై అట్టువేగుట.

అట్లుడికినట్లుపుకుట, జా. అట్లవలె విశేషముగ గుండెతల్లడిల్లుట.

అట్లొట్లు, దే. వి. బ. రూ-నట్లొట్లు. వాన వెలిసిన పిమ్మట చూరునుండిపడు నీరుబొట్లు: చూ, వంగుష్ఠ: (చూ, బొట్టు) 1-6-(౧).

అతాత్తు, వా. అవ్య: చూ, అకస్మాత్తు.

అడ, దే. వి. 1. పిండము. యయా. ౨. ఆ: చూ, సాదము (1)-౨౩; 2. ఆకృతి. స్వా. 3-౪౬: చూ, స్వరూపము. 1-౧; వా. 3. అంటలుగట్టిన తలవెంట్రుకల చిక్కు, అడ పము; వా. 4. జాడ: చూ, సూచన. 1.

అడంగు, వా. వి. 1. బయలుదేరిన మొదటి చోటు: చూ, స్థానము. 1-౪౪; బ. 2. గ్రామకరణముల మొదటి లెక్కల ఖాతము: చూ, సంపుటము. 3-౨౪.

అడఁకువ, దే. వి. రూ-అణఁకువ-అణుఁకువ. నమ్రత: చూ, వినయము. 1.

అడఁగారు, దే. అ. క్రి. రూ - అణఁగారు - అడఁగు: చూ, మ్రుక్కు. (౪).

అడఁగు, దే. అ. క్రి. 1. రూ-అణఁగు-అడఁగారు-అణఁగారు-అఁగు-అఱు. —పై.—, 2. తగ్గు: చూ, మ్రుక్కు. (9); 3. మెత్తఁబడు: చూ, 1-౧; 4. అస్తమించు: చూ, సమయు; 5. లోపడు: చూ, లోపించు. 1.

అడఁగుట, దే. వి. రూ-అణఁగుట: చూ, ఉపశాంతి. 1.

అడఁగుబొద్దు, దే.వి. బేలుదారి లోపల నణఁగియుంతునట్లు గోడ యంచులయందు గీఱ యేర్పఱచెడి బొద్దు: చూ, మొల త్రాడు. 2.

అడఁచు, దే. ప్రే. రూ-అణఁచు. అడఁగఁ జేయు (అను ప్రయుక్తమైన అడఁగు ధాతువునకును రూపము): చూ పిసుకు. ౩.

అడకట్టు, దే. అ. క్రి. రూ-అడ్డకట్టు: చూ; ముద్దకట్టు.

అడకత్తు, దే. వి. రూ-అడకత్తెర-అడకొత్తు-అకొత్తు, పోకొత్తు (పోఁకలు ఒత్తునది): చూ, శంకులు. 1.

అడకత్తెర, ద్వ. వి. —పై.—

అడకము, దె. విణ. లోపలనడఁగినది, తీలు: చూ, స్తబ్ధము.

అడకర, దే. విణ. ఓరిమి: చూ, శాంతము. 1.

అడకాయ, దే. వి. పోఁకకాయ: చూ, పోఁక. 1-౭.

అడకించు, దే. స. క్రి. 1. వెక్కిరించు: చూ, హసించు; 2: చూ, వంచించు. భో. ౬-౬.

అడకొత్తు, దే. వి. (అడకాయ+ఒత్తు): చూ, రూ-అడకత్తు.

అడగొను, దే. అ. క్రి: చూ, ముద్దకెట్టు.

అడగోలుకొను, దే. స. క్రి. రూ-ఒడగోలుకొను. అప హరించు. భో. ౬-౧౪: చూ, సడపు.

అడచిపాటు, దే. వి. వేగము: చూ, స్యదము.

అడజడి, దే. వి. 1. రూ-అలజడి. దుఃఖము: చూ, శోకము. 2; వా. 2. అడావిడి: చూ, సంభ్రమము. 1.

అడజడిపెట్టు, దే. స. క్రి: చూ, దుఃఖపెట్టు. మార్క. ౧-౧౯౯.

అడదడి, దే. వి. 1. దొరతనము: చూ, స్వారాజ్యము. 1-౧. (శ. ర); వా. 2: చూ, రూ-అడజడి. 2.

అడఁది, వై. వి. = హరిద్రా. రూ-అలఁది-అళఁది-అళిది-హాళఁది. పచ్చఁదనము: చూ, వర్ణము. 6-౭.

అడప, దే వి. 1. రూ-అడుప: చూ, పశురోగములు; 2. వక్క లాకుల తిత్తిగల అఁడుది: చూ, స్త్రీ. 1-౭౮.

అడపకత్తియ, ద్వ. వి. రూ-అడపకత్తె: చూ, అడప. 2.

అడపకత్తె, —పై.—

అడపకాఁడు, దే. వి. అడపముంచుకొని యుండువాఁడు.

అడపట్టె, వా. వి. రూ-అడ్డపట్టె. పొలములో విత్తనములువిత్తి మిట్టపల్లములు సమమగుటకై యెడ్లనుకట్టి త్రోలెడిమ్రాను: చూ, దిండు. 5.

అడపతడప, వా. వి. రూ-అడపదడప: ఎడపదడప: చూ, అప్పుడప్పుడు.

అడపదడప, —పై —

అడపము, దే. వి. 1. వక్కలాకులతిత్తి: చూ, రూ-హడ పము. 1; 2. మంగలితిత్తి: చూ, రూ-హడపము. 2; వా. 3: చూ, అడ. 3.

అడపొడ, దే. వి. 2. అడుగులగుఱుతు. కళా. 7-౪౪: చూ, లక్షణము. 1; వా. 2. జాడ: చూ, సూచన. 1.

అడబాల, వై. విణ. 1. బోనకాఁడు: చూ, సూపకారుఁడు; 2. పాచకి: చూ, వంటలక్క. 1.

అడమర, దే. వి. ముద్ద: చూ, సాదము. (1)—౨౩.

అదరించు, దే. ప్రే. బాణమును ప్రయోగించు. మార్క. 6-౨౧౦: చూ, వైచు. 3.

అడరు, దే. వి. 1. ఏపు. ఆధిక్యము. అచ్చ. రా. అర, కాం: చూ, హేరాళము. 1-౧; 2. ఆపద: చూ, విపత్తు; అ. క్రి. 3: చూ, సమ్మతించు. 4: చూ, వ్యాపించు. భార. కర్ణ. ౨. ఆ; 5: చూ, వర్ధిల్లు. రామా. ౧. ఆ. 6: చూ, విజృం భించు. వీర. ౪, ఆ; 7. అతిశయించు. భార. విరా. ౪. ఆ: చూ, సందడించు; 8. పూను. భో. ౪-౧౨౬: చూ, సమకట్టు. 2: 9. జన్మించు. భార. ఆర. ౬. ఆ: చూ, సంభవించు; 10. తొట్రుపడు: చూ, సంభ్రమించు; వా. 11. భయపడు: చూ, మ్రుక్కు. 1-(6).

అడరుచు, దే. ప్రే. రూ-అడర్చు: చూ, రూ-అదరించు.

అడరుదెంచు, దె. అ. క్రి. 1. అతిశయించు. మార్క. ౫, ఆ. 230: చూ, సందడించు; 2: చూ, సమ్మతించు; 3. అంతటను ప్రసరించు: చూ, వ్యాపించు; 4. పెరుఁగు: చూ, వర్ధిల్లు; ౫. చెలరేఁగు: చూ, విజృంభించు; 6. పూను: చూ, సమకట్టు. 2; 7. జన్మించు: చూ, సంభవించు; 8. తొట్రుపడు: చూ, సంభ్రమించు.

అడర్చు: చూ, రూ-అడరుచు. జై. ౭-౧౦.

అడలఁగొట్టు. దే. స. క్రి. 1. గద్దించు: చూ, వెఱపించు; వా. 2. గుండెదడ పుట్టించు. అడలించు.

అడలించు, —పై.—

అడలు, దే. వి. 1. చింత: చూ, విప్రతీసారము; 2. భయము: చూ, సాధ్వసము; 3. ఏడుపు: చూ, శోకము. 1; అ. క్రి. 4. ఏడ్చు: చూ, శోకించు. 2; ౫. దుఃఖముతో వనరు, వాపోవు. జై. ౬. ఆ. ౨౬౫: చూ, విలపించు; 6. పుత్త్ర మరణాది దుఃఖముచేతతపించు, వగచు: చూ, శోకించు. 1; 7. బెదరు, భయపడు. పాంచా. 3-౨౨: చూ, స్రుక్కు. 6.

అడలుకొను, దే. అ. క్రి: చూ, అడలు. 6. (దీనికి అడలు కడనున్న మిగత 4-౫-7 అర్థములను సందర్భము ననుస రించి చెప్పుకొనవచ్చును.)

అడవి, వై. వి. = అటవి: చూ, విపినము.

అడవికంద, ద్వా. వి. సర్పనాశము*: చూ, సూరణము. 1-౧.

అడవికాఁకర, వై. వి. వనకారవేల్లము*: చూ, సుషవి. 1.

అడవికాఁపు, ద్వా. వి. ముని: చూ, సన్న్యాసి. 1.

అడవికిక్కిస, ద్వా. వి. అడవికిక్కిసగడ్డి*: చూ, తృణము. 1-౩.

అడవికుక్క, ద్వా. వి. తోఁడేలు: చూ, వృకము. 1.

అడవికోడి, ద్వా. వి. వనకుక్కుటము: చూ, పుంజు. 1-౧.

అడవిగెనసు, ద్వా. వి. పిండాంశుకము*: చూ, తృణము. 1-(౪).

అడవిచిక్కుడు, ద్వా. వి: చూ, వనక్షుద్రశింబి*.

అడవిచెఱకు, ద్వా. వి. తెలుపుకలసినపచ్చ చెఱకు*: చూ, సుకు మారము. 1-౫.

అడవిచేమ, ద్వా. వి: చూ, శకుటము. 1.

అడవిజీలకఱ్ఱ, వై. వి. అరణ్యజీరకము*.

అడవితెరుగుడు, ద్వా. వి. కోఁతి: చూ, వానరము. 1.

అడవితొగరి, ద్వా. వి. అడవితువరి, అడవికంది తీఁగ*: చూ, కంది. 1-(2)-౧.

అడవితొలసి, ద్వా. వి. క్షవకము*: చూ, హరిప్రియ. 8-౪.

అడవిదున్న, ద్వా. వి. కారెనుబోతు: చూ, మహిషము. 1.

అడవిదొండ, ద్వా. వి. కాకిదొండ*: చూ, దొండ. 1-౧.

అడవిదోమ, ద్వా. వి. దంశి: చూ, మశకము. 1-౩.

అడవినట్టు. ద్వా.వి: చూ, అడవితిరుగుడు.

అడవినాభి, మి. వి. అరణ్యవసనాభి*: చూ, వసనాభి.

అడవినిమ్మ, ద్వా. వి. వనజంబీరము*: చూ, నిమ్మ. 1-౧.

అడవినువ్వులు, ద్వా. వి. బ. జర్తిలము*: చూ, నువ్వు. 1-౧.

అడవినెలవరి, ద్వా. వి. 1. ఋషి: చూ, సన్న్యాసి. 1; 2. కోఁతి: చూ, వానరము. 1.

అడవినెలవు: చూ, అడవినెలవరి.

అడవినెల్లి, ద్వా. వి. వహ్నిసంభము*: చూ, శ్రీపర్ణము. 1-౨.

అడవిపంది, ద్వా. వి. 1. వనసూకరము: చూ, సూకరము. 1-౪; వా. 2. పనిచేయనితిండిపోతు: చూ, భక్షకుఁడు. 1-౪.

అడవిపల్లె, ద్వా. వి. అడవిలోని చిన్న ఊరు, కావూరు: చూ, దేశములు. 1-౧౫.

అడవిపసుపు, వై. వి. వనహరిద్ర*: చూ, వర్ణము. 6-౭-(౧౩)

అడవిపిప్పలి, మి. వి. వనపిప్పలి*: చూ, పిప్పలి. 1-౧.

అడవిపుట్టువు, ద్వా. వి. ఐరావతము ఇంద్రుని యేనుఁగు: చూ. హస్తి. 1-(౭౬).

అడవిపెసర, ద్వా. వి. కాఱుపెసర*: చూ, పెసర. 1-౧.

అడవిపొట్ల, వై. వి. వనపటోలము*: చూ, పొట్ల. 1-౫.

అడవిప్రత్తి, వై. వి. భారద్వాజి*: చూ, సముద్రాంత. 3-౧.

అడవిబచ్చలి, ద్వా. వి. పంచువు, వనోపోదకి*: చూ, బచ్చలి. 1-౧.

అడవిబాదము, ద్వా. వి. వనబాదము*: చూ, వృక్షము. 1-౧౮.

అడవిబీఱ, ద్వా. వి. చేఁతిబీఱ*: చూ, హ్రస్వగవేధుక. 1-౬.

అడవిమనికి, ద్వా. వి: చూ, అడవికాఁపు.

అడవిమల్లె, ద్వా. వి. ఆస్ఫోట*: చూ, హసంతి. 2-౧౧.

అడవిమాచిపత్తిరి, ద్వా. వి. నాగదమని*: చూ.

అడవిమానిసి, వై. వి. 1. అడవిలో తిరుగువాఁడు: చూ, మను ష్యుఁడు. 1-౧; 2: చూ, అడవికాఁపు.

అడవిమామిడి, ద్వా. వి. ప్రియాలము*: చూ, మామిడి. 1-౪

అడవిమామెన, దే. వి. శారిబాభేదము*: చూ, శారిబ. 1-౪.

అడవిమునగ, వై. వి. కాడుమునగ*: చూ, శిగ్రువు. 1-౩.

అడవిమేఁక, ద్వా. వి. వనచ్ఛాగము: చూ, మేషము. 1-౭

అడవిమొల్ల, వై. వి. అంబష్ఠ*: చూ, హరిణి. ౫.

అడవియవిసె, వై. వి. వనయగస్తి*: చూ, శుకనాసము. 1-౧.

అడవియాముదము. వై. వి. వనయేరండము*: చూ, వ్యాడంబ కము. 1-౨. [1-౧.

అడవియీఁగ, ద్వా. వి. రూ-అడవీఁగ. దంశము: చూ, మక్షిక.

అడవియుల్లి, ద్వా. వి. వనపలాండువు*: చూ, సుకందకము. 1-౪. [1-౧.

అడవియులవలు, ద్వా. వి. ద. అరణ్యకులత్థము*: చూ, సరటి

అడవియేలకి, వై. వి. బృహదేల*: చూ, పత్రల. 1.

అడవిరాజు, వై. వి. 1. అడవిపంది: చూ, సూకరము; వా. 2: చూ, సింహము. 1.

అడవిరేఁగు, ద్వా. వి. వనకోలి*: చూ, రేఁగు. 1-౧.

అడవిసదాప, వై. వి. కుప్పి*: చూ, సదాప. 1-౧.

అడవీఁగ, వా. వి: చూ, రూ-అడవియీఁగ.

అడసాల, వై. వి. = అట్టశాలా. వంటయిల్లు: చూ, సదనము. 1-(౪౭)

అడావిడి, వా. వి. రూ-అడావుడి: చూ, సంభ్రమము. 1.

అడావుడి, —పై.—

అడి, వై. ఉప. 1. = అతి. అధికము, ఎక్కువ. మార్కం. ౮-౧౨౫: చూ, హేరాళము. 1-౬; 2. వమ్ము. భార. ద్రో. ౪. ఆ: చూ, వ్యర్థము.

అడిగండ్లు, దే. వి. బ. (అడుగు+కండ్లు.) మలువఁగా అడు గున నిలిచిన బాళ్లు "ఆ. అడిగండ్లుమలిగండ్లు" వేమన: చూ, రత్నములు. 1-౧౨-(౪).

అడిగము, దే. వి. తూనికయందలి భారవిశేషము. హంస. ౫-౫౭: చూ, వివధము. 3-౨.

అడిగట్టు, దే. వి. (అడుగు+కట్టు) పావ, పాదుక. "హరగ ణంబులకెల్ల నడిగట్టునైనని" ప్రభు. ౪. ఆ. (అడుగు, కట్టు ఈ రెండు పదములు చేరునపుడు డకారముమీఁది ఉకారము నకు ఇకారము వచ్చినది. ఇట్లు అడిగొట్టు అడియాలము మొ॥ వానిని నెఱుఁగునది. పదములు ఒకటితో నొకటి చేరు నపుడు వర్ణలోపవర్ణాగమాదేశములు పెక్కులు పెక్కు విధ ములుగా వచ్చుచున్నవి. ఉదా:- ఆకె, నూనె, తామరపాకు, ఇనుమసి. మొ॥): చూ, సమ్మాళిగలు. 1-౪.

అడిగికొను, వా. దే. స. క్రి. అ. క్రి. రూ-అడుగుకొను. 1: బ్రతిమాలు: చూ, వేఁడికొను; 2. యాచించు: చూ, వేఁడు. 4.

అడిగిననొసఁగెడియావు, ద్వ. వి. కామధేనువు, కోరినవస్తువు లిచ్చెడివేల్పుటావు: చూ, ధేనువు. 1-౮.

అడిగినలేదనుట, అం: చూ, అష్టకష్టములు.

అడిగొంటు, దే. విశే. (అడుగు+కొంటు) రూ-అడిగొట్టు కుటిలహృదయము గలవాఁడు: చూ, వ్యాధుఁడు. 1.

అడిగొంటుతనము, ద్వ. వి. కపటము: చూ, వ్యాజము. 1.

అడిగొట్టు, దే. వి. (అడుగు+కొట్టు) కుత్సితుఁడు: చూ, రూ-అడిగొంటు.

అడిచిపడు, ద్వ. అ. క్రి. 1. తొట్రుపడు: చూ, సంభ్రమించు 2. మండిపడు. వి. పు. ౭-౧౧౮: చూ, వెలుఁగు; వా. 3. (ఈర్ష్యాదులచే) ఎగసిపడు: చూ, మండు. 3.

అడిచిపాటు, ద్వ. వి. 1. తొందరపాటు: చూ, సంభ్రమము. 1; 2. వేగము, త్వర: చూ, రూ-అడచిపాటు; 3. మండి పాటు: చూ, సంభ్రమము. 1-౩.

అడితి, దే. వి. 1. ఒకవర్తకుఁడు మఱియొకఁడంపెడు సరకుల నమ్మి మరల వానికి సరకులఁ గొనిపంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనెడి తఱుగు; వా. 2. కలప అమ్మెడుచోటు: రూ-అడుతు.

అడితీదారుఁడు, దే. వి. 1. కమీషను వర్తకుఁడు; వా. 2. కలప అమ్మెడు యజమాని.

అడిత్రాగుడు. దే. వి. (అడిగి+త్రాగుడు) కఱవు, దుర్భిక్షము. పంచ. నా. 1-౩౫౫: చూ, కఱవు.

అడిదపుమెకము, ద్వ. వి. (అడిదము+మెకము) మీఁగండ్ల మెకము, ఖడ్గమృగము: చూ, నెరబము. 1.

అడిదము, దే. వి. కత్తి: చూ, రిష్టి. 2.

అడిబండ, ద్వ. వి. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

అడిబీరము, ద్వ. వి. మత్తు, కావరము: చూ, హామిక. 1.

అడియఁడు, దే. విశే. (అడుగు+అఁడు) పాదసేవకుఁడు: చూ, సేవకుఁడు. 1-౧.

అడియరి, దే. వి. (అడుగు+అరి) 1. కొలువుకాఁడు. భార. పౌ. ౧-౭: చూ, సేవకుఁడు. 1; విశే. 2. పిసినిగొట్టు: చూ, లోభి; శి: చూ, అడియఁడు.

అడియాలము, దే. వి. (అడ+అలము) రూ-అడియాళము. గుఱుతు: చూ, లక్షణము. 1.

అడియాళము, —పై.—

అడియాలముపట్టు, దే. స. క్రి. (అడ+అలము+పట్టు) గుఱుతుపట్టు: చూ, లెక్కసేయు.

అడియాస, వై. వి. = అర్థాశ. (అడి+ఆస) దురాశ: చూ, వాంఛ. 1-౨.

అడియొత్తు, దే. వి. (అడుగు+ఒత్తు): చూ, అడిగట్టు.

అడిసాటా, దే. వి: (అడితి+సాటా) తఱుగుబేరము: చూ, వర్తకము. 1-౨.

అడిసేరు, వా. వి. పదలము. (60 తులములు): చూ, వీసె. 1-౧.

అడుకు, దే. వి. 1. దొంతి: చూ, దొర. 1; 2. వెఱపు: చూ, సాధ్వసము. 1; స. క్రి. 3: చూ, దొంతిగనిడు.

అడుకులు, దే. వి. బ. వడ్లునానఁబోసి వేఁచికొట్టినవి. భార. ద్రో. ౪-౮౫: చూ, రూ-అటుకులు.

అడుగంటు, దే. అ. క్రి. (అడుగు+అంటు) 1. ఇంకు, వట్టు, ఎండు: చూ, శోషించు; 6. (వంటపాత్రలు లోనగునవి) మాడియడుగంటు; వా. 3. (కుటుంబములో) తిండిలేక మాడిపోవు; 4. (గిన్నెలో) అన్నములేక ఉత్తదియగు.

అడుగంటుట, దే. వి. మాడియడుగంటుట: చూ, కాటు. 1.

అడుగంటులు, దే. విశే. బ. రూ-అడుగంట్లు. అడుగున నిలిచినవి.

అడుగంట్లు, —పై.—

అడుగు, దే. వి. రూ-అడ్గు. 1. రూ-అడుపు. కాలుచాఁచిపెట్టిన భాగము: చూ, హజ్జ. 1; 2. క్రిందు: చూ; దిగువాటు; 3. పండ్రెండు అంగుళముల దూరము; విశే. 4. తక్కు వైనది: చూ, హీనము. 1; స. క్రి. 5. రూ-అడ్గు-అడుపు. ప్రశ్నించు: చూ, సవాలువేయు; 6. యాచించు. రూ-అడ్గు: చూ, వేఁడు. 4.

అడుగుకొను, దే. స. క్రి: చూ, రూ-అడిగికొను.

అడుగుకోలు, దే. వి. 1. ప్రార్థన: చూ, స్తోత్రము. 1; 2. ఆయవారము: చూ, యాచన. 1.

అడుగుకోలుతిరుగుడు, ద్వ. వి. భిక్షకుతిరుగుట, వ్రజ్య: చూ, సంచారము. 1-౪.

అడుగుచెమ్మటలాఁడు, ద్వ. వి. అడుగువాఁకగలాఁడు: చూ, విష్ణువు. 1.

అడుగుట, దే. వి. 1. ఆయవారము: చూ, యాచన. 1; 2. ప్రశ్నము: చూ, సవాలు.

అడుగుతాటించు, ద్వ. స. క్రి. పాదములతో తాడనముచేయు: చూ, తన్ను. 2.

అడుగుదమ్మి, ద్వ. వి. నేలతామర*: చూ, సహస్రపత్రము. 1-౧.

అడుగుదాఁటు, దే. స. క్రి. హద్దునతిక్రమించు. నై. ౫-౧౪౫: చూ, దాఁటు. 6; వా. 2. పొలిమేరదాఁటు; 3. గీచినగీఁత దాఁటు.

అడుగుపడు, ద్వ. అ. క్రి: చూ, క్రిందుపడు.

అడుగుపుట్టువు, ద్వ. వి. రూ-అడుగుఁబుట్టువు. 1. దేవగంగ, మిన్నేఱు: చూ, నది. 1; 2. నాలవజాతివాఁడు: చూ, శూద్రుఁడు. 1.

అడుగుఁబుట్టువు, —పై.—

అడుగుబద్ద, వా. వి. పండ్రెండు అంగుళముల కొలతబద్ద.

అడ్డసరము, వై. వి. అటరూషః. వైద్యమాత*: చూ, సింహాస్యము. 1.
అడ్డసాళులు, ద్వి. వి. బ. (అడ్డము + సాలెలు) రూ-అడ్డసాళ్ళు 1. పాచికలు: చూ, వ్యవహారము. 4-౬; వా. 2. అడ్డు ప్రశ్నలు: చూ, సవాలు. 1-౧.
అడ్డాదిడ్డి, వా. విశే. (అడ్డము + దిడ్డి) అక్రమము.
అడ్డాణము, సం. వి. అ. న. = అడ్డణము: చూ, భక్ష్యము. 1-౮౫; 2. = అడ్డణము. ఒడ్డనము, డాలు, కేడెము; చూ, హరిగ.
అడ్డాదిడ్డి, దే. విశే. (అడ్డము + దిడ్డి) క్రమము తప్పినది: (సం. ప.) అక్రమము.
అడ్డి, దే. వి. 1: చూ, అడ్డపాటు. 1; 2: చూ, అడ్డపాటు. 2; అప. విశే. 3. అడ్డినది.
అడ్డిగ, వై. వి. రూ-అడ్డగ.=అర్ధపణము. 1. రూకలో సగము; 2. రెండుపాతికలు (పాతిక = ఒకగురిగింజయెత్తు; రెండు అడ్డిగలు=౧ చిన్నము.)
అడ్డిగలు, దే. వి. ఆఁడువారిమెడనగ: చూ, భూషణము. 2-౬-(౧).
అడ్డిపడు, ద్వి. అ. క్రి: చూ, నట్టువడు.
అడ్డీ, దే. వి. అనుకైన వస్తువుయొక్క పూఁత. (అప్ర.)
అడ్డు, దే. వి. 1: చూ, రూ-అడ్డంకి; విశే. 2. అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1; స. క్రి. 3. అడ్డగించు: చూ, సంరోధించు.
అడ్డుగ, వై. వి. 1: చూ, రూ-అడ్డిగ: వా. అవ. 2. అడ్డముగను
అడ్డుగట్టు, దే. వి. (అడ్డు + కట్టు) 1: చూ, అడ్డంకి; 2. తలుపు నడ్డగించు గడియ: చూ, విష్కంభము. 2; విశే. 3: చూ, సంరోధము.
అడ్డుగుట్టు, దే. వి. 1: చూ, రూ-అడ్డుగట్టు. 1; 2: చూ, రూ-అడ్డుగట్టు. 2.
అడ్డుగొను, దే. అ. క్రి. (అడ్డు + కొను): చూ, అడ్డిపడు.
అడ్డుపెట్టు, వా. స. క్రి. నిలిపి ఉంచు.
అణఁకువ, దే. వి: చూ, రూ-అడఁకువ.
అణఁగారు, దే. అ. క్రి: చూ, రూ-అడఁగారు.
అణఁగినమెడ, దే. వి: చూ, అంటుమెడ.
అణఁగు, దే. అ. క్రి: చూ, రూ-అడఁగు.
అణఁగుట, దే. వి: చూ, రూ-అడఁగుట.
అణఁచు, దే. ప్రే: చూ, రూ-అడఁచు.
అణక, దే. వి: చూ, రూ-అంక. 2.
అణకము, సం. విశే. తక్కువైనది: చూ, హీనము. 1.
అణకించు, దే. స. క్రి: చూ, రూ-అడకించు. 1.
అణకుఁడు, సం. విశే. రూ-అణుకుఁడు, కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2-౨. [భూమి. 1-౩..
అణవీనము, సం. విశే. అణువులు పండుపొలము: చూ,
అణవ్యము, —వై.—
అణా, వా. వి. రూపాయలో పదియాఱవవంతు.
అణి, సం. వి. ఇ. పు. స్త్రీ. 1. రూ-ఆణి. చాయమేకు: చూ, బండికన్ను; 2 చివర: చూ, సుద. 1; 3: రూ-ఆణి. ఎల్ల: చూ, సీమ. 1.

అణిమ, సం. వి. న్. పు. 1. సూక్ష్మముగఁ జేయునది: చూ, సిద్ధులు. 1-౧. 2. అణుత్వము: చూ, స్వల్పము; 3. అణిమయను నది తన్నుఁగాని ఇతరమయిన గొప్పవస్తువునుగాని అణువుగాఁ జేయునట్టిశక్తి.
అణీయము, సం. విశే. (ఈకారాంతమైనపుడు అణీయస్ అని రూపము) మిక్కిలియణువు: చూ, అణిమ. 2.
అణుకుఁడు, సం. విశే. 1: చూ, రూ-అణకుఁడు; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.
అణుఁకువ, దే. వి: చూ, రూ-అడఁకువ.
అణుకులాచలన్యాయము, న్యా. పరమాణువునకును పర్వతమునకును జాలహెచ్చు తగ్గుండునను రీతి.
అణుకువాఁడు, దే. వి. మల్లజాతియునికంటె నస్యుఁడు.
అణుజు, దే. వి. 1: చూ, రూ-అడుజు; 2. ఈఁకెరాల్చినపక్షి, కుపుజ: చూ, పక్షి. 1-౮.
అణుధావము, సం. వి. అ. న. మెఱుపు: చూ, విద్యుత్తులు.
అణువు, సం. వి. ఉ. పు. 1. లేశము: చూ, స్వల్పము; బ. 2. కొఱ్ఱలకంటె ఇంచుకంత గొప్పయైన వ్రీహిధాన్యము. చిఱువడ్లుఅని కొందఱు: చూ, ధాన్యము. 1-౧౬; విశే. 3. అత్యల్పము: చూ, స్వల్పము.
అణ్ణులు, అం: అ. ఇ. ఉ. అనునవి.
అతంత్రము, సం. విశే. = అదంత్రము. హక్కులేనిది.
అతఁడు, దే. స. ఆశబ్దమునకు మహదర్థక పుంల్లైకవచనము, ఆమనుష్యుఁడు: రూ-అతగాఁడు - అతగాఁడు - అతఁడు, అతను, ఆయన.
అతకరించు, వై. స. క్రి. 1. = అధఃకరించు, క్రిందుపఱచు, హరి. పూ. ౪-౨౬: చూ, తగ్గించు; 2. జవదాఁటు: చూ, దాఁటు. 9.
అతకర్ణము, సం. వి. అ. న. తప్పు; చూ, సొంటు. 1.
అతగాఁడు, దే. స: చూ, రూ-అతఁడు.
అతగుఁడు, దే. వి. బక్కవాఁడు: చూ, శాతుఁడు.
అతటము, సం. వి. అ. పు. ఎక్కఁగూడని ప్రదేశము:
అతద్గుణము, అం. ఒక యర్థాలంకారము. అన్యగుణసంగతమయ్యును బరగుణా నంగీకృతి: చూ, అలంకారము.
అతను, దే. స: చూ, రూ-అతఁడు.
అతనుఁడు, సం. వి. ఉ. పు. 1. మరుఁడు: చూ, మన్మథుఁడు; విశే. 2. అధికుఁడు: చూ, హేమాహేములు.
అతరాపురేటు, వా. వి: చూ, అజబాజురేటు.
అతర్కణము, వై. వి. = అధఃకరణమ్. మట్టుమీఱినకార్యము: చూ, వ్యాపారము. 1-౧౩.
అతర్క్యము, సం. విశే. అగోచరమైనది. (బుద్ధికి లోఁబడనిది).
అతలకుతలపడు, ద్వి. అ. క్రి. తడఁబడు: చూ, వేఱుపడు. 1-౧.
అతలకుతలము, దే. వి. రూ-అతలాకుతలము, అలపట: చూ, శ్రమము. 1.
అతలము, సం. వి. అ. పు. 1. భూలోకమునకుఁ గ్రింది లోకము: చూ, లోకములు; అం. 2: చూ, అధోలోకము లు.
అతలస్పర్శము, సం. విశే. మిక్కిలి లోఁతుకలది, అడుగుభాగముయొక్క స్పర్శలేనిది: చూ, లోఁతు. 2-౧.
అతసి, సం. వి. ఈ. స్త్రీ. = అగసి*: చూ, 1. శుకనాసము.

అతి, సం. అవ్య. 1. అధికము: చూ, హెరాళము. 1; 2. పూజ: చూ, సపర్య; 3. గంతు: చూ. లంఘ; 4. భయము: చూ, సాధ్వసము; 5. మీఱుట, క్రమము తప్పుట: చూ, వ్యత్యయము. 1-౨; 6. ప్రతి, మాఱు: చూ, సమానము. 2; 7. జబ్బు: చూ, రోగము. 1; 8. నాశము: చూ, సంస్థ. 3; 9. వ్యాప్తి, క్రమ్ముట: చూ, సంవృతము. 1.౧; 10. అవృత్తి: చూ, మరలంబాటు. 1; 11. ఆరోపణము: చూ, ఆరోపము. 2; 12. ఆజ్ఞ: చూ, సెలవు; 13. త్వర: చూ, సంభ్రమము. 1; 14. మోసము: చూ, వంచన; 15. ప్రార్థన: చూ, స్తోత్రము; 16. ప్రశ్నార్థకము: చూ, సవాలు; 17. అంగీకారార్థకము: చూ, సమ్మతి. 1; 18. గౌరవము: చూ, సన్మానము. 1; ఉప. 19. "అతి"యను ఉపసర్గతోఁజేరినవి: అతిక్రమము, అతివృష్టి, అతిరేకము, అతిశయము, అతిహసితము. మొ; దే. అవ్య. (1)=అడి, అమితమైనది: చూ, హెరాళము.1-౨.

అతికటమము, సం. విణ. అతిసమీపము: చూ, సమీపము1-౩.

అతికాయము, సం. విణ. బ్రహ్మాండమైనది.

అతికాయుఁడు, సం. విణ. 1. బ్రహ్మాండమైన యాకారముగల మనుష్యుఁడు: చూ, మనుష్యుఁడు. 1-౨. 2. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1-౪.

అతికించు, దే. స. క్రి. కూర్చు: చూ, సంధించు. 3.

అతికృచ్ఛ్రము, వా. వి. 1. మిక్కిలికష్టమైనది; లం. 2. చాంద్రాయణాది ప్రాయశ్చిత్త వ్రతములలో నొకటి, ఏకభుక్తము, అయాచితాన్నభక్షణము, నక్తభోజనము వీనిని ముమ్మాఱు ఆచరించునపుడు పిడికెడు పిడికెడు అన్నము తినవలయును. ఇటుల తొమ్మిది రోజులు చేసినతరువాత మూఁడుదినము లుపవసించి యుండుట: చూ, కృచ్ఛ్రము. 3.

అతికృష్ణమచ్చము, వా. వి. నాశలక్షణము: చూ, లక్షణము: 1-౨౨.

అతికేశరఫల, సం. వి. అ. స్త్రీ. కరుబూజదోస*: చూ, హరివాలుకము. 1-౭.

అతిక్రమము, సం. వి. అ. పు. 1. మీఱుట, క్రమము తప్పుట: చూ, వ్యత్యయము. 1; 2. శత్రులఁగూర్చి దండెత్తిపోవుట: చూ, అభిక్రమము. 1; 3. ఆలస్యము: చూ, విలంబము. 1; ఉప. 4. (ఇచ్చట "అతి" యనునది ధాత్వర్థమును "దాఁటిపోవు" అనునర్థముగా మార్చినది.)

అతిక్రమించు, సం. స. క్రి. తరించు: చూ, దాఁటు. 9.

అతిక్రాంత, అం: చూ, ఆకాశచారులు.

అతిక్రాంతము, సం. విణ. 1. అతిక్రమించినది: చూ, అతీతము 1; అం. 2: చూ, ఆకాశమండలములు; 3: చూ,కరణములు.

అతిక్రాంతి, సం. వి. ఇ. స్త్రీ. మీఱుట: చూ, వ్యత్యయము. 1.

అతిఖట్వుఁడు, సం. వి. అ. పు. మంచమును మించిన పొడవు గలవాఁడు: చూ, మనుష్యుఁడు. 1-౬.

అతిఖరము, సం. వి. అ. పు. 1. కాకివెదురు*: చూ, శరము. 5; విణ. 2. మిగులతీక్ష్ణమైనది.

అతిగంధము, సం. విణ. 1. పెద్దవెక్కిళ్ళుగలదీ; అం. 2: చూ, యోగములు. [సొంపట్టి.

అతిగుహ, సం. వి. అ. స్త్రీ. ముయ్యాకుపొన్న*: చూ.

అతిచర, సం. వి. అ. స్త్రీ. మెట్టతామర*: చూ, సహస్రపత్రము. 1-౧.

అతిచారము, అం: చూ, గ్రహగతులు.

అతిచిత్రతమము, అం: చూ, మార్గప్రాణములు.

అతిచ్ఛత్రక, సం. వి. అ. స్త్రీ. మా-అతిచ్ఛత్రక. 1. అవాక్పుష్పి*: చూ, సదాప; 2. ఏనుఁగుతుమ్మి*: చూ, స్థూలజటము. 1-౬.

అతిచ్ఛత్ర, సం. వి. అ. స్త్రీ. —పై.—

అతిచ్ఛత్రము, సం. వి. అ. పు. గ్రుడ్డికామంచి*: చూ, తృణము. 1-౧౩.

అతిచ్ఛిద్రము, అం: చూ, తారమార్గములు.

అతిజగతి: చూ, ఛందస్సులు.

అతిజవుఁడు, సం. విణ. మిక్కిలివడిగ నడచువాఁడు: చూ, జంఘాలుఁడు.

అతితృష్ణానకర్తవ్యా తృష్ణాంనైవ పరిత్యజేత్, న్యా. అతితృష్ణ గూడదు. పొత్తుగాఁ దృష్ణనువిడువను గూడదు.

అతిదీర్ఘాతిహ్రస్వాంగము, అం. విధవాలక్షణము: చూ, లక్షణము. 1-౪౫.

అతిథి, సం. వి. ఇ. పు, స్త్రీ. 1. విందునకు పిలువఁబడినవాఁడు: చూ, విందు. 4; 2. అగంతుకుఁడు, కాలనియమము లేక అన్నార్థియై వచ్చినవాఁడు, పరదేశమునందుండి వచ్చిన వాఁడు: చూ, విందు. 4-౧; పు. 3. వగపు: చూ, శోకము. 1; 4. కోపి: చూ, రోషణుఁడు; 5. కుశునికొడుకు: చూ, సూమఁడు. 1-౩౧.

అతిథిక్రియ, అం. అతిథి సత్కారము. యజ్ఞములలో నొకటి: చూ, యజ్ఞములు.

అతిథిపూజ, అం: మా-అతిథిపూజనము. చూ, యజ్ఞములు.

అతిథిపూజనము, —పై.—

అతిథిసత్కారము, అం: చూ, అతిథిక్రియ.

అతిథిసపర్య, అం: చూ, అతిథిసత్కారము.

అతిదేశము, సం. వి. అ. పు. 1. ఒకచోట చెప్పఁబడిన దానిని సామ్యమును బట్టి మఱియొకచోట నుపయోగపఱచుట: 2. బదులు, మాఱు: చూ, సమానము. 2.

అతిధృతి, సం. వి. ఇ. స్త్రీ. 1. ధైర్యశాలి: చూ, దీట్టఁడు; అం. 2: చూ, ఛందస్సులు.

అతిను, సం. వి. ఉ. న. అతినౌక. ఓడకుమించిననీరు: చూ, సలిలము, 1-౪.

అతినువు, సం. విణ. ఉ. ఓడగడచినది, ఓడదాఁటినది.

అతినౌక, సం. వి. ఆ. స్త్రీ: చూ, అతిను.

అతిపథము, సం. వి. అ. పు. మంచిత్రోవ: చూ, మార్గము. 1-౨.

అతిపథుఁడు, సం. విణ. మార్గము నతిక్రమించినవాఁడు.

అతిపరిచయన్యాయము, న్యా. మిక్కిలి పరిచయముచేత మనుష్యునియం దనాదరము గలుగును. (అతిపరిచయాదవజ్ఞా.)

అతిపాతము, స. వి. అ. పు. మీఱుట: చూ, వ్యత్యయము. 1.

అతిబల, సం. వి. ఆ. స్త్రీ. 1. గాలివానతోఁ గూడినవాన: చూ, వాన. 1-౩; 2. విశ్వామిత్రుఁడు రామున కుపదేశించిన బల, అతిబల అను రెండువిద్యలలో నొకటి.

3. మిత్రవపులగము*: చూ, సహదేవ; 4. అడవిప్రత్తి*: చూ, సముద్రాంత. 3-౧; 5. చిన్నాముదము*: చూ, వ్యపెండకము. 1-౩; విశే. 6. మిక్కిలిబలముగలది.
అతిబలుఁడు, సం. విశే. 1. బలవంతుఁడు: చూ, శక్తుఁడు; 2. యముఁడు: చూ, హరి. ౫.
అతిభూమి, సం. వి. ఇ. స్త్రీ. అతిశయము: చూ, హేరాళము. 1-౧.
అతిభేదము, సం. వి. అ. పు. గ్రహణి: చూ, రోగము. 1-౧౩.
అతిమధురము, సం. వి. అ. న. 1: చూ, యష్టిమధుకము; విశే. 2. మిక్కిలి తియ్యనిది: చూ, మధురము. ౪-౧.
అతిమాత్రకుఁడు, సం. విశే. గొప్పవాఁడు: చూ, స్వామి. 3.
అతిమాత్రుఁడు, సం. విశే. అతిశయవంతుఁడు: చూ, హెచ్చుగలవాఁడు.
అతిమాత్రము, సం. క్రి. విశే. అ. న. 1. పెల్లు: చూ, హేరాళము. 1; విశే. 2. ఎక్కువైనది: చూ, హేరాళము. 1-౨; అం. 3: చూ, అర్థదోషములు. (లోకాతీతమైనదానినిగాఁ జెప్పుట).
అతిమానము, అం: చూ, హేయగుణములు.
అతిముక్తకము, సం. వి. అ. పు. రూ-అతిముక్తము. 1. నెమ్మి*: చూ, స్యందనము; 3. పూలగురివెంద*: చూ, శ్వేతపాకి. 1-౩; 3. తుమికి*: చూ, స్ఫూర్జకము.
అతిముక్తము, —పై.—; విశే. 4. ఫలములేనిది, కూడికలేనిది: చూ, నిష్ఫలము.
అతిముక్తుఁడు, సం. విశే. మిగుల నాసక్తి గలవాఁడు: చూ, బుద్ధుఁడు. 2.
అతిమూత్రము, సం. వి. అ. న. ఉచ్చ హెచ్చుగా వెలువరించు రోగము: చూ, రోగము. 1-౧.
అతిమేచక, సం. వి. ఆ. స్త్రీ. నల్లదింటెన*: చూ, విష్ణుక్రాంత. 1-౩.
అతిరక్తము, సం. విశే. 1. రూ-అతిరిక్తము. అధికమైనది: చూ, హేరాళము, 1-౨; 2. ముత్తియములలోని యెఱ్ఱని దోషము: చూ, రత్నములు. ౧-౧-౨౦.
అతిరథుఁడు, సం. వి. అ. పు. పెక్కువిలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు: చూ, భటుఁడు. 1.
అతిరసము, సం. వి. అ. పు. = అటిసె: చూ, భక్ష్యము. 1-౩.
అతిరాత్రము, సం. వి. అ. పు. 1. యజ్ఞభేదము: చూ, యజ్ఞము 1-౨; 2: చూ, సోమయజ్ఞములు.
అతిరిక్తము, సం. వి. అ. పు. 1. ఇంగిలీకము: చూ, హింగుళము; విశే. 2. రూ-అతిరక్తము. హెచ్చినది: చూ, హేరాళము. 1-౨.
అతిరుహా, సం. వి. ఆ. స్త్రీ. మెట్టతమ్మి*: చూ; సహస్రపత్రము. 1-౧.
అతిరేకము, సం. వి. అ. పు. 1. అతిశయము: చూ, హేరాళము. 1-౧; ఉప. 2. అతి యను ఉపసర్గ యిచ్చట ధాత్వర్థమును "హెచ్చు" అనునర్థమునకు మార్చినది.
అతిరోమశము, సం. వి. అ. పు. మేఁక: చూ, మేషము. 1.
అతిలుబ్ధుఁడు, సం. విశే. మిక్కిలి పిసినిఁగొట్టు: చూ, లోభి. 1-౧.
అతిలోభోనాశాయ, న్యా. అతిలోభము నాశమునకుఁగారణమగును.
అతివ, దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ. 1.
అతివక్త, సం. విశే. తానుపలుక నిశ్చయించిన యర్థమును లెస్సగా నిర్వహించువాఁడు. వాఙ్మి: చూ, సుధి. 1.
అతివస, వై. వి. = అతివిషా*: చూ, విష. 1.
అతివాదము, సం. వి. అ. పు. పరుషముగా మాటలాడుట: చూ, శబ్దము. 2-౯.
అతివాసము, వై. వి. = అధివాసరమ్. శ్రాద్ధదినమునకు ముందు దినము: చూ, అధివాసరము.
అతివాహికుఁడు, సం. వి. అ. పు. నరకమునందున్న యాతనాజీవుఁడు: చూ, హంసుఁడు. 2-౪.
అతివినయో ధూర్తలక్షణమ్, న్యా. (స్పష్టము.)
అతివిష, సం. వి. ఆ. స్త్రీ. = అతివస: చూ, అతివస*.
అతివీర్యవతీవభేషజే బహురల్పీయసిదృశ్యతేగుణః, న్యా. అల్పవస్తువునందును మిక్కిలి వీర్యవంతమగు నౌషధమునందు వలెనే పెద్దగుణము కానవచ్చును.
అతివృష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. దేశమునకు హానికరమైన హెచ్చువాన: చూ, వాన. 1-౧౧; అం. 2: చూ, ఈతిబాధలు; ఉప. 3. ఇచ్చట వృద్ధిశబ్దముతో సమసించి "మిక్కిలి" యను నర్థము నిచ్చినది.
అతివేలము, సం. క్రి. విశే. అ. న. 1. అతిశయము: చూ, హేరాళము. 1; విశే. 2. అధికమైనది: చూ, హేరాళము. 1-౨.
అతిశక్తిత, సం. వి. ఆ. స్త్రీ. అధికబలము: చూ, శక్తి. 1-౧.
అతిశక్వరి, అం: చూ, ఛందస్సులు.
అతిశయము, సం. వి. అ. పు. 1-ఆధిక్యము: చూ, హేరాళము. 1-౧; ఉప. 2. "అతి"యను ఉపసర్గ ఇట ధాత్వర్థమును "ఆధిక్య"మను నర్థమునకు మార్చినది.
అతిశయవంతుఁడు, సం. విశే. (త్. ఈ.త్) ఏకాంతుఁడు: చూ, హెచ్చుగలవాఁడు.
అతిశయించు, సం. అ. క్రి. పెంపుమీఱు, చూ, సందడించు. 2.
అతిశయిల్లు, —పై.—
అతిశయోక్తి, అం. ఉపమేయమును గప్పివేసి ఉపమానము మాత్రము కవిప్రౌఢోక్తిమూలముగాఁ జెప్పఁబడినది. ఇది సప్తవిధములనున్నది. సంబంధ, అసంబంధ, అక్రమ, చపల, అపహ్నవ, అభేద, భేదకాదిభేదములు: చూ, అలంకారము. 3.
అతిశాయనము, సం. అవ్య. ఎక్కుడు, కిమ్: చూ, అతిశయము. 1.
అతిశాయి, సం. విశే. (న్. ఈ.న్) అతిశయించినది: చూ, హేరాళము. 1-౨.
అతిశృంగకము, సం. వి. అ. పు. 1. శృంగి, కొమ్ముచేఁప: చూ, మత్స్యము. 1-౯; విశే. 2. పెద్దకొమ్ములుగలది.
అతిశోభనము, సం. విశే. ముఖ్యమైనది: చూ, శ్రేష్ఠము.
అతిసర్జనము, సం. వి. అ. న. 1. ఈవి: చూ, స్పర్శము. 3; 2. దోషము: చూ, వృజినము. 1.
అతిసర్వత్రగర్హ్యతే. "అతి" యెందును గర్హింపబడును.
అతిసర్వత్రవర్జయేత్, న్యా. "అతి" యెందును గూడదు.
అతిసారకి, సం. విశే. (న్. ఈ.న్) అతిసార రోగముగలవాఁడు: చూ, వ్యాధితుఁడు. 1-౨.

అతిసారనుత్తు, సం. వి. ద్. పు. కొడిసె*: చూ, వత్సకము.
అతిసారము, సం. వి. అ. పు. గ్రహణి: చూ, అతిభేదము.
అతిసౌరభము, సం. వి. అ. పు. మిక్కిలి పరిమళముగల తియ్యమామిడి*: చూ, మామిడి. 1-౫.
అతిస్థూలమహాకృశాంగము, అం: చూ, అతిదీర్ఘాతిహ్రస్వాంగము
అతిస్పృశ. సం. వి. ఆ. స్త్రీ. పూతిగడ్డ*: చూ, రాజాన్నము. 1-౨౯.
అతిహసితము, సం. వి అ. న. 1. శరీరకంపముతోఁ గూడిన నవ్వు; ప్రహసితము: చూ, హాస్యము. 1-౫; అం. 2: చూ, హాస్యములు.
అతీంద్రియము, సం. విఱ. నేత్రాదీంద్రియములచే నెఱుఁగ రానిది, ప్రత్యక్షము కానిది: చూ, వినాశము. 2.
అతీతకాలము, వా. విఱ. కాలదోషము, గడువుదాఁటినది.
అతీతి, అం: చూ, టక్కుజభాషలు.
అతీతము, సం: విఱ: చూ, అతిక్రాంతము.
అతీతుఁడు, సం. విఱ. సత్త్వరజస్తమములను దాఁటినవాఁడు.
అతీవ, సం. అవ్య. చాల: చూ, హేరాళము. 1-౮.
అతుకు, దే. వి. రూ-అదుకు. 1: చూ, సంధానవసనఖండము; 2: చూ, మాటు; 3. బట్టలకుట్టు: చూ, సౌచికము; 4. అతికినతావు; అ. క్రి. రూ-అదుకు 5, కూర్చు: చూ, సంధించు. 1; 6. ప్రేముడించు: చూ, సంధించు. 2; స. క్రి. రూ-అదుకు. 7. అతికించు, కూర్చు: చూ, సంధించు. 3; 8. పొందు: చూ, సక్తమగు; 9. తాఁకు: చూ, స్పృశించు.
అతుకుఁబడి, దే. వి: చూ, అమరకము.
అతుకువేయు, దే. స. క్రి. కూర్చు: చూ, సంధించు. 3.
అతులము, సం. విఱ. సరిలేనిది: చూ, రూ-అతులితము, అన్యము, అసమానము.
అతులితము, సం. విఱ.—పై.—
అతులుఁడు, సం. విఱ: చూ, ఈడులేనివాఁడు.
అతుల్యలంబము, వా. వి: చూ, విషమచతుర్భుజము.
అతుల్యవిక్రమము. సం. వి. అ. పు: చూ, సింహము.
అతృప్తుఁడు, సం. విఱ: చూ, తనివిలేనివాఁడు.
అత్త, సం. వి. ఆ. స్త్రీ. 1. అక్క: చూ, సహోదరి; 2. అమ్మ: చూ, మాత. 1; దే. వి. (1) మగనితల్లి: చూ, అత్తమ్మ, అత్తయ్య. (సం. ప) అంబిక; (2). భార్యతల్లి: చూ, అత్తమ్మ, అత్తయ్య, (సం.ప) అంబిక; (3). అండ్రితోఁ బుట్టువు: చూ, మేనత్త; (4). మేనమామభార్య, మాతుల: చూ, భార్య. 1-౪౯: అం. 5: చూ, గయాపిండదానార్హులు.
అత్తడము, దే. వి. 1. కొన్నికాగితముల కలయిక, కాగితపు అట్ట: చూ, అట్ట. 4; వా. వి. 2. మాటమాటకలియుట; 3. భార్యాభర్తలకలయిక; 3. ఒకని మాటతో మఱియొకని మాట కలియుట.
అత్తడి, దే. వి. రూ-నత్తడి. గోడిగ ఋతువు. గోడిగ=ఆఁడు గుఱ్ఱము: చూ, హయము. 1-౧. [ముకుఁగు*.
అత్తపత్తి, దే. వి. (వ్యు - అత్తుకొనునది): చూ, సోఁకుడు
అత్తమిల్లు, దే. అ. క్రి. 1. పండుకొను. అచ్చ. బాల. ౧౫౬: చూ, శయనించు; 2. గ్రమ్ము. జై. ౨-౯౩: చూ, వ్యాపించు; 3. = అస్తమ్. అస్తమించు. కాశీ. ౧-౧౩౨: చూ, నిండిపడు; 4. ఒఱగు. స్వా. ౨-౨౬: చూ, వ్రాలు. 3; 5. ఓపతిమిల్లు: చూ, గ్రుక్కు (4); 6. చెడు: చూ, నశించు.
అత్తము, దే. వి. 1. అరటిపండ్లగెల. రూ-అత్తెము: చూ, గెల; 2. హ్రాంగుత్త: చూ, హ్రాగుత్త; 3. గెంటిలో నొకభాగము; 4. సస్యగర్భము, వరిపొట్ట; కిఱ్ఱ: చూ, పొట్టకట్టు; 5: గుంపు: చూ, సమూహము: వా. 6 వ్యతి:- అంటము, చేరము.
అత్తమ్మ, ద్వి. వి. (అత్త+అమ్మ): చూ, అత్త. (1), (2), (3), (4), (5).
అత్తయ్య, ద్వి. వి.—పై.—
అత్తరము, దే. వి. తొందరపాటు: చూ, సంభ్రమము. 1.
అత్తరు, దే. వి. 1. రూ-అత్తరువు. వాసనానూనె: చూ, ప్రబోధనము, అం. 2: చూ, గంధములు.
అత్తలి, దే: వి. (అ+తలి) ఆసమయము.
అత్తలము, దే. వి. రూ-అత్తళము. 1. కుంతము, పొడుచునట్టి యొకానొక ఆయుధము. భార. శల్య. ౧-౩౫౧: చూ, బాణము. 1-౧౮; 2. బల్లెము. చెమురాకువంటి అలుగుగల బాణము. కళా. ౮-౫౬: చూ, బాణము. 1-౫౦.
అత్తవారు, వా. వి. 1. భార్య పుట్టింటివారు; 2. భర్తపుట్టింటివారు.
అత్తి, వై. వి.=అంజీర్,అంజూరు.*: చూ, మేడి; 2. ఏనుఁగు: చూ, హస్తి. 1.
అత్తిక, సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు అక్క. అంతిక: చూ, అప్ప ౩.
అత్తిల్లు, వా. వి. 1. భార్యపుట్టిన యిల్లు: చూ, సదనము. 1-౪౯; 2. భర్త పుట్టినయిల్లు: చూ, సదనము. 1-౫౫.
అత్తు, దే. వి. 1. రూ-అత్తెము - హత్తు. మైనపుగుడ్డ: చూ, వస్త్రము. 1-౪౦; అ.క్రి. రూ-హత్తు. 2. పొందు. విజ్ఞా. వ్య. కాం. ౧౨౬: చూ, సక్తమగు; 3. కలుగు, పుట్టు. పంచ. నా. ౧-౧౧౯: చూ, సంభవించు; 4. యుక్తమగు: చూ, సరిపడు. 2; పా. 5. ఆకారము; చూ, వర్ణము. 1:
అత్తుకొను, దే.అ.క్రి.1. పొందు: చూ, సక్తమగు; 2. కలుగు: చూ, సంభవించు; 3.జతపడు: చూ, సూత్రపడు; 4.కత్తిరిఁ గలయు: చూ, సంకరమగు.
అత్తెము, దే. వి. 1. రూ-అత్తము: చూ, గెల; వై. వి. 2. = హస్తతోరణమ్. హస్తకవచము. ఉ. రా. ౬-౪౦౨; చూ, వారవారణము. 1-౧; 3. మైనపుగుడ్డ: చూ, వస్త్రము. 1-౪౦.
అత్తెసరు, దే. వి. (అత్తు+ఎసరు) (వ్యు-అత్తుకొనునది.) రూ-ఎత్తెసరు, గంజివారకుండా అన్నముతో నిమిడిపోవునట్లు పెట్టెడి ఎసరు "అత్తెసరు మెతుకులు"; 2. కోష్ణజలము, మొదట బియ్యము ఉడిగి నీటితో నింపి ప్రొయ్యిమీఁదనుంచునది, ఎత్తెసరు: చూ, నఖంపచము. (రూ-బ. అత్తెసళ్లు.)
అత్యంతకోపనుఁడు. సం. వి. అ. పు.మిక్కిలి కోపించువాఁడు: చూ, రోషణుఁడు.
అత్యంతతిరస్కృతవాచ్యములు, అం: పదగతము, వాక్యగతము (2)
అత్యంతము, సం. క్రి. విఱ. 1. అతిశయము: చూ, హేరాళము. 1; 2. కడు, అందంద, అడాడ: చూ, మఱి మఱి.

1; 3 అధికమైనది: చూ, హేరాళము. 1-౩; అం. 4: చూ, సంఖ్యాభేదములు.

అత్యంతయుక్తి, అం; చూ, రతిబంధములు.

అత్యంతవంతుఁడు, సం. విణ. త్. మిక్కుటముగలవాఁడు: చూ, అనవరతుఁడు.

అత్యంతాతిశయోక్తి, అం. కారణము లేకుండఁగనే కార్యము జరుగుట; చూ, అలంకారము. 3.

అత్యంతాయ, సం. అవ్య. 1: చూ, అతీవ; 2. మిక్కిలి, హెచ్చు: చూ, హేరాళము. 1.

అత్యగ్నిష్టోమము, అం. 1: చూ, నహీనతానములు; 2: చూ, సోమయజ్ఞములు.

అత్యధికము, సం. విణ. మిక్కిలిహెచ్చు: చూ, హేరాళము. 1-౧.

అత్యప్రత్యక్షము. సం. విణ (ఇంద్రియముల కగుపడనిది) అతీంద్రియము; కానరానిది: చూ, వినాశము. 2.

అత్యమ్లపర్ణ, సం. వి. ఆ. స్త్రీ. పుల్లబచ్చలి*: చూ, బచ్చలి. 1-౨.

అత్యయము, సం. వి. అ. పు. 1. మీఱుట: చూ, వ్యత్యయము; 2. చేటు: చూ, సంస్థ. 3; 3. జోహారు, నతి: చూ, జాణిగలు. 1-౫; 4. తప్పు: చూ, సొంటు; 5. మనఃపీడ: చూ, శోకము; 6. మరణము: చూ, సావు.

అత్యరాళము, సం. వి. అ. పు. 1. అరాళమనెడి యేనుఁగు కంటె మిక్కిలి ప్రమాణముగల యేనుఁగు: చూ, హస్తి. 1-౩-(౩). (ఇది నింద్యము); విణ. 2. నానావిధవక్రము, వంకరబెంకర: చూ, వేల్లితము. 3-౨.

అత్యర్కము, సం. వి. అ. పు. వెల్లిజిల్లేడు*: చూ, వికీరణము. 1-౩.

అత్యర్థమధురము. సం. విణ. చెవులకు విన నింపయినది. (పలుకు): చూ, స్వాంతము. 3. (చూ, శబ్దము. 2.)

అత్యర్థము, సం. క్రి. విణ, అ. న. 1; అతిశయము: చూ, హేరాళము. 1-౧; విణ. 2. అధికమైనది: చూ, హేరాళము. 1-౫.

అత్యల్పము, సం.విణ. 1. మిక్కిలి కొంచెము: చూ, స్వల్పము. 1-౧; 2. కొంచెము: చూ, స్వల్పము. 1.

అత్యష్టి, అం: చూ, ఛందస్సులు.

అత్యాకారము, సం. వి. అ. పు. తిరస్కారము: చూ, హేళనము.

అత్యాచారుఁడు. సం. విణ. క్రూరుఁడు: చూ, హింసకుఁడు.

అత్యాదానము, సం. వి. అ. న: చూ, వ్యత్యయము. 1.

అత్యారూఢము, సం. విణ. 1. లెస్సగా నెక్కఁబడినది: చూ, సమారూఢము; 2. అత్యధికము: చూ, హేరాళము. 1-౫.

అత్యావశ్యకము, వా. విణ. పేరాస: చూ, వాంఛ. 1-౧; 2.తప్పక కావలసినది.

అత్యాహితము, సం. వి. అ. న. 1. మిక్కిలి వెఱపు: చూ, సాధ్వసము. 1-౩; 2. బ్రతుకఁగోరనిపని: చూ, వ్యాపారము. 1-౧౪; విణ. 3. కూడఁబడినది: చూ, సంయుక్తము.

అత్యుక్త, అం: చూ, ఛందస్సులు.

అత్యుక్తి, అం. అద్భుతకావ్యవర్ణనము. "దాతవీవగుచుండ యాచకులె కల్పతరువులైరి". గోరంతలు కొండంతలుగా వర్ణించుట :చూ, అలంకారము. 3.

అత్యుక్షి ప్రతల, అం:చూ,ను ఖర్జూవులు (అశ్వశాస్త్రములోనిది)

అత్యుగ్రప్రయఃపతనహేతుః, (రూ) పతనాంతాః సముచ్ఛ్రయాః. న్యా. పెరుఁగుట విఱుఁగుట కొఱకే.

అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవఫలముచ్యతే, న్యా. పుణ్యపాపము లధికమగునేని వాని ఫలమిచ్చుటనే యనుభవించును.

అత్యుషిత, సం. వి. ఆ. స్త్రీ. పిట్టగట్టిన పెంటిక: చూ, శమలము. 1-౯.

అత్యూహము, సం. వి. అ. పు. 1. నీటిప్రాఁచి*: చూ, శైవలము. 1; 2. ఎనిమిదిపేటలుగల స్త్రీల మొలనూలు: చూ, భూషణము. 2-౭-(౩).

అత్రమ, సం. వి. అ. న. క్షీరాన్నము: చూ, సాదము. (1)-౧౧-౧.

అత్రి, అం. 1: చూ, బ్రహ్మలు; 2. ఒకఋషి: చూ, సన్యాసి. 1-(౨); 3: చూ, మహర్షులు:(చూ, గోత్రము. 13-2-2); 4: చూ, స్మృతులు. "అత్రిస్మృతి". మొ॥

అత్రిజాతుఁడు, సం. వి. అ. పు. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

అత్రినేత్రభువు, ఉః. పు. —పై.—

అత్రిస్మృతి, అం: చూ, స్మృతులు.

అదంత్రము, వై. విణ. = అతంత్రమ్: చూ, అతంత్రము.

అదక, దే. వి. (వ్యు-అంటియుండునది) ప్రాఁతచెప్పు: చూ, సమ్మాళిగలు. 1-౧.

అదటు, దే. వి. 1. గరువము. కాశీ. 6. ౨౨: చూ, హంకారము; 2. క్రొవ్వు. (వ్యు-దీనిచేతమదించును) స్వా. ౫-౨౪: చూ, హామిక.

అదత్తి, సం. విణ. ఇ. తిండిపోతు: చూ, భక్షకుఁడు. 1.

అదద్భుజ, సం. వి. ఆ. స్త్రీ. కరుబూజాపోస*: చూ, హరివాలుకము. 1-౭.

అదనము, వై. విణ. = అధికమ్. హెచ్చైనది: చూ, హేరాళము. 1-౫.

అదనశీలుఁడు, సం. విణ: చూ, అదత్తి.

అదను, దే. వి. రూ-హదను. కాలము: చూ, సమయము. 1.

అదనైనవాఁడు, దే. వి. అఁకలిఁగొన్నవాఁడు; చూ, బుభుక్షితుఁడు.

అదభ్రము, సం. విణ. అధికమైనది: చూ, అదనము.

అదమాయింపు, దే. వి: చూ, మందలింపు. 3.

అదము, సరి. వి. అ. పు. 1. యజ్ఞార్థమైన అపూపము, పురోడాశము, ఐంద్రాగ్నేయి: చూ, సాదము. (1)-౬౧; 2. ఇదమ్. ఈశబ్దమునకు అమహదర్థక ప్రథమైక వచనము: చూ, ఇయ్యది; వా. 3. అయోడైన్ అనురాసాయనిక పదార్థము; వా. 4. పిండాకూడు. "నీఅదముపోపొమ్ము".

అదయుఁడు, సం. విణ. దయలేనివాఁడు; చూ, నిర్దయుఁడు.

అదరము, వై. వి. = అధరమ్, పెదవి: చూ, వాతెఱ.

అదరించు, దే. స. క్రి. రూ-అదలించు. 1. గద్దించు, అడలఁగొట్టు: చూ, వెఱపించు; 2. చూ, కదలుచు.

అదరిపాటు, దే. అవ్య: చూ, డప్పాటు.

అదరు, దే. వి. రూ-అదరుగడ-అదురునదురు-అడలు-అడుకు-అలుకు-అళుకు. 1. భయము: చూ, సాధ్వసము; 2. భయ

చలనము: చూ, సాధ్వసము. 1-౧; 3. కదలుట: చూ, లోలము. 1; అ. క్రి. 4. రూ-అదురు. అదలు, భయపడు: చూ, బ్రుక్కు. 6; 5. కదలు: చూ, సలించు.

అదరుగడ, దే. వి. భయము: చూ, అదరు. 1.

అదరులు, దే. వి. బ. మిణుఁగురులు. భార. అర. ౫-౧౫౧: చూ, వహ్ని. 1-౧౪.

అదర్శనము, సం. వి. అ. న. 1. కల: చూ, స్వప్నము. 1; 2. కానరాకుండుట: చూ, వినాశము. 2; వా. 3. అక్ష రములలోనగునవి కనఁబడకపోవుట.

అదలించు, దే. స. క్రి: చూ, రూ-అదరించు.

అదలు, దే. అ. క్రి. 1. భయపడు: చూ, బ్రుక్కు. 6; స. క్రి. 2. భయపెట్టు: చూ, వెఱపించు. [అదలు. 2.

అదలుచు, దే. ప్రే. రూ-అదల్చు. కోపమున గద్దించు: చూ,

అదలుపు, దే. వి. రూ-అదల్పు. దట్టిన: చూ, తర్జనము. 1.

అదల్చు, దే. ప్రే: చూ, రూ-అదలుచు.

అదల్పు, దే. వి: చూ, రూ-అదలుపు.

అదవ, దే. వి. 1. శైలదీర్ఘకోణము: చూ, కోన. 2; 2. ఇంటి అద్దె: చూ, భాటకము.

అదవద, దే. వి. 1. కలఁత. రామా. ౫-౧౩౭: చూ, సంతాపము; విశే. 2. చింత, కలవరము: చూ, విప్రతీసారము; 3. అల్లకల్లోలము: చూ, వ్యత్యయము. 1.

అదవదపడు, ద్వి. అ. క్రి. కలఁతపడు: చూ, సంక్షోభించు.

అదవదలు, దే. వి. తొందరపాటు: చూ, సంభ్రమము. 1.

అదాటు, వై. అవ్య: చూ, అదిరి.

అదార్వి, సం. వి. ఈ. స్త్రీ. కోరింద*: చూ, ముచపత్ర.

అది, దే. సర్వ. (వ్యు-చూపుటనుతెలుపునది) ఆశబ్దమునకు అమహదర్థక ప్రథమైకవచనము. రూ-అద్ది. "ఆయాఁడుది, ఆపశ్వాది, ఆ జడవస్తువు" మొ: చూ, ఆయది.

అదిగాక, వా. అవ్య. క్రి. విశే. మఱియును: చూ, మఱియు.

అదిగొ, దే. ద్ర. రూ-అదిగో-చూపుటను తెలుపునది. కళా. ౮-౧౩౩: చూ, ఏ.

అదిగో, దే. ద్ర: చూ, రూ-అదిగొ.

అదితి, సం.వి.ఇ.స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. పుడమి: చూ, భూమి. 1; 3. దేవతలతల్లి: చూ, మాత. 1-౩; 4. పునర్వసు నక్షత్రము: చూ, రిక్క. 1-౬.

అదితినందనుఁడు, సం. వి. అ. పు. దేవుఁడు: చూ, వేలుపు.

అదితిభము, సం. వి. అ. న: చూ, అదితి. 4.

అదిర, దే. అవ్య. రూ-అదిరా-అద్దిర-అద్దిరా-1. ఔరా, ఆశ్చర్యార్థకము. పాంచా. ౫-౬౭: చూ, వింత. 1.

అదిరి, దే. అవ్య. ఉన్నట్టుండి: చూ, దబ్బాటు.

అదిరిపడు, ద్వి. అ. క్రి. ఉలికిపడు: చూ, వడఁకు. 2.

అదిరిపాటు, ద్వి. అవ్య: చూ, అదిరి.

అదీనము, సం. వి. అ. పు. 1. ఏనుఁగు: చూ, హస్తి. 1; విశే. 2. దీనముకానిది.

అదీనుఁడు, సం. వి. అ. పు. ధైర్యశాలి: చూ, దిట్టఁడు.

అదుకు: చూ, రూ-అతుకు.

అదుము, దే. స. క్రి. 1. అడఁగఁజేయు: చూ, పిసుకు. 3; 2. నొక్కు: చూ, పిసుకు. 1.

అదుముడు, దే. వి. ఒత్తుట: చూ, సమ్మర్దము. 1.

అదుముపడు, ద్వి. అ. క్రి. ఒత్తువడు: చూ, పీడితమగు.

అదురు, దే. వి. 1: చూ, రూ-అదిరి. 1; 2, 3; అ. క్రి. 2: చూ, రూ-అదరు. 4, 5.

అదురుగ్రోవి, దే. వి. (అదురు+గ్రోవి) ప్రాణియందు ఇనుప గొట్టమును నాటించి దానియందు మందు గట్టించి అదురు పట్టుచేసెడిగ్రోవి: చూ, అదురుచేటు.

అదురుగ్రిక్క. దే. వి. (అదురు+గ్రిక్క) ఒకానొక పశు రోగము. హంసి. ప్ర. ౬-౧౬౬; భార. విరా. ౧-౨౫౬. రూ-అదుపుగ్రిక్క-అప్పురుగ్రిక్క: చూ, పశురోగము.

అదురుగడ, దే. వి: చూ, అదిరి. ఉ. రా. ౨-౫౫.

అదురుగుండియ, దే. విశే. రూ-అదురుగుండె. బెదరుగుండె

అదురుగుండె, —పై.— [వాఁడు: చూ, వెఱపరి.

అదురుచు, దే.అ.క్రి. రూ-అదురు అదుర్చు-అద్రుచు, కదలు: చూ, సలించు.

అదుర్చు, —పై.—

అదురుచేటు, దే. వి: చూ, అదురుగ్రోవి.

అదువ, దే. విశే. రూ-అద్దువ. స్థిరము లేనిది: చూ, అస్థిరము.

అదువకాఁపు, దే. వి. రూ-అదువుకాఁపు: చూ, అద్దెకాఁపు. 1.

అదువకాఁపురము, దే. వి: చూ, రూ-అదువుకాఁపురము.

అదువుకాఁపు, —పై.—

అదువుకాఁపురము, దే. వి. రూ-అదువకాఁపురము - అద్దెకాఁపురము: చూ, బొకాఁపు.

అదూరము, సం. విశే. సమీపించినది: చూ, సమీపము. 1-౨.

అదూషితము, అం. వ్యానకరణబంధము లిరువదియొకటింటిలో నొకటి. ఇది పదివిధములు:— వ్యానతము, నిష్పాటితము, నిఘాతము, చటకవిలసితము, జుప్పము, వరాహఘాతకము, వృషాభిఘాతము, మైనుకము, ఐభము, మార్జారము (౧౦): చూ, వ్యానకరణబంధములు.

అదృప్తుఁడు, సం. విశే. గ్రుడ్డివాఁడు: చూ, రేచీఁకు.

అదృశ్యమగు, మి. అ. క్రి. కనఁబడకపోవు: చూ, మఱుఁగుపోవు.

అదృశ్య, అం: చూ, కళలు.

అదృశ్యము, సం. విశే. దృశ్యముకానిది. (దృశ్యము-చూడఁదగినది): చూ, వినాశము. 2.

అదృశ్యుఁడు, సం. విశే: చూ, కానరానివాఁడు.

అదృష్టతరము, అం: చూ, షోడశసంధులు.

అదృష్టము, సం. వి. అ. న. 1. అగ్నిజలాదుల వలనఁబుట్టెడి కీడులు:— ఐంద్రి, దురదృష్టము, అనయము, దైవఘటన, దౌర్భాగ్యము, భాగ్యము, ఆదిశబ్దముచేత వ్యాధిదుర్భిక్ష మూషికశలభముల వలని భయములు; మఱియు దృష్టాదృష్ట ఫలప్రదాయకములలో రెండవది, మోక్షము; 2. భాగ్యము: చూ, సంపత్తి. 1; విశే. 3. చూడఁబడనిది, ముందుగా తెలియఁబడనిది: చూ, వినాశము. 2.

అదృష్టవంతుఁడు, సం. వి. త్. పు: చూ, సంపన్నుఁడు.

అదృష్టశాలి, సం. వి. న్. పు. —పై.—

అదృష్టహీనుఁడు, సం. వి. అ. పు: చూ, పెట్టిపుట్టనివాఁడు.

అదృష్టి, సం. వి. ఈ. స్త్రీ. రోషముచేఁ గ్రూరమైనచూపు: చూ, వీక్షణము. 1-౧౬.

చేతఁగాని విషువఁబడఁగా తెచ్చి పెంచుకొన్న కొడుకు: చూ, పుత్రులు. 1-౬.
అపవిష, సం. వి. ఆ. స్త్రీ. అతివస*: చూ, విష.
అపవేష్టితకము, అం. చూ, హస్తప్రాణములు.
అపశదుఁడు, సం. విణ. రూ-అపసదుఁడు: చూ, హీనుఁడు.
అపశబ్దనుఁడు, సం. విణ. వ్యాకరణవిరుద్ధముగ మాటలాడు వాఁడు, గ్రామ్యవాది.
అపశబ్దము, సం. వి. అ. పు. తొప్పపుమాట: చూ, శబ్దము. 2-౪.
అపష్ఠువు, సం. వి. ఉ. పు. 1. కాలము: చూ, సమయము. 2; విణ. 2. వాటము తప్పినది: చూ, ప్రతికూలము.
అపసంస్కృతము, అం: చూ, పదదోషములు, (చూ, కావ్యదోషములు) ఉదా:- దర్శనము, స్పర్శనము అనుశబ్దములను దరిశనము, స్పరిశనము అని వ్రాయరాదు. సంస్కృత శబ్దము లందలి సంయుక్తవర్ణములో విడదీసి వ్రాయుటతప్పు. నైవేద్యము అను దానిని నయివేద్యము అనరాదు.
అపసదుఁడు, సం. విణ: చూ, రూ-అపశదుఁడు.
అపసవ్యము, అం. ఔపాసనాగ్ని: చూ, వహ్ని. 1-౩౩.
అపసరణము, సం. వి. అ. పు: చూ, అపవర్జనము.
అపసరము, —పై.—
అపసరిల్లఁజేయు, మి. అ. క్రి: చూ, విసర్జించు.
అపసరిల్లు, సం. అ. క్రి. తొలఁగు: చూ, విరియు. 5.
అపసర్జనము. సం. వి. అ. న. 1: చూ, అపసరణము; 2. దానము: చూ, వితరణము; 3. చంపుట: చూ, హింస. 1.
అపసర్పుఁడు, సం. వి. అ. పు. చారుఁడు: చూ, వేగువాఁడు.
అపసవ్యజానువు, అం: చూ, ప్రచారములు.
అపసవ్యము, సం. విణ. 1. దక్షిణభాగము, కుడి: చూ, సత్యము. 2. (హరిత్తు. 1-౨); 2. వాటముతప్పినది: చూ, సవ్యము. 3.
అపసారము, సం. వి. అ. పు. తలఁగుట: చూ, విమోచనము.
అపసృతము, అం: చూ, పార్శ్వక్రియలు.
అపస్కరము, సం. వి. అ. పు. నొగకాఁడి బండికన్ను మొదలయిన రథావయవము; చూ, రూ-అవస్కరము. 2.
అపస్నాతుఁడు, సం. విణ. చావునిమిత్తము స్నానముచేయు వాఁడు: పుత్రాదులచేత సంస్కారార్థమై స్నానముచేయింపఁబడినశవము పేరు: చూ, మృతస్నాతుఁడు.
అపస్నానము, సం. వి. అ. న. చచ్చిన వారికొఱకు స్నానము, మృతస్నానము: చూ, స్నానము. 1-౪.
అపస్మారము, సం. వి. అ. పు. 1. మోహదుఃఖాదులచేఁ గలిగెడియావేశము: చూ, అపస్మృతి. 1. 2. తిఱుపుమఱుపు చెఱుపు మఱుపు, మాటలరోగము: చూ, రోగము. 1-౪౧.
అపస్మారి, సం. విణ: చూ, సొమ్మసిల్లినవాఁడు.
అపస్మృతి, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, అపస్మారము. 1; అం. 2: చూ, సంచారీ భావములు. (విస్మృతి, మఱపు. ఓ చెలులారా! మన చెలికత్తెకు మారకగ్రహంబావేశించెను. కావున హితమనోహరుని నామంబు ఆకుపై వ్రాసి యమ్మంత్రము నుడువుచు నీమె కెంగేలికి రక్షఁ గట్టుదమా!)
అపస్వరము, సం. వి. అ. పు. స్వరస్థానము తప్పఁజెప్పిన స్వరము: చూ, స్వరము. 2-౪౦.
అపహంలిహము, సం. వి. అ. పు. రూ-అవహంలిహము. ఎద్దు: చూ, వృషభము. 1.
అపహము, సం. విణ. చెఱుచునది.
అపహరణము, సం. వి. అ. న. దొంగతనము: చూ, హరణము. 1.
అపహరించు, సం. స. క్రి: ప్రముచ్చిలించు: చూ, సడపు.
అపహర్త, సం. విణ. దొంగ: చూ, హారకుఁడు. 1.
అపహసించు, సం. అ. క్రి. 1. దేహమదురఁగా కన్నీళ్ళు కాఱఁగా నవ్వెడు నవ్వు: చూ, హసించు. 1-౧; స. క్రి. 2. నవ్వు. చూ, హసించు. 1; 3. కొక్కిరించు: చూ, వెక్కిరించు. 2.
అపహసితము, సం. వి. అ. న. దేహమదురఁగా కన్నీళ్ళు కాఱఁగా నవ్వెడునవ్వు (ఇది అధమము): చూ, హాస్యము. 1-౩.
అపహస్తము, అం: చూ, పరిబంధములు. 1-(౧) ౨.
అపహారము, సం. వి. అ. పు. 1: చూ, అపహరణము; 2. తగ్గుదల: చూ, వెలితి. 3; 3. కీడు: చూ, హాని. 2; 4. రూ-అవహారము. మొసలి: చూ, మత్స్యము. 1-౩. 5. జూదము: చూ, వ్యవహారము. 4; 6. నీటిదయ్యము: చూ, మత్స్యము. 1-౫; 7. గ్రాహము, ఒకానొక నీరుపాము: చూ, మత్స్యము. 1-౯.
అపహారుఁడు, సం. వి. అ. పు: చూ, అపహర్త.
అపహాసము, సం. వి. అ. న: చూ, అపహసితము.
అపహాస్యము, —పై.—
అపహృతము, సం. విణ. దొంగిలింపఁబడినది: చూ, హృతము. 1.
అపహృతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, అపహారము. 1.
అపహ్నవము, అం. 1: చూ, అలంకారము. 3. (ఉపమేయ వస్తువును గాదని యుపమానమునే చెప్పుట.); 2. చెలిమి: చూ, స్నేహము. 1; 3: చూ, అపలాపము. 1.
అపహ్నుతి, అం: చూ, అపహ్నవము. 1.
అపాంక్తేయుఁడు, సం. విణ. 1. పంక్తియందు భుజింపఁదగనివాఁడు: చూ, అప్రాశ్యుఁడు; వా. 2. కంఠకావరమున శాస్త్రనిషిద్ధమని తలంపక రజస్వలయైన కన్యను వివాహమాడిన బ్రాహ్మణుఁడు: చూ, వ్రాత్యముఖుఁడు. 1-౬.
అపాంగము, సం. వి. అ. పు. 1. కడకన్ను: చూ, లోచనము. 1-౧; 2. చుక్క: చూ, బొట్టు. 1; విణ. 3: చూ, అంగహీనము.
అపాంపతి, సం. వి. అ. పు: చూ, సముద్రము.
అపాగ్రము, సం. విణ. ముఖ్యముగానిది: చూ, అప్రధానము.
అపాచి, సం. వి. ఈ. స్త్రీ. రూ-అవాచి, దక్షిణభాగము, కుడి. దక్షిణపు దిక్కు: చూ, హరిత్తు. 1-౨.
అపాతము, సం. వి. అ. న: చూ, లాఘవము.
అపాత్రము, సం. విణ: చూ, అనర్హము.
అపాత్రుఁడు, సం. విణ: చూ, అనర్హుఁడు.
అపాదానము, సం. వి. అ. న. 1. ఎందుండిపాయునో అది; అం. 2: చూ, కారకములు. (అపాదానము=రెండువస్తువులలో నొక వస్తువు విడిరాగా నక్కడ స్థిరముగానున్నది.

మఱియు:-భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము, భవనము, త్రాణము, విరామము, అంతర్ధి, వారణము ఇవి వేనివలన వచ్చునో యవి యపాదానమగును. అపాదానార్థమునఁ బంచమియగు. చెట్టువలనఁ బండు పండెను. ఇచటఁ బండు విడిరాఁగా-నక్కడ నిలిచి యున్నది చెట్టు కావున నది యపాదానము. శత్రువు వలన భయము:- ఇచట భయము శత్రువువలనఁ గలిగినది కావున శత్రువపాదానము. సంసారమువలన జుగుప్స:- (ఏవగింపు) ఇచట జుగుప్స సంసారము వలనఁ గలిగినది గావున సంసారమపాదానము. వైరివలనఁబరాజయము:- ఇచట వైరిఅపాదానము. భక్తివలనఁ బ్రమాదము-ఇచట భక్తిఅపాదానము. గురువువలనవిద్య గ్రహించెను:- ఇచట గురువుఅపాదానము. హిమవత్పర్వతము వలన గంగగలిగినది:- ఇచట హిమవత్పర్వతము అపాదానము. రాముఁడు రాక్షసులవలన యజ్ఞమును రక్షించెను:- ఇచట రాక్షసులపాదానము. వాఁడు చదువువలన విరమించెను:- ఇచట చదువు అపాదానము. కృష్ణుఁడు తల్లి వలనఁదాఁగెను:- ఇచటఁదల్లి యపాదానము. రాముఁడు దెబ్బలవలన సేనల వారించెను:- ఇచట దెబ్బలపాదానము. ఈభయాదులు వచ్చినపుడు విధించిన పంచమిహేత్వర్థ మందువచ్చునని తాత్పర్యము.

**అపానసము**, సం. వి. అ. పు. నిట్టూర్పు: చూ, వాయువు. 1-ఉ.

అపానము, సం. వి. అ. న. 1: చూ, ముడ్డి; అం. 2: చూ, వాయువు. 1-గ-(అ); 3: చూ, ప్రాణము.

అపామారకము, సం. వి. అ. పు. తుమ్మ*: చూ, విట్ఖదిరము.

అపామార్గము, సం. వి. అ. పు. 1. ఉత్తరేణి *: చూ, శైఖరికము. 1; 2. ఎఱ్ఱఉత్తరేణి*: చూ, శైఖరికము. 1-గ.

**అపాయము**, సం. వి. అ. పు. కీడు: చూ, హాని. 2.

**అపారపారము**, సం. వి. అ. పు: చూ, సముద్రము.

అపారము, సం. వి. అ. న. 1. ఇద్దరి: చూ, ఈవల. 1; 2. తుదిలేనిలెక్క: చూ, అసంఖ్యేయము; విణ. 3. తుదిలేనిలెక్కగలది: అనంతము, అనవధి, అశ్మంతము. (తె. ప):- అబ్బురము.

అపారుఁడు, సం. విణ. తుదిలేనివాఁడు:చూ, అంతరహితుఁడు.

**అపార్థము**, అం: చూ, అర్థదోషములు.

**అపావృతము**, సం. విణ. 1. కప్పఁబడినది: చూ, స్థగితము; 2. విచ్చలవిడియైనది: చూ, పుర. 3.

అపావృతుఁడు, సం. విణ: చూ, స్వతంత్రుఁడు.

అపాశ్రయము, సం. వి. అ. పు. ఒఱగుదిండు: చూ, లోడు. 1; విణ. 2. ప్రాపుపోయినది.

అపాశ్రయుఁడు, సం. విణ. ప్రాపుపోయినవాఁడు.

అపాసనము, సం. వి. అ. న. చంపుట: చూ, హింస. 1.

అపాస్తము, సం. విణ. మఱలఁబడినది: చూ, నివర్తితము.

అపి, సం. అవ్య. 1: చూ, అపదూఱు; 2. చెదరినవాని నొకటిగా ప్రోగుచేయుట: చూ, సముచ్చయము. 2; 3. ప్రశ్నార్థకము: చూ, సవాలు; 4. సంశయార్థకము: చూ, సంశయము; 5. తలపోయుట: చూ, సంభావన. 2; 6. బలవంతము: చూ, హతము. 2; 7. మఱుఁగు: చూ, వ్యవధానము. 3; 8. ఏవకారార్థకము: చూ, ఏవమ్; 9. పదార్థము: చూ, సరకు. 2; 10. నిశ్చయార్థకము: చూ, సత్యము. 1; 11. గ్రంథభాగవిశేషము: చూ, సర్గము. 1; 12. వెలుఁగు: చూ, వెలుతురు. 1; 13. మూగవానిచేష్ట; ఉప. 14. "అపి" యను ఉపసర్గతోఁ జేరిన శబ్దములు:— అపినద్ధము, అపిధానము.

అపిధానము, సం. వి. అ. న. 1. మఱుఁగు: చూ, వ్యవధానము. 3; ఉప. 2. ఇచట "అపి" అనునది ధాత్వర్థమును "కప్పు" అను నర్థమునకు మార్చినది.

అపినద్ధ(ద్ధ)ము, సం. విణ. 1. కట్టఁబడినది (వస్త్రము): చూ, వస్త్రము. 1-అ; 2. తొడుగఁబడినది (కవచము): చూ, వారవారణము. 1; ఉప. 3. ఇచట వ్యర్థమైనది.

అపిభవము, సం. వి. అ. పు. తిరస్కారము: చూ, హేళనము.

అపుఁడు, సం. అం. రూ-అపువు: చూ, వసువులు.

అపుడు, ద్వా. వి. ఏ. రూ-అప్డు. 1. అకాలము: చూ, రూ-అప్పుడు; ద్ర. 2. —పై.—

అపుణ్యము, సం. విణ. పుణ్యముకానిది: చూ, వృజినము. 1.

అపుత్త్రవంతుఁడు, సం. విణ. అనపత్యుఁడు. అపుత్త్రిఁడు, బిడ్డలులేనివాఁడు: చూ, పూసుఁడు. 1-ఉం.

అపుత్త్రస్యగతిర్నాస్తి, న్యా. పుత్త్రులులేనివాని కూర్ధ్వలోకగతులులేవు.

అపుత్త్రుఁడు: చూ, అపుత్త్రవంతుఁడు.

అపునర్భవము, సం. వి. అ. పు. ముక్తి: చూ, మోక్షము. 1.

అపురూపము, వై. బ = అపూర్వమ్. ముందులేనిది. ఏకా. ఉ-౨౧౬: చూ, క్రొత్త. 2.

అపుష్టార్థము, అం: చూ, పదదోషములు (ప్రస్తుతోపయోగము లేని ప్రయోగము. ఉదా:-వింశత్యర్ధానుని, వింశత్యర్థరథుని కొడుకు తునిమెను. అనఁగా దశాననుని, దశరథుని కొడుకు చంపెనని యర్థము. ఇచట "దశ" అనుటకు ఇరువదిలో సగమని చెప్పుట యనుపయోగము. ఇట్లు చెప్పుట వలన నేమియుఁ బ్రయోజనముఁగూడఁ గాన్పింపదు. ఉ॥ద॥

అపుష్పము, సం. వి. అ. పు. అత్తి*: చూ, మేడి.

అపృష్టప్రవాహరణము, అం: చూ, ప్రచారములు. [1-౩.

అపూపము, సం. వి. అ. పు. = అప్పము : చూ, భక్ష్యము.

అపూపికము, —పై.—

అపూపికుఁడు, సం. విణ. పిండివంటలు చేయువాఁడు: చూ, వంటవాఁడు.

అపూరణి, సం. వి. ఇ. స్త్రీ: చూ, అసంపూర్ణము.

అపూర్ణము, సం. విణ. 1. —పై.—; అం. 2: చూ, వాక్యదోషములు. (ఉ. వాక్యము క్రియాన్వయంబుల సరిపోని యెడలనపూర్ణము " తమదేశము విదేశీయునిఁ బాఱదోలు " "తమదేశమునుండి విదేశీయులఁ బాఱఁదోలు" అని వ్రాసిన వాని యభిప్రాయము.)

అపూర్వము, సం. విణ: చూ, అపురూపము.

అపూర్వవాది, సం. వి. న్. పు. మీమాంసశాస్త్రము తెలిసిన వాఁడు: చూ, మీమాంసకుఁడు.

అపూర్వవిధి, అం: చూ, విధులు. [తప్పు.

అప్పచ్ఛోత్తరన్యాయము, న్యా. అడుగకుండ జవాబు చెప్పుట

అపృష్టోపి శుభం బ్రూయాత్, న్యా. అడుగకుండఁగనే శుభమును చెప్పవలయును.
అపృష్టోపి హితంవదేత్, న్యా. అడుగకుండఁగనే హితమును చెప్పవలయును.
అపేక్ష, సం. వి. అ. స్త్రీ. 1. ఇచ్ఛ: చూ, వాంఛ. 1; 2. అధికమైన కోరిక: చూ, వాంఛ. 1-౧.
అపేక్షణీయము, సం. విశే. కోరఁదగినది: చూ, వాంఛ.1-౩౨.
అపేక్షపడు, మి. అ. క్రి: చూ, వాంఛించు.
అపేక్షపెట్టు. మి. స. క్రి: చూ, ఆసపెట్టు.
అపేక్షించు, సం. స. క్రి. కోరు: చూ, వాంఛించు.
అపేక్షితము, సం. విశే. కోరఁబడినది: చూ, వాంఛ. 1-౩౩.
అపేక్ష్యము, సం. విశే: చూ, అపేక్షణీయము.
అపేతము, సం. విశే. తొలఁగినది: చూ, విమోచనము.
అపైశునము, సం. వి.అ.న. న్యాయబుద్ధి: చూ, సత్యము. 1-౧
అపోగండఁడు, సం. వి. అ. పు. 1. రూ - అపోగండుఁడు, బాలపాపఁడు: చూ, శిశువు; విశే. 2. చొట్టపోయిన శరీరముగలవాఁడు: చూ, వికలాంగుఁడు; 3. వడలుగలవాఁడు: చూ, రూ-అపోగండఁడు.
అపోదకి, సం. వి. ఈ. స్త్రీ. మట్టుబచ్చలి*: చూ, బచ్చలి.
అపోశనము, వై. వి. =అపోశనమ్. రూ-అపోసనము-అపోసనము - అపోసము. భోజన ప్రారంభమున పుడిసిటజలము పోసికొని మంత్రపూర్వకముగాఁ బుచ్చుకొనుట, ఆపోశనము: చూ, శుద్ధాచమనము.
అపోహము, సం. వి. అ. న. లేనిది ఊహించుట, ఊహించుట: చూ, యోచన. 1.
అప్పు: చూ, రూ-అపుడు.
అప్తువు, సం. వి. ఉ. స్త్రీ. యజ్ఞపశువు: చూ, ధేనువు. 1-౨౫.
అప్తోర్యామము, అం: చూ, సోమయజ్ఞములు.
అప్ప, వై. వి. 1. = అమ్మకః. రూ-అప. తండ్రి. అచ్చ.యు. కాం. ౬౫: చూ, సవిత. 2; 2. = అమ్బా. రూ-అప. తల్లి చూ, మాత. 1; 3. అక్క. రూ-అప: చూ, జ్యేష్ఠ. 4; 4. అన్న: చూ, జ్యేష్ఠుఁడు. 1; వై. అవ్య. 5. ఆశ్చర్యార్థకము. రూ.అప్పా. ఆమ్రేడితమందు అప్పప్ప. సా. ౧-౩౧: చూ, వింత. 1.
అప్పగించు, వై. స. క్రి. = అర్పణ: చూ, వశపఱచు; 2 = అర్పించు. వదిలముగాకాపాడుమని యొప్పగించు: చూ, ఒప్పగించు.
అప్పగింత, వై. వి. = అర్పణమ్: చూ, ఒప్పగింత.
అప్పచి, వై. వి. రూ-అప్పచ్చి: చూ, అపూపము.
అప్పచి, —వై.—
అప్పచిలు, దే. వి. బ. రూ-అప్పచ్చిలు. చంద్రా. 2-౬: చూ, బాలక్రీడ.
అప్పచ్చిలు, —వై.—
అప్పడము, దే. విశే. తేరినది: చూ, ప్రసన్నము. 2.
అప్పటి, దే. అవ్య. పునరర్థకము: చూ, వెండియు.
అప్పడము, వై. వి.=అర్పటి. కళా. ౬-౮౧: చూ, అప్పచ్చి. 1.
అప్పణ, వై. వి. = అర్పణ. రూ-అప్పన, ఆజ్ఞ: చూ, సెలవు.
అప్పతి, సం. వి. ఇ. పు: చూ, వరుణుఁడు.
అప్పన, వై. వి. 1. = అర్పణ. శుక. ౨-౨౧౫: చూ, రూ-అప్పణ; 2. పన్ను: చూ, సిస్తు. 1.
అప్పనము, వై. వి. 1. రూ-అప్పన. పన్ను: చూ, సిస్తు. 1; 2. కట్నము, కానుక: చూ, లంచము; 3. = అర్పణమ్. అప్పగింత: చూ, ఒప్పగింత; వా. 4. తేరగా. “అప్పనపు మెతుకులు తినుచున్నాఁడు.”
అప్పనసేయు, వై. స. క్రి. (అప్పనము+సేయు) చెప్పు: చూ, వచించు; 2. అప్పగించు: చూ, వశపఱచు.
అప్పము, అం. 1: చూ, పండ్రులు; వై. వి. (1). అపూపః గుడా పూపమను భక్ష్యము: చూ, భక్ష్యము. 1-౮.
అప్పళము, వై. వి. 1. = అర్పటః: చూ, రూ - అప్పడము; 2. = ఆస్ఫాలః. అప్పళింత: చూ, చఱపు. 1; 3. వేగిరము: చూ, స్వరము. 1.
అప్పళములు, వై. వి. బ: చూ, బాలక్రీడ.
అప్పళించు, వై. స. క్రి. 1. తాఁకు: చూ, స్పృశించు; 2. కప్పు. స్వా. ౫-౫౫: చూ, స్థగనముచేయు; 3. చఱచు: చూ, పటపటించు; 4. ఆక్రమించు: చూ, ముగిరించు; 5. గ్రహించు. వై. ౬-౧౩౩: చూ, స్వీకరించు; 6. పడిపోవ నొత్తు. ఉ. రా. ౬-౨౦౭: చూ, ప్రాకు; 4; 7. మన్ను లోనగు వానిని దళముగా పూయు. వై. ౨-౧౪౧: చూ, లేపనము చేయు; వై.అ. క్రి. 8. ఉత్సహించు, యత్నించు: చూ, సమకట్టు. 2.
అప్పళింత, వై. వి. = ఆస్ఫాలనమ్: చూ, చఱపు.
అప్పసము, దే. అవ్య. 1. ఎల్లప్పుడు. శుక. ౧-౩౩౯: చూ, సతతము. 2; వి. 2. మనుష్యులచేతఁ ద్రవ్వఁబడిన చిన్న నీటి కాలువ: చూ, నది. 1-౧౧-(౧).
అప్పా, వై. అవ్య: చూ, రూ-అప్ప 5; రా, వి. ౧-౫౯.
అప్పాటున, దే. అవ్య: చూ, తప్పాటు.
అప్పిచ్చినవాఁడు, అం. 1: చూ, గయాపిండదానార్హులు; వా. వి. 2. ఋణదాత.
అప్పిచ్చు, ద్వ. స. క్రి: చూ, బదులిచ్చు.
అప్పిత్తము, సం. వి. అ. న. అగ్ని: చూ, వహ్ని 1.
అప్పీలు, వా. వి. క్రిందికోర్టుతీర్పును త్రిప్పివేయుడని పైకోర్టునకు చేయు విన్నపము.
అప్పు, సం. న్. స్త్రీ. బ. 1. నీరు: చూ, సలిలము. 1; దే. వి. (1) అప్పు: చూ, బాకీ. 2; అం. 3: చూ, ద్రవ్యములు; 4: చూ, మూర్తులు; 5: చూ, పంచభూతములు.
అప్పుడప్పుడు, ద్వ. వి. స. (అప్పుడు+అప్పుడు): చూ, ఎడ పడడప.
అప్పుడు, ద్వ. వి. ఏ. (అ+పొద్దు): చూ, రూ-అపుడు.1, 2.
అప్పుడే, వా. వి. 1: చూ, ఇప్పుడే; 2. అంతకుముందే; 3. అవెంటనే.
అప్పుతాత, మి. వి. ఆకసము: చూ, వ్యోమము. 1.
అప్పుపడు, దే. అ. క్రి. రూ-అప్పుపడు: చూ, ఋణపడు.
అప్పుపడుట, అం: చూ, అష్టకష్టములు.
అప్పుపుచ్చుకొను, అం: చూ, వివాదములు.
అప్పుయిచ్చు, దే. స. క్రి: చూ, ఋణమిచ్చు. [గ్రాహకుఁడు.
అప్పులకొఁపు, దే. వి. అప్పు పుచ్చుకొన్నవాఁడు: చూ, ధన

**అప్పులపోతు**, —పై.—
అప్పులవాఁడు, వా. వి. అప్పిచ్చినవాఁడు: చూ, ఉత్తమర్ణుఁడు.
అప్పుపడు, దే. అ. క్రి: చూ, రూ-అప్పుపడు.
అప్పువిడుదల, ద్వ. వి: చూ, విగణనము.
అప్పుసప్పు, జా. ఋణముఫణము.
**అప్రకాశము**, అం. అభిజిత్తు, బొమ్మరిక్క, కానరాని రిక్క: చూ, రిక్క. 1-౨౫.
అప్రకాశములు, అం: దానహీనుఁడగురాజు, నీళ్ళులేనియేఱు, నిజముకానిమాట, విద్వాంసులులేని సభ, కమలములులేని సరస్సు, కన్నులులేని ముఖము, బిడ్డలు లేని గృహము, మగఁడులేని యాఁడుది, చుట్టాలులేని యూరు. (౯).
అప్రకృతానేక విషయశ్లేషము, అం: చూ, అలంకారము. 3.
**అప్రగుణము**, సం. విణ. వ్యాకులతనొందినది: చూ, వ్యస్తము. 2.
అప్రతితాళము, అం: చూ, తాళము. 2.
**అప్రతిపత్తి**, సం. వి. ఇ. స్త్రీ. ఏమియుతోఁపక పోవుట.
**అప్రతిష్ఠ**, సం. వి. ఆ. స్త్రీ. అగౌరవము: చూ, నడి. 3.
అప్రతిహతము, సం. విణ. నాశనములేనిది: చూ, శాశ్వతము.
**అప్రతీతము**, అం. రూ-అప్రతీతకము: చూ, పదదోషములు (శాస్త్రపురాణాదులలోని మాటలు వాడుట. ఉ. ప్రమాణంబు నిన్ను రక్షించునుగాక, ప్రమాణము విష్ణునామ పర్యాయంబుగా విష్ణుసహస్ర నామశ్లోకంబునఁగలదు. కావుననిది యెల్లరకు సుబోధకముగామియె నిషేధించుటకుఁగారణము.) (ఉ॥ ద॥).
**అప్రత్యక్షము**, సం. విణ. కనుపించనిది: చూ, వినాశము. 2.
అప్రత్యక్షవిజయజ్ఞానము, అం: చూ, అభిజ్ఞలు.
అప్రధానము, సం. వి. అ. న. ప్రధానముకానిది: అంగము, అప్రాగ్ర్యము, ఉపసర్జనము, గుణము.
**అప్రమాణము, సం.** వి. అ. న. అబద్ధపు ప్రమాణము: చూ, సొంటు.
అప్రమేయుఁడు, సం. వి. అ. పు: చూ, వేలుపు.
అప్రయుక్తము, అం: చూ, పదదోషములు. (కవులు ప్రయోగింపనిది. ముడ్డిమున్నగు నీచజనులచేవాడఁబడు శబ్దమునను బ్రయోగింపరాదు. ముడ్డివిషయమై చెప్పవలసి వచ్చినప్పుడు. తదర్థబోధకమగు పిఱుఁదు శబ్దము నుపయోగింపవలెను. బూతులుకావ్య రచన యందుపయోగింపరాదు. సంభోగాది శబ్దార్థములు నింద్యములు. (ఉ॥ ద॥): చూ, కావ్యదోషములు)
**అప్రయోజకము, సం.** విణ. 1: చూ, వ్యర్థము; అం. 2: చూ, పదదోషములు. (విశేషము లేకుండుట: చూ, కావ్యదోషములు.)
**అప్రయోజకుఁడు**, సం. విణ: చూ, వ్రాజె.
**అప్రయోజనము**: చూ, అప్రయోజకము.
**అప్రవృత్తి, సం. వి.** ఇ. స్త్రీ: చూ, మఱలఁబాటు.
అప్రశస్తము, సం. విణ: చూ, ఓగు.
అప్రసక్తనిషేధన్యాయము, న్యా. వెనుకటి గ్రంథమువలన నెద్దియేని యొకటి సంబంధములేని స్థలమందుగూడఁ బ్రసక్తించినపుడు దానిని నిషేధింపవలయునుగాని ప్రసక్తించనిది నిషేధింపఁగూడదు. ఎట్లనః- ప్రాతఃకాలంబునఁ బువ్వులు వికసించును, అనువాక్యములే నెల్లపూవులు వికసించుట చెప్పగా గలువపువ్వులకుగూడ వికాసము ప్రసక్తించినది. కావునఁ గలువలు వికసింపవని నిషేధింపవలయును. ఇది ప్రసక్తనిషేధము. చీఁకటి తెల్లగానుండదు. అని చెప్పుట అప్రసక్త నిషేధము అనురీతి.
అప్రసిద్ధము, వా. విణ. ప్రసిద్ధముకానిది.
అప్రసిద్ధి, సం. విణ: చూ, రహస్యము. 1.
అప్రసిద్ధదోషములు, అం: చూ, అర్థదోషములు.
అప్రస్తుతతుల్యయోగిత, అం: చూ, అలంకారము. 3 (ఇట్లు **అ**ప్రస్తుత ప్రశంస, అప్రస్తుత ప్రసంగము.)
అప్రస్తుతప్రసంగము, అం. 1. —పై.—; వి. అ. పు. 2: చూ, అధికప్రసంగము.
అప్రస్తుతము, సం. విణ: చూ, అసంగతము. 2.
అప్రహతము, సం. విణ. దున్ననిది(నేల): చూ, భూమి. 1-౩.
అప్రాకృతము, సం. విణ. 1. చంపఁబడినది: చూ, ప్రోక్షితము; 2. విధింపఁబడినది: చూ, విహితము; 3. మేలిమి: చూ, లోహము. 1-౫-(౧).
అప్రాకృతుఁడు, సం. విణ: చూ, స్వతంత్రుఁడు.
అప్రాణి, సం. వి. న్. స్త్రీ: చూ, జడము. 5.
అప్రాణిద్యూతము, వా. వి. బ. సొగటాలు, చతురంగము మున్నగు ఆటలు.
**అ**ప్రాప్యము, సం విణ. అందరానిది: చూ, వెక్కసము. 3.
అప్రాప్తి, సం. వి. ఇ. స్త్రీ. —పై.
అప్రామాణికుఁడు, సం. విణ. ప్రామాణికుఁడు. కానివాఁడు.
అప్రావృతము, సం. విణ. 1. తనది: చూ, సతంత్రము; 2. చుట్టుకొనఁబడినది: చూ, సంవృతము; 3. విధింపఁబడినది: చూ, విహితము,
**అ**ప్రాశ్యుఁడు, సం. విణ: చూ, అపాంక్తేయుఁడు.
**అ**ప్రియము, సం. విణ. ప్రియముకానిది: చూ, వ్యళీకము. 1.
అప్రీతి, సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రీతిలేమి: చూ, రోఁత. 3; విణ. 2. ఇష్టముకానిది: చూ, అనిష్టము. 2.
అప్లుతము, అం: చూ, ప్రచారములు.
అప్సర, **సం.** వి. న్. స్త్రీ. =అచ్చర. రూ-**అప్సరస**: చూ, అచ్చర.
అప్సరస, —పై.—
అప్సుచరము, సం. వి. అ. పు. చేఁప: చూ, మత్స్యము. 1.
అప్సుజము, సం. వి. అ. న: చూ, అంభోజము.
అఫల, సం. వి. ఆ. స్త్రీ. ఏఱుజాజి*: చూ, ధాతకి.
**అఫలము**, సం. వి. అ. న. 1. ఏడికోలలేనినాగలి, కఱ్ఱు లేనిది అనికొందఱు) అధోహలము: చూ, లాంగలము. 1; 2. గొడ్డుమ్రాను: చూ, వంధ్య. 3.
అఫేనము, సం. వి. అ. పు. 1: చూ, నల్లమందు; విణ. 2. నురుగులేనిది.
అబందన, వై. విణ. = అభ్యంతరమ్. క్రమభంగము. చక్కన చెడినది: చూ, అభ్యంతరము. 5.
అబందర, —పై.—
అబక, వై. వి. = అభ్రి: చూ, రూ-అపక-అగప.
**అబద్ధము, సం.** విణ. 1. నిజముకానిది. అము. ౯-౩౬: చూ, వితథము; 2. సాముదాయార్థములేనిమాట; చూ, **శబ్దము**: (చూ, వితథము.)

అబద్ధముఖుఁడు, సం. విణ. ప్రేలరి: చూ, ముఖరుఁడు.
అబల, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుది: చూ, స్త్రీ. 1; విణ. 2. బలములేనిది: చూ, అశక్యము. 2.
అబలుఁడు, సం. విణ: చూ, నిస్సారుఁడు.
అబాంధవము, సం. విణ. అడ్డుపాటులేనిది: చూ, నిరర్గళము.
అబాధకము, —పై.—
అబాధకుఁడు, సం. విణ. 1: చూ, నిరర్గళుఁడు; 2: చూ, శాంతుఁడు.
అబాధము, సం. విణ: చూ, రూ-అబాంధము.
అబిసీలు, దే. వి. బ. వాహ్యాళి. చంద్రాం. ౪-౧౯: చూ, విహారము. 1.
అబ్జ, సం. వి. ఆ. స్త్రీ. 1. లచ్చి: చూ, లక్ష్మి. 1; 2. సురాభేదము: చూ, సుర. 1.
అబ్జజుఁడు, సం. వి అ. పు: చూ, బ్రహ్మ. 1.
అబ్జదళము, సం. వి. అ. న: చూ, తామరరేకు.
అబ్జబాంధవుఁడు, సం. వి. అ. పు: చూ, సూర్యుఁడు.
అబ్జభవుఁడు, సం. వి. అ. పు: చూ, బ్రహ్మ. 1.
అబ్జము, సం. వి. అ. న. 1: చూ, అంభోజము. 1; 2: చూ, అంభోజము. 2; 3. ఉప్పు: చూ, లవణము. 1; పుం, న. 4. శంఖము: చూ, సంకు. 1; పుం. 5. ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము; 6: చూ, అబ్ధిజము. 1: 7. నీరుప్రబ్బలి*: చూ, ప్రబ్బలి; 8. ముస్త*: చూ, రాజకశేరుక.
అబ్జయోని, సం. వి. ఇ. పు: చూ, బ్రహ్మ. 1.
అబ్జవాహనుఁడు, సం. వి. అ. పు: చూ, శివుఁడు. 1.
అబ్జారి, సం. వి. ఇ. పు. చంద్రుఁడు: చూ, హిమాంశువు.
అబ్జుఁడు, సం. వి. అ. పు. 1.—పై—; 2: చూ, వైద్యుఁడు.
అబ్దము, సం. వి. అ. పు. 1: చూ, సంవత్సరము; 2.=అద్దము: చూ, ముకురము; 3. కొండ: చూ, పర్వతము. 1; 4. అబ్దమనుకొండ: చూ, పర్వతము. 1-౨; 5. తుంగ*: చూ, తృణము. 1-౩౧; 6. మబ్బు: చూ, మేఘము. 1; 7. కుంద: చూ, ఖండము. 3.
అబ్దుఁడు, సం. వి. అ. పు. 1: చూ, శివుఁడు. 1; 2: చూ, సూర్యుఁడు.
అబ్ధి, సం. వి. ఇ. పు. 1: చూ, సముద్రము; 2. కొలను: చూ, సరస్సు. 1; 3. గంగ: చూ, నది. 1; సర్వ. 4: చూ, నాలుగు.
అబ్ధికఫము, సం. వి. అ. పు. సముద్రపు నురుగు: చూ, ఫేనము.
అబ్ధిజ, సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మీదేవి: చూ, లక్ష్మి. 1.
అబ్ధిజము, సం. వి. అ. న. 1. కల్పవృక్షము: చూ, వేలుపుఁజెట్టు; 2. ఉప్పు: చూ, అబ్జము. 3.
అబ్ధిజుఁడు, సం. వి. అ. పు. 1: చూ, వైద్యుఁడు; 2: చూ, అబ్జారి; 3. రాహుగ్రహము; చూ, రాహువు. 1; 2; 4: చూ, సూర్యుడు.
అబ్ధినవనీతము, స. వి. అ. న. అమృతము: చూ, సుధ. 1.
అబ్ధినవనీతుఁడు, సం. వి. అ. పు: చూ, అబ్జారి.
అబ్ధిపల్లవము, సం. వి. అ. పు. పగడము: చూ, రత్నము. 1.
అబ్ధిమేఖల, సం. వి. ఆ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1.
అబ్ధివశువు, సం. వి. ఉ. స్త్రీ: చూ, అబ్ధి. 3.
అబ్బ, వై. వి. 1.=అమ్బా. చంద్రి: చూ, సవిత. 2; అవ్ర 2. సంతాపార్థకము (ఆమ్రేడితమందు. అబ్బబ్బ-అబ్బబ్బా.): రూ-అబ్బా: చూ, సంతాపము.
అబ్బకాఁడు, వ్యా. విణ. మూర్ఖుఁడు: చూ, షణ్ఢుఁడు.
అబ్బరము, వై. వి=అద్భుతమ్. 1. ఆశ్చర్యము; చూ, వింత. 1; విణ. 2. మేరలేనిది, అప్ప. యు, కాం, ౧౮౮: చూ, అపారము. 1.
అబ్బాటు, దే. వి. 1. అకస్మాత్తు: చూ, రూ-దబ్బాటు; 2. బసవపుర్థమువలనఁ గలిగెడికాఁక. స్వా. ౫-౭౧: చూ, సంతాపము.
అబ్బాయి, దే. వి. 1. బాలుఁడు: చూ, శిశువు; వా. 2. కొడుకు: చూ, సూనుఁడు. 1. "పెద్ద అబ్బాయి, చిన్న అబ్బాయిఁ బుల్లి అబ్బాయి, బుచ్చి అబ్బాయి" మొ.
అబ్బాలాడు, దే. అ. క్రి. (అబ్బాలు+ఆడు) తొట్రుపడు: చూ, సంభ్రమించు.
అబ్బి, దే. వి. రూ-అబ్బీ. 1: చూ, అబ్బాయి. 1: వా. 2. కాలికి వచ్చినవాని పిలుపు. "బండి అబ్బి.": రూ-అబ్బీ.
అబ్బీ, —పై.—
అబ్బు, వై. అ క్రి.=అప్. ఆప్తిః. దొరకు: చూ, లోఁబడు.
అబ్బురపడు, వై. అ. క్రి. (అబ్బురము+పడు) రూ-అబ్రపడు: చూ, వెఱఁగొందు.
అబ్బురపాటు, వై. వి. (అబ్బురము+పాటు) రూ-అబ్రపాటు: చూ, వింత. 1.
అబ్బురము, వై. వి, విణ. రూ-అబ్రము. 1.=అద్భుతమ్: చూ, వింత. 1; 2.=అపూర్వమ్. అపురూపము. కళా. ౫-౧౮౬: చూ, క్రొత్త. 2.
అబ్బె, వా. వి. రూ-అబ్బే: చూ, రూ-అంబే. 2.
అబ్బెంద, దే. వి. ఒకానొక వృక్షము. య. ౪-౨౬: చూ, వృక్షము. 1-౧౮.
అబ్బెసము, వై. వి. = అభ్యాసః. కాశీ. ౫-౨౩౨; నై. ౧-౬౫: చూ, స్వభావము.
అబ్బెను, వా. క్రి. లభించెను.
అబ్రపడు: చూ, అబ్బురపడు.
అబ్రము: చూ, రూ-అబ్బురము.
అబ్రహ్మచర్యకము, సం. వి. అ. న. రతి: చూ, సంయోగము.
అబ్రహ్మణ్యము, సం. విణ. 1. చంపతగవిది: చూ, అవధ్యము (నాట్యమందు అధ్యుఁడను మాట.)
అబ్రహ్మణ్యుఁడు, సం. విణ. చంపఁదగనివాఁడు.
అబ్రాశి, సం. వి. ఇ. పు: చూ, సముద్రము.
అభంగము, అం: చూ, జన్యతాళములు.
అభంగురము, సం. విణ. భంగురముకానిది. (భంగురము = నశించునది.)
అభతుఁడు, సం. వి. అ. పు: చూ, శివుఁడు. 1.
అభయ, సం. వి. ఆ. స్త్రీ. కరక*: చూ, హరీతకి.
అభయము, సం. వి. అ. న. 1. ఉశీరము*: చూ, వట్టివేరు; విణ. 2. భయములేనిది: చూ, నిర్భయము.
అభయుఁడు, సం. విణ: చూ, నిర్భయుఁడు.

అభయపత్రా, సం. వి. జ్. పు. లోఁదేలు: చూ, వ్యాకము.
అభవుఁడు, సం. వి. అ. పు. 1: చూ, శివుఁడు. 1; విణ. 2. పుట్టుక లేనివాఁడు.
అభాగ్యము, సం. వి. అ. న. 1. బీదతనము: చూ, బీదరము. 1; 2. లేదు: చూ, శూన్యము. 1; విణ. 3. భాగ్యము లేనిది.
అభావము, సం. వి. అ. న. 1: చూ, అభాగ్యము. 1; 2: చూ, సావు.
అభావుఁడు, సం. విణ: చూ, బీదవాఁడు.
అభావేవిరక్తి, న్యా. (స్పష్టము.)
అభాషణము, సం. వి. అ. న. మాటలేమి: చూ, మౌనము.
అభాషణుఁడు, సం. విణ. మూఁగవాఁడు: చూ, మూగ. 3.
అభాసము, వా. విణ. భిన్నాభిప్రాయము కలిగియుండునది. రూ-అభాసు: చూ, రసాభాసు.
అభి, సం. అవ్య. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. ఇటువంటిదని చెప్పుట; 3. మరల మరల: చూ, వెండియు; 4. వంతు: చూ, భాగము. 1; 5. ఎదుట: చూ, ముందర. 1; ఉప. 6. "అభి" అను ఉపసర్గతోఁ జేరిన శబ్దములు:-అభిచారము, అభివాదము, అభిషేకము అభివృద్ధి, అభియానము. మొ॥
అభికుఁడు, సం. విణ. రూ-అభీకుఁడు: చూ, వలపుకాఁడు.
అభికృతి, అం. 1: చూ, ఛందస్సులు, నర్వ. 2. ఇరువదియైదు.
అభిక్రమము, సం. వి. అ. పు. 1: చూ, అతిక్రమము. 2; 2. ఒకటి వెంబడి యొకటి.
అభిక్ష్ణము, సం. అవ్య. రూ-అభీక్ష్ణము. 1. అసకృదర్థకము, మఱిన్ని మాటిమాటికి: చూ, శశ్వత్తు; 2. శీఘ్రము: చూ, స్యదము. 1; 3: చూ, శైఘ్ర్యము; 4: చూ, సతతము. 2.
అభిఖ్య, సం. వి. ఆ. స్త్రీ. 1. నామధేయము: చూ, సంకేతము. 1; 2: చూ, యశస్సు; 3: చూ, వెలుతురు. 1.
అభిగతము, సం. విణ. పొందఁబడినది: చూ, సంసక్తము.
అభిగమనము, సం. వి. అ. న. 1. చెలిమి: చూ, స్నేహము. 1; 2. జయమునకై యెదురుకొనిపోవుట: చూ, లూటీ. 4.
అభిగమము, పు. —పై.—
అభిగమ్యము, సం. విణ. పొందఁదగినది: చూ, సంసక్తము.
అభిగ్రస్తము, సం. విణ. మ్రింగఁబడినది: చూ, అభిపన్నము.
అభిగ్రహణము, సం. వి. అ. పు. ఎదురుగా దొంగలించుట, తెరువాటు: చూ, హరణము. 1.
అభిగ్రహము, సం. వి. అ. పు. 1. ఎదురుకొనిపోయి యాక్రమించుట: చూ, లూటీ. 4: 2. పగతెరుకు: చూ, లూటీ 4; 3. ఉర్యాద: చూ, సన్మానము; 4: చూ, అభిగ్రహణము.
అభిగ్రహుఁడు, సం. వి. అ. పు. అభియుక్తుఁడు: చూ, పగతెదురు.
అభిఘరించు, సం. స. క్రి. నెయ్యిమిడుచు, ద్రవద్రవ్యమును బొట్టుబొట్టుగామిడుచు: చూ, నిడుచు.
అభిఘాతము, సం. వి. అ. పు. 1. తాడనము, మొత్తు: చూ, హతి; వా. 2. ఒకానొకజ్వరము: చూ, రోగము. 1-౧౭-(౧)
అభిఘాతి, సం. వి. న్. పు: చూ, శత్రువు. 1.
అభిఘార, సం. వి. ఆ. స్త్రీ. నెయ్యి: చూ, తైలము. 2.
అభిఘారము, సం. వి. అ. పు. 1. ఎరుగఁబోయు: చూ, సాతాళింపు; వా. 2. నెయ్యి వడ్డించుట.
అభిచరించు, సం. అ. క్రి: చూ, సంచరించు.
అభిచరుఁడు, సం. విణ: చూ, సహాయుఁడు.
అభిచారము, సం. వి. అ. పు. హింసార్థమైన హోమకర్మము: చూ, హింసాకర్మ.
అభిజనము, సం. వి. అ. పు. 1. జన్మభూమి: చూ, పుట్టుచోటు; 2. కులము: చూ, వంగడము; 3. కులాగతమైన పెక్కుములో నగు నిరుదు: చూ, బిరుదము; 4. పొగడిక: చూ, స్తోత్రము; 5. గోత్రము: చూ, ప్రవరము. 1.
అభిజాతుఁడు, సం. విణ. 1. మంచికులమునఁ బుట్టినవాఁడు, అంగములతో వేదము చదువుకొనినవాఁడు: చూ, సజ్జనుఁడు; 2. చదువరి: సుధి; 3. తగవరి, న్యాయాధిపతి: చూ, స్వామి. 3.
అభిజిత్తు, సం. వి. త్. స్త్రీ. 1. పగటఁబదునాలుగు గడియల మీఁద రెండు గడియల కాలము; అం. 2. కానరానిచుక్క, బొమ్మరిక్క: చూ, రిక్క. 1-౨౫.
అభిజ్ఞలు, అం. దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్తజ్ఞానము, వియద్గమనాగమన వ్యూహాది లక్షణమయిన బుద్ధి. (ఒ).
అభిజ్ఞానము, సం. వి. అ. న. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. తెలివి: చూ, హృల్లేఖము. 2.
అభిజ్ఞుఁడు, సం. విణ: చూ, సమర్థుఁడు.
అభితప్త, అం: చూ, సంచారీ భావమునఁ బుట్టిన దృష్టులు.
అభితము, సం. వి. అ. న. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. ఇరుదెసలు: చూ, పార్శ్వము. 2-౭; 3. శీఘ్రము: చూ, స్యదము; 4. అంతయు: చూ, సర్వము; 5. ఎదురు: చూ, ముందర. 1.
అభిత్రికము, అం: చూ, తిర్యక్కరణబంధములు.
అభిదర్శించు, సం. స. క్రి. చూచు: చూ, వీక్షించు.
అభిద, సం. వి. అ. స్త్రీ. ఒక శబ్దవృత్తి. సంకేతికములగు పద పదార్థముల సంబంధము: చూ, వృత్తి; (ఇవి మూఁడు-అభిద, లక్షణ, వ్యంజన.)
అభిధానము, సం. వి. అ. న: చూ, అభిఖ్య. 1.
అభిధామూలధ్వని, అం: వివక్షితాన్వయపదవాచ్యము, అసంలక్ష్యక్రమ వ్యంగ్యము, రసాదిరూపము. (3).
అభిధాయకము, సం. విణ. తెలియఁజేయుట: చూ, సూచకము. 6.
అభిధేయము, సం. వి. అ. న. 1: చూ, అభిధానము; 2. శబ్దార్థము: చూ, టీక.
అభిధ్య, సం. వి. ఆ. స్త్రీ. పరద్రవ్యాపేక్ష: చూ, వాంఛ. 1-౩.
అభినందనము, సం. వి. అ. న. సంతోషించుట: చూ, హ్లాదనము. 1.
అభినంది, సం. వి. న్. పు: చూ, జన్మతాళములు.
అభినందించు, సం. అ. క్రి. 1: చూ, సంతోషించు.
అభినయము, సం. వి. అ. పు. తనయొక్క గాని ఇతరుల యొక్కగాని యభిప్రాయములను దెలుపు హస్తాదిచలనము (ఇది చతుర్విధము.—౧. ఆహార్యము = భూషణాదులచేఁ గలిగినది. ౨. వాచికము=వాక్కుచేతఁ గలిగినది; ౩.

ఆంగికము = అంగముచేతఁ గలిగినది; ౪. సాత్త్వికము = సత్త్వముచేతఁ గలిగినది): చూ, వ్యంజకము. 1.
అభినయములు, అం: ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము. (౪). [(౨).
అభినయహస్తములు, అం: సంయుతములు, అసంయుతములు,
అభినయించు, సం. స. క్రి. అంగన్యాసాదులచే అర్థమును సూచించు.
అభినవగుప్తుఁడు, అం: చూ, శాస్త్రప్రవర్తకులు.
అభినవము. సం. విణ. క్రొత్త: చూ, హొస.
అభినవోద్భిజ్జము, సం. విణ. క్రొత్తమొలక: చూ, మొలక. 1.
అభిని, వా. వై. వి. = అహిఫేనమ్: చూ, నల్లమందు.
అభినిపాలు, మి. వి: చూ, నల్లమందుపాలు.
అభినిర్ముక్తుఁడు, సం. వి. అ. పు. సూర్యుఁడస్తమించువేళ నిద్రించువాఁడు. (వ్యతి: చూ, అభ్యుదితుఁడు.)
అభినిర్యాణము, సం. వి. అ. పు. గెలువ నిశ్చయించిన రాజు ప్రయాణము, యాత్ర: చూ, సంచారము. 1.
అభినివేశము, సం. వి. అ. పు. 1. చొరవ: చూ, సాహసము. 1; 2. పుచ్చికోలు: చూ, స్వీకారము. 2; 3. ఏదే నొక పనిని చేసెదనని దృఢముగా చెప్పుట, పంతము: చూ, నిష్ఠ. 4.
అభినిష్ఠానము, సం. వి. అ. పు. 1. అక్షరము: చూ, వర్ణము. 1; 2. రెండు సున్నలు: చూ, విసర్జనీయము. 1.
అభినీతము, సం. విణ. 1. న్యాయముతోఁ గూడినది: చూ, యోగ్యము. 2; 2. సంస్కరింపఁబడినది: చూ, సంస్కారము. 1; 3. కోపముగలది: చూ, రోషము. 1-౮.
అభినీతుఁడు, సం విణ. 1. కోపి: చూ, రోషణుఁడు.
అభినుతము, సం.విణ. చూ, స్తుతింపఁబడినది: చూ, స్తోత్రము. 1-౩.
అభినుతి, సం. వి. ఇ. స్త్రీ. స్తుతి: చూ స్తోత్రము. 1.
అభినుతించు, సం. స. క్రి. పొగడు: చూ, స్తుతించు.
అభిన్నత, సం. వి. ఆ. స్త్రీ. భేదములేమి: చూ, సమరసము. 2.
అభిన్నము, సం. విణ. అంతయు: చూ, సర్వము.
అభిన్యాసము, సం. వి. అ. న. 1. పెట్టుకొనుట. ఉంచుట: చూ, సంభృతి. 2; వా. 2. వాతపిత్తశ్లేష్మముల కలయిక గల ఒకానొక జన్నిరోగము: చూ, రోగము. 1-౨౩
అభిపన్నము. సం. విణ. 1. తప్పినది: చూ, అపరాద్ధము; 2. మ్రింగఁబడినది: చూ, అభిగ్రస్తము; 3. ఆపదపొందినది: చూ, ఆపద్గతము; 4. శరణుఁజొచ్చినది: చూ, సంరక్షణము. 1-౬; 5. ప్రసిద్ధికెక్కినది: చూ, విజ్ఞాతము; 6. అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము. 1.
అభిపన్నుఁడు, సం. విణ. 1. అంగీకరింపఁ బడినవాఁడు: చూ, ఈకోలుకాఁడు; 2. ఆపదపొందినవాఁడు: చూ, కడగండ్లమారి; 3. తప్పుచేసినవాఁడు: చూ, దోషి; 4: చూ, దయాళువు; 5. శత్రువులచే నాక్రమింపఁ బడినవాఁడు: 6: చూ, శరణీయుఁడు.
అభిపల్లవము, సం. వి. అ. పు. పగడము: చూ, రత్నము. 1.
అభిప్రాయము, సం. వి. అ. పు. తలఁపు: చూ, విషయము. 4.
అభిప్రేతము, సం. విణ. తలఁపఁబడినది: చూ, స్మృతము.
అభిభవము, సం. వి. అ. పు. తిరస్కారము: చూ, పరాభవము.
అభిభవించు, సం. స. క్రి. అనాదరించు: చూ, భంగించు.
అభిభావము, ఉప. ఇచట "అభి" అనునది ధాత్వర్థమును తిరస్కారము అను నర్థమునకు మార్చినది.
అభిభావితము, సం. వి. అ. న. రతి: చూ, సంయోగము.
అభిభూతము, సం. విణ. తిరస్కరింపఁబడినది: చూ, పరాభవము.
అభిభూవుఁడు, సం. వి. అ. పు. ఆత్మగంధుఁడు, విజయము గలవాఁడు: చూ, విజయి.
అభిమంత్రణము, సం. వి. అ. న. 1. పిలుపు: చూ, సంబోధనము; 2. మంత్రముచే సంస్కరించుట.
అభిమంత్రించు, సం. స. క్రి. పిలుచు: చూ, సంబోధించు; 2. మంత్రముచే సంస్కరించు.
అభిమంత్రితము, సం. విణ. పిలువఁబడినది: చూ, సంబోధనము. 1-౨.
అభిమతము, సం. వి. అ. న. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1, 2. సమ్మతిమైనది: చూ, స్వీకృతము. 1.
అభిమరము, సం. వి. అ. పు. మా-అభీమరము, అభిమర్దము. 1. యుద్ధము: చూ, యుద్ధము. 1; 2. చంపుట: చూ, హింస. 1; 3. కట్టు: చూ, బంధము. 1.
అభిమర్దము, సం. వి. అ. పు. 1. కయ్యము: చూ, యుద్ధము. 1; 2. రాయిడి: చూ, సమ్మర్దము.
అభిమర్శనము, సం. వి. అ. న. ప్రేమచే శరీరము అల్లనతడవుట: చూ, నిమురుట.
అభిమర్శించు, సం. స. క్రి. ప్రేమచేశరీరము అల్లనతడవు: చూ, నిమురు.
అభిమాతి, సం. వి. ఇ. పు. పగతుఁడు: చూ, శత్రువు. 1.
అభిమానజము, అం: చూ, ప్రేమపంచకము.
అభిమానప్రీతి, అం: చూ, చతుర్విధప్రీతులు.
అభిమానము, సం. వి. అ. పు. (ధనాదులచేఁ గలిగెడు) గర్వము: చూ, హంకారము; 2. బుద్ధి: చూ, హృల్లేఖము. 2; 3. చెలిమి: చూ, స్నేహము. 1; 4. చంపుట: చూ, హింస. 1; 5. పొగడిక: చూ, స్తోత్రము.
అభిమాని, సం. విణ. (న్. ఈ. న్). అభిమానముగలవాఁడు.
అభిమానించు, సం. స. క్రి: చూ, సన్మానించు.
అభిమానుఁడు, సం. వి. అ. పు: చూ, బుద్ధుఁడు. 1.
అభిముఖమగు, మి. అ. క్రి. ఎదురగు: చూ, మోహరించు. 1.
అభిముఖము, సం. విణ. ఎదుటమొగమైనది: చూ, ముందర. 1.
అభిముఖుఁడు, సం. విణ. ఎదుటనున్నవాఁడు: చూ, సమ్ముఖుఁడు.
అభియాతి, సం. వి. ఇ. పు: చూ, అభిమాతి.
అభియానము, సం. వి. అ. న. 1. జయమునకై ఎదురుకొని పోవుట: చూ, లూటీ. 4. ఉప. 2. ఇచట ధాత్వర్థమును "యు: ద్ధమ"ను నర్థమునకు మార్చినది.
అభియుక్తుఁడు, సం. విణ. 1. ఆసగలాఁడు: చూ, లుబ్ధుఁడు; 2. అభిగ్రహుఁడు: చూ, లూటీ. 4; 3. నేరస్థుఁడు. దోషి: చూ, వ్యాధుఁడు. 2-౧.
అభియోక్త, సం. వి. ఋ. పు: చూ, శత్రువు. 1.
అభియోగము, సం. వి. అ. పు. 1: చూ, అభిగ్రహము. 2;

2. పగకెదిరించుట, దాడి: చూ, యుద్ధము. 1; 3. పూనిక: చూ, సన్నాహము. 2; 4. తిట్టు: చూ, శాపము. 1; 5. ఒట్టు: చూ, శపథము; 6. అమృతము కాఉట; 7. అపకీర్తి: చూ, సడి. 3; 8: చూ, అపదూఱు. వా. 9.దావా.

అభియోగి, సం. వి. న్. పు: చూ, అభియోక్త.

అభియోగించు, సం. స. క్రి: పగకెదిరించు.

అభిరతి, సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ. 1.

అభిరామము, సం. విశ. ఒప్పిదమైనది: చూ, హృద్యము.

అభిరుచి, సం. వి. ఇ. స్త్రీ. 1. పేరాస: చూ, వాంఛ. 1-౧; 2. కాంతి: చూ, వెలుతురు. 1.

అభిరుద్గత, అం: చూ, షడ్జగ్రామగత మూర్ఛనలు.

అభిరూపము, సం. విశ: చూ, అభిరామము.

అభిరూపుఁడు, సం. విశ. 1. ఒప్పిదము గలవాఁడు: చూ, సుహాపుఁడు. 1; 2. పండితుఁడు: చూ, సుధి. 1; 3. తగిన వాఁడు, పూజితుఁడు: చూ, సన్మానితుఁడు.

అభిలషించు, సం. స. క్రి. కోరు: చూ, వాంఛించు.

అభిలాపము, సం. వి. అ. పు. ధ్వని: చూ, స్వరము. 2.

అభిలావము, సం. వి. అ. పు. పైర్లు మొదలయినవి కోయుట, కోఁత: చూ, లవనము.

అభిలాష, సం. వి. అ. పు. 1. కోరిక: చూ, వాంఛ. 1; అం: చూ, విప్రలంభములు.

అభిలాషకుఁడు, సం. విశ. (ఏవిషయమందైనను తెంపుచేసి) ఆసగలవాఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

అభిలాషి, ఇ. —పై.—

అభివందనము, సం. వి. అ. న. నతి: చూ, హణిగలు. 1-౫.

అభివాదకుఁడు, సం. విశ. మ్రొక్కువాఁడు చూ, వందారువు.

అభివాదనము, సం. వి. అ. న. 1. గోత్రనామములుచెప్పి పాదములుసోఁక మ్రొక్కుట: చూ, హణిగలు. 1-3; ఉప. 2. ఇచట ధాత్వర్థమును "నమస్కారము" అను నర్థమునకు మార్చినది.

అభివాస్య, సం. వి. ఆ. స్త్రీ. దూడలు బ్రతుకనియావు: చూ, ధేనువు. 1-౧౪.

అభివీక్షించు, సం. వ. క్రి. చూచు: చూ, వీక్షించు.

అభివృద్ధి, సం. వి. ఇ. స్త్రీ. 1. అతిశయము: చూ, హెరాళము. 1-౧; ఉప. 2. ఇచట "అభి" అనునది వ్యర్థమైనది.

అభివేదనము, సం. వి. అ. న. 1. ఆక్రాంతి. అఱుము: చూ, పురి. 4; 2. వేఱుపెండ్లామును సంపాదించుట: 3. దున్న పోతును గట్టెడుకన్నె, పలుపు: చూ, సూత్రము. 1-౬.౫.

అభివ్యక్తము, సం. విశ. స్పష్టపఱచునది. ఐంద్రియకము: చూ, వెల్లడి.

అభివ్యక్త, సం. వి. ఇ. స్త్రీ. మాఱురూపము తోఁచుట: చూ, ప్రతిబింబము. 1.

అభివ్యాపించు, సం. అ. క్రి: చూ, వ్యాపించు.

అభిశంసనము, సం. వి. అ. న. నింద: చూ, నెగ్గింపు.

అభిశక్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. —పై.—; 2. వేఁడుట: చూ, యాచన.

అభిశస్తుఁడు, సం. విశ. 1. పరస్త్రీ గమనాది దోషములచే దూఱఁబడినవాఁడు, అపఖ్యాతుఁడు: చూ, దోసకారి.

అభిశాపము, సం. వి. అ. పు. ఊరక మోపిననింద: చూ, నెగ్గింపు.

అభిషంగము, సం. వి. అ. పు. రూ-అభీషంగము. 1. అవమానము: చూ, స. 3; 2. ఒట్టు: చూ, శాపము. 1; 3. తిరస్కారము: చూ, వహేలనము; 4. తిట్టు: చూ, శపథము.

అభిషవము, సం.వి. అ. పు. 1. కల్లుతేట: చూ, సురామండము; 2: చూ, యజ్ఞము; 3: చూ, స్నానము. 1; 4: చూ, సోమపానము; 5. కల్లుత్రాగునపుడు తినుటకై ఆవాలు మొ॥ వాని చేతఁ బొగచిన మాంసపు ముక్క: చూ, శుక్తము. 1-౧౩.

అభిషిక్తము, సం. విశ. తలయంటు: చూ, స్నానము. 1-౮.

అభిషుతము, సం. వి. అ. పు. పులియఁబెట్టిన కడుగునీరు: చూ, శుక్తము. 1.

అభిషువు, సం. వి. ఉ. పు. రూ-అభిషవు-ఆభీషువు-అభీశువు-అభీషువు. కిరణము: చూ, హాయనము. 2.

అభిషేకము, సం. వి. అ. పు. 1: చూ, స్నానము. 1; అం. 2. అభిషేకములు:- రాజ్యాభిషేకము, సూత్రాభిషేకము పాదుకాంతాభిషేకము; అం. 3. (స్నానము): చూ, ఉపచారములు; ఉప. 4. ఇచ్చట "అభి" అనునది నిరర్థకము.

అభిషేకించు, సం. అ. క్రి: చూ, మునింగించు.

అభిషేణనము, సం. వి. అ. న. సేనతో శత్రువు నెదుర్కొని పోవుట: చూ, లూటీ. 4.

అభిష్టుతము, సం. విశ. పొగడఁబడినది: చూ, స్తోత్రము.

అభిష్యందము, సం. వి. అ. పు. 1. కంటిజెవులు: చూ, హర్షణము. 3-౪; 2. మిక్కిలికాఱుట: చూ, స్రవణము; 3. మిక్కిలిసంపద, నింపు: చూ, సమృద్ధి; 4. రాగద్వేషాదులఁ బుట్టిన క్లేశము: చూ, శోకము. 1.

అభిష్వంగము, సం. వి. అ. పు. 1. పేరాస: చూ, వాంఛ. 1-౧; 2. తిట్టు: చూ, శాపము. 1.

అభిసందము: చూ, అభిష్యందము. 1.

అభిసంధము: చూ, అభిష్యందము. 1.

అభిసంధానము, సం. వి. అ. న: చూ, వంచన.

అభిసంపాతము, సం. వి. అ. పు: చూ, యుద్ధము. 1.

అభిసంహితుఁడు, సం. విశ. దుర్బోధ చేయఁబడ్డవాఁడు.

అభిసరుఁడు, సం. విశ: చూ, సహాయుఁడు. 1.

అభిసరించు, సం. స. క్రి. ప్రియులొకరొకరి నుద్దేశించు: చూ, విషయీకరించు.

అభిసారి, సం. విశ. 1. ఒకటినుద్దేశించి పోవువాఁడు; అం. 2: చూ, భోగ వ్యూహములు.

అభిసారిక, అం. 1: చూ, నాయికలు. (ప్రియుని గూర్చిసంకేతస్థలమునకుఁ బోయెడి నాయిక-దీనికి:-దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని యనువారు సహాయులు.

అభిహారము, సం. వి. అ. పు. 1. పగకెదిరించుట: చూ, లూటీ. 4; 2. దొంగతనము: చూ, హరణము; 3. యుద్ధమునకు సమస్త బలము నాయిత్తపడుట: చూ, సన్నాహము.

అభిహితము, సం. విశ. భాషితము, చెప్పఁబడినది: చూ, శబ్దము. 2.

అర్థసిద్ధి, సం. వి. ఇ. స్త్రీ: చూ, పుత్రజీవి*.

అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థోనకస్యచిత్, న్యా. పురుషుఁడు ధనదాసుఁడగును, ధనమెవ్వరికిని దాసత్వమొనర్పదు.

అర్థహరణము, అం: చూ, దండత్రయము: చూ, త్రయము.

అర్థహీనుఁడు, సం. విణ: చూ, బీదవాఁడు.

అర్థాంతరన్యాసము, అం. ఒకానొకయర్థాలంకారము. సామాన్యమును విశేషముతోడ, విశేషమును సామాన్యముతోడ గుణసామ్య కల్పన మొనర్చుట. ఒకానొక వస్తువును ముందుగఁ జెప్పి దానిని సమర్థించుటకై మఱియొక యర్థముఁజెప్పుట. (ఉ.—హనుమంతుఁడబ్ధిదాఁటె. మహాత్ముల కసాధ్యమేది? పూలతోఁ గూడిన నారతలఁదాల్పఁబడును. వెలలేని రత్నములచే నొప్పుచున్న యాహిమవంతుని మంచు శోభాహాని చేయలేదు. ఒక దోషము పెక్కుగుణములయందు మునిఁగి పోవుంగదా।): చూ, అలంకారము. 3. (చూ, అర్థాంతరము, అర్థాపత్తి.)

అర్థాంతరసంక్రమితవాచ్యము, అం. పదగతము, వాక్యగతము. (౨).

అర్థాతురోనగణయత్యపకర్షదోషమ్, న్యా. ధనాశగలవాఁ డవమానమును బరిగణింపఁడు.

అర్థాపత్తి, అం. 1: చూ, అర్థాంతరన్యాసము; 2: చూ, ప్రత్యక్షాది, ప్రమాణములు; 3: చూ, రసవదలంకారములు.

అర్థాలంకారము, అం. అలంకారములు రెండింటిలోనొకటి. అర్థముప్రధానముగాఁ గలిగి కావ్యశోభాహేతువులైనవి: చూ, అలంకారము. 3.

అర్థావృత్తిదీపకము, అం: చూ, అలంకారము. 3.

అర్థాశ, సం. వి. ఆ. స్త్రీ. = అడియాస: చూ, వాంఛ. 1.

అర్థి, సం. వి. న్. పు. 1: చూ, యాచకుఁడు; 2. యక్షసేవకుఁడు; విణ. 3. ధనికుఁడు: చూ, సంపన్నుఁడు; 4: చూ, వాది; 5: చూ, సేవకుఁడు; 6: చూ, వాంఛ. 1.

అర్థించు, సం. స. క్రి. 1: చూ, వాంఛించు; 2: చూ, వేఁడుకొను.

అర్థితము, సం. విణ. రూ-అర్థితము. 1. కోరఁబడినది: చూ, వాంఛితము; 2. వేఁడబడినది: చూ, ప్రార్థితము.

అర్థోహి కన్యా పరకీయఏవ, న్యా. కన్యపరుల సొత్తేకదా?

అర్థ్యము, సం. వి. అ. న. 1: చూ, సిలాజిత్తు; విణ. 2. తెలివిగలది: చూ, హృల్లేఖము. 2-౧౩; 3. న్యాయముతోఁ గూడినది: చూ, సత్యము. 1; 4. అర్థనీయము; 5. అర్థము వలన తొలఁగనిది.

అర్థ్యుఁడు, సం. వి. అ. పు. 1. చదువరి: చూ, సుధి; 2. అర్థము(ద్రవ్యము)నుండి యెడఁబాయనివాఁడు.

అర్దన: చూ, రూ-అర్థన.

అర్దితము, సం. విణ. 1: చూ, రూ-అర్థితము: 1-2; 3. అడుగఁబడినది (వస్తువు): చూ, వాంఛితము; 4.నొప్పింపఁబడినది; 5. పూజింపఁబడినది: చూ, సన్యస్తము: 2.

అర్ధకంధర, అం: చూ, ముఖరజ్జువులు.

అర్ధకుడ్యము, సం. వి. అ. న: = చూ, అడ్డగోడ.

అర్ధగంగ, సం: వి: ఆ. స్త్రీ కావేరి: చూ, నది. 1-(౧)-౧,

అర్ధగతి, అం: చూ, భూచారులు.

అర్ధఘటిక, సం. వి. ఆ. స్త్రీ. =: చూ, అరగడియ.

అర్ధచంద్ర, సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

అర్ధచంద్రము, సం.వి.అ.పు.1. క్షురప్రమనెడిగొలుసము: చూ, బాణము. 1-౪; 2. మెడపట్టిత్రోచుట కమర్చిన యర్ధచంద్రాకారపు చేయి: చూ, అర్ధేందువు. 2; 3. గోటినొక్కువంక. అర్ధేందువు: చూ, నఖక్షతము. 1; అం. 4: చూ, ఉత్తానకరణ బంధములు; 5: చూ, బాణాగ్రములు; 6: చూ, అసంహత వ్యూహములు; 7: చూ, అసంయుత హస్తములు; 8: చూ, ఆసనములు: 9. అభినయహస్త విశేషము (చూపుడువ్రేలు మొదలయిన నాలుగువ్రేళ్ళ నొక్కప్రక్క సరిగాఁజేర్చి బొటనవ్రేలినెడముగాఁ జాచిపట్టినది): చూ, వ్యంజకము. 1; న. 10: చూ, నెమలికన్ను.

అర్ధచంద్రిక, సం. వి. ఆ. స్త్రీ. 1. త్రిపుట*: చూ, బొల్లిమానసర; 2. నాసాభరణము: చూ, భూషణము. 2-౯(౧); అం. 3: చూ, వృత్తము. 1.

అర్ధచోలకము, సం. వి. అ. న. అంగరక:చూ, వస్త్రము.1-౯.

అర్ధజరతీ(య)న్యాయము, న్యా. శరీరమందుఁ గొంతభాగమున ముసలితనమును, కొంతభాగమున పడుచుతనమునుగల స్త్రీయుండదను రీతి.

అర్ధజాహ్నవి, సం. వి. ఈ. స్త్రీ: చూ, అర్ధగంగ.

అర్ధణా, వా. వి: చూ, అరణా.

అర్ధతూరము, సం. వి. అ. పు. యుద్ధారంభ వాద్యపు ధ్వని, పటహము: చూ, స్వరము. 2-౩౦.

అర్ధనారీశుఁడు, సం. వి. అ. పు. సామేను గిరిజ తాలుపు: చూ, శివుఁడు.

అర్ధనారీశ్వరుఁడు, —పై.—

అర్ధనావము, సం. వి. అ. పు. ఓడలోసగము, నౌకార్ధము: చూ, పోతము. 1-౯.

అర్ధనికుట్టనము, అం: చూ, కరణములు.

అర్ధనిమీలితము, అం: చూ, దృష్టిక్రియలు.

అర్ధనౌక, సం. వి. ఆ. స్త్రీ: చూ, అర్ధనావము.

అర్ధపతాకము, సం. వి. అ. పు. 1. అభినయహస్తవిశేషము; చూ, వ్యంజకము. 1; అం. 2: చూ, అసంయుత హస్తములు.

అర్ధపద్మాసనము, అం: చూ, ఉత్తానకరణబంధములు.

అర్ధపాదుక, అం: చూ, ఆవర్తరూపములు.

అర్ధపారావతము, సం. వి. అ. పు. 1. ఒకరకము పావురము: చూ, పురఁటీ. 1-౪; 2: చూ, తీతువు.

అర్ధపిప్పలి, సం. వి. ఈ. స్త్రీ. పిప్పలిలో సగము.

అర్ధప్రస్తము, సం. వి అ. పు. కుంచములో సగము: చూ, అడ్డ. 2.

అర్ధఫలము, సం. వి. అ. న. పదునాలుగు మాషములయెత్తు, కర్షము: చూ, ఫలము. 1.

అర్ధబిందువు, సం. వి. అ. పు: చూ, అరసున్న.

అర్ధమత్తల్లి, అం: చూ, కరణములు.

అర్ధమాణవకము, సం. వి. అ. పు. పదిపేటల ముత్యాల హారము: చూ, భూషణము. 2-౬-(౨౩).

అర్ధము, సం. వి. అ. న. 1. = అర్ధ-భాగ, సగసంశము: చూ,

సగము; పు. 2. తునుక: చూ, శకలము. 4.
అర్ధముకుళ, అం: చూ, సంచారి భావమునఁ బుట్టిన దృష్టులు.
అర్ధరథులు, సం. వి. అ. పు. బ. ఒక్క విలుకానితో సరిగా నిలిచి పోరలేని యోధులు: చూ, రథికుఁడు. 2 ౬.
అర్ధరశ్మి, సం. వి. ఇ. స్త్రీ. పండ్రెండు పేటలుగల హారము: చూ, భూషణము. 2-౨౮.
అర్ధరాత్రము, సం. వి. అ. పు.=అద్దమరేయి: చూ, రాత్రి. 1-౧.
అర్ధహాస్యము, సం. వి. అ. పు. అరనవ్వు.
అర్ధరేచితము, అం. 1: చూ, నృత్తహస్తములు; 2: చూ, కరణములు.
అర్ధర్చ, సం. వి. ఆ. స్త్రీ. సగము ఋక్కు: చూ, వేదము. 1-౨౧. (౧).
అర్ధవేసరి, అం: చూ, మాగధకైశికీజ భాషలు.
అర్ధశఫరము, సం. వి. అ. న. తిమిని మ్రింగెడు పెద్ద తిమింగిలము: చూ, మత్స్యము. 1-౨౮.
అర్ధసూచి, అం: చూ, కరణములు.
అర్ధసూచీముఖము, అం: చూ, అసంయుత హస్తములు.
అర్ధస్వస్తికము, అం; చూ, కరణములు.
అర్ధహారము, సం. వి. అ. పు. ౬౪ పేటలు (లేక) ౨౪ పేటలుగల హారము: చూ, భూషణము. 2-౬-(౨౮).
అర్ధాంగనిపీడితము, అం: చూ, ఉత్తానకరణ బంధములు.
అర్ధాంగి, సం. వి. ఈ. స్త్రీ: చూ, భార్య. 1.
అర్ధాంగీకారము, సం. వి. అ. పు. 1. సగము ఒప్పుకోలు: చూ, సమ్మతి. 1; 2. సగము శరీరమగుటవలన మగని కొనుట.
అర్ధాంబుజాసనము, అం: చూ, రతిబంధములు. 1-౧.
అర్ధేందువు, సం. వి. ఉ. పు. 1. గోటినెలవంక*: చూ, నఖక్షతము; 2. మెడపట్టి త్రోచుట కమర్చిన చేయి: చూ, అర్ధచంద్రము. 1; 3. కలయికవగ.
అర్ధోరుకము, సం. వి. అ. న. వేశ్యలు సగముతొడవఱకుఁ తొడిగికొనుగుడిగి, చల్లడము: చూ, వస్త్రము. 1-౯-(౯).
అర్పటము, సం. వి. అ. పు. = అప్పడము - అప్పళము: చూ, భక్ష్యము. 1-౪. [ఒప్పగింత.
అర్పణము, సం. వి. అ. న. = అర్పణ. అప్పనము: చూ,
అర్పము, సం. వి. అ. పు. పేవ*: చూ, వేత్రము. 2.
అర్పించు, సం. స. క్రి. = అప్పగించు: చూ, సమర్పించు.
అర్పితము, సం. విణ. అర్పింపఁబడినది.
అర్బుదఫలము, సం. వి. అ. పు. ఒకరకపుమామిడి*: చూ, మామిడి. 1-౧౫.
అర్బుదము, సం. వి. అ. న. దశకోటి, కోటి (అనికొందఱు): చూ, సంఖ్య. 1-౨౧; పుం. 2. కంటితెవులు: చూ, హర్ణణము; 3. దంతరోగము: చూ, పంటి తెవులు; 4. ఒకానొకకొండ: చూ, పర్వతము. 1; 5. మాంసపుకండ: చూ, శుక్తము. 2; అం. 6: చూ, సంఖ్యాభేదములు.
అర్భకము, సం. వి. అ. పు. 1. శుక్లశోణితపిండము: చూ, భ్రూణము. 1; 2. రతనము: చూ, రత్నములు. 1-౧౦; 3. ఓదతనము: చూ, సీదరము. 1. 4. గాలి: చూ, వాయువు. 1.

అర్భకుఁడు, సం. వి. అ. పు. 1. పదునాఱేండ్లకు లోఁబడిన పిల్లవాఁడు: చూ, శిశువు. 1-౫; 2. కుచేలుఁడు: చూ, దరిద్రుఁడు; విణ. 3. బక్కవాఁడు: చూ, కృశుఁడు; 4. మూర్ఖుఁడు: చూ, మూఢుఁడు.
అర్చి, సం. వి. ఇ. స్త్రీ. కళ: చూ, మునికోల. 2.
అర్మము, సం. వి. న్. న. 1. కంటితెవులు: చూ, హర్ణణము. 3-౪; 2. వెన్నునడిమి వెండ్రుక. రొంటి: చూ, వెండ్రుక. 1.
అర్మిలి, దే. వి. 1: చూ, స్నేహము. 1; 2: చూ, వాత్సల్యము; 3: చూ, వాంఛ. 1. విణ. ౨-౧౫౩.
అర్య, సం. వి. ఆ. స్త్రీ. కోమటిది: చూ, వైశ్య. 1.
అర్యమము, సం. వి. అ. న: చూ, మంతెన*.
అర్యముఁడు, సం. వి. న్. పు. 1: చూ, సూర్యుఁడు; అం. 2: చూ, ఆదిత్యులు.
అర్యమ్ణి, సం. వి. ఈ. స్త్రీ. ఉత్తర: చూ, రిక్క. 1-౧౨.
అర్యాణీ, సం. వి. ఈ. స్త్రీ: చూ, అర్య.
అర్యీ, సం. వి. ఈ. స్త్రీ. తాను క్షత్రియురాలయినను కోమటివాని పెండ్లాము: చూ, భార్య. 1-౧౨. (కోమటివాని భార్య అని కొందఱు.)
అర్యుఁడు, సం. వి. అ. పు. 1. కోమటి: చూ, వైశ్యుఁడు; 2. అధిపతి: చూ, స్వామి. 1; 3. అంతఃపుర కావలివాఁడు: చూ, సౌవిదల్లుఁడు; 4. పూజ్యుఁడు: చూ, సన్మానితుఁడు.
అర్ల, దే. వి: చూ, రూ-అరలు.
అర్లమర్ల, దే. వి. బ: చూ, రూ-అరలు మరలు.
అర్వంతము, సం. వి. త్. న. గుఱ్ఱము: చూ, హయము. 1.
అర్వంతుఁడు, సం.వి.అ.పు. కృత్రిముఁడు: చూ, వ్యాధుఁడు.2.
అర్వతి, సం. వి. ఈ. స్త్రీ. 1. తాటపుకత్తె: చూ, కంఖళి; 2. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము. 1-౧; వా. స. 3. అఱువది.
అర్వము, సం. వి. త్. న. 1. గుఱ్ఱము: చూ, హయము. 1; 2. తులువగుఱ్ఱము: చూ, హయము. 1-౨౨: విణ. 3. అధమము, కీడ్పడినది: చూ, హీనము. 1.
అర్వాచీనము, సం. విణ. క్రిందనుండునది.
అర్వాసుఁడు, సం. విణ: చూ, హీనుఁడు.
అర్వ్యుఁడు, సం. విణ: చూ, అర్వంతుఁడు.
అర్శము, సం. వి. స్. న. రూ-అర్శస్సు: చూ, మూలసంక.
అర్శసుఁడు, సం. విణ: చూ, మూలరోగి.
అర్శస్సు, 1: చూ, రూ-అర్శము; 1. జెలగ: చూ, బుద్ధ పితుఁడు.
అర్శోఘ్నము, సం. వి. అ. న. 1. మీఁగడపెరుఁగు: చూ, పెరుఁగు. 1; పు. 2. కంద*: చూ, సూరణము.
అర్శోఘ్ని, సం. వి. ఈ. స్త్రీ. 1. నేలతాటి*: చూ, శిలీంధ్రకము; 2. తాటిమొలక, తేగ: చూ, మొలక. 1-౩; 3: చూ, అర్శోఘ్నము. 2. *.
అర్శోహితము, సం. వి. అ. న. జీడి *: చూ, స్ఫోటనోథ.
అర్షము, సం. వి. అ. పు. బొబ్బకంద*: చూ, సూరణము. 1-౩.
అర్సము, వై. వి. = హర్షమ్. రూ-అరసము: చూ, హ్లాదనము.
అర్హణ, సం. వి. ఆ. స్త్రీ. అర్చన: చూ, సపర్య.
అర్హత, సం. వి. ఆ. స్త్రీ. మంచి: చూ, సామర్థ్యము. 2.

అర్హము, సం. వి. అ. పు. 1. పులిపిల్ల: చూ, శార్దూలము. 1-౨; విశ. తగినది: చూ, యోగ్యము.
అర్హశయ్య, సం. వి. అ. స్త్రీ. ఉత్తరేణు*: చూ, శైఖరికము.
అర్హితము, సం. విశ: చూ, అర్చితము.
అర్హితుఁడు, సం. విశ: చూ, అర్చితుఁడు.
అర్హుఁడు, సం. విశ. 1: చూ, అర్చితుఁడు; వి. అ. పు. 2: చూ, శివుఁడు. 1; 3: చూ, బుద్ధుఁడు.
అఱ, దే. వి. 1. ఎల్లదిక్కులకు నడిమిచోటు: చూ, వఱదగుడి. 1-౧; 2. వాసగృహము. రూ-అఱ్ఱ, లోగది: చూ, సదనము. 1-౧౮; 3. హస్తాదిలయము: చూ, హస్తము 1-౬; 4. పెట్టెలోనగువాని అఱ: చూ, రూ-అఱ్ఱ. 3; 5. రూ-అఱ్ఱ, పడకగది: చూ, సదనము. 1-౧౮. (ఇదే వాసగృహమం డుప); వై. వి. 6=అర్ధమ్: రూ-అర: చూ, నగము; 7. కీడు: చూ, హాని. 2; 8. మోసము. భా. ౪-౩౮: చూ, వంచన; 9. కొఱత: చూ, సొట్ట. 1; 10. భేదము: చూ, వేఱుపాటు; 11. కంఠ, చింపి: చూ, వస్త్రము. 1-౬౨; 12. లేనిది ఊహించుట: చూ, యోచన.
అఱక, దే. వి. మూఁపు: చూ, స్కంధము. 1.
అఱకడ, దే. వి. 1. (అఱక + కడ) —పై.—; 2. నితంబ పార్శ్వము; చూ, మంబె; 3. స్కంధ ప్రదేశము. భార. ఆది. ౬-౧౧౫: రూ-అఱకడము.
అఱకడము. —పై.—(స్కంధ ప్రదేశమనకు. —జై. ౧-౧౧౧; 4. సంకటము: చూ, కోపము. 1.
అఱకము, దే. వి. అజీర్ణము: చూ, రోగము.
అఱకాలు, దే. వి. 1: చూ, రూ-అరకాలు; అం. 2: చూ, కణా స్థానములు.
అఱకువ, దే. వి: చూ, రూ-ఆఱుకువ.
అఱగమి: చూ. అఱకువ.
అఱగొండెతనము, ద్వ. వి. 1. రూ-అఱగొండెము-అఱగొట్టి యము-అఱగొట్టెము- అఱగొడ్డియము -అఱగొడ్డెము. గుండెధైర్యము: చూ, సాహసకృత్యము.

అఱగొండెము,
అఱగొట్టియము,
అఱగొట్టెము, } —పై.—
అఱగొడ్డియము,
అఱగొడ్డెము,

అఱగొఱ, ద్వ. వి. 1. కొఱత: చూ, సొట్ట. 1; విశ. 2. న్యూనము: చూ, సొట్ట. 1-౧.
అఱచు, దే. అ. క్రి. 1. బోలు, క్రందు. భార. ద్రో. ౨-౧౩౨: చూ, విలపించు; 2: చూ, రోదించు; 3. కూయు. రామా. ౨-౧౩: చూ, శబ్దించు.
అఱచెయి, దే. వి. రూ-అరచెయి-అఱచెయ్యి-అఱచేయి: చూ, హస్తము. 1-౭.

అఱచెయ్యి,
అఱచేయి, } —పై.—

అఱజాతి, మి. విశ: చూ, అర్వంతుఁడు.
అఱఁటి, దె. వి. 1: చూ, రూ-అరఁటి*.
అఱటా, దే. వి. రూ-అఱటు. 1. కంఠభూషావిశేషము: చూ, భూషణము. 2-౬-(౨); 2. జడమీఁది కుచ్చుపూస; 3. పల్లకీ బొంగు కొనను వేసెడు సింహతలాటపు తగడు.
అఱటు, —పై.—
అఱపదిమోముల వేల్పు, ద్వ. వి: చూ, శివుఁడు. 1.
అఱపు, దే. వి. రూ-అరపు-అఱుపు-ఆఱుపు. 1. కంఠధ్వని: చూ, స్వరము. 2-(౧౨); 2. ఆర్తకంఠరవము: చూ, స్వరము. 2-(౧౩); 3. ప్రణాదము: చూ, స్వరము. 2-(౧౪); 4. పెద్దకూఁత: చూ, స్వరము. 2-(౧౭); 5. మద్దెల ధ్వని: చూ, స్వరము. 2-(౮౮). 6. పశుకంఠరవము: చూ, స్వరము. 2-(౧౩౫). (ఇత్యాది.)
అఱపోతుఁడు, ద్వ. వి. పొట్టివాఁడు: చూ, వామనుఁడు. 2.
అఱమఱ, ద్వ. వి. (అఱ + మఱలుట): చూ, రూ - అరమర. (సందేహము.-నిర్వ. ౯-౫౭.)
అఱమఱిక, —పై.—
అఱమఱ, ద్వ. వి. 1. —పై.—; 2: చూ, యోచన.
అఱమఱిక, —పై.—
అఱవ, దే. వి. 1. రూ - అఱ్ఱ - నఱ్ఱ. కుకత. సాధువు కాని యావు, ప్రయాసమునఁ బిదుకఁ దగినయావు, చూ, ధేనువు. 1-౩౦, విశ. 2. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. చెడ్డది: చూ, దుష్టము.
అఱవము, దే. వి. సస్యవిశేషము. కాశీ. 3-౨౫౧: చూ. స్తంబ. కరి 1-౨౬-౧.
అఱవత, ద్వ. వి. ద్రావిడ స్త్రీ: చూ, 1-౨౦౦.
అఱవము, వై. వి. (అఱి + వాయి) ద్రావిడభాష: చూ, భాషలు. 1-౬.
అఱవఱలు: చూ, రూ-అరవరలు.
అఱవఱసేయు, ద్వ స. క్రి. (అఱవఱలు + సేయు) 1. ఖం డించు: చూ, సెలగు; 2: చూ, పాడుసేయు.
అఱవలు, వై. వి. బ. 1: చూ, ద్రావిడులు; 2; చూ, కఠినులు; 3: చూ, నిర్దయులు.
అఱి, (వ్యాక). అప. నాశనార్థమైరూపాదుల మీఁదివచ్చిన ప్రత్యయము. ఇదిక్వార్థము. ఉ. రూపఱి-సొంపఱి. మొ॥.
అఱిముఱి, దే. వి. 1. తొందఱపాటు: చూ, సంభ్రమము. 1; 2 కలఁత: చూ, సంతాపము; 3. విరామము లేకుండుట: చూ, వితతము. 2; 4: చూ, మఱిమఱి; విశ. 5: చూ, నిరర్గళము; అవ్య. 6. చీటికి మాటికి: చూ, శశ్వత్తు; 7. ముందువెనుకలు.
అఱిముఱిపడు, ద్వ. అ. క్రి. 1: చూ, సంక్షోభించు; 2: చూ, సంభ్రమించు.
అఱిమెనకుండలు: చూ, రూ-అరిమెనకుండలు.
అఱిసె: చూ, రూ-అరిసియ.
అఱు, దే. వి. 1. రూ-అఱ్ఱు. కంఠము. కాశీ. 3-౧౨: చూ, మెడ; 2: చూ, సమీపము. 1; అ. క్రి. 3. తగ్గు: చూ, క్రుక్కు. 9; 4. మచ్చుపోయు: చూ, నమయు. 3.
అఱుఁగు: చూ, రూ-అరుఁగు.
అఱుకువ: చూ, రూ-ఆఱుకువ.
అఱుక్రమ్ము, దే. అ. క్రి. క్రమ్ము: చూ, వ్యాపించు,

అఱుగఁడీయు, దే. స. క్రి. రోషము; చూ, వద్దు. 1.
అఱుగు, దే. అ. క్రి. 1: చూ, జీర్ణించు; 2. క్షయించు: చూ, క్రుంగిపో. 9.
అఱుగుఁదెవులు, దే.వి. (అఱుగు + తెవులు)రూ-అఱుఁదెవులు-అఱువుఁదెవులు. క్షయము: చూ, రోగము. 1-౧౦.
అఱుగువడు, దే. అ. క్రి, స. క్రి: చూ, తగ్గించు.
అఱుట, దే. వి: చూ, విమోచనము.
అఱుఁదెవులు: చూ, రూ-అఱుగుఁదెవులు.
అఱుగుళ్లు, దే. వి. బ. రూ-అఱువుళ్లు. శ్లథము. అఱిగిపోయినది. నై. ౭-౧౯౭. (వ్యుత్పత్తియందేక వచనాంతము): చూ, శిథిలము.
అఱుగుడువడు, ద్వి. అ. క్రి. (అఱుగుడు + పడు) 1: చూ, తగ్గించు; 2: చూ, అఱు. 4; 3: చూ, ఉలివడు.
అఱుత్, వై. ద్ర. = అరాత్: చూ, రూ-అరత.
అఱుపు, వా. వి. 1: చూ, రూ-అఱవు; దే. స. క్రి. 2. రూ-అర్పు, చెల్లించు: చూ, దకి్క్రించు.
అఱుము, దే. వి. 1. దీపము: చూ, శౌర్యము. 1; 2. ఆక్రమణము: చూ, పురి. 4; స. క్రి. 3. ఎదురుచూచు. భార. ఉద్యో. 3-౨౩౭: చూ, ప్రతీక్షించు; 4. ఆక్రమించు: చూ, మొగరించు.
అఱుముట, దే. వి. ఎదురుకోలు: చూ, లూటీ. 4.
అఱువంద్రు, ద్వి. స. అఱువదికి మహన్మహత్త్వార్థకరూపము: చూ, అఱువదిమంది.
అఱువది, ద్వి. స. (ఆఱు + పది): చూ, ఆఱుపదులు.
అఱువదిమంది: చూ, రూ- అఱువంద్రు.
అఱువుఁదెవులు: చూ, రూ-అఱుగుఁదెవులు.
అఱువుళ్లు: చూ, రూ-అఱుగుళ్లు. భార. విరా. ౫-౩౬.
అఱ్ఱ, దే. వి.1: చూ, రూ-అఱ. 1, 2, 3, 4, 5.
అఱ్ఱము, దే. వి. ముండ్లమోపులోనగునది: చూ, రూ-ఎఱ్ఱము.
అఱ్ఱాఁక, దే. వి. (అఁక + అఁక) 1. ఒత్తిడి, మిక్కిలి విజృంభణము (అనికొందఱు). కాశ. ౩-౮౯: చూ, హఠము. 2; 2. మఱుఁగు: చూ, వ్యవధానము. 3.
అఱ్ఱాఁకలి, దే. వి. (అఁకలి + అఁకలి) మిక్కిలిక్షుత్తు. భో. ౬-౧౬౪: చూ, బుభుక్ష. 1-౧.
అఱ్ఱాడు, దే. అ. క్రి. (అఱ్ఱ + ఆడు)చేరువ చుట్టిముట్టి తిరుగు. మార్క. ౫-౭: చూ, వేష్టించు.
అఱ్ఱియము, దే వి. రూ-అఱ్ఱము. 1. అజీర్తి: చూ, రోగము. 1-౨; విశే. 2. జీర్ణముకానిది: చూ, అజీర్ణము. 2.
అఱ్ఱు, దే. వి. 1: చూ, విపత్తు; 2: చూ, రూ-అఱు. 1; 3: చూ, సమీపము. 1.
అఱ్ఱెము: చూ, రూ-అఱ్ఱియము.
అల, దే. వి. 1. తరంగము: చూ, వీచి. 1; విశే. 2. రూ-అల్ల-ఇల్ల. ప్రసిద్ధిని తెలుపును: చూ, సంభావన. 3; వై. అవ్య. 3. = హాళ: చూ, సంబోధనము. నిర్వ. ౨-౨౪.
అలమ్, సం. అవ్య. 1. కయిసేఁత: చూ, భూషణము. 2; 2. నిషేధార్థకము: చూ, వద్దు; 3. చాలుననుట: చూ, పర్యాప్తి; 4: అడ్డగించుట: చూ, సంరోధము; 5. అర్థము లేనిది: చూ, అనర్థము; 6. బలిమి: చూ, శక్తి. 1.
అలంకరించు, సం. స. క్రి: చూ, సింగారించు.
అలంకరిష్ణువు, సం. విశే. ఉ. 1: చూ, కైసేయువాఁడు; 2. కైసేయుస్వభావము గలవాఁడు: చూ, మండనుఁడు.
అలంకర్త, —వై.—
అలంకర్మీణుఁడు, సం. విశే: చూ, సమర్థుఁడు.
అలంకారకౌశలము, అం: చూ, సుగుణములు.
అలంకారము, 1. కైసేఁత: చూ; భూషణము. 2; 2. సరిగ మాది వర్ణసందర్భము: చూ, స్వరము. 2-౩-౭; అం: 3: చూ, రసలు; మఱియు అలంకారముల వివరము:— అలంకారములు ౧. శబ్దాలంకారములు, ౨. అర్థాలంకారములు, ౩. ఉభయాలంకారములు (అనికొందఱు); శబ్దాలంకారములు:— అర్థము విచారింపక శబ్దము వినఁగనే చెవులకింపుగా వినఁబడునది. ఇందులో ననేక భేదములుఁ గలవు.(౧.) ఛేకానుప్రాసము, (౨.) వృత్త్యనుప్రాసము, (౩.) లాటానుప్రాసము, (౪.) యమకము:- ఇందుపదయమకము, పాదయమకము, ముక్తపదగ్రస్తము, సింహావలోకనము, (౫.) అంత్యనియమము, (౬.) పునరుక్తవదాభాసము. మఱియు అనుప్రాసము మొ॥; మఱియు:- అర్థాలంకారములు-అర్థము ప్రధానముగాఁ గలిగి కావ్యశోభాహేతువులైనవి. (ప్రస్తుతము బ్ర. బులుసుపాపయ్యశాస్త్రిగారిచే వ్రాయఁబడి శ్రీ వావిళ్లవారిచేఁ బ్రకటింపఁబడిన శ్రీ విక్రమదేవవర్మ మహారాజీయముఅను (అలంకారసంగ్రహము) కొంత వఱకుతోడ్పడఁగలదు.) అలంకారములు:- ౧. అతద్గుణము, ౨. అతిశయోక్తి, ౩. అత్యుక్తి, ౪. అధికము, ౫. అనన్వయము, ౬. అనుగుణము, ౭. అనుజ్ఞ, ౮. అనుమానము, ౯. అన్యోన్యము, ౧౦. అపహ్నవము, ౧౧. అర్థాంతరన్యాసము, ౧౩. అల్పము, ౧౪. అవజ్ఞ, ౧౫. అసంగతి, ౧౬. అసంభవము, ౧౭. ఆక్షేపము, ౧౮. ఆవృత్తిదీపకము, ౧౯. ఉత్తరము. ౨౦. ఉత్ప్రేక్ష. ౨౧. ఉదాత్తము, ౨౨. ఉన్మీలితము, ౨౩. ఉపమానము, ౨౪. ఉపమేయోపమము, ౨౫. ఉల్లాసము, ౨౬. ఉల్లేఖ, ౨౭. ఏకావళి, ౨౮. కారకదీపకము, ౨౯. కారణమాల, ౩౦. కావ్యలింగము, ౩౧. కావ్యార్థాపత్తి, ౩౨. గూఢోక్తి, ౩౩. చిత్రము, ౩౪. ఛేకోక్తి, ౩౫. తద్గుణము, ౩౬. తుల్యయోగిత, ౩౭. దీపకము, ౩౮. దృష్టాంతము, ౩౯. నిదర్శనము, ౪౦. నిరుక్తి, ౪౧. పరికరము, ౪౨. పరికరాంకురము, ౪౩. పరిణామము, ౪౪. పరివృత్తి. ౪౫. పరిసంఖ్య, ౪౬. పర్యాయము, ౪౭. పర్యాయోక్తము, ౪౮. పిహితము, ౪౯. పూర్వ రూపము, ౫౦. ప్రతివస్తూపమము, ౫౧. ప్రతిషేధము. ౫౨. ప్రతీపము. ౫౩. ప్రత్యనీకము, ౫౪. ప్రస్తుతాంకురము, ౫౫. ప్రహర్షణము, ౫౬. ప్రౌఢోక్తి, ౫౭. భావికము, ౫౮. భ్రాంతి, ౫౯. మాలాదీపకము, ౬౦. మిథ్యాధ్యవసితి, ౬౧. మీలితము, ౬౨. ముద్ర, ౬౩. యథాసంఖ్యము. ౬౪. యుక్తి. ౬౫. రత్నావళి, ౬౬. రూపకము, ౬౭. లలితము, ౬౮. లేశము, ౬౯. లోకోక్తి. ౭౦. వక్రోక్తి, ౭౧. వికల్పము, ౭౨. వికస్వరము, ౭౩. విధి, ౭౪. వినోక్తి, ౭౫. విభావనము, ౭౬. విరోధాభాసము ౭౭. వివృతోక్తి. ౭౮. విశేషకము, ౭౯. విశేషోక్తి, ౮౦.

(ద్రోణాచార్యుని గుఱ్ఱమునకుఁబుట్టిన వాఁడు.): చూ, ద్రౌణాయనుఁడు.

అశ్వత్థి(ద్ధి)క, సం. వి. ఆ. స్త్రీ: చూ, అశ్వత్థసన్నిభ*.

అశ్వత్థు(ద్ధు)ఁడు, సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. వినుకెంపు: చూ, సూర్యుఁడు; 3. అగ్గి, అగిని, అగ్గి: చూ, వహ్ని 1.

అశ్వదంష్ట్ర, సం. వి. ఆ. స్త్రీ. గోక్షురకము*. పల్లేరు: చూ, స్వాదుకంటకము.

అశ్వదానము, అం: చూ, మహాదానములు.

అశ్వద్విషు, సం. వి, ఉ. పుం. తుమ్మ*: చూ పిట్టదిరము.

అశ్వధామము, సం. వి. న్. నైరృతిమూల ఇల్లు: చూ, సదనము. 1-(ఌ.)

అశ్వపంక్తి, సం. వి. ఇ. స్త్రీ. గుఱ్ఱముల వరుస: అశ్వాతరము 3.

అశ్వపాలకుఁడు, సం. వి. అ. పుం. గుఱ్ఱములను రక్షించు వాఁడు: చూ, సాహిణి (చూ, కుమారుఁడు. 6.)

అశ్వప్రతిగ్రహేష్టి. అం. సహీనతానములు ఏడింటిలోనొకటి: చూ, సహీనతానములు.

అశ్వభక్ష్య, సం. వి. ఆ. స్త్రీ. మద్దఖర్జూరము*. చూ, మధుఖర్జూరిక.

అశ్వము, సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. పురుషజాతి విశేషము: చూ, జాతులు; అం. 3: చూ, మహాదానములు; 4: చూ, చేతనరత్నములు; 5: చూ, తంత్రములు.

అశ్వమేధపర్వము, అం: చూ, భారతపర్వములు.

అశ్వమేధప్రకరణము. అం: చూ, భరతశాస్త్ర గ్రంథములు.

అశ్వమేధము, సం. వి. అ. పుం. 1. ఒకానొకయజ్ఞము: చూ, యజ్ఞము; 1-3; అం. 2: చూ, సహీనతానములు.

అశ్వమేధిని, సం. వి. ఇ. పుం. అశ్వమేధయజ్ఞము చేసిన వాఁడు: చూ, నారాయణుఁడు. 7.

అశ్వమేధీయము, సం. విణ. యాయావరము, అశ్వమేధమున కుపయోగించు గుఱ్ఱము: చూ, హయము. 1-ఌ.

అశ్వయుక్కు, సం. వి. జ్. స్త్రీ. గుఱ్ఱపుఁజుక్క, అశ్విని: చూ, రిక్క. 1-౧.

అశ్వర్థప్రతాపభంగము, అం: భోగవతీలక్షణము: చూ, లక్షణము. 1. (అశ్వత్థప్రతాపభంగము.).

అశ్వలక్షణము, అం: చూ, కళలు.

అశ్వలలిత, అం. ఒకానొకవృత్తము. ఒక్కొక్క పాదమున— న, జ, భ, జ, భ, జ. భ. నగణములు గలిగి పదమూఁడవ యింట యతిగాఁగల యిరువదిమూఁడవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1.

అశ్వలాల, సం. వి. ఆ. పుం. సలికండ్లపాము: చూ, సర్పము.

అశ్వలావకము, సం. వి. అ. పుం. ఆశ్వలాయన దర్భగడ్డి*: చూ, తృణము. 1-(ఒ).

అశ్వవారుఁడు, సం. అ. పుం. గుఱ్ఱపుఁగాఁపరి: చూ, వల్లభపాలకుఁడు.

అశ్వవాలకము, సం. వి. అ. పుం: చూ, అశ్వలావకము*.

అశ్వవాలము, సం. వి. అ. పుం: చూ. గుఱ్ఱపుతోఁక.

అశ్వవాహుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు: చూ, సాది.1.

అశ్వవిక్రయికుఁడు, సం.విణ. గుఱ్ఱములను విక్రయించువాఁడు: చూ, హేలావుకుఁడు.

అశ్వవిదుఁడు, సం. వి. అ. పుం. నలుఁడు: చూ, బాహుకుఁడు.

అశ్వవైద్యము, అం: చూ, కళలు.

అశ్వశాల. సం.వి.ఆ.స్త్రీ. గుఱ్ఱాలసాల: చూ. సదనము.1-౯.

అశ్వశిక్షకుఁడు, సం. వి. అ. పుం. గుఱ్ఱపుసాధకము చేయించు వాఁడు: చూ, రేవంతుఁడు.

అశ్వసంచార మార్గములు, అం. సమ, ఉన్నత, విషమాంబుకీర్ణ, శుద్ధ, నతాగ్ర, తృణపీడ దాఢ్య, స్థాణుప్రకీర్ణ, ఉపలసంప్రకీర్ణ, పార్శ్వోన్నత. (9)

అశ్వాతరము, సం. వి. అ. పుం. 1. అడవి: చూ, విపినము; 2. ధాన్యమునకుపట్టు కీటకము: చూ, వడ్లచిలుక; 3: చూ, అశ్వపంక్తి; 4: చూ. అశ్వమేధము.

అశ్వాభరణము, సం. వి. అ. పుం. గుఱ్ఱపు అలంకారము: చూ, భూషణము. 2-౧.

అశ్వారూఢుఁడు, సం. వి. అ. పుం: చూ, అశ్వవాహుఁడు.

అశ్వారోహ, సం. వి. అ. స్త్రీ: చూ, అశ్వగంధ*.

అశ్వారోహణ. అం: చూ, కళలు.

అశ్వారోహుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, అశ్వవాహుఁడు; 2. గుఱ్ఱములను ద్రిప్పువాఁడు: అశ్వికుఁడు. రూ-అశ్వికుఁడు.

అశ్వాశము, సం. వి. అ. పుం. చణకము: చూ, శనగలు.

అశ్వి, సం. వి. ఈ. స్త్రీ. వృషజాతిపురుషునియం దిష్టముగల స్త్రీజాతివిశేషము: చూ, స్త్రీ. 1-౧౧ల.

అశ్వికుఁడు, సం. వి. అ. పుం: చూ, అశ్వారోహుఁడు.

అశ్విని, సం. వి. ఈ. స్త్రీ: చూ, అశ్వయుక్కు.

అశ్వినీసుతులు, అం. దేవతలవైద్యులు: చూ, అశ్వులు (అశ్వరూపమును ధరించిన సంజ్ఞయను పేరుగల సూర్యునిభార్యకు సుతులు. సూర్యుని భార్యయగు సంజ్ఞాదేవి యశ్వరూపధారిణియై వీరలంగనెనని కథగలదు.)

అశ్వినులు, సం. వి. న్. పుం. —పై.—

అశ్వీనము, సం. వి. అ. న. గుఱ్ఱముచేత ఒకదినము పోఁదగిన త్రోవ: చూ, మార్గము. 1-ఌ.

అశ్వులు, అం. అశ్వినీసుతులు, అశ్వినీదేవతలు. (అశ్వినీసుతులు. దస్రులు, స్వర్వైద్యులు. అశ్వినీదేవతలు. - ఆశ్వినేయులు, ఆసత్యులు.)

అశ్వేతరము, సం. వి. అ. పుం. రూ - అశ్వతరము. కంచర గాడిదె: చూ, రాసభము.

అశ్వోత్పత్తులు, అం. శ్రీవృక్షకము, రోచమానము, పురుషకము, పంపకము, పుటము, విక్రాంతి. ప్రఖరము, ప్రతోదము, రశ్మి, లుఠణము. (10).

అషడక్షీణము, సం. విణ. 1. ఇద్దఱికంటె నన్యులెఱుఁగనిది. (మంత్రములోనగునది.); 2. ఇద్దఱాడుకొనెడి ఏకాంతము: చూ, రహస్యము. 1.

అష్ట, సం. వి. ఆ. స్త్రీ. 1. ఎనిమిది తంతులుగల వీణె: చూ, వీణె; 1-౯; న్. 2. ఎనిమిదిచేత లెక్కపెట్టఁబడ్డవారు.

అష్టక, సం. వి. ఆ. స్త్రీ. శ్రాద్ధవిశేషము: చూ, కర్మములు.

అష్టకము, సం. వి. అ. న. 1 = అట్టము. వేదభాగము. పఠాయి

భిన్నాభిప్రాయము లొక్కమారు వెలిపుచ్చు మేధాశక్తిగల వాఁడు: చూ, అవధాని.
అష్టాశతము, సం. వి. అ. న: చూ, ఎనమన్నూఱు.
అష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. భోజనము: చూ, నాపాటు; ఈ. స్త్రీ. అం. 2: చూ, ఛందస్సులు. [నూలు.
అష్ఠీలము, సం. వి. అ. పుం. ఆదర్శనము: చూ, ముంజెమొల
అష్ఠీవత్తు, సం. వి. త్. పుం. జానువు: చూ, మోఁకాలు: చూ, హజ. 1-౨౦.
అష్టైశ్వర్యములు, అం. వాని, ధనము, ధాన్యము, బంధువు, భృత్యుఁడు, వస్త్రము, వాహనము, సుతుఁడు. (8.)
అష్టోత్తరశతము, సం. వి. అ. న. నూటయెనిమిది. కావ్యలక్షణంబున.—సంఖ్యాబద్ధములో నొకటి: చూ, సంఖ్యాబద్ధము.
అసంఖ్యాబద్ధము, అం. 1. రగడ, గద్య, ద్విపద, దండక, మంజర్యాదులు: (చూ, సంఖ్యాబద్ధములు); 2. కావ్యలక్షణమున.— అప్పుడప్పుడు చెప్పినపద్యములు గ్రంథస్థములు కావు. ఇది సంఖ్యాబద్ధము, అసంఖ్యాబద్ధము అని ద్వివిధము. అందు ఇదియొకటి: చూ, సంఖ్యాబద్ధము. (చూ, మహా కావ్యము.)
అసంఖ్యేయము, సం. విణ. లెక్కపెట్టలేనిది; అగణితము, అపారము.
అసంగతము, సం. విణ. 1. కూడనిది: చూ, నిష్ఫలము; 2. పొసఁగనిది; అసంబంధము, అసంబద్ధము.
అసంగతి, 1. అం. ఒకానొక అర్థాలంకారము (కార్యకారణములకు భిన్నదేశత్వము విరుద్ధముగఁ గల్గుట. "మేఘములు విషము గ్రోలఁబథికాంగనలు మూర్ఛిల్లిరి"): చూ, అలంకారము. 3; విణ. 2. కూడికలేమి: అయోగము.
అసంగవచనము, సం. వి. అ. న. తిరఁబడకచదువుట, తురాయణము: చూ, విద్య. 1.
అసంతుష్టి, సం. విణ. సంతుష్టికానిది: అహృష్టము.
అసంపూర్ణము, సం. విణ. సంపూర్తికానిది: అపూరణి, అసమగ్రము, అసంపూర్తి; (తె. ప.) అంపెదుకు.
అసంపూర్తి, సం. వి. ఇ. పుం. సంపూర్తిలేమి. —పై.—
అసంప్రేక్ష్యకారిత్వము, అం. తంత్రములు అయిదింటిలో నొకటి: చూ, తంత్రములు.
అసంబంధము, సం. విణ. 1. కూడికలేనిది: చూ, నిష్ఫలము; 2. పొసఁగనిది: చూ, అసంగతము. 2.
అసంబద్ధప్రలాపము, వా. వి: చూ, వదరుట.
అసంబద్ధము. వా. విణ: చూ, రూ-అసంబంధము. 1-2.
అసంబాధ, అం. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్కపాదము మ, త, న, స, గగములతోఁ గూడిపండ్రెండవయింట యతిగాఁ గల చతుర్దశ ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉ.—వాలాయంబుగా సత్కవిజనములు- వాక్ప్రవ్యక్తా, వాలాయుక్త గోవిందవరదభృవ- వాత్సల్యా, కాళిందీప్రాణేశ మతనసగ - గప్రాప్తిన్, జాలాభాస్వ ద్విశ్రమమును న-సంబాధల్." అప్ప. 4, ఆ: చూ, వృత్తము. 1.
అసంభవము, సం. విణ. 1. కలుగనిది: అహతము; 2. ఒకానొక యర్థాలంకారము. ఇట్లు జరుగుననియెవడెఱుఁగునని యెన్నుట. ఉ.— "గొల్లపిల్లవాఁడు గోవర్ధమెత్తునని యెవ్వఁడను కొనును.": చూ, అలంకారము. 3.
అసంభావ్యత, సం. వి.అ. న.సాధ్యముకానిది: చూ, అసాధ్యము.
అసంభావ్యము, సం. విణ. సాధ్యములేనిది: చూ, అసాధ్యము.
అసంయుతములు, సం. వి. అ. పుం: చూ, అభినయహస్తములు.
అసంయుతహస్తములు, అం: అరాళము, అర్ధచంద్రము, అర్ధపతాకము, అర్ధసూచీముఖము, అలపల్లవము, ఊర్ణనాభము, కటకాముఖము, కపిత్థము, కపిలము, కర్తరీముఖము, ఖంజము, ఖండచతురము, గజతుండము, చంద్రకళ, చతురము, తామ్రచూడము, త్రిపతాకము, త్రిశూలము, పతాకము, పద్మకోశము, బాణము, భ్రమరము, మణి, మయూరము, ముకుళము, ముష్టి, మృగశీర్షము, యష్టికము, రాజసూండిలము, లాంగూలము, వంశాకము, విరళము, శిఖరము, శుకతుండము, సందంశము, సర్పచతురము, సర్పశీర్షము, సాంగరము, సాలపద్మము, సింహముఖము, సూచి, స్వర్ణరంజకము, స్వస్తికము, హంసపక్షము, హంసాస్యము. (45.) (28 విధములని 45 విధములని ద్వివిధము.)
అసంశ్రియ, సం. వి. ఆ. స్త్రీ. సివంతి*: చూ, స్రివంతి.
అసంహతము, సం. వి. అ. పుం: చూ, వ్యూహాభేదములు.
అసంహతవ్యూహములు. అం. అష్టానీకము, అర్ధచంద్రికము, ద్వితీయము, పరిఘమము. శృంగాటకము. సర్వతోముఖము (6.)
అసకృత్తు, సం. అవ్య. అభీక్ష్ణము. ముహుర్ముహము, మాటిమాటికి: చూ, శశ్వత్తు.
అసద్ధ, వై. వి.=అశ్రద్ధా. ఉపేక్ష: చూ, మందెమేలము. 1.
అసతి, సం. వి. ఈ. స్త్రీ. కులట: చూ, స్వైరిణి.
అసతీసుతుఁడు. సం. వి. అ. పుం. కౌలటేయుఁడు: చూ, అంకులాఁడికొడుకు. (చూ, సూనుఁడు. 1-౧౬)
అసత్యము. సం. వి. అ. న. 1. అబద్ధము, కల్ల: చూ, వితథము; 2. పరస్పరాన్వయము లేనిది (మాట.) జొంకు: చూ. వితథము. భార. శాం. 4, ఆ. 150.
అసత్యవాదము, అం: చూ, అజ్ఞాన దాయకములు.
అసత్యుడు. సం. విణ. అప్రియముగాఁ బలుకువాఁడు: చూ, ముఖరుఁడు.
అసత్ప్రలాపము, అం: చూ, అజ్ఞానదాయకములు.
అసదర్థనిదర్శన, సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అలంకారము: చూ, అలంకారము. 3.
అసదర్థవాదము, అం: చూ, అర్థవాదములు.
అసదు, వై. వి. =అసత్. 1. అల్పము. "అసదుగాను": చూ, స్వల్పము; 2. నికృష్టము: చూ, హీనము. 1;
అసనపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. సోమింద*: చూ, సోమిద.
అసన, సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1.
అసనము, సం. వి. అ. న. 1. చిమ్మనము: చూ, విక్షేపము. 4; పుం. 2. సర్జకము*: చూ, వేఁగిస.
అసభికుఁడు, సం. విణ. అ. పుం. ద్యూతకారుఁడు, జూదమాడించువాఁడు: చూ, హారకుఁడు. 2.
అసమంజసము, సం. విణ. బాగుకానిది: చూ, దుర్జాతము.
అసమగ్రము, సం. విణ. పూర్ణము కానిది: చూ, అసంపూర్ణము.

అసమయము, సం. విణ. సమయము తప్పినది: అకాలము, అనవసరము.

అసమర్థము, సం. వి. అ. పుం. 1: చూ, కావ్యదోషములు; విణ. 2 సమర్థము కానిది; అం. 3: చూ, పదదోషములు.

అసమర్థుఁడు, వా. విణ: చూ, అపటువు.

అసమశరుఁడు, సం. వి. అ. పుం. మరుఁడు, బేసితూపుల జోదు: చూ. మన్మథుఁడు.

అసమాధానము, సం. వి. అ. న: చూ, అసమ్మతి.

అసమానము, సం. విణ: చూ, అతులము.

అసమీక్ష్యకారి, సం. విణ. చక్కఁగా యోచింపక యేపనినేని చేయువాఁడు: చూ, జాల్ముఁడు.

అసము, వై. వి 1.=యశః. కీర్తి: చూ, యశస్సు; దే. వి. 2. ప్రేమము: చూ, స్నేహము. 1; 3. గర్వము. భార. విరా. 5, ఆ. 234: చూ, హంకారము.

అసముఁడు, సం. వి.అ. పుం. అద్వయవాది: చూ, బుద్ధుఁడు. 1.

అసమేషువు, సం. వి. ఉ. పుం. మరుఁడు, బేసితూపులజోదు: చూ, మన్మథుఁడు.

అసమోపమము, అం: చూ, అర్థదోషములు.

అసమ్మతి, సం. విణ. 1. సమ్మతిలేనిది: అనంగీకారము, అసమాధానము; (తె ప.):- ఎఱవటికము, ఒప్పమి.

అసర, వై. వి. = అసుర. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

అసరవేయు, దే. స. క్రి. ఆలస్యముచేయు: చూ, తడయు.

అసరసంజ, వై. వి. = అసురసంధ్యా. ప్రదోషకాలము, రాత్రి యొక్క మొదలు : చూ, సాయంకాలము. (రూ-అసరసంజె-అసరసందె.) [పసరు. 2.

అసరు, దే. వి. ఆకుపసరు. భార. శల్య. 2, ఆ. 160: చూ,

అసలార, దే. క్రి. విణ. ఒప్పిదముగా: చూ, సరిగా.

అసలారు, దే. అ. క్రి. అతిశయిల్లు: చూ. మొమ్మరించు.

అసలు, దే, వి. 1. పంకము: చూ, బురద; 2. మూలధనము: చూ, సంచిమొదలు.

అసలుఁబుట్టువు, దే. వి. (అసలు + పుట్టువు) పంకజము, తామర*: చూ, సహస్రపత్త్రము. 1.

అసలుకొను, దే. అ. క్రి: చూ, పంకిలమగు.

అసలుపైకము, అం: చూ, ప్రకాశింపఁ జేయగూడనివి.

అసవు, సం. వి. ఉ. పుం. ఉసురు, ప్రాణము: చూ, ప్రాణము. 6.

అసహత, సం. వి. అ. స్త్రీ. అసహనము, ఓర్వమి: చూ, హింస. 2

అసహనపడు, మి. అ. క్రి. ఈర్ష్యపడు: చూ, సూడుకొను. 2.

అసహనము, సం. విణ: చూ, అసహత.

అసహనుఁడు, సం. వి. అ. పుం. 1. పగతుఁడు: చూ, శత్రువు. 1; విణ. 2. ఓర్వలేనివాఁడు: చూ, సూడుకాఁడు.

అసహాయత, సం. వి. అ. పుం: చూ, దిక్కుమాలినతనము.

అసహాయశూరుఁడు, సం. వి. అ. పుం. సహాయములేకనే యుద్ధమందు నిపుణత్వముఁ గనఁబఱచువాఁడు: చూ, ఒంటరీఁడు. 1.

అసహాయుడు, సం. విణ. సహాయములేనివాడు: చూ, ఒంటరీడు. 2.

అసహిష్ణుఁడు, సం. విణ. ఉ. రూ-అసహిష్ణువు: చూ, సూడుకాఁడు.

అసహిష్ణుత, సం. వి. అ. పుం. ఓర్వలేమి: చూ. హింస. 7.

అసహిష్ణువు, సం. విణ. ఉ: చూ, రూ- అసహిష్ణుఁడు.

అసహ్యత, సం. వి. అ. న. ఓకరింత: చూ, రోఁత. 2.

అసహ్యపడు, మి. అ. క్రి: చూ, రోఁతపడు.

అసహ్యము, సం. విణ. 1. సహింపఁగూడనిది: చూ, రోఁత. 2.

అసహ్యించు, సం. అ. క్రి: చూ, రోఁతపడు.

అసహ్యుఁడు, సం. వి. అ. పుం. 1. పగవాఁడు: చూ, శత్రువు. 1: 2. రోఁతకలవాఁడు: చూ, రోఁతకాఁడు.

అసాదు, దే. అవ్య. ప్రశంసనార్థకము. బహు. రూ-హసాదు. రామా. 3, ఆ. 149. (పెద్దలయాజ్ఞను శిరసావహించుట యందువర్తించును.): చూ, సేబాసు.

అసాధ్యత, సం. వి. అ.న. సాధ్యములేమి: చూ, అసాధ్యము.

అసాధ్యము, సం. విణ. సాధ్యముకానిది: వి. అసంభావ్యత అసాధ్యత, విణ. అసంభావ్యము.

అసామర్థ్యము, వా. వి: చూ, అపాటవము.

అసారము, సం. విణ. సారములేనిది. (మాది మొ.): చూ, డొల్ల. 2.

అసారేఖలుసంసారే సారంశ్వశురమందిరమ్, న్యా, అసారమైన యీసంసారమున (లోకమున) అత్తగారింటియిల్లు సారమైనది. యుత్తరార్థమిది. "హిమాలయే హరశ్శేతే, హరిశ్శేతే మహోదధౌ."

అసి, సం. వి. ఇ. పుం. 1. అస్త్రము, ముప్పదియంగుళములకు నెక్కువగలకత్తి: చూ, రిష్టి. 2; అవ్య. 2. త్వమర్థకము, నీవనుట: చూ, త్వమ్; 3. ఒకానొక వాక్యాలంకారము: చూ, అలంకారము.3. అం. 4: చూ, బాణము. 1; దే. ఉప. (1) అల్పార్థకము. అసి, కోఁత, అసిగాయము. మొ.

అసిఁబోవు, దే. అ. క్రి. (అసి + పోవు.) తప్పిపోవు: చూ, తప్పిపోవు.

అసిక్ని, సం. వి. ఈ. స్త్రీ.1.శరీరాయాసముచే జీవనముచేయుచు అంతఃపురమునందు మెలఁగెడి ప్రాయపు ఆఁడుది. = నెఱియని వెంట్రుకలు గలది: చూ, స్త్రీ; 2. ఒకానొకయేఱు: చూ, నది. 1-(ఇ)

అసిగ్లానికము, సం. వి. అ. పుం. వెల్లుల్లి*: చూ, సుకందకము. 1-ఇ. (దీనిగడ్డయేమాత్రను.)

అసితపక్షము, సం. వి. అ. పుం. అమవసతోఁజేరి ముందుండు పదియేనుదినములు, కృష్ణపక్షము: చూ, పక్షము. 1-ఆ.

అసితము, సం. వి. అ. పుం. 1. నీలము, నలుపు: చూ, వర్ణము. 6-ఉ.

అసితాంగము, సం. వి. అ. పుం. 1. అస్త్రము, ముప్పది యంగుళములకు నెక్కువఁగలకత్తి: చూ, రిష్టి. 2: విణ. 2. నల్లని దేహముగలది.

అసితాననము, సం. వి. అ. న. కొండముచ్చు: చూ, వానరము. 1-ఈ.

అసితాభ్రశేఖరుఁడు. సం. వి. అ. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

అసితార్చి, సం. వి. స్. పుం. అగ్ని: చూ, వహ్ని. 1:

అసితుఁడు, సం. వి. అ. పుం. 1. శని, ఛాయకొడుకు: చూ, శని 1; విణ. 2. నల్లనివాఁడు: చూ, నల్లనయ్య.

అసిదంష్ట్రిము, సం. వి. అ. పుం. మొసలి: చూ, మత్స్యము. 1-౩.
అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష, అం. అలంకారభేదము: చూ, అలంకారము. 3.
అసిద్ధవిషయహేతూత్ప్రేక్ష, అం. —పై.—
అసిధరుఁడు, సం. వి. అ. పుం. 1. నైరృతి: చూ, మూలఱేఁడు: కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.
అసిధారావ్రతము, ఉత్కృష్టమైన వ్రతము. సౌందర్యవతియు, యౌవనవతియు నైన స్త్రీతో నేకశయ్యయందు శయనించి యామెయందు మనసైనఁ బ్రసరింపకుండుట. (కత్తిమీఁది సాము).
శ్లో. "యత్రైకశయనస్థాపిప్రమదా నోపభుజ్యతే, అసిధారా వ్రతంనామవదంతి మునిపుంగవాః" అనియును "శయనే మధ్యేఖడ్గంనిధాయ స్త్రీ పుంసౌయత్ర బ్రహ్మచర్యేణ స్వపతః తదసిధారా వ్రతం" అనియు; "యువాయువత్యాసార్థం యన్ముగ్ధ భర్తృకవదాచరేత్, అంతర్ని వృత్త సంగస్స్యాత్ అసిధారావ్రతంహితత్" అనియుగలదు. (త. చంద్రిక).
అసిధావకుఁడు, సం. వి. అ. పుం: చూ, సానలవాఁడు.
అసిధేనుక, సం. వి. ఆ. స్త్రీ. ఛురిక, చురకత్తి, మొలనుంచుకొను సూరకత్తి: చూ, రిష్టి. 2.
అసిపత్రకుఁడు, సం. వి. అ. పుం. కత్తి యొఱఁగలవాఁడు.
అసిపత్రము, సం.వి.అ.పుం.1: చూ, నరకములు; 2. ఇక్షువు*: చూ, చెఱకు; 3. కత్తియొఱ, ఖడ్గాదులయొఱ: చూ, ప్రత్యాకారము.
అసిపుచ్ఛకము, సం. వి. అ. పుం. మత్స్యవిశేషము: చూ, మత్స్యము. 1.
అసిపుత్రి, సం. వి. ఈ. స్త్రీ: చూ, అసిధేనుక.
అసిమి, దే. వి. ఎద్దుమీఁదవేసెడు గోనెవలె కుట్టినసంచి, గోణి: చూ, సంచి.
అసిమిగొల్లెన, దే. వి. ఇరుప్రక్కల వంపుగాళాలవలె నేర్పఱచిన చిన్నగుడారము. కళా. 8, ఆ. 42: చూ, సదనము. 1-౪౦-(3).
అసియాడు, దే. అ. క్రి. (అసి+ఆడు.) వణఁకు: చూ, చలించు.
అసిరమ్మ, ద్వి. వి. ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3. (రూ-అసినమ్మ.)
అసిలేటు, వై. వి. = ఆశ్లేషా. సప్తపుఁజుక్క: చూ, రిక్క. 1-౯.
అసివాడు, దే. వి. సవారిమార్గము, రూ-కసివాడు: చూ, మార్గము. 1-౨౮.
అసివాఱు, దే. వి. (అసి+పాఱు.) నికాటు. కాశీ. 4, ఆ. 195: చూ. విహారము. 1.
అసిహేతి, సం. విణ. ఇ. కత్తియాయుధముగా గలది. (వాడు): చూ, నైస్త్రింశికుడు.
అసీతికము, సం. విణ. అసీతిక్రీతవస్త్రము: చూ, వస్త్రము. 1-౩.
అసీత్యము, సం. విణ: —పై.—
అసుక్షణము, సం. వి. అ. న. అవమానము: చూ, వహేలనము.
అసుతీవలుఁడు, సం. వి. అ. పుం. 1. శూద్రజాతి విశేషమున్కఁబుట్టిన కన్యాపాలుఁడనువాఁడు. రూ-అసుతీవలుఁడు: చూ, సోమయాజి. 2; 2. రూ-అసుతీవలుఁడు క్షత్రియ స్త్రీకి శూద్రునకుంబొడమి అయిదువిధముల సారాయిని అమ్మువాఁడు: చూ, సురాజీవి.
అసుతీవలుఁడు, సం. వి. అ. పుం. —పై.—
అసుధారణము, సం. వి. అ. న. జీవనము: చూ, స్థితి. ౫.
అసుధారిణి, సం. వి. ఈ. స్త్రీ. మహామిద*: చూ, మహామేద.
అసుర, సం. వి. ఆ. స్త్రీ. 1. రాతిరి: చూ, రాత్రి; 2. భోగముదాన: చూ, వేశ్య; పుం. 3.=అసర. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 4. అసురకృత్యముచేత కుక్కకియ్యఁబడిన పేరు, గాంభీర్యమునుబట్టి కుక్కకియ్యఁబడినపేరు. స్వా.4, ఆ. 32: చూ, సివంగి. 2.
అసురము, సం. వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. కాకోలము, మాలకాకి: చూ, సకృత్ప్రజము. 1-౫.
అసురసంధ్య, సం. వి. ఆ. స్త్రీ. =అసరసంజ, అసరసంజె, అసరసందె. ప్రదోషకాలము, రక్కసులు తిరుగుకాలము: చూ, సాయంకాలము.
అసురాహ్వయము, సం. వి. అ. న. కాంస్యము, కంచు: చూ, లోహము. 1-౩: 2. మురామాంసియను గ్రంధిద్రవ్యము: చూ, రాజార్హము. 1-౪౧.
అసురి, సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ఆసురి. తివము, నల్లావలు*: చూ, సర్షపము; 2. అసురునిభార్య, రాక్షసాంగన: చూ, స్త్రీ. 1-౧౦.
అసురుఁడు, సం. వి. అ. పుం. 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2: చూ, సూర్యుఁడు.
అసురుసురుగుట, వా. వి. ఆయాసపడుట.
అసురుసురు, దే. వి. శ్రమమునందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
అసుర్షణము, సం. వి. అ. న. తెగడిక: చూ, వహేలనము. (రూ-అసూక్షణము-అసూర్షణము, అసుక్షణము.)
అసువు, సం. వి. ఉ. పుం. రూ-అసవు. ఉసురు: చూ, ప్రాణము. 6. (బ. అసువులు.)
అసుహృత్తు, సం. వి. త్. పుం. పగతుఁడు: చూ, శత్రువు. 1.
అసూక్షణము, సం. వి. అ. న. తిరస్కారము. రూ-అసూర్షణము, అసుర్షణము: చూ, వహేలనము.
అసూచ్యము, అం. దృశ్యము, శ్రావ్యమునని ద్వివిధము.
అసూర్షణము, సం. వి. అ. న: చూ, రూ-అసూక్షణము.
అసూయ, సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిగుణముగల దానియందు దోషము నారోపించుట: చూ, ఇడుగడ; 2. వ్యభిచారిభావ భేదము: చూ, రసములు; విణ. 3. కోపము: చూ, రోషము; అం. 4: చూ, సంచారీభావభేదములు.
అసూయాపరుఁడు, సం. విణ. ఓర్వలేనివాఁడు: చూ, సూడుకాఁడు.
అసూర్యంపశ్య, సం. వి. ఆ. స్త్రీ. 1. రాజభార్య, రాణి. దొరసాని: చూ, భార్య. 1-౩౧; 2. అంతఃపురస్త్రీ: చూ. స్త్రీ. 1-౮; విణ. 3. ఎండకన్నెఱుఁగనిది.
అస్పృక్కు, సం. వి. క్. న. మాంసమలము, నెత్తురు: చూ, రక్తము. 1.

అసృగ్ధర, సం. వి. ఆ. స్త్రీ. చర్మము: చూ, తెరలు.
అసృగ్వర, సం. వి. ఆ. స్త్రీ: చూ, అసృగ్ధర.
అసోగము, వై. వి. 1.=అశోకః. కంగేలి*: చూ, హేమ పుష్పము;2. =అశోకః. కటుకరోహిణి*: చూ, కటుకరోహిణి. 1
అసోమ, సం. వి. ఆ. స్త్రీ. చంద్రుఁడు లేని రాత్రి: చూ, రాత్రి. 1-ఎ.
అసౌమ్యస్వరుఁడు, సం. వి. అ. పుం. చెవులకింపుఁ గాని స్వరమును బలుకువాఁడు, అస్వరుఁడు: చూ, బొంగు గొంతుకవాఁడు.
అస్కంధము, సం. వి. అ. పుం. మ్రానులేనిచెట్టు, తీఁగెజాతి లోనగునది, దుంపజాతిలోనగునది. (భూమిలోని దుంపను మ్రానుగా వాడెదరు.): చూ, వృక్షము. 1-ఇ.
అస్ఖలితబ్రహ్మచారి, సం. వి. న్. పుం. ముంజిత్రాడు లోనగు వానిధరించి వేదముచదివి స్ఖాలిత్యము క(లే) వ్యభిచార దోషములులేని బ్రహ్మచర్యవ్రతమునందుండువాఁడు: చూ, బ్రహ్మచారి.
అస్తంబము, సం. వి. అ. పుం. బోదెలేని చిన్నచెట్టు: చూ, వృక్షము: (చూ, అస్కంధము.)
అస్తమనము, సం. వి. అ. పుం. అస్తమించుట: 1. అస్తమయము, అస్తమానము. (తె. ప.):— క్రుంకు, క్రుంకుడు. తద్వి-౧ ఉపధూపితము.
అస్తమయము, —పై.— సాసం. 2, ఆ. 109
అస్తమానము, 1. —పై.—; 2. (అ. ప్ర.) ఎల్లప్పుడు.
అస్తమించు, సం. అ. క్రి. 1. అత్తమిల్లు. చెడు: చూ, నశించు; 2. కనఁబడకపోవు, క్రుంకు: చూ, నింగివడు.
అస్తము, సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు అస్తమించుకొండ: చూ, పర్వతము. 1-ఎ. విశ. 2. త్రోయఁబడినది: చూ, విద్ధము; 3. ముగిసినది: చూ, సమాప్తి. 1; 4. అదృశ్యము: చూ, కంచుమించు; వై. వి. (1)=అత్తము. గెలలోనొక భాగము, (అరఁటిపండ్లఅత్తము.): చూ, గెల.
అస్తరు, వై. వి. = ఆస్తర. సంధాన వసనఖండము, గుడ్డకు జతగాఁజేర్చి కుట్టిన వేరొక గుడ్డ: చూ, మానిక. 1. (రూ-అస్తరువు-ఆస్తర-అస్తరు.)
అస్తరువు, వై. వి. =—పై.—
అస్తాచలము, సం. వి. అ. పుం: చూ, అస్తము. 1.
అస్తాద్రి, సం. వి. ఇ. పుం. —పై.—
అస్తి, సం. తిజంతప్రతిరూపకావ్యయము. 1. కాలసామాన్యము: చూ, ఆహా; 2. కలదు; 3. ఉన్నది; అం. 4: చూ, భావవికారములు.
అస్తిక్షీర, సం. విశ. పాలుగలది: చూ, క్షీరవతి.
అస్తిమంతుఁడు, సం. విశ. త్. ధనవంతుఁడు:చూ,సంపన్నుఁడు.
అస్తు, సం. అవ్య. 1. మేలు: చూ, శుభము. 1; 2. కోపము చేత నంగీకరించుట. (అసధాతువుయొక్క లోట్ప్రథమైక వచనము. కానిమ్ము అనుట.); 3. అలాగే కానిమ్ము: చూ, తథా. 2; 4. దుఃఖముచేత నంగీకరించుట: చూ, సమ్మతి. 1-ఉ; 5. అవుఁగాక: శ్రీరస్తు-శుభమస్తు-అవిఘ్నమస్తు—మహదైశ్వర్యాభివృద్ధిరస్తు-దిగ్విజయోస్తు- వంశాభివృద్ధిరస్తు. ఇత్యాదులు.): చూ, సమ్మతి. 1.

అస్తుంకారము, సం. వి. అ. పుం. ఇయ్యకోలు: చూ, సమ్మతి. 1.
అస్తేయము, అం: చూ, సాత్త్వికగుణములు; 2: చూ, యోగ యమాంగములు.: (చూ, అంగము. 9.)
అస్తోకము, సం. విశ. స్తోకముకానిది. (స్తోకము=అల్పము.)
అస్త్రకంటకము, సం. వి. అ. న. అమ్ము: చూ, బాణము. 1; హారావళి. 53. శ్లో.
అస్త్రజీవి, సం. వి. న్. పుం. పెక్కువిలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు: చూ, భటుఁడు.
అస్త్రజీవుఁడు, సం. వి. అ. పుం. —పై.—
అస్త్రమంత్రేణశామ్యతి, న్యా. అస్త్రముచేతనే యస్త్రము పరిశమిల్లును. ఇట్టివే "విషస్యవిషమౌషధం" "వజ్రం వజ్రేణ భిద్యతే" అనునవి. ఆంధ్రమున "పిరికిభ్రవక్యమునకు హనుమంతవక్యము" అనెడిలోకోక్తిగలదు.
అస్త్రము, సం. వి. అ. న. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. ఖడ్గము, కత్తి: చూ, రిష్టి. 2; 3. చాపము, విల్లు: చూ, బాణము. 1; 4. యజ్ఞప్రయోజ్యమంత్రవిశేషము, గాయత్రి లోనగునది: చూ, మంత్రము. 1.
అస్త్రములు, అం. అశని (శుష్కాశని, ఆర్ద్రాశని), అసిరత్నము, ఆగ్నేయాస్త్రము, ఐంద్రాస్త్రము (వజ్రాస్త్రము.), ఐషీకము, కంకణము, కంకాళము, కాందర్పము, కాపాలము, క్రౌంచాస్త్రము, గద (శిఖరిగద, మోదకిగద.), గభస్త్యస్త్రము, గాంధర్వాస్త్రము, చక్రము (దండచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము.), తామసము, తేజఃప్రభము, తేజోపకర్షణము, త్వాష్ట్రికము, దమనము, దర్పము, నందనాస్త్రము, నారాయణాస్త్రము, పాశము (ధర్మపాశము, కాలపాశము, వరుణ పాశము.), పైనాకాస్త్రము, పైశాచము, ప్రమథాస్త్రము, ప్రశమనము, ప్రస్వాపనము, బ్రహ్మశిరోస్త్రము, బ్రహ్మాస్త్రము, మానవాస్త్రము, మాయావంతము, ముసలము, మోహనము, మౌసలము, వాయవ్యాస్త్రము, వారుణాస్త్రము, విద్యాధరాస్త్రము, విలాపనము, శక్తి, శిఖరాస్త్రము, శిలేషు మానవాస్త్రము, శైవశూలము, శోషము, సంతాపనము, సంవర్తనము, సత్యాస్త్రము, సర్పమాయావమనము, సుధామనము, సోమాస్త్రము, సౌమనస్యము, సౌరము, హయశిరము. (53.): చూ, బాణము. 1: చూ, శస్త్రములు: చూ, ముప్పదిరెండాయుధములు.
అస్త్రి, సం. విశ. న్: చూ, విలుకాఁడు.
అస్థానసమాసము, అం: చూ, వాక్యదోషములు. [లోఁతు. 2.
అస్థాయము, సం. వి. అ. పుం. మిక్కిలిలోఁతు గలది: చూ,
అస్థి, సం. వి. ఇ. న. = ఎముక: చూ, శల్యము. 1.
అస్థిపంజరము, సం: వి. అ. పుం. 1. మనుజుని లోనగువాని ఎముకలగూఁడు: చూ, శల్యము. 1.
2. ప్రక్క టెముకలగుంపు: చూ, శల్యము. 1.
అస్థిభక్షము, సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము. 1.
అస్థిమాలి, సం. వి. ఇ. పుం. పునుకతాలుపు: చూ, శివుడు. 1.
అస్థిరత, సం. వి. ఆ. న. స్థిరత్వములేమి: చూ, అస్థిరము.
అస్థిరము, సం. విశ. 1. స్థిరముకానిది: వి. 2. అస్థిరత; విశ. ఆస్థైర్యము. (తె. ప) :—అదువ-రూ-అద్దువ.

అస్థిరుఁడు. సం. విణ. ఎందును నిలుకడలేనివాఁడు: చూ. సం కల్పుడు.
అస్థివిగ్రహుఁడు. సం. వి. అ. పుం. భృంగీశ్వరుఁడు; చూ. శివుఁడు.
అస్థిసంచయనము. పా. చచ్చినపిదప మంచిదినము చూచి ఎము కలు ప్రోవుచేయు కర్మము: చూ. సంచయనము
అస్థిసంహారము: సం. వి. అ. న. నల్లేరు*: చూ. హస్తిశుండి
అస్థిస్నేహము. సం. వి. అ. పుం. ఎముకలలోని క్రొవ్వు: చూ. మజ్జ. 2.
అస్థిహారుఁడు. సం. వి. అ. పుం. పాఁపతొడవుల వేలుపు: చూ. శివుఁడు. 1.
అస్థ్యుపదేహిక. సం. వి. ఆ. స్త్రీ. చెట్టున తెట్టెఁబెట్టు నల్లచీమ, ఉద్దీపకము; చూ. పిపీలిక.
అస్థైర్యము. సం. విణ. చూ. అస్థిరము.
అస్పష్టత. సం. వి. అ. న. స్పష్టముకానిది: చూ. రహస్యము 1.
అస్పష్టము. సం. విణ.—పై.—
అస్ఫుటము. —పై.—
అస్ఫుటవాచ్యుఁడు. సం. విణ.
అస్పృష్టి. స. వి. ఇ. స్త్రీ. చావుమైల. చూ. మృతాశౌచము.
అస్రపుఁడు. సం. వి. అ. పుం. నిర్ఋతి; చూ. నైఋతిలవేఁడు.
అస్రము. సం. వి. అ. న. 1. రూ-అశ్రము. కన్నీరు; చూ. రోదనము. 2: 2. రూ-అస్రము. నెత్తురు: చూ. రక్తము. 1: పుం. 3.కోణము, రెండుదిక్కులనడుము, మూల: చూ. విదిక్కు. 4. రూ-అస్రము. కేశము.
అస్రువు. సం. వి. ఉ. న. 1. రూ-అశ్రువు. కన్నీరు: చూ. రోదనము. 2: 2. నెత్తురు: చూ. రక్తము. 1: పుం. 3. క్లేశము, వ్యసనము: చూ. శోకము. 1-౧.
అస్వంతము. సం. వి. అ. పుం. 1. చావు; చూ. సావు: 2. ప్రొయ్యి; చూ. హసంతి. 1-౧.
అస్వచ్ఛందుఁడు. సం. విణ. ఒకరికి లోఁబడినవాఁడు: చూ. పరాధీనుఁడు.
అస్వతంత్రము. సం. విణ. స్వతంత్రములేనిది: వి. అవగ్రహము.
అస్వతంత్రుఁడు. సం. వి. అ. పుం. స్వతంత్రము లేనివాఁడు, గృహ్యాకుఁడు: చూ. గృహ్యుఁడు.
అస్వాధ్యాయుఁడు. స. వి. అ. పుం. వేదముచదువని బ్రాహ్మ ణుఁడు; నిరాకృతి. చూ. స్వస్తిముఖుఁడు. 1-౧౫.
అస్వామిక్రయము. అం. చూ. వ్యవహారపదములు.
అస్సుస. దే. వి. పరితాపానుకరణధ్వని: చూ; హుహూ. (రూ-అసురుసురు.)
అహమ్. సం. స. ద్. అస్మదర్థకము. నాశబ్దమునకు ప్రథమైక వచనము, ఏను; చూ. నేను.
అహఃకరుఁడు. సం. విణ. పుం. పగటిజోతి; చూ. సూర్యుఁడు.
అహఃపతి. సం. వి. ఇ. పుం. —పై.—
అహంకరించు. సం. అ. క్రి. గర్వించు; చూ. హంకరించు
అహంకారము. అం. 1. చూ. అంతఃకరణములు: చూ. నాలుగు; 2.= హంకారము, గర్వము: సం. వి. అ. పుం. చూ. హంకారము: అం. 3. చూ. హేయగుణములు; 4. చూ. ప్రకృతులు.
అహంకారసర్గము. అం: చూ. సృష్టిసర్గములు.
అహంకారి. సం. విణ. అహంకారము గలవాఁడు: పొగరుఁ బోతు. చూ. హేరంబుఁడు.
అహంకృతి. సం. వి. ఇ. స్త్రీ. గర్వము: చూ. హంకారము.
అహంక్రియ. సం. వి. ఆ. స్త్రీ. —పై.—
అహంత. సం. వి. అ. స్త్రీ.—పై.-(నేననుట.)
అహంపూర్వికి. సం. వి. ఆ. స్త్రీ యుద్ధాదులయందు నేనుముందు నేనుముందని యొకరితోనొకరిమీఁజుట, అహమహమిక: చూ. తండోపతండము.
అహంభావము. సం. వి. అ. పుం. గర్వము, నేననుట: చూ. హంకారము.
అహంయుపు. సం. విణ. ఉ: చూ. అహంకారి.
అహతము. సం. విణ. రూ-అహతము, క్రొత్తబట్ట, అనాహతము: చూ. వస్త్రము. 1-3.
అహమహమిక. సం. వి. ఆ. స్త్రీ. = అమిక, హమిక: చూ. అహంపూర్వికి.
అహమించు. సం. స. క్రి. గర్వించు. చూ. హంకరించు.
అహము. సం. వి. న్. న. రూ-అహస్సు: చూ. వాసరము. 1.
అహమ్మతి. సం. వి. ఇ. స్త్రీ. తెలివిలేనితనము; చూ. విస్మృతి.
అహరహము. సం. అవ్య. అజస్రము: చూ. సతతము 2.
అహర్గణము. సం. వి. అ. పుం. నెల: చూ. మాసము 1.
అహర్పతి. సం. వి ఇ. పుం; చూ. రూ-అహఃపతి,
అహర్ముఖము. సం. వి. అ. పుం. ప్రభాతము, తెల్లవాఱుగడ: చూ. వేగుజాము.
అహర్దానము. సం. వి. అ. న. ఔర్ధ్వదైహికము, మృతుల కొఱకుఁజేయఁబడు పిండజలాదిదానము; చూ. కర్మములు.
అహల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. గౌతమునిభార్య: చూ. భార్య: 1-౧౬: అం. 2: చూ. కన్యకలు.
అహవము. సం. వి. అ. న. రూ-ఆహవము. ఆహవము. జగడము: చూ. యుద్ధము. 1.
అహస్సు. సం. వి. న్. న. రూ-అహము. చూ. పగలు చూ. వాసరము.
అహస్కరుఁడు. సం. వి. అ. పుం. పగటిజోతి; చూ. సూర్యుఁడు.
అహహ. సం. అవ్య. 1. అద్భుతము: చూ. వింత. 1: 2. ఖేదము; చూ. శోకము: 1-౧. 3. హర్షము; చూ. సంతోషము: 4. ఊఱట; చూ. ప్రశ్నయము: వై. అవ్య. (1)= అహో. ఆశ్చర్యార్థకము. ఔర; చూ. వింత. 1. (రూ-అహహా.)
అహహా: చూ. రూ-అహహ.—పై.—
అహో. వై. అవ్య. ఆశ్చర్యార్థకము, ఔర: చూ. వింత. 1: షాంచా. 1, ఆ. 38.
అహోరె. ద్వి. వై. అవ్య.—పై.—(రూ-అహోరే.)
అహోరే; చూ. రూ-అహోరె.

అహార్యము. సం. వి. అ. పుం. 1. కొండ: చూ. పర్వతము. 1. విణ. 2. దొంగిలఁ దగనిది; 3. స్థిరమైనది: చూ. స్థిరము. 4.

అహి. సం. వి. ఇ. పుం. 1. పాము; చూ. సర్పము; 2. వృత్రాసురుఁడు: చూ. వృత్రుఁడు; 3. వజ్రాయుధము; చూ. బాణము. 1-౨౨; 4. నక్షత్రభేదము: చూ. రిక్క-1; 5. పగతుఁడు; చూ. శత్రువు. 1.

అహింస. సం. వి. ఆ. స్త్రీ. 1. హింసచేయకుండుట; చూ. అకతలు; అం. 2: చూ. సాత్త్వికగుణములు; 3: (చూ. అంగము 9.) చూ. యోగయమాంగములు; 5. చూ. మజ్జావదాయకములు; 6. చూ. రాజలక్షణములు.

అహింసాపరమోధర్మః న్యా. అన్నిధర్మములలో నహింసయే శ్రేష్ఠమైన ధర్మము.

అహింసావ్రతము. అం; చూ. బౌద్ధధర్మములు.

అహికేసరము. సం. వి. అ. పుం. నాగకింజల్కము*: చూ. సువర్ణాఖ్యము.

అహిచ్ఛత్ర. అం. చూ. దేశములు. 1-౪౮.

అహిచ్ఛత్రము; సం. వి. అ. న; చూ. పుట్టగొడుగు*; చూ. సర్పాక్షి.

అహిజిహ్విక. సం. వి. ఆ. స్త్రీ. పిల్లపీచర* చూ. శతమూలి.

అహితము. సం. విణ. హితవుకానిది. (తసిల్ప్రత్యయాంతమయిన అవ్యయ మయినప్పుడు శత్రువునుంచి పామునుంచి అను అర్థము); చూ. కవరు. 6.

అహితాగ్ని. సం. వి. ఇ. పుం. అగ్నిచిత్తు, అగ్నిచయనము చేసినవాఁడు: చూ. గాతువు. 4.

అహితుండికుఁడు. సం. వి. అ. పుం. పాములవాఁడు: చూ. వ్యాళగ్రాహి.

అహితుఁడు. సం. వి. అ. పుం. పగతుఁడు: చూ. శత్రువు. 1.

అహిదంష్ట్ర. సం. వి. ఆ. స్త్రీ. తేలుకొండి *: చూ. వృశ్చికము. 2.

అహిద్విషము. సం. వి. అ. న. మగ నెమిలి; చూ. శిఖి. 2.

అహిద్విషుఁడు. సం. వి. ష్. పుం. 1. గరుత్మంతుఁడు: చూ. హరివాహనుఁడు : 2. ఇంద్రుఁడు : చూ. వేలుపు ఱేఁడు.

అహినకులన్యాయము. న్యా. పాము ముంగిసలవలె స్వభావవైరము గలవారినిగూర్చి దీనిని ప్రయోగింతురు.

అహిపతి. సం. వి. ఇ. పుం. పాఁపఱేఁడు; చూ. సర్పము. 1.

అహిపుత్రకము. సం. వి. అ. న. నౌకావిశేషము. తరాణువు: చూ. హోడము. 1-3.

అహిఫేనము. సం. వి. అ. న. 1. = అభిని. అఫేనము: చూ. నల్లమందు; 2. విలుము. చూ. విసము. 1.

అహిభయము. సం. వి. అ. న. రాజునకు పుత్ర దాయాదప్రభృతి స్వపక్షజనకృతమైన భయము. (స్వపక్షమువారెవ్వరు.- మూలబలము, మిత్రబలము, సమాశ్రితుఁడు, సంబంధజుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁడు, ఉపచారగృహీతుఁడు.) చూ. స్వపక్షమువారు.

అహిభుక్కు. సం. వి. క్. పుం. గరుత్మంతుఁడు: చూ. హరివాహనుఁడు; 2. నెమిలి: చూ. శిఖి-2.

అహిభూషణుఁడు. సం. వి. అ. పుం. పాఁపతొడవులవేలుపు: చూ. శివుఁడు.

అహిమాకరి. సం. వి. న్. పుం. పంపుఁడుమ్మ *: చూ. విష్ణుదిరము.

అహిమారకము. సం. వి. అ. పుం. తుమ్మ * చూ. విష్ణుదిరము

అహిమేదము. సం. వి. అ. పుం: చూ. అహిమారకి*.

అహిరూపవ్యక్. సం. వి. త్. న. సర్పకంచుకము, పాము పొర. చూ. నీరదము. 3.

అహిర్బుధ్న్య. సం. ఈ. స్త్రీ. ఉత్తరభద్రపద నక్షత్రము: చూ. రిక్క. 1-౨౩.

అహిర్బుధ్న్యుఁడు. సం. వి. అ. పుం. : చూ. అహిభూషణుఁడు. 1; అం. 2. చూ. రుద్రులు.

అహివిషహా. సం. వి. న్. స్త్రీ. నల్లవిష్ణుక్రాంతము *: చూ. విష్ణుక్రాంత.

అహిహ. సం. వి. హ్. పుం. 1. ఇంద్రుఁడు: చూ. వేయిఁపు తేఁడు. 2. పామునుజంపినవాఁడు; 3. శత్రువును గొట్టినవాఁడు.

అహీంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. పాఁపఱేఁడు, సర్పరాజు, శేషుఁడు; చూ. సర్పము, విణ. 2. శత్రుశ్రేష్ఠుఁడు; చూ. శత్రువు. 1.

అహీనుఁడు. సం. విణ. 1. హీనుఁడుకానివాఁడు; 2. పాములలో శ్రేష్ఠుఁడు, వాసుకి: చూ. సర్పము. 1-౧.

అహీరణి. సం. వి. ఇ. పుం. ద్విముఖాహి, రెండుతలలపాము: చూ. సర్పము. 1-౧౨.

అహీరిణి.—పై.—

అహృష్టము. సం. విణ. సంతసములేనిది: అసంతుష్టి.

అహేతుకము. సం. విణ. హేతువులేనిది; చూ. నిర్హేతుకము.

అహేతువు. సం. వి. ఉ. స్త్రీ. రూ-అహేతువు, పిల్లపీచర*; చూ. శతమూలి.

అహో. సం. అవ్య. 1. ఆశ్చర్యార్థకము, ఔర: చూ. వింత. 1; 2. ఉతాహో;యద్వ; చూ.పికల్పార్థకములు; 3. విషాదము.రూ- అహో: చూ. శోకము; 4. తిరస్కరించుట; చూ. పహేళనము: 5. కృప; చూ. వాత్సల్యము. (చూ. దయ)

అహోపురిషిక. సం. వి. ఆ. స్త్రీ. రూ-ఆహోపురిషిక - అహోపౌరుషిక - అహోపురుషిక - అహోపౌరుషిక. గర్వముచే గలిగెడు ఆత్మగౌరవము. చూ. హంకారము. 1-౬.

అహోపురుషిక. —పై.—

అహోపౌరుషిక. —పై—

అహోబత. సం. వి. అ. న. అవ్య. 1. పనికరము: చూ. దయ; 2. వగ: చూ. శోకము; 3. పిలుపు: చూ. సంబోధనము; 4. అమృతము; చూ. సుధ. 1; 5. సంతసము: చూ. సంతోషము.

అహోబలము. అం. చూ. క్షేత్రములు.

అహోరాత్రము. సం. వి. అ. పుం. 1. రాత్రి పగలున్ను. ముప్పదిముహూర్తములకాలము, రేఁబగలు; చూ. హోర. 1; 2. మనుష్యులయొక్క మాసము పితరులకొక్క యహోరాత్రము. పితృసంబంధమైన యహోరాత్రము.

అహ్నాయము. సం. అవ్య. శీఘ్రముగా; చూ, స్యదము.
అహ్రీకుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధుఁడు: చూ, బుద్ధుఁడు. 1
అళక. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-అలక. కుబేరుని పట్టణము చూ, దేశము. 1-2-౫.
అళకము. సం. వి. అ. పుం. రూ - అలకము, అళికము. ముంగురులు ; చూ, వెండ్రుక, 1-౮. (బ. అళకలు.)
అళఁది. వై. వి. = హరిద్రా. పచ్చఁదనము; చూ, వర్ణము. 6-౩.
అళము. దే. వి. 1. ఉప్పుపంటఁబెట్టెడు ఏఁబడిపాదులకొలఁది నేల; చూ, భూమి. 1; 2. ఉప్పుఅమ్మెడునెట్టు; చూ, భూమి. 1-౧౮.
అళఘారతి. ద్వ. వి. ఆరాత్రికావిశేషము; తద్వి.—ఏకాదశారతి, కుంభారతి, గరుడారతి, పంచారతి, పురుషమృగారతి.
అళాకు. దే. వి. పడికి అళాకులు ఎనిమిది, ⅛; చూ, రూ-అలాకు. 2.
అళి. సం. వి. ఇ. న్. పుం. తుమ్మెద: చూ, షట్పదము. 1-౧, 2. తేలు: చూ, వృశ్చికము. 1; 3. కల్లు: చూ, సుర. 1: 4. నిర్మలాంతఃకరణుఁడు; ఇ. స్త్రీ. 5. రూ-ఆళి. బారు; చూ, శ్రేణి. 1; 6, చెలికత్తియ: చూ, సఖి, 1; 7, రూ-ఆళి. ఏఱులోనగువాని నీళ్లు వెలికిఁ బోవకట్టెడుకట్ట: చూ, సేతువు. 1; 8. నొసటియెముక, శంఖము; చూ, శల్యము. 1. 1.
అళింజరము, సం. వి. అ. పుం. రూ. అళింజరము. పెద్దబాన. చూ, పాత్రము 6-౧.
అళిందము. సం. వి. అ. పుం. రూ. ఆళిందము. తలవాకిటి ప్రక్కనుండెడు చిన్నగది, వాకిలి తొట్టికట్టునకు వెలుపల నుండు తలవాకిలి, ముందఱచావడి, కొన్నిచోట్ల నడవగది యని వాడుక ; చూ, హజారము.
అళికము. సం. వి. అ. న: చూ, రూ-అళికము.
అళిగర్దము. సం. వి. అ. పుం. 1. నీరుపాము; చూ, సర్పము; 1-౨౩: 2. నల్లత్రాఁచు; చూ, సర్పము. 1-౨,
అళిఁది. వై. వి. 1: చూ, రూ-అళఁది. (రూ-హళిఁది.) 2. తెల్ల తెగడ *: చూ, సర్వానుభూతి.
అళిని, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతుమ్మెద; చూ, అళి: 2. ఆఁడుతేలు: చూ, వృశ్చికము. 1.
అళిపకము. సం. వి. అ. పుం. 1. తుమ్మెద; చూ, అళి. 1: 2. కోయిల: చూ, నొకుడు పులుఁగు.
అళిపకుఁడు. సం. వి. అ. పుం, పల్లవుఁడు, లంజెకాఁడు; చూ, విటుఁడు.
అళిమకము, సం. వి. అ. పుం: చూ, రూ-అలిమకము.
అళిసుహృత్తు. సం. వి. ద్. పుం. కుందము, మొల్ల*; చూ, హసంతి. 2.
అళీకము. సం. వి. అ. న. 1. ప్రియముకానిది; చూ, వ్యళీకము. 1. 2. రూ-అలీకము, నుదురు; చూ, లలాటము; 3. అసత్యపు పలుకు; చూ, వితథము; 4. ఆకాశము: చూ, సుర వర్త్మము; 5. అమ్ము ; చూ, బాణము. 1; 6. ఉకమైథునము ; చూ, సంయోగము.
అళుకరి. దే. వి. భయశీలుఁడు; చూ, వెఱపరి.
అళుకు: దే. వి. 1. భయము: చూ, సాధ్వసము. అ. క్రి. 2. బెదరు: చూ, ఉలుక్కు. 6. (రూ-అలుకు, అల్కు, అళ్కు.)

# ఆ

ఆ. 1. ఒకానొకయక్షరము; చూ. వర్ణము,1; సం. ఉప. 2. ఇది యొక పదమునకు ముందువచ్చునపుడు "వఱకు" అను నర్థము నిచ్చుచున్నది. (ఉదా.— ఆచంద్రతారకము = చంద్రతారకలున్నవఱకు, ఆబాలగోపాలము = బాలగోపాలురవఱకు ఇట్లు ఆకంఠము, ఆచండాలము మొ.) 2. ప్రగృహ్యసంజ్ఞకమైన అవ్యయము; 3. స్మరణమును తెలుపును. "ఆ ఏవంకిలతత్" చూ, స్మృతి. 1; 4. మునుపుచెప్పిన వాక్యార్థమును సూచించుటను తెలుపును లేక వాక్యపూరణమందుగాని వర్తించును. " ఆ ఏవం మన్యసే - ఆ అద్య స్వాద్విష్టం భోజనంలబ్ధమ్." అని ప్రగృహ్యసంజ్ఞమైనందుచే "ఆఏవం" అనుచిక్కున సంధిలేక స్వభావమున నుండుట ప్రయోజనము; అవ్య. 5. ఆక్షేపించుటను తెలుపును : చూ, నెగ్గింపు; 6. అద్భుతమును తెలుపును; చూ, వింత. 1; 7. హర్షమును తెలుపును : చూ, సంతోషము; 8. ఊహించుటయందు వర్తించును: చూ, యోచన; 9. పీడయందు వర్తించును; చూ, శోకము; 1-౪; 10. సంతాపమునందు వర్తించును: చూ, సంతాపము; 11. శాంతమునందు వర్తించును: చూ, వినయము. 1; 12. వైరాగ్యమునందు వర్తించును; చూ, వైరాగ్యము ; 13. నీచకర్మలయందు వర్తించును; 14. ప్రభావమునందు వర్తించును. కోశబలమువలనఁ గలిగిన తేజమును తెలుపును: చూ, ప్రభావము. 1; 15. సంబుద్ధియందు వర్తించును: చూ, సంబోధనము; 16 ప్రయోగమునందు వర్తించును: చూ, ప్రయోగము 1; 17. ముఖ్యమనుట యందు వర్తించును: చూ, శ్రేష్ఠ్యము; 18. వితర్కమందు వర్తించును, సందేహము: చూ, సంశయము; 19. కోపమును దెలుపును: చూ, రోషము; 20. అలాగునెనుండుటను దెలుపును; చూ. తథా. 2; పుం. 21. చోటు: చూ, స్థానము, 1; 22. సత్త్వ; చూ, శక్తి, 1; 23. తాపము: చూ, సంతాపము; 24. బమ్మ, నలువ: చూ, బ్రహ్మ. 1; 25. ఘటము, ఏతవ: చూ, భాండము. 3; 26. బరువు: చూ, భారము. 1; 27. పరితాపము; చూ, సంతాపము; 28. అర్చన. పూజ: చూ, సపర్య: 29. మంగళసూత్రము: చూ, భూషణము. 2; 30. తాత. తండ్రితండ్రి: చూ, పితామహుఁడు. 1; 31. అభిప్రాయము. తలఁపు: చూ, విషయము. 4; 32. చూ, ఆ; దే. స. (1) ముందు చెప్పఁబడిన దానిఁదెలుపును. "ఆవరము." (2) ఎదుట దానిఁ దెలుపును. " ఆ వాని నృపులేక యేదియుఁగలుగదు ": చూ, ముందఱ. 1: (3) ఉద్దేశింపఁబడిన దానిఁ దెలుపును. చూ, యోచన; అవ్య. (4) అంగీకారమును తెలుపును. జై. 7, ఆ. 151: చూ, సమ్మతి. 1; (5) ఆశ్చర్యార్థకము. చూ, వింత. 1; (6) ప్రశ్నార్థకము. చూ, సవాలు. 1-౧; (7) ప్రార్థనార్థకము. చూ, స్తోత్రము. 1; (8) స్మృతిరేకార్థకము. ఎ. ఏ; (9) ఎదుటఁగలదానిఁ దెలుపును. "ఆయిల్లు"

"అకథలు" "వాఁడా; వాఁడున్నాఁడా; చెప్పుమా కమల ములవంటి కన్నులా." ఇత్యాదులు.

అమ్. సం. అవ్య. 1. మాదాగు, స్వయమంగీకారము, అంగీకారార్థకము; చూ, సమ్మతి, 1; 2. స్మరణమందు వర్తించును: చూ, స్మృతి 1; 3. నిశ్చయము దెలుపును: చూ, సత్యము. 1-౨.

అజ్. సం. అవ్య. 1. కొంచెమును దెలుపును : చూ, స్వల్పము; 2. మొదలుకొని అంతటానున్ను : చూ, అభివ్యాప్తి; 3. ఉద్గమము, పైకివచ్చుట : చూ, సంభవము 1; 4. గ్రహణము, పుచ్చుకొనుట : చూ, స్వీకారము-21;5 కోపగించుట : రోషము; 6. కౌగిలించుట; చూ, సంశ్లేషము; 7. తిట్టుట : చూ, శాపము : 1; 8. కోరుట : చూ. వాంఛ. 1; 9. తదేకశరణత్వము. అవష్టంభము : చూ, స్తంభనము. 1; 10. కాలము గడపుట : చూ, కాలయాపనము; 11. ఇష్టమైన వస్తువును పొందుటయందు వేగిరపడుట, ఉత్కంఠ : చూ, తహతహ; 12. దగ్గఱ : చూ; సమీపము. 1; 13. పగ : చూ, విరోధము. 1; 14, ఆవాసము : చూ, విత్తుట; 15. అడ్డగించుట ; చూ, వారణము 1; 16. మోసము ; చూ. వంచన; 17. కట్టుట : చూ, బంధము. 1; 18. చంపుట ; చూ, వధము; 19. మునక : చూ, స్నానము. 1; 20. హద్దు ; చూ. సీమ. 1; 21. వాడుక : చూ, స్వభావము; 22. చూచుట: చూ, లక్షణము, 8; 23. ఆలోచించుట ; చూ. యోచన; 24. శాస్త్రజ్ఞానము : చూ, హ్యుల్లేఖము. 2; 25. తెలియఁజేయుట : చూ, జ్ఞాపనము; 26. పరాధీనము : చూ, పారతంత్ర్యము; 27. త్యాగము ; చూ, వితరణము; 28. ఉత్తరువు : చూ, సెలవు; 29. అలంకారము : చూ, భూషణము. 2; 30, ఒకరితో నొకరుమాటలాడుట, సంభాషణము : శబ్దము. 2; 31. చిత్తరువు వ్రాయుట : చూ, వ్రాఁత 1-౧; 32. ఎదురు ; చూ, ముందట. 1; 33. ఆక్రమించుట ; చూ. పురి. 4; 34. జీవనోపాయము ; చూ, వృత్తి 4; 35. ముహూర్తార్థకము, చీటికి మాటికి : చూ, శశ్వత్తు; 36. నివృత్తి ; చూ, మానుట; 37. పొందించుట : లాభము. 1; 38. అంగీకారము ; చూ, సమ్మతి. 1; 39. మఱుపు : చూ, విస్మృతి; 40. నమ్మిక : చూ, విశ్వాసము; 41. దానితోకూడా, అభివిధి; 42. ఉద్యోగము, వ్యాపారము : చూ, సన్నాహము. 2; 43. తొట్రుపాటు : చూ, స్ఖలనము. 2; 44. భోజనము ; చూ, సాపాటు; 45. పిలుచుట : చూ, సంబోధనము; 46. కప్పుట, అడ్డపాటు : చూ, వ్యవధానము; 3; 47. ఆప్త ; చూ, పూరించుట; 48, సత్కారము. పూజ ; చూ, సపర్య; 49. బడలిక : చూ, శ్రమము. 1; 50. ఉక్తి : చూ, శబ్దము. 2. 51. పీడ ; చూ, శోషము; 1; 4. 52. అర్మిలి : చూ, వాత్సల్యము; 53. కూడఁ బెట్టుట : చూ, సంశయము. 2.

అంక్ష. వా. వి. బహిష్కారము. అపాంక్తేయునిగాఁ జేయుట; చూ, వెలి. 1; 2. శాసించుట.

అంగము. సం. వి. అ. పుం. కోమలమగు అంగము. చూ: శరీరము.1-౧.

అంగలదేశము. మి. వి. ఇంగ్లాండుదేశము : చూ, దేశము. (చూ. ఆఙ్గ్లదేశము,) అంగలభూమి, అంగలభూమి. పై—

అంగారము. సం. వి. అ. న : చూ, రూ-అంగారము. 1, 2.

అంగిక.సం. వి. ఆ. స్త్రీ. — అంగీ: చూ, రూ- అంగికి; ౨. 2. అభినయ విశేషము ; చూ, అభినయము,

అంగికము. సం. విణ. అంగముచేతఁగలిగినది, కనుబొమ లెగురవేయుటకోను గాఁగలది. (రూ-అంగికము.) ; చూ, వ్యంజకము. 1

అంగిరసస్మృతి. అం. చూ, స్మృతులు.

అంగిరసుఁడు. సం. వి. అ. పుం. వేలుపుటొజ్జ : చూ, సురాచార్యుఁడు. (రూ- అంగిరసుఁడు.)

అంగిరస. సం. వి. అ. పుం, 1. చూ, సంవత్సరములు; 2. పుష్యమీనక్షత్రము ; చూ, రిక్క 1.౫.

అంగిరసుఁడు. సం. వి. అ. పుం ; చూ, రూ-అంగిరసుఁడు.

అంజనము. సం. వి. అ. న. 1. కాటుక. రూ-అంజనము : చూ, చాఁదు. 1.3; విణ. 2. కాటుక సంబంధమైనది. చూ, చాఁదు 1-4.

అంజనేయుఁడు. సం. వి. అ. పుం = అనుమఁడు. హనుమంతుఁడు. అంజనాదేవి కొడుకు : చూ, వానరము. ౨.

అంతరము. అం. చూ, శౌచములు.

అంతరిక్షము. సం. విణ. అంతరిక్షమువలనఁ గలిగినది. రూ- అంతరిక్షము ; చూ, సురవర్త్మము.

అంతర్యము. సం, వి. అ. న. అభిప్రాయము; తలఁపు ; చూ, విషయము. 4.

అంత్రటీక. అం. చూ, విసరులు

అంత్రము. సం. వి, అ. న. రూ- అంత్రము : చూ, ప్రేగు.

అంత్రసమావృతము. సం. వి. అ. పుం. జలకుక్కుటము, నీరుకోడి ; చూ, పుంజు. 1-6.

అందోళనము. సం. వి. అ. న. 1. ఊఁగుట ; చూ, ఊఁగులాట: పుం. 2 = అందలము : చూ, అందోళము.

అందోళము. సం. వి. అ. పుం = అందలము. పార్శ్వముల మఱుఁగులేని పల్లకి. (సవారియని కొందఱు.) ; చూ, సవారి. 1- ౧.

అందోళించు. సం. అ. క్రి. ఊఁగు ; చూ, వ్రేలాడు.

అందోళిక. సం. వి. ఆ. స్త్రీ = అందలము : చూ, అందోళము.

అందోళితము. సం. విణ. ఊఁచఁ బడినది : చూ, ప్రేంఖితము.

అంధకము. సం. వి. అ. న. 1. పాతాళలోకము; చూ, లోకము 1. 7-(౧) 2. గుడ్డివాళ్ల గుంపు : చూ, రేచీకు ౩-౧.

అంధకి. సం. వి. ఇ, స్త్రీ. నిరృతిమూల : చూ, నైఋతిమూల; చూ, హరిత్తు. ౧-౬.

అంధతి. సం. వి. ఇ. పుం. నైఋతిపట్టణము ; చూ. దేశములు. ౨-౬.

అంధసికుఁడు. సం. విశే : చూ, సూపకారుఁడు.

ఆంధ్యము. సం. వి. అ. న. అంధత్వము : గ్రుడ్డితనము ; చూ. చీఁకు. 2.

ఆంధ్రమండలము. సం. వి. అ. న: చూ. రూ- ఆంధ్రమండలము. శ్రీశైలకాళేశ్వర దాక్షారామంబులనెడి త్రిలింగ క్షేత్రములకు నడుమనుండు ప్రదేశము; చూ. దేశము.

ఆంధ్రము. సం. వి. అ. పుం. రూ- అంధ్రము. 1. —పై.—; 2. తెనుఁగుబాస: చూ. భాష. 1-౧:

ఆంధ్రవ్యాకరణము. అం: చూ. వ్యాకరణములు.

ఆంధ్రి. అం. స్వరజాతులలో నొకటి: చూ. స్వరము. 2.

ఆంధ్రుఁడు. సం. వి. అ. పుం. రూ- అంధ్రుఁడు; తెనుఁగు దేశమునఁ బుట్టినవాఁడు: చూ. తెలుఁగువాఁడు. 2. ఆంధ్రదేశపురాజు; అంధ్రుఁడు.

ఆంబికేయుఁడు. సం. వి. అ. పుం. ధృతరాష్ట్రుఁడు; చూ. రాజు. 1-౧౪.

ఆంహోనము. అం. చూ. హస్తక్రియలు.

ఆంధ్రులు. అం. తెలుఁగుభాషా ప్రచారముఁగల దేశ మాంధ్రదేశము. దీనినే త్రిలింగదేశమని కూడ అందురు. ఈ యాంధ్రులు పంచద్రావిడులలో నొకతెగవారు. 1. వెలినాటి బ్రాహ్మణులు, 2. మురకనాటి బ్రాహ్మణులు, 3. కాసలనాటి బ్రాహ్మణులు, 4. తెలగాణ్యబ్రాహ్మణులు, 5. వెంగినాటి బ్రాహ్మణులు. 6. పరణసాల బ్రాహ్మణులు. 7. తైలింగ సామవేదబ్రాహ్మణులు, 8. కరణకమ్మబ్రాహ్మణులు. 9. నియోగబ్రాహ్మణులు, 10. వాజసనేయ బ్రాహ్మణులు, 11. ఆరాధ్యబ్రాహ్మణులు, 12. వైష్ణవబ్రాహ్మణులు. (వివరములు అయాపదములకడ చూచుకొన వలెను.): చూ. బ్రాహ్మణులు.

ఆఁక. దే. వి. 1. అభ్యంతరము. స్వా. 3, ఆ. 129; చూ. నిరోధము. 1; 2. ఆజ్ఞ; చూ. సెలవు; 3. కారాగృహము, ఉ. హరి. 5, ఆ: చూ. సదనము, 1-౫౮; 4. త్రోపు: చూ. నిషేధము.

ఆఁకట్టు. దే. స. క్రి. (ఆఁక + కట్టు.) అడ్డగించు. నీలా. 2, ఆ: చూ. సంరోధించు.

ఆఁకత్రాళ్ళు. దే. వి. బ. కవ్వమును దగిలించుటకై తరిగంబము నందుఁ గట్టెడుత్రాళ్లు. చూ. చల్లగుదులు.

ఆఁకపడు. ద్వా. అ. క్రి. అడ్డిపడు. చూ. నట్టువడు.

ఆఁకపెట్టు. ద్వా. స. క్రి. రూ-ఆఁకపెట్టు. అడ్డగించు. చూ. సంరోధించు.

ఆఁకయొనరించు. ద్వా. స. క్రి.—పై.—

ఆఁకరము. వై. వి. = ఆగ్రహః. కోపము: చూ. రోషము.

ఆఁకలి. దే. వి. గొద: చూ. బుభుక్ష.

ఆఁకలిఁజెందు. దే. అ. క్రి. ఆఁకలిఁగొను: ఆఁకొను.

ఆఁకలింపు. దే. వి. పొగడిక: చూ. స్తోత్రము.

ఆఁకపెట్టు. ద్వా. స. క్రి: చూ. రూ-ఆఁకపెట్టు.

ఆఁకొంట. దే. వి. చూ. ఆఁకలి.

ఆఁకొను. దే. అ. క్రి. (ఆఁకలి + కొను.) ఆఁకలిగొను.

ఆఁకొన్నవాఁడు. దే. వి. ఆఁకలిఁ గొన్నవాఁడు: చూ. బుభుక్షితుఁడు.

ఆఁగాఁకర. ద్వా. వి. (ఆకు + కాఁకర.) కర్కోటము, మట్టి కాఁకర * చూ. మహి.వి. 1.

ఆఁగించు. దే. స. క్రి. అడ్డగించు: చూ. సంరోధించు.

ఆఁగు. దే. స. క్రి. 1. —పై.—; 2. త్రోయు. చూ. నిషేధించు; 3. అవధరించు, మోచు. చూ. వహించు 4. కాపాడు: చూ. రక్షించు; అ. క్రి. 5. ఉపశమించు, అణఁగు చూ. ప్రసన్న. 4.

ఆఁచికొను. దే. స. క్రి. అపహరించు, కొల్లగొను. చూ: ప్రముచ్ఛలించు.

ఆఁచు. దే. క్రే. అణఁగించు, ఆఁగఁ జేయు. కా. 1, ఆ. 76. ఆపు; చూ. ఆఁకట్టు.

ఆఁటది. దే. వి. రూ-ఆఁడుది. చూ. స్త్రీ. 1.

ఆఁటు. దే. వి. 1. —పై.—; 2. ఆఁడుతనము; చూ. స్త్రీ రవళీ; అ. క్రి. 3. ఓపు. చూ. పర్యాప్తము; 4. తాళక యగు. చూ. తాళు.

ఆఁడంగి. దే. వి. 1. షండుఁడు. కొజ్జా : చూ. సోవిదల్లుఁడు; 2. ఆఁడుదానివలె మాటలాడువాఁడు: చూ. స్త్రీభాషి.

ఆఁడంగులు. దే. వి. బ. ఆఁడువారు: చూ. స్త్రీ.

ఆఁడతనము. దే. వి: 1: చూ. ఆఁటు. 2. (రూ-ఆఁడుతనము.) అం. 2: చూ. ఉత్తమస్త్రీ లక్షణములు.

ఆఁడపీక. వా. వి. బాలిక. (భద్రాచలప్రాంతమునవాడుక.)

ఆఁడది. దే. వి. రూ-ఆఁడుది: చూ. స్త్రీ. 1.

ఆఁడారిమాట. వా. వి. చేఁతకానిమాట. (కొజ్జావానిమాట. పుంసత్వములేని మాట.)

ఆఁడి. దే. అప. కల యను నర్థమునందు వచ్చెడి యొక స్త్రీ ప్రత్యయము. "కులుకులాఁడి, వగలాఁడి." మొ॥ (రూ-ఆఁడు.)

ఆఁడు. దే. అప. 1.—పై.—"ముద్దులాఁడు." మొ: 2 ఆఁడుతనము: చూ. రూ- ఆఁడతనము.

ఆఁడుఎట్టి. ద్వా. వి. శలి, ఒకరకపు చేఁప: చూ. మత్స్యము. 1.

ఆఁడుఒంటె. ద్వా. వి. ఉష్ట్రి; చూ. లొట్టపిట్ట.

ఆఁడుకట్టు దే. వి. ఆఁడుదాని కోకకట్టు.

ఆఁడుకూఁతురు. దే. వి. ఆఁడుది: చూ. స్త్రీ.

ఆఁడుకోయిల. ద్వా వి. కాదంబరి, ఆఁడుకోవెల: చూ. పికము.

ఆఁడుగుడి. దే. వి. మదనిల్లు: చూ. భగము. 12.

ఆఁడుగుఱ్ఱము. ద్వా వి. అర్వతి: చూ. హయము.

ఆఁడుగొఱ్ఱె. ద్వా. వి. ఏలిక, మెషి: చూ. మేషము. 1.

ఆఁడుగొరింక. ద్వా. వి. కాదంబరి, ఆఁడుగోరువంక: చూ. శారిక. 1.

ఆఁడుతనము. దే. వి: చూ. రూ-ఆఁడతనము.

ఆఁడుతాఁబేలు. ద్వా వి. కచ్ఛపి; చూ. తాఁబేలు.

ఆఁడుదోఁడు. దే. వి. తోఁబుట్టువు. స్వా. 4, ఆ. 87: చూ. సహోదరి.

ఆఁడుది. దే. వి. రూ-ఆఁడది: చూ. స్త్రీ. 1.

ఆఁడుపంది. ద్వా. వి. కచ్ఛు: చూ. సూకరము. 1-౪.

ఆకళింపు. వై. వి. = ఆకలనమ్. —ఆకళింత; (సం. ప);- అవగాహనము. రూ-అవగాహము, ఆకలన. రూ-ఆకలనము, అవ్య.-ఐ.

ఆకాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక: చూ. వాంఛ; 2. కక్కుఱితి: చూ. లోభము; 3. అన్వయము కొఱకు ఒకపదము మఱియొకపదమును కోరుట. క్రియాపదమును బట్టి కర్తృకర్మాదులకును వాని విశేషణములకును జేసెడు ప్రశ్నము.

ఆకాంక్షించు. సం. స. క్రి 1. కోరు: వాంఛించు; 2. అన్వయముకొఱకు ఒకపదము మఱియొకపదమునుకోరు.

ఆకాంక్షితము. సం. విణ. కోరఁబడినది: వాంఛితము: చూ. వాంఛ. 1-33.

ఆకారణ. సం. వి. ఆ. స్త్రీ. ఆహూతి. పిలుపు: చూ. సంబోధనము.

ఆకారణము. సం. వి. అ. న.—పై.—

ఆకారము. సం. వి. అ. న. 1. పోలిక: చూ. రూపు. 3; 2. అభిప్రాయసూచకమైన ముఖరాగాది వికారము, ఇంగితము; చూ. బొమముడిపాటు; పుం. 3. పోలిక: చూ. రూపు. 3; 4. గాత్రవికారము, శరీరవికారము; 5. చిహ్నము, గుఱుతు; చూ. లక్షణము. 1; 6. ఒడలు: చూ. శరీరము. 1.

ఆకారవంతుఁడు. సం. వి. అ. పుం. అందగాఁడు: చూ. సౌందర్యవంతుఁడు.

ఆకారితము. సం. విణ. పిలువఁబడినది: చూ. ఆవాహితము.

ఆకాయుఁడు. సం. వి. అ. పుం. పీనుఁగు: చూ. శవము. 2.

ఆకారో హ్రస్వో గుణాస్తు విపులాః. న్యా. ఆకారము చిన్నది. గుణములు పెద్దవి.

మూర్తిచిన్నది. బుద్ధి పెద్దది. పిట్ట కొంచెము కూతఘనము అని యాంధ్రభాషీయము.

ఆకాలికి. సం. వి. ఈ. స్త్రీ. మెఱపు: చూ. విద్యుత్తు. 1.

ఆకాశగంగ. సం. వి. ఆ. స్త్రీ. విన్నువాఁక చూ. నది. 1.

ఆకాశగరుడ. మి. వి. దొండతీఁగెవంటి తీఁగెమూలము * చూ. దొండ.

ఆకాశచారులు. అం. అతిక్రాంత, అపక్రాంత, ఆక్షిప్త, అలాత, అవిద్ధ, ఉద్వృత్త, ఊర్ధ్వజానువు, డోలాపాద, దండ, నూపురపాదిక, పార్శ్వక్రాంత, భ్రమరి, భుజంగత్రాసిత, మృగప్లుత, విద్యుద్భ్రాంత, సూచి. (16).

ఆకాశదీపము. వా. వి. 1. ఓడలకు రాత్రియందపాయకరమగు స్థలముం దెలియుటకై యాతావున నున్నతముగా బెట్టిన దీపము: చూ. స్నేహాశము; 2. కార్తీకమాసమందును శివరాత్రిమొదలు ఉత్సవాదులందు రాత్రులయందును, యెత్తైన తావులయందును వ్రేలాడఁదీయు దీపము: చూ. స్నేహాశము.

ఆకాశబాణము. వా. వి. 1. జువ్వ: చూ. బాణసంచు; 2. ఆకసముమైపుగా విసుచు (పోవు) ఒకానొక ఆయుధము: చూ. బాణము. 1-౧౨

ఆకాశభేదనన్యాయము. న్యా. ఆకాశమును బ్రద్దలుచేయుట కేమియు లేదు అనురీతి.

ఆకాశమండలములు. అం; అతిక్రాంతము, అలాతకము, క్రాంతము, దండపాదము, వలితము, వలితసంచరము, వామవిద్ధము, విచిత్రము, విహితము, సూచీవిద్ధము. (10)

ఆకాశము. సం. వి. అ. న. 1. ఆకసము; చూ. సురవర్త్మము. అం. 2. చూ. భూతములు, 3. చూ. మూర్తులు; 4. భావ్యాకాశములు రెడింటిలో నొకటి; వా. 5. ఒకానొకఇంటిపేరు.

ఆకాశము. అం. గుణరహితము, తారకము, పరము, మహత్తు, తత్త్వము. (5)

ఆకాశముష్టిహననన్యాయము. న్యా. ఆకాశమును పిడికిలితో గ్రుద్దుటకు వీలు లేదనురీతి.

ఆకాశమూలి, సం. వి. ఈ. స్త్రీ. నీటిప్రాఁచి *: చూ. శైవలము. 1.

ఆకాశవల్లి. సం. వి. ఈ. స్త్రీ. అంతరదామర *: చూ. సహస్రపత్రము. 1.

ఆకాశవాణి. సం. వి. ఈ. స్త్రీ. శరీరాకారముచూపకనే ఆకసమునుండి వినిపించు శబ్దము: చూ. సర్వము. 2. 33.

ఆకించన్యము. సం. వి. అ. న. దారిద్ర్యము: చూ. పేదరము. 1.

ఆకీర్ణము, సం. విణ. 1. ఒకటితో నొకటి కలసినది: చూ. సంకీర్ణము. 1; 2. వ్యాపించినది, ఎవరిచేత నిండి యున్నది: చూ. సంకీర్ణము. 2.

ఆకు. దే. వి. 1. వాప్యాంకురాళి: చూ. నారు. 1; 2. చెట్టునందలి యాకు. (వ్యు. ఆకసమువైపు చూచునది. పోవునది.) చూ. పర్ణము. 1; 3. శాకవిశేషము; శాకము; 4. తాటియాకు. చూ. తాళపత్రము; 1. 5. కర్ణపత్రము, చెవ్వాకు: చూ. భూషణము. 2. (౮-౨); 6. జాబు; చూ. లేఖ. 3; 7. కిల్లాకుపేటి: చూ. పురోణి; 8. పత్రపాత్రము; చూ. విస్తరి; 9. నాగవల్లీదళము; చూ. తములపాకు; 10. ఇచ్చిపుచ్చుకోలుపత్రము. విజ్ఞా. వ్య. కాం. 38: చూ. లేఖ. 4; 11. బండికంటియాకు, అంచు. ఆరము; చూ. శీఘ్రము. 2; 12 మిద్దెటింట్లు లోనగువాని కమర్చెడి ఆకు.

ఆకుంచనము. సం. వి. అ. న. ముడుచుట: చూ. ముడ్చుట

ఆకుకూర. దే. వి: చూ. పర్ణశాకము.

ఆకుచిఱుత. ద్వ. వి. ఒకదినుసు చిఱుతపులి, అల్పశార్దూలము; చూ. శార్దూలము. 1.౪.

ఆకుచిలుక. ద్వ. వి. క్రిమి, కీటకము; చూ. పురుగు. 1.

ఆకుచుట్ట. దే. వి. ఆకుబుట; చూ. పర్ణస్తబకము.

ఆకుచెప్పులు. ద్వ. వి. బ. పావరక్షభేదము, కవును; చూ. సమ్మాళిగలు. 1. ౧.

ఆకుజెముడు. దే. వి. సుఖవిరేచని* చూ. సువిరేచని.

ఆకుజెల్ల. దే. వి. ఒకరకపు చేఁప; చూ. మత్స్యము. 1. ౬౫.

ఆకుటిల్లు. దే. వి. (ఆకు + ఇల్లు) పర్ణశాల, ఆకులతో ఏర్పరచిన గుడిసె: చూ. సదనము. 1. ౪౦. (౧౦)

ఆకుతేలు. దే. వి. ఒకరకము తేలు: చూ. వృశ్చికము. 1.

ఆకుతోఁట. దే. వి. తములపాకులతోఁట: చూ. వనము. 2.

ఆకుపచ్చ. దే. వి. హరితము: చూ. వర్ణము. 6-3; విణ. 2. ఆకుపచ్చనిది: చూ. వర్ణము. 6, 3. (౧)

అకుపచ్చన. —పై.—
అకుపత్రి. ద్వి. వి. ఒకమూలి* చూ, రోమశము.
అకుపసరు. దే. వి. ఆకులను నలిపి పిండగా వచ్చినరసము; చూ, పసరు. 2.
అకుపాఁచి. దే. వి. ఒకరకము పాఁచి*: చూ, శైవలము. 1.
అకుపీఁకలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము: చూ, బాలక్రీడ. (రూ- అకుపీఁకెలు.)
అకుపురుగు. ద్వి. వి. శలభభేదము, ఒక దినుసు పచ్చపురుగు; చూ, శలభము.
అకుపోయు. దే. స. క్రి. విత్తనములుచల్లు: చూ, నాఱుపోయు.
అకుప్పు. దే. వి. (అకు+ఉప్పు.) ఒకదినుసు ఉప్పు; చూ, లవణము. 1-అ.
అకుబుట్ట. దే. వి; చూ, అకుచుట్ట.
అకుమడి. వా. వి. విత్తనములు జల్లినమడి.
అకుమడుపు. దే. వి. తమలపాకుమడుపు; చూ, వృత్తపర్ణము.
అకుమరుంగుపిందె. జా. మృదువగునది. "అకుమరుంగుపిందె యయి యంతిపురంబును బోలెనున్న." పాండురంగ మహాత్మ్యము.
అకుమిడుత. దే. వి. శలభభేదము: చూ, అకు పురుగు.
అకుమొగ్గ. వా. వి. కోటాకు.
అకురాయి. దే. వి. ఇనుములోనగువానిని తెగరాచెడి కొఱముట్టు: (రూ- అకుఱాయి.); చూ, వృశ్చినము.
అకులత. వా. వి. వ్యాకులతఁబొందుట ; చూ, వ్యస్తము. 2.
అకులపడు. మి. అ. క్రి. (ఆకులము+పడు.) అకులత నొందు; చూ, చెదరు. 4.
అకులపాటు. మి. వి: చూ, అకులత.
అకులము. సం. విణ. 1. ఆకులత నొందినది: చూ, వ్యస్తము. 2; 2. యుద్ధమునందు సైనికులు చెదరుటవలనఁబుట్టెడి శబ్దము, ఖంజము: చూ, స్వరము. 2-30; అం. 3. చూ, గాయకదోషములు.
అకులి. సం. వి. ఈ. స్త్రీ. తంగేడు, * చూ, హేమపుష్పకము. 3.
అకులోని పిందెలో దాఁగియున్నదనుట.
అకుల్యము. సం. వి. అ. న. నేలతంగేడు * చూ, హేమ పుష్పకము. 3.
అకుసంబెళ. ద్వి. వి. అడపము, వక్కలాకుల తిత్తి ; చూ, హడపము. 1.
అకుసన్నములు. దే. వి. బ. ధాన్యవిశేషము; చూ, ధాన్యము.
అకూతము. సం. వి. అ. న. అభిప్రాయము : చూ, విషయము. 4.
అకూతి. సం. వి. ఇ. స్త్రీ.—పై.—
అకృతయో బహూలో విసంవాదిన్యః న్యా. "యత్రాకృతి స్తత్ర గుణాభవంతి" అనునది సార్వత్రికముగాదు. పెక్కుచోట్ల నాకృతులు గుణరహితములై యుండును.
అకృతి. సం. వి. ఇ. స్త్రీ: 1. చూ, రూ-అకృతి; 2. రూపకము; చూ, రూపు. 3: 3. ఒడలు: చూ, శరీరము; 4. భావము నెఱింగించెడి సంజ్ఞ ; చూ, అనుభావము. 1; 5. ఫోలిక : చూ, సమానము. 2 ; 6. సామాన్యాకారము; స. 7: చూ, ముప్పదిరెండు.
అకృష్టి. సం. వి. ఇ. స్త్రీ. అకర్షణము, ఈడుపు; చూ, లాగు. 3.
అకె. ద్వి. స. ఏ. (అ+అకి:) అమె. (అకె, ఈకె, ఏకె, ఏవతె, ఒకతె ఇత్యాదులందు ఏకారము ఆదేశముగా వచ్చెనని తెలియనగును.) అపె-రూ- అమె, అవిడ-రూ-అవిదె-అవిడ, అయకి-రూ-అయక్క, అయమ-అయమ; (సం. ప).— తత్సతి.
అకేకర. సం. వి. ఆ. స్త్రీ. 1. అరకంటి చూపు: చూ, లక్షణము. 3; అం. 2. చూ, సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు.
అకొత్తె. దే. వి. 1. అడకత్తెర: చూ, కంకుల. 1; 2. చూ, భూషణము. 2.
అక్క. అం. 1. పట్టము, శాసనము, రాజశాసనము; 2. కార్యము.
అక్రందనము. సం. వి. అ. న. 1. ఏడుపు: చూ, దుఃఖము; 2. పిలుపు: చూ, సంబోధనము; 3. భయంకరయుద్ధము : చూ, యుద్ధము.
అక్రందము. సం, వి. అ. పుం. రూ-అక్రందనము. — పై —
అక్రందనుఁడు. సం. వి. అ. పుం. కాచువాఁడు: చూ, రక్షకుఁడు.
అక్రందాసరుడు. అం. చూ, ద్వాదశరాజమండలములు.
అక్రందించు. సం. అ. క్రి. దుఃఖముతోవనరు, వాపోవు: చూ, విలపించు.
అక్రందుఁడు. సం. వి. ఇ. పుం. చెలికాఁడు: చూ, స్నేహితుడు. 1; 2. తోడఁబుట్టినవాఁడు; చూ, సహోదరుడు; 3 కాచువాఁడు; చూ. రక్షకుఁడు; అం. 4. చూ, ద్వాదశరాజమండలములు.
అక్రమణము. సం. వి. అ. న. అక్రమించుట; చూ, పురి. 4.
అక్రమించు. సం. స. క్రి. అప్పళించు: చూ, ముగరించు.
అక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, అక్రమణము.
అక్రార. సం. వి. ఆ. స్త్రీ: అక్కలకర*.
అక్రీడము. సం. వి. ఉ. పుం. రాజుయొక్క క్రీడోద్యానము, మనుష్యులువేసి పెంచిన తోఁట: చూ, వనము. 2.
అక్రోశనము. సం. వి. అ. న. తిట్టు; చూ, శాపము. 1.
అక్రోశము. సం. వి. అ. పుం; చూ, రూ-అక్రోశనము.
అక్రోశించు. సం. స. క్రి. తిట్టు; చూ, శపించు.
అక్షపాదకుఁడు. సం.. వి. అ. పుం. 1. పదార్థములేదని యొప్పి కొనిన నయ్యాయికుఁడు; 2. తర్కశాస్త్రముఁ జదివినవాఁడు; చూ. తార్కికుఁడు.
అక్షారణ. సం. వి. అ. స్త్రీ. మైథునమును గూర్చిఘోషించుట; అమ్మకు నాలికి తిట్టుట: చూ, శాపము. 1.
అక్షారితుఁడు. సం. విణ. పరస్త్రీ గమనాదులచేత దూఱఁ బడినవాఁడు: చూ, దోసకారి.
అక్షికుఁడు. సం. వి. అ. పుం. జూదరి.: చూ, పందెకాఁడు.
అక్షిప్తము. అం. చూ, కరణములు.
అక్షిప్తము. సం. విణ. 1.అక్షేపింపఁబడ్డది; 2. ఎగురవేయఁ బడ్డది; అం. 3. చూ, అరోహివర్ణగతాలంకారములు. (చూ.

అలంకారము. 3.) 4. చూ. అవరోహివర్ణగతాలంకారములు. (చూ. అలంకారము. 3.)

ఆక్షిప్త అం. చూ. ఆకాశచారులు.

ఆక్షిప్తరేచితము. అం; చూ. కరణములు.

ఆక్షీబము. సం. వి. అ. పుం. రూ. అక్షీబము. మునగ* చూ. శిగ్రువు. 1.

ఆక్షేత్రము.సం. వి. అ. న. 1. దివ్యక్షేత్రము: చూ. పుణ్యక్షేత్రము; అవ్య. 2. క్షేత్రమువఱకు.

ఆక్షేపకము. సం. వి. అ. పుం. వాతరోగములలో నొకటి: చూ. రోగము. 1—3.

ఆక్షేపకుఁడు. సం. వి. అ. పుం. 1. వ్యక్తముకాకుండ మాటలాడువాఁడు, నత్తిగలవాఁడు; చూ. లోహలుఁడు; 2. కిరాతుఁడు : చూ. వ్యాధుడు. 3. ఆక్షేపించువాఁడు : చూ. వెక్కసి 1.

ఆక్షేపణ. వా. వి. చూ. సంరోధము. 1.

ఆక్షేపణము. వా. వి. — పై —

ఆక్షేపము. అం. 1. ఆక్షేపాలంకారము. తాను చెప్పినదానినె విచారణవలన నిశ్చయించుట. ఉ. చంద్రునిజూపుమపుసు. ప్రియాముఖమున్నదిగదా." చూ. అలంకారము. 3; వి. అ. పు. 2. అడ్డము; చూ. సంరోధము. 1; 3. ఏవగింపు: చూ. నెగ్గింపు; 4. ఈడువు: చూ. లాగు. 3; తిట్టు చూ. శాపము1; బెదరు: చూ. సాధ్వసము. 1; విణ. 7. ఈడవఁబడినది: చూ. ఆకృష్టము; అం. 8. చూ. సంచారివర్ణగతాలంకారములు: (చూ. అలంకారము. 3.)

ఆక్షేపించు. సం. స. క్రి. 1. అడ్డగించు; చూ. నిరోధించు; 2. దూఱు: చూ. నిందించు; 3. ఆకర్షించు. తిగియు: చూ; రెమ్మ; 4. అపహసించు; చూ. వెక్కిరించు.

ఆక్షోటము. సం. వి. అ. పుం. కొండగొనుగు*. చూ. స్వాదుమజ్జాఫలము.

ఆక్షోశము. సం. వి. అ. పుం. — పై —

ఆఖండలుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుడు: చూ. వేలుపుఱేడు.

ఆఖనిఖము. సం. వి. అ. పుం. 1. వరాహము. పంది: చూ. సూకరము; 2: ఎలుక: చూ. మూషికము.

ఆఖనికుఁడు. సం. వి. అ. పుం. కన్నపుదొంగ; చూ. హారకుఁడు

ఆఖుపాషాణము. సం. వి. అ పుం. ఇలిపాషాణము. ఉల్లిపాషాణము: చూ. సౌవీరము. 2.

ఆఖుభుక్కు. సం వి జ్. పుం 1. పిల్లి: చూ. మార్జాలము; 2. బొమ్మరివాడు, లఘువిద్యాజీవి; చూ. వంశనర్తి.

ఆఖువాహనుఁడు, సం వి అ. పుం. గణపతి; చూ. వినాయకుఁడు 1.

ఆఖువిషఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాడి*: చూ. దేవతాళము;

ఆఖువు సం. వి ఉ. పుం. 1. ఎలుక; చూ. మూషికము: 1. 2 దీర్ఘదేహి. పందికొక్కు: చూ. మూషికము. 1-౨; 3. పంది: చూ. సూకరము

ఆఖేటకుఁడు. సం. వి. అ. పుం. మృగయుఁడు: చూ. వేఁటకాఁడు.

ఆఖేటము. సం. వి. అ. పుం. మృగవ్యము; చూ. వేట 3

ఆఖోటము. సం వి. అ. పుం. కీరేష్టము, ఒకరకపుపోఁక*: చూ. పోఁక,

ఆఖ్య. సం. వి ఆ స్త్రీ. 1. నామధేయము, చూ. పేరు; న. 2. చక్కెరఁజేర్చి పొరఁటినపిండి, ఉపకారిక; చూ. భక్ష్యము.

ఆఖ్యాత, సం వి. అ పుం అతివక్తరి, వాజ్మి: చూ. వక్త. 1.

ఆఖ్యాతము సం విణ చెప్పఁబడినది. పలుకఁబడినది (వ్యాకరణమునందు ధాతువులమీద విధింపఁబడినతిఙ్ఞ.) చూ. శబ్దము. 2-౭౧.

ఆఖ్యానము. సం. వి. అ. న. చెప్పుట; చూ. శంసనము 2.

ఆఖ్యాయకుఁడు. సం. విణ. ఏదేనొకవిషయమును వివరించి చెప్పువాఁడు. (అకారాంతమైనప్పుడు ఆఖ్యాయికాఅని రూపము. ఇట్లంతట నెఱుంగునది); చూ. వ్యాఖ్యాత.

ఆఖ్యాయిక. సం. వి. ఆ. స్త్రీ. కావ్యభేదము. వాస్తవార్థమునగు హర్షచరితాది గ్రంథము- వాఙ్మయభేదమని కొందఱు: చూ. పరికథ.

ఆఖ్యేయము. సం. విణ. చెప్పఁదగినది; చూ. వక్తవ్యము.

ఆగంతుకము సం. విణ. కాలనియమములేక వచ్చునది: చూ. ఆహార్యము

ఆగంతుకుఁడు, సం. విణ అతిథి, భోజనసమయమునకు వచ్చినవాఁడు, అభ్యాగతుఁడు: చూ. పరదేశి

ఆగంతువు. సం విణ. ఉ. — పై —

ఆగడకాఁడు. ద్వ. విణ. (ఆగడము + కాఁడు) అకార్యము చేయువాఁడు: ఆగడీఁడు.

ఆగడపలు. దే వి. బ. మేఘపంక్తి, అడెపలు: చూ. మేఘము 1.

ఆగడము వై. వి. = ఆగస్. 1 అవకటము, అపరాధము: చూ. సొంటు; 2. చెఱుపు; చూ. ప్రతికూలము

ఆగడీఁడు. ద్వ. విణ. (ఆగడము + ఈఁడు) అకార్యము చేయువాఁడు; ఆగడకాఁడు.

ఆగడులు. దే వి. బ. ఆగడములు: చూ. కొంటెపనులు

ఆగతమగు మి. అ క్రి అరుగుదెంచు: చూ. వచ్చు. 2.

ఆగతము. సం. విణ. 1. వచ్చినది, ఉపాగతము; చూ. ఏతము, 2. పొందఁబడినది; చూ. ప్రాప్తము. 1.

ఆగమనము. సం. వి. అ. న, 1. రూ-ఆగమము. రాక: చూ. రాకడ.

ఆగమము, సం. వి. అ న. 1. రూ-ఆగమనము;—, పై—; 2. దేవపూజావిధానమును తత్సంబంధివిషయములను తెలుపునట్టి శాస్త్రము : చూ. శాస్త్రములు; 3. వ్యాకరణమున.— అధికముగా వచ్చెడి వర్ణము.

ఆగమములు. అ. ౯: చూ. ఉపవిద్యలు. 11-౧.

ఆగము, సం. వి. స్. న. 1, తప్పు; చూ. సొంటు, 2. దుష్కృతము : చూ. వృజినము.

ఆగాడి. దే. వి. తేలికయైన రెండవపోత ధాన్యము; చూ. ధాన్యము. (గింజ గట్టిలేని వడ్లు).

ఆగాత్యము, వై. వి. = ఆగస్, ఆవకట. కొంచెమును గొప్పగా చేసి కావించెడు అఱపు. ఏడ్పులోనగునవి. ఇవి వాడుకలోనివి : రూ-ఆగాయిత్యము.

ఆగామి. సం. విణ. 1. అనాగతము, కాఁగలది, రాఁబోవునది; చూ. భవిష్యత్తు; 2. అంతటఁ బోవునది.

ఆయసము. వై. వి. = ఆయుధశస్త్రము. అమ్ము: చూ. బాణము 1.
ఆయసి. సం. వి. ఈ. స్త్రీ. వస్తుబడిగల స్త్రీ: చూ, స్త్రీ. 1-౧౨౪.
ఆయవారము. వై. వి. = యాయావరః. ధాన్యాదుల భిక్షము. రూ-ఆయవారము: చూ, యాచన.
ఆయా. వై. వి. = ఆక్కి. పూజ్యురాలు; చూ, స్త్రీ. 1-౭.
ఆయుఃప్రమాణము. అం. చూ. ప్రకాశింపఁజేయఁగూడనివి
ఆయుధము, సం. వి. ధ్. స్త్రీ. అ. న. = ఆయుధము; చూ, బాణము. 1. (ముప్పదిరెండు ఆయుధములు బాణము. 1. కడఁజూచునది.)
ఆయుధశాల. సం. వి. ఆ. స్త్రీ. బాణములుంచుఇల్లు, అంపసాల: చూ, సదనము. 1-౯
ఆయుధాగారము. సం. వి. అ. పుం.—పై.—
ఆయుధాభ్యాసము. అం: చూ, కళలు.
ఆయుధికుఁడు. సం. విణ. ఆయుధముచేత బ్రదుకువాఁడు; చూ, శస్త్రాజీవుఁడు.
ఆయుధీయుఁడు. సం. విణ. —పై.—
ఆయుధేంద్రము. సం. వి. అ. న. విష్ణుచక్రము, సుదర్శనము; చూ, బాణము. 1-౭౮.
ఆయురేఖ. సం. వి. ఆ. స్త్రీ. జీవితకాలలక్షణము; చూ, లక్షణము 1-౧౯
ఆయుర్మర్మాణిరక్షతి. న్యా. ఆయువుమర్మములను రక్షించును. అనఁగా "ఆయువున్నచో నీటిలోవేసినను ఎదుర్కొని వచ్చు" నని తెలుఁగు సామెత వంటిది.
ఆయుర్యాతిదినేదినే. న్యా. దినదినమునువయస్సు వెళ్లిపోవుచున్నది.
ఆయుర్లక్షణము. సం. వి. అ. న: చూ. ఆయురేఖ.
ఆయుర్వేదము. సం. వి. అ. పుం. 1. రోగచికిత్సాశాస్త్రము: చూ, వైద్యము; అం. 2: చూ, విద్యలు.
ఆయువు. సం. వి. న్. న. 1. జీవితకాలము: చూ, వయస్సు; 2. కీలకము: చూ, మర్మము. 1; 3. నెయ్యి. చూ, హవిస్సు, 2; అం. 4. ఆయుస్థానము, 5. ఎనిమిది, అష్టకము: చూ; దచ్చి.
ఆయుష్కర్మము. సం. వి. న. న. మంగళపని; చూ, ముండనము
ఆయుష్మంతము. సం. వి. త్. పుం, 1. రూ-ఆయుష్మత్తు: చూ, యోగములు; విణ. 2. చిరకాలము బ్రదుకునది: ఆయుష్యము.
ఆయుష్మంతుఁడు సం. వి. త్. పుం. దీర్ఘాయుష్మంతుఁడు; చూ. పూర్ణాయుర్దాయవంతుఁడు.
ఆయుష్మత్తు. సం. వి. త్. పుం: చూ, రూ-ఆయుష్మంతము. 1.
ఆయుష్మాన్. అం: చూ, యోగములు.
ఆయుష్యము. సం. వి. అ. న. 1. ఆయువు: చూ. వయస్సు; విణ. 2. ఆయువు గలది; ఆయుష్మంతము.
ఆయుస్సు. సం. వి. అ. న. 1. రూ-ఆయుష్యము: చూ, వయస్సు; 2. ఆయుస్థానము: చూ, ఆయువు. 4; 3. జీవస్థానము, కీలకము: చూ, మర్మము. 1
ఆయెడ. వై. క్రి అట, అచ్చట; చూ, తత్ర.
ఆయెను. దే. అవ్య. క్రి. అయినది, భూతార్థకము, ఆస.
ఆయేనము. సం. వి. అ. న. వరుంబడికి యజమానత్వము ఆయైశ్వర్యము.
ఆయైశ్వర్యము. సం. వి. అ. న: చూ. ఆయేనము

ఆయోగము. సం. వి. అ. పుం. 1. గంధమాల్యములకానుక; 2. మోక్షవిషయమయిన జ్ఞానము, తెలివి. చూ, హృల్లేఖము. 2, 3. చేష్ట, చేఁత: చూ, వ్యాపారము. 1; 4. తెగులు; చూ, రోగము. 1; 5. మిక్కిలి చుట్టుట, వ్యాకృతము: చూ, చుట్టు 4; 6. కపటము: చూ, వ్యాజము. 1; 7. ఎడఁబాటు: చూ. విరహము; 8. కఠినప్రయత్నము; చూ, రూ-ఆయోగము. 5. అవ్య. 9. చేటువలన.
ఆయోగుఁడు. సం. వి. అ. పుం. 1. వైశ్యస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడు; 2. భార్యావియోగమయినవాఁడు.
ఆయోధనము. సం. వి అ. న. 1. జగడము: చూ, యుద్ధము-1; 2. చంపుట: చూ, వధము.
ఆర. సం. వి. అ. స్త్రీ. 1. = ఆరె. మాదిగవానిసూది. రూ-ఆరె. ఎడారె: చూ, చర్మభేదిక; దే. అవ. (1) సంబోధనమునందు వచ్చెడిఆగమము. "రాములార." మొ.
ఆరంగపువక్క. వ్యా. వి. మేలగు ఒకవిధమయిన వక్క, పూగ ఖండము: చూ, వక్క.
ఆరంగము దే. వి. —పై.—
ఆరంజ్యోతి. వై. వి. = అరుంధతి. వశిష్ఠునిభార్య: చూ, రిక్క. 1-౭౫-౪.
ఆరంబము. వై వి. 1. ఆరంభమ్. ప్రయత్నము:చూ,సన్నాహము. 2: ఆరంభమ్. ప్రారంభస్థానము: చూ, మొదలు. 4.
ఆరంభించు. వై. వి. = ఆరంభించు. తలపెట్టు; చూ, సమకట్టు. 2
ఆరంభము. సం. వి. అ. పుం. = ఆరంబము. 1; 2. —పై —; 3. గర్వము: చూ, హంకారము;. 4. తొందరపాటు: చూ. సంభ్రమము: 1; 5. చంపుట: చూ, వధము; 6. చెప్పుట: చూ, శంసనము. 1.
ఆరంభశూరాః ఖలుదాక్షిణాత్యాః.న్యా. దక్షిణాత్యులు కార్యారంభమున శూరత్వమునుజూపి క్రమక్రమముగాఁ గార్యమును జారవిడుతురు.
ఆరంభించు. సం, అ. క్రి. =ఆరంభించు:- తలపెట్టు: చూ, ఆరంభించు.
ఆరకాటి. దే. వి. ఓడనడుపువాఁడు, నావికుఁడు: చూ, సరంగు.
ఆరకాఁడు దే. వి. కృషీవలుఁడు, కమతకాఁడు: చూ, వ్యవసాయి.
ఆరకూటము, సం. వి. అ. పుం. న. పిత్తలము, ఇత్తడి: చూ, లోహము. 1-౨.
ఆరక్తమూల. సం. వి. అ. స్త్రీ. దాసనము*: చూ, హయజీవన మారకము.
ఆరక్షము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుకుంభస్థలముల క్రింది చోటు, కుంభములసంధి (అని కొందఱు.): చూ, హస్తి. 1-3 (2); విణ 2. రక్షింపఁదగినది.
ఆరక్షుఁడు. సం. వి. అ. పుం. 1. = ఆరెకుఁడు. బంటు: చూ, తలారి; 2. దక్షిణనాయకుఁడు, జముఁడు: చూ, హరి, 5. 3. రక్షింపఁదగినవాఁడు, అవిత: చూ, రక్షకుఁడు.
ఆరగించు. వై. స. క్రి. 1. =ఆహరించు. తిను, భుజించు; చూ, సాపడు; 2. పానముచేయు.: చూ, త్రాగు.

ఆరగింత, వై. వి. = ఆహారః. ఆహారము, తిండి, సాపడుట: చూ, సాపాటు.
ఆరగింపు, వై. వి. = ఆహారః—పై.—
ఆరఁగూరుట, దే. వి. లెస్సగా నసుట, క్షేమయుక్తము: చూ, లెస్స. 2.
ఆరగ్వధము, సం. వి. అ. పుం. కర్ణికారము, రేల*: చూ, రేల.
ఆరఘట్టము, సం. వి. అ. పుం. 1. నూతినుండి నీళ్ళు వెలుపలికిఁ దెచ్చుట కేర్పఱచిన యంత్రవిశేషము, ఏతాము: చూ, తలము. 2; 2. లోఁతుగల నూయి: చూ, సరస్సు. 1-౧౫.
ఆరజము, సం. వి. అ. పుం. = ఆరజము, 1. అవజము, రుంజ, డంగురము, వీరణము: చూ, వీణ. 1-౨౬, 2. అవ్యక్తమధురధ్వని: చూ, స్వరము. 2-౧౫.
ఆరజము, వై. వి. 1. = ఆరజమ్.—పై.—; 2. అవ్యక్తమధురధ్వని. స్వా. 3, ఆ. 110: చూ, స్వరము. 2-౧౫; 3. ఇంపు, అందము: చూ, సౌందర్యము; విణ. 3. కలకలము, గుంపునఁ బుట్టిన పెద్ద మ్రోఁత. స్వా. 3, ఆ. 84: చూ, స్వరము. 2-23; 4. ఒప్పిదమైనది, మనోజ్ఞము: చూ, రమ్యము. 3.
ఆరట, దే. వి. వేడుకగా తిరుగుట, వాహ్యాళి: చూ, విహారము.1.
ఆరటపడు, ద్వి. అ. క్రి. (ఆరటము + పడు.) తపించు: చూ, సంతాపించు.
ఆరటపాటు, ద్వి. వి: చూ, ఆరట.
ఆరటపెట్టు, దే. స. క్రి. (ఆరటము + పెట్టు) పరితపింపఁజేయు.
ఆరటము, దే. వి. 1 రూ-ఆరాటము: చూ, సంతాపము; 2.రూ-ఆరాటము. విరహవ్యసనము: చూ, శోకము-1.
ఆరటించు, దే. అ. క్రి. పరితపించు, దురపిల్లు: చూ, సంతాపించు.
ఆరట్టజము, సం. వి. అ. పుం. ఆరట్టదేశపుగుఱ్ఱము: చూ, హయము. 1-౮.
ఆరట్టము, అం. హిందూదేశముయొక్క పశ్చిమోత్తరమున నుండు ఒకానొక దేశము: చూ, దేశములు. 1-౯.
ఆరడము, దే. వి. పూనిక: చూ, సన్నాహము, వా. వి. 2. బట్టతడిఆఱుట.
ఆరడి, వై. వి. రూ-ఆఱడి. దూఱు: చూ, నెగ్గింపు.
ఆరడిసేయు, వై. స. క్రి. దూఱు: చూ, నెగ్గించు.
ఆరణపక్కి, వై. వి. కహ్వము, వక్కుకొంగ: చూ, బకము.
ఆరణి, సం. వి. ఇ. పుం. 1 కుక్కుటము: చూ, కోడి; 2. ఆవర్తము: చూ, నీటిసుడి.
ఆరణ్యకాండ, అం: చూ, కాండలు.
ఆరతి, సం. వి. ఇ. స్త్రీ. 1. ఊఱట: చూ, విశ్రాంతి. 2; వై. వి. (1) = ఆరాత్రికమ్. నీరాజనము: చూ, రూ-హారతి.
ఆరనాళకము, సం. వి. అ. న. కడుగు: చూ, శుక్తము. 1.
ఆరనాళము, —పై.—
ఆరబము, వై. వి. 1. సస్పియము. వి. పు. 2, ఆ. 166: చూ, సస్యము 2. = ఆరంభమ్. పూనిక: చూ, సన్నాహము. 2; 3. = ఆరంభమ్. ప్రథమము: చూ, మొదలు. 4.

ఆరబ్ధము, సం. విణ. ఆరంభింపఁబడినది: చూ, సన్నాహము.2.
ఆరభటము, సం. వి. అ. పుం. ధ్వని: చూ, స్వరము. 2.
ఆరభటి, సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-అప్పటి.—పై.—; 2. ఒకానొకవృత్తి. (ఇవి నాలుగు.—కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి): చూ, వృత్తులు; 3. ప్రౌఢిమము, విన్నాణము: చూ, సామర్థ్యము. 1.
ఆరభటుఁడు. సం. వి. అ. పుం. పెక్కు విలుకాండ్రతోఁబోరెడి యోధుఁడు: చూ, భటుఁడు. 1.
ఆరభి, సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకరాగము: చూ, స్వరము. 2-౪౪.
ఆరము, సం. వి. అ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.
ఆరయు, దే స. క్రి. 1. రూ-అరయు. అన్వేషించు: చూ, వెతకు; 2. రూ-అరయు, వివరించు; విచారించు. 1.
ఆరయుట, దే.వి. రూ-అరయుట. అన్వేషణము: చూ, వెదకుడు.
ఆరవము, సం. వి. అ. పుం. రూ-ఆరావము. ధ్వని: చూ, స్వరము. 2.
ఆరాచి, సం. వి. ఇ. స్త్రీ. = తూఁచు త్రాసు: చూ, త్రాసు. 1.
ఆరాట, దే. వి. రూ-ఆరాటము: చూ, సంతాపము.
ఆరాటపెట్టు, దే. అ. క్రి. తపించు: చూ, సంతాపించు.
ఆరాటము, దే. వి: చూ, రూ-ఆరాట. వి, పు. 1, ఆ. 147.
ఆరాటించు, దే. అ. క్రి: చూ, ఆరాటపెట్టు.
ఆరాత్, సం. వి. త్. అవ్య. 1. = అరత. సమీపమునందు: చూ, సమీపము. 1; 2. దూరమునందు: చూ, విప్రకృష్టము; 3. అశుభము, కీడు: చూ, హాని. 2; 4. తొడ పైభాగము: చూ, ఒడి, 2; 5. అందము: చూ, సౌందర్యము; 6. కల్లమాట: చూ, వితథము.
ఆరాత్రికము, సం. వి. అ. న. = ఆరతి. నీరాజనము: చూ, హారతి.
ఆరాధకుఁడు, సం. విణ. ఆరాధించువాఁడు, అర్చకుఁడు, పూజకుఁడు: చూ, పూజారి.
ఆరాధన, సం. వి. అ.న. రూ-ఆరాధనము. పూజ: చూ, సపర్య.
ఆరాధనము, సం. వి. అ. న. 1.—పై.—; 2. సంతోషము: చూ, హ్లాదనము, 3. పొందు: చూ, లాభము. 1; 4. వంట: చూ, సూపకారము.
ఆరాధనీయము, సం. విణ. ఆరాధింపఁదగినది: ఆరాధ్యము.
ఆరాధించు, సం. స. క్రి. సంతసపఱచు: చూ, పూజించు.
ఆరాధ్యబ్రాహ్మణులు, అం. ఆంధ్రులలోని పంచద్రావిడులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు కొందఱును కృష్ణయజుర్వేదులు కొందఱును కలరు. కాత్యాయన ఆపస్తంబసూత్ర ప్రవర్తకులై యుండియు బ్రాహ్మణ్యాపాదకమను శారీర సంస్కారములలో 15 సంస్కారములను మాత్రమాచరించి 16 వ సంస్కారము మాత్రమొప్పుకొనక మృతశరీరములను ఖననమాచరింపుచు ఆరాధనరూపముగ పరేతకృత్యములాచరింపుచు దేవతాంతరముల నొప్పుకొనక శివుని దైవముగ భావించి ఆత్మార్థరూపమగు శివార్చనచేయుచు శైవ చిహ్నధరులై వర్తింపుచున్నారు: చూ, బ్రాహ్మణులు. (చూ, ఆంధ్రులు.)

ఆరోహము, సం. వి. అ. పుం. 1. రూ-ఆరోహణము: చూ, ఎక్కుడు. 5; 2. జ్యోతిష్మతి*: చూ, స్వర్ణవల్లి; 3. దైర్ఘ్యము, నిడుపు: చూ, సోగ. 2; 4. నితంబము పిఱ్ఱ: చూ, శ్రోణి; 5. ఉన్నతి, ఎత్తు: చూ, సోగ 3-౨: 6. తూము లోనగువాని కొలఁత విశేషము; విణ. 7. ఉన్నతము, పొడవయినది: చూ, సోగ 3.

ఆరోహించు, సం. స. క్రి. అధిరోహించు: చూ, ఎక్కు. 6.

ఆరోహి, సం. వి. న్. పుం సంగీతాలంకారభేదము: చూ, అలంకారము. 3.,

ఆరోహివర్ణగతాలంకారములు, అం. అభ్యుచ్చయము, ఆక్షిప్తము, ఉద్గీర్ణము, ఉద్వాహితము, త్రివర్ణము, నిష్కర్షము, ప్రేంఖితము, బిందువు, ప్రస్తీర్ణము, వేణువు, సంధిప్రచ్ఛాదితము, హసితము. (12.) (చూ, అలంకారము. 3.)

ఆరోహివర్ణము, అం: చూ, వర్ణచతుష్కము.

ఆరోహుఁడు: సం. వి. అ. పుం. 1. మావటివాఁడు: చూ, హస్త్యారోహుఁడు; 2. గుఱ్ఱపురౌతు: చూ, సాది. 1.

ఆరోహ్యము, సం. వి. అ. పుం. ఏఋ దాఁటుపట్టి: చూ, హోడము-1

ఆర్ఘ్వధము, సం. వి. అ. పుం. రూ-ఆరగ్వధము*: చూ, ఱేల.

ఆర్చు, దే. అ. క్రి. 1. అఱచు, ధ్వనించు: చూ, శబ్దించు; 2. యోధులు బొబ్బరించు: చూ, శబ్దించు; ప్రే. 3. ఆడుధాతువునకు ఆడించు: చూ, జళిపించు; 4. విసరు: చూ, వీతెంచు; 5. ఆఱఁజేయు; 6. ఉపశమింపఁ జేయు; 7. తడియఁ జేయు; 8. నశింపజేయు. (రూ-ఆరుచు, ఆఱుచు.)

ఆర్జకుఁడు, సం. విణ. గడించువాఁడు; చూ, సంపాదకుఁడు.

ఆర్జన, సం. వి. ఆ. న. గడన: చూ, సంపాదనము. (రూ-ఆర్జనము.)

ఆర్జవము, సం. వి. అ. న. 1. తిన్నఁదనము: చూ, తిన్నన; పుం. 2. గగ్గెర*: చూ, పర్ణాసము; అం. 2: (చూ, అంగము. 9.) యోగయమాంగములు; 3: చూ, సుజ్ఞానదాయకములు.

ఆర్జించు, సం. స. క్రి. గడించు: చూ, సంపాదించు.

ఆర్జితము; సం. విణ. సంపాదింపఁబడినది: చూ, సంపాదితము.

ఆర్జుని, సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-అర్జుని: చూ, నది 1-2-(3); అనిరుద్ధుని భార్య: చూ, ఉషాకన్య; 3. రూ-అర్జుని, కుట్టని తారుపుకత్తె: చూ, శంభళి; 4. కులట: చూ, అంకులాఁడి.

ఆర్తకంఠధ్వని, సం. వి. ఇ. పుం. ఏడుపు: చూ, స్వరము. 2-౯౬-(౧౩).

ఆర్తగళము, సం. వి. అ. పుం. 1. = అడవిదొండ. నల్లగోరంట*: చూ, సహ. 2-౯; 2. = అడవిదొండ. తుజాలకము*: చూ, రక్తఫల. 1-౨: 3 ఇంతకేరి, బింబిక*: చూ, రక్తఫల. 1.

ఆర్తము, సం. విణ. దుఃఖమునొందినది: చూ, దుఃఖితము.

ఆర్తవము, సం. వి. అ. న. 1. స్త్రీఋతువు: ముట్టు: చూ, రేతస్సు-1; 2. పుష్పము. పువ్వు: చూ, సుమము; విణ 3. ఋతుసంబంధమైనది.

ఆర్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. ఇడుమ; చూ, శోకము; 2. అటవి. కోటి: చూ, వింటికొప్పు; వై. వి. (1) = ఆరాత్రికమ్. రూ-ఆరతి: చూ, హారతి; అం. 2: చూ, సంచారీభావములు.

ఆర్తుఁడు, సం. విణ. దుఃఖముతోనున్నవాఁడు: చూ, దుఃఖితుఁడు.

ఆర్దితము, సం. విణ. 1. యాచింపఁబడినది; 2. హింసింపఁబడినది; వి. అ. న. 3. వాతరోగము: చూ, రోగము. 1-3.

ఆర్ద్రము, ద్వ. వి. (అఱు + తూము.) ఆఱుతూములు. రూ-ఆఱ్ఱుము.

ఆర్ద్రి, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆర్ద్రానక్షత్రము, కాలిని: చూ, రిక్క. 1-౬; విణ. 2. తడిసినది: చూ, వోదము.

ఆర్ద్రించగు. మి. అ. క్రి. తడియు: చూ, నాను. 2.

ఆర్ద్రిక, అం: చూ, ఘృతములు.

ఆర్ద్రికము. సం. వి. అ. న. 1.=అల్లము(కన్న-హసిగొంకి.)*: చూ, శృంగబేరము. (అజీర్ణముపోగొట్టును.) 2. ఆముద్రపురుగు: చూ, పట్టుపురుగు.

ఆర్ద్రిత, సం. వి. ఆ. స్త్రీ. తడి: చూ, స్తేమము.

ఆర్ద్రము, సం. వి. అ. న. 1. అల్లము*: చూ, శృంగబేరము; విణ. 2. తడిసినది: చూ, వోదము.

ఆర్ద్రవస్త్రము, సం. వి. అ. న. తడిబట్ట, పిడప: చూ, వస్త్రము 1-౨౭.

ఆర్థికము, సం. వి. అ. న. వడ్డిచేతఁ బ్రదుకుట: చూ, వృద్ధిజీవనము.

ఆర్పు, దే. వి. 1. ప్రణాదము, బొబ్బరింత: చూ, రూ-ఆరుపు. 1; 2. సింహనాదము: చూ, రూ ఆరుపు. 2; స. క్రి. 3. అఱుపు: చూ, దక్కించు, వా. 4. నిప్పుమీఁద నీరుపోయు, చల్లనఱుచు.

ఆర్భాటము, వై. వి. = ఆర్భట. ధ్వని, చప్పుడు: చూ, స్వరము. 2.

ఆర్భటము, సం. వి. అ. పుం. = ఆర్భాటము. రూ-ఆరభటము. ధ్వని, చప్పుడు: చూ, స్వరము. 2.

ఆర్భటి, సం. వి. ఈ. స్త్రీ. = ఆర్భాటము.—పై.—

ఆర్య, సం. వి. ఆ. స్త్రీ. 1. బాలిక, పదునాలేండ్లప్రాయముగల ఆఁడుది: చూ, స్త్రీ; 1-౧౧౦-(౨); 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. పూజ్యస్త్రీ: చూ, స్త్రీ. 1-౩; 4. ధాన్యవిశేషము: చూ, ధాన్యము; 5. తల్లి: చూ, మాత; 6. ఆర్యాగీతి. కందపద్యభేదములలో నొకటి. ఇది పథ్యాకందముకన్న నొకగురువు అధికముగా నుండును. ఇదియే సహజ కందంబనఁబడును. (చూ, కందము.): చూ, వృత్తము. 1.

ఆర్యకము, సం. వి. అ. న. పితృకార్యము. ఆబ్దికము: చూ, సాంవత్సరికము.

ఆర్యపుత్రుఁడు, సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు.) పెనిమిటి: చూ, మారిషుఁడు. (పారిపార్శ్వకుఁడు.)

ఆర్యమిత్రుఁడు, సం. వి. అ. పుం. గౌరవింపఁబడువాఁడు: చూ, మర్యాదకుఁడు.

ఆర్యాణి, సం. వి. ఈ. స్త్రీ పూజ్యురాలు: చూ, స్త్రీ. 1-౩.

ఆర్యావర్తము, అం. 1. పుణ్యభూమి. హిమవత్పర్వతమునకును వింధ్య పర్వతమునకును నడుమనుండు దేశము: చూ, దేశములు. 1-౧౧, అం. 2; చూ, దేశములు.

ఆర్యి, సం. వి. ఆ. స్త్రీ. పూజ్యురాలైన యిల్లాలు: చూ, భార్య. 1-౩౭.

ఆర్యుఁడు, సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి: చూ, ఆర్యపుత్రుఁడు; 2. కొడుకు: చూ, సోవిదల్లుఁడు; వి.జ. 3. = అయ్య. పూజ్యుఁడు: చూ, సన్మానితుఁడు; 4. = అయ్య. తండ్రి: చూ, సవిత. 2. 5. మంచికులమునఁబుట్టిన వాఁడు: చూ, సజ్జనుఁడు; 6. న్యాయము తెలిసినవాఁడు.

ఆర్వైరము, వై. వి. = అరివిర్వ. రూ-అరివేకము: చూ, అతిపీర్యము.

ఆర్షజగతి, సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన జగతీఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షపంక్తి, సం. వి. ఇ. స్త్రీ. ఋషిప్రోక్తమైన పంక్తిఛ్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షబృహతి, సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన బృహతిఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షభి, అం: చూ, జాతులు.

ఆర్షభ్యము, సం. వి. అ. పుం. అంబోతుగా విడువఁదగిన కోడెదూడ: చూ, వృషభము. 1.

ఆర్షము, సం. వి. అ. పుం. 1. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యకనిచ్చి యథాశాస్త్రముగాఁ జేయు వివాహము: చూ, వివాహము; 2. పదముయొక్క నడుమను పాదముయొక్క కొనను రెండవపాదము గలిగిన మూఁడు పాదముల మంత్రము: చూ, మంత్రము. 1-౧౫; వి.జ. 3. ఋషిది; అం. 4. చూ, వివాహములు.

ఆర్షి గాయత్రి, సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన గాయత్రీ ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షి త్రిష్టుప్పు, సం. వి. ప్. స్త్రీ. ఋషి ప్రోక్తమైన త్రిష్టుప్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్ష్యనుష్టుప్పు, సం. వి. ప్. స్త్రీ. ఋషిప్రోక్తమైన యనుష్టుప్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్ష్యుష్ణిక్కు, సం. వి.హ. స్త్రీ. ఋషిప్రోక్తమైన ఉష్ణిక్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్హత, సం. వి. ఆ. స్త్రీ. న. పూజ్యత్వము, రూ-అర్హత: చూ, యోగ్యత.

ఆర్హతి, సం. వి. ఇ. స్త్రీ, న.—పై.—

ఆఱఁగట్టు, దే. స. క్రి. (బట్ట) ఆఱవేయు: చూ, ఎండవేయు.

ఆఱడి, దే. వి. 1. దూఱు, జై. 7, ఆ. 34: చూ, నెగ్గింపు. విజ. 2. పొల్లు, వమ్ము, ప్రయోజనములేనిది: చూ, వ్యర్థము.

ఆఱడిపడు, ద్వి. అ. క్రి. 1. పొల్లువోవు: చూ, వ్యర్థమగు; 2. తిట్టువడు: చూ, వీడఁబోవు.

ఆఱడిపెట్టు, ద్వి. అ. క్రి.—పై.—

ఆఱడిపోవు, ద్వి. అ. క్రి.—పై.—(రూ-ఆఱడివోవు.)

ఆఱవసంద్రము, ద్వి. వి. పాలసముద్రము: చూ, సముద్రము. 1-౬-(౬).

ఆఱవేయు, దే. స. క్రి: చూ, ఆఱఁగట్టు.

ఆఱాపు, దే. వి. ప్రణాదము, అఱపు: చూ, స్వరము. 2. 1-౧౪. (బ. ఆఱాపులు.)

ఆఱు, దే. స. 1. ఐదనొకటి: చూ, షట్కము; వి. 2. న్యూఁగాఱు: చూ, రోమరాశి; అ. క్రి. 3. అడఁగారు: చూ, సుఖిక్కు. 4; 4. చెడు: చూ, నశించు; 5. తడితీయు, ఎండు: చూ, మిడుకు. 8.

ఆఱుకుంచములు, వై. వి. ఆఱుస: చూ, షట్ప్రస్థి.

ఆఱుగడ, దే. స. ఆఱుమండి. (ఆఱునకు మహన్మహాత్మ్యార్థక రూపము.) రూ-ఆఱుగడ.

ఆఱుట, దే. క్రియా: చూ, రూ-ఆఱ్పు.

ఆఱుతూములు, ద్వి. వి. బ: చూ, ఆఢకము.

ఆఱుపలము, ద్వి. వి. రూ-ఆఱ్పలము. (పలము = నాలుగు కర్షములయెత్తు.): చూ, పలము. 1.

ఆఱుపు, దే. వి: చూ, రూ-ఆఱపు.

ఆఱుము, ద్వి. వి: చూ, ఆఢకము.

ఆఱుమూడగు, దే. అ. క్రి: చూ, రూ-ఆఱుమూడగు; అం, శే. 9.

ఆఱుమూడు, దే. వి: చూ, రూ-ఆఱుమూడు.

ఆఱుమోములవేలుపు, ద్వి. వి. షణ్ముఖుఁడు, జమిలిముత్తల: చూ, స్కందుఁడు.

ఆఱువ, దే. వి. సీమ: చూ, దేశము.

ఆఱువాళ్ళు, దే. వి. బ. (ఆఱు + వాదులు.) కొంచెము ఎండుట.

ఆఱుపుగు, దే. స: చూ, రూ-ఆఱుగడు.

ఆఱుస, ద్వి. వి. (ఆఱు + కుంచము.): చూ, ఆఱుకుంచములు.

ఆఱ్తుము, ద్వి. వి. (ఆఱు + తూము.): చూ, రూ-ఆఢకము.

ఆలంకి, దే. వి. 1 బరిపెవంటి పల్లకి: చూ, సవారి, 1-౨; 2. వాంఛ్రీడా విశేషము: చూ, బాలక్రీడ.

ఆలంకిగుడి, ద్వి. వి. —పై.— రా, వి. 2, ఆ. 23.

ఆలంకులు, దే వి. బ. —పై.— వి, పు. 7, ఆ. 302.

ఆలంబనవిభావము, అం: చూ, విభావములు. (స్త్రీపురుషాదులాలంబన విభావము = రసాధారమనుట).

ఆలంబము, సం. వి. అ. పుం. ఆశ్రయము, ఊఁత: చూ, సన్నిధానము. 2.

ఆలంబించు, సం. స. క్రి. ఆశ్రయించు, ఊఁతకొను: చూ, ప్రాపుగొను.

ఆలంభనవిభావము, అం: చూ, విభావములు.

ఆలంభము, సం. వి. అ. పుం. 1. చంపుట: చూ, వధము; 2. తాకుఁడు: చూ, స్పర్శము.

ఆలఁగాఁపరి, దే. వి. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. గొల్లవాఁడు. చూ, వ్రేఁడు. 1. (రూ-ఆలఁగాఁపు-ఆలకాఁపరి-ఆలఁకాపు.)

ఆలకఁబోతు, వా. వి. తోఁకలేని కోఁతి: చూ, వానరము.

ఆలకము, సం. వి. అ. పుం. పెద్దసీలి*: చూ, రంజని.

ఆలకి, దే. వి. 1. నాథుఁడులేనిది: చూ, విధవ; 2. దిక్కులేనిది. (వాఁడు): చూ, విధవ; 3. ఒకరిమాటవినని ఆఁడుది: చూ, స్త్రీ. 1-౧౨౫.

ఆలకించు, వై. స. క్రి. 1. = ఆలకించు. పాటించు. చంద్రా. 4, ఆ. 59: చూ, సంభావించు; 2. ఆకర్ణించు: చూ. విను. 2.

ఆలక్షించు, సం. స. క్రి. 1, = ఆలకించు: చూ, సంభావించు; 2. చూచు: చూ; వీక్షించు.

ఆలగోడు బాలగోడు, తా. వి. విపరీతపుధ్వని, పెదబొబ్బ, మొత్తుకోళ్ళు: చూ, స్వరము. 2. ౪౬-(౧౬)

అలతి, వై. వి. = అలప్తిః. రూ-అలత్తి-ఆళరి: చూ, స్వరము. 2-౪౬-(౨౨.)

అలత్తి, వై. వి. = అలప్తిః.—పై.—

అలన, దే. వి. ఏలుబడి: చూ, రక్షణము.

అలపించు, వై. స. క్రి. = ఆలాపించు. రాగముతిన్నఁగా నీను: చూ, ఆలాపించు.

అలపోతు, దే. వి. రూ-ఆఁబోతు: చూ, వృషభము. 1.

అలప్తి, సం. వి. ఇ. స్త్రీ. = అలతి-అలత్తి: చూ, స్వరము. 2. ౪౬-(౨౨).

అలప్యాలము, సం. అవ్య. పలుకవలదనుట.

అలము, స. వి. అ. న. 1. రూ-అళము. తేలుకొండిముల్లు: చూ, అలము. 2; 2. రూ-ఆలము. పసుపువర్ణముగల మట్టి: చూ, హరిదళము; దే. వి. (1) ఆశ్రిద్ధ: చూ, సయాట 4; వై. వి. (2) హరః. జగడము: చూ, యుద్ధము. 1.

అలముచేయు, ద్వ. స. క్రి. 1 యుద్ధముచేయు; 2. ఆగడము చేయు.

అలమెకము, ద్వ. వి. నక్క: చూ, సృగాలము.

అలయము, సం. వి. అ. పుం. 1. ఇల్లు: చూ, సదనము 1. 2. దేవాలయము: చూ, వేలుపుటెంకి.

అలరి, దే. విశే. దుశ్శీలుఁడు, శీలస్వభావాదులచేత నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

అలతేఁడు, దే. వి. ఎద్దు, బసవఁడు: చూ, సదనము. 1.

అలవట్టము, వై. వి. 1. = ఆలావర్తమ్. వస్త్రముతో గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱ: చూ, సూరెపాను; 2 = ఆలావర్తమ్. గుడ్డగొడుగు: చూ, వారిత్ర 1-౨.

అలవాలము, సం. వి. అ. న. ఆవాలము. పాదు: చూ, వెల్లము.

అలసము, వై. వి. = అలస్యమ్: చూ, విలంబము. 1.

అలసించు, వై. అ. క్రి. = అలస్యమ్. ఆలస్యముచేయు: చూ, వివరించు. 3.

ఆలస్యము, సం. వి .అ. న. 1. = అలసము: చూ, విలంబము. 1; 2. జడ్డుఁదనము: చూ, సోమరితనము; 3. మీఱుట: చూ, వ్యత్యయము; పుం. 4. జలసూకరము, నీరుపంది: చూ, మత్స్యము. 1-౧౧; అం. 5: చూ. సంచారీ భావములు. (స్మరమనోహరుండగు వరుం దలంచుచు నక్కురంగాక్షి సరసంగల సరసిజాక్షుల తన్నుంబిలువ నెగాదిగం జూచుంగాని మారు నుడువకుండె.

అలసావమృత్యం విషమ్, న్యా. (స్పష్టము)

అలస్యుఁడు, సం. వి. అ. పుం. అలసుఁడు, బద్ధకుఁడు: చూ, సోమరి.

అలాగు, దే, అవ్య. రూ-అలాగు: చూ, తథా. 2.

అలాజ్యము, సం. వి. అ. న. వంటకట్టియలు: చూ, వంటచెఱకు.

అలాత, అం: చూ, ఆకాశచారులు.

అలాతము, అం: చూ, కరణములు.

అలానము, సం. వి. అ. పుం, న. 1. ఏనుఁగును కట్టు కంబము: చూ, స్తంభము. 1-౮; 2. పగ్గము: చూ, సూత్రము 1.

అలానిక, సం: వి. అ: స్త్రీ. తమలపాకులతీఁగె*: చూ, నాగవల్లి.

ఆలాస, అం: చూ, గాంధారగ్రామగత మూర్ఛనలు.

ఆలాపనము, సం. వి. అ. న. 1. బందుమిత్రసంభాషణము, నిండు మాట: చూ, సంభాషణము, 2. రాగాలాపము: చూ, అలప్తి.

ఆలాపము, సం. వి. అ. పుం. —పై.—

ఆలాపి, అం: చూ, శ్రుతులు.

ఆలాపించు, సం. స. క్రి. రాగముఁ దిన్నఁగానీను: చూ, రూ-అలపించు.

ఆలాపిని, సం. వి. ఈ. స్త్రీ. 1. వల్లకి: చూ, వీణ. 1; అం. 2: చూ, తతవాద్యములు.

ఆలాప్తి, సం. వి. ఇ. స్త్రీ. = అలతి - అలత్తి: చూ, రూ-అలప్తి.

ఆలాబువు, సం. వి. ఉ. స్త్రీ: చూ, రూ-అలాబువు *.

ఆలాయము, సం. వి. అ. న. 1. అశ్వశాల: చూ, సదనము. 1-౩౬; వై. వి. (౨) గాబు: చూ, పాత్రము. 6-౧. విశే. (2) ఆయితమైనది: చూ, సిద్ధము. 2.

ఆలాత్రి, సం. వి. ఈ. స్త్రీ. = అలతి-అలత్తి: చూ, అలప్తి.

ఆలావము, సం. వి. అ. పుం. పైర్లు మొ॥ కోయుట: చూ, లవనము.

ఆలావర్తము, సం. వి. అ. న = చూ, అలవట్టము.

అలి, సం. వి. ఇ. స్త్రీ 1. పంక్తి: చూ, శ్రేణి. 1; 2. చెలికత్తె: చూ, సఖి. 1; 3. తేలు: చూ. వృశ్చికము (రూ-అళి.); దే. వి. (1) పెండ్లాము: చూ, భార్య. 1; విశే. (2) తక్కువైనది: చూ, హీనము. 1.

ఆలింగనము, సం. వి. అ. న. కవుఁగిలింత: చూ, కౌఁగిలి.

ఆలింగనములు, అం. 1. సరసాలింగనము, దృఢాలింగనము, సర్వాలింగనము, స్పష్టకాలింగనము. పృథకాలింగనము, అనురూపాలింగనము, గూహనాలింగనము, కుచాలింగనము, లాటికాలింగనము, నిరూపణాలింగనము. లతావేష్టితాలింగనము, వృక్షాధిరూఢాలింగము, తండులకాలింగనము, క్షీరకాలింగనము. (14.); 2. అజాతస్మరాలింగనము, జాతస్మరాలింగనము. వీనిలో అజాతస్మరాలింగనము నాలుగు విధములు:-౧ స్పష్టకము, విద్ధకము, ఘృష్టకము, పీడనము; జాతస్మరాలింగనము యెనిమిదివిధములు:-౨ లతావేష్టితము, వృక్షాధిరూఢము, తిలతండులము, నీరక్షీరము. ఊరూపగూహనము. జఘనోపశ్లేషము, కుచాశ్లేషము, లాలాటము.

ఆలింగితము, సం. విశే. కవుఁగిలింపఁబడినది: చూ, ఉపగూఢము.

ఆలింగ్యము, సం. వి. అ. పుం. 1. గోపుచ్ఛమువంటి ఆకారముగల మృదంగము, ఆదోకుమద్దెల: చూ, మృదంగము.1-30; విశే. 2. కవుఁగిలింపఁదగినది.

అలించు, వై. స. క్రి. = అలక్షణమ్: చూ, అలకించు.

అలిందకి, సం. వి. ఈ. స్త్రీ. ఉపుత: చూ, చిక్రోడము. (రూ-అళిందకి.)

అలిందము, సం. వి అ. పుం. ఇంటిచోపా: చూ, సదనము. 1-౧౩.(3).

అలింపన, సం. వి. అ. స్త్రీ. తనివి: చూ, సాహిత్యము.

ఆలిగొను, దే. స. క్రి. (ఆలి+గొను.) 1. అపహసించు: చూ, వెక్కిరించు. 3; 2. తక్కువపఱచు: చూ, వంచించు.

ఆలిచిప్ప, దే. వి. జలశుక్తి (జలసామాన్యపుసందెల్లఁ బుట్టునది.): చూ, సంకు. 1.

ఆలిప్సుఁడు, సం. వి. అ. పుం. పొందుటకు యిచ్ఛయించిన వాఁడు: చూ, వలపుకాఁడు.

ఆలీఢము, సం. వి. అ. న. 1. విలుకాఁడు కుడికాలు ముందటికి చాఁచి నిలుచుట: చూ, సమపదము; 2. విలుకాఁడు రెండు కాళ్ళుసమముగానుంచుకొని నిలుచుట: చూ, సమపదము; విశే. 3. నాకఁబడినది; అం. 4: చూ, విలుకానిస్థానములు; 5: చూ, గతివిశేషములు; 6: చూ, పుంస్థానకములు.

ఆలీనము, సం. వి. అ. న. 1. పాఁతఱ: చూ, లిబ్బి; విశే. 2. అంతట లయించియున్నది.

ఆలు, దే. వి. 1. పెండ్లాము. (దీనికి వ్యుత్పత్తియందు ఆఁడుది యనిమాత్ర మర్థము. "జవరాలు, ధీవరాలు." మొ॥): చూ, భార్య -1; బ. 2. ఆవులు: చూ, ధేనువు; 1; 3. స్త్రీవాచక మందు వచ్చునది. "జవరాలు, ముద్దరాలు." మొ॥

ఆలుక, సం. వి. ఆ. స్త్రీ. 1. అలకి. గిండివంటిచెంబు: చూ, పాత్రము. 6-గళ; 2. =ఆనుగ. ఆనపు*: చూ, సొఱ.

ఆలుకము, సం. వి. అ. పుం. 1. ఆలువు, గెనుసు*: చూ, గెనుసుదుంప; 2. చేమగడ్డ*: చూ, చేమ; 3. ఆనుగు*: చూ, సొఱ.

ఆలుడి, దే. వి. పవిత్రచరిత్రము: చూ, శీలము. 2.

ఆలుబ్ధుఁడు, సం. వి. అ. పుం. మిగుల లోభి: చూ, లోభి.

ఆలులేదుచూలులేదు కొడుకుపేరు సోమలింగము. లో. ఒకానొక లోకోక్తి, ఏమియు లేనిదే పేర్లు పెట్టుట.

ఆలువు, సం. వి. ఊ. స్త్రీ. 1. రూ-ఆలూవు. గలంతిక, సన్నమెడగలచెంబు: చూ, పాత్రము. 6-గళ; 2. రూ-ఆలూవు. కిడిమి*: చూ, నీపము; 3. రూ-ఆలూవు. గెనుసు*: చూ, గెనుసు; 4. రూ-ఆలూవు. ప్లవము: చూ, హోడము.

ఆలూనశాలికులము, సం. వి. అ. న. కోయఁబడిన సంబావుగల క్షేత్రము: చూ, భూమి. 1-గళ.

ఆలూవు, సం. వి. ఉ. స్త్రీ: చూ, రూ-ఆలువు.

ఆలెగాఁడు, దే. వి. పరిచారకుఁడు: చూ, సేవకుఁడు. 1.

ఆలెపొయ్యి, దే. వి. ఒకసారిగ నాలుగయిదు పాత్రములు వేఱువేఱుగాఁ బెట్టి వండునట్లేర్పఱచిన ప్రొయ్యి, గాఁడి ప్రొయ్యి: చూ, హసంతి. 1-౨.

ఆలేఖనము, సం. వి. అ. న. 1. రూ-ఆలేఖ్యము. లిఖితము: చూ, వ్రాఁత; 2. రూ-ఆలేఖ్యము. చిత్తరువువ్రాయుట: చూ, చిత్తరువు.

ఆలేఖని. సం. వి. ఇ. పుం. 1. చిత్తరువువ్రాసెడు తూలిక: చూ, లేఖిని; 2. వ్రాయుసీసపు పోతపుల్ల, పెన్సిలు: చూ, లేఖిని.

ఆలేఖ్యకృత్తు, సం. వి. త్. పుం. చిత్తరువు వ్రాయువాఁడు: చూ, ముచ్చి.

ఆలేఖ్యము, సం. వి. అ. న: చూ, రూ-ఆలేఖనము.

ఆలేహ్యము, సం. వి. అ. న. ఆస్వాదింపఁదగినది.

ఆలోకనము, సం. వి. అ. పుం. 1. రూ-ఆలోకము. చూపు: చూ, ఆక్షిణము 8; 2. వెంత: చూ, వెలుఁగు. 3; 3. బట్టువాఁడు చేయు స్తోత్రము: చూ, స్తోత్రము. 1-గ.

ఆలోకము, సం. వి. అ. పుం. 1. రూ-ఆలోకనము. చూపు: చూ, ఆక్షిణము. 8; 2. కొలుపు. చూ, శబ్దాం. 2.

ఆలోకించు, సం. స. క్రి. చూచు: చూ, వీక్షించు.

ఆలోకితము, సం. విశే. 1. చూడఁబడినది, స్వభావమైన దృష్టివిశేషము: చూ, అవస్థితము; అం. 2: చూ, దృష్టిభేదములు; 3: చూ, దృష్టిక్రియలు.

ఆలోచన, సం. వి. ఆ. స్త్రీ. అ. న. తలఁపు: చూ, యోచన.

ఆలోచించు, సం. స. క్రి. 1. తలఁచు: చూ, యోచించు; 2. అరయు: చూ, విచారించు. 1.

ఆలోడనము, సం. వి. అ. న. కలఁత: చూ, సంతాపము. 1.

ఆలోడించు, సం. స. క్రి. కలఁగఁజేయు: చూ, సంక్షోభించు.

ఆలోడితము, సం. విశే. కలఁచఁబడినది: చూ, మలినము. 3.

ఆలోన, దే. అవ్య. ఇట్లుండఁగా; ఆలోపల, ఇంతలో.

ఆలోపల, దే. అవ్య.—పై.—

ఆలోలము, సం. విశే. 1. కదలు: చూ, లోలము. 1; 2. విషయలంపటము, కార్యముకొఱకు సలయుట.

ఆలోలితము, అం: చూ, శిరఃక్రియలు.

ఆలోలుఁడు, సం. విశే. 1. చంచలుఁడు, కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 2. స్త్రీయందు దాన క్తిగలవాఁడు.

ఆలోళితము, అం: చూ, శిరోభేదములు.

ఆవ, దే. వి. 1. నిమ్నము, మిక్కిలి పల్లపుప్రదేశము: చూ, భూమి. 1-౫౦; 2. వరిపండునేల, చేను: చూ, భూమి. 1-౪౨; 3. ఆవ*: చూ, సర్షపము; బ. 4. సర్షపబీజములు, ఆవలు: చూ, సర్షపము. (ఆవాలు అని వాడుక.)

ఆవంక, దే. వి: చూ, ఆదిక్కు.

ఆవంత, దే. వి. 1. గొప్పవెత; వా. 2. కొంచెమైనను.

ఆవకాయ. దే. వి. ఊరుఁగాయ: చూ, పచ్చిగాయ. (బెల్లపు ఆవకాయ, అల్లపుఆవకాయ, వెల్లుల్లిఆవకాయ మొదలగునవి.)

ఆవగింజలు, దే. వి. బ. సర్షపబీజములు: చూ, సర్షపము.

ఆవజము, వై. వి. =ఆరజము, ఢంజ అను వాద్యము: చూ, పీఠ. 1-౫౬.

ఆవటము, దే. వి. 1. మైత్రి, పొత్తు: చూ, సంయోగము; విశే. 2. పొందికయయినది. భాగ. 4, స్కం, 136: చూ, సంయుక్తము.

ఆవటముచేయు, దే. స. క్రి. పొందికపఱచు. పాండు. 2, ఆ. 229: చూ, సంధించు. 2.

ఆవటించు, దే. ప్రే. అనుకూలపడు: చూ, సరిపడు. 1.

ఆవటిల్లు, దే. అ. క్రి. వై.=ఆవాహ. రామా. 5, ఆ. 175: చూ, సరిపడు. 1.

ఆవట్టజము, సం. వి. అ. న. పారశీకాశ్వము: చూ, హయము. 1-౮.

ఆవడ, దే. వి. 1. కార్చిచ్చు*: చూ, హ్రస్వగవేధుక; 2. రూ-ఆమవడ, మజ్జిగపులుసులోనగువానియందు నానవేసిన వడ: చూ, భక్ష్యము. 1-౮.

ఆవడి, దే. వి. రూ-హావడి. ఉపద్రవము: చూ, విపత్తు.

**ఆవతిన్నఅమ్మకుయేవఁబారినదట**, లో. ఒకానొక లోకోక్తి.

**ఆవపనము**, సం. వి. అ. న. 1. కాఁగు, గూన: చూ, పాత్రము. 6-౨౫; 2. గోనియ: చూ, గోనె.

**ఆవపాఱు**, దే. అ. క్రి. భావముదయించు, జ్ఞప్తికివచ్చు: చూ, స్ఫురించు. 2.

**ఆవము**, వై. వి. 1. = ఆవాపః. కుమ్మరి కుండలు లోనగునవి కాల్చుటకేర్పఱచిన (కావు): చూ. కావు 5; 2. ఈసడింపు: చూ, నెగ్గింపు; 3. = హోర. జగడము, లడాయి: చూ, యుద్ధము. 1.

**ఆవరణము**, సం. వి. అ. న. ఆచ్ఛాదనము, మూఁత: చూ, వ్యవధానము. 3.

**ఆవరణములు**, అం. పృథివ్యప్తేజోవాయ్వాకాశాహంకార మహత్తత్వములు.(7); ప్రకృతితోఁగూడ అష్టావరణములగు.(8).

**ఆవరించు**, సం. స. క్రి. చుట్టుకొను: చూ, వేష్టించు.

**ఆవరించుకొను**, మి. స. క్రి. —పై.—

**ఆవరింత**, దే. వి. 1. రూ-ఆవలింత: చూ, హాఫిక; 2. ఆక్రమణము: చూ, పురి. 4.

**ఆవర్జనము**, సం. వి. అ. న. ఆకర్షణము, ఈడుపు: చూ, లాగు. 3.

**ఆవర్త**, సం. వి. ఆ. స్త్రీ. నేలతామర*: చూ, సహస్రపత్రము. 1-౧.

**ఆవర్తనము**, సం. వి. అ. న. 1. అప్రవృత్తి: చూ, మరలఁబాటు; 2. పాఠముయొక్కవల్లె: చూ, వల్లె. 4.

**ఆవర్తని**, సం. వి. ఈ. స్త్రీ నులితడ*: చూ, మహాబల.

**ఆవర్తకము**, అం: చూ, అలంకారము. 3.

**ఆవర్తము**, సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపు సుడి: చూ, హయము. 1-౫౨: చూ, సుడి. 1-3; 2. నీటి సుడి: చూ, సుడి. 1-౪; 3. శరీరమందలి సుడి: చూ, సుడి. 1-౧౧. 4. రోమావర్తము: చూ, సుడి. 1-౧౦. 5. భ్రూమధ్యావర్తము: చూ, సుడి. 1-౬; 6. మెడపైసుడి: చూ, సుడి. 1-౭; 7. గాలి సుడి: చూ, సుడి. 1-౨; (ఇత్యాదులు); 8. అప్రవృత్తి: చూ, మరలఁబాటు; 9. పాఠముయొక్కవల్లె: చూ, వల్లె. 4; 10. ఆవర్తకమను మేఘము: చూ, మేఘము. 1; అం. 11: చూ, మేఘములు; 12: చూ, మేఘములు; 13: చూ, భౌమమండలములు; 14: చూ, కరణములు.

**ఆవర్తించు**, సం. స. క్రి: చూ, వల్లించు.

**ఆవర్తితము**, సం. విశే. 1. మరలినది: చూ, నివర్తితము; 2. వల్లింపఁబడినది; అం. 3: చూ, జంఘాక్రియలు.

**ఆవల**, దే. వి. (ఆ + వలను.) 1. అప్రక్క: చూ, ఆదిక్కు; 2. అనంతరము: చూ, పిమ్మట. వా. 3. ఆవలికొన: రూ-ఆవల-అవ్వల.

**ఆవలి**, సం. వి. ఇ. స్త్రీ. 1. చాలు: చూ, శ్రేణి. 1; దే. వి. (1) రూ-ఆవళి. ఉపద్రవము: చూ, విపత్తు: 2. ఇబ్బంది, కష్టము: చూ, శోకము. 2; (3) అధికము: చూ, హెరాళము. 1-౬.

**ఆవలించు**, సం. అ. క్రి. రూ-ఆవులించు: చూ, విజృంభించు.

**ఆవలింత**, దే. వి: చూ, రూ-ఆవరింత.

**ఆవలిమొన్న**, ద్వి. వి. మొన్నటికి పూర్వదినము, అటుమొన్న: చూ, రోజు. 1.

**ఆవలినాఁడు**, ద్వి. వి. ఎల్లుండికి పరదినము: ఆవలియెల్లుండి.

**ఆవలియెల్లుండి**, ద్వి. వి.—పై.— (ఆవలియెల్లుండికి పరదినము = అటావలి యెల్లుండి.)

**ఆవలఈవల**, ద్వి. క్రి. ఈప్రకారముగ: చూ, ఇటుల.

**ఆవశము**, సం. వి. అ. పుం. ఇష్టానిష్టములగు వసులయందుఁ గలిగెడి తొందఱ: చూ, సంభ్రమము. 1.

**ఆవశ్యకము**, సం. వి. అ. న. 1. అక్కఱ: ఆవశ్యము, అవ్య: అనయము; (తె.ప):— అక్కఱ; తద్వి:— మిక్కిలి అక్కఱ.— అత్యావశ్యకము; విశే. 2. అక్కఱైనది, ఆవశ్యము.

**ఆవశ్యము**, —పై.—

**ఆవసథము**, సం. వి. అ. న. ఇల్లు: చూ, సదనము. 1.

**ఆవసితము**, సం. విశే. బుద్ధము, సుజీచినది. (ధాన్యము.): చూ, ధాన్యము. 1-౫.

**ఆవసితరి**, సం. వి. ఇ. న.—పై.—

**ఆవహము**, సం. విశే. 1. కలిగించునది: చూ, ఉపపాదకము; అం. 2. చూ, వాయువులు.

**ఆవహించు**, సం. ప్రే. అవతరించు: చూ, పుట్టు. 2.

**ఆవహిద్ధము**, అం: చూ, స్త్రీస్థానకములు.

**ఆవహిల్లు**, సం. అ. క్రి.—పై.—

**ఆవళి**, చూ, రూ-ఆవలి.

**ఆవాపకము**, సం. వి. అ. పుం. బంగారపు సూడిగము: చూ, భూషణము. 2. ౧౨-(౪); (ఆఁడుదానిచేతి మట్టిగాజు అని కొందఱు.)

**ఆవాపము**, సం. వి. అ. పుం. 1. రూ-ఆవాపము: చూ, ఆవాలము; 2. విత్తడము: చూ, విత్తుట; 3. = ఆవము: చూ, కావు. 5; 4. పరరాష్ట్ర చింత. (ఇది స్వరాష్ట్రచింతన తంత్రమనఁబడును.); చూ, తంత్రము. 2; 5. తాళప్రాణక్రియాభేదము: చూ, తాళము. 2; 6. ఓడ దాఁటించిన కూలి: చూ, తరపణ్యము; 7. వ్యధ: చూ, శోకము. 2; 8. మంగలిపని: చూ, ముండనము; అం. 9: చూ, నిశ్శబ్దక్రియలు.

**ఆవాయకము**, చూ, ఆవాపకము.

**ఆవాలము**, సం. వి. అ. న. ఆవాపము; పాదు: చూ, విల్లము.

**ఆవాలు**, దే. వి. బ. ఆబలు: చూ, సర్షపము: చూ, ఆవ.

**ఆవాసము**, సం. వి. అ. పుం. ఇల్లు: చూ, సదనము. 1.

**ఆవాహనము**, సం. వి. అ. న. 1. పిలుపు: చూ, సంబోధనము; 2: చూ, ఉపచారములు.

**ఆవాహించు**, సం. అ. క్రి: చూ, అవటిల్లు.

**ఆవాహితము**, సం. విశే. పిలువఁబడినది: అభిమంత్రితము, ఆకారితము, ఆమంత్రితము.

**ఆవి**, సం. ఈ. అవ్య. 1. కనఁబడినది; దే. వి. (1) తాపము. విజ. 2, ఆ. 53: చూ, సంతాపము; (2) ఊపిరి: చూ, శ్వాసము; (3) ఆవిరి: చూ, ఔష్మ్యము.

**ఆవించు**, దే. స. క్రి. వాసెనమీఁదఁబెట్టి ఆవిరితోఁ బక్వము చేయు. కాశ. 3, ఆ. 36: చూ. ఉడ్కు. 2.

ఆవైపు, దే. వి: చూ, ఆదిక్కు.

ఆవ్రశ్చన, సం. వి. అ. న. 1. మంత్రభేదము: చూ,మంత్రము. 1-౧౬; 2. మ్రానితొఱ్ఱ: చూ, రంధ్రము. 1-3.

ఆశ, సం. వి. ఆ. స్త్రీ. 4. = ఆస. ఇచ్ఛ: చూ, వాంఛ. 1; 2. = ఆస. దిక్కు: చూ, హరిత్తు; 3. ఆస. అత్యాశ. భర్తృ. 3, ఆ. 3: చూ, వాంఛ. 1-౧; అ. పుం. 4.అంతట వ్యాపించుట: చూ,వ్యాప్తి. 1;5. భుజము: చూ,హస్తము.1.

ఆశంపిత, సం. వి. ఋ. పుం. ప్రియవస్తువును కోరువాఁడు, ఆశంసిత, ఆశంసితుఁడు, ఆశంసువు: చూ, కోరువాఁడు.

ఆశంసనము, సం. వి. అ. న. ఇచ్ఛ: చూ, వాంఛ. 1.

ఆశంసిత, సం. విశ. 1: చూ, ఆశంపిత; 2. పరోక్షమునందుఁ బొగడువాఁడు; ఆశంసితుఁడు, ఆశంసువు.

ఆశంసితము, సం. విశ. కోరఁబడినది. వాంఛితము: చూ, వాంఛ. 1-33.

ఆశంసితుఁడు, సం. వి. ఋ. పుం: చూ, ఆశంసిత.

ఆశంసువు, సం. విశ. ఉ.—పై.—

ఆశకుఅంతములేదు, లో. ఒకానొక లోకోక్తి.

ఆశపడు, మి. అ. క్రి. అక్కఱపడు: చూ, వాంఛించు.

ఆశపెట్టు, మి. స. క్రి: చూ, ఆసపెట్టు.

ఆశము, సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. అంతటను ప్రసరించుట: చూ, వ్యాప్తి. 1.

ఆశయ, సం. వి. ఆ. స్త్రీ. గుండాలయను గడ్డి*: చూ, తృణము. 1.

ఆశయము, సం. వి. అ. పుం. 1. తలఁపు: చూ, విషయము. 4; 2. చోటు: చూ, స్థానము. 1; 3. ఆశ్రయము: చూ, సన్నిధానము. 2; 4. మనసు: చూ, హృదయము; 5. పాఁతఱ: చూ, లిబ్బి. 2; 6. మడుగు: చూ, సరస్సు. 1.

ఆశయిత, సం. విశ. చూ, తినిపించువాఁడు.

ఆశయేశయుఁడు, సం. వి అ. పుం: చూ, మన్మథుఁడు.

ఆశరుఁడు, సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1: 2. కోనతేఁడు, నైరృతి: చూ, మూలతేఁడు; 3. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

ఆశాపాలుఁడు, సం. వి. అ. పుం. దిక్పాలకుఁడు: చూ, దిక్పాలుఁడు.

ఆశాపాశము, జా. ఆసయను త్రాడు. (ఇట్లు ఆశాబంధము = ఆసయను ముడి.)

ఆశాబంధము, సం. వి. అ. పుం. 1. ఊఱట: చూ, ప్రత్యయము; 2. సాలెపురుగు నేసిననేఁత: చూ, సాలెగూఁడు; 3. ఆసయనుముడి: చూ, ఆశాపాశము, 4. కోఁతిగూఁడు: చూ, పదవము. 1-౨౬. ఆశావధిం కో గతః. న్యా. ఆశయొక్కయవధి నెవఁడు పొందెను.

ఆశాసనము, సం. వి. అ. వ. ఆశీర్వచనము: చూ, దీవన.

ఆశాసించు, సం. స. క్రి. ఆశీర్వదించు: చూ, దీవించు.

ఆశాస్తి, సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ. 1.

ఆశాస్యము, సం. విశ. 1. ఆశీర్వదింపఁదగినది; 2. ప్రార్థింపఁదగినది: చూ, ప్రార్థనీయము

ఆశి; సం. వి. ఈ. స్త్రీ. పాముయొక్క కోఱ; ఆశీస్సు: చూ; పల్లు. 1-౩.

ఆశించు, సం. స. క్రి. = ఆసించు: చూ, వాంఛించు.

ఆశిత, సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ. 1.

ఆశితము, సం. విశ. 1. తినఁబడినది: చూ, భుక్తము. 1; 2. అంతకుముందు ఆవులను మేసిన పొలము: చూ, గవీనము.

ఆశితసుతుఁడు, సం. వి. అ. పుం. సగరచక్రవర్తి. చూ, ఆసితసంభుఁడు.

ఆశిరుఁడు, సం. వి. అ. పుం. అగ్నిహోత్రుఁడు: చూ, వహ్ని. 1.

ఆశితిభవ, సం. వి. ఆ. స్త్రీ. తనివి: చూ, సౌహిత్యము.

ఆశిరము, సం. వి. అ. పుం. 1. పాలవిఱుగుడు: చూ, స్తన్యము. 1-౬; 2. జున్ను: చూ, స్తన్యము. 1-౪; 3. అగ్ని: చూ, వహ్ని. 1; 4. తిండి: చూ, సాపాటు.

ఆశిరుఁడు, సం. వి. అ. పుం. రవి: చూ, సూర్యుఁడు.

ఆశీర్వదించు, సం. స. క్రి. చూ, ఆశాసించు.

ఆశీర్వచనము, వా. వి. అ. న: చూ, దీవన.

ఆశీర్వాదము, సం. వి. అ. పుం. —పై.—

ఆశీవిషము, సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము. 1.

ఆశీస్సు, సం. వి. స్. స్త్రీ. 1. ఆశీర్వాదము: చూ, దీవన; 2. ఇచ్ఛ: చూ, వాంఛ; 3. మంచిపని: చూ, హితము; 4. పొగడిక: చూ, స్తోత్రము; 5. పాముయొక్క కోఱ, ఆశి: చూ, పల్లు. 1-౩.

ఆశుగము, సం. వి. అ. పుం. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. గాలి: చూ, వాయువు. 1.

ఆశువక్రోష్టి, సం. వి. ఇ. పుం. స్త్రీ. ఒకరకము తోఁటకూర: చూ, మారిషము. 1-౧.

ఆశువు, సం. వి. ఉ. పుం. 1. ఎఱ్ఱజిలమ వడ్లు: చూ, ధాన్యము; న. 2. వాసి; ప్రసిద్ధి: చూ, సంభావన. 3; క్రి. విశ. 3. వేగ: చూ, స్యదము. 1; విశ. 4. వేగముగలది: చూ, స్యదము. 3.

ఆశువ్రీహి, సం. వి. ఇ. పుం. ఎఱ్ఱజిలమ వడ్లు: చూ, ధాన్యము.

ఆశుశుక్షణి, సం. వి. ఇ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వేఁడియూపిరి: చూ, శ్వాసము; 3. ఉచ్ఛిష్టము: చూ, ఎంగిలి.

ఆశౌచము, సం. వి. అ. న. 1. అంటు: చూ, మైల. 4; 2. చావుమయిల: చూ, మృతాశౌచము; 3. జాతాశౌచము: చూ, పురుడు.

ఆశౌచములు; అం. జాతాశౌచము, మృతాశౌచము. (2)

ఆశ్చర్యపడు, మి. అ. క్రి: చూ, వెఱఁగొందు.

ఆశ్చర్యము, సం. వి. అ. న. 1. = అక్కజము: చూ, వింత. 1; 2. నవరసములలో నొకటి: చూ, అద్భుతము. 2. (చూ, రసములు.); విశ. 3. అచ్చెరువయినది: చూ, వింత. 1; అం. 4. చూ, రసస్థాయీభావములు. (మున్నెన్నఁడుఁ జూడని వస్తువులఁ జూడ మనమునఁ బుట్టెడి సంతోషము.) ఉదా. రావణుం డట్టపరిమితమగు వానరసేనావిస్తారంబును జూచి యయ్యారే! యింతటి వానరసేనను మున్నెన్నఁడుఁ జూచి యుండలేదు. అని యచ్చెరువొందెను.

ఆశ్రమము, సం. వి. అ. పుం. న. 1. మునులయిల్లు, ఆకుటిల్లు: చూ, సదనము. 1-౧౦. 2. బ్రహ్మచర్యాది—ఇవి నాలుగు: బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము; 3. సన్న్యాసులు లోనగువారు ఉండెడుచోటు, మఠము: చూ, సదనము. 1-౫౦. 4. అడవి: చూ, విపినము; 5. సన్న్యాసుల సాంప్రదాయభేదమును దెలిపెడి గుఱుతు: చూ, లక్షణము. 1; 6. శిష్యులు మొదలగువారుండు ఇల్లు: చూ, సదనము. 1.

ఆశ్రమవాసపర్వము, చూ, పర్వములు.

ఆశ్రయము, సం. వి. అ. పుం. 1. = ఆసరా: చూ, సన్నిధానము. 2; 2. బలవంతు నాశ్రయించుట: చూ, గుణములు; 3. చోటు: చూ, స్థానము. 1; 4. ఇల్లు: చూ, సదనము. 1; 5. ఒకానొక దేశము: చూ, దేశములు. 1-౧౧; 6. సన్న్యాసుల మతము: చూ, సదనము. 1-౫౦.

ఆశ్రయాశి, సం. వి. న్. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

ఆశ్రయాశుఁడు, సం. వి. అ. పుం. 1. —పై.—; విణ. 2. ఆశ్రయించినవానినిఁ జెఱుచువాఁడు: చూ, ప్రాపుచెఱచువాఁడు.

ఆశ్రయించు, సం. స. క్రి: చూ, ప్రాపుగొను.

ఆశ్రయుఁడు, సం. విణ. పొందించువాఁడు: చూ, ప్రాపకుఁడు.

ఆశ్రవము, సం. వి. అ. పుం. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2. రాగద్వేషాదిప్రయుక్త దుఃఖము: చూ, శోకము. 2; 3. శ్రవణేంద్రియముతోఁ గూడుకొనిన బుద్ధి: చూ, హృల్లేఖము. 2; 4. పట్టుదల: చూ, స్పర్ధ. 4.

ఆశ్రవుఁడు, సం. విణ. 1. మాట దాఁటనివాఁడు: చూ, విధేయుఁడు; 2. బాగుగా వినువాఁడు; 3. మాటలలో భేదముఁ గల్పించువాఁడు.

ఆశ్రావణము, సం. వి. అ. న. ఒకానొక నాటకాంగము, నాటక పరిచ్ఛేదము: చూ, నాటకము. 1.

ఆశ్రావకము, సం. వి. అ. న. పారేవతము*: చూ, రైవతకము.

ఆశ్రి, సం. వి. ఇ. స్త్రీ. రూ-అశ్రి. కత్తిలోనగువాని వాయి: చూ, వాదర.

ఆశ్రితము, సం. విణ. ఆశ్రయింపఁబడినది: చూ, సన్నిధానము. 2.

ఆశ్రితుఁడు, సం. వి. అ. పుం. ఒకనిపోషణలో నుండువాఁడు.

ఆశ్రుతము, సం. విణ. 1. అంగీకరింపఁబడినది: చూ, సమ్మతి. 1; 2. మంత్రభేదము: చూ, మంత్రము. 1; 3. హోమవస్తువు; 4. మాయచేతఁ జేయఁబడినయడవి: చూ, విపినము.

ఆశ్లిష్టము, సం. విణ. కవుఁగిలింపఁబడినది: చూ, ఉపగూఢము.

ఆశ్లేష, సం. వి. ఆ స్త్రీ.=అసిలేసు: చూ, రిక్క. 1-౯. (రూ-ఆశ్లేషము.)

ఆశ్లేషము, సం. వి. అ. పుం. 1.—పై.—; 2. కవుఁగిలింత: చూ, కౌఁగిలి.

ఆశ్లేషాభవము, సం. వి. అ. పుం. కేతుగ్రహము: చూ, సుకేతనము.

ఆశ్లేషించు, సం. స. క్రి: చూ, కౌఁగిలించు.

ఆశ్వత్థము, సం. వి. అ. న: చూ, రావిపండు.

ఆశ్వము, సం. వి. అ. న. గుఱ్ఱపు సమవాయము: చూ, హయము. 1-౬౧.

ఆశ్వమూత్రి, సం. వి. ఈ. స్త్రీ. అందుగు, ముదము*: చూ, సల్లకి.

ఆశ్వయుజము, సం. వి. అ. పుం. 1. ఆశ్వయుజమాసము: చూ, మాసము. 1; 2. శరదృతువులో మొదటినెల. (ఆశ్వయుజ కార్తికమాసములు శరదృతువు.)

ఆశ్వయుజి, సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజ పౌర్ణమి, అశ్విని నక్షత్రయుక్తమగు పౌర్ణమి, కోజాగరము, కౌముది, కౌముదీచారము: చూ, పున్నమ.

ఆశ్వలాయనము, అం: చూ, కల్పసూత్రములు.

ఆశ్వలాయనస్మృతి, అం: చూ, స్మృతులు.

ఆశ్వసించు, సం. స. క్రి. రూ-ఆశ్వాసించు: చూ, ఓదార్చు.

ఆశ్వసితము, సం. విణ. ఊఱడింపఁబడినది. రూ-ఆశ్వాసితము.

ఆశ్వాసనము, సం. వి. అ. న. ఓదార్పు: చూ, ప్రశ్రయము. (రూ-ఆశ్వాసము.)

ఆశ్వాసము, సం. వి. అ. పుం. 1.—పై.—; 2. ఆఖ్యాయిక యను వచనకావ్యములోని వస్తువు: చూ, పరికథ; 3. గ్రంథభాగము: చూ, పరిచ్ఛేదము; 4. నాటకపరిచ్ఛేదము: నాటకము. 1; 5. ఎగఊపిరి: చూ, శ్వాసము; అం. 6. చూ, వ్యసనములు.

ఆశ్వాసించు, చూ, రూ-ఆశ్వసించు.

ఆశ్వాసితము, చూ, రూ-ఆశ్వసితము.

ఆశ్వికము, సం. వి. అ. న. సంభోగబంధములలో నొకటి: చూ, రతిబంధము. 1.

ఆశ్వికుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-అశ్వికుఁడు.

ఆశ్వితి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-అశ్విని.

ఆశ్వినము, సం. వి. అ. పుం. 1: చూ, రూ-ఆశ్వయుజము; విణ. 2. గుఱ్ఱము ఒకదినము పోఁదగిన (త్రోవ.): చూ, మార్గము. 1. (రూ-ఆశ్వీనము.)

ఆశ్వినేయులు, సం. వి. అ. పుం. అశ్వినీదేవతల కుమారులు అనఁగా దేవవైద్యులు: చూ, అశ్వులు.

ఆశ్వీనము, సం. విణ. చూ, రూ-ఆశ్వినము. 2.

ఆశ్వీయము, సం. వి. అ. పుం. 1: చూ, రూ-ఆశ్వము; విణ. 2. గుఱ్ఱముల కిష్టమయినది.

ఆషాఢపూర్వజము, సం. వి. అ. పుం: చూ, జ్యేష్ఠమాసము.

ఆషాఢభవుఁడు, సం. వి. అ. పుం. అంగారక గ్రహము: చూ, వక్రుఁడు. 1.

ఆషాఢము, సం. వి. అ. పుం. 1. ఒకానొక నెల: చూ, మాసము. 1; (రూ-ఆషాఢము.) 2. ఉత్తరాషాఢానక్షత్రము: చూ, రిక్క. 1-౨౧; 3. పూర్వాషాఢానక్షత్రము: చూ, రిక్క. 1-౨౧; 4. మలయపర్వతము, గిరిసారము: చూ, పర్వతము. 1-౨౧; 5. బ్రహ్మచారి పట్టుకొను మోదుగుకఱ్ఱ.

ఆషాఢి, సం. వి. ఈ. స్త్రీ. ఆషాఢశుద్ధ పౌర్ణమి: చూ, పున్నమ. (పూర్వాషాఢా నక్షత్రయుక్తముగా గాని (లేక) ఉత్తరాషాఢా నక్షత్రయుక్తముగా గాని గల పౌర్ణమి.)

ఆస. 1. సం. అవ్య. ఆయెను, బభూవార్థకము: వై. వి. (1) = ఆశ. కోరిక: చూ, వాంఛ. 1; (2) = ఆశ. అత్యాశ: చూ, వాంఛ. 1-౧; (3) = ఆశ. దెస: చూ, హరిత్తు.

ఆసంగము, సం. వి. అ. పుం. 1. ఆసరా: చూ, సన్నిధానము 2; 2. కోరిక: చూ, వాంఛ. 1.

ఆసంగిని, సం. వి. ఈ. స్త్రీ. వాత్య, సుడిగాలి: చూ, వాయువు. 1-(7)-(వ).

ఆసంది, సం. వి. ఇ. పుం. 1. కటువు, పాడె: చూ, శవయానము; 2. చచ్చౌకమైన మంచమువంటి పీట: చూ, సింహాసనము. 1-ఇ; 3. చౌకమగు మంచము. మంచము. (రూ-ఆసంధి.)

ఆసంధి: చూ, శయ్య. 1. —పై.—

ఆసకప్పెరగాడు, ద్వ. వి. ఒకానొక పక్షి: చూ, పక్షి.

ఆసక్తము, సం. విణ. కూడియున్నది: చూ, సంయుక్తము.

ఆసక్తి, సం. వి. ఇ. స్త్రీ. = ఆసత్తి: చూ, వాంఛ. 1.

ఆసక్తుడు, సం. విణ. ఆసగలాడు: చూ, లుబ్ధుడు. 2.

ఆసగంది, ద్వ. వి. కులట: చూ, జంకులాడి.

ఆసగలాడు, ద్వ. విణ: చూ, ఆసక్తుడు.

ఆసగొను, ద్వ. స. క్రి. కోరు: చూ, వాంఛించు.

ఆసచేయు, ద్వ. స. క్రి.—పై.— వి. వు, 2, ఆ. 65.

ఆసత్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. లాభము, మూలద్రవ్యముకంటె అదనముగ వచ్చినసొమ్ము: చూ, లాభము. 1; 2. కూడిక: చూ, సంయోగము; వై. వి. (1) = ఆసక్తి. కోరిక: చూ, వాంఛ. 1.

ఆసత్యులు, సం. వి. అ. పుం. అశ్వినీ దేవతలు: చూ, అశ్వులు.

ఆసన, సం. వి. ఆ. స్త్రీ. 1. = ఆసాను. కూర్చుండుట: చూ, స్థితి. 2; 2. అంగడివీధి: చూ, వీధి. 3.

ఆసనము, సం. వి. అ. న. 1. పీఠము: చూ, సింహాసనము. 1. 2. ఏనుగు మూపు: చూ; స్కంధము. 1-అ; 3. పదియు అక్కఱలేకపోవుట; 4. దేశకాలాద్యపేక్షచేత నిలుచుట: బలాద్యపేక్షచే దండెత్తిపోక నిలుచుట: చూ, యానములు. (చూ, గుణము.); (ఇది పంచవిధము. —సంధాయాసనము, ప్రసంగాసనము, విగృహ్యాసనము, సంభూయాసనము, ఉపేక్ష్యాసనము. (వీనికర్థము యానశబ్దము కడచూడుము.) 5. కూర్చుండుట: చూ, స్థితి. 2; 6. చోటు: చూ, స్థానము. 1; పుం. 7. సర్జకము*: చూ, వేగిస; అం. 8: చూ, ఉపచారములు; 9: (చూ, అంగము. 9): చూ, యోగాంగములు. 10: చూ, గుణములు.

ఆసనములు. అం. స్వస్తికాది.—స్వస్తికాసనము, గోముఖాసనము, బద్ధాసనము, పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము, ముక్తాసనము, (దీనికి సిద్ధాసనమని, వజ్రాసనమని, గుప్తాసనమనియు నామాంతరములు గలవు.) మయూరాసనము, కుక్కుటాసనము; వరాహాసనము, బకాసనము, క్రౌంచాసనము, ముద్రికాసనము, సర్వతోభద్రాసనము, నాగాసనము, మత్స్యాసనము, వ్యాఘ్రాసనము, అర్ధచంద్రాసనము, అర్కాసనము, దండాసనము, శైలాసనము, ఖడ్గాసనము, ముద్గరాసనము, మకరాసనము, హస్తికాసనము, కర్ణికాసనము, సీరాసనము, స్థాణ్వాసనము, సిద్ధాసనము, (30).

ఆసన్నము, సం. వి. అ. న. 1. దాపు: చూ, సమీపము. 1; 2. దాపైనది: చూ, సవిధము.

ఆసపడు, వై. అ. క్రి: చూ, వాంఛించు.

ఆసపాటు, వై. వి. కోరిక: చూ, వాంఛ. 1.

ఆసపెట్టు, వై. స. క్రి: చూ, అపేక్షపెట్టు.

ఆసరా, వై. వి. = ఆశ్రయము. ఊత: చూ, సన్నిధానము. 2.

ఆసవము, సం. వి. అ. పుం. 1. పక్వముకాని చెఱకురసమున జేసిన కల్లు, చెఱకురసమున జేసిన కల్లు, (అనికొందఱు): చూ, సుర. 1; 2. కల్లుతేట: చూ, సురామండము; 3. పూదేనె: చూ, మకరందము.

ఆసాదనము, సం. వి. అ. స. పొందు, ప్రాప్తి: చూ, లాభము. 1.

ఆసాది, దే. వి. మతంగుడు: చూ, మాదిగ.

ఆసాదించు, సం. స. క్రి. పొందు: చూ. సక్తమగు.

ఆసాదితము, సం. విణ. పొందబడినది: చూ, సంసక్తము. 1.

ఆసాద్యము, సం. విణ. పొందదగినది: చూ, లభ్యము. 1.

ఆసారము, సం వి. అ. పుం. 1. జడివాన: చూ, వాన. 1-ళ; 2. మునుగ*: చూ, శిగ్రువు. 1; 3. అర్కపర్ణము*: చూ, వికిరణము; 4. మిత్రబలము - మిత్రసంధిబలము - మిత్రసైన్యము; 5. అంతట సేన వ్యాపించుట: చూ, ప్రసరణి; 6. దండువిడిసిన చోటు: చూ, శిబిరము; 7. లొలిచసవులు: చూ, వేసము.

ఆసించు, వై. స. క్రి. = ఆశించు: చూ, వాంఛించు.

ఆసిక, సం. వి. ఆ. స్త్రీ. కూర్చుండుట: చూ, స్థితి. 2.

ఆసికుడు, సం. వి. అ. పుం. కటారికాడు: చూ, ఖడ్గి. 2.

ఆసితము, సం. వి. అ. న. 1. కూర్చుండుట: చూ, స్థితి. 2; విణ. 2. పూర్వమునందు ఆవులున్నతావు: చూ, భూమి. 1; 3. కూర్చుండినది.

ఆసితసంతుడు, సం. వి. అ. పుం. సగర చక్రవర్తి: చూ, రాజు. 1-౨౧.

ఆసిద్ధము, సం. విణ. 1. అడ్డగింపబడినది: చూ, రుద్ధము. 1; 2. కట్టాయితమైనది.

ఆసియా, అం: చూ, ఖండములు.

ఆసీనము, సం. విణ. కూర్చున్నది.

ఆసీనుడు, సం. విణ. కూర్చున్నవాడు: చూ, ఉపవిష్టుడు.

ఆసు, దే. వి. సాలెవాడు ఆసుపోయునపుడు నూలు చొప్పించెడు క్రోవి: చూ, ఆసుగ్రోవి.

ఆసుగ్రోవి, దే. వి. (ఆసు + క్రోవి.): చూ, తంత్వాతర్చనము.

ఆసుతీబలుడు, సం. విణ. నేర్పరి: చూ, సమర్థుడు.

ఆసుపోయు, దే. స. క్రి. కొయ్యచట్టముగుండా దారమును పోయు: చూ, పోగువాలు. (రూ-ఆసువోయు.)

ఆసురము, సం. వి. అ. పుం. 1. జొంతకాకి: చూ, సకృత్ప్రజము. 1-౫; న. 2. చవుటియుప్పు: చూ, లవణము. 1-౭; 3: చూ, విషామృతము; పుం. 4. ధనమిచ్చి కన్యను దీసికొనెడి యొకానొక వివాహము: చూ, వివాహము.

ఆసుని, సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లావలు: చూ, సర్షపము.

ఆసురి, సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లావలు: చూ, సర్షపము; 2. మూలానక్షత్రము: చూ, రిక్క. 1-౧౯; 3. ఆర్షచ్ఛందోబద్ధమైన యొకానొక మంత్రపాఠము: చూ, మంత్రము. 1, ౧౮; 4. బెల్లమువేయక చేసిన సారాయి: చూ, సుర. 1; 5. పంది: చూ, సూకరము.

ఆస్వదించు, సం. స. క్రి. 1. రుచుచు : చూ, భుజించు, 2;2. రూ-ఆస్వాదించు : చూ, చవిగొను.

ఆస్వనితము, సం. వి. అ. న, ఉల్లము, మనస్సు : చూ, హృదయము. 2.

ఆస్వాదనము, సం. వి. అ. న: చూ, రూ-ఆస్వదనము.

ఆస్వాదించు, సం. స. క్రి: చూ, రూ-అస్వదించు.

ఆస్వాదితము, సం. స. విణ. 1. అనుభవింపఁబడినది : చూ, భుక్తము; 2. చవిచూడఁబడినది.

ఆహ, సం. 1. తిజంత ప్రతిరూపకావ్యము. కాలసామాన్యము: చూ, అస్తి. 1; 2. ఉవాచ, పలికెను.

ఆహకము, సం. వి. అ. పుం. 1. కుడువ : చూ, తాకట్టు. (ఆహకశబ్దము అయుక్తమై యుండనోపు.)

ఆహతము, సం. వి. అ. పుం. 1. తమ్మటమను వాద్యము: చూ, వీణ. 1-౧౫; విణ. 2. అసత్యమైనది: చూ, వితథము; 3. క్రొత్తది (వస్త్రము) కోరా : చూ, వస్త్రము. 1-3; 4. మాసిన బట్ట : చూ, వస్త్రము; 1-౬౩; 5. కలుగనేరనిది. (గొడ్రాలి కొడుకు చూచుచున్నాఁడు లోనగు మాటలు.) : చూ, అసంభవము; 6. కొట్టబఁడినది : అయస్తము, ఆవిద్ధము; 7. రెట్టింపఁబడినది, గుణకారము : చూ, హెచ్చవేత; 8. వాయింపఁబడినది; 9. ముద్రవేయఁబడిన వెండి బంగారము: చూ, నాణకము; అం. 10; చూ, గమకములు; 11 : చూ, నాదములు; 12 : చూ, చక్రములు.

ఆహతలక్షణుఁడు, సం. విణ. మంచి గుణములచేతఁ బ్రసిద్ధిఁ జెందినవాఁడు : చూ, కృతలక్షణుఁడు.

ఆహతుఁడు, సం. విణ. 1. కల్లమాటలాడువాఁడు : చూ, ముఖరుఁడు; 2: చూ, కొట్టఁబడినవాఁడు.

ఆహరణము, సం. వి. అ. పుం. ఆనేతవ్యము: చూ, తెచ్చుట.

ఆహరించు, సం. స. క్రి. 1. అపహరించు: చూ, ముచ్చిలించు; 2. ఆక్షేపించు: చూ, రెమ్ము; 3. తిను: చూ, సాపడు.

ఆహర్త, సం. విణ. దొంగ: చూ, ముచ్చు. 1.

ఆహవనము, సం. వి. అ. న. జన్నము : చూ, యజ్ఞము.

ఆహవనీయము, సం. వి. అ. పుం. 1. శ్రౌతాగ్ని, పేరికకుఁ దూర్పుననుండు నాలుగుమూలల కుండలలోని యగ్ని. అగ్నులయిదింటిలో నొకటి : చూ, అగ్నులు; విణ. 2. యజ్ఞమునందు బలియియ్యయోగ్యమైనది; అం. 3; చూ, అగ్నులు.

ఆహవము, సం. వి. అ. పుం. 1. రూ-ఆహావము, జగడము : చూ, యుద్ధము; 2. రూ-ఆహావము, నూతియొద్దఁగట్టిన నీళ్ళతొట్టి : చూ, నిపానము; 3. పిలుపు : చూ, సంబోధనము ; 4. జన్నము; చూ, యజ్ఞము.

ఆహా, వై. అవ్య. ఆశ్చర్యార్థకము : చూ, వింత. 1. (రూ-ఆహాహా.)

ఆహారము, సం. వి. అ. పుం 1. = ఆరగింపు, భోజనము; చూ, సాపాటు; 2. = ఓగిరము, అన్నము, చూ, సాదము; (1) 3; ఆహరణము; చూ, తెచ్చుట; 4. కందుకము: చూ, బంతి. 3; 5. అపహరణము, దొంగతనము: చూ, హరణము. 1; అవ్య. 6. హారముభణకు: 7. హరించే వణకు.

ఆహారి, అం: చూ, స్త్రీరాగములు.

ఆహారించు, సం. స. క్రి. తిను. నై. 2. ఆ. 123: చూ, సాపడు. ఆహారేవ్యవహారేచ త్యక్తలజ్జస్సుఖీభవేత్. న్యా. ఆహారమందును వ్యవహారమందును సిగ్గుపడనివాఁడు సుఖపడును.

ఆహార్యము, సం. వి. అ. పుం. 1. హారాదిభూషణాదులచేఁ గలుగు అభినయవిశేషము : చూ. అభినయము. (చూ, వ్యంజకము. 1.); 2. భూషణాది వేషసామగ్రి; విణ. 3. తెచ్చుకోఁదగినది; ఆనేతవ్యము, ఆనేయము; 4. కాలనియమములేకవచ్చునది;ఆగంతుకము;అం. 5. చూ,అభినయములు.

ఆహావము, సం. వి. అ. పుం. 1. పశువులు నీరు త్రాగుటకై నూతియొద్దఁ గట్టిన తొట్టి, రూ- ఆహవము; చూ, నిపానము; 2. రూ- ఆహవము, జగడము; చూ, యుద్ధము.

ఆహాహా, వై. అవ్య. చూ, రూ- ఆహా.

ఆహికము, సం. వి. అ. పుం. 1. వంతుప్రకారము విడిచి విడిచి వచ్చెడు పొలి; (జ్వరము); చూ, రోగము; 1; 2. సుషిరమను వాద్యము; చూ. స్వరము. 2. 3. కేతుగ్రహము : చూ, సుకేతనము; అం. 4. చూ, ప్రవాహములు.

ఆహితము, సం. విణ. 1. ఉంచఁబడినది: చూ, ఉపహితము; 2. చేయఁబడినది; చూ, ఉద్ధృతము.

ఆహితలక్షణుఁడు, సం. విణ: చూ, రూ- ఆహతలక్షణుఁడు.

ఆహితుండికుఁడు, సం, విణ. పాములవాఁడు: చూ, సర్పగ్రాహకుఁడు (గారడివాఁడనియు వాడుదురు.)

ఆహిరిణి, సం. వి. ఈ. స్త్రీ, రూ-అహీరణి, విషముగల ఇరుదలల పాము: చూ, సర్పము.

ఆహిషము, సం. వి. అ. పుం. అప్పనము: చూ, లంచము.

ఆహుతము, సం. విణ. వ్రేల్వఁబడినది: చూ, రూ - అహుతము.

ఆహుతి, సం. వి. ఇ. స్త్రీ. అగ్నియందు వ్రేల్చుట.

ఆహుల్య, సం. వి, ఆ. స్త్రీ: చూ, కాంచనపుష్పకము*.

ఆహూతము, సం విణ. పిలువఁ బడ్డది; చూ, సంబోధనము.

ఆహృతి, సం. వి. ఇ. స్త్రీ. ఆనేతవ్యము; చూ, తెచ్చుట.

ఆహేరువు, సం. వి. ఉ. స్త్రీ. పిల్ల పీఁచర. * చూ, శతమూలి.

ఆహో, సం. అవ్య. 1. అదియో ఇదియో అను సంశయమును దెలుపును: చూ, సంశయము; 2. ఊహించుట: చూ, యోచన; 3. సవాలు: చూ, ప్రశ్నము; 4. వికల్పార్థము. రూ- అహో: చూ, యవ్య.

ఆహోపురుషిక, సం. వి. ఆ. స్త్రీ. జగడమందు గర్వముచే శత్రునిదూషించి తన్నుఁ బొగడుకొనుట: చూ, రూ- అహోపురుషిక.

ఆహోపౌరుషిక, సం. వి. ఆ. స్త్రీ. 1. —పై.—; 2. ప్రసిద్ధకులజాతుని యభిప్రాయము: చూ, స్మృతి. 1; 3. ప్రసిద్ధకులజాతునిపని.

ఆహ్నికము, సం. వి. అ. న. 1. నిత్యకర్మము, పగలు చేయఁదగిన కర్మము: చూ, కర్మములు; 2. తిండి: చూ, సాపాటు; 3. ప్రకరణసమూహము, చూ, వేలము; విణ. 4. పగలు చేయఁదగినది.

ఆహ్లాదము, సం. వి. అ. పుం: చూ, సంతోషము.

ఆహ్వా, సం. వి. ఆ. స్త్రీ. 1. నామధేయము: చూ, పేరు, 1; 2. పిలుపు: చూ, సంబోధనము.

ఆహ్వాయము, సం. వి. అ. పుం. నామధేయము చూ, పేరు. 1.

ఆహ్వానము, సం. వి. అ. న. పిలుపు: చూ, సంబోధనము.

ఆళము, సం. వి. అ. పుం. 1. ఉచ్చింత *: చూ, కుంద. 5; 2. కుంతలము, తలవెంట్రుక: చూ, వెంట్రుక. 1; 3. పాపు: చూ, సొప్పు: 4. ఆఁడుగుఱి: చూ, భగము. 12; న. 5. తేలు కొండిముల్లు: చూ, ఆలము. 2; 6. అరిదళము: చూ, హరి దళము. (రూ-ఆలము.)

ఆళరి, వై. వి.=ఆలాప్తి. రాగాలాపము: చూ, స్వరము. 2.

ఆళి, సం. వి. ఇ. స్త్రీ. 1.= ఓలి. పంక్తి; శ్రేణి: చూ, 1; చూ, 2. చెలికత్తె: చూ, సఖి. 1: 3. అడ్డకట్ట: చూ, సేతువు. 1; న్. పుం. 4. తేలు: చూ, వృశ్చికము. 1; 5. ఎఱ్ఱతేలు: చూ, వృశ్చికము. 1; ఇ. పుం. 6. కష్టము: చూ, శోకము, 2; 7. అభిప్రాయము: చూ, విషయము. 4; విణ. 8. నిర్మలమయిన మనస్సుఁగలది.

ఆళిందకి, సం. వి. ఇ. స్త్రీ. రూ-అలిందకి, ఉపుత: చూ, చిక్రో డము.

ఆళిందము, సం. వి. అ. పుం. రూ-అళిందము. నగరి తల వాకిలి చావడి: చూ, హజారము.

ఆళు, సం. వి. ఊ. స్త్రీ. 1. గటిక *: చూ, తృణము. 1; 2. భృంగారము, గిండి: చూ, పాత్రము. 6-౧౪.

ఆళుగ, దే. వి. శల్యకము, ముత్తెపుఁజిప్పలవంటి ముండ్లచేతఁ గప్పఁబడిన యెల్లయంగములుఁ గల యొక వికమైన పంది, రూ-ఆళువ: చూ, సూకరము. 1-౬.

ఆళువ, దే. వి. — పై. —

ఆళువరి, దే. వి. అలంగము: చూ, వప్రము.

ఆళువారు, దే. వి. చూ, రూ-ఆళ్వారు.

ఆళ్ళకోస, దే. వి. ఆతాపి. ఒకరకము కాకి: చూ. సకృత్ప్ర జము. 1-౧.

ఆళ్ళు, దే. వి. ఉ. (ఆరుగ + లు.) 1. కోద్రవము: చూ, ధాన్యము; 2. సస్యవిశేషము: చూ, సస్యము.

ఆళ్వారు, దే. వి. హరిభక్తుఁడు. చూ, రూ-ఆళువారు.

ఆళ్వారులు, అం. పొయిఘాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, పెరియాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు, తిరు మిషియాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, మధుర కవి యాళ్వారు, నాథమునియాళ్వారు, కులశేఖరాళ్వారు, తిరుప్పాణి యాళ్వారు. (12.)

## ఇ

ఒకానొకయక్కఱము, చూ, వర్ణము. 1; సం. అవ్య. 1. చిత్రము: చూ, వింత. 1; 2. కోపములో భేదము: చూ, రోషము; 3. వంత: చూ, శోకము; 2; 4. చూ, శబ్దము: 1; 5. తేడామాట: చూ, మాటతేడా; 6. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; ఇ. పుం. 7. చూ, మన్మథుఁడు; 8. పాము: చూ, సర్పము; 9. మణి, చూ, రత్నము; 1-౧౫; 10. కాంతి; చూ, వెలుతురు. 1; 11. మంట: చూ, వహ్ని 1-౨౬; 12. అగ్రము: చూ, సుద. 3; 13. ముందు; చూ, ముంధఱ. 1; 14. ఆఁడుగుఱి: చూ, భగము. 12; 15. మహాప్లుల స్నాన ముచేసిన పుణ్యోదకము, తీర్థము: చూ, సలిలము: 1-౬; 16. ముక్కంటి: చూ, శివుఁడు; 17. కరేణువు, ఆఁడేనుఁగు: చూ, హస్తి; 1-(౭౫); 18. ఆఁడేనుఁగుయొక్క గర్భాంత ర్భాగము: చూ, హస్తి; 1.(౭౭); 19. చంద్రకిరణము: చూ, మయూఖము. 1; 20. శుద్ధాంతము, రాజవాసము: చూ, సద నము. 1; దే. వి. (1) పదముందలి వర్ణమునకు ద్విత్వము పుట్టించి ఇదంతశబ్దార్థమగును. "ఇయ్యెడవి." మొ: (2) ఇదంతశబ్దములకుఁ బ్రథమైకవచన ప్రత్యయములు రావు. ఉ. హరి-మతి; ప్రథమైకవచన ప్రత్యయమునైన "డు-ము-వు"-లు ఇకారము కడపటఁగల శబ్దములకురావు. హరిఁడు- మతిము అనరాదు. హరి, మతి యే యగు వఁయును.

ఇంక, దే. ప్ర. 1. ముందు: చూ, ముందఱ. 1; 2. ఇంకను, ఇప్పటికిని, ఇదివఱకును: చూ, యుఁ; 3. అనఁగా: చూ, మఱి. 2.

ఇంకనేమిచేయనని క్రమొక్కుట, అం. చిహ్నములు మొనిమిదిం టిలో నొకటి: చూ, చిహ్నములు.

ఇంకించు, దే. అ. క్రి. 1. చిగురొత్తు: చూ, పల్లవించు. ఆం. పద. పారి; 2. అడఁగు, ఆఱు: చూ, సమయు. 3.

ఇంకు, దే. అ. క్రి. వట్టు, శోషిల్లు: చూ, శోషించు.

ఇంకుడు, దే. వి. 1. ఇంకుట: చూ, శోషణము. 1. విణ. 2. ఇంకినది; 3. ఎండినది. చూ, శుష్కము. 2. (రూ-ఇంకుట.)

ఇంకువ, దే. వి. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. స్థలి, మెరకనేల: చూ, భూమి 1. - 40.

ఇంగము, సం. వి. అ. పుం. 1. తలఁపు:, చూ, విషయము: 4; 2 ఆశ్చర్యము: చూ, వింత. 1; 3. బుద్ధి: చూ, హృల్లే ఖము; 2; 4. సంజ్ఞచేయుట; న. 5. అభిప్రాయసూచకమైన ముఖరాగాది వికారము, ఇంగితము: చూ, బొమముడిపాటు; విణ. 6. తిరుగునది, చరిష్ణువు: చూ, త్రసము.

ఇంగలము, సం. వి. అ. పుం. 1. పిడకనిప్పు: చూ, వహ్ని. 1; వై. వి. = (1) అంగారః. అగ్ని. చూ, నిప్పు; వహ్ని. (2) = హింగుళ: చూ, ఇంగిలీకము.

ఇంగళింపు, చూ, మల్లశాస్త్రము.

ఇంగాలము, ప్రా. వి. అ. పుం. బొగ్గు: చూ, వహ్ని. 1.

ఇంగితజ్ఞుఁడు, సం విణ.: అంతరజ్ఞుఁడు.

ఇంగితము, సం. వి. అ. న. 1. తలఁపు: చూ. విషయము. 4;2. ఆకారము: చూ, బొమముడిపాటు; 3. పయనము: చూ, ప్రయాణము.

ఇంగిలము, వై. వి. = అంగారః, అగ్ని: చూ, వహ్ని. 1.

ఇంగిలాయ, దే. వి. కరదీపిక: చూ, దివిటి.

ఇంగిలాయి, దే. వి. ఒకరకపుచేఁప: చూ, మత్స్యము. 1.

ఇంగిలికము, వై. వి. = హింగుళః. రాగద్రవ్య విశేషము, కొండకావిజాయి: చూ, హింగుళము.

ఇంగుదము, సం. వి. అ. పుం. 1. రూ-ఐంగుదము: చూ, గార పండు; 2. గార *: చూ, హింగుది.

ఇంగుది, సం. వి. ఈ. స్త్రీ. గార *: చూ, రూ-హింగుది.

ఇంగువ, వై.వి. 1. = హింగు. ఉగ్రగంధము *: చూ, హింగువు. 1; 2. = హింగు, సంబారవిశేషము: చూ, హింగువు. 2.

ఇంచాకము, సం. వి. అ. న. రెయ్యచేఁప. జలవృశ్చికము: చూ. మత్స్యము. 1.

ఇంచించుక, దే. అవ్య. (ఇంచుక + ఇంచుక.) కొంచెము కొంచెము: చూ. స్వల్పము. 1.

ఇంచిమంచి, దే. వి. ఏ. రుచిగల వస్తువు. శుక. 3, ఆ. 295: చూ. భక్ష్యము. 1-౽.

ఇంచిమంచిపెట్టు, దే. స. క్రి. రుచిగల వస్తువు పెట్టు. (ఏమన్నా పెట్టు = రుచిగల వస్తువుపెట్టు. వాడుక.)

ఇంచు, వై. వి. 1. = ఇక్షుః. ఇక్షువు * : చూ. రసాలము. 3; దే. అ. క్రి. 2. అందగించు. భార. ఉద్యో-2, ఆ: చూ. రమ్యమగు; 3. మనోహరమగు. చూ. మనోజ్ఞమగు; దే. స. క్రి. 4. అపేక్షించు. చూ. వాంఛించు.

ఇంచుఁబోఁడి, ద్వ. వి. (ఇంచు + పోఁడి.) 1. చెఱకువలె మనోజ్ఞాంగులగు ఆఁడుది : చూ. స్త్రీ; 2. ఆఁడుది : చూ. స్త్రీ.

ఇంచుక, వై. అవ్య. = ఈషత్. కించిదర్థకము. అం. ధా.తృ. అవ్య. 74: చూ. స్వల్పము. 1.

ఇంచుకంత, దే. అవ్య. త్రీ—పై.—

ఇంచుకయెఱుపు. ద్వ. వి. అవ్యక్తరాగము : చూ. వర్ణము. 6.

ఇంచుట, దే. వి; చూ. ఎచ్చుట.

ఇంచుపాలకడలి, ద్వ. వి. 1. పాలసముద్రము. ఆఱవ సంద్రము: చూ. సముద్రము; అం. 2. సముద్రము లేడింటిలో నొకటి; చూ. సముద్రములు.

ఇంచుమించు, ద్వ. వి. అంతరువు. విజ. 1. ఆ. 34; చూ. వేఱుపాటు. 1.

ఇంచుమా్రను, ద్వ. వి. ఇక్షువు, చెఱకు*: చూ. రసాలము, 3.

ఇంచువిలుకాఁడు, ద్వ. వి: చూ. మన్మథుఁడు. (రూ - ఇంచువిల్కాఁడు.)

ఇంచువిలుతుఁడు, —పై. — (రూ-ఇంచువిల్తుఁడు.)

ఇంజెటి, దే. వి. రూ - ఈఁజేటి, ఒకరకము కంద*: చూ. సూరణము.

ఇంటఁగుడిచి యింటివాసములు లెక్కపెట్టినట్లు, లో. ఉదా. — "ఓ స్వామిద్రోహీ! యింటఁగుడిచి యంటివాసము లెన్నికయిడిన వడువున మా దేశమునఁ గ్రుమ్మరుచు మా స్వామినే యాక్షేపింపఁజొచ్చితివి." (నీతిచంద్రిక — విగ్రహము.)

ఇంటగెలిచి రచ్చ గెలువవలెను, లో. ఉదా :— దేవా! ఇంట గెలిచి మఱి రచ్చ గెలువవలయును. మనలో మనమాట విచారింతము. (నీతిచంద్రిక — విగ్రహము.)

ఇంటరము, దే. వి. రూ - ఇంటర్ము. సంకటము. భార. ఉద్యో. 4, ఆ. 237: చూ, శోకము. 2.

ఇంటాతఁడు. ద్వ. వి. మగఁడు : చూ, భర్త. 1.

ఇంటికప్పము, ద్వ. వి. చూ, ఇంటిపన్ను.

ఇంటికప్పు, ద్వ. వి. ఇంటికి వేసెడు పైకప్పు. చూ. సదనము; 1-౧౭.

ఇంటికాఁపు, దే. వి. (ఇల్లు + కాఁపు.) గృహస్థుఁడు: చూ, యజమానుఁడు.

ఇంటికొన, ద్వ. వి. గృహాగ్రము. చూ. ప్రకోష్ఠము.

ఇంటిచోపా, ద్వ. వి. గృహైకదేశము : చూ: ముంగిలి, 2.

ఇంటితోఁట, దే. వి. గృహారామము : చూ: వనము. 2.

ఇంటిపట్టు, దే. వి. (ఇల్లు + పట్టు.) స్వా. 1, ఆ. 11: చూ, గృహస్థధర్మము.

ఇంటిపన్ను, ద్వ. వి: చూ, ఘాటకము,

ఇంటిపాప, ద్వ. వి. (ఇల్లు + పాప) వెలఁగొన్న దాసి; చూ, పరిచారిక.

ఇంటిపెంట, ద్వ. వి. పొరకతోఁజిమ్మి చేర్చిన కసవు కుప్ప: చూ, పెంట. 1.

ఇంటిపెత్తనకత్తె, అం. చూ, దూతీచతుష్టయము.

ఇంటిపేరు, ద్వ. వి. గృహనామముల మార్పు

–: (గృహనామముల మార్పు) :–

(1) చెట్లనుబట్టి :– ఈతవారు, తాడివారు, జామివారు, వేపవారు, రావివారు, రేటకూరవారు, తోఁటవారు, చింతావారు, ఈశ్వరివారు, తుమ్మలవారు, బాదంవారు, మామిడివారు ఇత్యాది; (2) మృగములను బట్టి :– గుఱ్ఱంవారు, గొఱ్ఱెలవారు, గేదెలవారు, పోతులవారు, ఎద్దులవారు, పులివారు, వెలుగుబంటివారు, ఏనుఁగువారు, నక్కావారు, పిల్లివారు, కోడివారు ఇత్యాది; (3) పక్షులను బట్టి :– కాకివారు, డేగవారు, పిట్టావారు, పిచ్చుకవారు ఇత్యాది; (4) గ్రామములను బట్టి :– కాంద్రేగులవారు, కాకినాడవారు, కొట్టురువువారు, కొవ్రువారు, ప్రత్తిపాటివారు, బమ్మెరవారు, ముదిగొండవారు, బొడిలవారు, రావిపాటివారు, ద్రాక్షారామమువారు ఇత్యాది; (5) వస్తువులను బట్టి:– నాగవారు, పైండావారు, చెక్కావారు, గ్రంధివారు, ముత్యాలవారు, బంగారువారు ఇత్యాది; (6) స్థలములనుబట్టి:– అడవివారు, కొండవారు ఇత్యాది; (7) జలములను బట్టి:– గోదావరివారు, చెఱువు వారు ఇత్యాది; (8) వృత్తినిబట్టి:– పంచాంగంవారు, పురాణంవారు ఇత్యాది; (9) కాయలనుబట్టి :– బీరకాయలవారు, వంకాయలవారు ఇత్యాది; (10) ఆకులను బట్టి:– ఆకులవారు, చింతాకులవారు ఇత్యాది; (11) ఉద్యోగములను బట్టి:– ఉపాధ్యాయులవారు, కరణంవారు ఇత్యాది; (12) పౌరుషమును బట్టి:– తేజోమూర్తులవారు, సన్నిధానమువారు ఇత్యాది; (13, శరీరభాగములను బట్టి:– బుఱ్ఱవారు, ముక్కువారు, నోరువారు, గడ్డంవారు, కంఠంవారు, కాళ్ళవారు, చేయివారు, గోళ్ళవారు, వేళ్ళవారు ఇత్యాది: (14) సరీసృపములనుబట్టి:–పాము వారు, తేలువారు ఇత్యాది; (15) కవిత్వమునుబట్టి:– నిమిషకవివారు, వేములవాడ భీమకవి (వేములవాడవారు), ముక్కు తిమ్మనకవి(ముక్కువారు). బమ్మెర పోతన (బమ్మెరవారు), కొట్టరువు తిక్కన్న (కొట్టరువువారు) ఇత్యాది; (రమారమి 50 వేల యిండ్లపేళ్ళు వ్యుత్పత్తులతో "ఆంధ్రవాచస్పత్యకర్త" చే వ్రాయఁబడినవి. (మున్ముందు ప్రకటింపఁబడును.); చూ. గ్రామము. 1.

ఇంటియాతఁడు. ద్వ. వి. మగఁడు; చూ, భర్త. 1.

ఇంటిల్లిపాది, వా. వి. (ఇల్లు + ఇల్లు + పాది.) కుటుంబము వారందఱు.

ఇంటివాడు, ద్వా. వి. చూ, ఇంటికాడు.

ఇంటప్రోపడు, ద్వా. అ. క్రి. (ఇంట్రము + పడు.) తపించు హరి. ఉ. 9. ఆ. 159; చూ, సంతాపించు.

ఇంట్రోము, దే. వి. రూ-ఇంటరము, సంకటము. పై, 6, ఆ 84: చూ, శోకము. 2.

ఇంఘ, దే. వి. ఈత *: చూ, మధుఖర్జూరిక.

ఇంఘుగు, దే. వి. 1. కతకము *. రూ- ఇంఘువు: చూ, చిల్ల; 2. కతకబీజము. చూ, చిల్లగింజ. (రూ- ఇంఘువు.)

ఇండె, దే వి. 1. చీలిక; చూ, శకలము. 4; 2. ఎముక కీలు చూ, మాటు.

ఇండెవాయు, దే. అ. క్రి. చీలు: చూ, స్ఫోటించు.

ఇండ్లవడన. దే. వి. గృహాశ్రమము ; ఇలువదన.

ఇంత, ద్వా. స. (ఈ + అంత.) 1. ఈకొలది: కా. 2 ఆ. 178; ఇంతవట్టు, ఇంతయు - రూ - ఇంతె - ఇంతే, 2. ఇది యంతయు, ఈసమస్తము. ఇంతవట్టు; 3. ఇంతకాలము. చూ, అంత.

ఇంతకమున్ను, ద్వా. వి. ఇకాలమునకంటెం బూర్వకాలము: ఇదక. (వా.)

ఇంతటనుండి, ద్వా. వి. ఇప్పటినుండి. (రూ-ఇంతటినుండి. వా.)

ఇంతంత, ద్వా. స; చూ, ఇంత అంత.

ఇంతంతనరానిది, ద్వా. వి. పరిమితిచేయుటకు శక్యముకానిది; (రూ-ఇంతంత యనరానిది.)

ఇంతఅంత, ద్వా. స: చూ, ఇంతంత.

ఇంతలు, ద్వా. అవ్య. ఇంతపరిమాణము కలవనుట(వా): ఇంతలేసి.

ఇంతలేసి, ద్వా. అవ్య.—పై.—

ఇంతలో, ద్వా. వి. చూ, ఆలోచన.

ఇంతవట్టు, ద్వా. స. (ఇంత + పట్టు.) 1. ఇదియంతయు. చూ, ఇంత. 2; 2. ఇంతమాత్రము. చూ, ఇంత. 1; అవ్య. 3. ఇంతపర్యంతము; ఇంతవడి, ఇందనుక-రూ-ఇందాక.

ఇంతవడి, ద్వా. అవ్య: చూ, ఇంతవట్టు. 3.

ఇంతవింతలు, ద్వా. వి. బ. మిగులగొప్పవి.

ఇంతి, వై. వి. స్త్రీ. ఆడుది: చూ, స్త్రీ, 1.

ఇంతికౌపుంజు. ద్వా. వి. ఇంద్రుడు: చూ, వేలుపుతేడు.

ఇంతియ, ద్వా. స. (ఈ + అంతియ.): చూ, రూ-ఇంత. 1. (రూ-ఇంతె-ఇంతే.)

ఇంతేకాకుండ, వా. అవ్య. క్రి. విణ: చూ, అదిగాక.

ఇంద, దే. అవ్య. 1. ఇచ్చటనే: చూ, ఇచ్చట. 2; 2. ఇదిగో తీసికొనుము: ఇందండి, ఇందము; ద్ర. 3. ఈస్థానము; చూ, ఇందు. 3.

ఇందండి, దే. స. క్రి. నిత్య. బ: చూ, ఇంద. 2. (ఏ.ఇందము.)

ఇందనుక, ద్వా. అవ్య. (ఇంత + దనుక.): చూ, ఇంతవట్టు. 3. (రూ-ఇందాక.)

ఇందము, దే. స. క్రి. ని. ఇదిగో తీసికొనుము. రామా. 6, ఆ. 198; (బ. ఇందండి): చూ, ఇంద. 2.

ఇందఱు, ద్వా. స. (ఇంత + వారు-) 1. ఇంత శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము. వీరందఱు. (ఈపురుషులందఱు, ఈ స్త్రీలందఱు, ఈ స్త్రీ పురుషులందఱు. ; 2. ఇంత సంఖ్యగలవారు; అవ్య. 3. ఇయువర్థకము. (రూ-ఇందొఱు.)

ఇందాక, ద్వా. ప్ర. (ఇంత + దనుక.): చూ, రూ-ఇందనుక.

ఇంది, సం. వి. ఈ. స్త్రీ. లక్ష్మి: చూ, లక్ష్మి. 1.

ఇందిందిరము, సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, భ్రమరము.

ఇందిర, సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి: చూ, లక్ష్మి. 1,

ఇందీవరము, సం. వి. అ. న. 1. నల్లగలువ *: చూ, పద్మము. 1; 2. తామర *: చూ, సహస్రపత్రము. 1; 3. జుట్టుపు *: చూ, మలుపు.

ఇందీవరి, సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీచర *: చూ, శతమూలి.

ఇందీవరివరి, సం. వి. ఈ. స్త్రీ పెద్దపీచర *; చూ, శతమూలి,

ఇందీవరుడు, సం. వి. అ. పుం. లచ్చిమగడు; చూ, విష్ణువు. 1.

ఇందు, దే. అ. క్రి. 1. అడంగు. య. 4; అ: చూ, ప్రక్కు. 4; 2. అనుకూలపడు: చూ, సరిపడు 1; ద్ర. 3. ఈస్థానము: ఇంద, ఇక్కడ, ఇచట- రూ-ఇచటు - ఇచొటు- ఇప్పటి- ఇచ్చటు- ఇచ్చోటు- ఇచ్చో- ఇచ్చోటు, ఇట, ఇయ్యెడ, ఈ చోటు, ఈడ, ఈయెడ; (సం. ఇ.):—ఇహ.

ఇందుడు, సం. వి. ఉ. పుం. చందురుడు: చూ, హిమాంశువు.

ఇందుకళ, సం. వి. ఆ. స్త్రీ. పెఱుమద్ది *: చూ, సాలము.3.గ.

ఇందుకాంతము, సం. వి. అ. పుం. వెంకి: చూ, లోహము.1-ళ.

ఇందుక్షయము, సం. వి. అ. పుం. అమవస: చూ, సూర్యేందు సంగమము.

ఇందుగు, దే. వి: చూ, రూ-ఇంఘుగు*. "ఏ, గీ. అందుగులు - గేదంగులుమఱ్ఱి లిందుగులును." అప్ప. సుం. కాం: చూ, సల్లకి.

ఇందుజనకుడు, సం. వి. అ. పుం. కడలి: చూ, సముద్రము. 1.

ఇందునామము, సం. వి. న్. న. 1. కప్పురము: చూ, సిరము: 2. కంపిల్లము*: చూ, రోచని.

ఇందుప్పు, ద్వా. వి. (ఇందు + ఉప్పు.) సైంధవలవణము, చెందుప్పు: చూ, లవణము. 1-౨౦.

ఇందుభము, సం. వి. అ. న. మృగశిర, జింకతల రిక్క: చూ, రిక్క. 1-౫.

ఇందులకు, దే. ద్ర. 1. ఇచ్చోటికి. "ఉ. ఇందులకెమ్మెయిన్ మనుజులెన్నడు వత్తురె." భార. ఆది. 6, అ: ఇచ్చోటికి; 2. చూ, దీనికి.

ఇందులేఖ, సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీగె *: చూ, సోమవల్లి; 2. అప్పృశ *: చూ, సోమలత; 3. చంద్రరేఖ: చూ, శశికళ.

ఇందువారము, సం. వి. అ. పుం. సోమవారము: చూ, వారము.2.

ఇందువు, సం. వి. ఉ. పుం. 1. తిందుకము *: చూ, తుమికి. 2. ముక్కు ఎడమరంధ్రము: 3. పలమెత్తువెండి. (పావు శేరువెండి అని సర్వశబ్ద సంబోధిని); 4. చందురుడు చూ, హిమాంశువు. 5. కప్పురము: చూ, సిరము; 6. మృగశిర: చూ, రిక్క. 1-౫; 7. ఒకటి అనుసంఖ్యకు సంకేతపదము దే. వి. (1)చిల్ల *: చూ, సల్లకి; 2. కతకబీజము: చూ, చిల్లగింజ. (రూ- ఇంఘుగు-ఇందుగు.)

ఇందువ్రితము. సం. వి. అ. న. చాంద్రాయణ మను పేరుగల వ్రితము : చూ, చంద్రాయణము.

ఇందొఉ, చూ, ఇందఉ. 1, 2, 3.
ఇందన్, సం. వి. ఆ. స్త్రీ. వాసనగల ఒకానొక చెట్టు : చూ, మరువము.
ఇంద్రకకుభ, సం. వి. ఆ. స్త్రీ. ఏపె * : చూ, మద్ది.
ఇంద్రకము, అం. చూ, ఉత్తానకరణబంధములు.
ఇంద్రకీలము, సం. వి. అ. పుం. మందర పర్వతము, కవ్వపుఁగొండ : చూ, పర్వతము. 1-౬.
ఇంద్రకోశము, సం. వి; అ. పుం. 1. అరప : చూ, శయ్య. ; 2. తిట్టు : చూ, శాపము. 1.
ఇంద్రకోషము, చూ, రూ-ఇంద్రకోశము. 1.
ఇంద్రక్రియ, అం. చూ, క్రియాంగములు. (చూ, అంగము. 9.)
ఇంద్రగణములు, అం. భ, ర, త, నగ, నల. సలములు. (6.)
ఇంద్రగోపకము, సం, వి, అ, పుం : చూ, పట్టుపురుగు.
ఇంద్రగోపము, —పై.—
ఇంద్రచాపము, సం. వి. అ. న. 1. చూ, ఇంద్రధనువు; 2. సూర్యున కెదురుగానుండు మేఘము : చూ, మేఘము. 1.
ఇంద్రజాల, అం. చూ, కళలు.
ఇంద్రజాలసాధనమునకు ప్రయోజనములు, వా. రక్షణ. శక్తి. కౌతుకము. (3.)
ఇంద్రజాలము, సం. వి. అ. పుం. 1. కనుకట్టు విద్య : చూ, మాయము. 1; 2 చూ, ఉపాయములు.
ఇంద్రజాలికుఁడు, సం. వి. అ. పుం. కనికట్టు విద్య చేయువాఁడు : చూ, ప్రాతిహారకుఁడు.
ఇంద్రజిత్తు, సం. వి. త్. పుం. 1. గరుత్మంతుఁడు : చూ, హరివాహనుఁడు; 2. రావణుని పెద్దకొడుకు : ఇంద్రారి.
ఇంద్రతూలము, సం. వి. అ. న. గ్రీష్మహాసము : చూ, దూది ప్రోవు.
ఇంద్రద్రుమము, సం. వి. అ. పుం. ఏఱుమద్ది * : చూ, మద్ది.
ఇంద్రద్రువు, సం. వి. ఉ. పుం.—పై.—
ఇంద్రధనువు, సం. వి. ఉ. న్. పుం. న. కొఱడు : చూ, బాణము 1-౧౬. (రూ-ఇంద్రధనుస్సు.)
ఇంద్రనగరి, సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రునిపట్టణము : చూ, దేశములు. 1-౬౧-(౪)-౨.
ఇంద్రనామము, సం. వి. న్. పుం. 1. గుగ్గిలము * : చూ, గుగ్గులువు; 2. గుడ్లగూబ : చూ, సకినంపుఁబులుఁగు; 3. అజ్జివాలు; చూ, పుంజు.
ఇంద్రనీలము, సం. వి. అ. పుం. నెమలిమెడ చాయవంటి చాయగల నీలమణి : చూ, రత్నములు.౬.
ఇంద్రపుత్త్రుఁడు, సం. వి. అ. పుం. కుబేరునికి వాహనమైన మనుజుఁడు, ఇంద్రుని కొడుకు : చూ, జయంతుఁడు.
ఇంద్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. కలికాలియను తఱిగొబ్బి * : చూ, హాలిని.
ఇంద్రభోగము. జా. ఎక్కువభోగము."పరిభవ మునీంద్రభోగమె దొరకెఁగా." విజయవిలాసము.
ఇంద్రమహాకాముకము, వా. వి. కుక్క; చూ, శునకము. (వర్షాకాలారంభమున కామవికారముగలది. చిత్తకార్తెకుక్కల లక్షణము.)
ఇంద్రము, సం. వి. అ. పుం. 1. కాకిచెఱకు * : చూ, శరము 2. చతుర్దశసంఖ్య : చూ, పదునాలుగు; 3. చూ, ఇంద్రనీలము; అం.4 చూ, రూ-ఐంద్రము; 5 చూ, ఖండములు.
ఇంద్రమూర్ధము, సం. వి. న్. పుం. పుట్ట : చూ, వల్మీకము.
ఇంద్రయవము, సం. వి. అ. న కొడిసె * : చూ, వత్సకము (కొడిసెకాయ.)
ఇంద్రలుప్తకము, సం. వి. అ. న. పేనుకొఱుకుట: చూ, బట్టతల.
ఇంద్రలుప్తకుఁడు, సం. విణ. ఖల్వాటుఁడు : చూ, బట్టతలవాఁడు.
ఇంద్రలుప్తము, సం. వి. అ. పుం. 1. —పై—; 2. పేను చూ, యూకము.
ఇంద్రలోకము, సం. వి. అ. పుం. 1. దేవేంద్రుని పట్టణము : చూ, దేశములు; 1-౬౧-(౪)-౨ 2. జేజేపట్టు : చూ స్వర్గము.
ఇంద్రవంశము, అం. ఒకానొకవృత్తము. ఈవృత్తమునందొక్కొక్క పాదమునందు త, త, జ, రలు గలదై ఎనిమిదవ యింట యతిగల ద్వాదశఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా. "ఇందీవరాక్షుల్ తగ । నింద్రవంశమా, నందంబునం దాడిరి । నందసూతిపై, డెందంబులన్మోహము। దేవమీఱఁగాఁ బొందై గజక్రాంతులు । పూనఁదాఁ్రజలన్." చూ, వృత్తము. 1.
ఇంద్రవజ్ర, అం. ఒకానొక వృత్తము, ఇందు ఒక్కొక్క పాదమున త, త, జ, గ, గములతోఁగూడి ఎనిమిదవయింట యతిగలిగి ఏకాదశ ఛందస్సు నందుఁబుట్టిన వృత్తము. ఉదా.— "ఇంపల్పనాపాడుదు । రింద్రవజ్రల్, స్వాంతంబునన్ మోహము । సంధిలంగన్, దంతావళక్రాంతిని । తాజకాంచ, ప్రాతంబునంగద్వయ । మందమందన్." చూ, వృత్తము. 1.
ఇంద్రవల్లి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఇల్లింద * : చూ, మాదలుంగము; 2. చూ, సవిరేల * : 3. పారిజాతలత * ; 4. గవాదని * : చూ, పెద్ద పాఁపర.
ఇంద్రవారుణి, సం. వి. ఈ స్త్రీ: చూ, పెద్ద పాఁపర *.
ఇంద్రవారుణిక, సం. వి. ఆ. స్త్రీ.—పై.—
ఇంద్రవ్యాకరణము, అం. చూ, వ్యాకరణములు.
ఇంద్రశిఖ. అం. చూ, శిఖలు.
ఇంద్రసాహ్వా, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఇంద్రవారుణి.
ఇంద్రసురసము, సం. వి. అ. పుం. నిర్గుండి * : చూ, వావిలి.
ఇంద్రాక్షము, సం. వి. అ. న. 1. ఇంద్రాక్షపూస: అక్షము; 2. శృంగి * : చూ, వృషభ.
ఇంద్రాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి, 1: 2. ఒకానొకమంత్రము. (పంటి బిడ్డల యాయురారోగ్యాభివృద్ధికిని, పీడాపరిహారమునకును విభూతితో ఇంద్రాక్షిని మంత్రించి యిచ్చెదరు.)
ఇంద్రాగ్నిధూమము, సం. వి. అ. పుం. మంచు. "హిమమింద్రాగ్నిధూమశ్చ ఖబాష్పో రజనీ జలం." హరావళి: చూ, హిమము. 1.
ఇంద్రాణి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రుని భార్య: చూ, భార్య: 1-౭; (చూ, శచి); 2. చూ, మాతృకలు; 3. నిర్గుండి *. చూ, వావిలి; 4. ఎఱ్ఱవస *.; చూ, రక్తవస; 5. స్త్రీవిలాసచేష్ట.

సంభోగక్రియా భేదము; చూ, రతిబంధము; 6. యజమానురాలు: చూ, స్వామిని, అం. 7. చూ, శంత్రములు; అం. 8. చూ. మాతలు.

ఇంద్రాణిక, సం. వి. ఆ. స్త్రీ. నిర్గుండి * చూ, వావిలి.

ఇంద్రాణికము, అం. చూ, ఉత్తానకరణ బంధములు. (చూ, బంధములు.)

ఇంద్రాయుధము, సం. వి. అ. న. 1. దేవేంద్రుని విల్లు; చూ, ఇంద్రధనువు; 2. మేఘములందు నానావర్ణమై ప్రతిఫలించుచు ధనురాకారముగాఁ గానఁబడియెడి సూర్య కిరణము; చూ, మయూఖము. 1; పుం. 3. కాటుకకన్నుల గుఱ్ఱము; చూ, హయము

ఇంద్రారి, సం. వి. ఇ. పుం: చూ, ఇంద్రజిత్తు 1. 2; 3. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

ఇంద్రావరజుఁడు, సం. వి. అ. పుం. లచ్చిమగఁడు: చూ. విష్ణువు. 1.

ఇంద్రావరజుఁడు, సం. వి. అ. పుం. — పై. —

ఇంద్రాసనము, సం. వి. అ. న చౌటిపట్టు: చూ. భూమి. 1.

ఇంద్రియజయాధ్యాయము, అం. చూ, కామందకము.

ఇంద్రియ నిగ్రహము, అం. చూ, సాత్త్విక గుణములు.

ఇంద్రియము, సం. వి. అ. న. 1. వీర్యము: చూ, రేతస్సు, 1; 2. అయిదను లెక్క: చూ, పంచకము.

ఇంద్రియములు, అం. 1. జ్ఞానద్వారములు, జ్ఞానేంద్రియములు. — త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము. (5) 2. కర్మేంద్రియములు.- వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ (5); 3. మనస్సుతోడంగూడ ఏకాదశేంద్రియము లనంబడు, (1) = (11), 4, ఇంద్రియముల సమూహము: అక్షమాల.

ఇంద్రియార్థము, సం. వి. అ. పుం. ఇంద్రియవిషయములగు శబ్దము మొదలైన పంచభూతముల గుణములు.— శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. (5); (చూ, విషయములు. 3.,: చూ, హృషీకము.

ఇంద్రియ విషయములు, అం. గంధము, రూపము, రసము, స్పర్శము, శబ్దము. (5)

ఇంద్రియసర్గము, అం. చూ, సృష్టిసర్గములు.

ఇంద్రుఁడు, సం. వి. అ. పుం. 1. దేవేంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; అం. 2. చూ, ఆదిత్యులు; వి. 3. జీవుఁడు: చూ, హంసుఁడు; 4. చూ, సూర్యుఁడు: 5. స్వజాతి సమూహము లోముఖ్యుఁడు. 6. నాగుఁబాము: చూ, సర్పము; 7. ఆఁబోతు చూ, వృషభము, 1. ౧; విశ. 8. అధిపతి: చూ, ప్రభువు. 1; అం. 9. చూ, దిగధిపతులు.

ఇంధనము, సం. వి. అ. న. 1. చిదుగు: చూ, సమిధ; 2. వంటకట్టియ: చూ, వంటచెఱకు.

ఇంపారు, దే. అ. క్రి. ఆనందించు: చూ. సంతోషించు.

ఇంపితము, దే. విశ. (ఇంపు + ఇతము.) ఇంపైనది. (ఇది పోలితమువంటిది.): చూ, రమ్యము.

ఇంపు, దే. వి. ఆనందము, స్వా, 2. ఆ. 62: చూ, సంతోషము; 2. ఇచ్ఛ. చూ, వాంఛ: విశ. 3. ఇచ్ఛవచ్చినట్లు, కళా. 7, ఆ. 92: చూ, యథేచ్ఛము; 4. వస్త్రభూషణముల వలన శోభ: చూ; సౌందర్యము. (రూ-ఇంబు.)

ఇంపైనవాఁడు, దే. విశ. అందగాఁడు: చూ. సౌందర్యవంతుఁడు.

ఇంపొలయు, దే. అ. క్రి: చూ, సొగసుఁగాంచు.

ఇంబు. దే. వి. 1: చూ, రూ - ఇంపు.

ఇఁక, దే. ప్ర. 1. ఇకమీదట: చూ, ఇంతకుమున్ను: 2. పునరర్థకము, మరల. చూ, వెండియు, (రూ-ఇఁగ.): వా. 3. ఇఁకయొక్క ఉత్తము లాలించవచ్చునని కొందఱు "ఇఁక సేవించి తరించుసంచను" (విం॥ స॥ గాను. విజయనగరము)

ఇఁకమీఁద, దే. అవ్య. పురార్థ పురోర్థము: చూ, ముందఱ. 1.

ఇఁకమీఁదట, దే. అవ్య — పై. —

ఇఁడి, దే. అవ. అభావార్థమునందు వచ్చు ప్రత్యయము. "ముక్తి డి సిగ్గిఁడి." మొ.

ఇక్క, దే. వి. 1. తానము. చూ, స్థానము. 1; 2. ఇల్లు: చూ, సదనము. 1.

ఇక్కట్టు, దే. వి. (ఇక్కు + కట్టు.) సంకటము, ఇక్కుపాటు, (ఇక్కు ఇఱుకుయొక్క మాఱు రూపమని తెలియవలెను.): చూ, శోకము. 2.

ఇక్కడ, దే. వి. ప్ర. (ఈ + కడ) 1. ఈచోటు: చూ, ఇచట. 3; ప్ర. 2. ఇచ్చటనే: చూ, ఇచ్చట. 2.

ఇక్కము, దే వి. ఇఱుకటము. సంకటము: చూ, దుఃఖము.

ఇక్కుపాటు, దే. వి. (ఇఱుకు + పాటు.) — పై.—

ఇక్కువ, దే. వి. 1. తానము. చూ, స్థానము. 1; 2. ఇల్లు, ఉనికి. విజ. 2. ఆ. 165; చూ, సదనము. 1; 3. జాడ, అందు లరహస్యము, ఆచూకి. చూ, సూచన. 1; 4. కళాస్థానము. కళలుండు స్థలములు పందొమ్మిదియుగాక తద్విశేషములలో నొకటి. చూ, కళలుండు స్థలములు.

ఇక్షుక, సం. వి. ఆ. స్త్రీ. తిప్ప తెల్లు. *: చూ, బాణ.

ఇక్షుకుట్టకుఁడు, సం. వి. అ. పుం. 1. క్షత్రియస్త్రీకి శూద్రునకుం బొడమి అయిదువిధముల సారాయిని అమ్మువాఁడు: చూ, సురాజీవి; 2. కల్లువెంపువాఁడు, గవుండ్లవాఁడు: చూ, సురాజీవి.

ఇక్షుకుసుమ, సం. వి. ఆ. స్త్రీ. తిప్పతెల్లు. *: చూ, బాణ.

ఇక్షుగంధ, సం. వి. ఆ. స్త్రీ. 1. గొలిమిడి *: చూ. మొగవీర: 2. తెల్లనేలగుమ్ముడు *: చూ, భూమి కర్జూరపు: 3. ఆశ్వలాయనదర్భ, కాకిచెఱకు *: చూ, శరము; 4. ఏనుఁగు పల్లేరు *: చూ, స్వాదుకంటకము. 1-౧.

ఇక్షుజము, సం. వి. అ. పుం. ప్రేంకణపు చెట్టుయొక్క నీడగల చెఱకునుండి పుట్టిన ముత్తియము: చూ, రత్నము. 1-౧. (౨.).

ఇక్షుధన్వుఁడు,- సం. వి. న్. పుం. ఇంచు విలుకుఁడు: చూ, మన్మథుఁడు.

ఇక్షునాశిక, సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱకు *: చూ, రసాలము. 3.

ఇక్షుపుంఖము, సం. వి. అ. పుం. శరపుంఖము *: చూ, వెంపలి.

ఇక్షురంక, సం. వి. ఆ. స్త్రీ. శణము, తెల్లు *: చూ, శరము.

ఇక్షురము, సం. వి. అ. పుం. గొలిమిడి *: చూ, మొగవీర.

ఇక్షువణము, సం. వి. అ. న. చెఱకుతోఁట: చూ, మధుతృణవనము.

ఇక్షువనము, —పై.—

ఇక్షువల్లి, సం. వి. ఈ. స్త్రీ. పాలనేల గుమ్మడి * : చూ, భూమి కూష్మాండము.

ఇక్షురము, సం. వి. ఉ. పుం.= ఇంచు. * : చూ, రసాలము. 3.

ఇక్షుశరాసనుఁడు, సం. వి. న్. పుం: చూ, ఇక్షుధన్వుఁడు.

ఇక్షుశాకటము, సం. వి. అ. న. చెఱకు పండఁదగిననేల: చూ, భూమి. 1.

ఇక్షుశాకినము, సం. వి. అ. న. — పై. —

ఇక్షుసముద్రము, సం. వి. అ. పుం: చూ, ఇంచుపాల కడలి. (చూ, సముద్రము.)

ఇక్షుసాయకుఁడు, సం. వి. అ. పుం: చూ, ఇక్షుశరాసనుఁడు.

ఇక్షూదము, సం. వి. అ. పుం: చూ, ఇక్షుసముద్రము.

ఇక్ష్వాకువు, సం. వి. ఉ. పుం. 1. సూర్యవంశపు రాజులలో నొకఁడు; చూ, రాజు. 1; స్త్రీ. 2. చేఁదుసొర * : చూ, సొఱ; 3. అందుగు, చిల్ల * : చూ, సల్లకి.

ఇక్ష్వారిక, సం. వి. ఆ. స్త్రీ. కాశము, పెల్లు * : చూ, శరము.

ఇక్ష్వాలిక, సం. వి. ఆ. స్త్రీ. బల్బజము, మొదవగడ్డి * : చూ, తృణము. 1. (రూ-ఇక్ష్వాళిక.)

ఇగము, వై. వి. 1.= హిమమ్. రూ-ఇవము: చూ, హిమము. 1; 2. జలుబు: చూ, శైత్యము.

ఇగిరించు, దే. అ. క్రి. 1. చిగిరించు: చూ, పల్లవించు; 2. ఎఱ్ఱనగు. చూ, పల్లటిల్లు.

ఇగిరిక, దే. వి. అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురఁబెట్టిన యన్నము: చూ, హవిస్సు. 1 (రూ-ఇగిరికె.)

ఇగిలించు, దే. స. క్రి. పండ్లిగిలించు- రూ- ఇగుల్చు- ఇవులుచు- ఇవుల్చు.

ఇగురు, దే. వి. 1. రూ-ఇవురు, మొలక: చూ, మొక్క. 1; 2. రూ-ఇవురు; చిగురు: చూ, విద్రుమము; 3. పండ్లచుట్టు నుండుకండ: రూ-ఇవురు; అ. క్రి. 4. ఇంకు, వట్టు, ఎండు చూ, శోషించు. (రూ-ఇవురు.)

ఇగురుఁబోఁడి, దే. వి. (ఇగురు+బోఁడి.) 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ.

ఇగురుకొను, దే. అ. క్రి. ఇగిరించు : చూ, పల్లవించు.

ఇగురుచు, దే. అ. క్రి. —పై.—(రూ-ఇగుర్చు.)

ఇగురువిలుతుఁడు, ద్వి. వి. మరుఁడు : చూ, మన్మథుఁడు. (రూ-ఇగురువిల్తుఁడు.)

ఇగురొత్తు, దే. అ. క్రి. 1. చిగిరించు : చూ, పల్లవించు; 2. అనురక్తమగు. చూ, చిగురొత్తు.

ఇగులుచు, దే. స. క్రి: చూ, ఇగిలించు (రూ-ఇగుల్చు.)

ఇగో, దే. ద్ర. చూ, చూపుటనుదెలుపును. జై. 3, ఆ. 114 ఇదిగో-రూ-ఇదిగో, ఇదియ-రూ-ఇదె.

ఇగ్గు, దే. అ. క్రి. రూ-ఈగు, వెనుకకొఱగు. చూ, వ్రాలు. 3.

ఇగ్గులాడు, దే. స. క్రి. వెనుకకీడ్చు. రసి. 3, గుచ్ఛము.

ఇగ్రుచు, దే. అ. క్రి: చూ, రూ-ఇగురుచు.

ఇచ్చినదానిని మరలించుట, అం. చూ, వివాదములు.

ఇచట, దే. వి. ఏ. ద్ర. ఈస్థానము : చూ, ఇందు. 3.

ఇచటు, దే. వి. ఏ.—పై—(రూ-ఇచోటు.)

ఇచ్ఛ, వై. వి.=ఇచ్ఛ. 1. చిత్తము. చూ, హృదయము; 2. యదృచ్ఛ. ఇంపు. చూ, యథేచ్ఛము; వై. విణ. 3. కోరిక. చూ, వాంఛ,

ఇచ్చకమాడు, దే. స. క్రి. అచ్చిక బుచ్చికలాడు: చూ, బుజ్జగించు.

ఇచ్చకము, వై. వి. 1=ఇచ్ఛ. ఇష్టోక్తి : చూ, బుజ్జగింత. 1; విణ. 2. కూరిమి. చూ, స్నేహము. 1.

ఇచ్చకాలమారి, వై. విణ. ఇచ్చకుఁడు : చూ, ప్రియవాది.

ఇచ్చకుఁడు, వై. విణ.—పై.—

ఇచ్చగలవాఁడు, దే. విణ. కాముకుఁడు: చూ, వలపుకాఁడు.

ఇచ్చగించు, వై. స. క్రి. 1. = ఇచ్ఛించు; చూ, వాంఛించు; 2. ఒప్పుకొను. చూ, సమ్మతించు.

ఇచ్చగింత, వై. వి. = ఇచ్ఛ. ఇమ్ముకోలు; చూ, సమ్మతి. 1.

ఇచ్చగొండి, వై. విణ: చూ, ఇచ్చకాలమారి.

ఇచ్చట, దే. వి. ఏ. ద్ర. 1. ఈస్థానము : చూ, ఇందు. 3; 2. ఇచ్చటనే : ఇంద, ఇక్కడ, ఇచ్చో.

ఇచ్చటు, దే. వి. ఏ. ఈస్థానము: చూ, ఇందు. 3. ఇచ్చనుండువాఁడు. ద్వి. వి. అడ్డపాటులేనివాఁడు: చూ, స్వతంత్రుఁడు.

ఇచ్చు, దే. స. క్రి = ఒసఁగు; చూ, దయచేయు.

ఇచ్చునపుడు, కామునిపండుగు, పుచ్చుకొనునపుడు దీపావళి పండుగు. లో. ఒకానొక లోకోక్తి.

ఇచ్చువాఁడు. దే. వి. ఇడువాఁడు: చూ, దాత.

ఇచ్చోటు, దే. వి. ఏ. (ఈ+చోటు.) ఈస్థానము: చూ, ఇందు 3. (రూ-ఇచ్చోటు.)

ఇచ్చో, దే. ద్ర. 1.—పై.—; 2. ఇచ్చటనే: చూ, ఇచ్చట. 2.

ఇచ్ఛ, సం. వి. ఆ. స్త్రీ = ఇచ్ఛ: చూ, వాంఛ.

ఇచ్ఛాదులు, అం. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. 3.

ఇచ్ఛామతి, వా. వి. ఏబదిసంవత్సరములు వీడు జవ్వనముగల స్త్రీ చూ, స్త్రీ. 1-౨౫౮.

ఇచ్ఛామాత్రా ప్రభోస్సృష్టిః, న్యా. ఈశ్వరునికి సృష్టికార్యము ఇచ్ఛామాత్రము.

ఇచ్ఛావతి, సం. వి. ఈ. స్త్రీ. గంధపుష్పాలంకారముల కాసపడు స్త్రీ, సంభోగముతక్క తక్కిన విషయములందు ఇచ్ఛగల ఆఁడుది: చూ, స్త్రీ. 1-౩౬.

ఇచ్ఛావసుఁడు, సం. వి. ఉ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు:

ఇచ్ఛాశక్తి. అం. 1. చూ, ఇచ్ఛాదులు; అం. 2. చూ, శక్తులు.

ఇజారా, దే. వి. గుత్త-రూ-గుత్తగ-గుత్తవ.

ఇజారాదారు, దే. విణ. గుత్తయెత్తినవాఁడు: చూ, పాలెగాఁడు.

ఇజారాదారుఁడు, —పై, —

ఇజారు, దే. వి. రూ-హిజారు," కాళ్ళకు తొడుగుకొను లాగు, చూ, వస్త్రము.

ఇఙాకు, దే. వి. 1. ఇక్కట్టు, సంకటము: చూ, దుఃఖము; 2. అలసట: చూ, శ్రమము. 1.

ఇజ్జలము, సం. వి. అ. పుం. రూ-హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు. *: చూ, హయమారకము.

ఇజ్య, సం. వి. అ. స్త్రీ. 1. కైసేఁత, పూజ: చూ. సపర్య; 2. ఈవి, చూ. వితరణము; 3. జన్నము; చూ, యజ్ఞము; 4. భూమి; చూ, భూమి, 1; 5. కలయిక ; చూ, సంయోగము 6. తల్లి: చూ, మాత 1; 7. పెంపెనకత్తె: చూ, కంభళి.

ఇజ్యాశీలుఁడు, సం. వి. అ. పుం. పలుమాఱు యాగము సేయువాఁడు: చూ, యాయజూకుఁడు.

ఇజ్యుఁడు, సం. వి. అ. పుం. 1. బృహస్పతి. చూ, వేలుపుటొజ్జ; విణ. 2. ఒజ్జ: చూ, పంతులు. 1; 3. మంచికులమునఁ బుట్టినవాఁడు. సత్కుల ప్రసూనుఁడు: చూ, సజ్జనుఁడు; 4. అంతఃపుర పాలకుఁడు: చూ, సౌవిదల్లుఁడు.

ఇట, దే. వి. ఏ. 1. ఈస్థానము. చూ, ఇందు. 3; క్రి. 2. ఈ ప్రక్క, ఈవల.

ఇటఁబట్టి, దే. అవ్య. ఇది మొదలుకొని (ఈపైని యని భవిష్యత్కాలముం దెలుపును.) ఇటమీఁద.

ఇటక, వై. వి.= ఇష్టక. రూ-ఇటిక-ఇటికె-ఇటుక-ఇట్టిక-ఇట్టికె-ఇట్టుక: చూ, రత్నము. 1-౧౫-(౯).

ఇటకసూయి, ద్వా. వి. భూమి లోపలనుండి పైకి కట్టిన నుయ్యి: చూ. సరస్సు. 1-౧౫ - (౫).

ఇటఁబడి, దే. క్రి: చూ, ఇటఁబట్టి.

ఇటిక, వై.= వి. ఇష్టక: చూ, రూ- ఇటక.

ఇటికపగడము, వై. వి. తిక్కాడి: చూ, పట్టిపగడము.

ఇటికె, వై. వి. = ఇష్టక: చూ, రూ - ఇటక.

ఇటు, దే. అవ్య. రూ - ఇట్టు, ఏవమర్థకము. కళా. 1, ఆ. 58: చూ, ఏవమ్. 5.

ఇటుక, వై. వి. = ఇష్టక: చూ, రూ - ఇటక.

ఇటుకనూయి, ద్వా. వి. చూ, ఇటకసూయి.

ఇటుల, దే. క్రి. ఈప్రకారముగ: చూ, అవలీవల.

ఇటులు. దే. అవ్య. ఇటు: చూ, ఏవమ్. 5. (రూ-ఇట్టులు.)

ఇటువంటి, దే. విణ. ఇట్టి. కళా. 3, ఆ. 88: ఇట్టి.

ఇటువలె, దే. క్రి. ఇటు. రామా. 6, ఆ: చూ, ఏవమ్. 5. (రూ-ఇట్టువోలె.)

ఇట్చరము, సం. వి. అ. పుం. ఆచ్చుటెద్దు: చూ, వృషభము 1-౧.

ఇట్టలము, దే. విణ. 1. చేవ: చూ: స్థైర్యము, 1; 2. తిరము; చూ, స్థిరము; 3. అధికము. స్వా. 4, ఆ. 43: చూ, హేరాళము. 1 - ౫.

ఇట్టలు, దే. వి. లంఘువిశేషము, పేరెమ్ములు. చూ, లంఘు.

ఇట్టి, దే. విణ. చూ, ఇటువంటి.

ఇట్టిక, వై. వి. = ఇష్టక: చూ, రూ - ఇటక.

ఇట్టికె. వై. వి. = — వై. —

ఇట్టు, దే. అవ్య, రూ - ఇటు: చూ, ఏవమ్. 5.

ఇట్టుక, వై. వి. = ఇష్టక: చూ, ఇటక.

ఇట్టుపు. వై. వి. దుట్టుపు * (మేఁక కొమ్ములవంటి ఫలములు గలది.): చూ, విషాణి.

ఇట్టులు, దే వి. రూ - ఇటులు: చూ, ఏవమ్. 5.

ఇట్టువోలె, దే. క్రి, చూ, రూ - ఇటువలె. — వై. — భార. శాం. 2, ఆ. 95.

ఇట్లు, దే. అవ్య. — వై. — (రూ - ఇటులు - ఇట్టులు.)

ఇడ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఇండునాడి, (ప్రాణాయామ విషయమున నాడులు మూఁడు. ఇడ, పింగళ, సుషుమ్న.) మున్నగు మరంధ్రము: 2. నేల: చూ, భూమి. 1; 3. పురోడాశపాత్రము, చూ, పాత్రము. 6, 3౬; 4. బుధగ్రహముయొక్క పెండ్లాము; చూ, భార్య, 1-౮౦; 5. మాట, చూ, వట్టము; 2, 6. ఆవు; చూ, ధేనువు; 7. విన్నప్రోలు: చూ, స్వర్గము; 8. అంత్రము: చూ, ప్రేవు. 9. వాయువేప్పని పట్టపురాణి: చూ, భార్య, 1-౫౫: అం. 10. చూ, మహీనతానుబులు; 11. చూ, నాడులు.

ఇడి. దే. వి. ఒకతూరి పూపెరిని ఒకతూరి మోటను వండిన పిండిని తామరనూలిపోఁగంత సన్నముగా యంత్రమునఁ దింపెడు భక్ష్యవిశేషము. చూ, భక్ష్యము.

ఇడిక. సం. వి. ఆ. స్త్రీ. నేల; చూ, భూమి. 1. (చూ.౧.)1-౧౨

ఇడిసుడుక, దే. వి. — వై. —

ఇడిసుడుము, దే. వి. — వై. —

ఇడిక్కము, సం. వి. అ. పుం. మేఁక: చూ, మేషము. 1.

ఇడియఁగొట్టు, దే. స. క్రి. అవమానపెట్టు: చూ, హేళనముచేయు.

ఇడియు, దే. అ. క్రి. చీలు, హం. 1, ఆ. 118; చంద్రా. 4, ఆ. 192: చూ, స్ఫోటిల్లు.

ఇడు, దే. స. క్రి. 1. ఇచ్చు: చూ, వయచేయు. 2; 2 ఉనుచు: ఉంచు, ఉంచఁజేయు, ఉనుచు; (సం. ప) :— ఉపన్యసించు.

ఇడుగడ, దే. వి. 1. మంచిగుణములుగల దానియందు దోషము నారోపించుట. భార. ఆది. 2, ఆ. 93: చూ, అసూయ; 2. హీనత్వము. విజ్ఞా. ఆచా. కాం. 111. (ఇది విచార్యము.) చూ, హీనము. 1-౬.

ఇడుపు, దే. వి. 1. వైపు. చూ, పార్శ్వము. 2; 2. గోడ యిరుపార్శ్వములందుండు చోటు. వై. 7, ఆ. 151: చూ, హెడికట్టు; 3. పీడిక. ఆము. 6, ఆ: చూ, కళలము. 4.

ఇడుము, దే. వి. 1. ఆపద. చూ, విపత్తు; 2. అలసట. మార్క. 4, ఆ. 249: చూ, శ్రమము. 1; 3. కష్టము, కడగండ్లు: చూ, శోకము; 2. 4. వగ, వంత: చూ, శోకము 2.

ఇడుమపాటు, దే. వి, చూ, ఇడుముడిపాటు.

ఇడుముకొను, దే. అ. క్రి. ఆక్రమించు: చూ, ముగరించు.

ఇడుముడి, దే. వి. కష్టము; కడగండ్లు, చూ. శోకము, 2.

ఇడుముడిపాటు, ద్వే. వి. చూ, ఇడుము. 1. 2. 3. 4

ఇడువాఁడు, దే. వి. ఇచ్చువాఁడు: చూ, దాత.

ఇడ్డెన, వై. వి. = ఇడియూఱ. వాసెన కుడుము: చూ, భక్ష్యము; ౧ - ౫

ఇత్వరము, సం. వి. అ. పుం. ఆఁబోతు : చూ, వృషభము. 1-౧.

ఇతఁడు, దే. స. ఏ. 1. ఈపూజ్యుఁడు: ఇతగాఁడు, ఈతఁడు, ఈతగాఁడు: ఈయన; 2. ఈమనుష్యుఁడు, ఇతగాఁడు, ఈతఁడు, ఈతగాఁడు, ఈయన.

ఇతఃపరము, సం. క్రి. విణ. అ. న: చూ, ఇంతకమున్ను.

ఇతకరి, వై. వి. = హితకారి. హితము సేయువాఁడు: చూ, హితవరి.

ఇతగాఁడు, దే. స. పుం: చూ, ఇతఁడు.

ఇతము, సం. విణ. (అ. ఆ. అ.) 1. చెందఁబడినది: చూ. అభిప్రేతము; 2. నడవఁబడినది; 3. పొందఁబడినది; చూ, సంప్రాప్తము. 1; 4. తెలివి: చూ, బుద్ధి; వై. విణ. (1) = హితమ్, చెలిమి. కిరా. 3, ఆ. 61: చూ, స్నేహము. 1. (అప్పటి కప్రియముగా నుండినను పిదపటికి మేలు కలుగఁజేయునది.)

ఇతరము, సం. స. 1. అన్యము: చూ, పరాయి; వి. 2. తక్కువ: చూ, వెలితి. 2.

ఇతరుఁడు, సం, స. 1. అన్యుఁడు: చూ, వేఱయినవాఁడు; 2. అధముఁడు: చూ, హీనుఁడు; 3. అజ్ఞాని; చూ, ప్రబ్బుఁడు;

ఇతరేతరద్వంద్వము, అం. చూ, ద్వంద్వములు. (1. ఇతరేతర ద్వంద్వము, 2. సమాహార ద్వంద్వము. 3. ఏకశేషము అని త్రివిధము.)

ఇతరేతరము, సం. స. ఒండొకటి; చూ, పరస్పరము.

ఇతరేద్యుస్సు, సం. పొంతావ్యయము: చూ, మఱునాఁడు.

ఇతవరి, వై. విణ = హితకారి. (ఇతవు + అరి.) హితము చెప్పువాఁడు: చూ, హితవరి.

ఇతవు, వై. వి. = హితమ్, రూ - హితవు. భార. అను. 5, ఆ. 206: చూ, స్నేహము. 1.

ఇతవుఁడు, వై. విణ. 1. = హితః, చెలికాఁడు. భార. ఉద్యో. 4. ఆ. 240: చూ, స్నేహితుఁడు. 1; 2: చూ, ఇతవరి.

ఇతివృత్తము, వా. వి. వస్తువనఁగా కథ. దీనికే ఇతివృత్త మని పేరు.

ఇతిహాసకులు, అం. చూ, సభాసప్తాంగములు. చూ, అంగము 9.

ఇతిహాసము, సం. వి. అ. పుం. 1. ప్రాచీనచరిత్ర బోధక వ్యాసాది ప్రణీతములైన భారతాదులు, తొల్లింటికత: చూ, సమాచారము. 2; 2. తెలివి: చూ, హ్యార్లేఖము, 2; 3. ఏర్పాటు: చూ, సత్యము 1-అ; అం. 3. చూ, కిళలు.

ఇతోభ్రష్ట స్తతోభ్రష్టః న్యా. ఏదియు లభింపక చెడినవాఁడు "రెంటికిం జెడిన రేవఁడు" అని తెలుగు సామెత.

ఇతోవ్యాఘ్ర ఇత స్తటీ, న్యా. ఇటు పులి ఇటు చఱియ (ఏట వాలుగా నున్న పర్వతభాగము) "ఇటు నుయ్యి ఆటు గొయ్యి" అని తెలుఁగు సామెత.

ఇత్కటము, సం. వి. అ. న. కోశాంగము: చూ, ఖరచ్ఛదము.

ఇత్తడి, వై. వి. పిత్తళమ్, చూ, లోహము. 1.అ. (రూ-ఇత్తళి.)

ఇత్తతి, దే. వి. (ఈ + తతి.) ఈ సమయము: చూ, సాంప్రతము. 2.

ఇత్తళి. చూ, రూ- ఇత్తడి.

ఇత్తిగ. ద్వి. వి.(ఇరు + తిగ.) 1. రూ-ఇద్దుగ. పాపికలమీది మూఁడువొద్దు అత: చూ. దుందుభి. 1; స. 2. రూ-ఇరుతిగ ఇత్తిగ: చూ, షట్కము.

ఇత్వ, సం. వి. ఆ. స్త్రీ. ఒకరకము పాలకి: చూ, పవారి. 1-ఇ.

ఇత్రాంగము, సం. వి. అ. న. కరణము: చూ, మగిడి.

ఇత్వరము, సం. వి. అ. పుం. అంకోతు. చూ. వృషభము. 1-ం.

ఇత్వరి. సం, వి. ఈ. స్త్రీ. కులట: చూ, అంకులాఁడి.

ఇత్వరుఁడు, సం, విణ. 1. అకించనుఁడు: చూ, బీదవాఁడు; 2. అధముఁడు: చూ, హీనుఁడు; 3. భయంకరమగు పని చేయువాఁడు; చూ, క్రూరకర్ముఁడు; 4. దారి నడచువాఁడు; చూ, పాంథచారి.

ఇదమ్, సం. విణ. ఏతచ్ఛబ్దార్థకము : చూ, ఇలయ్యాది.

ఇదానీమ్, సం. అవ్య. 1. వాక్యభూషణము: చూ. ఊతపదము; 2. ఇప్పుడు: చూ, సాంప్రతము. 2; 3. అంతట వ్యాపించినది; 4. పాదపూరణము; 5. కాంతి: చూ, వెలుతురు. 1.

ఇది, దే. స. రూ-ఇద్ది; చూ, ఇయ్యది.

ఇదిగో. దే. క్రి. (ఇది + కొమ్ము.) చూ, రూ-ఇగో. (రూ-ఇదిగో.)

ఇదిగో, దే. ద్ర.—వై.—కళా. 1, ఆ. 35.

ఇదియ, దే. అవ్య.—వై.—(రూ-ఇదె.)

ఇద్దరి, దే. వి. (ఈ + దరి.) అపారము : చూ, ఈవల.

ఇద్దఱు, దే. స. రెండు శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనాదేశము: ఇరుగురు-రూ- ఇరువురు-ఇవ్వరు.

ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు, ద్వి. వి. గణపతి : చూ, వినాయకుఁడు. 1.

ఇద్ది, దే. స. ఈశబ్దమునకు అమహదర్థక ప్రథమైక వచనము: చూ, రూ-ఇది.

ఇద్దుగ. ద్వి. స. (ఇరు + నుగ.) చూ, రూ-ఇత్తిగ ఉ. హరి. 3, ఆ, 121.

ఇద్దుము, ద్వి. వి. (ఇరు + తూము). రెండుతూములు: రూ-ఇరుదూము.

ఇద్దెస ద్వి వి. రూ-ఈదెస, ఈతట్టు; ఈకడ, ఈవంక, ఈవైపు

ఇద్ధము, సం. వి. అ. పుం. 1. కాంతి: చూ, వెలుతురు. 1; విణ. 2. పరిశుద్ధము: 3. వెలిగింపఁబడినది: చూ, ప్రకాశితము; 4. తపింపఁ జేయఁబడినది: చూ, తప్తము; అవ్య, 5. ఈ లాగు: చూ, ఇటు.

ఇధ్మము, సం. వి. అ. న. 1. చిదుగు : చూ, సమిధ; 2. వంట కట్టియ : చూ, వంటచెఱకు.

ఇని, ద్వి స. ఏ: చూ, రూ-ఇన్ని.

ఇనాము, దే. వి. 1. బహుమానము: చూ, సన్మానము 2. కొద్దిగ క్విటిరెంటు (పన్ను) కట్టియిచ్చిన శాశ్వతపు హక్కుగల భూమి. రూ-ఈనాము.(ఇనాము. = క్విటిరెంటుఇనాము దరిమిలా ఇనాము, మొ.)

ఇనుఁడు, సం, వి. అ. పుం. 1. పగటివేలుపు: చూ, సూర్యుఁడు; 2. అధిపతి : చూ, స్వామి. 1; 3. ఒకరాజు ; చూ, రాజు. 1; 4. ఆస్తికాఁడు; చూ, సంపన్నుఁడు; 5. మగఁడు: చూ, భర్త. 1.

ఇనుకు, దే. వి. 1. బొంతుచేతఁగప్పబడిన యల్పధాన్యము. చూ, ధాన్యము; అ. క్రి. 2. రూ-ఇంకు. ఎండు: చూ, శోషించు.

ఇనుపకచ్చడము, ద్వి. వి. ఇనుపగోఁచి. స్వా. 2, ఆ. 73. వేమన. 418.

ఇనుపగుదియ. ద్వి. వి. గునపము : చూ, ముద్గరము. 1-ఇ.

ఇనుపగోఁచి. ద్వి. వి: చూ, ఇనుపకచ్చడము.

ఇనుపగోలెము, ద్వి. వి. ఇనుపకుంపటి : చూ, హసంతి. 1.

ఇల్లరి, దే. వి. (ఇల్లు + అరి) ఇంటిపన్ను: చూ, ఛాటకము.
ఇల్లరికము, దే. వి. (ఇల్లు + అరికము.) చూ, ఇల్లంట్రము.
ఇల్లటికము, దే. వి. (ఇల్లు + అటికము.)—పై—
ఇల్లలికినఁ బంపువగునా, లో. "త్రుళ్ళఁగ నేటికి నిలునిలు, మిల్లలికినఁ బంపువగునె యింతటిలోనే, వల్లభునపుఁ గమనచ్చిన, యిల్లాలవైయేను లాఁతినే పోవోలా." కళాపూర్ణోదయము.
ఇల్లవ, వై. వి. = ఇల్లిశము. ఇల్లెము: చూ, మత్స్యము. 1-౧౩.
ఇల్లాటము, దే. వి. (ఇల్లు + అట.); చూ, రూ-ఇల్లంట్రము.
ఇల్లామల్లి, దే. విఙ. కొండెకాఁడు: చూ, సూచకుఁడు. 1.
ఇల్లాలు, దే. వి. (ఇల్లు + ఆలు.) పెండ్లాము. అగ్నిహోత్రసాక్షిగ వివాహమాడినది.) చూ, భార్య. 1.
ఇల్లి, దే. వి. ఉపవాసము: చూ, పస్తు.
ఇల్లింద, వై. వి = ఇంద్రవల్లి* : చూ, రూ-ఇలింద.
ఇల్లిగ్గులు, దే. వి. బ. (ఇగ్గులు + ఇగ్గులు.) మిక్కిలి పెనుకకొఁజగుటలు. ఉ. హరి. 5, ఆ. 166.
ఇల్లిముక్కు, దే. వి. పగలి నెత్తుటకాఱెడి ముక్కులోపలిభాగము.
ఇల్లిశము, సం. వి. అ. పుం. = ఇల్లవ: చూ, మత్స్యము. 1-౧౩. (రూ-ఇల్లీశము.)
ఇల్లిసె, వై. వి. = ఇల్లిశము.—పై.
ఇల్లు, దే. వి. (ఇల్లాలుకలది) రూ-ఇలు: చూ, సదనము. 1.
ఇల్లుఅలుకగానే పెండ్లిఅయినట్లా, లో. చేయవలసిన పనియంతయు ముందున్నదని భావము.
ఇల్లుకట్టిచూడు పెండ్లిచేసిచూడు, లో. కష్టసాధ్యమైన పనులని భావము.
ఇల్లుకాలిపోవుట, అం. చూ, నష్టములు.
ఇలుపిప్పిపందిలివేసినట్లు, లో. గొప్పపనిని కొద్దివానిగాఁజేసినట్లు.
ఇల్లెడ, దే. వి. అధీనము : చూ, వశము. 1.
ఇల్లెము, వై. వి. = ఇల్లిశము. చూ, మత్స్యము. 1-౧౩
ఇల్లోనారాయణమ్మ, లో. పిల్లికి బిచ్చమైనను పెట్టని వాఁడివిధవ, ఎంగిలిచేతిని కాకికిఁగూడివిదల్పనిది. (ఇందుల కొక కథ కలదు.)
ఇల్వక సం. వి. అ. స్త్రీ. మృగశిరకు పై నక్షత్రము: చూ, రిక్క 1-౨౭. (3).
ఇల్వడి. దే. వి: చూ, రూ-ఇలువడి.
ఇల్వపస. దే. వి; చూ, రూ-ఇలువపస.
ఇల్వల, సం. వి. ఆ. స్త్రీ. చూ, ఇల్వక.
ఇల్వలము, సం. వి. అ. పుం; చూ, ఇల్లిశము.
ఇల్వలుఁడు, సం. వి. అ. పుం. ఒక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.
ఇవ, సం. అవ్య. వలెను: చూ, సామ్యము.
ఇవక, వై. వి. = హిమమ్. శీతము. ఆం, భా. ప్ర. ది. 80: చూ, శైత్యము.
ఇవతల, దే. వి. 1. (ఇవల + తల.) ఈవలి ప్రదేశము; రూ-ఇవతలి-ఇవల-ఇవ్వల-ఈతల; 2. ఈపిమ్మట: రూ-ఇవతలి-ఇవల-ఇవ్వల-ఈతల; 3. ఇద్దరి: చూ, ఈవల. (రూ-ఇవతలి.)
ఇవతలి, ద్వ. వి. — పై.—
ఇవతాళించు, ద్వ. అ. క్రి. చల్లనగు. కవిక. 3, ఆ. 222: చూ, శైత్యించు. (రూ-ఇవతాళించు. (ఇవక + తాళించు.) కళా. 6, ఆ. 251.)
ఇవతాళింపు, ద్వ. వి. జలుబు: చూ, శైత్యము.
ఇవము, వై. వి. 1. = హిమమ్, రూ-ఇగము: చూ, హిమము. 1; 2. రూ-ఇగము. జలుబు: చూ, శైత్యము.
ఇవముకొను, ద్వ. అ. క్రి. (తడిసో) ఊకను. కాశీ. 3, ఆ: చూ, నాను.
ఇవముమేపరి, ద్వ. వి. వెలుఁగుఱేఁడు. అచ్చ. యు, కాం. 311: చూ, సూర్యుడు.
ఇవముసూడు, ద్వ. వి.—పై.—
ఇవల, దే. వి: చూ, రూ-ఇవతల.
ఇవి, వై. స. బ. ఏతచ్ఛబ్దార్థకము. ఈశబ్దమునకు అమహద్వాచక ప్రథమా బహువచనము, రూ-ఇవ్వి: చూ, ఇయ్యది.
ఇవిరించు, దే. అ. క్రి: చూ, రూ-ఇగిరించు.
ఇవురు, చూ, రూ-ఇగురు. (అ. క్రి. కోమిల్లు-హల్లు పరమగుచో వృత్తియందు కడపటి ఉకారమునకు లోపము వికల్పముగా నగు. ఇవుర్వంటకము.)
ఇవురుచు, దే. అ. క్రి: చూ, రూ-ఇగురుచు. (రూ-ఇవుర్చు).
ఇవులుచు, దే. అ. క్రి: చూ, రూ-ఇగురుచు. 1, 2; 3. పండ్లిగిలించు: చూ, ఇగిలించు.
ఇవ్వల, దే. వి, చూ, రూ-ఇవల. ప్ర. 2. ఈవైపున.
ఇవ్వి, వై. స. బ. చూ, రూ-ఇవి.
ఇషణము, సం. వి. అ. న. 1 ఇచ్ఛ: చూ, వాంఛ; 2: చూ, ఈషణత్రయము. (చూ, త్రయము.)
ఇషము, సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము: చూ, మాసము. 1.
ఇషిక, సం. వి. ఆ స్త్రీ. ముంజిమొక్క: రూ-ఇషీక-ఈషిక.
ఇషీక, సం. వి. అ. స్త్రీ. 1.—పై—; 2. రూ-ఈషిక. చిత్తరువు వ్రాసెడి కుంచె; చూ, లేఖిని; 3. ఏనుఁగు కనుగ్రుడ్డు: రూ-ఈషిక; 4. ఏనుఁగు కండ్లపైనుండెడు గుంటలు: రూ-ఈషిక; 5. రూ-ఈషిక. కాకితము వ్రాయు కలము; చూ, లేఖిని: 6. రూ-ఈషిక. తాటాకుమీఁద వ్రాయు గంటములో నగునది: చూ, లేఖిని.
ఇషుధి, సం. వి. ఇ. పుం. స్త్రీ. అమ్ములపొది, తూణీరము, చూ, బాణము. 1.—3.
ఇషువు, సం. వి. ఉ. పుం, స్త్రీ. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. చూ, మహీనతానములు.
ఇష్టక, సం. వి. ఆ. స్త్రీ. = ఇటిక: చూ, ఇటుక. ఇష్టకప్రవాళము. సం. వి అ. పుం: చూ, ఇటిక పగడము.
ఇష్టకాపథము, సం. వి. అ. న 1. నీరువట్టివేరు*: చూ, వట్టివేరు; 2. అభయము:* చూ. వట్టివేరు.
ఇష్టగంధము, సం. వి. అ. న. 1. ఏలావాలుకము, నూఁగుదోస * చూ, హరివాలుకము 1, విఙ. 2. మంచివాసనగలది.
ఇష్టదేవత, సం. వి. అ. స్త్రీ: చూ, ఇలువేలుపు.
ఇష్టపడు, మి. అ. క్రి. అంగీకరించు: చూ, సమ్మతించు
ఇష్టమగు, మి. అ. క్రి. ప్రియపడు: చూ, సంధించు. 2.

ఇష్టము, సం. వి. అ. పుం. 1. జన్నము: చూ, యజ్ఞము; న. 2. యజ్ఞమధ్యమునందుఁ జేయు హోమదానాదిక్రియ; 3: చూ, సంస్కారము; న. క్రి. విణ. 4. తన మనసువచ్చినట్లు: చూ, యథేష్టము; విణ. 5. కోరఁబడినది: చూ, వాంఛితము; 6. ఈఁబడినది: చూ, దత్తము; 7. హోమము చేయఁబడ్డది: చూ. హుతము; 8. ప్రియమైనది: చూ. వల్లభము. 2; 9. పూజింపఁ బడినది: చూ, పూజితము.

ఇష్టగోష్ఠి, సం. వి. ఈ. స్త్రీ. 1. సరస సల్లాపములు: చూ, సల్లాపము; 2. ఆనందముతోఁగూడిన లోకవ్యవహార సంబంధ మగు సంభాషణాదులు: చూ, సల్లాపము.

ఇష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. జన్నము; చూ, యజ్ఞము; 2. వత్తి: చూ, దీప్తి. 2; 3. ఇచ్ఛ: చూ, వాంఛ; 4. టూకిగా చేసిన పద్యము, సంగ్రహశ్లోకము: చూ, శ్లోకము. 1; 5. కొలువు సేత: చూ, సపర్య; 6. దానము: చూ, వితరణము; 7. సంగ్రహము, కొంచెము: చూ, స్వల్పము. 1.

ఇష్టిక, సం. వి. అ. స్త్రీ. = ఇటిక: చూ, ఇటుక.

ఇష్టుఁడు, సం. విణ. 1. చెలికాఁడు; చూ, స్నేహితుఁడు. 1; 2: చూ, విష్ణువు-1.

ఇష్టోక్తి, సం.వి.ఇ. స్త్రీ.ఇచ్ఛకము. ముఖ్యగింత. చూ, సమరసము.2

ఇష్మము, అం. వసంతము. చూ, ఋతువులు. (సూ.వి)

ఇష్వాసము, సం. వి. అ. పుం. 1. విల్లు: చూ, బాణము. 1-3ఐ: 2. అమ్ములపొది: చూ, బాణము. 1.—3.

ఇష్వాసుఁడు, సం. వి. అ. పుం. ధన్వి: చూ, విలుకాఁడు.

ఇష్మఁడు, సం. వి. అ. న. చూ, మన్మథుఁడు.

ఇసక, దే. వి. వి. రూ-ఇసుక: చూ, సికత. 4.

ఇసడిలు, దే. అ. క్రి. నిర్వేదించు. చూ, విసుగు. 2.

ఇసిరో, దే. అవ్య. (ఇసి+రో.) 1. రూ-ఇస్సిరో. నిందార్థకము. చూ, హిహీ; 2. ఈశ్వరస్మరణమందుఁ గలిగిననిపాత: ఇసీ - రూ - ఇస్సీ - ఇస్సిరో.

ఇసిచింతలు, దే. వి. బ. కదలిక. వై. 8, ఆ. 61: చూ, చలనము, 1.

ఇసిచింతలువాఱు, దే. అ. క్రి. (ఇసిచింతలు+వాఱు.) వణఁకు. చూ, చలించు.

ఇసీ, దే. అవ్య. 1. నిందార్థకము. రూ - ఇస్సీ. చూ, హిహీ; 2. ఈశ్వర స్మరణమందుఁ గలిగిన నిపాత: రూ - ఇస్సీ: చూ, ఇసిరో, 2.

ఇసుక, దే. వి. వి: చూ, రూ - ఇసక.

ఇసుకతక్కిడి, పేడతక్కిడి. లో. ఒకనిని మించినవాఁడు మఱి యొకఁడుగ ఉన్న యిసువుపు మోసగాండ్ర విషయమున నుప యోగింతురు.

ఇసుకదాసరి, ద్వ. వి. ఒకరకము కూర: చూ, సైకతశాకము.

ఇసుకదిన్నియ, ద్వ. వి. (ఇసుక + తిన్నియ.) సైకతము: చూ, భూమి. 1-ఞ. (రూ-ఇసుకదిన్నె.) (వా. ఇసుకదిబ్బ అనియు)

ఇసుకదిబ్బ, ద్వ. వి. — పై. —

ఇసుకదొండు, ద్వ. వి. ఒకరకము చేప: చూ. మత్స్యము. 1.

ఇసుక, ద్వ. వి చూ, ఇసుకదిన్నియ.

ఇసుకపాతఱ, జా. హద్దులేనిది, "తే. అనఘవేశ్యా విడంబవ ర్తనము లెన్న, నిసుకపాఁతఱ యూజోలియేల త్రవ్వ." వైజయంతీ విలాసము.

ఇసుకపులకండము, గ్రే. వి. మత్స్యండి; పంచదార: చూ, శర్కర.

ఇసుకబేలు, ద్వ. వి. ఒకానొక తీఁగె: చూ, లత. 1.

ఇసుకమాల్తెను, ద్వి. వి. ఉలిమిరి. నేరుపు, *: చూ, శ్వేత పుష్పము.

ఇసుమంత, దే. అవ్య. ఈషదర్థకము: చూ, స్వల్పము. 1.

ఇసుమంత కాఁక, ద్వ. వి. గోరువెచ్చ: చూ, మందోష్ణము.

ఇసుము, దే. వి. వి: చూ, ఇసక.

ఇసులు, దే. వి. వి. — పై. —

ఇసుళ్లు, దే. వి. బ. పెక్కుచెదలు: ఉసిళ్లు - రూ - ఉసుళ్లు.

ఇస్తిరి,
ఇస్త్రీ, } వావి. బట్టలను నిప్పుపెట్టెలో నునుపు చేయుట.

ఇస్తువు, దే. వి. సొంతము; చూ, స్వామ్యము.

ఇస్సిరో, దే. అవ్య. నిందార్థకము. రూ - ఇసిరో. భాగ. శల్య. 2. ఆ. 58: చూ, హి హీ; 2. ఈశ్వర స్మరణమందుఁ గలిగిన నిపాత: చూ, రూ - ఇసిరో. 2.

ఇస్సీ. దే. అవ్య. — పై. — భార. విరా. 5, ఆ. 79.

ఇస్సు. దే. వి. ప్రయాణ బడలికచేఁ గలుగు ధ్వన్యనుకరణము; చూ, హూహూ.

ఇహ. సం. అవ్య. ఇచ్చట: చూ, ఇందు. 3.

ఇహము, సం. అవ్య. ఇహలోకము. భో. 2, ఆ. 9: చూ, దేశము. (ఐహికము.)

ఇహలోకము, సం. వి. అ. పుం. 1.—పై.—; అం. 2. చూ, లోకములు. (ఐహికము.)

ఇహాముత్రార్థ ఫలభోగవిరామము, అం.చూ, సాధనములు. (చూ, సాధన చతుష్టయము)

ఇహిహీ, దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. రూ - ఈహీ. రుక్మి. 3, ఆ. 94 చూ, హూహూ; అవ్య. 2. నిందార్థకము. రూ - ఈహీ. రామా. 5, ఆ. 148 చూ, హిహీ.

ఇళ, సం. వి. ఆ. స్త్రీ; చూ, రూ - ఇల.

## ఈ

ఈ అచ్చులలోని నాలుగవ యక్షరము. చూ, వర్ణము. 1; సం. వి. ఈ. స్త్రీ, 1. ఏఱుగలది, నదీపతి; 2. లచ్చి: చూ, లక్ష్మి. 1; 3. నలువరాణి: చూ, సరస్వతి. 1; 4. గౌరి; చూ, పార్వతి. 1, 5. నాలుక: చూ, రసన; 6. అబ్జదళము: చూ, తామరతేకు; చూ, సహస్రపత్రము 1-౧౦-(3); 7. తామర పూల (కింజల్కము) కేసరము: సహస్రపత్రము, 1-౧౦-౨ చూ, 8. ఇంద్రధనువు; 9. అంప; చూ, బాణము. 1; 10. పాము; చూ, సర్పము; 11. కొండయందు తొలువఁబడిన గొప్ప బిలము; చూ, రంధ్రము. 1; 12. మొలనూలు: చూ, భూషణము. 2 - ౭ - (౧): అవ్య. 13. కోపార్థము: చూ, రోషము; 14.దుఃఖార్థకము: చూ, శోకము, 2. స. (1)ఎదుట

నుండుదానిఁ దెలుపును. "ఈ తపము: చూ,ఏ: అవ్య.(2)పిలి చ్ఛార్థకము. వేమన. 439,445;"ఈకిం(ఱు.": చూ, ఇయ్యడి; (3) ప్రశ్నార్థకమందు శబ్దానుబంధమైవచ్చు నిపాత. "ఏకీ నీ పాటివారు." (4) ప్రార్థనార్థక ధాతువునకుం బ్రశ్నార్థమంపుఁ గలిగిన నిపాత. "నన్ను రక్షింపుమీ వేగ నలిననాభ."

**ఈంత్ర**, దే. వి. రూ - ఈడిగ, తాటిచెట్టు లోనగువాని గీఁచి జీవించు జాతి: చూ, సెట్టిబలిజె. (ఈంత్రవాఁడు, ఈంత్రది.)

**ఈంత్రము**, దే. వి. రాపిడి. భాగ. 8, స్కం. 565: చూ: సమ్మర్దము.

**ఈంత్రవాఁడు**, దే. వి. చూ, సురాజీవి. (ఈంత్రజాతిది, ఈంత్రది)

**ఈంత్రించు**, దే. స. క్రి. నలఁగుసుపెట్టు. కాశ. 4, ఆ. 50 చూ, పీడితమగు.

**ఈఁక**, దే. వి. పక్షము: చూ, రెక్క. 1. (రూ - ఈఁకె.)

**ఈఁకు**, దే. అ. క్రి. రూ - ఇంకు: చూ, శోషించు

**ఈఁకె**, దే. వి. చూ, రూ - ఈఁక.

**ఈఁకెలదారము**, దే. వి. ఒకరకము పంచెవు కోడిపుంజు. చూ, పుంజు, 1-ల.

**ఈఁగ**, దే. వి. రూ - ఈఁగె: చూ, మక్షిక,

**ఈఁగకు నిలిపాముకు బలిపెట్టఁడు. లో.** దాతనివాఁడని భావము. ఉదా. "ఎగ్గీ. మంచియీాకుఁ గాటుపామునకు బలియు, నొసఁగడని పొక్కు- భర్తకై యువిదమదిని." పాండు. 4. ఆ. 149.

**ఈఁగపులి**, దే. వి. లూత: చూ, సాలెపురుగు.

**ఈఁగమెంగిలికూర**, వా. వి: చూ, పుదీన *

**ఈఁగు**, దే. అ. క్రి. 1. ప్రవేశించు, చొచ్చు. పాండు, 1, ఆ. 150: చూ, సోఁకు. 4; స. క్రి. 2. కొలఁగించు. భాగ. 6, స్కం. 341 (రూ - నీఁగు.); చూ, విసర్జించు.

**ఈఁగె**, దే. వి. రూ - ఈఁవె; చూ, రూ - ఈఁగ.

**ఈఁజేటి**, దే. వి. ఒకరకము కంప *. కాశ. 3, ఆ. 251 : చూ, రూ - ఇంజేటి.

**ఈఁటియ**, దే. వి. కుంతలమను నాయుధము : చూ, బాణము. 1 (రూ - ఈఁటె.)

**ఈఁటె**, అం. చూ, బాణము. 1. (రూ - ఈఁటియ.)

**ఈఁటెకాఁడు**, దే. వి. ఈఁటె ఆయుధముగాఁ గలవాఁడు: చూ: కాంతికుఁడు.

**ఈఁడులేనివాఁడు**, దే. వి. చూ, అతులుఁడు.

**ఈఁత**, దే. వి. 1. ఖర్జూరి *. రూ - ఈఁదు: "వేమన. 451 ; చూ, మధురఖర్జూరిక, 2. నీటియందు ఈఁదుట, ఈఁదుట; 3. (పశ్వాదులు) ఈనుట, ఈనిక: చూ, ప్రసవము. 6.

**ఈఁతకాఁడు**, దే. వి. ఈఁదెడువాఁడు, శావ. అశ్వ. 4, ఆ. 167.

**ఈఁతకు లోఁతెమిటి.** లో. ఉదా.— "ఈ కలహంసయాననను నెక్కడి కెక్కడనుండి తెచ్చెనా, హా కసుదార మెక్కడని యక్కనఁ జేర్పక జంపుమాటలన్, వ్యాకులపెట్టుటెల్ల విరహాంబుధి ముంపకపోదు నంజలం, బే కద నీకు మంచిదిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే." విజ. 1. ఆ. 101. ("ఈఁతకు మించిన లోఁతు బుద్ధికి మించినపని లేదు." "ఈఁతకు మించిన లోఁతు గోఁచీకిమించిన దరిద్రములేదు.")

**ఈఁతకొట్టు**, దే. అ. క్రి. నీటియందు ఈఁదులాడు. "ఈఁత కొట్టినను". ఈఁదు, ఈఁదులాడు.

**ఈఁతపండు**, వ్యా. వి. అక్షోటఫలము.

**ఈఁదు**, దే. వి. 1, చలిగాలి; అల్లిగాలి: చూ, వాయువు; 1-౨౪. 2. ఖర్జూరి *: చూ, రూ - ఈఁదు, (రూ - ఈఁదు.)

**ఈఁదర**, దే. వి. ఈఁదు, చలిగాలి: చూ, వాయువు. 1-౨౪.

**ఈఁదాడన్నఁ గోఁదాడనుట**, జా. ఒకటియనిన మఱియొకటియనుట. (ఈఁదాడి = గిజకరాడి, కోఁదాడి = ఒకరకము తాడి.) "ఈఁదాడన్నను మునుముట్టు, కోఁదాడనువాఁడు విసవుకొని సాగునో." విజ. 2, ఆ. 190.

**ఈఁదాడి**, వై. వి. = హింతాలః. (ఈఁదు + తాడి.) గిజకరాడి* చూ, హింతాలము. (రూ - ఈఁదాడు.)

**ఈఁదు**, దే. వి. 1. గాలి : అప్ప సుం. కాం. 135 : చూ, వాయువు; వై. వి. 2. = హింతాలః *: చూ, ఈఁదాడి; 3. ఖర్జూరి * చూ, ఈఁత. (రూ - ఈఁద.); (ఇవి ద్వివిధము - పేర్లోఁదు, చిట్టీఁదు.) అ. క్రి. 4. ఈఁదులాడు : చూ, ఈఁత కొట్టు, స. క్రి. 5. దాఁటు: చూ, లంఘించు. 2.

**ఈఁదుకాయ**, దే. వి. ఏఱుదాటఁదగిన కొయ్య: చూ, హోవము 1 - ౨

**ఈఁదుకొయ్య**, దే. వి. — వై. —

**ఈఁదుట**, దే. వి. 1. నీటియందు ఈఁదుట: చూ, ఈఁత. 2. (ఈఁతలు.— నిలువు ఈఁత, దొరగిలు ఈఁత, వెలికిలు ఈఁత, మునిఁగిన ఈఁత లోనగునవి.); వా. 2. ఒకానొక కార్యమునకై శ్రమముచే ప్రాకులాడుట.

**ఈఁదురు**, దే. వి. తుపానుగాలి: చూ, వాయువు, 1-౨౪.

**ఈఁదురుగాలి**, వ్యా. వి. — వై. —

**ఈఁదులాడు**, దే. అ. క్రి. (ఈఁదులు + ఆడు.) 1. చూ, ఈఁతకొట్టు; 2. ఈఁగు. స్వా. 4, ఆ. 42: చూ, ప్రేలాడు.

**ఈకడ**, వ్యా. వి. ఈవైపు: చూ, ఇద్దెస.

**ఈకరిజె**, దే. వి. ఈవిధము.

**ఈకువ**, దే. వి. తడి: చూ, స్నేహము.

**ఈకె**, వ్యా. స. ఏ. (ఈ + అక.) ఈ పూజ్యస్త్రీ: చూ, స్త్రీ. 1-౬౫; (అకె, ఈకె, ఏకె, ఎవతె ఇత్యాదులయందు ఏకారము ఆదేశముగా వచ్చెనని ఎఱుంగునది.)

**ఈకొను**, వ్యా. స. క్రి. రూ - ఈయకొను. అంగీకరించు, చూ, సమ్మతించు.

**ఈకోలు**, వ్యా. వి. రూ - ఈయకోలు, అంగీకారము, చూ, సమ్మతి. 1.

**ఈకోలుకాఁడు**, వ్యా. వి. అంగీకరింపఁబడినవాఁడు, రూ - ఇయ్యకోలుకాఁడు - ఈయకోలుకాఁడు, అభిమన్నుఁడు.

**ఈక్ష**, సం. వి. ఆ. స్త్రీ, చూపు: చూ, లక్షణము. 3.

**ఈక్షణము**, సం. వి. అ. న. 1. — వై. — ; 2. కన్ను: చూ, లోచనము. 1.

**ఈక్షణిక**, సం. వి. ఆ. స్త్రీ. ఎఱికెత: చూ, సోదెకత్తె.

**ఈక్షిక**, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఈక్ష.

**ఈక్షితక్రియము**, సం. వి. అ. పుం: చూ, చెప్పుతట్ట. *

**ఈక్షితము**, సం. విశే. చూపింపఁబడినది: చూ, అవర్మితము.

**ఈక్షితసహ**, సం. వి. ఆ. స్త్రీ. చూ, మయూరశిఖ *

ఉన్నేయప్రశ్నోత్తరము, సం. వి. అ. న. ఉన్నేయప్రశ్నోత్తరాలంకారము: (చూ, అలంకారము. 3.)

ఉన్మంథనము, సం. వి. అ. న. 1. కదలించుట: చూ, లోలము. 1; 2. చంపుట: చూ, వధము.

ఉన్మంథము, సం. వి. అ. న. 1. చంపుట: చూ, వధము; 2. చిలుకుట: చూ, మథనము.

ఉన్మంథితము, సం. విణ. కదలింపఁబడినది; చూ, వేల్లితము. 2.

ఉన్మత్తము, సం: వి. అ. పుం. 1 = ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము, 2. పుష్పవృక్ష విశేషము: చూ, వృక్షము (1-౧౭); విణ. 3. వెఱ్ఱెత్తినది: చూ, వెఱ్ఱి. 1.

ఉన్మత్తుఁడు, సం. విణ. 1. చూ, వెఱ్ఱివాఁడు; 2. నలువ; చూ, బ్రహ్మ. 1.

ఉన్మదితుఁడు, సం. విణ. చూ, వెఱ్ఱివాఁడు.

ఉన్మదిష్ణువు, సం. విణ. ఉ. — పై. —

ఉన్మనుఁడు, సం. విణ. స్. 1. ప్రియవస్తువు ఎప్పుడు దొరకునో యను త్వరకలవాఁడు; చూ, ఉత్కుఁడు. 2; 2: మదించినవాఁడు; చూ, మత్తుఁడు.

ఉన్మాథము, సం. వి. అ. పుం. 1. తిమిరము, స్పర్శముఁ దెలియని రోగము: చూ, తిమ్మిరి: 2. గాలము; చూ, మత్స్యబంధనము; 3. చంపుట; చూ, వధము; 4. కూటయంత్రము: చూ, బోను.

ఉన్మాథుఁడు, సం. వి. అ. పుం. మరణింపఁజేయువాఁడు: చూ, మారకుఁడు.

ఉన్మాదకుఁడు, సం. విణ. చూ, వెఱ్ఱివాఁడు.

ఉన్మాదనము, సం. వి. అ. పుం. మన్మథునియొక్క బాణము: చూ, బాణము 1-౬౩. (చూ, మన్మథ బాణములు.)

ఉన్మాదము, సం. వి. అ. పుం. 1. = ఉమాదము; చూ, వెఱ్ఱి; 1: (ప్రియ వియోగ విభవభ్రంశాదులచే చేతనాచేతనములయందు సమానముగా ప్రవర్తించుట.) 2. అధిక చప్పుడు: చూ, స్వరము, 2-౧౬; 3. వ్యభిచారభావ భేదము, (సంచారిభావ భేదము, (భ్రమము.) ఉదా :- "ఓ రసాతలమా ! నాపై దయగలిగెనేని సీత యేత్రోవ నేతెంచెనో యానతిమ్మ." చూ, సంచారీభావములు; అం. 4. చూ, శృంగారచేష్టలు: 5. చూ, ద్వాదశావస్థలు.

ఉన్మాదవంతుఁడు. సం. విణ: చూ, ఉన్మత్తుఁడు.

ఉన్మాదవతుఁడు, సం. విణ. రూ — పై. —

ఉన్మానము, సం వి. అ. న. తులామానము; చూ, తూనికె.

ఉన్మార్గము, సం. వి. అ. పుం. 1. చెడునడత: చూ, తప్పునడత: 2. తప్పుత్రోవ; పెడదారి. చూ, మార్గము. 1-౩.

ఉన్మితము, సం. విణ. కొలువఁబడినది: చూ, వనిత. 5.

ఉన్మిషితము, సం. విణ. విరిసినది: చూ, వ్యాకోచము.

ఉన్మీలనము. సం. వి. అ. న. విరియుట, వికసించుట: చూ, వికాసము. (చూ, బుద్ధి.)

ఉన్మీలితము, సం. విణ. 1. విరిసినది: చూ, వ్యాకోచము; 2. ఉన్మీలితాలంకారము, చూ, అలంకారము. 3. అం. 3. చూ, దృష్టిక్రియలు: 4. అర్థాలంకారములు నూటింటిలో నొకటి. ఉపమా నోపమేయములకు భేదవిస్ఫురణంబుఁ జూపుట. ఉ. నీకీర్తి కిరవైన హిమవన్నగమును దేవతలు మంచువలన, గనిపెట్టుచున్నారు: చూ, అలంకారము. 3.

ఉన్మీషితము, సం. విణ. చూ, రూ - ఉన్మిషితము.

ఉన్ముక్తకము, సం. వి. అ. పుం. శిరస్త్రాణము, పాదములదాఁక నుండెడు అంగి: చూ. వస్త్రము.

ఉన్ముఖుఁడు, సం. విణ. మీఁదుచూచువాఁడు:చూ, ఉద్గ్రీవుఁడు. 1.

ఉన్ముద్రము, సం. విణ. చూ, ఉన్మిషితము.

ఉన్మూలించు, సం. స. క్రి. పెల్లగించు. చూ, స్ఫోటించు. 1-౧.

ఉన్మూలితమగు, మి. అ. క్రి. పెల్లగిల్లు — పై. —

ఉన్మూలితము, సం. విణ. 1. వేరు త్రెంపఁబడినది, పెల్లగింపఁబడినది: ఉత్ఖాతము, ఉత్పాటితము, ఉద్బృహితము, ఉత్సన్నము, ఉత్పాదితము, ఉన్మూలితము: 2. అడుగుతోఁ జెఱుపఁబడినది.

ఉన్మేషము, సం. వి. అ. పుం. 1 తెలివి; చూ, హృల్లేఖము, 2. 2. కనుఱెప్పలు విచ్చుట; 3. పుష్పాది వికాసము; చూ, వికాసము; అం. 4. చూ, పుటక్రియలు.

ఉప. సం. ఉపసర్గము, 1. ఉపగూహము = ఇచట "ఉప" అనునది ధాత్వర్థమును ఆలింగనముగా మార్చినది; 2. ఉపయమము — ఇచట ధాత్వర్థమును వివాహార్థము కలదానినిఁగా మార్చినది; 3. ఉపమ — ఇచట ధాత్వర్థమును బోలికగా మార్చినది; 4. ఉపమాత — ఇచట మాతృశబ్దముతో సమసించి దగ్గఱయను నర్థము కలదియైనది; 5. ఉపప్లవము — ఇచట ధాత్వర్థమును ఉపద్రవమను నర్థమునకు మార్చినది. సం. అవ్య. 6. తక్కువ: చూ, వెలితి. 2: 7. దగ్గఱ: చూ, సమీపము; 8. ఆరంభము: చూ, యత్నము; 9. ఆచార్యుని క్రియ; 10. ఎక్కువ: చూ, హెచ్చు. 1; 11. రీతి: చూ, విధము; 12. చెప్పఁగూడనిది చేయుట; 13. గొల్లవేషము: 14. చెడుగును తలఁచుట: చూ, విప్రతీసారము.

ఉపకంఠము, సం. వి. అ. న. 1. దగ్గఱ; చూ, సమీపము, 2. గ్రామము చేరువనేల, ఉపశల్యము: చూ, భూమి. 1-౨౦; విణ. 3. సమీపించినది: చూ, సమీపము.

ఉపకరణము, సం. వి. అ. న. కొఱముట్టు, చూ, సాధనము. 2.

ఉపకరించు. సం. అ. క్రి. ఉపయుక్తమగు: చూ, సరిపడు.

ఉపకర్త, సం. విణ. ఉపకారి: చూ, శుభంకరుఁడు.

ఉపకారము, సం. వి. అ. పుం. 1. ఉపకృతి, చూ, మేలు. 12; 2. గుంపు: చూ, సమూహము; 3, చెదరిన పువ్వులోనగునవి: చూ, ప్రకరము.

ఉపకారి, సం. విణ. చూ. ఉపకర్త.

ఉపకారిక, సం. వి. ఆ. స్త్రీ. 1. ఉపకారముచేసెడు స్త్రీ: చూ. స్త్రీ. 1-౧౨౫; 2 — ఉప్పరిగ, రాజసదనము, మేడ, చూ, సదనము. 1-౬౫; 3. శిబిరము, గుడారము: చూ, సదనము, 1-౪౦; 4. చక్కెరచేర్చి పొరటిన పిండి, అఖ్య: చూ, భక్ష్యము; 1-౭: 5, ఒకానొక బంక.

ఉపకార్య, సం. వి ఆ. స్త్రీ. 1. రాజసదనము. మేడ: చూ, ఉపకారిక 2; 2. రాజుల విడిది యిల్లు; ఉపకార్య: చూ, సదనము 1; విణ. 3. ఉపకరింపఁదగినది, ఉపకారమును పొందఁదగినది, శుభమైనది: చూ. మేలు. 15,

ఉపకుంచిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఉపకుంభిక. 1-2.
ఉపకుంభిక, సం. వి. ఆ. స్త్రీ. 1. సన్నయేలకి * : చూ, పత్రిల; 2. కారవి, సోపు, నల్లజీలకఱ్ఱ *: చూ, జీలకఱ్ఱ. (ఉపకుంచిక అని శబ్దరత్నాకరము, ఉపకుంభిక అని సర్వశబ్ద సంబోధిని.)
ఉపకుర్వాణుఁడు, సం. వి. అ. పుం. ఒకానొక బ్రహ్మచారి: చూ, వటువు.
ఉపకుల్యా, సం. వి. ఆ. స్త్రీ. పిప్పలితీఁగె * : చూ, పిప్పలి. 1.
ఉపకృతము, సం. వి. అ. న. 1. ప్రయోజనము: చూ, పని. 2; విణ. 2. ఉపకరింపఁబడినది.
ఉపకృతి, సం. వి. ఇ. స్త్రీ. ఉపకారము: చూ, మేలు. 12.
ఉపక్రమము, సం. వి. అ. పుం. 1. ఉపాయమునెఱిఁగి ప్రారంభించుట: చూ, సన్నాహము, 2. రోగమునకుఁజేయు ప్రతిక్రియ: చూ, ప్రతిక్రియ 1; 3. గురుముఖమున ఆనుపూర్విగ వేదముఁజదువుట; అధీతి, అధ్యయనము; చూ, విద్యలు. ౯-౪; 4. మంత్రులలోనగువారిఁ బరీక్షించుట: చూ, ప్రక్రమము. 2; 5. విక్రమము, బలిమి: చూ, శక్తి. 1; 6. ప్రారంభము: చూ, సన్నాహము (తెలివితోఁజేసిన తొలియారంభము, పనికి మొదలుఁబెట్టుట); 7. తంత్రము. ఎత్తుగడ: చూ, ఉపాయము; (ఉపక్రమము ప్రక్రమము క్రియకు మొదట దొరఁకొనుటపేళ్లు, అధ్యయమునకు ప్రణవోచ్చారణము. వంటకు పొయి యలుకుట మొదలైనవి.)
ఉపక్రమించు, సం. అ.క్రి.స.క్రి. ప్రారంభించు. చూ, సమకట్టు.2.
ఉపక్రోశము, సం. వి. అ. పుం. మాలు: చూ, నెగ్గింపు.
ఉపగణములు, అం. రెండక్షరములవి. — (4) గగ, గల, లగ, లల; నాలుగక్షరములవి. —(10) తగము, తలము, నగము, నలము, భగురు, భలము, రగము, రలము, మలము, సలము; ఐదక్షరములవి. —(7) నగలము, నగగము, నలలము, నలగము, సలలము, సలగము, సగలము.
ఉపగతము, సం. విణ. అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము.
ఉపగతి, సం. వి. ఇ. స్త్రీ. అవనము: చూ, లాభము. 1.
ఉపగమము, సం. వి. అ. పుం. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2. సమీపించుట: చూ, సమీపము.
ఉపగీతి, అం. ఒకానొకపద్యము. ఇది చపలాకందముచాయను నడచును. (చూ, కందము.) చూ, వృత్తము. 1.
ఉపగూఢము, సం. విణ. 1. కౌఁగిలింపఁబడినది: ఆలింగితము, ఆశ్లిష్టము; 2. దాఁచఁబడినది: చూ, రహస్యము. 3.
ఉపగూహనము, సం. వి. అ. న. 1. ఆలింగనము, చూ, సంశ్లేషము; కౌఁగిలి; 2: చూ, దాఁచుట.
ఉపగ్రహము, సం. వి. అ. పుం. 1. అనుకూలపడుట, పొత్తు: చూ, స్నేహము. 1; 2. మిక్కిలివృద్ధి: చూ, సమృద్ధి; 3. చెఱ: చూ, బంధనాలయము; 4. కారాగృహశిక్ష ననుభవించుట: చూ, బందీ; 5. సూర్యాదిగ్రహణము: చూ, గ్రహణము. 1; అం. 6. చూ, షోడశసంధులు.
ఉపగ్రహుఁడు, సం. వి. అ. పుం. చెఱఁబడ్డవాఁడు: చూ, బందెకాఁడు.
ఉపగ్రాహ్యము, సం. వి. అ. న. కానుక: చూ, సూడిద.

ఉపఘాటకము, సం. వి. అ. న. సంభోగక్రియాభేదము: చూ, రతిబంధము. 1-(౧).
ఉపఘాతిని, సం. వి. ఈ. స్త్రీ. ఆఁబోతు త్రొక్కుటవలన సీచు కొనిన యావు: చూ, ధేనువు. 1-౩.
ఉపఘ్నము, సం. వి. అ. పుం. తీఁగెయల్లుటకు సమీపమున నిడు కొయ్యలోనగునది: చూ, ప్రాఁకు.
ఉపచయము, సం. వి. అ. పుం. 1. ఉన్నతి: చూ, సోగ. 2; 2. అతిశయము: చూ, పేరాశము. 1.
ఉపచరము, సం. వి. అ. పుం. 1. గోమహిష్యాది ప్రథమ గర్భము; చూ, ప్రజనము. 1; 2. చూలగునట్టి కాలము. చూలు: చూ, ప్రజనము. 2; 3. ఎద్దు వెదగొనదము.
ఉపచరించు, సం. స. క్రి. 1. గౌరవించు: చూ, సన్మానించు; 2. కొలుచు: చూ, సేవించు.
ఉపచరితుఁడు, సం. విణ. సేవింపఁబడినవాఁడు: చూ, సేవితుఁడు.
ఉపచాయ్యము, సం. వి. అ. పుం. 1. చయనాగ్నియందుఉపయోగింపఁదగిన పేరు: పరిచాయ్యము, సమూహ్యము: చూ, వహ్ని. 1-౨; 2. గ్రామము కావలెనను కోరికఁగల వానిచేతఁ జేయఁబడునట్టి యొకయాగము: చూ, యజ్ఞము. 1-౧౮.
ఉపచారగృహీతుఁడు, సం. వి. అ. పుం. మంచిమాటచేత దండును దెచ్చినవాఁడు. (చూ, అభిభయము): చూ, స్వపక్షములవాఁడు.
ఉపచారము, సం. వి. అ. పుం. 1. మరియాద: చూ, సన్మానము. 1; 2. కొలువు: చూ, శుశ్రూష. 2; 3. తనపని చక్కఁబెట్టుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు ధనము, ఆమిషము: చూ, సూడిద; 4. అలవాటు: చూ, స్వభావము; 5. వసంతఋతువు. వసంతము. చిగిరించేకాలము: చూ, మాసద్వయము.
ఉపచారములు, అం. 1. పదునారు.—ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, నమస్కారము, ఉద్వాసనము; (౧౬). 2. ఐదు.— స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము. నమస్కారము. (౫).
ఉపచారుఁడు, సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు.
ఉపచితము, సం. విణ. 1. కాలినది; 2. అలకడము (సున్నము చేత పెరిగినగోడ మొదలైనది.): చూ, నిదిగ్ధము: 3. కూడఁబెట్టినది: చూ, నిదిగ్ధము. 4. వర్ధిల్లినది: చూ, పృథులము.
ఉపచిత్ర, సం. వి. ఆ. స్త్రీ. 1. ఎలుకజీడి *: చూ, భల్లాతకి; అం. 2. ఒకానొకవృత్తము. ఇందు ఒకటి మూఁడు పాదములయందు మూఁడు సగణములును, యొక వగణంబును, రెండు నాలుగు పాదంబులందు భ, భ, భ, గగములుయుండి తొమ్మిదింట యతులు గల వృత్తము. అప్ప. 4, ఆ.253. పుట; చూ, వృత్తము. 1.
ఉపజలము, సం. వి. అ. పుం. కమ్మనీరు: చూ, నీరు. 1-౧౪.
ఉపజాతి, అం. ఒకానొకవృత్తము. ఇందు బేసిపాదంబులు ఇంద్రవజ్రచ్ఛాయను, సరిపాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను

నడచును. దీనినే "నీశ" యనియుచు సంజ్ఞ. తద్విశేషములు:—వృత్త్యస్తోపజాతి: — ఇందు బేసిపాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను, సరిపాదములు ఇంద్రవజ్రచ్ఛాయను నడచును; సమోపజాతి :— మొదటి రెండుపాదములు ఇంద్రవజ్రచ్ఛాయను, 3-4 పాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను నడచును; వృత్త్యస్తసమోపజాతి :— ఇది యుపేంద్రవజ్రచ్ఛాయను మొదటి రెండుపాదములున్ను, ఇంద్రవజ్రచ్ఛాయను గడమ రెండుపాదములున్ను నడచును: వైపరీత్యోపజాతి:—ఇది ఇంద్రవజ్రచ్ఛాయను మొదటిచరణమున్ను, కడమ మూఁడు పాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను నడచును: చూ, వృత్తము. 1.

**ఉపజాతులు.** అం. గీతములుతొమ్మిది, సీసములేడు. (కొందఱు చంపకోత్పల శార్దూలమత్తేభములు జాతులనియు, కందగీత సీసములుపజాతులనియు, తక్కినవి వృత్తములనియు వాడు చున్నారు.)

**ఉపజాపము,** సం. వి. అ. పుం. 1. భేదము; చూ, వేఱుపాటు 1; అం. 2. రాజులయొక్క మూఁడవయుపాయము: చూ. ఉపాయములు.

**ఉపజిహ్విక,** సం. వి. ఆ. స్త్రీ. 1. కొండనాలుక: చూ, రోగము. 1; 2 చెట్టున తెట్టెపెట్టెడు నల్లచీమ: చూ, పిపీలిక.

**ఉపజీవి,** సం. విణ. ఒకరి ననుసరించి జీవించువాఁడు; చూ, జీవకుఁడు. 2.

**ఉపజీవించు,** సం. స. క్రి. ఒకరిని అనుసరించి జీవించు: చూ, జీవించు.

**ఉపజీవిక,** సం. వి. ఆ. స్త్రీ. ఒకరిని ఆశ్రయించి జీవించుట: చూ, బ్రదుకు. 1.

**ఉపజ్ఞ,** సం. వి. ఆ. స్త్రీ. ఉపదేశములేక తనంతట మొట్టమొదట పుట్టెడుజ్ఞానము. (వాల్మీకియొక్క శ్లోకనిర్మాణ జ్ఞానము వంటిది.); చూ, హృల్లేఖము. 2.

**ఉపకార్య,** సం. వి. ఆ. స్త్రీ. 1. రాజుల విడిదియిల్లు: చూ, సదనము. 1-౬౫; 2. డేరా: చూ, సదనము. 1-౪౦.

**ఉపతప్త,** సం. వి. ఋ. పుం. తపింపఁజేయు రోగము; చూ, రోగము. 1.

**ఉపతాపము,** సం. వి. అ. పుం. 1. వంతః క్షోభము: చూ, సంతాపము; 2. తపింపఁజేయు రోగము: చూ, రోగము. 1; 3. తొందఱ; చూ, సంభ్రమము. 1.

**ఉపతాయి,** దే. వి. మల్లవిజ్ఞానము. భార. విరా. 2, ఆ. 15: చూ, మల్లశాస్త్రము.

**ఉపత్యక,** సం. వి. ఆ. స్త్రీ. కొండచేరువ నేల: చూ, భూమి. 1-౨౧.

**ఉపత్తు,** సం. వి. ద్. స్త్రీ. ఇసుమ: చూ, విపత్తు.

**ఉపద,** సం. వి. ఆ. స్త్రీ. కానుక: చూ, సూడిద.

**ఉపదంశము,** సం. వి. అ. పుం. 1. ఊఱుఁగాయ: చూ, ఉచిగాయ: 2. కల్లుఁద్రాగునపుడు నంజుకొనురొట్టె మాంసాదులు; 3. మేఢ్రరోగము, కొఱుకురోగము, కొఱుకు, కొఱుకుపుండు: చూ, సవాయి. 1; 4. సమిష్టిల, ఏఱువంగ *: చూ, వంగ.

**ఉపదానము,** సం. వి. అ. న. 1. అరణము. వివాహకాలము నందు అల్లునికును ఆఁడుబిడ్డకును మామగారిచే నియ్యఁబడు ధనాదికము: చూ, హరణము; 2. కానుక: చూ, సూడిద.

**ఉపదిష్టము,** సం. విణ. ఉపదేశింపఁబడినది: ఆదిష్టము.

**ఉపదూషితము,** సం. విణ. 1. ఆసన్నమరణము, సన్నిహిత మరణము: చూ, చావు; 2. నిందింపఁబడినది, నిందతానిది: చూ, అజన్యము. 5.

**ఉపదూషితుఁడు,** సం. విణ. దాపించిన చావుఁగలవాఁడు; 2. నిందింపఁబడ్డవాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**ఉపదేశకుఁడు,** సం. విణ. ఉపదేశించువాఁడు; చూ, బోధకుఁడు. 2.

**ఉపదేశకులు,** అం. ఎన్నిమాల (అక్షరములు) నభ్యాసముచేసిన వాఁడు, ఉపనయనకాలమందు గాయత్రిని ఉపదేశించినవాఁడు, వేదాధ్యయనముఁ జేయించినవాఁడు, శాస్త్రార్థాభ్యాసముఁ జేయించినవాఁడు, పురాణేతిహాసాదులను తెలియఁజేసినవాఁడు, శైవ వైష్ణవ మత సాంప్రదాయములను బోధించినవాఁడు, టక్కుటమార గజకర్ణగోకర్ణ - ఇంద్రజాలమహేంద్రజాలాది విద్యల నుపదేశించినవాఁడు. (8.)

**ఉపదేశము,** సం. వి. అ. పుం. 1. మంచిమాట: చూ, హితవచనము; 2 బోధించుట: చూ, బోధనము.

**ఉపదేశించు,** సం. స. క్రి. ఉపదేశముచేయు: చూ, పన్ను. 9.

**ఉపదేష్ట,** సం. విణ. చూ, ఉపదేశకుఁడు.

**ఉపదేహిక,** సం. వి. ఆ. స్త్రీ. చెదపురుగు: చూ, పిపీలిక.

**ఉపద్రవము,** సం. వి. అ. పుం. విప్లవము, హానివడి: చూ, విపత్తు.

**ఉపధ,** సం. వి. ఆ. స్త్రీ. 1. ధర్మార్థకామములచేత మంత్రి లోనగువారి చిత్తమును పరీక్షించుట: చూ, ప్రస్తరము. 2; 2. తలగడ: చూ, లోడు, అం. 3. చూ, గతివిశేషములు; వా. 4. (వ్యాకరణమున) కడపటి యక్షరమునకు ముందటి యక్షరము ఉపధయనఁబడును. (ఉ.—పిచి-సంచి వీనిలోని కడపట్టియు ఇకారము. దానివెనుక నున్నది చకారము. అది ఉపధయనఁబడును. (మ॥ సూ॥ గారి ఆంధ్రభాషానుశాసనము.)

**ఉపధానము,** సం. వి. అ. న. 1. తలగడ: చూ, లోడు, 2. చెలిమి; చూ, స్నేహము; 1; 3. విషము; చూ, విసము. 1.

**ఉపధావించు,** సం. అ. క్రి. పఱుగిడు: చూ, వెళ్లు. 1.

**ఉపధి,** సం. వి. ఇ. పుం. 1. చూ - ఉపాధి. పరద్రోహార్థ మొకటి యుద్దేశించినట్లు తెలిపి యొకటి నేయుట: చూ, వ్యాజము. 1. 2. అక్షాగ్రకీలము: చూ, బండికన్ను.

**ఉపధూపితము,** సం. వి. అ. పుం. 1. సమీపించిన యస్తమయము: చూ, అస్తమనము. 1-౧ విణ. 2. చావుసమీపించినది; 3. పొగవేయఁబడినది.

**ఉపధూపితుఁడు,** సం. విణ. 1. ఆసన్నమరణము గలవాఁడు, 2. పీడింపఁబడినవాఁడు, ఉపరక్తుఁడు, చూ, వ్యసనార్తుఁడు.

**ఉపనక్తిము,** సం. వి. అ. పుం. చెప్పుతిత్తి *: చూ, చర్మారము.

**ఉపనతము,** సం. విణ. కదిసినది: చూ, సంసక్తము. 1.

**ఉపనయనకాలమందు గాయత్రిని ఉపదేశించినవాఁడు;** అం. చూ, ఉపదేశకులు.

ఉపనయనదానము, అం. చూ, షోడశమహాదానములు.
ఉపనయనము, సం. వి. అ. న. చూ, వడుగు; అం. 2. చూ, కర్మములు.
ఉపనయము, సం. వి. అ. న. — పై. —
ఉపనాయము, సం. వి. అ. న. — పై. —
ఉపనాయకులు, అం. (నలుగురు — దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు, చూ, పతులు.) చూ, నాయకులు. 2.
ఉపనాహము, సం. వి. అ. పుం. 1. వీణె లోనగువాని తంతి మెట్టుకు పెడడ; బిరడ. చూ, వీణ, 1-౨౬; 2. పుంటిమీఁద పూసెడు మందు; చూ, మందు. 1; 3. జలదారి: చూ, వాహనము, 2. 4. పుండు: చూ, వ్రణము: 5. తామర తూడు: చూ, సహస్రపత్రము, 1-౯. 6. గ్రాసము, మెట్టు. చూ, సావము, (1)-౨౩.
ఉపనిధి, సం. వి. ఇ. పుం. చెప్పక చూపక యుంచిన ఇల్లడ: చూ, వాడిక.
ఉపనిషత్తు, సం. వి. ద్. స్త్రీ. 1. వేదాంతము, ధర్మము: చూ, వేదాంతము; 2. వేదోక్తవిధి; చూ, ధర్మము; 3. ఏకాంతము: చూ, రహస్యము. 1.
ఉపనిషత్తులు, అం. ఈశావాస్యము, తలవకారము, కఠవల్లి, ప్రశ్న, ముండకము, మాండూక్యము, భృగువల్లి, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము. (10)
ఉపనిష్కరము, సం. వి. అ. న. = ఉక్కళము. రూ - ఉపనిష్కారము, అడ్డముదైన రాజమార్గము: చూ, మార్గము. 1.
ఉపనిష్కారము, = ఉక్కళము. —పై.—
ఉపనీతుఁడు, సం. విశ. 1. వడుగైనవాఁడు, చూ, వటుఁడు; 2. సమీపమునకు తేఁబడినవాఁడు.

ఉపన్యసించు. సం. స. క్రి. 1. ఉంచఁజేయు, ఉనుచు, చూ, ఇడు, 2; 2. ఉపన్యాసముచేయు.

ఉపన్యాసము, సం. వి. అ. పుం: 1. ఏదేనియొక విషయమునెత్తి విస్తరించి చెప్పుట; ఉః: చూ, వాఙ్ముఖము; 2: చూ, ఉదాహరణము; 3. చూ, షోడశసంధులు.

ఉపపట్టణము, సం. వి. అ. న. 1. శాఖానగరము, పేఁట: చూ, దేశములు; 1-౬౩-8-౧. 2. పట్టణమునకు దగ్గరయూరు: చూ, దేశములు. 4-౫.

ఉపపతి, సం. వి. ఇ. పుం. 1. జారుఁడు: చూ, అంకుమగఁడు; 2. చూ. నాయకులు. (శృంగార రసమందలి ముఖ్యుఁడైన యొకానొక నాయకుఁడు.)

ఉపపత్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. భాగ్యము: చూ, సంపత్తి. 1; 2. అలవాటు; చూ, స్వభావము: 3. మంచి: చూ, యోగ్యత, 4. కారణము; చూ, హేతువు, 5. చూ, ఉదాహరణము; 6. జన్మము; చూ; సంభవము; 7. కత: చూ, సమాచారము. 2; 8. రతి, కూడిక; చూ, సంయోగము.

ఉపపదము, అం. చూ, చిత్రబంధములు.

ఉపపన్నము, సం. విశ. 1. ఉపపత్తికలది; 2. పొందఁబడ్డది: చూ, సంసక్తము; 3. పుట్టినది: చూ. సంభూతము; 4 పూర్ణమయినది; చూ. వర్ధితము. 3.

ఉపపాదకము, సం. విశ. కలిగించునది: చూ, ప్రతిపాదకము.
ఉపపాదనము, సం. వి. అ. న. కలిగించుట: చూ, సంభవము. 1.
ఉపపురాణములు, అం. సనత్కుమారీయము, నారసింహీయము, స్కాందము, శివధర్మము, దౌర్వాసము, నారదీయము, కాపిలము, మానవము, ఔశనము, బ్రహ్మాండము, వారుణము, కాళీపురాణము, లైంగము, సాంబము, సౌరము, పారాశర్యము, మారీచము, భార్గవము. (18)
ఉపపుష్పిక, సం. వి. ఆ. స్త్రీ. ఆవరింత: చూ, హాఫిక.
ఉపప్రదానము, సం. వి. అ. న. కానుక: చూ, సూడిద.
ఉపప్లవము, సం. వి. అ. పుం. 1. అంజన్యము. చూ, తోఁకచుక్క; 2. ఉపద్రవము, చూ, విపత్తు; 3. కేతువు: చూ, సుకేతనము; 4. రాహుగ్రహము: చూ, రాహువు. 1.5. సూర్యచంద్ర గ్రహణములు: చూ, గ్రహణము. 1. విశ. 6. తెలియక వచ్చునది. (ఉత్పాతము); 7. రాజకీయోపద్రవము.
ఉపప్లుతుఁడు, సం. విశ. వ్యసనవంతుఁడు: చూ, వ్యసనార్తుఁడు.
ఉపబర్హము, సం. వి. అ. పుం. తలగడ: చూ, లోడు.
ఉపబృంహణము, సం. వి. అ. న. చక్కఁగా పెరుగుట, చూ, సంవృద్ధి.
ఉపబృంహితము, సం. విశ. చక్కఁగా పెరిగినది: చూ, సంవర్ధితము.
ఉపభుక్తము, సం. విశ. అనుభవింపఁబడినది: చూ, లీఢము.
ఉపభృత్తు, సం. వి. త్. స్త్రీ. 1. హోమార్థమైన మిళ్ళివంటి యజ్ఞోపకరణ విశేషము: చూ, స్రువము; 2. కిరీటము, చూ, సీసకము. 1; 3. ఉపస్థమూలము; చూ, యోనిమూలము; 4. ఐ. చనుమొన: చూ, స్తన్యము, 1-౪.
ఉపభోగము, సం. వి. అ. పుం. అనుభవము, చూ, భుక్తి, 2.
ఉపభోగ్యము, సం. విశ. అనుభవింపఁదగినది; చూ, భోగ్యము. 3.
ఉపమ, అం. 1. అర్థాలంకారము, (రూ - ఉపమానము): చూ, అలంకారము. 3. సమస్తాలంకారములకు నుపమ పూర్ణాదిగా నున్నది. దానినుండియే సమస్తాలంకారములును బుట్టినవి. రెండు పదార్థములయందు వర్ణ్యావర్ణ్యములందు మనోహరమగు సామ్యమును స్పష్టముగాఁ జెప్పఁబడి యుండెనేని యుపమయగును. 1.ఉపమానము, 2. ఉపమేయము, 3. ఉపమావాచకము, 4. సాధారణ ధర్మము; అని నాలు గవయవములు కలవు. ఉదా :— రాముని కీర్తివెన్నెల దల్లనై లోకమున వ్యాపించియున్నది. ఒకదానితో నొకటి పోలిక గల రెండు వస్తువులలో గొప్పదియగు నప్రస్తుతవస్తువు ఉపమానము. అది యిందు వెన్నెల. అది తెలుపుచేత గొప్పదియుఁ బ్రస్తుతము వర్ణించఁబడనిదియునై యున్నది కావున నుపమానము (ఉపమాన = పోలిక; ఉపమేయ = పోల్చఁబడునది: ఉపమావాచక = వలెప్రభృతులు; సాధారణధర్మ (గుణ)ములు కలది పూర్ణోపమ, ఇందులో నేదేని దక్కువైన లుప్తోపమ, మొత్తమున నెనిమిది విధములు. పూర్ణోపమ - ఉ. - నీ కీర్తి హంసాంగనవలె స్వర్గంగం దేలుచుండె; లుప్తోపమ.— ఉ.- నీ మోము సోమునింబోలు.); 2. పోలిక: చూ, సామ్యము; 3. పోల్పఁదగిన చంద్రాది: చూ, ఉపమానము; విశ. 4. ఉత్తరపదమైనచో,సమానము: నిభము, సంకాశము, నీకాశము,

ప్రతీకాశము, ఉపమ (చంద్రనిభ, లక్ష్మీసంకాశ, పద్మి నీకాశం, సూర్యప్రతీకాశః, విష్ణూపమః అని సమాన శబ్ద ములు ఉత్తరపదములు కానప్పుడు సదృశవాచకములు. నిభా దులైతే ఉత్తరపదములైనప్పుడే సదృశవాచకములని భేదము) చూ, ఉపమానము; వై. వి. (1) అనువు. హరిశ్చ. 5, ఆ. 110; వి. పు. 7. ఆ. 8: చూ, ఉపాయము, వా. (2) గోధుమ నూకతోఁ జేసిన పిండివంటి భక్ష్యము; (రూ-ఉప్మా.) చూ, భక్ష్యము. 1-౧౪; సం. 1. ఉపాయము, (సూ. ని.)

ఉపమరి, వై. విశే. ఉపాయశాలి. వేమన, 527; చూ, సమర్థుఁడు.

ఉపమాత, సం. వి. ఋ. స్త్రీ. 1. పాలిచ్చి పెంచు (దాది) తల్లి; చూ, మాత. 1-౨; విశే. 2. ఉపమానము చెప్పువాఁడు.

ఉపమానము, సం. వి. అ. న. 1. ఒకానొక అర్థాలంకారము: చూ, ఉపమ. 1. 2. పోలిక: చూ, సామ్యము; 3. పోల్పఁ దగిన చంద్రాది: చూ, ఉపమ. 3; 4. చూ, ఉపమ, 4: అం. 5. చూ, ప్రత్యక్షాది ప్రమాణములు; 6. చూ, తార్కిక ప్రమా ణములు; (అర్థాలంకారమునకు :—ఉదా. —మిత్రమా!నేఁడు నీ రాక యిష్టదేవతా దర్శనంబు లభించినట్లును, పర్వదినంబు చేకూరినట్లును, చిరకాలకాంక్షితంబగు నర్థంబు సిద్ధించినట్లును, నష్టద్రవ్యము తిరుగ లభించిన చందంబునను మనంబున కత్యానందంబు సంధించుచుండె.)

ఉపమానలుప్త, సం. వి. ఆ. స్త్రీ. లుప్తోపమాలంకారము (చూ, ఉపమ 1.): చూ, అలంకారము. 3.

ఉపమించు, సం. స, క్రి. పోలఁజేయు: చూ, పోలుచు.

ఉపమితి, సం. వి. ఇ. స్త్రీ. పోలిక: చూ, సామ్యము.

ఉపమేయము, సం. వి. అ. న. ప్రకృతము వర్ణించు వస్తువు. పోలికగల రెండువస్తువులలోఁ గొంచెము తక్కువమై ప్రస్తు తము వర్ణింపఁబడుచున్నది యుపమేయము. అది యిందుఁ గీర్తిమై యున్నది. అది తెలుపుచే వెన్నెలకంటెఁ దక్కువ యైనదియుఁ బ్రస్తుతము వర్ణింపఁబడుచున్నదియును గావున నుపమేయము.

ఉపమేయోపమ. అం. ఒక యర్థాలంకారము: చూ, అలం కారము. 3. ఉపమానోపమేయములు రెండును ఒకదాని కొకటి యుపమానములైన యెడల నుపమేయోపమ. ఉదా.— రామునికి సముద్రుఁడేసాటి, సముద్రునికి రాముఁడేసాటి; ధర్మమర్థమువలె, అర్థము ధర్మమువలె నీయందున్నవి.

ఉపయమము, సం. వి. అ. పుం. 1. పెండ్లి: చూ, వివాహము; 2. యముని సమీపము; ఉపయామము.

ఉపయాచితకము, సం. వి. అ. న. అభీష్టసిద్ధికై దేవతలకిఁబడు ద్రవ్యము: చూ, మ్రొక్కుబడి.

ఉపయామము, సం. వి. అ. పుం: చూ, ఉపయమము.

ఉపయుక్తమగు, మి. అ. క్రి: పొందుపడు : చూ, సరిపడు. 1.

ఉపయుక్తము, సం. విశే. 1. ఒదవుబడియైనది; 2. సమృద్ధ మైనది, పెరిగినది: చూ, సుర. 3.

ఉపయోగము, సం. వి. అ. పుం. ఒదవుబడి: చూ, సమృద్ధి.

ఉపయోగించు, సం. అ. క్రి. 1. ఒదవు: చూ, సమృద్ధమగు; 2. పొందుపడు: చూ, సరిపడు.

ఉపర, సం. వి. ఆ. స్త్రీ. నాలుకంచెనుంచెడునాడా: చూ, నాడె.

ఉపరంధ్రము, సం. వి. అ. న. మృగముల వెనుక కాలి మూలమునకును ప్రక్కకును నడిమిచోటు: చూ, తొలకు.

ఉపరక్తుఁడు, సం. విశే. 1. రాహువుచే పట్టఁబడినవాఁడు. (చంద్రుఁడు లేక సూర్యుఁడు.): చూ, గ్రహణము. 1: 2. జూదము మొదలైన వ్యసనములచేత తొందరబడ్డవాఁడు; చూ, వ్యసనార్తుఁడు.

ఉపరక్షణము, సం. వి. అ. న. 1. బెత్తములవారు సందడిలేక తొలగించుట: చూ, సజ్జనము; 2. శిబిరరక్షణార్థమై చుట్టును బెట్టిన వెలుఁగు లోనగునవి: చూ, సజ్జనము.

ఉపరతి, సం. వి. ఇ. స్త్రీ. 1. ఊఱట: చూ, విశ్రాంతి, 2: చూ, పురుషాయితము; అం. 3. చూ. శమాదులు.

ఉపరథ్య, సం. వి. ఆ. స్త్రీ. పసులులోనగువాని రాకపోకలచేత నేర్పడిన ఊరిముందఱి దారి: చూ, మార్గము. 1-౭.

ఉపరమము, సం. వి. అ. పుం. రూ-ఉపరామము. ఉడుకువ; చూ, విశ్రాంతి.

ఉపరాగము, సం. వి. అ. పుం. 1, రాహువు సూర్యచంద్రులను బట్టుట; చూ, గ్రహణము. 1; 2: చూ, గ్రహకల్లోలము; విశే. 3. ధర్మముకానిది: అధర్మము, అన్యాయము, అపన్యా యము; (తె. ప):—అన్నెము, అపపాడి. అవపాడి. అవ నాయము; వి. 4. వ్యసనము: చూ, దుఃఖము.

ఉపరామము, సం. వి. అ. పుం: చూ, ఉపరమము.

ఉపరి. సం, అవ్య. మీఁదివైపు: చూ, మీఁదు. 2.

ఉపరిష్టాత్తు, సం. అవ్య. మీఁదివైపు: చూ, మీఁదు. 2.

ఉపరుద్ధము, సం. విశే. . అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1.

ఉపరోధము, సం. వి. అ. పుం. అడ్డగింత: చూ, సంరోధము.1.

ఉపరోధించు, సం. స. క్రి. అడ్డగించు, చూ, సంరోధించు.

ఉపల, సం. వి. అ, స్త్రీ. 1. కల్పపుగుండు: చూ, పాత్రము. 1-౧౨-(౧౦ ; 2. నూరెడుగుండ్రాయి: చూ, పాత్రము. 1-౧౨-(౧౦); 3. గుండ్రాయి; చూ, మెఱియ: చూ, రత్నములు. 1-౧౨-(౧౦).

ఉపలంభము, సం. వి. అ. పుం. 1. కుడుపు: చూ. భుక్తి. 2; 2. జ్ఞానము; చూ, హృల్లేఖము. 2.

ఉపలనాడి, సం. వి. ఈ. స్త్రీ. చూ, పిడక.

ఉపలభ, సం. వి. అ. స్త్రీ. మతి: చూ, హృల్లేఖము. 2.

ఉపలబ్ధము, సం. విశే, 1. పొందఁబడినది: చూ, సంసక్తము; 2. తెలియఁబడినది; చూ, వ్యక్తము. 2.

ఉపలక్షార్థ, సం. వి. ఆ. స్త్రీ. ఏయుపాయము చేతనైనను ఎఱుఁగఁబడిన అర్థముఁగలది: చూ, పరికథ.

ఉపలబ్ధి, సం. వి. ఇ. స్త్రీ. 1. జ్ఞానము: చూ, హృల్లేఖము. 2; 2. పొందు: చూ, స్నేహము. 1.

ఉపలము, సం. వి. అ. పుం. 1. శిల: చూ. రత్నములు. 1-౧౦; 2. మణి: చూ, రత్నములు-౧౦; 3. కల్పపుగుండు: చూ, పాత్రము. 1-౧౨-(౧౦); 4. నూరెడుగుండ్రాయి; చూ, పాత్రము. 1-౧౨-(౧౦) 5. గుండ్రాయి: మెఱియ. చూ, 1-౧౨-(౧౦).

ఉపలసంప్రకీర్ణ, అం. చూ, అశ్వసంచారమార్గములు.

**ఉపలాలనము**, సం. వి. అ. న: బుజ్జగింత: చూ, సమరసము. 2.

**ఉపలాలించు**, సం. స. క్రి: చూ, బుజ్జగించు.

**ఉపలాలితము**, సం. విణ. బుజ్జగింపఁబడినది.

**ఉపలాల్యాము**, అం. ఒకంకము. కథ ప్రసిద్ధము. శృంగారహాస్య కరుణశోకములు ముఖ్యములు, కీర్తనలుండును: చూ, నాటకలు.

**ఉపలింగము**, సం. వి. అ, న. దేశోపద్రవము: చూ, విపత్తు.

**ఉపలేపనము**, సం. వి. అ. న. అలుకుట: చూ, గోముఖము.

**ఉపలోలకము**, అం. చూ, అలంకారము. 3.

**ఉపవతము**, దే. వి. రూ-ఉప్పవతము: చూ, మేలుకోలు.

**ఉపవనము**, సం. వి. అ. న. 1. మనుష్యులు వేసి పెంచిన తోఁట: చూ, వనము. 2; 2. ఇంటితోఁట: చూ, వనము. 2.

**ఉపవర్గము**, సం. వి. అ. పుం. 1. మారితెవులు: చూ, మారి; 2. ఉపద్రవము: చూ, విపత్తు.

**ఉపవర్తనము**, సం. వి. అ. న. 1. విరాళి; అనేక పట్టణములు గల గొప్ప భూభాగము: చూ, దేశము; 2. ఇరువదిగ్రామములు చేరిన భూభాగము; చూ, దేశములు. 1-౧౪.

**ఉపవస్త్రుఁడు**. సం. వి. అ. పుం. కృతకోటి, హాలభృతుఁడు: చూ, సన్న్యాసి. 1-౧౫.

**ఉపవసథము**, సం. వి. అ. పుం. గ్రామము: చూ, దేశములు. 1-౬౩-౪-౨.

**ఉపవసించు**, సం. అ. క్రి. 1. వ్రతాదులయందు పస్తుండు. 2. జ్వరాదులచే లంకణముచేయు: చూ, పస్తుండు.

**ఉపవస్తము**, సం. వి. అ. పుం, న. 1. వ్రతాదులకొఱకుఁ జేయు ఉపవాసము; చూ, లంకణము. 1-౧; 2. జ్వరాదులచేత నుండెడి యుపవాసము; చూ, లంకణము. 1-౧.

**ఉపవాక్యము**, అం. 1. చూ, వాక్యములు; 2. కర్తగాఁగాని, కర్మగాఁగాని వాడఁబడువాక్యముపవాక్యము. ఉ.—నీవేమి చేసితివో నాకుఁ దెలియదు. అడితవని వింటిని.

**ఉపవాటిక**, సం. వి. ఆ. స్త్రీ. 1. మంత్రుల గృహముతోఁజేరిన తోఁట; చూ, వనము. 2-౭; 1-2. వేశ్యాగృహారామము: చూ, వనము. 2-౯.

**ఉపవాయువులు**, అం. నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము. (5); చూ, వాయువు. 1-౨.

**ఉపవాసము**, సం. వి. అ. పుం, న: చూ, ఉపవసము. 1-2. భార. అను. 4, ఆ. 143.

**ఉపవాహ్యము**, సం. వి. అ. పుం. ఔపవాహ్యము, రాజెక్కెడి యేనుఁగు: చూ, హస్తి. 1-3-(౧).

**ఉపవిద్యలు**, అం. 1. శిక్ష. 2. వ్యాకరణము. 3. నిరుక్తము 4. జ్యోతిషము; (1) గణితశాస్త్రము. (2) వాస్తుశాస్త్రము (3) శకునశాస్త్రము. (4) స్వరశాస్త్రము. (5) ప్రశ్న శాస్త్రము, 5. కల్పము, 6. ఛందస్సు, 7. ఋగ్వేదము, 8. ఋగ్వేదోపవేదము. (ఆయుర్వేదము) (1) ధాతు రసవాదము. — (2) అంజనవిద్య, (3) వశ్యౌషధ ప్రయోగము, 4. పాకశాస్త్రము,(5) దోహదశాస్త్రము, దాడిమాదివృక్ష దోహదము. 9. యజుర్వేదము, (దీనిచేత దేవతలు పూజింపఁబడుదురు.) (1) కామశాస్త్రము.-10. యజుర్వేదోపవేదము, (అర్థవేదము.) (1) స్వర్ణరత్నాది పరీక్ష, (2) (2) ద్యూతము = ప్రాణిద్యూతము, అప్రాణిద్యూతము అని ద్వివిధము. (3) కృషి, (4)వాణిజ్యము, (5) గోశాస్త్రము, (6) భూపరీక్ష, (7) సూచీవానకర్మ, (సూదులచేతఁ గుట్టుపని విశేషములు ) 11. అధర్వణవేదము, (1) ఆగమములు. 28. కామికాగమము, యోగము, చింత్యము, కారణము, అజితము, దీప్తము, సూక్ష్మము, సహస్రము, అంశుమత్తు, సుప్రభేదము, విజయము, నిశ్వాసము, స్వాయంభువము, అనలము, వీరము, రౌరవము, మకుటము, చంద్రజ్ఞానము, బింబము, తంత్రము, ప్రోద్గీతము, లలితము, సిద్ధము, సంతానము, సర్వోక్తము, పారమేశ్వరము, కిరణము, వాతూలము. ఈ యాగములయం దనేక మంత్ర యంత్ర తంత్ర ప్రయోగాదులఁ దెలియఁజేయునవి; (2) ఇంద్రజాలికము. — (లేనిది యున్నట్లును, ఉన్నది లేనట్లును, చూచువారి కన్నులకు భ్రమ గల్పించునది) అవాంతరములు మహేంద్రజాలము: గజకర్ణము, గోకర్ణము, గారడి, కనుకట్టు, హస్తలాఘవాదులు. (3) ప్రయోగము. — ఆకర్షణము, స్తంభనము, మారణము, మోహనము, వశీకరణము, ఉచ్చాటనములను నాలువిధములగు మంత్రప్రయోగములఁ దెలుపునది; మంత్రశక్తిచే జలము, అగ్ని, వాయువు, వాక్కు, దృష్టి, శుక్లము, భుజము, ఖడ్గము మొదలగువానిని స్తంభింపఁజేయు విధ మెఱింగించునది; 12. ధనుర్వేదము. — (అధర్వవేదోపవేదము.)- (1) మల్లశాస్త్రము. — ఈ శాస్త్ర విషయ గ్రంథము లంతరించినను గొన్ని విషయములు లోకానుచారంబుగా నున్నవాని నీ నిఘంటురాజమందుఁ జూపఁబడియె :— (12 దండెలు, 12 గతులు, 12 పదవన్నె, 12 మొనలు, 12 కాయమానములు, 14 విసరులు, 16 ఉపవీతములు, 32 విన్నాణములు, 32 ప్రచారములు, 8 సఱుకులు మొదలగునవి.) (2) గజశాస్త్రము. — (3) వ్యూహశాస్త్రము. — కామందకమునఁ జెప్పినరీతి నిందు వివరింపఁబడియె. — ప్రకృతి వ్యూహములు 4, దండవ్యూహములు 17, భోగ వ్యూహములు 5, మండల వ్యూహములు 2, అసంహత వ్యూహములు 6, ప్రధానవ్యూహములు 6, గురుమతమున వ్యూహాంగములు 7, శుక్రమతమున వ్యూహాంగములు 5, (4) అశ్వహృదయ పరిజ్ఞానము, సారథి రథికుల యొక్క యుత్సాహము: 13 సామవేదము .—14. గాంధర్వవేదము:— (సామవేదోపవేదము) వానిలో నాట్యోపయోగములైన యంగములు 19, శిరఃక్రియలు 17, దృష్టిక్రియలు 18, రసదృష్టులు 8, రసస్థాయీభావమునఁబుట్టిన దృష్టులు 8, సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు 20. తారాక్రియలు 9, పుటక్రియలు 9, భ్రూక్రియలు 7, నాసికాక్రియలు 6, గండక్రియలు 6, అధరము 6, చిబుకము 8, ముఖక్రియలు 6, కంఠక్రియలు 4, హస్తక్రియాభేదములు:— బాహుప్రచారములు 10, హస్తక్రియలు 20, హస్తప్రచారములు 15, హస్తకరణములు 4, హస్తక్షేత్రములు 3, ఉత్తమ క్షేత్రములు 3 ,మధ్యమక్షేత్రములు 5, అధమ క్షేత్రములు 6; మతాంతరము:— హస్తక్షేత్రములు 13, అసంయుత హస్తములు 45, సంయుతహస్తములు 32, నృత్తహస్తములు 29, హస్తప్రాణములు 12, వక్షఃక్రియలు 5, జఠర

క్రియలు 3, పార్శ్వక్రియలు 5, కటిక్రియలు 5, ఊరుక్రియలు 5, జంఘాక్రియలు 5, చరణక్రియలు 6, స్థానకములు 30, పుంస్థానకములు 6, స్త్రీస్థానకములు 3, ఏకవింశతి స్థానకములు 21, భూచారులు 16, ఆకాశచారులు 16, భూమండలములు 10, ఆకాశమండలములు 10, కరణములు 108 మున్నగునవి చెప్పఁబడుచున్నవి; ఇది నందికేశ్వర విరచితమగు భరతార్ణవాది గ్రంథములలో లక్షణ వినియోగములతో వివరింపఁబడి యున్నది. మఱియు కావ్యములు 2, సాహిత్య కావ్యములు 2, రీతులు 4, వృత్తులు 4, గుణములు 23, పాకములు 4, శబ్దాలంకారములు 39, అర్థాలంకారములు 100, రసవదలంకారములు 18, రసస్థాయీ భావములు 9, సంచారిభావములు 33, శృంగార చేష్టలు 19, ద్వాదశావస్థలు 12, విప్రలంభము 4, అర్థాంతర సంక్రమిత వాచ్యములు 2, అత్యంత తిరస్కృతవాచ్యములు 2, అభిధామూలధ్వనులు 3, సంలక్ష్యక్రమవ్యంగ్యము 3, శబ్దశక్తి మూలానురణనరూప వ్యంగ్యము 4. అర్థశక్తి మూలానురణనరూపవ్యంగ్యము 3, ఉభయశక్తి మూలానురణనరూపవ్యంగ్యము 1, ధ్వనిభేదములు 1326 ను సంకరములతోఁ గూడిన 5304 విటితోఁగూడిన కావ్యముఁగూడ ధ్వనియనిపించుకొనును. ఇదే యుత్తమకావ్యము. ఇక రాగాధ్యాయమును తెలిసికొనవలెను. రాగజ్ఞానమును గుఱించి యపేక్షితములయిన అష్టాదశపదార్థములలో నాదము 2, శ్రుతులు 22, స్వరము 7, స్థాయి 3, గ్రామము 3. షడ్జగ్రామగత మూర్ఛనలు 7, మధ్యమగ్రామగత మూర్ఛనలు 7, గాంధారగ్రామగతమూర్ఛనలు 7, అందు తానముల వివరము షడ్జమధ్యమగ్రామములలోఁ జెప్పఁబడిన మూర్ఛనాసప్తకద్వయములో ప్రత్యేకమతాంతరభేదములు నాలుగుగలవు. వాటిచేత నొక్కొక్క సప్తక మిరువదెనిమిది భేదములుగానైనవి, అవాంతరభేదములు 4, తానములు 3, శుద్ధతానములు 28, సహీనతానములు 7, రిహీనతానములు 7, నహీనతానములు 7, నిహీనతానములు 7; కూటతానములు 28:— పహీనతానములు 7, రిహీనతానములు 7, గహీనతానములు 7, మహీనతానములు 7; సర్వతానములు 28:—స-మ- హీనతానములు 7, ప-రి-హీనతానములు 7, రి-ధ-హీనతానములు 7, ని-గ-హీనతానములు 7; వర్ణచతుష్కము, అలంకారములు 63:— స్థాయివర్ణగతాలంకారములు 7, ఆరోహివర్ణగతాలంకారములు 12, అవరోహివర్ణగతాలంకారములు 12, సంచారివర్ణగతాలంకారములు 25, అలంకారములు 7, గమకములు 15; అంశములు :—శుద్ధజాతులు 7, జాతులు 11, సప్తస్వరయుక్తరాగములు, షట్స్వరయుక్తరాగములు, పంచస్వరయుక్త రాగములు, చతుస్స్వరయుక్తరాగములు, త్రిస్వరయుక్తరాగములు, ద్విస్వరయుక్త రాగములు, ఏకస్వరయుక్త రాగములు; మఱియు రాగాంగములు 13; భాషలు :— సౌవీరజభాషలు 4, కకుభజభాషలు 7, టక్కజభాషలు 21, పంచమజభాషలు 10, భిన్నపంచమజభాషలు 4, ఉత్కలకైశికజభాషలు 2, హిందోళజభాషలు 9, భోటజభాష 1, మాళవకైశికజభాషలు 13, గాంధారపంచమిజభాష 1, భిన్నషడ్జకజభాషలు 17, వేసరషాడవజభాషలు 2, మాళవపంచమిజభాషలు 3, తానజభాష 1, పంచమషాడవజభాషలు 3; సౌవీరాది 15 జనకరాగములయందుఁ బుట్టిన భాషారాగములు:—భాషాంగములు 11: విభాషలు 20;—కకుభజవిభాషలు 3, టక్కజవిభాషలు 4, పంచమిజభాషలు 2. భిన్నపంచమిజభాష 1, ఉత్కలకైశికజవిభాష 1, మాళవకైశికజవిభాషలు 2, భిన్నషడ్జజవిభాషలు 4, వేసరషాడవజవిభాషలు 2. పంచమషాడవజవిభాష 1; అంతరభాషలు 4:—కకుభజభాషాంతభాష 1. పంచమషాడవజాంతర భాషలు 3; ఉపాంగములు 4: వరాట్యుపాంగములు 6; తుండ్యుపాంగములు 2; గూర్జర్యుపాంగములు 4; వేళావళ్యుపాంగములు 4; క్రియాంగములు 12; మఱియు సామకృతి, గౌడకృతి, దేవకృతి, నాదను మొదలు క్రియాంగము పర్యంతమునైన యష్టాదశపదార్థములను సంగీతరత్నాకరము మొదలగు గ్రంథములలోఁ జెప్పఁబడియున్న ప్రకారముగ నుద్దేశలక్షణ వినియోగములను సద్గురుముఖమువలన సంప్రదాయపూర్వకముగఁ జదువుకొని వాటిని నిండా అభ్యసించి సాధించి జితశ్రముఁడై సంపుష్టోష్ఠత మొదలుకొని సానునాసికత్వపర్యంతమునైన నిరువదిమూఁడు గాయకత్వ దోషములలో నేదోషమును జెందక రూక్షిత్వము మొదలుగాగల కంఠధ్వని దోషములు లేక సుగుణములు యిరువదెనిమిది మొదలగునవి కలిగియున్న గాయకోత్తముఁడు తాళవర్జితములు మొదలగు దోషములు లేక ప్రభుసభయందు సభాసదుల కాహ్లాదనార్థముగఁ బాడవలసినరీతిని యాఱు విధములుగ వినికిఁ జేసిన శాస్త్రపండితుఁ డనఁబడును. ఇక తాళాధ్యాయము చూతము.— తాళము అనఁగ తలనక్రియ (అనఁగా నృత్తగీతములయొక్క లఘుద్రావి ప్రమాణసహితమైన పదకవితాదర్శావృత్తకాలమును అవాపు, నిష్క్రామాది క్రియలచేతఁ గొలిచి సరిపెట్టి నిలుపుట, తాళమునకు ప్రాణములు 10 :— కాలప్రాణములు 12; మార్గప్రాణము 6, నిశ్శబ్దక్రియలు 4, సశబ్దక్రియలు 4, దేశీయక్రియలు 8, అంగప్రాణము 6, గ్రహప్రాణము 4, జాతిక్రియ 5, ముఖ్యకళాప్రాణము 5: - ఈ పైదింటియందే 96 తాళములు పుట్టి 101 తాళమయ్యెను. జన్యతాళములు 96, లయప్రాణములు 3, యతిప్రాణము 6. ప్రస్తారప్రత్యయప్రాణము 19, సూడకము (సూళాది సప్తతాళములు) 7, వాద్యములు 4, తతవాద్యములు 20, ఆనద్ధవాద్యములు 18, సుషిరవాద్యములు 10, ఘనవాద్యము 6, పంచమహావాద్యములు 5, 15. మీమాంస :— మీమాంస అనఁగా విచారణ. (1) యోగశాస్త్రము, (2) సాంఖ్యము, (3) వేదాంతశాస్త్రము, (4) అలంకారశాస్త్రము, (5) అణిమాదిసిద్ధులు, (6) అదృశ్యము, (7) పరకాయప్రవేశము, (8) ఆకాశగమనము మున్నగునవి. 16. న్యాయశాస్త్రము.—న్యాయము అనఁగా దృష్టాంతము. 17. పురాణము. 18. ధర్మశాస్త్రము. (1) సాముద్రికము.— ఇందు లక్షణాంగములు 58: మహావిద్యలు 18; ఉపవిద్యలు 46 ను గూడి చతుష్షష్టివిద్యలయ్యె.

ఉపవిష. సం. వి. అ. స్త్రీ. ఎఱ్ఱఅతివస *: చూ. విష.

ఉపవిష్టుఁడు, సం. విణ. కూర్చున్నవాఁడు: ఆసీనుఁడు, ఆసేది వంతుఁడు; (తె. ప.):—కూరుచున్నవాఁడు- రూ- కూర్చున్న వాఁడు. తద్వి-దగ్గఱ కూర్చున్నవాఁడు:— (సం. ప.)— ఉపోపవిష్టుఁడు.

ఉపవీతము, సం. వి. అ. న. 1. ఎడమ భుజము మీఁదుగా కుడి పార్శ్వమున వ్రేలెడు జంధెము: యజ్ఞోపవీతము; చూ, సూత్రము 1-౧౫; 2. ఉత్తరీయము: చూ, వస్త్రము. 1-౧౧.

ఉపవీతములు, అం. మల్లశాస్త్రము లోనివి.— దండనిలుకడ, కదలునిలుకడ, కదలుమెలుకువ, విదళింపునిలుకడ, దిశావ దిశలు, హస్తపుపారువు, దేహపుపారువు, నయపుపారువు, పాదపుపారువు, వీవ, రాకచ, ఏకసర, పైసర, ఝుంపు. విక్షే కరలాఘవము. (16.)

ఉపవేదచతుష్టయము, అం. ఆయుర్వేదము, అర్థవేదము, ధను ర్వేదము, గాంధర్వవేదము. (4): మహావిద్యలు పదునెనిమి దింటిలోనివి. (4); చూ, మహావిద్యలు: (చూ, ఉపవిద్యలు.)

ఉపవేశకాలము, అం. చూ, శిక్షాకాలములు.

ఉపవేశము, సం. వి. అ. పుం. కూర్చుండుట: చూ, స్థితి. 2.

ఉపశమము, సం. వి. అ. పుం. 1. ఉపశాంతి (తె. ప.) అడఁ గుట: అణఁగుట; 2. ఓర్పు: చూ, శాంతము. 1.

ఉపశమించు, సం. అ. క్రి. 1. అడఁగారు: చూ, సురిక్కు. 4; 2. ఓర్చు: చూ, సురిక్కు. 9.

ఉపశమిల్లు, సం. అ. క్రి.—పై.—

ఉపశయము, సం. వి. అ. పుం. వలయొడ్డి యాచెంత తాను దాఁగి యుండుటకై త్రవ్విన పల్లము; అనుపు. మాటు. 3: చూ, రంధ్రము. 1-౪.

ఉపశల్యము, సం. వి. అ. న. గ్రామము చేరువ నేల, ఉపకంఠము: చూ, భూమి. 1-౨౦.

ఉపశాంతి, సం. వి, ఇ. స్త్రీ. 1. అడఁగుట: చూ, ఉపశమము. 1; 2. ఓర్పు: చూ, శాంతము. 1.

ఉపశాఖ, సం. వి. ఆ. స్త్రీ. పిల్లకొమ్మ, ఉపకాండము, చాఁగునట్టి లేఁతకొమ్మ, రెమ్మ; చూ, శాఖ. 1-౨.
(ఇట్లు ఉపధనుస్సు; ఉపజీవస్థానము; ఉపవృంతము ఇత్యాది.)

ఉపశాయము, సం. వి, అ. పుం. 1. కావలివారు వరుసక్రమమున మండుట: చూ, విశాయము; 2. బంధుత్వక్రమము: చూ, వరుస.

ఉపశోభితము, సం. విణ. ప్రకాశించినది: చూ, వెలుతురు. 1.

ఉపశ్రుతము, సం. విణ. సమ్మతింపఁబడినది: చూ, స్వీకృతము.

ఉపశ్రుతి, సం. వి. ఇ. స్త్రీ. 1. తమ భాషణమప్పుడు దబ్బాటునఁ గలిగెడి శుభసూచకమగు అన్యసంభాషణ శ్రవణము: చూ, వినికిడి; 2. ఒడఁబాటు: చూ, సమ్మతి. 1.

ఉపష్టువు, సం. విణ. ఎడమది: చూ, సవ్యము. 1.

ఉపసంపన్నము, సం. విణ. 1. యజ్ఞార్థము చంపఁబడినది (పశ్వాది): చూ, ప్రోక్షితము; 2. నీళ్లుపోసివండిన యన్నా దులు.

ఉపసంవ్యానము, సం. వి. అ. న. అధోవస్త్రము, కట్టుకొనెడు బట్ట: చూ, వస్త్రము. 1-౨.

ఉపసంహరించు, సం. స. క్రి. 1. క్రమ్మఱుచు: చూ, మఱ లించు: 2. చంపు: చూ, సంహరించు.

ఉపసంహారము, సం. వి. అ. పుం. 1. అప్రవృత్తి: చూ, మరలఁ బాటు; 2. చంపుట: చూ, వధము.

ఉపసంహృతి, అం. నాట్యముయొక్క యయిదవసంధి (విమర్శము నకు సావమర్శమనియు, నిర్వహణమునకుఁ బ్రరోహము లేక ఉపసంహృతి యనియు నామాంతరములున్నవి.)

ఉపసత్త, సం. విణ. 1. చూ, సేవకుఁడు; 2. దగ్గఱ నుండు వాఁడు; (సూ. ని.)

ఉపసత్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. చూ. సేవ; 2. అనుసరించుట; (సూ. ని.)

ఉపసభాపతి, వా. ఉపాధ్యక్షుఁడు.

ఉపసరము, సం. వి. అ. పుం. 1. చూ, ఉపచరము. 2. ఎఱువు, చూ. వర్ణము, 6; 3. తెలియకవచ్చు కీడు లోనగునది: చూ, తోఁకచుక్క; 4. అడ్డగింపు; చూ, నిరోధము. 1. 5 ఇగురు, చిగురు: చూ. విద్రుమము, 6. మారితెవులు: చూ. మారి.

ఉపసర్జనము, సం. విణ. 1 ప్రధానముకానిది; చూ, అప్రధానము; 2. తరువాతది, ముఖ్యముగానిది (వస్తువు.): చూ, అప్రాగ్రము.

ఉపసర్పణము, సం.వి.అ.న. ఆశ్రయము: ప్రాపు: చూ, సమీపము.

ఉపసర్పించు, సం. స. క్రి. ఆశ్రయించు: చూ. ప్రాపుఁగొను.

ఉపసర్య, సం. వి. ఆ. స్త్రీ. కట్టుటకు నీసువచ్చిన (తొలిచూలి) యావు; చూ, ధేనువు. 1-౧౩.

ఉపసూర్యకము, సం. వి. ఆ. న. సూర్యునిచుట్టును గుడికట్టుట: చూ, పరివేషము.

ఉపసృష్టకము, సం. వి. అ. న. స్త్రీపురుషుల కలయిక: చూ, సంయోగము.

ఉపసేదివంతుఁడు, సం. వి. స్. పుం. విద్యకొఱకు దగ్గఱఁ జేరి సేవచేయుచు శిక్షింపఁబడువాఁడు: చూ, శిష్యుఁడు.

ఉపస్కంధము, పా: చూ, ఉపపరిచ్ఛేదము.

ఉపస్కరము, సం. వి. అ. పుం. చూ, సంబారము.

ఉపస్కృతము, సం. విణ. చూ, అలంకృతము.

ఉపసృతము, అం. చూ. కరణములు.

ఉపస్థ, సం. వి. ఆ. స్త్రీ. 1. నేత్రాది దశేంద్రియములలో నొకటి: చూ. హృషీకము; 2. జననేంద్రియము, ఆఁడుగుఱి; చూ, భగము. 12; విణ. 3. పరస్పరము సమీపమున నుండునది; 4. మగగుఱి: చూ. శిశ్నము; 5. తొడ పైభాగము: చూ, ఒడి. 2; 6. ఊరువు: చూ, తొడ, 7. అరసంజ: చూ, సాయంకాలము; 8. గుదము: చూ, ముడ్డి; అం. 9. చూ, ఇంద్రియములు; 10. చూ, ద్వారములు.

ఉపస్థానము, సం. వి. ఆ. న. 1. కూడిక: చూ, సంయోగము; 2. కొలువు: చూ, శుశ్రూష.

ఉపస్థానవరాటి, అం. చూ, వరాట్యుపాంగములు. (చూ, అంగము. 9.)

ఉపస్థితము, సం. విణ. 1. చేరినది: చూ, ఆసక్తము. 1; అం. 2. ఒకా నొక వృత్తము. ఇందొక్కొక్కపాదమున త, జ, జ, గ, గ ములు గలిగి ఎనిమిదవయింట యతిగల పదునొకండవ ఛందస్సునందు దుద్భవించిన వృత్తము. ఉదా.— "భక్తస్త్వాలరి

ఉపానహము, సం. వి. హ. స్త్రీ. 1. చెప్పులు; చూ, సమ్మాళిగలు; పుం. 2, అంసహాది *: చూ, హంసపాది.

ఉపాయనము, సం. వి. అ. న. కానుక: చూ, సూడిద.

ఉపాయము, సం. వి. అ. పుం. 1. ఎత్తుగడ: చూ, వెరవు; 2. పొందు: చూ, స్నేహము 1,

ఉపాయములు, అం. 1. సామము, దానము, భేదము, దండము. (4); 2. చూ, అంగపంచకము: 3. సామము, భేదము, దానము, నతి, ఉపేక్ష, రసాంతరము. (6): 4. సామము, దానము, భేదము, దండము, మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము(7).

ఉపాయశాలి, సం. వి. ఇ. పుం. ఉపమతి; చూ, సమర్థుఁడు.

ఉపారము, వై. వి.＝ఉపహారః. 1. కానుక: చూ, సూడిద, 2. వ్రతాదులయందును దేవతల పండుగులయందును సంతుష్టికై పెట్టినది. (నైవేద్య పదార్థము.) "ఉపారముమీఁది కుడుము."

ఉపార్జనము, సం. వి. అ. న. గడన: చూ, సంపాదనము.

ఉపార్జించు, సం. స. క్రి. గడించు: చూ, సంపాదించు.

ఉపార్జితము, సం. విణ. గడింపఁబడినది: చూ, సంపాదితము.

ఉపాలంభము, సం. వి. అ. పుం. 1. మర్మముదూరి పాఱనాడుట; చూ, ఉల్లంఘనము, వా. 2. నిరాకరణము, తిరస్కారము.

ఉపాలంభించు, సం. స. క్రి. మర్మము దూఱిపాఱనాడు: చూ, ఉల్లసమాడు.

ఉపావృతము, సం. విణ, అనాదరణము: చూ, ఉపేక్షితము.

ఉపావృత్తము, సం. విణ. (పలుమాఱు నేల పొర్లాడినది.) అశ్వము : చూ, హయము. 1-౩౨.

ఉపాశ్రయము, సం. వి. అ. పుం. 1. దగ్గఱ: చూ, సమీపము; 2. అసరా: చూ, సమీపము; న. 3. మదపుటేనుఁగు: చూ, హస్తి-1-౭౨; 4. కటకటాలు: చూ, పత్తాలంబము.

ఉపాశ్రితము, సం. విణ. ఆశ్రయింపఁబడినది: చూ, సంశ్రితము

ఉపాసంగము, సం. వి. అ. పుం. తూణీరము: చూ, బాణము. 1-౩.

ఉపాసకుఁడు, సం. విణ. కొలువుకాఁడు: చూ, సేవకుఁడు. 1.

ఉపాసన, సం. వి. ఆ. స్త్రీ, అ, న. కొలువు: చూ, శుశ్రూష.

ఉపాసనము, సం. వి. అ. న. 1. కొలువు: చూ, శుశ్రూష, 2. విలువిద్య నేర్చుట: చూ, శరాభ్యాసము; 3. ఆసనము: చూ, సింహాసనము; 4. బాధ: చూ, విపత్తు.

ఉపాసము, వై. వి.＝ఉపవాసము. ఉ. హరి. 2; ఆ. 166; చూ, ఉపవస్తము. 1-౨.

ఉపాసించు, సం. స. క్రి. కొలుచు ; చూ, సేవించు.

ఉపాసితుఁడు, సం. విణ. ఉపచరితుఁడు: చూ, సేవితుఁడు.

ఉపాస్తి, సం. వి. ఇ. స్త్రీ. కొలువు : చూ, శుశ్రూష.

ఉపాస్యుఁడు, సం. విణ, ఉపాసింపఁదగినవాఁడు, చూ, సేవ్యుఁడు.

ఉపాహితము, సం. వి. అ. పుం. 1. నిప్పురగిలించిన పిడుగుల వరుస: చూ, తోఁకచుక్క; 2. అంజన్యము: చూ, తోఁకచుక్క; విణ. 3. మఱియొక పదార్థముతోఁ గూర్పఁబడినది: చూ, సంయోజితము; 4. ఆరోపింపఁబడినది: చూ, విషయి. 4.

ఉపాహృతము, సం. విణ. 1. పొందఁబడినది: చూ, వ్యాప్తము. 3; 2. పట్టుఁబడినది.

ఉపేంద్రవ్రజ, పా. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్క పాదము నందు జ, త, జ, గ, గ, ములు గలిగి ఎనిమిదవయింట యతిగల పదునొకండవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—క్షమాధరాయ త్త-జగ్గంబుల్, బ్రహ్మార్ణమై దంతివి-రామ మొప్పన్, ద్విపాధిపత్రాత సు-తంపఁజేసె, యుపేంద్ర వ్రజమ్మై-యు స్థిరిత్వ.": వృత్తము. 1.

ఉపేంద్రుఁడు. సం. వి. అ. పుం. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.

ఉపేక్ష, సం. వి. ఆ. స్త్రీ. 1. అశ్రద్ధ: చూ, మందెమేలము. 2: అం. 2. చూ, ఉపాయములు; 3. చూ, ఉపాయములు. (నాయకుఁడు నాయికయొక్క కోపమును పోగొట్టునప్పు డుపయోగించునది.)

ఉపేక్షకుఁడు, సం. విణ. ఉపేక్షించువాఁడు: చూ. కన్నడీఁడు.

ఉపేక్షము, అం. చూ, యానపంచకము.

ఉపేక్షించు, సం. స. క్రి. అశ్రద్ధచేయు: చూ, కన్నడించు.

ఉపేక్షితము, సం. విణ. అనాదరణ చేయఁబడ్డది: అనాదరణము, ఉపావృతము.

ఉపేక్షితుఁడు, సం. విణ. చూ, ఒప్పరికింపఁబడనివాఁడు.

ఉపేక్ష్యయానము, అం. చూ, యానములు.

ఉపేక్ష్యాసనము, అం. నే నే శత్రువులను సంహరింపఁగలనను తలంపుతో దేశకాలాదులను పరిశీలింపక కదలిపోవుట. ఆసనము లయిదింటిలో నొకటి: ఆసనము. 4.

ఉపేత, సం. విణ. 1. ఉపాయశాలి: చూ, సమర్థుఁడు; 2. సమీపించువాఁడు.

ఉపేతము, సం. విణ. కూడుకొన్నది: చూ, సంయుక్తము.

ఉపోఢము, సం. విణ. 1, చెంతనున్నది: చూ, సమీపము. 2; 2. ఉన్నరూపు: చూ, సత్యము. 1; 3. వివాహమైనది. చూ, వివాహము. 1-3; 4. మొలిచినది, కందళితము: చూ, సంఘాతము; 5. గట్టియైనది: చూ, వృత్తము. 6.

ఉపోఢుఁడు, సం. విణ. అంసలుఁడు: చూ, లావరి.

ఉపోదక, సం. వి. ఆ. స్త్రీ. అపోదకి *: చూ, బచ్చలి.

ఉపోదకి, సం. వి. ఈ. స్త్రీ. రూ - —పై.—

ఉపోదిక, సం. వి. ఆ. స్త్రీ. రూ - —పై.—

ఉపోద్ఘాతము, సం. వి. అ, పుం. 1. చెప్పెడి యర్థమునకు సరితాఁకునట్లు యెత్తిచూపెడి అర్థాంతరము: చూ, నిదర్శనము. 1; 2. వాక్యారంభము: చూ, వాఙ్ముఖము; 3. అనుక్రమణిక: చూ, విషయసూచిక.

ఉపోపవిష్టుఁడు, సం. వి. అ. పుం. దగ్గఱ కూర్చున్నవాఁడు, చూ, ఉపవిష్టుఁడు.

ఉపోషణము, సం. వి. అ. న. చూ, ఉపవస్తము, 1-2.

ఉపోషితుఁడు, సం. విణ. చూ, పస్తున్నవాఁడు.

ఉప్తకృష్టము, సం. విణ. దున్ని విత్తులువేసిన పొలము: చూ, భూమి. 1-౨౨.

ఉప్తము, సం. వి. అ. న. 1. కుంకుమము, నుదుట ధరించు రాగద్రవ్య విశేషము: చూ, సిందూరము: 1; విణ. 2. విత్తఁబడినది (నేల.): చూ. భూమి. 1-౨౨; (చూ, వాపితము. 2.)

ఉప్తి, సం. వి. ఇ. స్త్రీ. బీజావాపము: చూ, వెద. 2.

ఉప్పకుఁ జప్పకుఁగాఁ జూచుట, జా. మంచిచెడ్డలకుఁ జూచుట. "క. ఒకతెవలె నాడి యాడిం, చుకొనుటనే యిరుగు పొరుగు జూచెనొకో యు, ప్పకుఁ జప్పకుఁగానను జా, చుక నమవఁగ వలెఁ గులీన శుకసల్లాపల్." నిరంకుశోపాఖ్యానము.

ఉప్పట్టి, దే. వి. రూ - ఉప్పట్టు: చూ, బాలక్రీడ.

ఉప్పట్టు, దే. వి. —పై.— (రూ - ఉప్పుఁబట్టు.)

ఉప్పత, దే. వి. ఓర్పులేనితనముచేత ఆడిపోసికొనుట: చూ, రవ్వ. 1.

ఉప్పత్తి, వై. వి. = ఉత్పత్తి: చూ, సంభవము.

ఉప్పతించు, వై. అ. క్రి. ఓర్పులేనితనముచేత ఆడిపోసికొను, చూ, విలపించు.

ఉప్పతిల్లు, వై. అ. క్రి. 1. జనించు: చూ, సంభవించు, 2. అతిశయించు. చూ, సందడించు.

ఉప్పఁదనము, దే. విశే. లవణధర్మము: చూ, కటువు.

ఉప్పని, దే. వి. 1. ఉప్పు; నీళ్ళవంటిది: చూ, లవణము. 1. 2: లవణధర్మము: చూ, కటువు; 3. చవుటినేల: చూ, భూమి. 1-ఒ.

ఉప్పనిఁబట్టలు, దే. వి. బ. ఉప్పుఁబట్టు, ఉ. హరి. ౫, ఆ. 141: చూ, బాలక్రీడ. (ఉప్పట్టిఅనియు వాడుక)

ఉప్పర, దే. వి. 1, మట్టిత్రవ్వి బ్రతికెడు జాతి, "ఉప్పరవాఁడు." "ఉప్పరది."; 2. మట్టిత్రవ్వి బ్రదికెడువాఁడు: చూ, ఖనకుఁడు; 3. ఉప్పరవాని పెండ్లాము: ఉప్పరది.

ఉప్పరది, దే. వి. చూ; ఉప్పర, 3.

ఉప్పరము, వై. వి. 1. = అభ్రము: చూ, సురవర్త్మము, 2. ఊర్ధ్వభాగము, ఆము. ౫, ఆ. 104; జై. ౫, ఆ. 139; భార. విరా. 3, ఆ. 177; చూ, మీఁదు. 2.

ఉప్పరవాఁడు, దే. వి: చూ. ఉప్పర. 2.

ఉప్పరవీది, ద్వ. వి. మిన్ను: చూ. ఉప్పరము. 1.

ఉప్పరించు, దే. స. క్రి. మల్లయుద్ధక్రియా విశేషము ఉ, హరి. 6, ఆ. 108: రూ - ఉప్పళించు.

ఉప్పరింత, దే. వి. అగ్నిభాస *: చూ, మానేరు, రూ - (ఉప్పిరింత.)

ఉప్పరిగ, వై. వి. ఉపకారికా. మిద్దెమీఁది కట్టడము: చూ. సదనము. 1-౬౫; (రూ - ఉప్పరిగె.)

ఉప్పలవాయి, దే. వి. బొట్టన జుట్టనవ్రేళ్ళ నడుము. భార. అను. 4, ఆ. 113.

ఉప్పలి, దే. వి. ఆపద: చూ, విపత్తు.

ఉప్పవడము, దే. వి. రూ - ఉపవడము. పర. 3, ఆ. 56: చూ, మేలుకోలు.

ఉప్పళము, దే. వి. (ఉప్పు+అలము.) 1. ఉప్పుపంట పెట్టెడు నేల: చూ, భూమి. 1-౮౯; 2. ఉప్పురాసులుండు చోటు: చూ. భూమి. 1 ౧౮.

ఉప్పళించు, దే. స. క్రి. చూ, రూ - ఉప్పరించు. భార. విరా. 2. ఆ, 16.

ఉప్పి, దే. వి. కుండలి * చూ, లవణి. (నల్లఉప్పిఅని కొందఱు)

ఉప్పిఁడి, దే. విశే. (ఉప్పు+ఇఁడి.) ఉప్పులేనిది: చూ, చప్పిఁడి. కాశీ. 2, ఆ. 83.

ఉప్పిరింత, దే. వి: చూ, రూ - ఉప్పరింత. *

ఉప్పిలము, దే. వి. చూ, ఉప్పుఁబఱ్ఱ.

ఉప్పిళ్ళు, దే. వి. పక్షిప్రభృతిహితంపులయులు, ఉప్పుడు: చూ. బియ్యము, 1-౪.

ఉప్పు, దే. వి. 1. నీళ్ళవంటిది; చూ, లవణము: స. క్రి. 2. ఆవిరిపోర యుడికించు: చూ, అలించు;

ఉప్పుఁగండ, ద్వ. వి. ఉప్పువమిరి యెండఁబెట్టిన మాంసము: చూ, కు క్రము, 2-౯; (రూ - ఉప్పుగండ.)

ఉప్పుఁగడలి, దే. వి. (ఉప్పు+కడలి.) లవణసముద్రము, చూ, సముద్రము, ౧.

ఉప్పుఁగల్లు, ద్వ వి. ఉప్పురాయి (నూ. ని.)

ఉప్పుఁగాయ. దే. వి. (ఉప్పు+కాయ.) ఊరుఁగాయ. అని. 1. ఆ, 105: చూ, ఉచిఁగాయ.

ఉప్పుగుండము, దే. వి. (ఉప్పు+కుండము) బాలక్రీడలలో నొకటి: చూ, బాలక్రీడ.

ఉప్పుఁగొటారు, ద్వ. వి. ఉప్పునట్టు (సూ. ని.)

ఉప్పుఁజేఁప, దే. వి. (ఉప్పు+చేఁప.) ఉప్పుచమిరి యెండబెట్టిన చేఁప: చూ, మత్స్యము. 1.

ఉప్పుఁబట్టు. దే. వి. చూ, రూ-ఉప్పట్టు.

ఉప్పుఁబఱ్ఱ, దే. వి. (ఉప్పు+పఱ్ఱ) తనంతట ఉప్పుపండెడునేల: చూ, భూమి. 1-౮౯.

ఉప్పుఁబిండి, వా. వి. చూ. ఉప్పుడుపిండి

ఉప్పుకూర, ద్వ. వి. చూ, ఈల, ఈలకూర *. ఉప్పుడు; దే. వి. ఉప్పుడుబియ్యము: చూ, బియ్యము. 1-౪.

ఉప్పుడుపిండి, ద్వ. వి. 1. వరి గోధుమలోనగు పిండితోఁజేసిన భక్ష్యము: చూ, భక్ష్యము; 1-౧౫ (వైధవ్యమునొందిన యాఁడువారురాత్రులయందు ఫలహారముగనుపయోగింతురు.)

ఉప్పుతోఁదొమ్మిది, జా. సమస్తము. "ఉప్పుతోఁదొమ్మిదియను బెట్టి కృపణరక్షణము గావించునే గుణసముద్రుఁడు." రామాభ్యుదయము.

ఉప్పునీరు, ద్వ. వి. క్షారోదకము: చూ, సలిలము. 1-౧౮.

ఉప్పుమన్ను, ద్వ. వి. క్షారమృత్తిక: చూ, భూమి. 1-ఒ.

ఉప్పులూరు, వా. వి. 1. ఒకానొక గ్రామనామము (కడపజిల్లాలోనిది; ఉప్పలూరనివాడుక); 2. గ్రామనామము ఇంటిపేరు గాఁగలవారు (కాకినాడ, గుడివాడ మొ॥ కలరు); 3. ఉప్పుపంటగల గ్రామము.

ఉప్పులేక ముప్పందుముత్రాగుట. జా. తనకాధారము లేకపోయినను గొప్పపనులకుఁ బ్రయత్నించుట, బడాయి గొట్టుట, దంబములు గొట్టుట. "ఉప్పు లేక ముప్పందుముత్రాగుచు గద్దెపొంకములు చాల దిద్దగలరే." ధర్మజ రాజసూయము.

ఉప్పులేనికూర, జా. చప్పిడికూర. "ఉప్పులేనికూర యొప్పదు రుచులకుఁ బప్పులేనితిండి ఫలములేదు, అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు." వేమన. 589.

ఉప్పువాము. దే. వి. ఉప్పుపంట పైరుపెట్టెడిచోటు: చూ, భూమి. 1-౮౯.

ఉప్పెన. వై. వి. 1. సముద్రోల్బణము: చూ, పొంగు. 3; 2. వరావరి. చూ, విజృంభణము,

ఉప్పొంగు, దే. అ. క్రి.(ఉప్పి + పొంగు.) 1. మిక్కిలి యుబుకు. అతిశయించు : చూ, సందడించు, 2. మిక్కిలి సంతోషించు : చూ, సంతోషించు, 3. చెంగలించు : చూ, విజృంభించు; 4 : చూ, ఒడ్డగిలు. 3.

ఉబలాటము, దే. వి. 1. ఉత్కంఠ : చూ, తహతహ; 2. జాలి : చూ, దయ; 3. మిక్కిలి కోరిక : చూ, వాంఛ. 1-౧.

ఉబుకు, దే. వి. 1. ఉప్పెన : చూ, పొంగు. 3; అ. క్రి. 2. అతిశయించు, పొంగు : చూ. సందడించు.

ఉబుసు, దే. వి. 1. పనిలేనికాలము. కళా. 3, ఆ. 4 : చూ, రూ-ఊసు; 2. తొల్లింటికత. వృత్తాంతము. విక్ర. 6, ఆ. 38: చూ, సమాచారము. 2.

ఉబుసుపోక, వా. వి. పనిలేకపోవుట : ఊరోప్పక, ఊసుపోక.

ఉబ్బ, వై. వి. = ఊష్మః : చూ, ఔష్ణ్యము.

ఉబ్బకము, వై. వి. 1. అతిశయము : చూ, హేరాళము. 1; 2. ఉత్సాహము. పంచనా. 2, ఆ. 11 : చూ, సన్నాహము. 3. ఆనందము : చూ, హ్లాదనము.

ఉబ్బతిల్లు, వై. అ. క్రి. రూ-ఉబ్బతిల్లు : చూ, సందడించు.

ఉబ్బనీరు. వై. వి. రూ- ఉమ్మనీరు. ప్రసవజలము : చూ, సలిలము. 1-౧౩.

ఉబ్బరపోవు, ద్వ. అ. క్రి. (ఉమ్మరము + పోవు.) చేష్టలుడిగి యేమితోఁచక అట్లైనిలుచు. నై. ౪,ఆ.95:చూ, వెఱఁగుపడు.

ఉబ్బరము, వై. వి. 1. అజీర్తి : చూ, రోగము. 1; 2. నీరుకట్టు తెవులు : చూ, మూత్రకృచ్ఛ్రము. (మూత్రద్వారమందు బాయి పెరగడము); 3. కడుపు పొంగరించుట : చూ, పొంగరింపు; 4 = ఉల్బణమ్. అతిశయము. భీ. 3, ఆ. 57 : చూ, హేరాళము. 1.

ఉబ్బరించు, వై. అ. క్రి. 1. అజీర్తిచేయు, ఉబ్బు: చూ, పొంగు. 9; 2. అతిశయించు. రా. యు. కాం. 339. (ఇక్కడ ఉబ్బరింపక అనగా మీఱక అని యర్థము.) చూ, సందడించు.

ఉబ్బలి, దే. వి. 1. రూ-ఉమ్మలి. రసి. 6, ఆ. 45 : బురద, చూ, సుబ్బలి; కజ్జురము * : చూ, మధుఖర్జూరిక.

ఉబ్బసము. వై. వి. 1. = ఉచ్ఛ్వాసః, పొడిదగ్గు : చూ. దగ్గు; 2. ఊర్ధ్వశ్వాసరోగము : చూ, ఊర్ధ్వశ్వాస.

ఉబ్బించుట, దే. వి. ఉద్వేగము : చూ, ఉద్భ్రమము. 1.

ఉబ్బు, వై. వి. 1. అనుమోదము : చూ, హ్లాదనము; 2 కడుపుబ్బుట, అజీర్తి ; చూ, రోగము. 1; 3.కడుపు పొంగరింపు: చూ, పొంగరింపు; వై. అ. క్రి. 4. అధిక్యమగు : చూ, ముమ్మరించు; 5. అజీర్తిచేయు:చూ, పొంగు. 9; 6. పొటమరించు. రా. అర. కాం. 150. చూ, లేచు; 7. ఆనందించు : చూ, సంతోషించు; 8. కండపట్టు : చూ, బలియు; వా. 9. బిల్ల. (ధర్మామీటరుయొక్క బిల్ల.)

ఉభయనాయకుఁడు, అం. చూ, నాయకత్రయము.

ఉభయపార్శ్వములు, అం. చూ, హస్తక్షేత్రములు.

ఉభయము, సం. స. ద్వి. 1. రెండవయవములుగలది; 2. గుడి పాడువత్తికాఁడును లోకులును జేరి చేయు నుత్సవము; చూ. సంబరము, 2-౧౨.

ఉభయయతులు, అం. భీమన పది, అనంతుఁ డిరువది, మఱొక్కరిరువదేను ననిరి: తుదకప్పకవి యతులు నాల్గు విధములు. స్వరయతులు, వ్యంజనయతులు. ఉభయయతులు, ప్రాసయతులు నని. స్వరయతులు 7, వ్యంజనయతులు 21, ఉభయయతులు 12, ప్రాసయతి 1 = మొత్తము 41. వీనికి వేర్వేఱ భేదములున్నవి: చూ, యతులు.

ఉభయశక్తిమూలము, అం. చూ, వ్యంజనములు.

ఉభయాలంకారము, సం. వి. అ. పుం. అలంకారములు మూడింటిలో నొకటి, (1. శబ్దాలంకారము, 2. అర్థాలంకారము, 3. ఉభయాలంకారము.): చూ, అలంకారము. 3.

ఉమ, సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. నూనెయగిసెవిత్తులు: చూ, లాలని; 3. నూనెయగిసె *: చూ, శుకనాసము. 1; 4. కాంతి: చూ, వెలుతురు. 1; 5. అనుజ్ఞ: చూ, సెలవు; 6. పసుపు: చూ, వర్ణము. 6-౭: అసము: చూ, యశస్సు.

ఉముక, దే. వి. రూ-ఉముక-ఊక: చూ, తుషము.

ఉమాకటము, సం. వి. అ. పుం. 1. ఆవిసెవిత్తులనూగు; 2.గడ్డి గలిగిన పొల్లుధాన్యము: చూ, బూగర. 1; 3. ఇంటివాసము లకుఁబట్టు బూసి: చూ, బూగర. 2.

ఉమాదము, వై. వి, = ఉన్మాదః. రూ-ఉమ్మాదము: చూ, వెఱ్ఱి.1.

ఉమాపతి, సం. వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు. 1.

ఉమాపిత, సం. వి. ఋ. పుం. హిమాలయము: చూ, పర్వతము. 1-౨౭.

ఉమాప్రియము, సం. వి. అ. పుం. మొగులుకడిమి *: చూ, హలిప్రియము. 1-౧.

ఉమాప్రియుఁడు సం. వి. అ. పుం. చూ, ఉమాపతి.

ఉమామృతము, సం. వి. అ. పుం. కొండగోనుగు *: చూ, మృదుద్రుమము.

ఉమాసుతుఁడు, సం. వి. అ. పుం. 1. గణపతి, ఇద్దరుతల్లుల ముద్దుబిడ్డఁడు: చూ, వినాయకుఁడు. 1; 2. కుమారస్వామి, సుబ్రహ్మణ్యేశ్వరుఁడు: చూ, స్కందుఁడు.

ఉమి,వై. వి. = ఊర్మి. రూ-ఉమ్మి: గల్యము: చూ,రసనామలము.

ఉమియు, వై. స. క్రి. ఉమ్మివేయు: చూ, తూపొడుచు.

ఉముకనిప్పు, ద్వ. వి. తుషానలము: చూ, వహ్ని. 1-౩౨.

ఉమేజువారీ, వా.వి. పనిచేయక చేయు కట్టుపెత్తనము.

ఉమేశుఁడు, సం. వి. అ. పుం. చూ, ఉమాపతి.

ఉమోద్భవుఁడు, సం. వి. అ. పుం. చూ, ఉమాసుతుఁడు. (ఇట్లు ఉమోదితము, ఉమోదంతము, ఉమోదయము, ఉమోత్పన్నుఁడు, ఉమోజ్జీవితుఁడు, ఉమోత్తారకుఁడు, ఉమోద్వాసితుఁడు, ఉమౌజ్జ్వల్యము, ఉమౌదార్యము, ఉమౌపమ్యము, ఉమౌచిత్యము, ఉమౌన్నత్యము. ఇత్యాదు లూహ్యంబులు.)

ఉమ్మ, వై. వి. 1 = ఊష్మః: చూ, రూ-ఉబ్బ; 2. ఏడుపు; చూ, శోకము 2.

ఉమ్మగిలు, వై. అ. క్రి. 1. ఆవిరిచే నుడుకు: చూ, వంటయగు. (రూ-ఉమ్మగిల్లు); 2. ఆవిరిచే నుడికిన పదార్థముయొక్క వేఁడిమి కొంతవఱకు చల్లారు: అనవటిల్లు, రూ-ఉమ్మగిల్లు.

ఉమ్మగిల్లు, —రూ-వై.—

**ఉమ్మడి**, దే. వి. 1. అవిభక్తత. భో. 6, ఆ. 137: చూ, పొత్తు. 8; 2. నిత్యపుఁగట్టడ. జై. 1, ఆ. 32 పీఠిక; ద్ర. 3. ఏకకాలమున. రస. 3, ఆ. 75. (ఇక్కడ పూర్వకవి ప్రయోగములయందొక్క శబ్దపూర్వకముగానే కానఁబడుచున్నది. భార. ద్రో. 2, ఆ. 55. చూ, యుగపత్.

**ఉమ్మడిపేరము**, ఆం. చూ, వివాదములు.

**ఉమ్మరము**, వై. వి. = ఊష్మః: చూ, రూ-ఉమ్మ. 1.

**ఉమ్మరించు**, దే. అ. క్రి. రూ-ఉమ్మలించు: చూ, దుఃఖించు.

**ఉమ్మనీరు**, వై. వి: చూ, రూ-ఉబ్బనీరు.

**ఉమ్మలక**, వై. వి. = ఊష్మః: చూ, ఔష్మ్యము.

**ఉమ్మలము**, దే. వి. ఏడుపు: చూ, దుఃఖము.

**ఉమ్మలి**, దే. వి: చూ, రూ-ఉబ్బలి. కళా. 6, ఆ. 224.

**ఉమ్మలించు**, దే. అ. క్రి. 1. వగచు, రూ- ఉమ్మలికించు, భార. శల్య. 2, ఆ. 213: చూ, శోకించు; 2. ఏడుచు, రూ-ఉమ్మలికించు. భార. సౌ. 1, ఆ. 217: చూ, రోదించు; స. క్రి. 3. చుట్టు: చూ, వేష్టించు.

**ఉమ్మలింపు**, దే. వి. 1. ఊష్మము: చూ. ఉబ్బరము: 2. వగ: చూ, శోకము. 2.

**ఉమ్మలిక**, దే. వి. 1. రూ-ఉమ్మలికము. వగ. భార. ఉద్యో. 1, ఆ. 107: చూ, దుఃఖము; 2. ఊష్మము: చూ, ఉమ్మరము.

**ఉమ్మలికము**, దే. వి.—పై.— భార. విరా. 1, ఆ. 91.

**ఉమ్మలికించు**, దే. అ. క్రి. 1. వగచు, చూ, రూ-ఉమ్మలించు: 2. ఏడుచు, రూ ఉమ్మలించు. భార. భీష్మ. 3, ఆ. 415: చూ, రోదించు.

**ఉమ్మాదము**, వై. వి.=ఉన్మాదః. రూ-ఉమాదము; చూ, వెఱ్ఱి. 1.

**ఉమ్మాయముత్తియము**, ద్వ. వి. క్షుద్రమౌక్తికము, ఆణిపూస: చూ, రత్నములు. ౧-(౯).

**ఉమ్మారావులు**, వా. వి. రాజకీయోద్యోగులు: రూ- ఉమ్రావులు.

**ఉమ్మి**, వై. వి. = ఊర్మి, చూ, రూ- ఉమి.

**ఉమ్మినీరు**, ద్వ. వి. నాలుకనుండిఁబుట్టుచొంగ: చూ, లాల.

**ఉమ్మెత**, వై. వి. = ఉన్మత్తః, రూ-ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.

**ఉమ్మెత్త**, వై. వి. = ఉన్మత్తః—పై.—

**ఉమ్మెత్తముల్లు**, ద్వ. వి. చూ, మదనకంటకము.

**ఉమ్యము**, సం. విణ. ఏగిసవడ్లు, అగిసెచెట్లు పండునేల: చూ, భూమి. 1-౨౩.

**ఉమ్రావులు**, వా. వి. చూ, రూ-ఉమ్మారావులు.

**ఉయాల**, ద్వ. వి. రూ- ఊయేల, డోలిక, లాలి: చూ, సవారి 1-౧౦.

**ఉయేల**, —పై.—

**ఉయ్యల**, పై.—కళా. 6, ఆ. 193.

**ఉయ్యాల**, పై.—హరి. ఉ. 6, ఆ. 38.

**ఉయ్యాలతొట్టి**, పై.—వి. పు. 7, ఆ. 125.

**ఉయ్యాలచేఁబులుఁగు**, ద్వ. వి. బెగ్గురు: చూ, సారసము. 2.

**ఉయ్యాలపులుఁగు**, ద్వ. వి.—పై.—

**ఉయ్యాలమంచము**, ద్వ. వి. డోలిక. కళా. 2, ఆ. 15. (రూ ఉయ్యెలమంచము — ఉయ్యేలమంచము.): చూ, శయ్య 1-(౯).

**ఉయ్యెలమంచము**, —పై.—

**ఉయ్యేలమంచము**, —పై.—

**ఉయ్యెల**, ద్వ. వి. డోలిక. రూ-ఉయ్యేల. భార. ఆర. 2. ఆ, 79; చూ, రూ- ఉయాల.

**ఉయ్యేల**, —పై.—

**ఉరంగము**, సం, వి. అ. పుం. పాము: చూ, సర్పము.

**ఉరఃకిరణము**, సం. వి. అ. పుం. ఒంటె: చూ. లొట్టిపిట్ట.

**ఉరఃపార్శ్వమండలము**, ఆం. చూ, స్వతహస్తములు.

**ఉరక**, దే. అవ్య. తూష్ణీమర్థకము, ఏదేనియొకటిలేక యనునర్థమును దెలిపెడి. అచ్చ. యు, కాం. 499 ; రూ-ఊరక : చూ, మిన్నక.

**ఉరగము**, సం. వి. అ. పుం. 1. పాము; చూ, సర్పము; 2. పాముగుపేఁప : చూ, మత్స్యము. 1-౧౭. 3. అంబాడుపిడుజు: చూ, బుద్ధపిడుఁదు. 1-౩.

**ఉరచ్ఛదము**, సం. వి. అ. పుం. రూ- ఉరశ్ఛదము, కవచము: చూ, వారవారణము.

**ఉరడించు**, దే. అ. క్రి. 1. రూ- ఉరణించు, చెంగలించు: చూ, విజృంభించు; 2. రూ- ఉరణించు, వెలుఁగు: ప్రకాశించు. 1; చూ, హావణిల్లు. 3. రూ-ఉరణించు. వేగిరపడు. హరి. ఉ. 8, ఆ. 117: చూ, సంభ్రమించు.

**ఉరణము**, సం. వి. అ. పుం. పొట్టేలు: చూ, మేషము. 1.

**ఉరణాక్షము**, సం. వి. అ పుం. తగిరిస*: చూ, ప్రపున్నాటము.

**ఉరణాఖ్యము**, సం. వి. అ. పుం.—పై.—

**ఉరణించు**, దే. అ. క్రి: చూ, రూ-ఉరడించు.

**ఉరప**, దే. వి. ఱొమ్ము: చూ, వక్షము.

**ఉరపత్రి**, సం. వి. ఈ. స్త్రీ. ఇంగువచెట్టుఆకు; ఉగుపత్రి.

**ఉరభ్రము**, సం. వి. అ. పుం. పొట్టేలు: చూ, మేష... 1.

**ఉరమరి**, దే. వి. రమారమి, ఇంచుమించు: చూ, వేఱుపాటు. 1.

**ఉరము**, వి. స్. న 1. ఱొమ్ము: చూ, వక్షము; అం. 2. శరీరాంగములలో నొకటి: చూ, శరీరాంగములు. (చూ, అంగము. 9.); విణ. 3. మిన్న, ముఖ్యమైనది: చూ. శ్రైష్ఠ్యము.

**ఉరరి**, సం. వి. ఈ. స్త్రీ. 1. విస్తారము: చూ, వెడలుపు; అవ్య. 3. అంగీకారార్థకము: చూ, సమ్మతము.

**ఉరరీకృతము**, సం. విణ. అంగీకరింపఁబడినది: చూ. స్వీకృతము.

**ఉరరీకృతి**, సం. వి. ఇ. స్త్రీ. అంగీకారము: చూ. సమ్మతి. 1.

**ఉరలగడ్డ**, దే. వి. ఆలువు *. చూ, గెనుసు. బంగాళాదుంప.)

**ఉరలఁబడు**, ద్వ. అ. క్రి. (ఉరలఁగ + పడు.) రూ-ఉర్లఁబడు: పొరలఁబడు: చూ, లుఠనమగు

**ఉరలఁబాఱు**, దే. అ. క్రి. (ఉరలఁగ + పాఱు.) కదలు. చూ, చలించు.

**ఉరలు**, దే. అ. క్రి. 1 రూ-ఉర్లు. హరి. పూ. 5, ఆ. 206; చూ, ఉరలఁబడు; 2. కాఱు, భార. విరా. 2, ఆ. 138: చూ,

2; 3. ముందునడచుట. వసు. 2, ఆ. 114: 4. మొదటిగాలి వీచుట. ఆము. 4, ఆ. 130. (ఇక్కడ మొదలుశబ్దమునకు పూర్వమర్థము.); విణ. 5. మొదటిది. హ. 2, ఆ. 53: చూ, మొదలు 1; 6. ముందునడచునది." హ. 3, ఆ. 51.

ఎలగోలుజల్లు, ద్వ. వి. చూ, ఎలగోలు. 1.

ఎలగోలుసేన, వా. వి. ముందునడచుసేన: చూ, సేన. 1-ఎ.

ఎలకోట, దే. వి. ఆరామము. కళా. 1, ఆ. 62: చూ, వనము. 2.

ఎలనవ్వు, ద్వ. వి. స్మితము, చిరునవ్వు: చూ, హాస్యము. 1.

ఎలనాగ, దే. వి. 1. ఆడుది : చూ, స్త్రీ. 1; 2. యౌవనముఁగల యాఁడుది. భార. ఆర. 5, ఆ. 10: చూ, స్త్రీ. 1-ఎ.

ఎలనీరు, ద్వ. వి. చూ, రూ- ఎలనీరు.

ఎలమావి, ద్వ. వి. సహకారము, తేనెమామిడి *: చూ, మామిడి. 1—ఎ.

ఎలమి, దే. వి. 1. ఆనందము: చూ, హ్లాదనము; 2. ప్రేమము, ఎలసము: చూ, స్నేహము. 1: 3. ఉద్భోధము, ఐలి. భార. విరా. 3, ఆ. 56; భార. ఉద్యో. 2, ఆ. 110: చూ, వికాసము.

ఎలమికాఁడు, దే. విణ. ఉద్బోధయుక్తుఁడు: చూ, వికాసవంతుఁడు.

ఎలయు, దే. స. క్రి. 1. పొందు. భార. శాంతి. 4, ఆ. 451: చూ, సక్రమమగు; అ. క్రి. 2. చేరు. భార. భీష్మ. 1, ఆ. 101: చూ, సమీపించు; 3. చొచ్చు. భార. శాంతి. 5, ఆ. 493: చూ, నోటు. 4; 4. జనించు. భార. ఆర. 7, ఆ. 374: చూ, సంభవించు; 5. అక్కఱపడు. భార. ఆర. 5, ఆ. 81: చూ, వాంఛించు.

ఎలరాచు, దే. అ. క్రి. (ఎలర్ + ఆచు.) 1. అతిశయించు, అంపిల్లు: చూ, సందడించు; 2. ఒప్పు. చూ, సమ్మతించు.

ఎలరు, దే. వి. 1. అతిశయము: చూ, హేరాళము. 1; 2. ఉద్బోధము: చూ, వికాసము.

ఎలరుచు, దే. అ. క్రి. 1. రూ- ఎలర్చు. అతిశయించు. హరి. ఉ. 8, ఆ. 115: చూ, సంపడించు; 2. రూ- ఎలర్చు. విరియు. ఆము. 5, ఆ. 104: చూ, వికసించు; 3. రూ- ఎలర్చు. ఆనందించు. భార. ఉద్యో. 4. ఆ, 158: చూ, సంతోషించు.

ఎలరుపు, దే. వి రూ- ఎలర్పు. ఆనందము: చూ, హ్లాదనము.

ఎలర్చు, దే. అ. క్రి: చూ, రూ- ఎలరుచు.

ఎలర్పు, దే. వి: చూ, రూ- ఎలరుపు. భార. శాంతి. 6. ఆ. 574.

ఎలసము, దే. వి. 1. ఉత్సాహము, పూనిక: చూ, సన్నాహము; 2. ప్రేమము, చెలిమి: చూ, స్నేహము. 1.

ఎలికె, వా. వి. చూ, రూ- ఎలుక. "ఎలికెవల."

ఎలికెబోను, వా. వి. ఎలుకలఁబట్టుబోను: ఎలికెవల, ఎలుకబోను.

ఎలుకెవల, వా. వి.—పై.—

ఎలిసె, దే. వి. వాచూరు: చూ, రూ- పెలిసె.

ఎలుగించు, దే. అ. క్రి. కూయు. భార. ఆర. 6, ఆ. 194. (లక్షణ ప్రకారము ఎలిగించు అని యుండవలయును.): చూ, శబ్దించు.

ఎలుఁగు, దే. వి. 1. రూ-ఎల్గు. ఎలుఁగు: చూ, స్వరము; 2. రూ-ఎల్గు, భల్లూకము: చూ, వెలుఁగుబంటి.

ఎలుఁగుగొడ్డు, ద్వ. వి. చూ, వెలుఁగుబంటి.

ఎలుఁగుబంటి, —పై.—

ఎలుక, దే. వి. 1. రూ- ఎలక - ఎలికె: చూ, మూషికము; 2. ఈలిబాధ లాభించిలో నొకటి: చూ, పందికొక్కులు. (చూ, ఈతిబాధలు.)

ఎలుకపిల్లిపోషీ, లో. ఎలుకను బట్టునది పిల్లిగావున నిరుప యోగమని భావము.

ఎలుకచెవి, ద్వ. వి. మూషకపర్ణి *: చూ, స్ఫోటకోష.

ఎలుకచెవిపల్లిక, —పై.—

ఎలుకచిడి, —పై.—

ఎలుకచిడిపల్లిక, —పై.—

ఎలుకబోను, ద్వ. వి. చూ, ఎలికెబోను.

ఎలుకమొటెక్కు, ద్వ. వి. చూ, ఎలుకచెవి *.

ఎలుఁగు, దే. వి. చూ, రూ- ఎలుఁగు. (రూ- ఎల్గు.)

ఎల్గు, — రూ.—పై.—

ఎవక్రోసిటీ, వా. విస్మృత్యుక్తి: చూ, విస్మృత్తు.

ఎల్ల, దే. వి. 1. పొలిమేర: చూ, సీమ. 1; ద్ర. 2. ఎల్లవెంట. సమస్తము. చూ, సర్వము.

ఎల్లపుడు, దే. వి. రూ- ఎల్లప్పుడు: చూ, సతతము. 2.

ఎల్లపుడు బ్రిమ్మరు తేరుదొర, ద్వ. వి. చూ, మన్మథుఁడు.

ఎల్లప్పుడు, దే. వి. చూ, రూ ఎల్లపుడు.

ఎల్లమ్మ, ద్వ. వి. (ఎల్ల + అమ్మ.) ఎల్లయందుండు ఒకానొక గ్రామదేవత, పొలిమేరమ్మ: చూ, మహాలక్ష్మి. 3.

ఎల్లరు, దే. స. బ. (ఎల్ల + వారు.) (దీనికి ఏ-వ. ఎల్లవాఁడు.): చూ, అందఱు. 1-2. (రూ-ఎల్లవారు.)

ఎల్లవాఁడు, దే. స. ఎవ్వఁడును. సౌ. 1. ఆ. 45; చూ, వేఁడు (చూ. ఎతఁడు.)

ఎల్లవారు, దే. స. బ. 1. సమస్తపురుషులు, సమస్తస్త్రీలు: చూ, అందఱు- రూ. అందొఱు, ఎల్లరు; 2. అంత సంఖ్యగలవారు అందఱు- రూ-అందొఱు, ఎల్లరు.

ఎల్లవెంట, దే. ద్ర. ఎల్లవెంటను: చూ, సర్వము.

ఎల్లవెంటను, దే. ద్ర.—పై. – ఆం. భా. 3. కాం. 74.

ఎల్లాఁడి, దే. వి. (ఎల్ల + అఁడి.) 1. దొంగ: చూ, హారకుఁడు: 2. అడవియందుఁ జోటుచేసికొని ఎల్లయందుండి కొట్టి దోఁచెడు దొంగ: చూ, హారకుఁడు. 1-ఎ.

ఎల్లాఁడికత్తియ, ద్వ. వి. దొంగతనముగల స్త్రీ: చూ, స్త్రీ; 1-అం. (రూ- ఎల్లాఁడికత్తె.) (చూ. ముచ్చు. 1.)

ఎల్లి, దే. వి. ఏ. 1. పశ్చాద్దినము. భార. ఉద్యో. 2, ఆ. 130; వేమన. 701: చూ, తేపు; 2. గొఱుగు. భార. శల్య. 1, ఆ. 133: చూ, వారిత్ర.

ఎల్లితము. దే. వి. 1. రూ-ఎల్లిదము. తిరస్కారము: చూ, వహేలనము; విణ. 2.—పై.—.

ఎల్లిదము, దే. వి. విణ.—పై.—(చిణయందు- భార. అశ్వ. 1. ఆ. 81; భార. విరా. 5, ఆ. 317: భార ఉద్యో. 2. ఆ. 88.

ఎల్లిదుఁడు, దే. విణ. దుష్టుఁడు, మలినమైన బుద్ధిగలవాఁడు. నిర్వ. 8, ఆ. 7: చూ, వ్యాధుఁడు. 2.

ఎల్లుండి, దే. వి. రేపటికి అవలిదినము.

ఎల్లువెలినోటిమెకము, ద్వ. వి. బెబ్బులికిని చిరుతపులికిని పుట్టిన పులి. ఝల్లాకము. సాంబ. 4. వచ్చి. 2: చూ, వెలుఁగుబంటి.

ఎల్లెత, దే. వి. పందిరి లోనగువానిలోపలి మీఁదఁ గట్టెడు మేలుకట్టు. ఉల్లెత: చూ, వితానము.

ఎల్లెలుక, ద్వ. వి. రాజమూషికము. రూ-ఎల్లెల్క: చూ, మూషికము. 1-౩.

ఎల్లెల్క. —పై.—

ఎవఁడు, దే. వి: చూ, ఎతఁడు.

ఎవత, దే. స. ఏ, ఏయాఁడుది. రూ-ఎవతి: చూ, స్త్రీ. 1-౨౪.

ఎవతి, —పై.—(రూ-ఎవతె.)

ఎవతుక, (ఎవత + క.)—పై.— (ఇక్కడ స్వార్థమున కప్రత్యయము. కప్రత్యయము పరమగునపుడు ఉకారమువచ్చును. ఇట్లు ఇతరస్థలములయందును తెలియునది.) (రూ-ఎవ్వతుక.)

ఎవతె, —పై.—(రూ-ఎవ్వతె.)

ఎవయు, దే. అ. క్రి. రూ-ఎగయు. భార. సభా. 1. ఆ. 255: చూ, లంఘించు.

ఎవరిత, దే. స. ఏ. (ఎవరి + త.) రూ-ఎవర్త; చూ, స్త్రీ.

ఎవరితె, (ఎవరి + తె.)—పై.—(రూ-ఎవర్తె.)

ఎవర్త, —పై.—(రూ-ఎవరిత.)

ఎవర్తి, —పై.—(రూ-ఎవరితి.)

ఎవర్తుక, (ఎవర్త + క.)—పై.— (రూ-ఎవతుక.)

ఎవర్తె, —పై.—(రూ-ఎవరితె.)

ఎవుచు, దే. స. క్రి. 1. ఎగయుఁజేయు చూ, రూ-ఎగచు. 1; 2. తఱుము. రూ-ఎగచు. నిర్వ. 1, ఆ. 39; కకు. 5, ఆ. 37: చూ, వెంబడించు.

ఎవ్వ. దే. వి. కష్టము. ఇడుమ: చూ, శోకము. 2.

ఎవ్వఁడు, దే. వి. చూ, రూ-ఎవఁడు (ఎల్లవాడు.- భార. ఆర. 2; ఆ. 341.)

ఎవ్వత, దే. స. ఏ. ఏయాఁడుది. రూ-ఎవ్వరిత: చూ, రూ-ఎవత.

ఎవ్వతి, -పై.- (రూ-ఎవ్వరితి.)

ఎవ్వతుక, (ఎవ్వత + క.) -పై.- (రూ-ఎవతుక.)

ఎవ్వతె, —పై.— (రూ-ఎవ్వరితె.)

ఎవ్వరిత, (ఎవ్వరి + త. —పై.— (రూ- ఎవ్వర్త.)

ఎవ్వరితి, (ఎవ్వరి + తి.) —పై.— (రూ- ఎవ్వర్తి.)

ఎవ్వరితె, (ఎవ్వరి + తె.) —పై.— (రూ-ఎవ్వర్తె.)

ఎవ్వర్త, —పై.— (రూ- ఎవ్వరిత.)

ఎవ్వర్తి, —పై.— (రూ-ఎవ్వరితి.)

ఎవ్వర్తుక, —పై.— (రూ-ఎవ్వతుక.)

ఎవ్వర్తె, —పై.— (రూ- ఎవ్వరితె.)

ఎవ్వల, దే. వి. ఏప్రక్క, ఏవైపు. "క. ఇవ్విధముననే వర్ణము నెవ్వలఁ బొడలేకపోవ." హరి. ఉ, 9. ఆ. 57: చూ, రూ-ఏవల.

ఎవ్వాఁడు, దే. స. (ఎ + వాఁడు.): చూ, రూ- ఎవ్వఁడు.

ఎస, దే. వి. 1. ఆధిక్యము, అతిశయము. కవిః. 3, ఆ. 99: చూ, హేరాళము; 2: చూ, విధము. 1. (సూ. ని.); క్రి. విశ. శి. కకు. వై. 5, ఆ. 156: చూ, మఱిమఱి,

ఎసఁగు, దే. అ. క్రి. 1. అతిశయించు. తనరు. భార. ఆర. 7, ఆ. 448; వేమన. 711: చూ, సందడించు. 2; 2. ఉప్పొంగు. ఉ. హరి. 5, ఆ. 220: చూ, విజృంభించు; 3. ఒప్పు. ఆం. భా. తృ. కాం, 83: చూ, సమ్మతించు.

ఎసకము, దే. వి. 1. అతిశయము. హరి. పూ. 8, ఆ. 6: చూ, హేరాళము. 1; 2. ఎగసిపాటు. భార. ఉద్యో. 4, ఆ. 324: చూ, విజృంభణము; 3. రీతి, అమరిక. కాశీ. 6, ఆ. 185: చూ, విధము. 1.

ఎసకొను, దే. అ. క్రి. పురికొను: చూ, వ్యాపించు.

ఎసకొలుపు, దే. ప్రే. పురికొలుపు. భార. ఉద్యో. 4, ఆ. 207: చూ, ప్రేరేపించు.

ఎసగొట్టు, ద్వ, వి. అంబేద, పనికిమాలినవాఁడు: చూ, వ్రాజె.

ఎసటిపోఁతలు, దే. వి. బ. ఆహతతండులములు, ఎసటవేయఁదగిన బియ్యము. కళా. 6, ఆ. 120: చూ, సడింపులు.

ఎసరు, దే. వి. 1. అత్తెసరు, కోష్ణజలము, ఎత్తెసరు: చూ, నఖంపచము; అ. క్రి. 2. రూ- ఏసరు. అతిశయించు. పాండు. 4, ఆ. 180: చూ, సందడించు. 2.

ఎసరేఁగు, దే. అ. క్రి. ఉప్పొంగు. చూ, విజృంభించు.

ఎసల, దే. వి. ఒకరకము మట్టిపిడత, అటికె: చూ, పాత్రము. 6—౨.

ఎసలారు, దే. అ. క్రి. (ఎసలు + ఆరు.) అతిశయించు, మీరు. భార. విరా. 1, ఆ. 172: చూ, సందడించు. 2.

ఎసలిక, దే. వి. అవకాశము. తీటిక: చూ, సంధు. 6.

ఎసలు, దే. వి. సంకులరణము, దొమ్మి: చూ, యుద్ధము.

ఎసవు, దే. అ. క్రి. చూ, రూ- ఎసఁగు.

ఎసవెట్టు, దే. స. క్రి. (ఎస + పెట్టు.) పురికొలుపు. కళా. 6, ఆ. 231: చూ, ప్రేరేపించు.

ఎసళ్ళు, దే. వి. బ. చూ, రూ - ఏ - ఎసరు. 1.

ఎళనీరు, ద్వ. వి: చూ, రూ-ఎడనీరు.

ఎళ్ళు, మి. వా. వి. (ఏడు + పలము.) ఏడుపలములు. ఆం. భా. ద్వి. వై. 269. చూ, మెల్లము.

ఎప్పు, దే. వి. బ. 1. రూ-ఎడ్లు, హరి. పూ, 6. ఆ. 22: చూ, వృషభము. 1; వా. 2. పెదలు. వెళ్లు (వకారము పలుకలేని క్రింది జాతుల యుచ్చారణలోపము.)

# ఏ

ఏ, అచ్చులలో నొక యక్కరము. సం. అవ్య. 1. దుఃఖమును భావించుట: చూ, శోకము. 2; 2. కోపమును దెలుపును: చూ, రోషము; 3. ప్రత్యక్షమును దెలుపును: చూ, ఈ. (1); 4. సన్నిధిని తెలుపును: చూ, సమీపము; 5. తలఁచుటను తెలుపును: చూ, స్మృతి. 1; 6. పిలుపును తెలుపును: చూ, సంబోధనము; వి. అ. పుం. 7. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 8. తేజస్సు: చూ, వెలుతురు. 1; 9. ఉదకము: చూ, సలిలము. 1; 10. రేయి: చూ, రాత్రి; 11. హర్మ్యోదరము, మేడ యొక్క నడిమిభాగము: చూ, సదనము. 1-౬-౫; (౬); 12. ఆకాశము: చూ, సురవర్త్మము; 13. ఏకాదశసంఖ్య: చూ, పదునొకటి; 14. అరుణోదయము: చూ, సూర్యోదయము; 15. మణికుట్టిమము, రత్నఖచితమగు తిన్నె: చూ, వేదిక,

(రత్నమయమైన శిరోగృహమని సర్వశబ్దసంబోధిని.): దే. సి. (1) రూ-ఏ. అడుగుట: "ఏతలఁపు."; చూ, సవాలు; (2) ఉద్దేశము. భాగ. 8, స్కం: చూ, యోచన; దే. అవ్య. (3) రూ-ఏ. అడుగుటను దెలిపెడి. భాగ. 1, స్కం. 347: చూ, సవాలు; (4) రూ-ఏ. కాకుస్వరమున వ్యతిరేకమును దెలిపెడి. భార. ద్రోణ. 2, ఆ. 205: చూ, వేఱుపాటు; (5) రూ-ఏ. ఆఁకుదగుటను దెలిపెడి. "అవునే, ఏమే.": చూ, ఏ. 3; (6) రూ-ఏ. మెచ్చుకొనుటను దెలిపెడి. భార. ఉద్యో. 2, ఆ. 117: చూ, సెబాసు; (7) రూ-ఏ. ఎక్కువ తక్కువలను దెలిపెడి. ఉ. హరి. 5, ఆ. రూ-ఏ; (8.) దుఃఖమును దెలిపెడి. భార. ఉద్యో. 3, ఆ. 183: చూ, శోకము. 2; (9 విచారమును దెలిపెడి. భార, ఉద్యో. 3, ఆ. 378. చూ, శోకము. 2; (10) రూ-ఏ. ప్రార్థించుటను దెలిపెడి. పద. 1, ఆ: చూ, స్తోత్రము; వై. అవ్య. (11) అ. రూ-ఏ. మఱియొకదాని లేమిని తెలిపెడి. చూ,అ. (2)(12)జీవ, రూ-ఏ చూపుటను దెలిపెడి. రామా. 4, ఆ. 81: అదిగో-రూ-లదిగో, అదే-రూ-అదే, రూ-ఏ; (సం. ప):—అన న్యము, ఏవ; (13) తనంతట అనుష్ఠుమును దెలిపెడి. కళా. 3, ఆ. 200: అ, రూ-ఏ; (14) ఏకూపను తెలిపెడి; పా. (15) వక్రములలో నొకటి. (ఏ ఏ ఒ ఓ లకు వక్రములని పేరు): చూ, వక్రములు; (16) అవ్య. ఏవార్థకములలో నొకటి. (ఏవార్థకములు.— అ - ఆ - ఏ - ఏ.): చూ, ఏవార్థకములు; (17) ప్రార్థనార్థకము మీఁద వచ్చువానిలో నొకటి (ప్రార్థనార్థకముమీఁది వచ్చునవి — ఇ-ఈ-ఎ-ఏ-ఒ-ఓ అనునవి.) "పండవే"; 18) ఇ-ఈ-ఎ-ఏ లం గూడిన చ జ లు తాలవ్యంబులు. వానిలో నిడియొకటి: చూ, తాలవ్యములు; (19) కంఠతాలుపులం బుట్టినవి.—ఏ-ఐ; (20) సంస్కృత శబ్దసంధి ప్రకరణము.-గుణములు. - ఏ-ఓ-అర్-అల్; (21) ఏచ్చులతోనిది యొకటి. (ఏచ్చులు.—ఏ-ఓ-ఐ - ఔ.): చూ. ఏచ్చులు; (22) ఉజ్జులలోనిది యొకటి. (ఉజ్జులు.—ఉ-ఋ-ఌ-ఏ-ఓ.): చూ, ఉజ్జులు.

ఏండ్లునుబూండ్లును, జా. ఏఁడులు బూడులు. అనేక వత్సరములు. "మొట్టమొదటనుండి పుట్టినదవఱకు వర్ణించుట కేండ్లుం బూండ్లును బట్టును." ధర్మజ.

ఏఁకట, దే. వి. 1. అపేక్ష. స్వా. 3, ఆ. 7: చూ, వాంఛ; 2. మిక్కిలికోరిక: చూ, వాంఛ.

ఏఁకరి, దే. వి. ఒకానొక కిరాతుఁడు, ఆం, భా. ద్వి. కూ. 289: చూ, వ్యాధుఁడు. 1.

ఏఁకరు, దే. అ. క్రి. వాఁడిపోవు. రుక్మాం. 4, ఆ. 134: చూ, వాఁడు. (రూ-ఏఁకారు.)

ఏఁకరువెట్టు, ద్వ. స. క్రి. ఉన్నది ఉన్నట్టు మొదటినుండియు చెప్పు: ఏఁకరువు పెట్టు.

ఏఁకరువుపెట్టు, —పై.— (వాడుక.)

ఏఁకారు, దే. అ. క్రి: చూ, రూ-ఏఁకరు. ఉ. రా. 8, ఆ. 178.

ఏఁచు, దే. స. క్రి. కాఱించు, బాధపెట్టు. భార. ఉద్యో. 3, ఆ. 101: చూ, బాధించు.

ఏఁజెల్ల, దే. అవ్య. (ఏను + చెల్ల.) సంతాపమును దెలిపెడి. హరిశ్చ. 2, ఖా. 926: చూ, సంతాపము.

ఏఁట, దే. వి. గొఱ్ఱె: చూ, మేషము. 1-౧ (సూ.ని.)

ఏఁడాది, దే. వి. (ఏఁడు + ఆది.) ఏఁడు (ఏడాది అనుచో ఆది శబ్దము నిరర్థకము.ఇట్లు శబ్దములు మహాకవిప్రయోగములందు యుండకను కొన్నికలవు. పంచాది, పాడాది మొ.): చూ, సంవత్సరము.

ఏఁడి, దే. వి. ఎక్కడనున్నాఁడు. "వాఁడేఁడి" రూ-ఏఁడీ, బ. ఏరి-రూ-ఏరీ.

ఏఁడీ, —పై.— అవ్య. అ, కాం. 88.

ఏఁడికోల, దే. వి. ఈశ-రూ-ఈష, నాఁగటి మేఁడికోల: చూ, లాంగలము.

ఏఁడు, దే. వి. 1. ఏఁడాది: చూ, సంవత్సరము; స. 2: చూ, రూ-ఏతఁడు. 1, 2, 3. (ఎల్లవాఁడు.—భార. ఉద్యో. 1, ఆ. 119.)

ఏఁడుడి, దే. వి. (ఏఁడు + ఉడి.) 1. చనిపోయినతరువాత సంవత్సరాంతమున జరిగించు శ్రాద్ధము: చూ, సాంవత్సరికము; 2. అబ్దికము, ఒద్దినము, మృతినొందినవారికి ప్రతిసంవత్సరమునఁ జేసెడి కర్మము: చూ, సాంవత్సరికము.

ఏఁదర, దే. ఎ. 1. కుటుంబముతోఁజేరని స్వతంత్రపుసొత్తు. విశ. 2. కుటుంబముతోఁ జేరక స్వతంత్రమైనది.

ఏఁదుము, దే. వి. (ఏను + తూము.) 1. ఇరువది కుంచములు. (గోదావరీమండలములోని యుత్తరభాగమున ఇరువదికుంచములును, దక్షిణభాగంబున ఏఁబదికుంచములును, విశాఖమండల ప్రాంతమున అయిదు కుంచములును వాడుక) అయిదు తూములు; 2. రెండు యకరములనేల.

ఏఁదుముబియ్యము ఏకాదశి - పందుముబియ్యము పరగడుపు లో. తడుపునింపఁగ మెక్కినను ఒక్కమెతుకైనను తిననట్టున్నాఁడని భావము.

ఏఁపు, దే. వి. బాధ, కాఱియ. చూ, శోకము. 2.

ఏఁబంపుఁ, ద్వ. స. ఏఁబదిమందికి మహన్మహత్వార్థకరూపము: ఏఁబదిమంది.

ఏఁబది, ద్వ. స. (ఏను + పది.) $5 \times 10 = 50$: చూ, అయిదు పదులు.

ఏఁబలము, మి. వి. (ఏను + పలము.) రూ-ఏఁబులము. ముప్పది తులములు.

ఏఁబులము, —పై.—(వాడుక.)

ఏకకంఠత్వము, సం. వి. అ. న. ఐకకంఠ్యము, ఒప్పిక, పొత్తు: చూ, స్నేహము. 1.

ఏకకుండలుఁడు, సం. వి. అ. పుం. 1. ఒంటిపోఁగు, రోఁకలి తాల్పు: చూ, హలాయుధుఁడు; 2. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; 3. శేషసర్పము, పాపఱేఁడు: చూ,సర్పము. 1-౧.

ఏకకుఁడు, సం. విశ. (1. అసహాయుఁడు: ఒంటరీఁడు: 2; 2. క్కఁడు. చూ, ఒకఁడు. 3.

ఏకక్రియాద్వ్యర్థకరి, న్యా. రెండుప్రయోజనములుగల ఒక పని.

ఏకక్రీడితము, అం, చూ, భౌమమండలములు.

దట్లు లేదు. రాఘ. 1. ఆ. 39 పీఠిక : చూ, సూకరము, విణ 2. అసహాయము : చూ, దిక్కుమాలినతనము.

ఏకలీయు : వై. వి. = ఏకలః : అడవిపంది. చూ, ఏకచరము, 1. హన-2- 24.

ఏకవాచకానుప్రవేశసంకరము, సం. వి. అ. పుం. ఒకానొక అలంకారము : (చూ, అలంకారము.)

ఏకవాలి, సం. వి. ఇ. స్త్రీ. ఏకాత నిమిషా కర్త్రి. పరవాలికి: చూ, రిష్టి. 2.

ఏకవింశతి మహాదోషములు, అం. పంచాంగశుద్ధి హీనము, సంక్రాంత్యహస్సు, పాపషడ్వర్గము, కుసవాంశము, అష్టమ కుజుఁడు, భృగుషట్కము, కర్తరి, లగ్నాష్టమదోషము, అష్టమ చంద్రుఁడు, షడష్టరిష్ఫచంద్రదోషము, చంద్రసహదోషము, వారజనితదుర్ముహూర్తము, ఖార్జూరిస్థ నవమాంఘ్రిభము, గ్రహణభము, ఉత్పాతభము, క్రూరయుగ్విక్షప్రము, అశుభవిద్ధము. విషయుతలగ్నము, లగ్నాస్తదోషము, గండాంతము, వ్యతీపాతవైధృతి మహాయోగము. (21.)

ఏకవింశతస్థానకములు, అం. సంహతము, సమహవము, స్వస్తికము, వర్ధమానము, నంద్యావర్తము, చతురశ్రము, పార్ష్ణివిద్ధము, పార్ష్ణిపార్శ్వగతము, ఏకపార్శ్వగతము, ఏకజానుకృతము, పరావృత్తము, పృష్ఠోద్ధానతలము, ఏకపాదము, బ్రాహ్మము, వైష్ణవము, శైవము, గారుడము, వృషభాసనము, సమసూచికము, విషమసూచికము, చండసూచికము. (21.)

ఏకవింశన్మహామణి, సం. వి. ఇ. పుం. కశేరుక, వెన్నెముక : చూ, శల్యము. 1.

ఏకవీరము, సం. వి. అ. పుం. ఆఖుపాషాణము, ఉల్లిపాషాణము: చూ, సౌవీరము. 2.

ఏకవీరుఁడు, సం. వి. అ. పుం. 1. అంగాధిపుఁడు, కర్ణుఁడు : చూ, రాధేయుఁడు; 2. శ్రీరాముఁడు, కౌశలేయుఁడు : చూ, రాముఁడు ; 3. అర్జునుఁడు : చూ, విజయుఁడు. 1; 4. ఒక వీరుఁడు : చూ, భటుఁడు. 1; 5. జంక : చూ, హరిణము. 1.

ఏకశఫము, సం. వి. అ. న. గుఱ్ఱము : చూ, హయము. 1.

ఏకషుఁడు, సం. విణ. బ్రాహ్మణుఁడు : చూ, స్వస్తిముఖుఁడు.

ఏకశృంగుఁడు, సం. వి. అ. పుం. విష్ణుఁడు : చూ, విష్ణువు.1.

ఏకసర, అం : చూ, ఉపవీతములు,

ఏకసరము, సం. వి. అ. పుం : చూ, ఏకయష్టిక.

ఏకసర్గుఁడు, సం. విణ. ఏకతానుఁడు (ఒక పదార్థమందే యుండు నిశ్చయము గలవాఁడు) చూ, ఐకాగ్ర్యుఁడు.

ఏకసూత్రము, సం. వి. అ. పుం. వైడూర్యము, విడూరదేశము నందుఁ బుట్టిన రత్నము, పిల్లికన్నతనము: చూ, రత్నములు. 1-గా.

ఏకసని, సం. వి. ఈ. స్త్రీ. ప్రపుండరీకము *: చూ, శ్రీపుష్పము.

ఏకస్త్రీ, సం. వి. ఈ. స్త్రీ. ఒక యాఁడుది : చూ, స్త్రీ.

ఏకస్వాదునభుంజీత, న్యా. ఒంటరిగాఁ దిండివంటలతో భుజింపరాదు.

ఏకహాయని, సం. వి. ఈ. స్త్రీ. ఒక వత్సరము ఈడుగల అప్పుడూడు లేత పెయ్య, ఆఁబిడ్డ : చూ, వత్సము. 2. (చూ, ధేనువు.)

ఏకాంగము, సం. వి. అ. పుం, న. మంచిగంధము : చూ, సుగంధము.

ఏకాంగి, సం. వి. న్. పుం. 1. పుత్రమిత్రకళత్రాదులం బరిత్యజించి భగవత్కైంకర్యమే పరమపురుషార్థమని కాషాయవస్త్రములఁ గట్టుకొని భగవత్కైంకర్యార్థము శరీరమును ప్రాణమును అర్థమును తృణముగాఁ జూచుచు విరక్తుఁడైన విష్ణుభక్తుఁడు. అను. 2, ఆ. 96: (చూ, ఒంటరీఁడు. 2.) ; 2. బుధుఁడు : చూ, సౌమ్యుఁడు; విణ. 3. ఏకాకి, అసహాయుఁడు చూ, ఒంటరీఁడు. 2.

ఏకాంగుఁడు, సం. వి. అ. పుం. బుధుఁడు : చూ, ఏకాంగి. 2.

ఏకాంగులము, సం. వి. అ. న. ఉప్పు : చూ, మూత్రము.

ఏకాంతము, వై. విణ = అఖండమ్. అంతయు. వై. 6, ఆ. 98; కవిక. 3, ఆ. 196: చూ, సర్వము.

ఏకాంతము, సం. త్రి. విణ. న. 1. అత్యంతము, రహ: చూ, మతిమతి; 2. అధికము, మిక్కిలి; చూ, హేరాళము. 1. 3 = ఏకతము. ఇద్దఱకంటె నెక్కువమంది లేనిది, అనువికాస్యము: చూ, రహస్యము. 1; 4. తెలియఁబడనిది. (చోటు.) చూ, రహస్యము. 1. [1) ఏకాంత, రహస్య. గుప్త, (2) వ్యక్తిసంబంధము: (3) ఆత్మీయ, స్వంతము; (4) స్వతంత్రము, (5) లౌకిక.

ఏకాంతుఁడు, సం. విణ. అతిశయవంతుఁడు: చూ, హెచ్చుగలవాఁడు.

ఏకాకి, సం. విణ. 1: చూ, ఏకాంగి, 3; అం. 2. చూ, భూపాలులు.

ఏకాక్షము, సం. వి. అ. పుం. 1. కాకి, మెల్లకంటి: చూ, వాయసము; విణ. 2. ఒకకన్ను గలది: చూ, ఏకదృష్టి. 2.

ఏకాక్షరము, అం. చూ, శబ్దాలంకారములు. (చూ, అలంకారము. 3.)

ఏకాక్షరి, అం. ఇది అన్నియు నొకేయక్షరముగాఁగలది: చూ, హేతువు. 2.

ఏకాష్ఠీలుఁడు, సం. వి. అ. పుం. ఒంటికంటిగాము, చూ, శుక్రుఁడు

ఏకాగ్ర్యుఁడు, సం. విణ. 1. ఒకవిషయమునందే మనస్సునిలిపినవాఁడు: చూ, ఐకాగ్ర్యుఁడు; 2. ధైర్యశాలి: చూ, దిట్టుఁడు.

ఏకాగ్ర్యుఁడు, సం. విణ. చూ, రూ-ఐకాగ్రుఁడు.

ఏకాచ్ఛము, అం. చూ, శబ్దాలంకారములు. చూ, అలంకారము. 3.

ఏకాదశకము, సం. స. న్. 1. ఏకాదశము: చూ, పదునొకండు; విణ. 2. పదునొకండవది.

ఏకాదశము, సం. స. న్. 1. ఏకాదశకము: చూ, పదునొకండు;

ఏకాదశి, సం. వి. ఈ. స్త్రీ. 1. పదునొకండవ తిథి, హరిప్రియ : చూ, తిథి, 1; 2. పదునొకండు తంత్రులుగల పరివాదిని యను వీణె : చూ, వీణె; అం. 3. చూ, తిథులు; 4. చూ, తతవాద్యములు.

ఏకానంశ, సం. వి. ఆ. స్త్రీ. గౌరి : చూ, పార్వతి. 1.

ఏకాబ్ద, సం. వి. ఆ. స్త్రీ : చూ, ఏకహాయని.

ఏకాయనగతుఁడు. సం. విణ. అనన్యవృత్తి: చూ, ఐకాగ్రుఁడు.

ఏకాయనుఁడు, సం. విణ. —వై.—

ఏకార్థము, అం. : చూ, అర్థదోషములు.

ఏకార్థాభినివేశము, అం : చూ, విగ్రహాకులు.

ఏకావళి, అం. ఒకానొక అర్థాలంకారము. గృహీతము త్రీతిని వర్జించుట ఉదా—కన్నులు శ్రవణాంతదీర్ఘములు. శ్రవణములు. భుజాంతర లంబనములు. భుజములు జాను దఘ్నములు. చూ, అలంకారము. 3. 2. ఒంటిపేట హారము: చూ. భూషణము. 2.

ఏకాష్ఠీల, సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది* : చూ, విద్ధకర్ణి.

ఏకాష్ఠీలము. సం. వి. అ. పుం. శివమల్లి : చూ, శ్రీవల్లి*.

ఏకాహభవము, సం. వి. అ. న. ఒకదినమునఁబుట్టినది : చూ, ఐకాహికము.

ఏకాహము, సం. వి. అ. పుం. 1: చూ, ఒకరోజు; 2. మృతిఁ బొందినవానికి పదునొకండవనాఁడు చేయు శ్రాద్ధము: చూ, కర్మములు; వా. 3. ఒకరోజుచేయు శ్రీరామాదుల స్మరణోత్సవము. (సప్తాహము మున్నగునవి.)

ఏకియేకివదలు, లో, కోపముతీఱవఱకు సాధించి హాస్యముచేసి వదలు.(వాడుక.) "కానీ నిన్ను ఏకియేకి వదలెద."

ఏకీభవించు, సం. అ. క్రి. ఒక్కటియగు, కలియు: చూ, సక్తమగు.

ఏకీభావము, సం. వి. అ. పుం. ఐక్యము, ఒక్కటి యగుట: చూ, స్నేహము. 1.

ఏకీయుఁడు, సం. వి. అ. పుం. తోడువచ్చినవాఁడు: చూ, సహాయుఁడు. 1.

ఏకు, దే. వి. 1. ఏకిన దూదిచుట్ట, తూలనాళిక. చూ, దూదిచుట్ట; స. క్రి. 2. దూదిని చక్కఁజేయు; వా. 3. దూఱు. "కానీ నిన్ను నలుగురిలో ఏకి యెగనటికి కాకులకు వేసెదను." చూ, సెగ్గించు.

ఏకుడు, దే. వి. దూదియేకుట. అం. భా. ద్వి. ఖా. 294: చూ, సముద్రాంత. 1—ర.

ఏకె, ద్వా. స. ఏ. (ఏ+అక.) ఏహ్యార్యాలు; ఏపె-హా-ఏమె, ఏబిడ. (అకె ఈకె ఏకె ఎవతె ఒకతె ఇత్యాదులందు ఎకారము ఆదేశముగా వచ్చెనని యెఱుంగునది.); (చూ, అకె.)

ఏకేనచక్రేణ నరథస్యగతిర్భవేత్, న్యా. ఏకచక్రముతో రథము నడవదు.

ఏకోద్దిష్టము, సం. విణ. ఒకఁడు ఉద్దేశింపఁబడినవాఁడుగాఁగలది (శ్రాద్ధము.): గతించిన పదునొకండవనాఁడు చేయునది (శ్రాద్ధము.): చూ, కర్మములు.

ఏకోద్దేశము, సం. వి. అ. పుం, ఒకరిని గుఱించిన యుద్దేశము (ఒక అపరాధముఁజేసిన నేరగాండ్రందఱకును గూడ ఒక దుద్దేశ ముండుట.)

ఏకో నగచ్ఛేదధ్వానమ్, న్యా. ఒంటరిగాఁ త్రోవ నడువరాదు. "నడవకుమీ తెరువొక్కరుఁడు."

ఏకోనవింశతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, పందొమ్మిది.

ఏకోనవింశతికృత్వము, సం. అవ్య. పందొమ్మిదిమార్లు.

ఏకోనవింశతిధా, సం. అవ్య. పందొమ్మిది విధములుగా.

ఏకోనవింశతితము, సం. అవ్య. పందొమ్మిదేవి.

ఏకోనవింశక, సం. వి. అ. స్త్రీ: చూ, పందొమ్మిదవది.

ఏకోనవింశుఁడు, సం. వి. అ. పుం: చూ, పందొమ్మిదవవాఁడు.

ఏకోను, దే. వి. సమిష్టి, అంతయు "ఏకోనుకు మొత్తమెంత." మో: చూ, సర్వము.

ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వి వాంకః, న్యా. చంద్రకిరణములందు మచ్చవలెనే గుణసముదాయమునందొక దోషమడఁగును.

ఏక్కు, వా. వి. మిక్కిలిరోఁత సెబ్బట్టు: చూ, రోఁత. 2.

ఏగడము, దే. వి. పయనము: చూ, సంచారము. 1.

ఏగాని, దే. వి. చూ, అరకాని.

ఏగు, దే. అ. క్రి. 1. గమించు, పోవు: చూ, వెళ్ళు. 2. చను. అం, భా. తృ, కాం. 87: చూ, సమయు.

ఏగుడు, దే. వి. పయనము: చూ, సంచారము.

ఏగుదెంచు, దే. అ. క్రి. (ఏగు + తెంచు.) 1. రూ-ఏతెంచు, పోవు, మించు. జై. 2, ఆ. 73: చూ, వెళ్ళు. 3; 2. రూ-ఏతెంచు, వచ్చు, ఆగతమగు. భార. ఆది. 6, ఆ. 228: చూ, వచ్చు. 2.

ఏగుపెండ్లి, దే. వి. ఊరేగింపు, పెండ్లియయిన తర్వాత వధూవరులను ఊరేగించునట్టివేడుక. వసు, 3, ఆ. 10. చూ, మెఱవణి.

ఏగురు, దే. స. (ఏను + గురు.) (ఏనునకు మహన్మత్యర్థక రూపము. : రూ- ఏవురు. అయిదుగురు- రూ- ఐదుగురు. అయిదుమంది-రూ-ఐదుమంది.

ఏగుస, ద్వ. వి. (ఏను + కుంపము.): చూ, రూ- ఎంగుస. అం, భా. ద్వి. వై. 271.

ఏచ, దే. విణ. 1. రూ- ఏస. పాముకలమాట. య. 1, ఆ. 102; కాశ. 3, ఆ. 36: చూ, గ్రామ్యము. 4: రూ- ఏస. వక్రము. చూ, వంకర.

ఏచకంటిచుక్క, ద్వ. వి. ఉత్తరాషాఢానక్షత్రము: చూ, రిక్క. 1—౨౧.

ఏచు, దే. అ. క్రి. 1. అతిశయించు. విప్ర. 2. ఆ. 100: చూ, సందడించు. 2; 2. పెరుఁగు. చూ, వర్ధిల్లు, 3. ఎసరేఁగు. చూ, విజృంభించు.

ఏచోటు, దే. వి. ఎక్కడ: చూ, యత్ర, 1.

ఏచ్చులు, అం;-ఓ-ఐ-ఔ. (క).

ఏట, దే. వి. రూ- ఏటము, పక్షము: చూ, ప్రక్క. 2.

ఏటము, దే. వి. —పై.—

ఏటవాలు, దే. వి. ఒఱగుట, వంపు. స్వా. 3, ఆ. 84; చూ. వంపు. 4.

ఏటికపాము, దే. వి. చూ, ఎమిడిక.

ఏటికోళ్లు, దే. వి. 1. గోత్రనామాదులు (ప్రవర) చెప్పి పాదములు సోఁక మ్రొక్కుట, అభివాదనము: చూ, హాజీగలు; 2. దండము. భీ. 3, ఆ. 212-185; భార. ద్రో. 2. ఆ. 347 : చూ, హణిగలు.

ఏటిబోటిమగల యెకిమీఁడు, ద్వ. వి. నదీకాంతలకు భర్తలైన సముద్రములకు రాజు, నీటి ఱేఁడు : చూ, సముద్రుఁడు. 1.

ఏటిరింత, దే. వి. రూ-ఏట్రింత. చూ. వ్యాఘ్రాటము.

ఏటివేఁడు, దే. వి. (ఏఱు + వేఁడు.) సరిత్పతి. య.-3, ఆ. 28 : చూ, సముద్రము. 1.

ఏటు, దే. వి. 1. బాణప్రయోగము: 2. బాణహతి: చూ, హతి. 1-ఴ.

ఏటులాడు, దే. అ. క్రి. (ఏటులు + ఆడు.) ఆయుధహతులచే పోట్లాడు. శశాం. 5, ఆ. 21 ; భార. విరా. 5, ఆ. 133 : చూ, వాటులాడు.

ఏటిరింత, దే. వి : చూ, రూ-ఏటిరింత.

ఏడ, దే. వి. ఏ. ఎక్కడ. భార. ఆర. 2, ఆ. 47; కాశీ. 4, ఆ. 108 : చూ, యత్ర. 1.

ఏడక, సం. వి. ఆ. స్త్రీ. = ఏడిక. ఆఁడుగొఱ్ఱె, చూ, మేషము. 1. ౯.

ఏడకము, సం. వి. అ, పుం. మేఁక, పొట్టేలు; చూ, మేషము.1.

ఏడగజము, సం. వి. అ. పుం. తగిరిస * : చూ, ప్రపున్నాటము.

ఏడమూకుఁడు, సం. విణ. 1. అనేడమూకుఁడు : చూ, చెవిటి మూఁగ; 2. మోసగాఁడు: చూ,వంచకుఁడు; 3. కుత్సితుఁడు, మొక్కలీఁడు : చూ, వ్యాధుఁడు. 2.

ఏడాకులపొన్న, ద్వ. వి. (ఏడు + ఆకులపొన్న.) అయుగ్మపర్ణము * : చూ, సురపున్నాగము. 1-౨.

ఏడాకులఅఁటి, దే. వి. (ఏడు + ఆకుల + అరఁటి.) సప్తపర్ణము. * రంభ. 2. (రూ-ఏడాకులరఁటి.)

ఏడాకులవారు, ఒకానొక తెగవారు.

ఏడాకు లెక్కువ చదివినవాఁడవు, వా. వి. అందఱికంటె ఘనుఁడవు అని వ్యధికరణము.

ఏడాకోడము, దే. విణ. రూ-ఏడాగోడము : చూ, విరుద్ధము.

ఏడాగోడము, దే. విణ. రూ—పై.—

ఏడాటలాడించు, దే. స. క్రి. (ఏడు + ఆటలు + ఆడించు.) మిక్కిలి శ్రమపఱచు. చూ, శ్రమపెట్టు.

ఏడాళి, సం. వి.ఇ. పుం. చెవిటివాండ్రవరుస.

ఏడిక, వై. వి. = ఏడకః. 1 చూ, బధిరుఁడు. 1-౨. మేఁక. పొట్టేలు : చూ, మేషము. 1: 2. ఆఁడుగొఱ్ఱె : చూ, మేషము. 1-౯.

ఏడికవజీరు, ద్వ. వి. అగ్ని. ఆం, ప. సుర. 30; చూ,వహ్ని.1.

ఏడిమత్తు, సం. వి. అ. న. చెవిటివాండ్రకులము. చూ, బధిరుఁడు. 1-3.

ఏడీరితము, సం. విణ. చెవిటివాండ్రకులముగల కులముచేత చెప్పఁబడినది.

ఏడు, దే. స. 1. ఆఱునొకటి. వేమన. 733-734 : చూ, సప్తకము; అ. క్రి. 2. ఏడుచు. (ఏడ్చుచుండుమని యర్థము. వాడుకయందిట్లున్నది.): చూ, రోదించు.

ఏడుఁడు, సం. విణ. చెవిటి; చూ, బధిరుఁడు.

ఏడుకము, సం. వి. అ. న. నడుమను యెముకలుంచి పెట్టినగోడ, రూ-ఏడూకము ; చూ, బొమికెలగోడ.

ఏడుకొండలరాయఁడు, ద్వ. వి. తిరుపతివేంకటేశ్వరుఁడు.

ఏడుగడ, దే. అవ్య. 1. సమస్తపదార్థము. ఆం, భా. తృ. అవ్యా. 79 : రూ-ఏడ్గడ; విణ. 2. (ఏడు + కడ.) (గురుపు తల్లి తండ్రి పురుషుఁడు విద్య దైవము దాత అని సప్త ప్రకార ములుగల) రక్షకుఁడు రూ- ఏడ్గడ. వాసి. 1, ఆ : చూ, రక్షకుడు.

ఏడుగురు, దే. స. ఆఱునొక్కమంది. (ఏడుగురు మహాన్మాహాత్మ్యస్థపురుషుడు) : ఏడుమంది.

ఏడుగుఱ్ఱములతేరెక్కెడుకోడు, ప్లా. వి. సప్తహయారూఢుఁడు : చూ, సూర్యుఁడు.

ఏడుచు, దే. అ. క్రి. రూ-ఏడ్చు: చూ, రోదించు.

ఏడుతూములు, దే. వి. బ. ఇరువది ఎనిమిది కుంచములు: ఏడ్తుము.

ఏడుపు, దే. వి. 1. రూ-ఏడ్పు : చూ, రోదము. 2;2. రూ-ఏడ్పు, అఱపు : చూ, స్వరము. 2-౧౩.

ఏడుమంది, దే. స. చూ, ఏడుగురు. (అప్ర.)

ఏడులుఁబూరెలు, జా. ఏడ్లను బూరెలు. "ఎఱుకలుఁ గట్టుకొన్న మఱి యేడులుఁ బూరెలుఁ బట్టు." మనుచరిత్ర.

ఏడువారములనగలు, జా. వా. ప్రతి ఆదివారముమొదలు ప్రతి శని వారము వఱకున్ను అమ్మవారికి సమర్పించెడి నగల మార్పు నకుఁ జెందిన పేరు.

ఏడూకము, సం. వి. అ. న : చూ, రూ-ఏడుకము.

ఏడేక్షము, చూ, ఏడగజము.

ఏడేహితము, సం. వి. అ. న. చెవిటివాని కోరిక : చూ, వాంఛ. 1-౩౪. (ఇట్లు ఏడైశ్వర్యము, ఏడోద్వాహము, ఏడార్థస్థితిహాకము ఇత్యాదులూహ్యంబులు.)

ఏడ్గడ, దే. అవ్య. విణ : చూ, రూ-ఏడుగడ.

ఏడ్చు, దే. అ. క్రి : చూ, రూ-ఏడుచు.

ఏడ్చును, అం : చూ, చిహ్నములు.

ఏడ్పు, దే. వి : చూ, రూ- ఏడుపు.

ఏడ్తెఱ, దే. వి. 1. అతిశయము : చూ, హెచ్చరము !; 2. సరకము. భార. శల్య. 2, ఆ. 387 : చూ, విజృంభణము; 3. పరాక్రమము; బీరము. భార. ద్రోణ. 3, ఆ. 41 : చూ, శౌర్యము; 4. జగడము. ఆం, ప. సర. 113 : చూ యుద్ధము.

ఏడ్తెఱ, దే. వి. అధికోత్సాహము : చూ, సంతోషము, ప్లావనము, 1-౧.

ఏడ్దుము, ద్వ. వి. (ఏడు + తూములు) 1 : చూ, ఏడుతూములు. వా. 2. "ఏడ్చెదము. ఏదోఒకవిధముగా చూచుకొందుము. నీవు పెళ్ళినపని చెప్పుము. చెప్పిన యెటులనో యేడ్తుము. నష్టమైన ననుభవింతుము." (ఏడ్తుము = ఏడ్చెదము. ప్రయోగానర్హము.) రూ-ఏడుద్దుము.)

ఏణతిలకుఁడు, సం. వి. అ. పుం. చంద్రుఁడు : చూ, హిమాంశుపు.

ఏణము, సం. వి. అ. పుం. పెద్దకన్నులుగల యిఱ్ఱి : చూ, హరిణము. 1-౮.

ఏణి, సం. వి. ఈ. స్త్రీ. పెద్దకన్నులుగల నల్లలేడి : చూ, హరిణము. 1-౮; వి. ఇ. న. 2. ఏణములకులము : చూ, సంతతి. 1-౧౧.

ఏణేచ్ఛ, సం. వి. ఆ. స్త్రీ. ఇఱ్ఱియందలి యాస. చూ, వాంఛ. 1-౩౫. (ఇట్లుఏణైశ్వర్యము, ఏణోల్లాసము, ఏణౌత్సుక్యము ఇత్యాదులు.)

ఏతఁడు, దే. స. పు. (ఏ+డు.) చూ, రూ- ఎతఁడు.

ఏతము, సం. వి. అ. పుం. 1, చిత్రవర్ణము : చూ, వర్ణము. 6; విణ. 2. చిత్రవర్ణముగలది, చూ, వర్ణము. 6; 3. వచ్చినది, ఆగతము, ఉపాగతము; వై. వి. (1) = యంత్రమ్. రూ- ఏతాము.

ఏతరి, దే. విణ. పచ్చితుఁడు, తుంటరి. స్వా. 6, ఆ. 46 : చూ, వ్యాధుఁడు. 2.

ఏతిరము, వై. వి. = ఏకల, ఏకవీఁడు వనసూకరము : చూ, సూకరము. 1-౫.

ఏతర్హి, సం. అవ్య. ఇప్పు, ఇప్పుడు : చూ, సాంప్రతము. 2.

ఏతావృక్షము, సం. విణ. ఇటువంటిది : చూ, ఏతాదృశము.

ఏతాదృశము,—వై.—ఈవృక్షము, ఈదృశము.

ఏతాము, వై. వి. = యంత్రమ్ : చూ, రూ-ఏతము. (ఏతము, ఏతాము అని పుంసోక్తమ ఏపేయము.)

ఏతి జీవంతమానందో నరం వర్షశతాదపి. న్యా. "బ్రదికియుంటిని సుఖములఁ బడయవచ్చు" అని యాంధ్రజాతీయము.

ఏదు, దే వి. గర్వము. వై. 8, ఆ. 37 : చూ, హంకారము.

ఏపల, దే. వి. చాపలల్లెడి యొకానొకజాతి: చూ, మేకం.

ఏతెంచు, దే. అ. క్రి. 1. రూ- ఏతెంచెంచు వి. పు. 7, ఆ. 330: చూ, వెళ్లు. గు 2. రూ-ఏగుదెంచు, వచ్చు: చూ, వచ్చు. 2.

ఏత్వములకందము, వా. కేవేవేదేలేఁడే, నేవేరే యెమ్మెహెచ్చె నేవేమేనే, తేవేవేవేనేనే, నేవేనేనేదేనే జేజేజేజే." కట్ట క్రవర్తి చరిత్రము. 3, ఆ. 105-114.

ఏద, దే. వి. 1. ఏమరము, అవధానము, ఎచ్చరిక: చూ, హెచ్చరిక 2. ఒకచెట్టు: చూ, వృక్షము.

ఏపడి, దే. వి. ఒకరకము ఎలుఁగుగొడ్డు : చూ, ఎలుఁగుబంటి.

ఏదాలాజము, వా. వి. ఇష్టాపసారము.

ఏది, దే. స. 1: చూ, రూ- ఎది; అవ్య. 2. ఏప్రకారము. కళా. 1, ఆ. 92: చూ, రూ-ఏదీ; వి. 3. ఎక్కడ నున్నది: ఏదీ.

ఏదీ, దే. స. 1: చూ, రూ- ఏది. 1; అవ్య. 2. ఏప్రకారము: రూ- ఏది, ఏటు-రూ-ఏటులు-ఏట్లు- ఏట్టులు-ఏట్లు-ఏటువలె, ఎట్టు వోలె; వి. 3. ఎక్కడనున్నది. చూ, ఏది. 3.

ఏదు, దే. వి. 1. ముండ్లపంది: చూ, సూకరము. 1-౨. వై. స. క్రి. 2 = ఏధనమ్. పోషించు, పెంచు. రామా. 3, ఆ. 135: చూ, రక్షించు; 3. త్యజించు. ఆం. భా. త్య. సకర్మక. 130: చూ, విసర్జించు. అ. క్రి). 4. మచ్చమాయు, చెడు. భార. ఉద్యో. 3. ఆ. 12: చూ, సమయు. 3.

ఏదుపు, దే. వి. విడుపు: చూ, విమోచనము.

ఏదుపంది, దే. వి. ముండ్లపంది: చూ, సూకరము. 1-౨.

ఏదువేఁట, దే. వి. ఒకరకమువేఁట. రామా. 2, ఆ. 29: చూ, వేఁట. 3.

ఏధ, సం. వి. ఆ. స్త్రీ. ధనాదిసమృద్ధి. నింపు: చూ, సమృద్ధి.

ఏధతుఁడు, సం. వి. అ. పుం. 1. మనుజుఁడు: చూ, మనుష్యుఁడు 2. అగ్ని: చూ, వహ్ని .1.

ఏధము, సం. వి. స్. న. 1. రూ-ఏధస్సు, వంటకట్టియ; చూ, వంటచెఱకు; 2. రూ-ఏధస్సు- చిదుగు; చూ, సమిధ.

ఏధస్సు,—వై.—

ఏధితము, సం. విణ. వృద్ధిపొందినది చూ, వృద్ధము. 2.

ఏధిమఁడు, సం. వి. అ. పుం. వృద్ధిచేయఁబడ్డవాఁడు.

ఏనకేనప్రకారేణ ప్రసిద్ధఃపురుషోభవేత్. న్యా. పురుషుఁ డేదో విధముగా నైనఁ బ్రసిద్ధిని బొందవలెను.

ఏనము, సం. వి. స్. న. 1. తప్పు; చూ, నొంటు. 2. దోషము: చూ, వృజినము. 1; 3. దూఱు: చూ, నెగ్గెంపు. (రూ- ఏనస్సు.)

ఏనస్సు,—వై.—

ఏనాదము, దే. వి. సముద్రతీరము; చూ. రోధస్సు, 1-౧.

ఏనాది, దే. వి. 1. రూ-అనాది. ఒకరకము కిరాతుఁడు, కోయ : చూ, వ్యాధుఁడు. 1; 2. దారిదొంగ: చూ, హారకుఁడు. 1-3.

ఏనాళ్లు, దే. వి. బ. (ఏను+నాళ్లు.) 1. అయిదునాళ్లు; 2. వివాహానంతరము వియ్యంకు లొకరికొకరు పంపెడుసారె.

ఏని, సం. వి. ఈ. స్త్రీ. 1. అనేకవర్ణములుఁగల వస్తువు; దే. అవ్య. (1) పక్షాంతరమును దెలిపెడి, " అట్లయేని. ఇట్లయేని."(అపక్షమున ఈపక్షమున నని యర్థము.) భార. ఉద్యో. 3, ఆ. 30 (విసఁబాలతేఁ బేఁడు పిసవలయు పక్షమున నని యర్థము.) ఒండె, ఒండేని. (2) వికల్పమును దెలిపెడి, కూఱుబల. "హరినేనబ్జజునేని."; చూ, వికల్పము. 2; (3) దొత్తిగా అనుసర్షమును దెలిపెడి. భార. ఉద్యో. 3. ఆ. 104; (ఏనియు అనినమాత్రమున ద్రుతప్రకృతికముకాదు. ఏనిన్ ఏన్ అనురూపములు ఉవర్ణమును నివర్ణమును లోపింపఁగా నైనవి. "ఎండేని-ఎన్నఁడేని ఇత్యాదులయందలి యేని శబ్దము వాక్యాలంకారసంబద్ధము, ఎండేని = ఎందయినను, ఎన్నఁడేని= ఎన్నఁడయినను: కొన్నిచోట్ల వాక్యాలంకారముగ నుండును.) చూ, అ. (3).

ఏనిక, వై. వి. = అనేకపః. ఏనుఁగు రుక్మి. 3, ఆ. 45; భార. ఉద్యో. 4, ఆ. 232: చూ, హస్తి. 1.

ఏనికతిండి, ద్వి. వి. ఏనుఁగుగొంగ. ఉత్త. 3, ఆ. 62; చూ, సింహము. 1.

ఏనిపదోమ, ద్వి. వి, ఘోషి, దొంతపుదోమ: చూ, మశకము. 1—౧.

ఏను, దే. స. 1. అరపడి. (ఇందలి ఉకారము వికల్పముగ లోపించును. ఉదా.—ఏన్పర్వంబులు.); చూ, పంచకము; 2. నాశబ్దమునకు ప్రథమైకవచనము. చూ, రూ—నేను; వై. వి. 3=అనేకపరి. చూ, ఏనుఁగు. 1.

ఏనుఁగడుగు, ద్వి, వి. బ. (ఏనుఁగు+అడుగు.) చిత్రవర్ణ వస్త్రములలో నొకటి : చూ, వస్త్రము. 1—౫౨.

ఏనుఁగు, వై. వి. 1. = అనేకపః. ఏనిక: చూ, హస్తి. 1; విణ. 2. పెద్దది. "ఏనుఁగుతలబంద. ఏనుఁగుకాలు, ఏనుఁగుతుమ్మి, ఏనుఁగుపల్లేరు. ఏనుఁగు జలగ, ఏనుఁగు బీర, ఏనుఁగుగజ్జి." మొ : చూ, విపులము.

ఏనుఁగుకలబంద, ద్వి. వి. నారకుపయోగించెడి పెద్దకలబంద *: చూ, కలబంద.

ఏనుఁగుకాలు, ద్వి. వి. బూరగాలు. చూ, హజజ. 1—౧.

ఏనుఁగుకొమ్ముమొదలు, ద్వి. వి. గజదంతమూలము: కరీరిక: చూ, హస్తి. 1—(౪౫).

ఏనుఁగుకొమ్ములు, ద్వి. వి. బ. శాలిధాన్యము. హంస. 4, ఆ, 28: చూ, ధాన్యము.

ఏరవకడ, దే. వి. తావరడంగి * చూ, విషనాశని.

ఏరలు, దే. వి. రూ- ఏరాలు. ఆం. ప. నర. 58 : చూ, సవతి.

ఏరాది, దే. వి. ఉత్తమాశ్వసంతతియైన గుఱ్ఱము. చంద్రా. 1. ఆ. 43 : చూ, హయము. 1-౫.

ఏరాలు, దే. వి. (ఎరవు + ఆలు.) సపత్ని. రూ-ఏరలు. పాంచు. 3, ఆ. 62. చూ, భార్య. ౧-౬౩.

ఏరాళము, వై. వి. = హేరాళము. అధికము : చూ, హేరాళము; 2. అసంఖ్యము. బహుళము, చాల. పాంచు. 2, ఆ. 125 : చూ, విస్తారము. 1.

ఏరి, దే. వి. బ. చూ, ఏఁడి.

ఏరీ, రూ—వై.—

ఏరితకోల, ద్వ. వి. నాఁగటిమేడి, కోల : చూ, లాంగలము.

ఏరు, దే. వి. 1. తలనొప్పి. చూ, శిరోభారము; 2. గోకిలము, ఎద్దులనుగట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి. పర. 5, ఆ : చూ, లాంగలము.

ఏరుగడము, దే. వి. విష్ఠ. ఏరుగు : చూ, శమలము. 1.

ఏరుగంప, దే. వి. హలోపకరణము : చూ, బరగట్టు.

ఏరుగు, దే. వి. 1 : చూ, ఏరుగడము; అ. క్రి. 2 : చూ,విష్ఠించు.

ఏరునేల, దే. వి. భూపరిమాణవిశేషము. భార. అశ్వ. 3, ఆ. 158; బస. 2. ఆ. 47 పుట.

ఏరుపడు, ద్వ. అ. క్రి. రూ- ఏర్పడు. తేటపడు: చూ, విశదమగు; 2. నిర్ణయింపఁబడు : చూ, పాలుపోవు; 3. బయలుపడు : చూ, వెలువడు; 4. అడరు: చూ,వర్ధిల్లు; 5. భేదపడు. రామా. 8, ఆ. 96. చూ, వేఱుపడు; 6. రూ-ఏర్పడు, ఒనగూడు:చూ, సిద్ధించు.

ఏరుపరుపు, ద్వ. వి. వంటచేయఁబోవు పదార్థములయందలి రాళ్లు మొ. యేఱిదాగుచేసిన బియ్యము మున్నగునవి : చూ, రూ- ఏర్పరుపు.

ఏరుపాటు, ద్వ. వి. రూ-ఏర్పాటు, నిబద్ధి : చూ, సత్యము, 1; 2. కట్టడి : చూ, నియమము; 3. వయినము : చూ, వివరము.

ఏరుపిడక, దే. వి. రూ- ఏఱుపిడక, కరీషము నేలఁబడి ఎండి యేఱఁబడెడి పేడకడి. చూ, పిడక.

ఏరుప్పు, దే. వి. రూ— ఏర్పు, మంట : చూ, వహ్ని. 1-౨౬.

ఏరులమగఁడు, ద్వ. వి. ఏటిఁబేడు, కడలి : చూ, సముద్రము.1.

ఏరువాక, దే. వి. దుక్కియొక్క ప్రారంభము.

ఏర్చు, దే. అ. క్రి. 1. తలనొచ్చు. చూ, తలనొచ్చు; స. క్రి. 2. ఏర్పఱచు, అచ్చుకట్టు. శుక. 1, ఆ. 307 : చూ, సృజించు; 3. చక్కఁబఱచు. భార. ఉద్యో. 4, ఆ. 310: చూ,సవరించు, 4. కాల్చు. భార. ఆది. 8, ఆ. 308 : చూ, వెలుఁగు. 5.

ఏర్పడు, చూ, రూ- ఏరుపడు.

ఏర్పరుపు, చూ, రూ- ఏరుపరుపు.

ఏర్పఱచు, ద్వ. అ. క్రి. అచ్చుకట్టు : చూ. సృజించు.

ఏర్పాటు, ద్వ. వి : చూ, రూ- ఏరుపాటు. (నియమము.—కాశీ, 7, ఆ. 107.)

ఏర్పిడక, దే. వి : చూ, రూ- ఏరుపిడక.

ఏర్పు, దే. వి. మంట : చూ, వహ్ని. 1-౨౬.

ఏర్వారుపు, సం. వి. ఉ. పుం. 1. ఇర్వారువు * : చూ, హరివాలుకము. 1-౧; 2. ఒకరకపు ఎంద్రకాయ, పీత : చూ, హరిలాంఛనము.

ఏఱు, దే. వి. 1. వాఁక : చూ, నది; స. క్రి. 2. క్రిందనుండు వస్తువుల నొకటొకటిగా యెత్తు. భార. అశ్వ. 4, ఆ. 220 : చూ. ఎత్తు. 1-౨౬.

ఏఱుజాజి. ద్వ. వి. ఆరె * : చూ, సుభిక్ష.

ఏఱునుగ్గులు, ద్వ. వి. ఏరుపిడక: చూ, పిడక.

ఏఱుపిడక, ద్వ. వి : చూ. రూ- ఏరుపిడక.

ఏఱుపచ్చ. దే. వి. అమృతపత్రము, నెమిలడుగు * : పూతికరజము: చూ, రీఠాకరజము.

ఏఱుమద్ది, దే. వి. నదీసర్జము * : చూ, సాలము. 1-౧.

ఏఱుమల్లియ, ద్వ. వి. వాసంతి ; యూథి. 1. (రూ-ఏఱుమల్లె.) చూ, హరిణి. 5.

ఏఱువ, దే. వి. విలాతి: చూ, దేశము. 1.

ఏఱువంగ, ద్వ. వి, గండీరము, ఆమ్లగంధకృత్తు ; చూ, వార్తాకము. 1-౨.

ఏఱువావిలి, ద్వ. వి: చూ, సప్తల *. 5.

ఏర్పిడక, దే. వి: చూ, రూ-ఏఱుపిడక.

ఏల, 1. సం. వి. ఆ. స్త్రీ. = ఏలకి. పేరేలకి *: చూ, పత్రల: దే. అవ్య. (1) రూ-ఏలా, ఎందులకు: చూ, యత్ర. 1; వై. వి. (2)= హేలా. ఒకానొక యేఱు. దీనినే ఏలేఱందురు. చూ, నది. 1.

ఏలకి, వై. వి = ఏలా. పేరేలకి *: (దీనిభేదము.-చిట్టేలకి.)

ఏలకికాయ, ద్వ. వి. 1. ఒకరకపు భక్ష్యము. హంస. 1, ఆ. 105: చూ, భక్ష్యము. 1-౧౩; 2. ఏలకిపండు: ఏలకిపండు; (సం. ప.):-ఏలాఫలము.

ఏలకిపండు, ద్వ. వి: చూ. ఏలకికాయ. 2.

ఏలపాట, ద్వ. వి. 1. శృంగారపుఁబాట. బ-ఏలలు: చూ,స్వరము. 2; ౪౬-(౪; 2. ఒకరకపు బాలక్రీడ. వి. పు. 7, ఆ. 202: చూ, బాలక్రీడ.

ఏలబిలుఁడు, సం. వి. అ. పుం. కుబేరుఁడు; చూ, శ్రీదుఁడు.

ఏలము, వై. వి. 1. కల్లుగీచువాఁడు ఆతోఁపునందు వేసికొనెడు గుడిసె, రూ-ఏలాము; చూ, సదనము. 1-33; వా. వి. 2. సర్కారువారుగాని, వర్తకులుగాని చరస్థిరాసులను పాటఁబెట్టి పాటపైపాటరాఁబట్టి అమ్ముట లోనగు యొ విధము, రూ- ఏలాము; చూ, వేలము.

ఏలముపట్టు, ద్వ. వి. ఊఁత. పాండు. 5, ఆ. 179: చూ, సన్నిధానము. 2.

ఏలలు, దే. వి. బ: చూ, ఏలపాట. 1, అచ్చ. యు, కాం. 90.

ఏలవాలుకము, సం. వి. అ. న. నూఁగుదోస, రూ-ఏలావాలుకము * : హరివాలుకము. 1.

ఏలా, దే. అవ్య: చూ, రూ-ఏల. (1).

ఏలాటి, దే. విశే: ఎటువంటి, ఎట్టి, ఎట్టు.

ఏలాపత్రము, సం. వి. అ. న. అగ్నిమంథని * : చూ, వైజయంతి. 4.

ఏలాపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. 1. కారేలికి * : చూ, సన్నరాష్ట్రము; 2. కాస్తపెల్ల: చూ, పిరంగిచెక్క.

ఏలాపుత్రము. సం. వి. అ. పుం. ఏలాపుత్రుఁడను నాగము: చూ, సర్పము. 1-౪-౧).

ఏలాఫలము, సం. వి. అ. న: చూ, ఏల'కాయ.

ఏలాము, వై. వి. 1: చూ, రూ-ఏలము. 1; హిం. వి. 2: చూ, రూ-ఏలము. 2.

ఏలావాలుకము, సం. వి. అ. న. చూ, రూ-ఏలవాలుకము.

ఏలి, సం. వి. ఈ. స్త్రీ. 1. చీలమండ బుడిపెలక్రింద మడిమల మీఁదు; దే. విణ. (1) మనుష్యకృతము. భార. ఉద్యో. 3, ఆ. 9; చూ, కృత్రిమము.

ఏలి, దే. వి. 1. క్షత్రియుఁడు: చూ, రాజు. 1; 2. అధిపతి: చూ, స్వామి. 1. 3. గొఱ్ఱె చూ, మేషము. 1.

ఏలికసాని, ద్వ. వి. పట్టపుదేవి: చూ, రాజ్ఞి.

ఏలికిరాజనములు, ద్వ. వి. బ. ఒకరకమువడ్లు; చూ, ధాన్యము.

ఏలిదము, వై. వి. 1. = హేళిత. రూ-ఎల్లిదము, తిరస్కారము: భార. ఆది. 6, ఆ. 117: చూ, వహేళనము; విణ. 2 = హేళిత, రూ-ఎల్లిదము, చులుకనిది: చూ, వహేళనము.

ఏలినవాఁడు, దే. వి. ఒడయుఁడు: చూ, ప్రభువు. 2.

ఏలీక, సం. వి. ఆ. స్త్రీ. చిన్నఏలకులు, సూక్ష్మైల: చూ, పత్రల.

ఏలు, దే. స. క్రి. 1. పాలించు: చూ, రక్షించు; 2. పరిగ్రహించు, ప్రియముతో పుచ్చుకొను, పొందు. భార. విరా. 1, ఆ. 226: చూ, ప్రాపించు.

ఏలుకొను, దే. స. క్రి.—పై.—.

ఏలుకోటి, మి. వి. ఏలుబడికిలోఁబడిన జనులసంఖ్య.

ఏలుపు. దే. వి: చూ, రూ-ఏలుబడి.

ఏలుబడి, దే. వి. రూ-ఎల్బడి: చూ, రక్షణము. (రూ-ఏల్బడి.)

ఏల్బడి, దే. వి: చూ, రూ- ఏలుబడి.

ఏవ, దే. అవ్య. 1. ఇదేననుట, చూపుటను తెలిపెడి: చూ, ఏ. 12; 2. అవమానము; 3. చంపుట, 4. సాటి: వై. వి. (1)= హేయ, ఏవగింపు: చూ, సెగ్గింపు; (2) అవధానము: చూ, హెచ్చరిక; (3) = హేయ, అసహ్యము. ఆము. పీఠిక. 1, ఆ. 14: చూ, రోఁత. 2; విణ. (4) = హేయ, రోఁతయైనది, రూ-ఏవము: చూ, రోఁత. 2.

ఏవమ్, దే. అవ్య. 1. పోలిక; చూ, సమానము. 2; 2. ఈప్రకారమనుట, ఏవకారార్థకము: చూ, అపి. 8; 3. అంగీకారార్థకము; చూ, సమ్మతము. 1; 4. తెఱఁగు: చూ, విధము. 1; 5. నిబద్ధి; చూ, సత్యము. 1; 6. ప్రకృతమును పరామర్శించుట; 7. ఉపదేశము; చూ. హితవచనము.

ఏవకాఁడు, దే. విణ. 1. అసహ్యుఁడు: చూ, రోఁతకాఁడు; 2. ఓర్వలేనితనముకలవాఁడు, ఈర్ష్యాళువు: చూ, సూయకాఁడు.

ఏవగించు, దే. అ. క్రి. 1. అసహ్యించు. భార. అను. 1. ఆ. 55: చూ, రోఁతపడు; స. క్రి. 2. దూఱు. హరిశ్చ. 4, ఆ. 229: చూ, సెగ్గించు; 3. త్యజించు. వసు. 1, ఆ. 130: చూ, విసర్జించు.

ఏవగింపు, దే. వి. దూఱు: చూ, సెగ్గింపు.

ఏవపడు, ద్వ. అ. క్రి. అసహ్యించు. భార. అను. 3, ఆ. 32. చూ, రోఁతపడు.

ఏవము, దే. వి. 1. రూ-ఏవ. అసహ్యము: చూ, రోఁత. 2; 2. దూఱు. ఆం. భా. ప్ర. వాగ్వి. 115: చూ, సెగ్గింపు.

ఏవల, దే. వి. (ఏ + వలను.), చూ, రూ- ఎవ్వల.

ఏవాఁడు, దే. స: చూ, రూ-ఎవ్వాఁడు.

ఏవార్థకములు, వ్యా. ఎ, ఏ, అ, పో, ఏవే, అయ్యేవే. (౬).

ఏవురు, దే. స. రూ-ఏగురు. (ఏనునకు మహన్మహత్వార్థక రూపము): చూ, రూ-ఐదుగురు.

ఏష, సం. వి. ఆ. స్త్రీ. కోరిక: చూ, వాంఛ. 1. (సూ. ని.)

ఏషణము, సం. వి. అ. పుం. 1. (లోహమయమైన) బాణము: చూ, బాణము. 1; 2. కోరిక: చూ, వాంఛ. 1. (ఏషణ అనియు.)

ఏషణి, సం. వి. ఈ. స్త్రీ. 1. నారాచాకృతియైన యగసాలెవాని త్రాసు: చూ, ఆరాచి; 2. పుండ్లకంటఁ జొప్పించెడు శలాక (లేక) బంగారుపనివాని చీరణము: చూ, శలాక.

ఏష్యము, సం. విణ. 1. కాఁగలది; 2. (పంచాంగములో) మఱునాఁడు మిగిలిన తిథి లోనగునవి.

ఏస, దే. వి. 1. ఏపు: చూ, విజృంభణము; విణ. 2. రూ-ఏచ. పామరులమాట. "ఏసమాట": చూ, గ్రామ్యము. 4: 3. రూ-ఏచ. వక్రము. వసు. 2, ఆ. 11; చూ, వంకర.

ఏసరు, దే. అ. క్రి. అతిశయించు. రుక్మాం. 4, ఆ. 39; చూ, సంపడించు. 2.

ఏసరేఁగు, దే. అ. క్రి. చూ, రూ-ఎసరేఁగు.

ఏసి, దే. అవ్య. 1. పరిమాణార్థకము. కొలఁదిని తెలిపెడి. "ఇంతలేసిబొరలు."; అంత, ఎసు; 2. చొప్పున. "రెండేసి-మూఁడేసి."; చూ, వంతున.

ఏసె, దే. వి. 1. నార, ప్రత్తి; చూ, వల్కలము; 2. గడ్డిలోనగువాని పరక, పొరక: చూ, పోచ.

ఏహ్యము, వా. విణ. అసహ్యము: చూ, రోఁత. 2.

## ఐ

ఐ. అచ్చులలోని ఒక యక్షరము. సం. అవ్య. 1. స్మృత్యర్థకము, ఆకళింపును తెలుపును: చూ, ఆకళింపు; 2. పిలుచుటను తెలుపును: చూ, సంబోధనము; వి. ఐ. పుం. (ఐకారాంతః పుంసి:-ఐః - ఆయౌ - ఆయః.) 3. దిక్కు: చూ, హరిత్తు; 4. హస్తము: చూ, హస్తము. 7; 5. ముక్కంటి; చూ, శివుఁడు. 1; 6. కొండకొన: చూ, శిఖరము. 1; 7. చర్మము: చూ, తోలు. 1.

ఐంగుదము, సం. వి. అ. న. రూ-ఇంగుదము: చూ, గారపండు.

ఐందవము, సం. విణ. ఇందుసంబంధమైనది (ఇందుఁడు = చంద్రుఁడు.)

ఐందవి, సం. వి. ఈ. స్త్రీ. పలుకుఁజెలి: చూ, సరస్వతి. 1.

ఐంద్రజాలికము, వా. వి. (లేనివి ఉన్నట్టును, ఉన్నది లేనట్టును, చూచువారి కన్నులకు భ్రమ కల్పించునది.) అవాంతరములు మహేంద్రజాలము, గజకర్ణము, గోకర్ణము, గారడి, కనుకట్టు, హస్తలాఘవాదులు: చూ, ఉపవిద్యలు. 11-2).

ఐంద్రజాలికుఁడు, సం. వి. అ. పుం. చూ, రూ-ఇంద్రజాలికుఁడు.

ఐంద్రము, సం. వి. అ. పుం. 1. ఒకానొక పంచాంగయోగము: చూ, యోగములు. 3: 2. ద్రోణకాకము, మాలకాకి: చూ, సకృత్ప్రజము. 1-౫; విశ. 3. ఇంద్రునిసంబంధమైనది; 4. ఇంద్రదేవతాకమైన మంత్రము: చూ, మంత్రము. 1-౨౧.

ఐంద్రలుప్తకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-ఇంద్రలుప్తకుఁడు.

ఐంద్రాగ్నేయి, సం. వి. ఈ. స్త్రీ. 1. విశాఖ: చూ, చుక్క. 1-౧౬; 2. ఇంద్రాగ్నిసంబంధమైన పురోడాశము: చూ, పురోడాశము. 1.

ఐంద్రాణికము, సం. వి. అ. న: చూ, రతిబంధము.

ఐంద్రాస్త్రము, అం: చూ, అస్త్రములు (ఐంద్రాస్త్రము = వజ్రాస్త్రము).

ఐంద్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రాణి: చూ, భార్య. 1-౩: చూ, శచి; 2. జ్యేష్ఠానక్షత్రము: చూ, చుక్క. 1-౧౮. 3. గౌరి: చూ, పార్వతి. 1; 4: చూ, అదృష్టము; 1; 5. ఇంద్రవారుణి*: చూ, పుచ్చకాయ; 6. ఏలకి*: చూ, పత్రల; 7. తూరుపు: చూ, ప్రాచి. 1. విశ. 8. ఇంద్రుఁడు దేవతగాఁ గలది.

ఐంద్రియకము, సం. విశ. చక్షురాదీంద్రియగోచరమైనది: చూ, వెల్లడి.

ఐంద్రుఁడు, సం. వి. అం. 1. ఇంద్రపుత్రుఁడు: చూ, కొడుకుఁడు. 1-౨౬; 2. కిరీటి, పాండురాజుకొడుకు: విజయుఁడు. 1: చూ, సుభద్రేశుఁడు: (చూ, సూనుఁడు. 1-౭౩); 3. కాకాసురుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

ఐకకంఠ్యము, సం. వి. అ. న: చూ, ఏకకంఠత్వము.

ఐకద్యము, సం. అవ్య. ఒకప్పుడు: చూ, కదాచిత్.

ఐకమత్యము, సం. వి. అ. న: చూ, ఐకకంఠ్యము.

ఐకాగారికుఁడు, సం. వి. అ. పుం, దొంగ: చూ, హారకుఁడు. 1.

ఐకాగ్రుఁడు, సం. విశ. ఒక విషయముననే మనస్సు నిలిపిన వాఁడు: చూ, స్థిరచిత్తుఁడు.

ఐకాహికము, సం. వి. అ. న. ఒకదినమునఁ బుట్టినది: చూ, ఏకాహభవము.

ఐక్యము, సం. వి అ. న. మైత్రి. బసవ ఖీ. 5, ఆ 48: చూ, స్నేహము. 1; 2. లెక్క కలియఁగూడడము: చూ, వెరసి. 1; 3. కొండకొన: చూ, శిఖరము. 1; 4. చర్మము: చూ, తోలు. 1; 5. హత్తము: చూ, హస్తము. 1.

ఐక్షవధనువు, అం. చెఱకువిల్లు, మన్మథధనుస్సులో మొదటివిల్లు: చూ, మన్మథబాణములు.

ఐక్షరము, సం. వి అ. న. చెఱకురసమువలనఁ జేసిన తేనె: చూ, మధువు. 5.

ఐక్ష్వాకుఁడు. సం వి. అ. పుం. ఇక్ష్వాకుకులమునఁ బుట్టినవాఁడు. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

ఐణము, సం. విశ. 1. ఏణము (ఇఱ్ఱి) యొక్క తోలు మాంసము మొదలైనది: అం. 2. వ్యాకరణబంధములు 21: అదూషితములు 10, భావదూషితములు 11. (ఐణము భావదూషితములు పదునొకటింటిలో నొకటి.): చూ, వ్యాకరణబంధములు.

ఐణాసనము, అం: చూ, ఆసనములు.

ఐణేయము, సం. విశ. ఏణియొక్క తోలు మాంసము మొదలైనది. (ఏణి = లేడి); 2. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము.

ఐతరేయము, అం: చూ, ఉపనిషత్తులు.

ఐతి, దే. విశ. రూ-అయితి: చూ, శక్యము.

ఐతిహ్యము, అం. 1. పారంపర్యోపదేశము, పెద్దకాలమునుండు జనవాదము, పారంపర్యముచేత వచ్చిన యుపదేశము: అం. 2: చూ, రసవదలంకారములు.

ఐతిహ్యము, అం. ప్రత్యక్షాదిప్రమాణము లాఱునుగాక పౌరాణిక ప్రమాణములగు సంభవము, ఐతిహ్యము అను ప్రమాణము లెనిమిదింటిలో నొకటి: చూ, ప్రత్యక్షాదిప్రమాణములు.

ఐతే, దే. అవ్య. తు అను అవ్యయార్థకము: చూ, రూ-అయితే.

ఐద, దే. అవ్య. పృష్ఠార్థకము. వెంట: చూ, వెంబడి.

ఐదవది, దే. స: చూ, రూ-అయిదవది.

ఐదార, దే. వి అగ్ని: చూ, వహ్ని. 1.

ఐదు, దే. స: చూ, రూ-అయిదు. వేమన. 768.

ఐదుగురు, దే. స. బ: చూ, రూ-అయిదుగురు.

ఐదునొసటి, దే స. అబ: చూ, షట్కము.

ఐదుపదిసేయు, దే. అ. క్రి. 1. రూ-అయిదు పదిచేయు, సమస్థరించు. ఆము. 2, ఆ. 31: చూ, మొక్కు, 8; 2 రూ-అయిదు పదిచేయు. ఓడిపోవు. కళా. 8, ఆ, 99, (పై ఉదాహరణము దీనికినిఁ జెప్పవచ్చును.): చూ, వెనుదీయు. 1.

ఐదుమంది, దే. స. బ: చూ, రూ-అయిదుమంది.

ఐదుమోములవేల్పు, ద్వి. వి. పంచముఖుఁడు, రూ-అయిదు మోములవేల్పు, అయిదుమోములవేలుపు: చూ, శివుఁడు. 1.

ఐదువ, ద్వి. వి. (ఐదు + వన్నెలుకలది, జీవభర్తృక, సౌభాగ్యవతి, (వన్నె యనఁగా ఇక్కడ సుమంగలియొక్క అలంకారము, ఐదు — మంగళసూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు): చూ, స్త్రీ. 1-౧౬: (చూ, రూ-అయిదువ.)

ఐదువత్రాడు, వా. వి. మంగళసూత్రము.

ఐదువరాలు, (ఐదువ + ఆలు): చూ, ఐదువ (ఇక్కడ ఐదువ శబ్దము విశేషము: చూ, ఆలు: (చూ, రూ-అయిదువరాలు.)

ఐద్దాయిలు, దే. వి బ. (ఐదు + దాయిలు.) వడ్ల-కమ్మర-కంచర-అగసాలె-కాసె కులస్థుల పనులు.

ఐన, దే. ద్ర. ముందు చెప్పఁబడినదానికి విరుద్ధమైన యర్థమును దెలుపును: చూ, రూ-అయిన, అఁట.

ఐనిల్లు, దే. వి. అంతర్గృహము. రూ-అయినిల్లు: చూ, సదనము. 1-౧౮.

ఐనింటివారిబిడ్డ, జా. సద్వంశమునఁ బుట్టినది.

ఐపు, దే. వి. 1. రూ-అయిపు. తప్పు: చూ, సొంటు. 2. జాడ. రూ-అయిపు: చూ, సూచన. 1.

ఐపోవు, దే. అ. క్రి. 1. రూ-అయిపోవు, ముగియు, "వాని ఉద్యోగము ఐపోయినది": చూ, సరిపోవు. 3, 2. రూ-అయిపోవు. వెచ్చమైతీఱు. "సంచారములన్ని ఐపోయినవి": చూ, చెల్లు.

ఐభము, అం వ్యాకరణబంధములు ఇరువదియొకటి. అందు అదూషితములు ౧౦; భావదూషితములు ౧౧; ఇది అదూషితములు పదింటిలో నొకటి: చూ, వ్యాకరణబంధములు.

ఐభి. సం. వి. ఈ. స్త్రీ: చూ, హస్తిఘోషక.

ఐమచ్చు, దే. వి. గుఱుతు; లక్షణము. 1. (పదార్థము దీనిచేత చూడ(బడును.)

ఐమూల, దే. విఱ. మూలవాటు, రూ-అయిమూల. "అయిల్లు ఐమూలగానున్నది.": చూ, హరిత్తు. 1-౧౪.

ఐర, దే. వి. రూ-అయిర, కంటితెవులు. ఆం. ధా. ప్ర. మ. 127: చూ, హర్షణము. 3-౫.

ఐరకొను, దే. అ. క్రి. యుక్తమగు. రూ-అయిరకొను. పంచ. వేం. 1, ఆ. 99: చూ, సరిపడు. 2.

ఐరగట్టు, ద్వ. వి. హలోపకరణము: చూ, రూ-అయిరగట్టు.

ఐరావణము, సం. వి. అ. పుం. 1. ఐరావతము, ఇంద్రుని యేనుగు: చూ, హస్తి-1-౩౬; 2. నాగరంగము *: చూ, శర్కరాంకము. 1-౧౧; 3. అమృతము, అబ్ధినవనీతము: చూ, సుధ. 1.

ఐరావతము, సం. వి. అ. న. 1. వంకరలేని నిడుపైన ఇంద్ర ధనుస్సు: చూ, బాణము. 1-౧౬; పుం. 2. ఇంద్రుని యేనుగు: చూ, హస్తి; 1-౩౬; 3. నాగరంగము *: నారింజ; చూ, శర్కరాంకము. 1-౧౧; 4. అమృతము, అబ్ధినవనీతము: సుధ 1; 5. మబ్బుమీ(దవచ్చెడి మబ్బు, రాజమేఘము: చూ, మేఘము. 1-౬; 6. ఐరావతమను నొక పాము: చూ, సర్పము; 1-౪-(౨); 7. ఐరావతమను పేరుగల ఖండము: చూ, దేశములు. ౬౪-3; 8. తూర్పుదిక్కునందలి యేనుగు: చూ, హస్తి; 1-౨-(౧); 9. నింబ *: నిమ్మ; చూ, శర్కరాంకము. 1-౧౨; 10. కమ్మరేగు *: చూ, రేగు. 1-౨. 11. కాకినేరేడు *: చూ, సురభిపత్ర: 12. ఎఱ్ఱికిత్తిలి *: చూ, శర్కరాంకము. 1-౧; అం. 13. ఇంద్రుని వాహనము, చూ, దిక్పాలవాహనములు;

ఐరావతి, సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱపు: చూ, విద్యుత్తు, 1; 2. కోల మెఱుపు: చూ, —పై.—; 3. యముని భార్య. చూ, భార్య. 1—౫౦. (చూ, స్త్రీ.)

ఐరిణము, సం. వి. అ. న. పాంశవలవణము: చూ, లవణము. 1—౪.

ఐరుపు, దే. వి. రూ- అయిరుపు. అగ్ని: చూ, వహ్ని. 1.

ఐరేని, దే. వి. రూ- అయిరేని, పంచరంగులలో చిత్తరువులు పెండ్లికడవలు. విజ. 3, ఆ. 95: చూ, భాండము. 3—౨.

ఐరేనికడవలు, ద్వ. వి. —పై.—

ఐరేయము, సం. వి. అ. న. కల్లు: చూ, సుర. 2.

ఐలబిలుడు, సం. వి. అ. పుం. 1. కుబేరుడు: చూ, శ్రీదుడు; 2. దిలీపమహారాజు: చూ, రాజు. 1.

ఐలారము, దే. వి: చూ, రూ- అయిలారము *.

ఐలుడు, సం. వి. అ. పుం. 1. పురూరవ చక్రవర్తి: చూ, రాజు. 1.

ఐలేయము, సం. వి. అ. న. సూ(గుదోస *: చూ, హరి వాలుకము.

ఐలేయుడు, సం. వి. అ. పుం. పురూరవ చక్రవర్తి: చూ, ఐలుడు.

ఐవచ్చు, దే. అ. క్రి; చూ, రూ- అయివచ్చు.

ఐశుడు, సం. వి. అ. పుం. ఈశ్వరుని కొమారుడు: చూ, వినాయకుడు. 1.

ఐశాని, సం. వి. ఈ. స్త్రీ. 1. ఈశానదిక్కు, ఈశాన్యము, ఐశి: చూ, దిక్కులు; 2. ఈశానుని పట్టణము: చూ, దేశములు. ౬౧-౪.

ఐశి, —పై.—; 3: చూ, పార్వతి.

ఐశ్వర్యము, సం. వి. అ. న. 1. అణిమాద్యష్టసిద్ధులలో నొకటి: చూ, సిద్ధులు. (విభూతులు.): 2, భాగ్యము: చూ, సంపత్తి. 1; 3: చూ, అదృష్టము 1; 4. చూ, గుణములు.

ఐశ్వర్యములు, అం. 1. మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము. (6); 2. దాసీజనము, భృత్యులు, పుత్రులు, మిత్రులు. బంధువులు, వాహనములు, ధనము, ధాన్యము. (8).

ఐశ్వర్యలక్ష్మి, అం. చూ, తంత్రములు.

ఐషమస్తనము, సం. విఱ. ఈసంవత్సరపుది: ఐషమస్త్యము.

ఐషమస్త్యము, —పై.—

ఐష్టికుడు, సం. వి. అ. పుం. యష్టికర్త యజ్ఞమువాడు: చూ, యష్టిధరుడు.

ఐషీకము, అం. చూ, అస్త్రములు.

ఐహికము, సం. విఱ. (అ. ఆ. ఉ.) 1. ఇహలోక సంబంధమైనది; 2. చూ, లోకములు. (చూ, ఇహలోకము.)

ఐళుడు, సం. వి. అ. పుం: చూ, రూ-ఐలుడు.

## ఒ

ఒ, అచ్చులలోని ఒకయక్షరము. దే. అవ్య. 1. సంబోధనార్థకము. భార. విరా. 1, ఆ. 215: చూ, సంబోధనము; అవ్య. 2. ప్రార్థనార్థకము మీ(దవచ్చు వానిలో నొకటి. ప్రార్థనార్థకముమీ(దవచ్చునవి — ఇ - ఈ -ఏ - ఏ - ఐ - ఓ అనునవి.

ఒంకియ, వై. వి.=వంక్యమ్. పాగమొదలైనవి తగిలించెడు చిలుకకొయ్య: చూ, వంక్యము. (రూ- ఒంకె.)

ఒంకె, వై. వి.=వంక్యమ్. —పై.—

ఒంపువాడు, దే. వి. ఘాతకుడు, చంపువాడు: చూ, హింసకుడు.

ఒంజిలి, దే. వి. 1. రూ ఒండిలి. కీడు: చూ, హాని. 2; 2. రూ- ఒందిలి. పీడుపు; చూ, శోకము. 2; విఱ. 3. రూ- ఒంచిలి. దుఃఖముకలవాడు: చూ, విమనుడు; 4. రూ- ఒంచిలి. దుఃఖముకలది: చూ, దుఃఖితము.

ఒంటపగు, దే. వి. మల్లయుద్ధగతిభేదము; చూ, పరువడి. ; చూ, మల్లశాస్త్రము.

ఒంటనివాడు, ద్వ. వి. పగతుడు: చూ, శత్రువు. 1.

ఒంటమి, దే. వి. పగ: చూ, విరోధము. 1.

ఒంటరము, దే. వి. —పై.— భార. ఉద్యో. 4, ఆ. 237.

ఒంటరమింటరము, దే. వి. ఎక్కువతక్కువలు. భార. ఉద్యో. 4, ఆ. 237. (ఎక్కువతక్కువలు = కష్టనిష్ఠురములు.)

ఒంటరి, ద్వ. వి. (ఒంటి + అరి.) 1. పంది: చూ, సూకరము; అసహాయుడైన బంటు. య. 5, ఆ. 74; చూ, ఒంటరీడు. 1; 3. ఎక్కటి: చూ, ఒంటరీడు. 2.

ఒంటరికాఁడు, ద్వ. వి. 1. పంది. చంద్రా. 1, ఆ. 20: చూ, సూకరము; 2. అసహాయుఁడైనజంతు. ఉ, రా. 7, ఆ. 414: చూ, ఒంటరీఁడు. 1; విశ. 3. ఎక్కటి: చూ, ఒంటరీఁడు. 2. (స్వార్థమున కాఁడు.)

ఒంటరిపాటు, ద్వ. వి. 1. అనురహసము; చూ, రహస్యము. 1; 2. అసహాయత: చూ, దిక్కుమాలినతనము.

ఒంటరివాఁడు, ద్వ. వి. 1. అసహాయుఁడైనజంతు; చూ, ఒంటరీఁడు. 2; 2. ఎక్కటి; చూ, ఒంటరీఁడు. 2.

ఒంటరీఁడు, ద్వ. వి. (ఒంటరి + ఈఁడు.) 1. అసహాయుఁడైన జంతు. అం. ఛా. ద్వి.క. 185. (స్వార్థమున ఈఁడు.)ఒంటరి, ఒంటరికాఁడు, ఒంటరివాఁడు, ఒంటరీఁడు, ఒంటికాఁడు, ఒంట్రింపు; (సం, ప);—అసహాయశూరుఁడు; 2. అసహాయుఁడు, ఎక్కటి: చూ, విడి, 12.

ఒంటరులు, ద్వ. వి. బ. 1. కాలిబంటు; చూ, భటుఁడు. 1; 2. నాలుగవ జాతివారిలో నుత్తములుగ పరిగణింపఁబడు నొకానొక జాతివారు.

ఒంటి, దే. వి. 1. ఒంటిపాటు: చూ. రహస్యము. 1: 2. అసహాయత: చూ, దిక్కుమాలినతనము.

ఒంటింపు, దే. వి. 1. మైత్రి, పొత్తు: చూ, స్నేహము. 1; 2. తోడు, సహాయము: చూ, వెంబడి; 3. ఏఁడు వీఁడీయా పనినిఁ జెయవలయునని యేర్పఱచు నేర్పాటు. (ఇప్పంతము ప్రాచీనకవి సమ్మతము కామ. అరగింపు వంటిది.

ఒంటికంటిగాము, ద్వ. వి. అనేహస్సు: చూ, శుక్రుఁడు.

ఒంటికంటిరామలింగము, లో. ఎదుటివారికలిమి చూచి యోర్వలేనివాఁడు. (అసహనుఁడు.)

ఒంటికాఁడు, ద్వ. వి. 1. పంది: చూ, సూకరము; విశ. 2. సన్న్యాసి, వియోగి, ప్రియురాలి నెడబాసినవాఁడు. హ, న. 2, ఆ. 30: చూ, ముని. 1; 2. ఏకాకి, ఎక్కటి: చూ, విడి. 12.

ఒంటికొమ్ము వేలుపు, ద్వ. వి. ఏకదంతుఁడు: చూ, వినాయకుఁడు. 1.

ఒంటిగాము, ద్వ. వి: చూ, ఒంటికంటిగాము.

ఒంటిజందెపువాఁడు, ద్వ. వి. ఉపనీతుఁడు, బ్రహ్మచారి: చూ, వటువు.

ఒంటిపాటు, వై. వి. ఏకాంతము: చూ, రహస్యము. 1.

ఒంటిపేటదండ, ద్వ. వి. ఏకావళి, ఒంటిపేటహారము: చూ, భూషణము. 2-3ళ.

ఒంటిపోఁగు, ద్వ. వి. బలదేవుఁడు, రోఁకలితాల్పు. శశాం. 2, ఆ. 20: చూ, హలాయుధుఁడు.

ఒంటిపోట్లాట, ద్వ. వి: చూ, ఎక్కటిజవరము.

ఒంటిమన్ను, వా. వి. శరీరమలము: చూ, శమలము. 1-౧౦.

ఒంట్రిమాఁకులపెనుముప్పు, ద్వ. వి. గాలి: చూ, వాయువు. 1.

ఒంటియ, వై. వి.= ఉష్ట్రీ. రూ-ఒంటె: చూ, లొట్టిపిట్ట.

ఒంటియపుగుగ్గతెర, ద్వ. వి. చూ, పరువళ్లు. (చూ, మల్లకాష్ఠము.)

ఒంటివేలు, వా. వి. అల్పాచమానము విడుచుటకు బడిపిల్లలు (బాలబాలికలు) పంతులుగారిని అనుమతిని చూపెడిసంజ్ఞ. (చిటికెనవ్రేలు చాపుట.)

ఒంటు, దే. వి. 1. మైత్రి, పొత్తు: చూ, స్నేహము. 1; 2. గ్రామసమూహము; అ. క్రి. 3. అనుకూలించు: చూ, సరిపడు. 1; స. క్రి. 4. పొందు. శశాం. 2, ఆ. 118: చూ, సక్తమగు.

ఒంటుకొన్న, దే. స. క్రి. పొందు. శశాం. 2, ఆ. 89: చూ, సక్తమగు.

ఒంటె, వై. వి.= ఉష్ట్రీ. చూ, రూ-ఒంటియ.

ఒంటెపిల్ల, ద్వ. వి. కరభము. —పై.—

ఒంటెపులి, ద్వ. వి. ఒక్కరకము మృగము. (అప్ర.)

ఒంటెలగుంపు, ద్వ. వి. ఉష్ట్రిసమూహము: చూ, ఔష్ట్రికము.

ఒంట్రింపు, ద్వ. వి. అసహాయశూరుఁడు: చూ, ఒంటరీఁడు. 1.

ఒంట్లు, దే. వి. బ. (ఒంటు + లు.) 1. పురుషులకర్ణభూషణము: చూ, భూషణము. 2-రా-(ఆ) వై. వి. 2. అంకెలు: చూ, సంఖ్య. 1.

ఒండిలి, దే. వి. రూ-ఒంజిలి, అపథము: చూ, హాని. 2.

ఒండు, వై. స. ఏ. 1.= ఏకః. ఒకటి: చూ, వంచి; వై. స. 2.= ఏకః. అన్యము: చూ, వేఱు. 3: అపరు:చూ, సుబ్బలి.

ఒండువలను, ద్వ. వి. అన్యము: చూ, వేఱు. 3.

ఒండె, దే. ద్ర. 1. ఆటుకానిపక్షమున. భార. అర. 5. ఆ. 363. ఫీ. 6, ఆ. 73: చూ, ఏని. (1); 2. కాని, వికల్పార్థకము. భార. సభా. 1, ఆ. 193 : చూ, వికల్పము. 2.

ఒండేని, దే. అవ్య. (ఒండె + ఏని) 1. ఆటుకానిపక్షమున: చూ, ఏని. (1); 2. కాని, వికల్పార్థకము. కాశీ. 5, ఆ. 45: చూ, వికల్పము. 2.

ఒండొండ, దే. అవ్య. (ఒండు + ఒండు + ల.) క్రమక్రమముగా. భార. ఆది. 4, ఆ. 224 భార. శాంతి. 1, ఆ. 22.

ఒండొండు, దే. అవ్య. మిథఃపదార్థము, పరస్పరము. అం. ఛా. తృ. అవ్య. 68: చూ, మిథము. 1.

ఒండొకటి, దే. స. అన్యోన్యము, పరస్పరము: చూ, మిథము. 1.

ఒండొకఁడు, ద్వ. అవ్య. ఇతరుఁడు: చూ, వేఱయినవాఁడు.

ఒండొరు, దే. ద్ర. పరస్పరము: చూ, మిథము. 1.

ఒండొరుమిక్కి, ద్వ. వి. మైత్రి: చూ, స్నేహము. 1.

ఒండొరులు, దే. ద్ర. ఒండొరు: చూ, మిథము. 1.

ఒండొరులమైత్రిచెఱుచుట, అం. చూ, భేదోపాయములు.

ఒండొరులకురాయిడిపుట్టించుట, అం.—పై.—

ఒందిక, దే. వి. మైత్రి. రూ-ఒద్దిక. వి. పు. 5, ఆ. 79 : చూ, స్నేహము. 1.

ఒందిలి, దే. వి, విశ : చూ, రూ-ఒంజిలి.

ఒందు, దే. స. క్రి. 1. పొందు : చూ, సక్తమగు; అ. క్రి. 2. జనించు, కలుగు. భార. అర. 4, ఆ. 181; భార. ఆది. 8, ఆ: చూ, సంభవించు.

ఒక, వై. స. 1.= ఏకఃవృత్తియందు ప్రత్యయము లోపించిన రూపము. "ఒకపరి, ఒకతేప, ఒకముష్టి": రూ-ఒక్క; 2.= ఏక. ఉద్దేశింపఁబడని, 'ఒకించుక, ఒకింత ఇత్యాదులయందు ఇది అల్పార్థకమని యెఱుంగునది: ఒకానొక, రూ-ఒక్క.

ఒకంట, వై. ప్ర. = ఏకత్ర. ఏకత్రార్థకము: రూ-ఒకట-ఒక్కాట-ఒకోట-ఒక్కోట.

ఒకఁడు, వై. స. 1. = ఏకః. ఒకటి: చూ, వంచి; 2. = ఏకః, రూ-ఒక్కఁడు. అన్యుఁడు: చూ, ఒండొకఁడు; 3. = ఏకః. ఏకఁడు (లేక) ఏకము. అన్యము: రూ-ఒకరుఁడు-ఒకరు వుఁడు - ఒకోఁడు-ఒకోరుఁడు - ఒకోరువుఁడు - ఒక్కఁడు-ఒక్కరుఁడు - ఒక్కరువుఁడు - ఒక్కోఁడు -ఒక్కోరుఁడు-ఒక్కోరువుఁడు, ఒడ్డు, ఒరుఁడు-ఒరువుఁడు; (సం. ప): — ఏకకుఁడు.

ఒకట, వై. ప్ర. 1. = ఏకత్ర. ఏకత్రార్థకము: చూ, రూ-ఒకంట; 2. కూడ, సహితమను నర్థమును దెలిపెడి: చూ, సైతము; 3. ఏకకాలమున: చూ, యుగపత్.

ఒకటి, వై. స. ఏ. 1. = ఏకః. ఏకసంఖ్య, రూ-ఒక్కటి: చూ, వంచి; 2. = ఏకః. రూ- ఒక్కటి. అన్యము: చూ, వేఱు. 3.

ఒకటికి, వా. చూ, ఒంటివేలు.

ఒకత, వై. స. ఏ. 1. = ఏకస్త్రీ. రూ-ఒకతె: చూ, స్త్రీ. 1-అ; 2. పరస్త్రీ. రూ- ఒకతె: చూ, స్త్రీ. 1-అ.

ఒకతడవ, దే అవ్య. సకృదర్థకము: చూ. సకృత్. 1.

ఒకతి, చూ, రూ-ఒకత.

ఒకతుక, (ఒకత + క.) రూ-ఒకర్తుక.—పై.—

ఒకతూరి, దే. అవ్య. ఒకతడవ: చూ, సకృత్. 1.

ఒకతె, రూ- ఒకరితె: చూ, రూ- ఒకత.

ఒకతేప, దే. అవ్య. ఒకతడవ; చూ, సకృత్. 1.

ఒకపరి, దే. అవ్య. —పై.— ఆం. భా. తృ. అవ్య. 68.

ఒకపారి, దే. అవ్య. —పై.—

ఒకపెట్టు, దే. క్రి. ఏకకాలమున: చూ, యుగపత్.

ఒకపెట్టున, దే. క్రి. —పై.—

ఒకప్పుడు, దే. క్రి. ఐకద్యము. ఆం. భా. తృ. అవ్య. 70; చూ, కదాచిత్.

ఒకమరి, దే. అవ్య. ఒకతడవ; చూ, సకృత్. 1.

ఒకమాటు, —పై.—

ఒకమాఱు, —పై.—

ఒకమొగి, దే. క్రి. ఏకకాలమున; చూ, యుగపత్.

ఒకయూక, —పై.—

ఒకరిత, వై. స. ఏ. (ఒకరి + త.) రూ-ఒకర్త: చూ, రూ-ఒకత.

ఒకరితి, (ఒకరి + తి.) —పై.— (రూ-ఒకర్తి.)

ఒకరితె, (ఒకరి + తె.) —పై.— (రూ-ఒకర్తె.)

ఒకరిసొమ్మును ఇానమ్ముట, అం. చూ, వివాదములు.

ఒకరుఁడు, వై. స. 1. = ఏకః. అన్యుఁడు: చూ, ఒండొకఁడు; 2. = ఏకః. ఏకకుఁడు (లేక) అన్యము. ఏకము: చూ, ఒకఁడు. 3.

ఒకరువుఁడు, —పై.—

ఒకరోజు, ద్వ. వి. ఒకానొకదినము: ఒక్కనాఁడు; (సం. ప):— ఏకాహము.

ఒకర్త, 1. రూ-ఒకరిత. ఏకస్త్రీ: చూ, స్త్రీ; 1-అ; 2. రూ-ఒకరిత. పరస్త్రీ: చూ, స్త్రీ. 1-అ.

ఒకర్తి, —పై.— (రూ-ఒకరితి.)

ఒకర్తు, (ఒకర్త + ఉ.) —పై.— (రూ-ఒకర్తుక.)

ఒకర్తుక, (ఒకర్త + క) —పై.— (రూ-ఒకతుక.)

ఒకర్తె, రూ-ఒకతె. —పై.—

ఒకవిడుత, ద్వ. అవ్య. ఒకతడవ: చూ, సకృత్ 1.

ఒకసారి, ద్వ. అవ్య. —పై.—

ఒకానొక, వై. విశే. వృత్తియందు ప్రత్యయము లోపించిన రూపము. ఉద్దేశింపఁబడని. "ఒకానొక పురుషుఁడు, ఒకానొక స్త్రీ, ఒకానొక మృగము." మొ. (దీనిని ప్రత్యయముతో చేర్చి చెప్పునప్పుడు మహదర్థమున ఒకానొకఁడనియు, మహత్స్వర్థమున ఒకానొకతెయనియు, అమహదర్థమున ఒకానొకటి యనియు రూపములు.): చూ, ఒక. 2.

ఒకానొకప్పుడు, ద్వ. క్రి. కదాచిదర్థకము: చూ, కదాచిత్.

ఒకింత, దే. వి. 1. అల్పము, రూ-ఒక్కింత: చూ, స్వల్పము; అవ్య. 2. రూ-ఒక్కింత. ఈషదర్థకము. ఆం. భా. తృ.అవ్య. 74: చూ, స్వల్పము.

ఒకింతవేఁడిమి, ద్వ. వి. ఇనుమంతకాఁక: చూ, సంజ్వరము 2-అ.

ఒకొ, దే. అవ్య. రూ-ఒకో. సంశయార్థకము. భార. ద్రోణ. 2, ఆ. 229; భార. విరా. 1, ఆ. 49; నిర్వ. 8, ఆ. 121. చూ, సంశయము.

ఒకోఁడు, వై. స. 1. = ఏకః. అన్యుఁడు; చూ, ఒండొకఁడు; 2. = ఏకః. ఏకకుఁడు (లేక) అన్యము, ఏకము: చూ, ఒకఁడు. 3.

ఒకోట, వై. ప్ర. 1. ఏకత్రార్థకము. రూ - ఒక్కోట: చూ, ఒకంట; 2. కూడ. రూ-ఒకట: చూ, సైతము.

ఒకోటి, వై. స. ఏ. రూ-ఒకటి. ఏకసంఖ్య: చూ, వంచి.

ఒకోత, వై. స. ఏ. 1. రూ-ఒకోరిత, ఏకస్త్రీ: చూ, స్త్రీ. 1-అ; 2. రూ-ఒకోరిత. పరస్త్రీ: చూ, స్త్రీ. 1.-అ.

ఒకోరితి, (ఒక్కరితి +) —పై.— రూ- (ఒకోర్తి)

ఒకోతి, —పై.— (రూ-ఒకోరితి.)

ఒకోతుక, (ఒకోత + క.) —పై.—

ఒకోతె, —పై.— (రూ-ఒకోరితె.)

ఒకోరిత. (ఒకోరి + త.) —పై.— (రూ-ఒకోర్త.)

ఒకోరితి, (ఒకోరి + తి) —పై.— (రూ-ఒకోర్తి.)

ఒకోరితె, (ఒకోరి + తె.) —పై.— (రూ-ఒకోర్తె.)

ఒకోరుఁడు, వై. స. = ఏకః: చూ, రూ-ఒకోఁడు.

ఒకోరువుఁడు, వై. స. = ఏకః. —పై.—

ఒకోర్త, వై. స. ఏ. 1. రూ- ఒకోరిత. ఏకస్త్రీ; చూ, స్త్రీ 1-అ; 2. రూ- ఒకోరిత. పరస్త్రీ; చూ, స్త్రీ.

ఒకోర్తు, 1-అ. (ఒకోర్త + ఉ.) —పై.—

ఒకోర్తుక, (ఒకోర్తు + క.) —పై.— (రూ-ఒకోతుక.)

ఒకోర్తె, —పై.— (రూ- ఒకోరితె)

ఒకో, దే. అవ్య: చూ, రూ-ఒకొ.

ఒక్క, వై. స: చూ, రూ-ఒక.

ఒక్కంతగా, దే. క్రి. ఒక్కపెట్టు; చూ, యుగపత్.

ఒక్కాట, వై. క్రి. 1. ఏకత్రార్థకము. రూ- ఒకట: చూ; ఒకంట; 2. కూడ, సహితము. భార. ఆది. 7, ఆ. 160. భార. అర. 2, ఆ. 76; చూ, సైతము.

ఒక్కటి, వై. స. ఏ.=ఏకః: చూ, రూ- ఒకటి.
ఒక్కటీఁడు, ష్ఠ్వ. వి. ఏకాకి. ఒంటరికాఁడు: చూ, విశి. 12.
ఒక్కఁడు, వై. స. 1.=ఏకః రూ-ఒకఁడు. అన్యుఁడు: చూ, ఒంటొకఁడు; 2.=ఏకః. ఏకకుఁడు (లేక) ఏకము, అన్యము: చూ, రూ- ఒకఁడు. 3.
ఒక్కణ, వై. వి.=వ్యాఖ్యానమ్. రూ-వక్కణ; చూ, వివరము.
ఒక్కత, వై. స. ఏ. రూ- ఒక్కరిత: చూ, రూ- ఒకత.
ఒక్కతి, వై. స. ఏ. రూ- ఒక్కరితి, —పై.—
ఒక్కతుక, వై. స. ఏ. రూ - ఒకతుక. —పై.—
ఒక్కతూకు, దే. అవ్య. ఒకతడవ; చూ, సకృత్. 1.
ఒక్కతె, వై. స. ఏ. రూ - ఒక్కరితె : చూ, రూ- ఒకత.
ఒక్కనాఁడు, ష్ఠ్వ. వి. ఏకాహము, అన్యదినము. ఆం, భా. ప్ర. విన్న. 97. చూ, ఒక రోజు.
ఒక్కపెట్టు, దే. క్ర. ఒక్కుంతగా : చూ, యుగపత్.
ఒక్కప్రొద్దు, వై. వి. వ్రతాదులచే నియమముతోఁ జేయునట్టి యొక్క పూఁట భోజనము : చూ, సాపాటు. 1-అ.
ఒక్కమాటు, దే. అవ్య. ఒకపరి: చూ, సకృత్. 1.
ఒక్కము, దే. స. ఏకసంఖ్య, ఒకటి : చూ, వంచి.
ఒక్కమొగి, దే. క్ర. ఒక్కపెట్టు: చూ, యుగపత్.
ఒక్కయూకి, దే. క్ర.—పై.— ఆం, భా. ద్వ, అవ్య. 80.
ఒక్కరిత, వై. స. ఏ. రూ- ఒక్కర్త: చూ, రూ-ఒకత.
ఒక్కరితి, రూ- ఒక్కర్తి, —పై.—
ఒక్కరితె, రూ- ఒక్కర్తె. —పై.—
ఒక్కరుఁడు, వై. స.=ఏకః; చూ, రూ- ఒకరుఁడు.
ఒక్కరుపుఁడు, వై. స.=ఏకః.—పై.—
ఒక్కర్త, వై. స. ఏ. రూ- ఒక్కరిత: చూ, రూ-ఒకత.
ఒక్కర్తి, రూ- ఒక్కరితి. —పై.—
ఒక్కర్తు, రూ- ఒకర్తు. —పై.—
ఒక్కర్తుక, రూ- ఒకర్తుక. —పై.—
ఒక్కర్తె, రూ- ఒకర్తె. —పై.—
ఒక్కసారె, దే. అవ్య. సకృదర్థకము. ఆం. భా. ద్వ, అవ్య. 68: చూ, సకృత్. 1.
ఒక్కసికొక్కు, ష్ఠ్వ. వి. ఒకానొక బాలక్రీడ. "ఒక్కసికొక్కు, రెండు లోగిప్ప, మూఁడుముచ్చిలక, నాలుగు నందన్న, అయిమంచిటిగొలుసు, ఆఱుంచారాలు, ఏడుండిటీలు, ఎనమన మనమంచ, తొంబాతోటచ్చు, పావిరపట్టుడీ" మొ॥ చూ, బాల క్రీడ.
ఒక్కాణించు, వై. వి.=వ్యాఖ్యాన; వ్యాఖ్యానముచేయు, చెప్పు. (పురుషోత్తమ కవీయము.)
ఒక్కింత, దే. వి. చూ, రూ- ఒకింత.
ఒక్కుమ్మడి, దే. క్ర. ఒక్కయూకి: చూ, యుగపత్.
ఒక్కూక, —పై.—
ఒక్కెడ, దే. క్ర. ఐకద్యము; చూ, కదాచిత్.
ఒక్కెత్తు, దే. అవ్య. ఒక్కయూకి: చూ, యుగపత్.
ఒక్కెఱ, వై. వి. 1.= ఉగ్రమ్. అంకపొంకములు, ఉగ్రభావము. భార. అర. 3, ఆ. 153: చూ, రౌరవము; విణ. 2. ఉగ్రము. —పై.— భార. ఆది. 6, ఆ. 256.
ఒకొ్క, దే. అవ్య. రూ- ఒకో్క: చూ, సంశయము.
ఒకొ్కఁడు, వై. స. 1. రూ- ఒక్కఁడు. అన్యుఁడు: చూ, ఒండొకఁడు; 2. ఏకకుఁడు (లేక) అన్యము, ఏకము. రాఘ. 2, ఆ. 106: చూ, రూ- ఒకఁడు. 3.
ఒకొ్కట, వై. క్ర. 1. ఏకత్రార్థకము: చూ, ఒకంట. 2. కూడ, సహితము: చూ, సైతము; 3. ఏకకాలమున. భార. ఆది. 6, ఆ. 233: చూ, యుగపత్.
ఒకొ్కటి, వై. స. ఏ. ఏకసంఖ్య. రూ- ఒకొటి: చూ, వంచి.
ఒకొ్కత, రూ- ఒకొ్కరిత: (చూ, రూ- ఒకత.)
ఒకొ్కతి, రూ- ఒకొ్కరితి. —పై.—
ఒకొ్కతుక, రూ- ఒకొతుక —పై.—
ఒకొ్కతె, రూ- ఒకొ్కరితె. —పై.—
ఒకొ్కరిత, రూ- ఒకొరిత. —పై.—
ఒకొ్కరితి, రూ- ఒకొరితి. —పై.—
ఒకొ్కరితె, రూ- ఒకొరితె. —పై.—
ఒకొ్కరుఁడు, వై. స. 1.= ఏకః. అన్యుఁడు. రూ- ఒకొరుఁడు: చూ, ఒండొకఁడు; 2.= ఏకః. ఏకకుఁడు రూ- ఒకొరుఁడు: చూ, ఒకఁడు. 3.
ఒకొ్కరుపుఁడు, వై. స.=ఏక. —పై.—(రూ- ఒకొరుపుఁడు.)
ఒకొ్కర్త, వై. స. ఏ. రూ- ఒకొర్త: చూ, రూ- ఒకత.
ఒకొ్కర్తి, రూ- ఒకొర్తి. —పై.—
ఒకొ్కర్తు, రూ- ఒకొర్తు. —పై.—
ఒకొ్కర్తుక, రూ-ఒకొర్తుక. —పై.—
ఒకొ్కర్తె, రూ- ఒకొర్తె. —పై.—
ఒకో్క, దే. అవ్య. రూ- ఒకొ్క: చూ, సంశయము.
ఒకో్కట, దే. క్ర. రూ- ఒకొ్కట. ఏకకాలమున: చూ, యుగపత్.
ఒకో్కలనము, దే. అవ్య. —పై.—
ఒగచెడము, దే. వి. కాఠిన్యము, నిష్ఠురము: చూ, దయ.
ఒగరు, వై. వి. 1.=తువర. వగరు, చుక్కఁగాఁబండని దానిమ్మలోనగువాని రుచి. విక్ర. 6, ఆ. 172: చూ, రసము. 5; అం. 2. చూ, రసములు.
ఒగరుచు, వై. అ. క్రి. ఒగరుగు. ఆము. 2, ఆ. 53.
ఒగరుప్పు, వై. వి. ఊపిరికట్టు: చూ, శ్వాసబంధము (రూ- ఒగప్పు.)
ఒగప్పు, —పై.—
ఒగి, దే. క్ర, క్రి. విణ. క్రమముగా. భార. అర. 2, ఆ. 275.
ఒగిదిగ, దే. వి. కొప్పువల, చూ, భూషణము. 2 ౧౧-(అ).
ఒగుడు, దే. వి. జొన్నలోనగువాని యెండినయాకు: చూ, సొరుగాకు.
ఒగుడుకలుచు, దే. అ. క్రి. స్పృశించు, చికుప్ప: చూ, వడియు. 3.
ఒగ్గము, దే. వి. అవపాతము. భాగ. 1, స్కం. 454: చూ, వారి. 6.
ఒగ్గాళము, దే. విణ. ఉగ్రము, భయంకరము. (సూ. ని.) చూ, కౌరవము. 2.

ఒగ్గు, దే. అ. క్రి. 1. ఉత్సహించు, కడఁగు. పాంచా. 2, ఆ. 49: చూ, సమకట్టు. 2; స. క్రి. 2. (వల) పఱచు, ఒడ్డు: చూ, పఱచు; 3. చాఁగఁజేయు, ఒడ్డు: చూ, చాఁపు.

ఒగ్గుజల్లి, దే. వి. తరిమెనపట్టెపు కొయ్యకాధారమైన జల్లి: చూ, సింహాసనము. 1-౧౮.

ఒచ్చుబడి, దే. వి. రాబడి. చూ, రూ- వచ్చుబడి.

ఒచ్చెము, దే. వి. 1. అచ్చిర, న్యూనత. కాశీ. 7, ఆ. 57: చూ, వెలితి. 2; 2. అవమానము. భార. ఉద్యో. 1, ఆ. 348: చూ, సడి. 3.

ఒచ్చెల, దే. అవ్య. రూ- ఓచెల్ల. సంతాపార్థకము. భో. 5, ఆ. 58: చూ, సంతాపము.

ఒచ్చెల్ల, —పై.— భో. 1, ఆ. 182.

ఒజ్జ, వై. వి. 1. = ఉపాధ్యాయః. చదువులయ్య. వంతులు. చూ, సురాచార్యుఁడు. 1-౧; 2. = ఉపాధ్యాయః. యాజకుఁడు. భార. ఆది. 1, ఆ. 131: చూ, ఋత్విజుఁడు. 1.

ఒజ్జదనము, వై. వి: చూ, ఒజ్జనము.

ఒజ్జనము, వై. వి. ఉపాధ్యాయత్వము: ఒజ్జదనము: (సం.ప):- ఆచార్యకము, ఆచార్యత్వము, ఉపాధ్యాయత్వము.

ఒజ్జబంతి, వై. వి. = ఉపాధ్యాయపద్ధతి. (ఉపాధ్యాయుఁడు చూపిన) ఒరవడి. పాంచా. 1, ఆ. 20; రూ-ఓజబంతి: చూ, మేలుబంతి.

ఒజ్జలపంగనామము, లో. గురువునకు పంగనామము. (అయ్యవారికి తప్పులు దిద్దఁబోవుట లోనగుచర్య.)

ఒజ్జలపుచ్చకాయ, జా. నేర్చినవిద్య మఱచిపోవుట. "ధర్మవిధులన్నియు నొజ్జలపుచ్చకాయఁగావఁయు" (కళాపూర్ణోదయము.) "శా. ఆహా! యొజ్జలపుచ్చకాయ వితమౌరా వేయునింకేటికిఁ." శశాం. 4, ఆ. 192.

ఒజ్జలపుచ్చపాదు, లో. గురునకు పుచ్చపాదు. (నేర్చినవిద్య మఱచి యెదురుతిరుగుట.)

ఒజ్జసాని, వై. వి. = ఉపాధ్యాయిని. హరిశ్చ. 2, ఛా: చూ, సోమిదమ్మ. (చూ, భార్య. 1-౮.)

ఒడ్డుబ్రాహ్మణులు, అం. పంచగౌడులలో నొకతెగయగు మైథిలులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ, శాక్తేయులు, కాళీదేవత నుపాసించెదరు: చూ, బ్రాహ్మణులు.

ఒట్టు, దే. వి. 1. బాస: చూ, శపథము; అ. క్రి. 2: జనించు. చూ, సంభవించు; స. క్రి. 3. కీలించు, ఉంచు. భార. శల్య. 2, ఆ. 133: చూ, హావణించు. 4; 2. రంగులఁజేయు. నిర్వ. 4, ఆ. 54; భాగ. 3, స్కం. 998: చూ, రవులుచు.

ఒడంబడిక, వా. వి. ఒప్పుదల పత్రము.

ఒడఁగూడు, దే. అ. క్రి. 1. ఒనఁగూడు: చూ, సిద్ధించు; 2. అంటసిలు, చేరు. భార. ఆది. 5, ఆ. 66: చూ, సమీపించు. (పేర్. ఒడఁగూర్చు.)

ఒడఁబడిక, ద్వ. వి. 1. ఒడఁబాటు. కవిక. 3, ఆ. 224: చూ, సమ్మతము; 2. సమ్మతించి వ్రాసియిచ్చినవ్రాత: చూ, రాజీ.

ఒడఁబడు, ద్వ. అ. క్రి. 1. అంగీకరించు: చూ, సమ్మతించు: 2. అనుకూలించు. భార. సభా. 1, ఆ. 32; చూ, సరిపడు. 1; 3. సంతోసించు. చూ, సంతోషించు. (ప్రే. ఒడఁబఱచు.)

ఒడఁబాటు, ద్వ. వి. 1. ఒడఁబడిక: చూ, సమ్మతము; విణ. 2. అంగీకారము. (ఒడఁబాటు = ఒడఁబడ్డ ప్రవర్తనము.) చూ, సమ్మతము.

ఒడగోలుకొను, దే. స. క్రి. రూ-అడగోలుకొను. అపహరించు భో. 3, ఆ. 124: చూ, ముచ్చిలించు.

ఒడపప్పు, దే. వి. 1. నానఁబెట్టిన పెసరపప్పు లోనగునది చూ, రూ-వడపప్పు;

ఒడపి, దే. వి. గంటి, సందు, చిల్లి. ఆము. 4, ఆ. 23: చూ, రంధ్రము. 1.

ఒడమి, దే. వి. 1. రూ-ఒడమె. తొడవు: చూ, భూషణము. 2; 2. రూ-ఒడమె. ధనము. ఉ. హరి. 6, ఆ. 28: చూ, హిరణ్యము.

ఒడమె. —పై.—

ఒడయఁడు, దే. వి. 1. రూ- ఒడయుఁడు. మగఁడు: చూ, భర్త; విణ. 2. రూ-ఒడియుఁడు. ఏలువు: చూ, స్వామి. 1.

ఒడయుఁడు. —పై.— (భర్త— జై. 5, ఆ. 117.)

ఒడయురాలు, దే. విణ. (ఒడయుఁడు + ఆలు) ప్రభ్వీణి: చూ, స్వామిని.

ఒడలిచూపొడయఁడు, ద్వ. వి. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు. (రూ-ఒడలు చూపొడయఁడు.)

ఒడలు, దే. వి. 1. రూ-ఒప్పు, మే-మేను. లక్ష్మీ. 2, ఆ. 3: చూ, శరీరము: వా. 2. ఒకానొక భక్ష్యము; (ఒడ, నడుమ బెజ్జములేని గారెవంటి తినుబండము.)

ఒడలుగాలి, వా. వి. వ్యానము, శరీరమందుండుగాలి: చూ, వాయువు.

ఒడలుచూపొడయఁడు, ద్వ. వి: చూ, రూ-ఒడలిచూపొడయఁడు.

ఒడలుదాఁచుకొనుట, జా. పనిచేయకుండుట. "నేఁజేతఁబని పట్టితేఁజూచి ముందుగాఁ దానందుకొను నొడల్దాఁచుకొనదు." (వైజయంతీ విలాసము.)

ఒడలెల్లఁగన్నులు, జా. ఎక్కువవిమర్శ "సహస్రపత్త్రసూనుని నొడలెల్లఁ గన్నులుగఁజూచిరి మానసముల్గరంగఁగఁ." (విజయ విలాసము.)

ఒడి, దే. వి. 1. గుడ్డదొప్ప. వస్త్రపుటి. చూ, వస్త్రము; 1-౪౫ 2. ఉత్సంగము, తొడపైభాగము: చూ, క్రోడము; 3. పశుయోని, కతి: చూ, భగము. 12; 4. లక్ష్యముపెట్టి దాఁటిన దాఁటు, ఉంకింపు. చూ, విజృంభణము.

ఒడిఁబ్రాలు, దే. వి. ఒడికట్టుబియ్యము, ఒడికట్టు.

ఒడికట్టు, దే. వి. 1. పాపలగనుతావు: చూ, భగము. 12; 2 కాంచీభూష, ఒంటిపేటగల ఆఁడుదాని మొలనూలు, ఒడ్డాణము: చూ, భూషణము. 2; 3. వస్త్రపుటి, గుడ్డదొప్ప: చూ, వస్త్రము; 4. ఒడికట్టుబియ్యము: చూ, ఒడిఁబ్రాలు; అ. క్రి. 5. కడఁగు. సారం. 3, ఆ. 49: చూ, యత్నించు.

ఒడికట్టుట, జా. సిద్ధపడుట. "లోకనింద కొడిగట్టితిగా." (సారంగధర చరిత్రము.)

ఒడికము, దే. వి. 1. ఉపాయము. అనుపు. పంచ. నా. 1, ఆ. 101. చూ, పెరవు; విణ. 2. మనోజ్ఞము, ఒప్పిదమైనది. భార. ఆర. 5, ఆ 11: చూ, రమ్యము; 3. యుక్తము, ఇమ్ము. ఉ. రా. 5, ఆ. 134; చూ, యోగ్యము. 2.

ఒడికారము, దే. వి. ఉద్రేకము. య. 4, ఆ. 26: చూ, విజృంభణము.

ఒడిత్రాడు, దే. వి. వేటాడుటకుపయోగించిన యొకానొక సాధనము. ఉచ్చు: చూ. వాగుర. (చూ, తీపుద్రాడు. కాళ. 3. ఆ.)

ఒడిదామర, ద్వ. వి. (ఒడి + తామర.) 1. ఒకరకపుచెట్టు: చూ, వృక్షము.

ఒడిదారము. దే. వి. స్త్రీలమొలనూలు. చూ, భూషణము: 2.-౬-(౧).

ఒడిపిలి, దే. వి. ఆహారవిశేషము. (అప్ర.); చూ, సాదము. 1.

ఒడియు, దే. స. క్రి. 1. ఆకర్షించు, తిగియు. పాంచు. 2. ఆ. 17; చూ, రెమ్ము. 2; అ. క్రి. 2. కొంచెము పైకెగురు. భార. విరా. 2, ఆ, 128; జై. 3, ఆ. 113: చూ, లంఘించు.

ఒడిస, దే. వి. ఆవిషము; చూ, పైపనిక.

ఒడిసియ, దే. వి. 1. —పై.— (రూ-ఒడిసె) 2. ఒడిసెగట్ట. (రూ-ఒడిసె.)

ఒడిసె, —పై.—

ఒడిసెల. ద్వ. వి. రాళ్ళువిసరివేయుటకై యేర్పడిన యొక విధమగుత్రాడు. సారం. 1, ఆ. 93: క్షేపణిః 3. చూ, సూత్రము. 1-౬౬-(౧).

ఒడిసెలకాఁడు. ద్వ. వి. ఒడిసెలవేయువాఁడు.

ఒడుగు. వా. వి. వడుగు, ఉపనయనము.

ఒడుచు, దే. క్రి. ఓడించు: భార. ఆది. 7, ఆ. 63; భార. ఆది. 8, ఆ. 16; భార. ఆది. 3, ఆ. 206: చూ, జయించు.

ఒడుదొడుకు, దే. వి. 1. వైషమ్యము. సమముకామి. రసి. 2, ఆ. 98: చూ, వైషమ్యము విణ. 2. ఇక్కట్టు, సంకటము: చూ, శోకము. 2; విణ. 3. సమముకానిది: చూ, విషమము.

ఒడుపరితనము, దే. వి. చూ, టుంటరితనము.

ఒడుపు, దే. వి. 1. లక్ష్యముపెట్టి దాఁటినదాఁటు. హరిశ్చ. 1. ఆ. 465: చూ, విజృంభణము; 2. పూనిక. భో. 4. ఆ. 268: చూ, సన్నాహము; 3. అధికము, లాభము: చూ, హేరాళము; 4. సమయనిరీక్షణము.

ఒడ్డగ, దే. వి. రెండిట్టి కొమ్ములుకలచేసి యేర్పఱచిన ఆయుధము: చూ, బాణము. 1. ౧౫-(౧).

ఒడ్డగిలు, దే. అ. క్రి. 1. రూ-ఒడ్డగిల్లు. అవనతమగు: చూ, వ్రాలు. 6; 2. రూ-ఒడ్డగిల్లు. అతిశయించు; చూ, సందడించు, 3. రూ- ఒడ్డగిల్లు. నీటిపొట్టు లోనగునవి లోపలనుండి పైకుబుకు, ఉప్పొంగు: చూ, బుగులుకొను. 4.

ఒడ్డగిల్లు. —పై.— (అవనతమగు — రామా. 7. ఆ. 56; అతిశయించు.- రామా. 8, ఆ. 54: చూ, సందడించు; ఉప్పొంగు.— భాగ. 1, స్కం. 260.

ఒడ్డగెడవు, దే. వి. ఒకప్రక్క క్రిందికొఱగి మఱియొకప్రక్క పైకిలేచుట: భార. భీష్మ. 2, ఆ. 165; పర. 1, ఆ. 53: వాలుపడుట,

ఒడ్డణము, దే. వి. 1. రూ- ఒడ్డాణము. ఒడ్డియాణము. కాంచీభూష: చూ, భూషణము. 2-౬-(౧); 2. రూ-ఒడ్డనము, మోహరము: చూ, వ్యూహము.

ఒడ్డన, --1-2-పై.—వా. 3. ఒడ్డించుట, విస్తరియందు అన్నాదులుంచుట, చూ, రూ - వడ్డన.

ఒడ్డనము, పై. వి. 1 = అడ్డనమ్, అడ్డాణము, డాలు, అంతనము, హరి. ఉ. 7, ఆ. 228: చూ, హరిగ; 2. = అడ్డనమ్. అడ్డాణము, బెత్తము లోనగువానిచే చేయఁబడిన కేడెము. ఉ. హరి. 6, ఆ. 59: చూ, హరిగ, 3. మొగ్గరము. భార. భీష్మ. 2, ఆ. 26: చూ, వ్యూహము; 4. పందెము. భాగ. 6, స్కం. 416: చూ, వ్యవహారము. 4.

ఒడ్డము, దే. వి. మొగ్గరము: చూ, వ్యూహము.

ఒడ్డాణము, పై. వి. 1. = ఓడ్యాణ; చూ, రూ - ఒడ్డణము. కళా. 7, ఆ. 66: 2. యోగులు జందెమువలె వేసికొనెడి పట్టు లోనగువానిరో నేసిన పట్టె. స్వా. 1, ఆ. 59: చూ, యోగపట్టె; వా. 3. పేరుయొక్క అడ్డుచీరికలోని యొకభాగము..

ఒడ్డాది, పై. వి. 1. = ఓఢ్రి, ఓఢ్రదేశము: చూ, దేశములు. ౧౨. 2. విశాఖపట్టణ మండలములోని ఒకానొక గ్రామము.

ఒడ్డారము. దే. వి. 1. ఒఱగొడ్డెము: చూ, వంకరమాట; 2. పగ. చూ, విరోధము. 1: 3. ప్రతిఘటనము. రామా. 6, ఆ. 42: మాఱొడ్డు. 1.

ఒడ్డారించు, దే. అ. క్రి. 1. పగఁగొను చూ, విరోధించు: 2. ప్రతిఘటించు. చూ, మాఱొడ్డు. 2.

ఒడ్డి, దే. వి. 1. ఉడ్డీనగతిగల పావురాయి: చూ, పురఁటీ. 1-౪; 2. పావురము: చూ, పురఁటీ. 1.

ఒడ్డిక, — పై.—

ఒడ్డిమంగలి, వా. వి. అంగమర్దుఁడు: చూ, సేవకుఁడు. 1-౧౩. (ఓఢ్రదేశపుమంగలి.)

ఒడ్డిమి, దే. వి. పందెము. భార. ఉద్యో. 1, ఆ. 22: చూ, వ్యవహారము. 4.

ఒడ్డియ, పై. వి. = ఓఢ్రిః రూ-ఒడ్డె, ఒడ్డెవాఁడు. (సం.వ.):— ఓఢ్రుఁడు.

ఒడ్డియాణము, చూ, రూ-ఒడ్డాణము. 1-(సూ.ని).

ఒడ్డీడు, పై. వి. 1.= ఓఢ్రః. ఓఢ్రదేశపురాజు: చూ, రాజు. ౨-30; 2. ఉడ్డీనగతిగల పావురాయి. జై. 1, ఆ. 45; సారం. 1, ఆ. 117: చూ, ఒడ్డి. 1; 2: చూ, ఒడ్డి. 2.

ఒడ్డు, దే. వి. 1. ఓర, దరి: చూ, రోధస్సు; 2. మొగ్గరము. భార. భీష్మ. 2, ఆ. 30: చూ, వ్యూహము; 3. పందెము. భార. ఉద్యో. 2, ఆ. 68: చూ, వ్యవహారము. 4; 4. పూనిక. స్వా. 3, ఆ. 136: చూ, సన్నాహము; 5. అడ్డిపాటు. భాగ. 10 స్కం. పూ. 140: చూ, నిరోధము. 1; పై. స. 6. = ఏకః. అన్యుఁడు, భార. ఉద్యో. 1, ఆ. 278: చూ, వేఱయినవాఁడు; 7. ఏ. = ఏకః. ఏకకుఁడు. చూ, ఒకఁడు. 3; దే. విణ. 8. లావు. "వాఁడొడ్డుపొడుగుగాఁ బెరిగినాఁడు." చూ, స్థూలము. 2; 9. విశాలము, ఇమ్ము. ఫీ. 1, ఆ. 110, చూ, విస్తారము; 10. ఎక్కువ. స్వా. 3, ఆ. 122; 11. విప్పుల వెడిదైనది, పెద్దదైనది. "ఒడ్డోలగము.": చూ, విపులము;

- జై. 3, ఆ. 17: చూ, సరిపడు. 1; 3. యుక్తమగు, అనువుపడు. లక్ష్మీ. 4, ఆ. 162: చూ, సరిపడు. 2. (రూ - ఒదగు అని పురుషోత్తమకవీయము.)

ఒదవుబడి, ద్వ. వి. 1. రూ-ఒదువుబడి. నింపు : చూ, సమృద్ధి; విణ. 2. ఒదవుబడియైనది, ఉపయోగమైనది, పెరిగినది: చూ, వృద్ధము. 4.

ఒదిఁగిలు, దే. అ. క్రి. ఒత్తిగిలు, ప్రక్కకొఱగు. ఉ. హరి. 5, ఆ. 204: చూ, జరగు.

ఒదిగిళ్లు, వా. వి. బ. ఒదిగిలుటలు. విధేయతలు.

ఒదివిరిప్రాలు. దే. వి. బ. ఒకరకము వడ్లు. హరి. పూ. 6, ఆ. 22 : చూ, ధాన్యము.

ఒదుఁగఁబాఱు. దే. అ. క్రి. (ఒదుఁగఁగ + పాఱు.) ఒదుఁగు, తొలఁగు. భార. అను. 3, ఆ. 261: చూ, విరియు. 5.

ఒదుఁగు,—పై.— లక్ష్మీ. 3. ఆ. 36.

ఒదుఁగువడు, —పై.—జై. 5, ఆ. 58.

ఒదుఁగువాటు, ద్వ. వి. అపసరణము, తొలఁగుట: చూ, విమోచనము.

ఒదుగు, దే. వి. 1. రూ-ఒదువు, నింపు : చూ, సమృద్ధి; విణ. 2. రూ-ఒదువు, ఒదువుబడియైనది. ఆము. 4, ఆ. 195 : చూ, సమృద్ధము; అ. క్రి. 3. రూ-ఒదువు, ఉపయోగించు : చూ, సమృద్ధమగు.

ఒదుగుబడి, దే. వి. రూ-ఒదువుబడి, తామరతంపము, నింపు : చూ, సమృద్ధి.

ఒదువు, దే. వి. 1.—పై.—; విణ. 2. రూ-ఒదుగు, ఒదవుబడియైనది : చూ, సమృద్ధము; అ. క్రి. 3. రూ-ఒదుగు, ఉపయోగించు: చూ, సమృద్ధమగు; 4. రూ-పొదువు, క్రమ్ము. మార్క. 6, ఆ. 90 : చూ, వ్యాపించు.

ఒదువుబడి, దే. వి: చూ, రూ-ఒదుగుబడి.

ఒద్ద, దే. వి. దాఁపు. భార. ఆది. 3, ఆ. 165. భార. ఉద్యో. 3, ఆ. 146 : చూ, సమీపము.

ఒద్ది,. దే. వి. అజశృంగి * : చూ, రూ-వద్ది.

ఒద్దిక, దే. వి. 1. రూ-ఒందిక, చెలిమి : చూ, స్నేహము. 1; 2. ఒకవస్తువును సరియెత్తుగా నుంచి తూఁచెకు డాయి లోనగునది. విజ్ఞా. వ్య. కాం. 117: చూ, ప్రతిమానము.

ఒద్దియ, దే. వి. ఒదుగు, నింపు, తామరతంపము: చూ, సమృద్ధి (రూ-ఒద్దె.)

ఒద్దె, దే. వి. 1. —పై.—; వా. 2. రూ-ఒద్దే. చాల, ఎక్కువ.

ఒద్దు, వా. అక్కఱలేదు. (వద్దు ఒద్దు అయినది)

ఒద్దే, వా. అవ్య. 1. చాల, ఎక్కువ, "ఒద్దేకూడు వడ్డించిరి." "ఒద్దేసేపు మాటలాడిరి"; 2. అక్కఱలేదనుటను దెలిపెడి. (ఒద్దు = వద్దునకు ప్రతిరూపము.) (అన్నము మితిమీఱి వడ్డించినచో ఒద్దు ఒద్దు చాలు చాలు అనియు, స్త్రీ సంబోధనమున ఒద్దే ఒద్దే (పెట్టకుము) అనియు గోదావరి కృష్ణామండలముల యందును కొన్ని యితరచోట్లను వాడెదరు. ఇది ప్రయోగానర్హము)

ఒనగూడు, దే. అ. క్రి. రూ-ఒడగూడు: చూ, సిద్ధించు. (పేరి-ఒనగూర్చు.)

ఒనబెట్టు, ద్వ. వి. రూ-ఒనవెట్టు, గూఢనివసతి: చూ, పొంచిక.

ఒనరించు, దే. ప్రే. ఒనర్చు. చేయు, నిర్వహించు: చూ, సలుపు.

ఒనరిక, దే. వి. పొందిక, మైత్రి : చూ, స్నేహము. 1.

ఒనరు, దే. వి. 1 మైత్రి: చూ, స్నేహము. 1; 2. ఇంపు. రాఘ. 3, ఆ. 95: చూ, యథేచ్ఛము; విణ. 3. మంజులము, సింగారము: చూ, రమ్యము; 4. ఒయారము: చూ, సౌందర్యము; అ. క్రి. 5. అంగీకరించు. భార. సభా. 2. ఆ. 81: చూ, సమ్మతించు; 6. జనించు, కలుగు. నిర్వ 7, ఆ. 123: చూ, సంభవించు; 7. యుక్తమగు, పొసఁగు. కళా. 4, ఆ: చూ. సరిపడు.

ఒనరుచు, దే. ప్రే: చూ, రూ. ఒనరించు.

ఒనరుపడు, ద్వ. అ. క్రి. అనుకూలించు: చూ, సరిపడు. 1.

ఒనరుపెట్టుకొను, —పై.—.

ఒనవెట్టు, ద్వ. వి. చూ, రూ-ఒనబెట్టు.

ఒనవెట్టుకొను, దే. అ. క్రి. (ఒనవు + పెట్టుకొను.) ఇఱుముకొను, తిరోహితమగు. కాశీ. 4, ఆ. 133: చూ, మఱుఁగుపడు.

ఒప్పంచము, వై. వి. = అర్పణ. ఒప్పదల.

ఒప్పఁజెప్పు, వై. స. క్రి: చూ, ఒప్పగించు.

ఒప్పగించు, వై. స. క్రి. పదిలముగా కాపాడుమని యొప్పగించు: అప్పగించు, ఒప్పఁజెప్పు, ఒప్పించు; (సం. ప): — అర్పించు.

ఒప్పగింత, వై. వి. = అర్పణ. పదిలముగా కాపాడుమని యొప్పగించుట: అప్పగింత, అప్పనము, ఇల్లడ - రూ - ఇల్లడము, ఒప్పన - రూ - ఒప్పనము; (సం. ప).—అర్పణము.

ఒప్పన, వై. వి. 1 = అర్పణమ్.—పై.— ; 2. అప్పన, కప్పము పన్ను: చూ, సిస్తు. 1.

ఒప్పనము, వై. వి. = —పై.—(ఒప్పగింత.—కళా.3, ఆ.149.

ఒప్పనసేయు, వై. స. క్రి. రూ-అప్పనసేయు : చూ, వశపఱచు.

ఒప్పమి, దే. వి. 1. అశుభము, కీడు. భార. విరా. 1, ఆ. 288 : చూ, హాని. 2; 2. అపరాధము. తప్పు. కళా. 4, ఆ. 106 : చూ, సొంటు, 3. అనంగీకారము. (ఒప్పుకొనమి.) : చూ, అసమ్మతి.

ఒప్పరము, దే. వి. జలదారి. ఆం, భా. ప్ర. వారి. 154 : చూ. తూము. 2.

ఒప్పరికము, వై. వి. = ఉపేక్ష. అపద్ధ; చూ, మందెమేలము. 2.

ఒప్పరికించు, వై. స. క్రి. ఉపేక్షించు. భార. ఉద్యో. 2, ఆ. 10; నిర్వ. 6, ఆ. 127; విక్ర. 5, ఆ. 152; భార. భీష్మ. 2. ఆ. 280: చూ. కన్నడించు

ఒప్పరికించువాఁడు, ద్వ. వి. ఉపేక్షకుఁడు: చూ, కన్నడీఁడు.

ఒప్పరికింపఁబడినవాఁడు, ద్వ. వి. ఉపేక్షింపఁబడినవాఁడు: చూ, ఉపేక్షితుఁడు.

ఒప్పాచారము, దే. వి. ముచ్చిలక, సమ్మతించి వ్రాసియిచ్చిన వ్రాఁత : చూ, రాజీ.

ఒప్పారు, దే. అ. క్రి. (ఒప్పు + ఆరు.) అంగీకరించు, ఒప్పు. భార. అర. 4, ఆ. 313: చూ, సమ్మతించు.

ఒప్పించు, వై. స. క్రి. అర్పించు: చూ, ఒప్పగించు.

ఒప్పికోలు, దే. వి. రూ-ఒప్పుకోలు: చూ, సమ్మతము. 1.

ఒప్పిదము, దే. వి. 1. (ఒప్పు + ఇదము.) ఒప్పు, అందము. చూ, విధము. 1; 3. రొదవు; చూ, భూషణము. 2; విశ. 4. మనోజ్ఞము, సింగారము. భార. విరా. 1; ఆ. 228: చూ, రమ్యము. 3.

ఒప్పిదుఁడు, దే. విశ. అలంకృతుఁడు: చూ, భూషితుఁడు.

ఒప్పు, దే. వి. 1. కాంతి. ఆం, భా. ప్ర. కాం. 80. చూ, వెలుతురు. 1: 2. విన్నాణము: చూ, సామర్థ్యము. 1: 3. ఒడఁబడిక. అని. 1, ఆ. 10: చూ, సమ్మతి; 4. సొగసు. అందము. భార. ఆర. 6, ఆ: చూ, సౌందర్యము: 5. తప్పు కామి, నిజము. ఉ. హరి. 4, ఆ. 130: చూ, సత్యము. 1; విశ. 6. మంజులము: చూ, రమ్యము. 3; అ. క్రి. 7. ఒప్పిద మగు: చూ, రాజించు; 8. యుక్తమగు; చూ, సరిపడు. 2; 9. అంగీకరించు: చూ, సమ్మతించు.

ఒప్పుకొనిమరలఁబడుట, అం. చూ, వివాదములు.

ఒప్పుకొను, దే. స. క్రి. 1. అంగీకరించు: చూ, సమ్మతించు: పా. 2. ఆమోదించు. స్థిరపఱచు.

ఒప్పుకోలు, దే. వి: చూ, రూ-ఒప్పికోలు.

ఒప్పుదలపత్త్రము, ఋణలేఖ్యము; చూ, సమ్మతిపత్త్రము.

ఒప్పులకుప్ప, వా. వి. 1. నేర్పులరాశియగు స్త్రీ పలుకుబడులు; అం. 2. బాలికాక్రీడావిశేషము: చూ, బాలికాక్రీడ. "ఒప్పులకుప్ప ఒయ్యారిభామ. సన్నబియ్యం, చాయపప్పు, కొబ్బరికుడక, బెల్లపచ్చు".

ఒప్పులాఁడి, దే. వి. (ఒప్పులు + ఆఁడి.) 1. అఁడుది: చూ, స్త్రీ; 1. 2. చక్కఁదనము గల ఆఁడుది: చూ, స్త్రీ. 1-౬; (చూ, సౌందర్యవతి, 2.); (చూ, స్త్రీ. 1-౨౫.)

ఒప్పులు, దే. వి. బ. 1. క్రముకః: చూ, పోఁక; 2. మంచివిషయములు. (వ్య-తప్పులు.)

ఒబ్బట్లు, దే. వి. బ. (ఒమ్మ + అట్లు.) పోళీ, రూ-బొబ్బట్లు, భక్ష్యవిశేషము. కళా. 7, ఆ. 81: చూ, భక్ష్యము. 1-౩౨.

ఒబ్బిడి, దే. వి. 1. పంటనుఱిపిడి, కైలు: చూ, నూర్పు; 2. చేటు; నాశనము. చూ, పతన; 3. (పని) శుభ్రము; 4. (కార్యము) చక్కఁదనము; 5. (సొమ్ము) కూడఁబెట్టుట; 6. (వ్యాపారము) లాభకరముగఁ జేయుట; 7. (పంట) వడ్లు లోనగునవి ప్రోగుచేయుట; ఇత్యాదులూహ్యంబులు.

ఒమ్మచ్చు, ద్వ. వి. (ఒమ్ము + అచ్చు.) మణులను పొదుగుటకు బంగారుతోఁజేసెడు పీఠస్థానము.

ఒమ్మమి, దే. వి. వైరము, పగ: చూ, విరోధము. 1.

ఒమ్మిక, దే. వి. పొందిక, ఇమిడిక. రా. ఆ. కాం: చూ, స్నేహము. 1.

ఒమ్మివచ్చు, దే. అ. క్రి. అచ్చివచ్చు, శుభాగతమగు: చూ, మేలైవచ్చు.

ఒమ్ము, దే. వి. 1. బలుపు, స్థౌల్యము: చూ, శక్తి. 1; విశ. 2. పెద్ద, క్రొవ్విననది: చూ, స్థూలము. 2; అ. క్రి. 3. ఒప్పు, అనుకూలపడు. చూ, సరిపడు. 2; స. క్రి. 4. క్రిమ్మ్మ, చుట్టుకొను: చూ, వేష్టించు.

ఒయారము, దే. వి. 1. రూ-ఒయ్యారము. గర్వము: చూ, అహంకారము. 2. రూ-ఒయ్యారము. యౌవనా పలవలన గలుగు గర్వచేష్ట. య. 5, ఆ. 30: చూ, విలాసము; 3. రూ-ఒయ్యారము, అందము: చూ, సౌందర్యము.

ఒయారి, దే. వి. 1. రూ-ఒయ్యారి. విలాసముగల స్త్రీ: చూ, స్త్రీ; 1-౨౨౦; 2. ఒయ్యారి. సౌందర్యముగల స్త్రీ: చూ, స్త్రీ; 1-౬. (చూ, సౌందర్యవతి): విశ. 3. సౌందర్యముగలది. రామా. 1, ఆ 205: రూ-ఒయ్యారి-ఒయారి.

ఒయారి-త్తె, చూ, రూ-ఒయారి.

ఒయారికాఁడు, ద్వ. విశ. రూ-ఒయ్యారికాఁడు. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

ఒయ్య, దే. క్రి. విశ. 1. తిన్నగా. భార. ఆది. 1. ఆ. 130. చూ, మెల్ల. 3; 2. మెల్లఁగా. భార. ఉద్యో. 3, ఆ. 100; రామా. 6, ఆ. 231. (ఆమ్రేడితమందు ఒయ్యొయ్య.)

ఒయ్యన, దే. వి. 1. రూ-ఒయన. తిన్నన. చూ, మెల్లన; 2. రూ-ఒయన. నెమ్మదిగ: చూ, మెల్లన.

ఒయ్యారము, చూ, రూ-ఒయారము. (అందమునకు.— భార. విరా. 1, ఆ. 107.)

ఒయ్యారి, చూ, రూ-ఒయారి.

ఒయ్యారికత్తె, చూ, రూ-ఒయారికత్తె.

ఒయ్యారికాఁడు, రూ-ఒయారికాఁడు.

ఒర, దే. వి. 1. సామ్యము, పోలిక. భార. భీష్మ. 2, ఆ. 381, పి. శకుం. 1, ఆ, 25: చూ, సమానము; 2. ఘర్షణము; రాధ. నై. 8, ఆ. 159: చూ, సమ్మర్దము.

ఒరగట్టు, దే. వి. (ఒర + కట్టు.) చుట్టగాఁజుట్టి కట్టిన వస్త్రపు కట్టు. సిలా. 3, ఆ. 49: చూ, వస్త్రము. 1-౫౦.

ఒరగడుగు, ద్వ. వి. (ఒర + కడుగు.) రెండవసారి బియ్యము కడిగిన నీరు: చూ, శుక్తము. 1.

ఒరగఁబడు, దే. అ. క్రి. రూ-ఒఱగఁబడు. అవనతమగు: చూ. వ్రాలు. 3.

ఒరగఁబెట్టుకొని తినకుండఁగఁజేసినాఁడురా కంచరనాయలు. లో. ఉన్నబెజ్జమును మాటలేక ఒరగఁబెట్టి తినకుండఁగఁజేసిన కంచరవాఁడు. (వాడుక.)

ఒరగల్లు, దే. వి. (ఒర + కల్లు. బంగారు లోనగువాని నొరపెట్టెడు ఱాయి. నికషము; చూ, రత్నములు. 1-౧౨ (౪౧.)

ఒరగాలు, దే. వి. (ఒరగు + కాలు.) 1 ఒరగినకాలు. ఒఱగాలు; 2. మఱియొకకాలిమీఁద నొరగఁబెట్టినకాలు. ఒఱగాలు.

ఒరగు, దే. వి. 1. తలగడ; ఒఱగుదిండు: చూ, లోడు; 2. వంపు: చూ, వంకర; విశ. 3. వంపయినది: చూ, వంకర; అ. క్రి. 4. రూ-ఒఱగు. వంగు, అవనతమగు: చూ, వ్రాలు. 3; 5. రూ-ఒఱగు. వ్రాలు. చూ, వ్రాలు. 3. 4-5 అర్థములు స్వల్పభేదము.); 6. ప్రక్కకొఱగు: చూ. జరగు.

ఒరగుట, దే. వి. ఒరగుట: ఓరపాటు.

ఒరగుదిల్లు, దే. వి. రూ-ఒఱగుదిల్లు, తలగడ: చూ, లోడు.

ఒరగువోవు, దే. అ. క్రి. రూ-ఒఱగువోవు. అవనతమగు: చూ, వ్రాలు. 3.

ఒరగొడ్డియము, ద్వ. వి. వక్రోక్తి: చూ, వంకరమాట. (రూ-ఒరగొడ్డెము - ఒఱగొడ్డియము - ఒఱగొడ్డెము.)

ఒరగొడ్డెము, ద్వా. వి. —పై.—.
ఒరగొను, దే. స. క్రి. (ఒర + కొను) బంగారు లోనగువానిని ఒరయు, తోము, రాచు, అఱుగఁజేయు: చూ, రుద్దు. 1.
ఒరచాలుదుక్కి, ద్వా. వి. రూ-ఒఱచాలుదుక్కి, చాల తేలికగాఁ బాఁటిన దుక్కి: చూ, వ్యవసాయము.
ఒరచుబద్ద, ద్వా. వి. పలుకులు లోనగునవి నునుపుపఱచెడు వడ్ల వానికొఱముట్టు. (అప్ర.)
ఒరపదను, దే. వి. కొంచెముతడి: చూ, తేమము 1-౧.
ఒరపిడి, దే. వి. ఘర్షణము, రూ-ఒఱపిడి, రాయిడి. భార. శాంతి. 2, ఆ. 356: చూ, సమ్మర్దము.
ఒరపెట్టు, దే. స. క్రి. బంగారులోనగువానిని ఒరయు: చూ, ఒరగొను.
ఒరయిక, దే. వి. అదుముడు: చూ, ఒరపిడి.
ఒరయు, దే. అ. క్రి. 1. ఒరపెట్టు: చూ, రుద్దు. 1; 2. పరీక్షించు, సోధించు. కళా. 2. ఆ. 157: చూ, శోధించు; 3. ఆరయు, వివరించు. పంచ. నా. 1, ఆ. 32: చూ, విచారించు. 1; 4. అన్వేషించు. రామా. 5, ల. 177: చూ, వెతకు; 5. (కాళ్ళ వ్రేళ్ల.) ఒరయు. వాననీటిచే కాళ్ళవ్రేళ్ళు ఒరసినవి." (ఒరపులు అనియు వాడెదరు.)
ఒరలుట, దే. వి. విడుపు: చూ, విమోచనము.
ఒరవడి, దే. వి. ఒజ్జబంతి: చూ, మేలుబంతి.
ఒరవు, దే. వి: చూ, విధము. 1. (సూ. ని.)
ఒరసికొనిపోవు, దే. అ. క్రి. చూ, దోఁగిపోవు.
ఒరసు, దే. వి. పోలిక: ఉపమావాచకము (సూ. ని.)
ఒరిగ, దే. వి. మొక్క. "ఒరిగ బ్రహ్మాండ భాండోదరనకవ" రుక్మాం. 1, ఆ. 123: చూ, హజిగలు. 1-౫.
ఒరిజ, దే. వి. రూ-ఒరిజె. ఏనుఁగు మెడగొలుసు. చంద్రా. 1, ఆ. 32: చూ, శృంఖలము. 2.
ఒరిజె, —పై.—
ఒరిమ, వై. వి. 1. రూ- ఒరిమి. మైత్రి. య. 1, ఆ. 51: చూ, స్నేహము. 1; 2. ఐకమత్యము. ఐకకంఠ్యము, పొత్తు. కాశీ. 3, ఆ. 138: చూ, స్నేహము. 1.
ఒరిమి, దే. వి. —పై.— (రూ-ఒరిమిక.)
ఒరిమిక, —పై.—
ఒరిస్సా, దే. వి. 1. ఓఢ్రదేశము ఒడిశా: చూ, దేశములు.1-౧-౨.
ఒరుఁడు, వై. స. 1. = ఏకః. రూ-ఒకరుఁడు, అన్యుఁడు: చూ, ఒండొరుఁడు; 2. = ఏకః. ఏకరుఁడు, ఒక్కడు: చూ, ఒకడు.3.
ఒరుగు, వా. వి. చూ, రూ-వరుగు. 1.
ఒరుదల, దే. వి. (ఒరు + తల.) కొండెకానితనము: చూ, పైశున్యము.
ఒరుదలకాఁడు, దే. విణ. కొండెకాఁడు, పిశునుఁడు. చూ, సూచకుఁడు. 1.
ఒరుము, దే. అ. క్రి. కలయు. ఆము. 4, ఆ. 171; చూ, మేళగించు. 1.
ఒరువుఁడు, వై. స. ఏకః: చూ, రూ- ఒరుఁడు.
ఒఱ, దే. వి. 1. గవుసెన; చూ, నిచోళము; 2. కత్తియొఱ. జై. 6, ఆ. 138; చూ, ప్రత్యాకారము; 3. నూతియొఱ; చూ, బావియొఱ.
ఒఱకటము, ద్వా. వి. 1. రూ-ఒరగడ్డము, సంకటము. చూ, శోకము. 2; విణ. 2. రూ- ఒరగడ్డము. ఎగుడుదిగుడు: చూ, విషమము. (రూ-ఒఱగడము.)
ఒఱకము, దే. వి. 1. గర్తము, పల్లము. చూ, రంధ్రము. 1; 2. సంకటము. కాశీ. 7, ఆ. 166; కాశీ. 2, ఆ. 45: చూ, శోకము. 2.
ఒఱకాటము, చూ, రూ-ఒఱకటము.
ఒఱగఁబడు, ద్వా. అ. క్రి. (ఒఱగన్ + పడు.) అవనతమగు: చూ, రూ-ఒరగఁబడు. (స్వార్థమునపడు.)
ఒఱగడము, చూ, ఒఱకటము.
ఒఱగడ్డము, —పై.—
ఒఱగల్లు, దే. వి. (ఒఱ + కల్లు.): చూ, రూ- ఒరగల్లు.
ఒఱగు, దే. వి: చూ, రూ- ఒరగు. వ్రాలు.—సిలువఁజాలక యొఱగిన. భార. ఉద్యో. 3, ఆ. 310.)
ఒఱగుబిల్ల, దే. వి. చూ, రూ- ఒరగుబిల్ల. (ఒఱగుబిళ్ల.)
ఒఱగుపోవు, దే. అ క్రి. (ఒఱగు + పోవు.): చూ, రూ-ఒరగుపోవు. హరిశ్చ. 4, ఆ. 168.
ఒఱగొడ్డియము, ద్వా. వి: చూ, రూ- ఒరగొడ్డియము.
ఒఱగొడ్డెము, ద్వా. వి. రూ—పై.—భాగ 1, స్కం 313.
ఒఱచాలుదుక్కి, ద్వా. వి: చూ, రూ- ఒఱచాలుదుక్కి.
ఒఱటు, దే. విణ. దుశ్శీలుఁడు, జాత్యాచారాదులచేత నిందితుఁడు, పాపాలముద్ద. హరి. పూ. 9, ఆ. 19: చూ, వ్యాధుఁడు. 2.
ఒఱపరి, దే. విణ. (ఒఱపు + అరి.) సొగసుకాఁడు. జై. 3, ఆ. 28: చూ, సౌందర్యవంతుఁడు.
ఒఱపిఁడి, దే. విణ. (ఒఱపు + ఇఁడి) 1. యోగ్యుఁడు కాని వాఁడు. విక్ర. 3, ఆ. 101: చూ, అయోగ్యుఁడు; 2. కుటిలుఁడు కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు 2.
ఒఱపిడి, దే. వి. ఘర్షణము, రూ-ఒరపిడి: చూ, సమ్మర్దము.
ఒఱపు, దే. వి. 1. ఆరాటము, తాపము. రసి. 2, ఆ. 105: చూ, సంతాపము; 2. మంజులము, సింగారము: చూ, రమ్యము. 3; 3. సొగసు: చూ, సౌందర్యము; 4. ఉపాయము, అనువు, ఎత్తుగడ. భార. కర్ణ. 1, ఆ. 314: చూ, వెరవు; 5. కోశబలమువలనఁ గలిగిన తేజము, ప్రతాపము, తేజు, రసి. 1, ఆ. 36: చూ, ప్రభావము. 1; 6. చేవ, ధైర్యము. చూ, స్థైర్యము. 1; 7. గౌరవము. ఉ హరి. 4, ఆ. 48: చూ, సన్మానము; 8. అర్హత: చూ, యోగ్యత; విణ. 9. చేవ, గట్టి దృఢము. చూ, స్థైర్యము. 1; 10. తగినది. ఉ. హరి. 4, ఆ. 48; నిర్వ. 2, ఆ. 80: చూ, యోగ్యము. 2; 11. వానలేమి. "కాలము ఒఱపుగానున్నది."
ఒఱపులాఁడి, దే. వి. (ఒఱపులు + ఆఁడి) చూ, సౌందర్యవతి. (చూ, స్త్రీ. 1-౬.)
ఒఱపెంకు, దే. వి. నూతియొఱ. చూ, బావియొఱ.
ఒఱయిక, దే. వి. చూ, రూ-ఒరయిక.
ఒఱలనూయి, ద్వా. వి. మట్టికాల్చి చేసిన గుండ్రని ఒఱజుదింపి కట్టిన నూయి. ఇప్పుడు (సిమెంటుతో ఒఱలు తయారగుచున్నవి.): చూ, సరస్సు. 1-15-(ఊ).

ఒఱలు, దే. అ. క్రి. 1. వాపోవు, శోలు. భార. ద్రోణ. 3, ఆ. 95: చూ, విలపించు: 2. మ్రోఁగు. పా. 5, ఆ. 31: చూ, శబ్దించు; ఐ. వి. 3 (నూతి) ఒఱలు.

ఒఱవ, దే. విణ. 1. వంపైనది. భార. ఆర. 2, ఆ. 135: చూ, వంకర: 2. తాఱుమాఱు. భార. విరా. 4, ఆ. 39: చూ, వ్యత్యయము; 3. వికారము నొందినది. చూ, వికృతము.

ఒఱవఁబడు, ద్వ. అ. క్రి. (ఒఱవన్ + పడు.) చూ, రూ- ఒఱగఁబడు. జై. 6, ఆ. 230.

ఒఱపు, దే. అ. క్రి.—పై.— (రూ-ఒఱపు, ఒరగు.)

ఒఱిగాలు, చూ, రూ- ఒరగాలు. 1,2.

ఒఱిబీజము, మి. వి. (ఒఱ్ఱు + బీజము.) ఒకప్రక్క వట్టవాఁచిన రోగము: చూ, వట్టవాఁపు (రూ-ఒఱుబీజము)

ఒఱియిక, దే. వి. రూ-ఒఱయిక: చూ, ఒరపిడి,

ఒఱుగు, దే. వి. రూ-ఒఱగు, తలగడ: చూ, [illegible].

ఒఱుగొమ్ము, ద్వ. వి. ఒకవైపున భారము హెచ్చినందుచేఁ గలిగిన తూకము. "కావడి ఒఱుగొమ్ము వచ్చినది."

ఒఱుబీజము, వా. మి. వి: చూ, రూ-ఒఱిబీజము.

ఒఱ్ఱు, దే. విణ. కటువు, కారమైనది. పాం. 4, ఆ. 184: చూ, కారము. 1.

ఒఱ్ఱుకనింద, ద్వ. వి. కప్పుర, పచోరము*: చూ, [illegible],

ఒఱ్ఱుఁదనము, దే. వి. కటువు, కారము: చూ, కారము. 1.

ఒఱ్ఱున, —పై.—

ఒఱ్ఱియ, దే. వి. 1. సుకత, సాధువుకానియావు, రూ-ఒట్టె: చూ, ధేనువు. 1-30; విణ. 2. రూ- ఒట్టె, వంపైనది: చూ, వంకర.

ఒఱ్ఱు, వా. వి. 1. లోపము, తక్కువ, న్యూనము. "నెపు నామాట వినకున్న నాకు ఒఱ్ఱులేదు." చూ, వెలితి. 2; దే. విణ. 2. కటువు, కారము. ఆం, భా. ప్ర. ఫీ. 104: చూ, కారము, 1; 3. గొప్పది, విరివియైనది: చూ, విశాలము.

ఒఱ్ఱె, చూ, రూ - ఒఱ్ఱియ.

ఒలపక్షము, మి. వి. ఒలిపక్షము.

ఒలయు, దే. అ. క్రి. 1. క్రమ్ము, చూ, వ్యాపించు. 2. చొచ్చు, నిర్వ. 8, ఆ. 57: చూ, సోఁకు. 4. 3. జనించు, కలుగు. భార. అను. 4, ఆ. 147; చూ, సంభవించు, 4. చేరు. భార. సభా. 2, ఆ. 131: చూ, సమీపించు; స. క్రి. 5. చుట్టుకొను. భార. ఆర. 2, ఆ. 8; చూ, వేష్టించు, 6. కదియు: పొందు; చూ, సక్రమగు. ఆము. 2, ఆ. 27.

ఒలవి, దే. వి. ఎత్తు; చూ, ఔన్నత్యము. (సూ. ని.)

ఒలి, దే. వి. ఒలుపు, దోఁపుడు, అపహరణము. జై. 1, ఆ. 63: చూ, హరణము. 1.

ఒలికి, దే. వి. సొదపేర్చెడుచోటు, ఆ: చూ, శ్మశానము.

ఒలికికాడు, ద్వ. వి. —పై.—

ఒలిదామర, ద్వ. వి. (ఒలి + తామర.) ఒకానొకచెట్టు, చూ, వృక్షము.

ఒలపక్షము, మి. వి. పక్షపాతము. (సూ. ని.)

ఒలిమె, దే. వి. చెలిమి, చూ, స్నేహము. 1.

ఒలియు, దే. అ. క్రి. చర్మము ఊడిడియు. భార. ఆది. 5, ఆ. 165; చూ, తోలూడు.

ఒలివడు, ద్వ. అ. క్రి. (ఒలి + పడు) అపహరింపఁబడు. ఆము. 8, ఆ. 85; దొంగిలించు, చూ, నవడు.

ఒలుకు, దే. అ. క్రి. 1. గళితమగు, కాశీ. 6, ఆ. 257: చూ, రాలు; 2. కాఱు; చూ, స్రవించు: స. క్రి. 3. చల్లు. భార. విరా. 5, ఆ. 232; చూ, సంప్రోక్షించు; 4. ఒలుకు. కవిక. 6, ఆ. 95; చూ, పోయు; అం. ప్రే. 8. కార్చు, చూ, వడుచు.

ఒలుకులమిట్ట, దే. వి. (ఒలుకుల + మిట్ట) ఒలికి కాడు: చూ, శ్మశానము.

ఒలుచు, దే. ప్రే. 1. చూ, ఒలియు; 2. చూ, ఒలివడు.

ఒలుపు, చూ, ఒలి.

ఒలుపుఁబప్పు, ద్వ. వి. ఒలిచినపప్పు.

ఒలె, దే. వి. 1. రూ-ఒల్లె. వలువ: చూ, వస్త్రము. 1; 2. రూ - ఒల్లె. కంచువా. చూ, వస్త్రము. 1-౧౧; 3. రూ-ఒల్లె. పుత్రోత్పత్తి చీర: చూ, వస్త్రము. 1-౯౦.

ఒలెవాటు, దే. వి. శృంగారోత్తరీయము, అంగవస్త్రమునకు కుచ్చె పెట్టి మెడచుట్టిరా భుజములమీఁద వైచికొనుట. రూ - ఒల్లెవాటు - వలెవాటు - వల్లెవాటు; చూ, వస్త్రము. 1-౮౫.

ఒల్ల, పై. క్రి. విణ. = అలనమ్. అంగ్లము. రూ - అల్ల: చూ, విరంబము. 1.

ఒల్లఁబాటు, ద్వ. వి. (ఒల్లమి + పాటు) 1. అపేక్షలేమి, ఒల్లమి: చూ, వలవమి; విణ. 2. అపేక్షింపఁబడనిది. భార. భీష్మ. 1, ఆ. 182.

ఒల్లఁబోక, దే. వి. (ఒల్లమి + పోక.) 1. అనాదరము. చూ, పరిహాసము; 2. మంచియొక్కటాని, చెడుయొక్కటాని మాఱుపాటు: చూ, విస్మృతి; 3. తాపము, ఆరాటము: చూ, సంతాపము.

ఒల్లఁబోవు, దే. అ. క్రి. (ఒల్లమి + పోవు.) 1. అదరింపఁబడని విగు: ఒల్లగిల్లు; 2. భిన్నుఁడగు. ఆము. 2, ఆ. 56; చూ, విన్నబోవు; 3. మూర్ఛిల్లు. భార. ద్రోణ. 3, ఆ. 63; చూ, సొమ్మసిల్లు.

ఒల్లకాయి, వా. వి: చూ, రూ-వల్లకాయి.

ఒల్లగిల్లు, దే. అ. క్రి. ఆదరింపఁబడనిదగు. హరి. ఉ. 3, ఆ. 80; చూ, ఒల్లఁబోవు. 1.

ఒల్లన, పై. వి. రూ-అల్లన. తిన్నఁదనము. భాగ. 10, స్కం. పూ. 927: చూ, మెల్లన.

ఒల్లమి, దే. వి. 1. అపేక్షలేమి: చూ, వలవమి. (వలచు ధాతువు యొక్క వ్యతిరేకభావార్థక రూపము.: 2. వైరము: పగ: చూ, విరోధము. 1.

ఒల్లము, దే. వి. మూర్ఛ, సొమ్మ: చూ, రోగము. 1.

ఒల్లియ, దే. వి. 1: చూ, రూ-ఒలె. (కంచువా.- భాగ. 10, స్కం. పూ. 548.)

ఒల్లె, దే. వి.—పై.—(బట్ట.—ప్రభా. 4, ఆ. 141.)

ఒల్లెంక, దే. వి. ఒకరకముచేఁప: చూ, మత్స్యము. 1—౬౫.

ఒల్లెచీర, దే. వి. గర్భిణీస్త్రీ ధరించు ఎఱుపుతెలుపుపూవు కలిపి నేసిన చీర, పుత్రోత్పత్తిచీర: చూ, ఒలె. 3.

ఒల్లెవాటు, దే. వి: చూ, రూ-ఒలెవాటు.

ఒప్పనివాఁడు, వ్యా. వి. ప్రకాశింపనివాఁడు.

ఒప్పమి, దే. వి. అనంగీకారము: చూ, అసమ్మతి.

ఒప్పు, దే. అ. క్రి. రూ-ఒప్పు. అనుకూలపడు. గిట్టు. భార. అర. 6, ఆ: చూ, సరిపడు. 1.

ఒసఁగు, దే. వి. 1. త్యాగము, ఈవి. ఆము. 6, ఆ: చూ, వితరణము; 2. బహుమానము, మన్నన. ప్రభా. 4, ఆ. 101: చూ, సమ్మానము; స. క్రి. 3. రూ-ఒసపు. ఇచ్చు, దాన మిచ్చు: చూ, దయచేయు. 2.

ఒసపరి, దే. వి. 1. సుందరుఁడు: చూ, సౌందర్యవంతుఁడు; 2. ఉత్కృష్టము, తలకట్టు. సా. 1, ఆ. 38: చూ, శ్రైష్ఠ్యము.

ఒసవు, దే. స. క్రి. రూ-ఒసఁగు. వి. పు. 2, ఆ. 50: చూ, దయచేయు. 2.

ఒసి, దే. అవ్య. చేటికాది సంబోధనార్థకము. రూ- ఓసి. ఆం. భా. తృ. అవ్య. 72: చూ, ఓసీ.

ఒహో, వై. అవ్య = అహో. రూ-ఓహో. సంబోధనమునందు వచ్చును. భాగ. 1, స్కం. 55: చూ, సంబోధనము.

ఒళగు, దే. వి. రూ-ఒళవు. ప్రవాణము, కరివె: చూ. వీణా దండము.

ఒళవరి, దే. విశే. (ఒళవు + అరి) మర్మముఁ దెలిసినవాఁడు, ఆణికాఁడు: చూ, మర్మజ్ఞుఁడు.

ఒళవు, దే. వి. 1: చూ, రూ- ఒళగు. రా. అర. కాం. 2. ఆ. 256; 2. ఆణి, కీలకము. విజ. 2, ఆ. 197: చూ, కీలకము; 3. అధీనము, లోకువ: చూ, వశము. 1.

ఒళ్లము, దే. వి. ఎళ్లము, ఏడుపలములు: చూ, మెల్లము.

ఒళ్లు, దే. వి. రూ-ఒడలు. దేహము. కవిక. 3. ఆ. 156. (ఇది పెళ్లు నళ్లువంటిది): చూ, శరీరము.

ఒళ్లుపెట్టు, దే. అ. క్రి. రక్తముపెట్టు, కందపట్టు, బలియు: చూ, స్థూలించు.

## ఓ

ఓ, అచ్చులలోని ఒకయక్షరము, సం. వి. ఓ. పుం. 1. బమ్మ, వలువ: చూ, బ్రహ్మ 1; 2. కుబేరుఁడు. పైఁడితేఁడు: చూ, శ్రీదుఁడు; 3. చందమామ: చూ, హిమాంశువు; 4. కమలము, తామరః: చూ, సహస్రపత్రము. 1-5. కుడ్యము; గోడ: చూ, మఱుఁగుగోడ; 6.ఉదకము; చూ, సలిలము. 1; 7. మొగులు; చూ, మేఘము. 1; 8. ఆఁడుగుఱి : చూ, భగము. 12; 9, ఇంద్రుఁడు : చూ, సహస్రాక్షుఁడు. 10. బృహస్పతి : చూ. సురాచార్యుఁడు; 11. నొల, బండినిలాగు చట్రము : చూ, చక్రము. 10; అవ్య. 12. ఒహో; చూ, సంబోధనము; 13. అభిమంత్రణము, పిలుచుటను దెలిపెడి : చూ, సంబోధనము; 14. తలంపునుదెలిపెడి: చూ, స్మృతి. 1; 15. కృపార్థకము, దయనుదెలిపెడి ; చూ, దయ; దే. అవ్య. (1) ప్రశ్నమును దెలిపెడి. భార. ఉద్యో. 2, ఆ. 204: చూ, నవాలు; (2) సంబోధనమును దెలిపెడి. ఆం. భా. తృ. కాం. అవ్య. 72 : చూ, సంబోధనము: (3) సందేహమును దెలిపెడి. భాగ. 10, స్కం. 1725 : చూ, సంశయము. (4) పిలుచునప్పుడు ఎచ్చరించుకొనుటను తెలుపును. ఉ. హరి. 2, ఆ. 129 : చూ, సంబోధనము; (5) ఊహనుతెలిపెడి. చూ, యోచన; (6) ప్రార్థనాదులను దెలిపెడి. కాశీ. 5, ఆ. 273 : చూ, ప్రార్థన; (7) ఆర్త్యర్థకము, ఆర్తినిఁదెలిపెడి. భార. అర. 5, ఆ. 177 : చూ, శోకము. 2; (8) విక్రయార్థకము. అమ్మటను దెలిపెడి. చూ, విక్రయము ; (9) ప్రార్థనార్థకము మీఁద వచ్చువానిలో నొకటి. ప్రార్థనార్థకముమీఁద వచ్చునవి. "ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ" అనునవి.

ఓమ్, సం. అవ్య. 1. అంగీకారార్థకము : చూ, సమ్మతి. 1; 2. పరబ్రహ్మార్థకము : చూ, పరమాత్మ; 3. ప్రారంభార్థకము: చూ, సన్నాహము; అం. 4. అకార, ఉకార, మకారములను త్ర్యక్షరసంయోగముచే ఓంకారము సిద్ధమగుచున్నది. ఓంకారము వేదముల యొక్క సారభూతము. ఉపనిషత్తులు దీని మహిమను గానముచేయుచున్నవి. యోగాదిశాస్త్రములు దీని నుపాసించుచున్నవి. బ్రాహ్మణగ్రంథములును, స్మృతులును, భగవద్గీతలును దీనిని ప్రశంసించుచున్నవి. దీని కనేకార్థములు గలవు. ఇదే ప్రణవము. (చూ. ఉద్గీథము. 3); కేశవాది నామంబు లిరువది నాలుగును "ఓం" అను ప్రణవము ప్రారంభింపఁబడును — ఆ నామము లీక్రింద వివరింపఁబడును — (ఆచమనము.) ౧. ఓమ్ కేశవాయస్వాహా = ప్రవర్తియందు బ్రహ్మ విష్ణు రుద్ర స్వరూపులుగాను లయమందొక పరమాత్మగా నుండుటయే స్వభావముగాఁ గల వస్తువే కేశవుఁడు. అట్టి వస్తువు నా పాపములను లెస్సఁగా భస్మీకరించుఁగాత ! ౨. ఓమ్ నారాయణాయస్వాహా = ముక్తిస్థానమైనదియు శుద్ధ చైతన్యస్వరూపమ్మయిన వస్తువె నారాయణుఁడు. అట్టి వస్తువు నాపాపములను లెస్సఁగా భస్మముఁ జేయుఁగాత ! ౩. ఓమ్ మాధవాయస్వాహా = మాయ అవిద్యలను వణఁకించువాఁడు; మౌన, ధ్యాన, యోగములచేఁ బొందఁదగిన వస్తువే మాధవుఁడు. అట్టి వస్తువు నా పాపములను లెస్సఁగా భస్మముఁజేయుఁగాత ! ౪. ఓమ్ గోవిన్దాయనమః = మనస్సు మొదలగు సమస్తేంద్రియములను నడుపు అంతర్యామియగు నాత్మకు నమస్కారము; ౫. ఓమ్ విష్ణవేనమః = సమస్తములోను ప్రవేశించి వ్యాపించియుండు వస్తువుకొఱకు నమస్కారము; ౬. ఓమ్ మధుసూదనాయనమః = అసురస్వభావమును నశింపఁజేయు వస్తువుకొఱకు నమస్కారము; ౭. ఓమ్ త్రివిక్రమాయనమః = సకలజగత్తును వ్యాపించి యుండు వస్తువుకొఱకు నమస్కారము; ౮. ఓమ్ వామనాయనమః = మంగళకరములగు వేదములచేఁ బొగడఁబడు వస్తువుకొఱకు నమస్కారము; ౯. ఓమ్ శ్రీధరాయనమః = కీర్తివహించిన వస్తువుకొరకు నమస్కారము; ౧౦. ఓమ్ హృషీకేశాయనమః = ఇంద్రియములను నియమించు వస్తువుకొఱకు నమస్కారము; ౧౧. ఓమ్ పద్మనాభాయనమః = హృదయకమలమునందు ప్రకాశించు వస్తువుకొఱకు నమస్కారము; ౧౨. ఓమ్ దామోదరాయనమః = శమదమాది షట్కసంపత్తివలన సంస్కరింపఁబడిన శుద్ధ

మనస్సుచే దొందఁదగిన వస్తువుకొఱకు నమస్కారము; ౧౩. ఓమ్ సఙ్కర్షణాయనమః = లెస్సఁగా పాపనిర్మూలముఁ జేయువస్తువుకొఱకు నమస్కారము; ౧౪. ఓమ్ వాసుదేవాయ నమః = అంతటను ఆత్మస్వరూపముగా నివసించు వస్తువు కొఱకు నమస్కారము; ౧౫. ఓమ్ ప్రద్యుమ్నాయనమః = స్వయం జ్యోతిస్స్వరూపము కొఱకు నమస్కారము; ౧౬. ఓమ్ అనిరుద్ధాయనమః = బంధరహితమైన వస్తువు కొఱకు నమస్కారము; ౧౭. ఓమ్ పురుషోత్తమాయనమః = సమస్తజీవులయందును వ్యాపించియుండు శ్రేష్ఠమైన వస్తువు కొఱకు నమస్కారము: ౧౮. ఓమ్ అధోక్షజాయనమః = సమస్తేంద్రియములచే తెలిసికొనఁబడని వస్తువు కొఱకు నమస్కారము; ౧౯. ఓమ్ నారసింహాయనమః = ఎట్టి విధమైన నాశనములేని వస్తువుకొఱకు నమస్కారము; ౨౦. ఓమ్ అచ్యుతాయనమః = అన్నియు నశించినను తాను నశిం పని వస్తువు కొఱకు నమస్కారము: ౨౧. ఓమ్ జనార్దనాయ నమః = జననమరణములను బోఁగొట్టు వస్తువు కొఱకు నమస్కారము: ౨౨. ఓమ్ ఉపేంద్రాయనమః = పర మైశ్వర్య వస్తువుకొఱకు నమస్కారము: ౨౩. ఓమ్ హరయే నమః= భక్తులయొక్క పాపములను హరించు వస్తువుకొఱకు నమస్కారము; ౨౪. ఓమ్ శ్రీకృష్ణాయనమః = భక్తుల యొక్క మనస్సును ఆనందమయముగాఁ జేయు వస్తువు కొఱకు నమస్కారము. చూ, ప్రణవము, ఉద్గీథము సహస్ర నామాదులకు మొదట "ఓం"తో ప్రారంభించుట వాడుక.)

ఓంకార, సం. వి. ఆ. స్త్రీ. బుద్ధునిభార్య, అనంత : చూ, స్వాహ 2, చూ. భార్య. 1-౪౧.

ఓంకారము, సం. వి. అ. పుం. ప్రణవము, కలాపము. (సర్వ భూతములను రక్షించునది.) : చూ, ఓమ్.

ఓంకారేశ్వరుఁడు, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు 1.

ఓంత్ర, దే. వి. ఇ, గాడిదయొక్క కూఁత : చూ, స్వరము. 2-(౧౩౭)

ఓంత్రపెట్టు, దే. అ. క్రి. గాడిదకూయు : ఓంత్రించు.

ఓంత్రించు,—వై.—

ఓంబాయి, వా. వి. 1. ఇద్దరుపిల్లలు తమచేతులమీఁద ఇంకొక పిల్లను మోచుచు నాడెడు ఆటలోనగు ధ్వన్యనుకరణము: చూ, హూ హూ; 2. పాలకి మున్నగువానిని మోయువారల ధ్వన్యనుకరణము : చూ, హూహూ.

ఓఁక, సం. వి. ఆ. స్త్రీ. కరమర్దము, పుల్లకలివె *: చూ, సామ్లపుష్పఫల.

ఓక, సం. వి. ఆ. స్త్రీ. అజహాలిక, కంచెకోట: చూ, ప్రాచీనము. 1,

ఓకణము, సం. వి. అ. పుం. పేను : చూ, యూకము. (ఓకోదని ఓక్కణి, ఓకణి, ఉకణము అని సూ. ని.)

ఓకణి, సం వి. ఈ. స్త్రీ—వై.—

ఓకము, సం. వి. అ. న. 1. ఇల్లు: చూ, భవనము. 1; 2. చోటు చూ, స్థానము. 1; 3. శ్రేష్ఠము : చూ, స్వధము.

ఓకర, వై. వి. 1 = ఉద్గారః. ప్రచ్ఛర్ది చూ, వాంతి; 2. దూఱు: చూ, నిర్బంధము; 3. అసహ్యము: చూ, రోఁత. 2.

ఓకరించు, వై. అ. క్రి. 1 ఓకరవచ్చి ఉమియు : చూ, వెక్కి గొట్టు; 2. అసహ్యించు : చూ, రోఁతపడు.

ఓకరింత, వై. వి. = వికార-ఉద్గారః: చూ, ఓకర. (రూ-ఓకలింత.)

ఓకలివె, దే. వి. కలివె * : చూ, సామ్లపుష్పఫల.

ఓకస్సు, సం. వి. స్. న, చూ, రూ-ఓకము. 1, 2, 3.

ఓకిలి, వై. వి.= ఉద్గారః : చూ, ఓకర.

ఓకిలించు, వై. అ. క్రి. 1. దోఁకు : చూ, వెక్కఁగొట్టు; 2. అస హ్యించు. ఉ. హరి. 3, ఆ. 14; కాశీ. 5, ఆ. 55 : చూ, రోఁతపడు.

ఓకిలింత, వై. వి. = వికార, ఉద్గార : చూ, ఓకర. (రూ-ఓక రింత.)

ఓకు, వా. వి. 1. దూరవస్తుదర్శన యంత్రము : చూ, దుర్భిణి; 2. ఒరుపు.

ఓకుఁడు, సం. 1. వి. అ. పుం. చూ, శూద్రుఁడు.

ఓక్రము, సం. వి. అ. న. మంచితావు, ఇంటి కనుకూలమైన స్థానము : చూ, స్థానము. 1, (నెల్లూరుజిల్లా ప్రాంతముల వాడుక.)

ఓగాత్యము, వై. విణ. = అవజ్ఞాత - అవాచ్య. అమంగళము, అశుభమైనది : చూ, ఓగు. 2.

ఓగితము, వై. వి. = యుక్తమ్-యోగ్యమ్. ఇమ్మ. లక్ష్మి. 2, ఆ. 90 ; భో. 5, ఆ. 288: చూ, యోగ్యము. 2.

ఓగిరము, వై. వి. = ఆహారః. రూ - ఓయిరము - ఓరెము. అన్నము; కాశీ. 4, ఆ. 133 : చూ, సాదము. (1) (ఓవి రము అని సూ.ని. )

ఓగు, దే. వి. 1. అశుభము, కీడు. వేమన. 818; చూ, హాని 2; విణ. 2. అశుభము, కీడైనది. ఓగాత్యము; (సం. ప.):— అమంగళము, అప్రశస్తము, అవజ్ఞాతము, అశుభము; 3. అజ్ఞాని. వేమన. 817 : చూ, మ్లుఁడు.

ఓగురొత్తుచు, దే. అ. క్రి. దేవురించు : చూ, దైన్యపడు.

ఓఘము, సం. వి. అ. పుం. 1. మూఁక : చూ, సమూహము; 2. అంపాచారము : చూ, ప్రవాహము. 1; 3. క్రమపద్ధతి: చూ, పరంపర; 4. వరచరణాది గతివిశేషములయొక్క సమ వాయము. వృత్తగీతాదులకాలము : చూ, తాళము. 2; 5. ఉపదేశము, మంచిమాట : చూ, హితవచనము.

ఓచెల, దే. అవ్య. రూ-ఓచెల్ల. సంతాపార్థకము. నై. 5,ఆ. 157. (కొన్ని ప్రతులయందు ఒచ్చెల అనియు కలదు.) ; చూ, సంతాపము.

ఓచెల్ల,—వై.—స్వా. 3, ఆ. 36.

ఓజము, సం. వి. అ. పుం. 1. (జ్యోతిశ్శాస్త్రమునందు) బేసి చూ, విషమము; అం. 2. చూ, కావ్యగుణములు.

ఓజస్సు, సం. వి. స్. న. 1. తేజము, జోతి: చూ, వెలుతురు. 1; 2. బలము : చూ, శక్తి. 1; 3. ఉత్సాహము, పూనిక:చూ, సన్నాహము 2: 4. కిరణము: చూ, హాయనము; 2. ఆత పము, ఎండ: చూ, వెలుఁగు. 3; అం. 6; చూ, గుణములు.

ఓజస్విత, సం. వి. ఆ. స్త్రీ. ఓజస్సు కలవాఁడుగానుండుట. ఓజ స్వీత్వము.

ఓజస్త్విత్వము, సం. వి. అ. న.—పై.—

ఓజస్వుఁడు, సం, వి.అ. పుం. బలము మున్నగునవి గలవాఁడు; చూ, లావరి.

ఓజోరోగము, సం. వి. అ. పుం. ఒకానొక జ్వరము : చూ, రోగము. 1.

ఓజ, పై. వి. 1. = ఓజఁ. భయము. రా. అర, కాం. 2. ఆ. 105 చూ, వెఱపు; 2. = ఓజఁ. రూ-ఒజ్జ. ఉపాధ్యాయుఁడు. భార. శ్రీ. 2, ఆ. 136 : చూ, పంతులు. 1; 3.=ఊర్జ. ఉత్సాహముఁ పూనిక. భార. అర. 5, ఆ. 57 : చూ, సన్నాహము. 2.

ఓజపడు, వ్యా. అ. క్రి. యుక్తమగు, క్రమపడు : చూ, సరిపడు.

ఓజబంతి, పై. వి. ఒజ్జబంతి, చూ, మేలుబంతి.

ఓజు, దే. వి. కమసాలి, చూ, స్వర్ణకారుఁడు.

ఓట, దే. వి. 1. భయము, దిగులు. స్వా. 2, ఆ. 39 : చూ, సాధ్వసము; 2. జంకు. భార. ఉద్యో. 3, ఆ. 104 : చూ, సంకోచము. 3.

ఓటమి, దే. వి. 1. భయము, దిగులు. భాగ. 1, స్కం. 104 : చూ, సాధ్వసము: 2. భంగము, చెఱుపు. కళా. 7, ఆ. 207: చూ, హాని. 2; 3 అపజయము : చూ, పీఁక. 7.

ఓటము, దే. వి. అపజయము. ఉ, హరి 3, ఆ. 156; చూ, పీఁక. 7.

ఓటఱు, దే. అ. క్రి. రూ - ఓటారు. అశక్తియగు. హరి. పూ. 6, ఆ. 131 : చూ, నిస్సత్త్వమగు.

ఓటాఱు, దే. అ. క్రి.—పై.—భార. ద్రోణ. 5. ఆ. 138. (ప్రే. ఓటాఱుచు.)

ఓటి, దే. వి. విముఖత్వము.

ఓటికుండ, దే. వి. పగిలినకుండ: చూ, భాండము. 3—౧౭.

ఓటిపలుకు, దే. వి. 1. బెజ్జముగాని పగులుగానిఁగల కుండ లోనగువాని పలుకు; 2. పరవతి లేనిమాట, ఉత్తమాట: చూ, శబ్దము. 2-౧౬.

ఓటిమాట, దే. వి : చూ, ఓటిపలుకు. 2.

ఓటిల్లు, దే. అ. క్రి. ఓడు : చూ, సంకోచించు.

ఓటిల్లుచిందఱ, దే. వి. ఒకానొక బాలక్రీడ. కాశ. 3, ఆ. 33: చూ, బాలక్రీడ.

ఓటు, దే. వి. 1. అపజయము : చూ, పీఁక. 7: 2. భంగము, చెఱుపు: చూ, హాని. 2; అవ్య. 3. ప్రశ్నార్థకము. స్వా. 3, ఆ. 41; పా. 4. అభ్యర్థికివేయు జయసూచకపు గుఱుతు(+) (రూ-వోటు.)

ఓటుకాఁడు, వా. వి. అజయుఁడు : చూ, విముక్తుఁడు.

ఓటుపడు, దే. అ. క్రి. 1. ఓడు. భార. అర. 2, ఆ. 224; చూ, వెనుదీయు. 1; 2. ప్రమాదపడు. పంచ. నా. 4, ఆ. 98: చూ, మోసపోవు; స. క్రి. 3. అవమానపెట్టు. భార. సభా. 2, ఆ. 209; భార. సభా. 2, ఆ. 207: చూ, హేళనముచేయు.

ఓటుపాటు, ద్వ. వి. అపజయము. అధ్యా. యు, కాం. 1, ఆ. 325: చూ, పీఁక. 7.

ఓటువుచ్చు, దే. ప్రే. ఓటువోవు.

ఓటుపోవు, దే. స. క్రి (ఓటు + పోవు.) అవమానపెట్టు. భార. శ్రీ. 2 ఆ. 136; చూ, హేళనముచేయు.

ఓటుసేయు, ద్వా అ. క్రి. (ఓటు + చేయు.) —పై.— రసి. 6, ఆ. 100.

ఓడ, పై. వి. = పోఁడి, నావ, తరణి. వేమన. 822.; చూ, పోతము.

ఓడంగి, పై. వి. 1. ఓడవాఁడు, నావికుడు : చూ, సరంగు. 2. చిన్నదోని నడపువాఁడు. పడవవాఁడు : చూ, సరంగు; 3. దోనెకు బోటట్టు వేసెడు దూలము. చూ, మదనచేతులు, 1–౪.

ఓడకంబము, ద్వా. వి. ఓడనడుమవేయు నిడుపాటిస్తంభము. ఓడ కొడికంబము ; చూ, స్తంభము. 1-౧౨.

ఓడకేవు, ద్వా. వి. ఆతరము : చూ, తరపణ్యము.

ఓడకొడికంబము, ద్వా. వి : చూ, ఓడకంబము.

ఓడకొయ్య, —పై.—

ఓడప్రయాణికుఁడు, వా. వి. కలమరి.

ఓడమాలి, ద్వ. వి: చూ, ఓడంగి,

ఓడము, సం. వి. అ. పుం. రాగాలాపము, ఆలప్తి: చూ, స్వరము. 2.—౨౨.

ఓడరేవు, వా. వి. రేవుపట్టణము.

ఓడించు, దే. స. క్రి. గెలుచుకొను: చూ, విజయమునొందు.

ఓడిక, సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము; దే. వి. (1) జలదారి: చూ, తూము. 2: (2) తనయిచ్చ దాటెడునీరు, అంపాచారము. జై. 1. ఆ. 99: చూ, వెల్లువ; 3. మనుష్యులచేతఁ ద్రవ్వఁబడిన చిన్న నీటికాలువ, కుల్య: చూ, నది. 1-౧౧(౧).

ఓడిగిల్లు, దే. అ. క్రి. 1. ప్రవహించు, కాశీ. 3, ఆ. 101: చూ, వెల్లిగొను; 2. పరుగిడు. జై. 1, ఆ. 136: చూ, వెళ్లు 1; 3. కాఱు. కాశీ. 4, ఆ. 174: చూ, స్రవించు.

ఓడినక్క, ద్వ. వి. పొట్టినక్క: చూ, సృగాలము. 1-3, (అప్ర)

ఓడు, దే. వి. 1. అపజయము, ఓటము; చూ, పీఁక. 7; 2. ధార, కుండలోనగుకానితూఁటు. "ఓటికుండ": చూ, రంధ్రము. 1; అ. క్రి. 3. అపజయపడు. భార. కర్ణ. 3, ఆ. 53: చూ, వెనుదీయు. 1; 4. పరుగిడు. హరి. పూ. 8, 46: చూ, వెళ్లు. 1; 5. బెదరు. భార. ఆది. 3, ఆ. 41: చూ, క్రుక్కు. (6); 6. కొంచుకు. మై. 2, ఆ: చూ, సంకోచించు.

ఓడుబిళ్ల, దే. వి. ఇంటిపైఁ గప్పెడు పెంకు. వసు. 4, ఆ. 72: చూ, శర్కర. 3.

ఓఢ్యాణము, సం. వి. ఆ. న. 1.=ఒడ్డాణము: కాంచీభూష. చూ, భూషణము. 2-౭; 2. కూర్చుండు పీఁట: చూ, సింహాసనము.

ఓఢ్రదేశము, సం. వి. అ. పుం. ఒరిస్సా అను ఓఢ్రదేశము, ఉత్కలము: చూ, దేశములు. 1-౧౨.

ఓఢ్రపుష్పము, సం. వి. అ. పుం. జప. దాసనము *: చూ, హయజీవనమారకము.

ఓఢ్రము, సం. వి. అ. పుం. 1.—పై.—; 2. ఉత్కలమను ఓఢ్రదేశము. (చూ, ఓఢ్రదేశము.): చూ, దేశములు 1-౧౨;

అం. 3. ఆర్యావర్తాదిదేశములలో నొకటి: చూ, దేశములు: 4. ఒకానొకభాష: 1-౧౨; చూ, భాషలు. 1-౧౩.

ఓఢ్రుఁడు, సం. వి. అ. పుం.=ఒడ్డె, ఒడ్డెవాఁడు: చూ, ఒడ్డియ.

ఓణి, దే. వి. 1. ఉత్తరీయము. కండువా. చూ, వస్త్రము; 1-౧౧; 2. పరికిణీ (లంగా) పైన యుక్తవయస్సు వచ్చిన ఆఁడువారు భుజముపైకి వేసికొను పైఁట: చూ, వస్త్రము. 1-౪౧-(౨). (రూ-ఓణీ.)

ఓణీ, —పై.—

ఓతప్రోతన్యాయము, న్యా. పడుగుపేకలవలె నొకదానిలో మఱొకటి కలసిన విషయమును దెలుపుట కిది యుపయుక్తమాన మగును.

ఓతప్రోతము, సం. విణ. నిలువుగాను, అడ్డముగాను అంతట వ్యాపించి యున్నది; పరివ్యాప్తమైనది: చూ, వ్యాప్తము. 4.

ఓతము, సం. వి. అ. న. నిడుపుపోఁగులు.

ఓతువు, సం. వి. ఉ. పుం. పిల్లి: చూ, మార్జాలము.

ఓదకాంతమనువ్రజేత్, న్యా. ఉదకాంతమువఱకు బంధువును సాఁగనంపవలయును.

ఓదనము, సం. వి. అ. పుం. న. అన్నము: చూ, సాదము. (1).

ఓదనాహ్వయ, సం. వి. ఆ. స్త్రీ. ముత్తవపులగము *: చూ, సహదేవ. (ఓదనిఅనియు) (ఓదనౌదనికఅనియు).

ఓదము, వై. వి. శ్వభ్రము, ఒగ్గము, ఏనుఁగును బట్టెడి పల్లము. భార. శాంతి. 4, ఆ. 181; ఉ. హరి. 4, ఆ. 29; చూ, వారి. 6. (ఓవము అని పూ. ని.)

ఓదార్చు, దే. స. క్రి. ఆశ్వాసించు: రూ- ఓదార్పు: చూ, సహాశ్వాసించు.

ఓదార్పు, —పై.—

ఓదారుపు, దే. వి. ప్రశ్రయము. రూ-ఓదార్పు: చూ, సహాశ్వాసము.

ఓదార్పు, —పై.—

ఓదియ, దే. వి. కోఁతకోసి చేనియందక్కడక్కడ నుంచెడు పెన్నుపోఁచలప్రోగు. రూ-ఓదె: చూ, పన.

ఓదె, —పై.—

ఓదెకొంగ, ద్వి. వి. ఓదెకొలుకు పంటకాలములోవచ్చు ఒక రకము కొంగ: చూ, బకము. 1-౧.

ఓదెకొలుకు, —పై.—

ఓద్యోలి, సం. వి. ఈ. స్త్రీ. అపహోలిక. కంచెకోట: చూ, ప్రాచీనము. 1.

ఓనమాలు, వా.వి. అకారాది హకారాంతము వరకుగల వర్ణమాల; చూ, వర్ణము. 1.

ఓనికట్టు, దే. వి. కొండలనడుమ గొందిదారి: చూ, కనుమ. 2.

ఓపమి, దే. వి. బద్ధకము, బడుగుతనము, స్త్యానము: చూ, విలంబము. 1.

ఓపిక, దే. వి. 1. ఓపు, బలము. చూ, శక్తి. 1; 2. క్షమ, ఓరిమి. చూ, శాంతము. 2.

ఓపికకలవాఁడు, ద్వి. వి. శ్రద్ధగలవాఁడు: చూ, శ్రద్ధధానుఁడు.

ఓపు, దే. వి. 1. బలిమి. భార. విరా. ౫, ఆ. 93: చూ, శక్తి. 1; 2. క్షమ, ఓర్మిమి. భార. ఆది. 1, ఆ. 138: చూ, శాంతము. 2; అ. క్రి. 3. కావలసినంతయగు: చూ, పర్యాప్తమగు; 4. చాలు. చూ, నేయడు.

ఓపువాఁడు, ద్వి. వి. నేర్పరి: చూ, సమర్థుఁడు.

ఓమె, దే. అవ్య. స్త్రీనిబులుచుటను దెలిపెడి: చూ, ఓమె.

ఓమటి, దే. వి. అన్నము, ఓగిరము. ఆం. భా. ద్వి. వై. 257: చూ, సాదము. (1).

ఓమనగాయలు, ద్వి. వి. బ. (ఓమన+కాయలు) ఓమనగుంటలాడు గింజలు.

ఓమనగుంటలు, ద్వి. వి. బ. ఒకానొక బాలికాక్రీడ. చూ, బాలికాక్రీడ.

ఓమనపీఁట, ద్వి. వి. ఓమనగుంటలాడుపీఁట. (ప్రక్కకు ఏడేసి గళ్ళచొప్పున రెండుప్రక్కలకు పదునాల్గు గళ్ళు ఉండును.)

ఓమము, దే. వి. దీప్యము. *: చూ, యవాని.

ఓము, దే. స. క్రి. కాచు. భార. అశ్వ. 1, ఆ. 164: చూ, రక్షించు.

ఓమె, దే. అవ్య: చూ, రూ-ఓమె. ఆం. భా. త్ర. అవ్య. 72.

ఓయన, దే. వి: చూ, రూ- ఒయ్యన.

ఓయారము, దే. వి: చూ, రూ- ఒయ్యారము.

ఓయారి, దే. వి. చూ, రూ-ఒయారి.

ఓయి, వై. అవ్య.=హై, హో, పురుషసంబోధనార్థము. రూ-ఓయీ: చూ, సంబోధనము.

ఓయియమ్మ, ద్వి. అవ్య. వేడికాది సంబోధనార్థకము: చూ, ఓసీ.

ఓయిరము, వై. వి.=ఆహారః. అన్నము, రూ-ఓగిరము. కాశీ. ౫, ఆ. 297: చూ, సాదము. (1).

ఓయీ, వై. అవ్య.=హై, హో: చూ, రూ- ఓయి.

ఓర, దే. వి. 1. ఒడ్డు: చూ, రోధస్సు; 2. అంచు: చూ, మైజాలు; 3. ప్రక్క, పైపు: చూ, పార్శ్వము. 2; అవ్య. 4, సాదృశ్యకము. ఆం. భా. త్ర. అవ్య. 72; వై. వి. 5.=హోరా. అహోరాత్రము, మువ్వది ముహూర్తములకాలము రేఁబవలు: చూ, హోర. 1. విణ. 6. ఒరగినది. "ఓరచూపు, ఓరగచ్చు"మొ: చూ, వేల్లితము, 3; వక్రిమము. 2; 7. వంగినది, వంకరయైనది. వై. 3. ఆ. 89: చూ, వేల్లితము. 3.

ఓరంతప్రొద్దు. వై. వి.= హోరా. (ఓర+అంతప్రొద్దు.) 1. దినమంతయు. కాశీ. 4, ఆ. 133. 2=హోరా. సర్వకాలము, ఎల్లకాలము. ఉ. హరి. ౫, ఆ. 282; స్వా. ౫, ఆ. 7: చూ, సతతము. 2. (పురుషోత్తమకవియము.)

ఓరగచ్చు, దే. వి. (ఓర+కచ్చు) ప్రక్కకొదిఁగించిన కౌపీనము. శల్యా. 3, ఆ. 35: చూ, లంగోటి.

ఓరగిల్లు, దే. అ. క్రి. 1. అపసరిల్లు: విరాయు. ౫; 2. అవనతమగు: భార. భీష్మ 1, ఆ. 268: చూ, వ్రాలు. 6.

ఓరచూపు, ద్వి. వి. ప్రక్కదృష్టి. వంకరచూపు: చూ. వాలుచూపు.

ఓరచ్చులు, ద్వి. వి. బ. (ఓర+అచ్చులు.) గుదికాలు దెడిచోట ఎత్తుగా అట్టలువేసి కట్టిన ఓరట్టచెప్పులు. హరిశ్చ. ౫, ఆ. 111: సపాదుకలు. 1.

ఓరట్టచెప్పులు, (ఓర+అట్టచెప్పులు) —పై.—

ఓరణము, దే. వి. ఒకరకము దేగ.. రసి. 1, ఆ. 115: చూ, శ్యేనము.

ఓరపాక, దే. వి. పంచను దూలములుచేత వెలిప్రక్క వంచి కట్టినశాల, పాదలి, మోరపాక : చూ, సదనము. 1-౧౫.
ఓరపాటు, ద్వ. వి. ఒరగుట. ఉ. రా. 3, ఆ. 40: చూ, ఒరగుట.
ఓరపారము, దే. విశ. ఎగుడు దిగుడు : చూ, విషమము.
ఓరవలి, దే. వి. పలురంగులచీర : చూ, వస్త్రము. 1-౫౧.
ఓరవోవు, దే. అ. క్రి. (ఓర + పోవు. అవనతమగు, వంగు. భార. శల్య. 2; ఆ. 9; చంద్రా. 6, ఆ. 128: చూ, వ్రాలు. 6.
ఓరసింపు, వై. వి. = హోరా. ఓరసిల్లుట. అని. 3, ఆ. 95 : చూ, ఓసరింత. (పురుషోత్తమకవీయము.)
ఓరసిలు, వై. అ. క్రి. అపసరః. అపసరిల్లు. రూ- ఓరసిల్లు. కవి. 3, ఆ : చూ, విరియు. 5.
ఓరసిల్లు, వై. అ. క్రి. = అపసరః. —వై.—
ఓరి, దే. అవ్య. నీచసంబోధనార్థకము : చూ, రూ- ఓరీ.
ఓరిమి, దే. వి. క్షమ, ఓర్పు : చూ, శాంతము. 2.
ఓరీ, దే. అవ్య. రూ-ఓరి : చూ, సంబోధనము.
ఓరు, దే. వి. 1. ఇంటితిన్నెగోడల యడుగునను మూలలను తెన్నెకు ఎఱ్ఱమట్టిపట్టె : చూ, పట్టియ. 6; వై. ఉప.2. = ఉరు. పృథువు, పెద్ద. "ఓరుగాలి వీచుచున్నది": చూ, విపులము.
ఓరుగాలి, ద్వ. వి. ప్రకంపనము, మిక్కిలి బలముగల వాయువు. పా. 5, ఆ. 31 : చూ, వాయువు. 1—౧౩.
ఓరుచు, దే. అ. క్రి. 1. రూ- ఓర్చు: చూ, సహించు, భార. ఆది. 7, ఆ. 15 : చూ, సహించు; 2. రూ-ఓర్చు. ఉపశమిల్లు : చూ, సురిక్కు. 4; 3. రూ- ఓర్చు. క్షయించు, తగ్గు: చూ, సురిక్కు. 9.
ఓరుతీయు, దే. అ. క్రి. ఇంటి తిన్నెగోడల యడుగునను మూలలను ఎఱ్ఱమట్టిలోఁ బట్టెలు దీర్చు: చూ, లేపనముచేయు. 1-౧.
ఓరుపరి, దే. వి. (ఓరుపు + అరి.) రూ-ఓర్పరి. తాలిమికాఁడు : చూ, సహనుఁడు.
ఓరుపు, దే. వి. 1. రూ-ఓర్పు. క్షమ: చూ, శాంతము. 2. రూ-ఓర్పు. గెలుపు : చూ, విజయము. 3. రూ-ఓర్పు, నైరణ ; చూ, సహనము.
ఓరువాకిలి, వా. వి. కొద్దిగ తలుపు తెఱచియుంచుట.
ఓరెము, వై. వి. ఆహారః : చూ, రూ-ఓయిరము. అచ్చ. బాల. కాం. పీఠిక. 15.
ఓర్చు, దే. అ. క్రి : చూ, రూ-ఓరుచు.
ఓర్పరి, దే. వి. చూ, రూ-ఓరుపరి.
ఓర్పు, చూ, రూ-ఓరుపు. (క్షమాజయములకు. _ పాంచా. 4, ఆ. 52.)
ఓర్త, వై. స. ఏ. రూ-ఒకర్త : చూ, ఒకత.
ఓర్తి, రూ-ఒకర్తి : —వై.—
ఓర్తు, రూ-ఒకర్తు : —వై.— కాశీ. 6, ఆ. 262.
ఓర్తుక, రూ-ఒకర్తుక. —వై.—
ఓర్తె, రూ-ఒకర్తె. —వై.—
ఓర్వనివాఁడు, ద్వ. వి. అసహనుఁడు : చూ, మూఢుకాఁడు.
ఓర్వమి, దే. వి. 1. ఓర్వలేనితనము : చూ, మూడు. 1; 2. తాలిమిలేమి : చూ, కొంతశము.
ఓఱు, దే. వి. 1. ధ్వని, అలికిడి: చూ, స్వరము. 2; 2. వర్షధారావిధ్వని: చూ, స్వరము. 2-(౫౧.)
ఓల, దే. వి. 1. నెపము: చూ, వ్యాజము. 1; 2. అపజయము, ఓటు: చూ, వీఁక. 7; 3. జలక్రీడా సమయమునందు ప్రేరేపించుటకై యుపయోగించునట్టి శబ్దము. కళా. 6, ఆ. 231;
ఓలగండము, ద్వ. వి. పూనినపనుపు. కాశీ. 3, ఆ. 212: చూ, పూఁతపసుపు.
ఓలగము, దే. వి. 1. కొలువు. రామా. 2, ఆ. 78: చూ, సభ. 2; ౧: 2. కొలువుకూటము. భో. 2, ఆ. 55: చూ, సభ, 2.
ఓలగించు, దే. స. క్రి. కొలుచు: జై. 1, ఆ. 44: చూ, సేవించు.
ఓలచెంగనాలు, దే. వి. బ. అపజయము, ఓటము. ఆం, భా. ద్వి. ద్వి. తు. 224: చూ, వీఁక. 7.
ఓలమానగొను, ద్వ. అ. క్రి. (ఓలము + అన + కొను) లిలోహితమగు. భార. అను. 1, ఆ. 68, నై. 4, ఆ. 97: చూ, మఱుఁగుపడు.
ఓలము, సం. వి. అ. పుం. 1.=అల్లము*: చూ, శృంగబేరము. (రూ-ఓల్లము); 2. రూ-ఓర్గము, కంద *. చూ, సూరణము; దే. వి. (1) అడ్డపాటు: చూ, వ్యవధానము; (2) దేహము, ఒడలు, చూ, శరీరము: (3) వృక్షము లోనగు వానిచే మఱుఁగగుచోటు. భార. విరా. 2, ఆ. 321: చూ, మఱుఁగు చోటు; (4) మూలధనము, అసలు: చూ, సంచిమొదలు.
ఓలలాడు, దే. అ. క్రి. (ఓలలు + ఆడు) 1. రూ-ఓలాడు. స్నానముచేయు: చూ, స్నానమాడు; 2. నీళ్ళలోమునుఁగక మీఁద సంచరించు. రూ-ఓలాడు, తెప్పలదేలు: చూ, తేలు. 4. (ప్రే. ఓలలార్చు.)
ఓలాకు, దే. వి. అలసట: చూ, శ్రమము. 1.
ఓలాకుపడు, ద్వ. అ. క్రి. అలయు, శ్రమపడు. భార. విరా. 3, ఆ. 132: చూ, వేసరు. 2.
ఓలాడు, దే. అ. క్రి. (ఓల + ఆడు); చూ, రూ-ఓలలాడు. (సీళ్ళాడు.—ధీ. 6, ఆ. 107; తేలు.—లక్ష్మీ. 1, ఆ. 25. పీఠిక.)
ఓలి, దే. వి. 1. ఉంకువ: చూ, శుల్కము; వై. వి. 2. = ఆలిః (ఆళి.) వరుస, బారు. ఆర. 2, ఆ. 202; చూ, శ్రేణి, 1; 3. క్రమము: చూ, విధము. 1.
ఓలిమి, దే వి. అడ్డపాటు, ఆం. భా. ప్ర. ది. 76: చూ, వ్యవధానము. 3.
ఓల్లము, సం. వి. అ. పుం: చూ, రూ-ఓలము *.
ఓవము, వై. వి: చూ, ఓదము. (సూ. ని.)
ఓవర, వై. వి. = అపవరకః. రూ-ఓవరి. లోపలిగది: చూ, సదనము. 1—౧౮.
ఓవరి, వై. వి. 1 = అపవరకః. —వై.— హరి. పూ. 5, ఆ. 219; 2. = అపవరకః. చంద్రశాల, మైమెడ. చూ, సదనము. 1 — ౬౫.
ఓవిరము, వై. వి: చూ, రూ-ఓగిరము. (సూ. ని.)
ఓవు, దే. అ. క్రి. రూ-ఒవ్వు. అనుకూలమగు. శుక. 1, ఆ. 71: చూ, సరిపడు. 1.

కామరేఖ, సం. వి. ఆ. స్త్రీ. భోగముది: చూ, వేశ్య.
కామల, సం. వి. ఆ. స్త్రీ. = కామెల: చూ, పసరిక.
కామలత, సం. వి. ఆ. స్త్రీ మగగుఱి: చూ, శిశ్నము.
కామలము, సం. వి. అ. పుం. 1. = కామల: చూ, పసరిక; 2. మరుభూమి: చూ, భూమి.1-౩౬; 3. వసంతఋతువు: చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)
కామలుఁడు, సం. విణ. 1. కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 2. లంజెకాఁడు: చూ, విటుఁడు.
కామవతి, సం. వి. ఈ. స్త్రీ. అంకపీలి*: చూ, మ్రానిపసుపు.
కామవల్లభ, సం. వి. ఆ. స్త్రీ చందిరిక: చూ, వెన్నెల.
కామవల్లభము, సం. వి. అ పుం. ఆమ్రము*: చూ, మామిడి.
కామవృంత, సం. వి. ఆ. స్త్రీ కలిగొట్టు*: చూ, స్థాలి 2.
కామవృక్షము, సం. వి. అ. పుం. బదనిక*: చూ, వదనిక.
కామవృద్ధినామము, సం. వి. అం. పుం. పొట్టికొమ్మలాడలుగల చెట్టు: చూ, హ్రస్వశాఖాశిఫము.
కామశరము, సం. వి. అ. పుం. ఆమ్రము*: చూ, మామిడి.
కామశాస్త్రము, సం. వి. అ. న. కొక్కోకము మొదలైనవి: చూ, కామము. 8.
కామసఖము, సం. వి. అ. పుం. వసంతఋతువు: చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)
కామసుతుఁడు, మన్మథుని కొడుకు: చూ, విశ్వకేతువు.
కామాంకుశము, సం. వి. అ. పుం. 1. గోరు: చూ, నఖము; 2. మగగుఱి: చూ, శిశ్నము.
కామాంగము, సం. వి. అ. పుం. ఆమ్రము*: చూ, మామిడి.
కామాంతకము, సం. వి. అ. పుం. ఏడుపు: చూ, దుఃఖము.
కామాంతకుఁడు, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.
కామాంధ, సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి: చూ, మృగమదము.
కామాంధము, సం. వి. అ. పుం. కోయిల: చూ, పికము.
కామాటము, వై. వి. = కర్మఠ: రామా. 8, ఆ. 185: చూ, మోటపని.
కామాటి, వై. విణ. = కర్మఠ. (కామాటము + ఇ) మోటపని చేయువాఁడు.
కామాతురుఁడు, సం. విణ. కామార్తుఁడు: చూ, వలపుకాఁడు.
కామాధిదేవత, సం. వి. ఆ. స్త్రీ. త్రయోదశితిథి: చూ, తిథి. 1.
కామాయుధము, సం. వి. అ. న. 1. కామదేవాస్త్రము: చూ, బాణము. 1-౨౬; 2. మహారాజచూతము*: చూ, మామిడి.
కామాయువు, సం. వి. న్. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.
కామారణ్యము, సం. వి. అ. న. మనోజ్ఞమైన వనము: చూ, వనము. 2.
కామారి, సం వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు. 1.
కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు. న్యా. కామార్తులు యుక్తాయుక్తవివేకశూన్యులు; గానఁ జేతనాచేతనములను దీనులై యాచింతురు.
కామార్తుఁడు, సం. విణ: చూ, కామాతురుఁడు.
కామాలిక, సం. వి. ఆ. స్త్రీ. కల్లు: చూ, సుర. 2.
కామాళువు, సం. వి. ఉ. పుం: చూ, రక్తకాంచనము*.

కామి, సం. వి. ఇ. పుం. 1. కాముకుఁడు: చూ, వలపుకాఁడు; విణ. 2.—పై.—; వి. ఇ. న్. 3. జక్కవ: చూ, చక్రవాకము; 4 పారావతము: చూ, పావురము: ఇ. స్త్రీ, 5. ఇచ్ఛ: చూ, వాంఛ; 6 రతి, మన్మథుని భార్య: చూ, భార్య; ఇ. పుం. 7. లంజెకాఁడు: చూ, విటుఁడు.
కామికము, సం. వి. అ. పుం. 1. కన్నియలేడి: చూ, మహాపక్షము; అం. 2: చూ, తంత్రములు.
కామికాగమము, అం: చూ, ఆగమములు: (చూ, ఉపవిద్యలు.1-౧.)
కామిని, సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రియసంగమమునందు మిక్కిలి ఆసగల యాఁడుది: చూ, స్త్రీ; 1-౧౪౨; 2. ఆఁడు: చూ, స్త్రీ; 3. ఆఁడుజక్కవ: చూ, చక్రవాకము; 4. ఆఁడు పావురము: చూ, పావురము; 5. బదనిక*: చూ, వదనిక; 6. అంకోలగిరి*: చూ, ప్రేంకణము.
కామినీశము, సం. వి. అ. పుం. మునగ*: చూ, శిగ్రువు. 1.
కామీస్వతాంపశ్యతి, న్యా. కాముకుఁడు తన వలచిన యువతి యొక్క చేష్టలన్నియుఁ దన్నుఁ గూర్చినవనియే తలంచును.
కాముఁడు, సం. వి. అ. పుం మరుఁడు: చూ, మన్మథుఁడు.
కాముక, సం. వి. ఆ. స్త్రీ. గంధపుష్పాలంకారములయం దపేక్షగల యాఁడుది: చూ, స్త్రీ. 1-౧౪౩.
కాముకకాంత, సం. వి. ఆ. స్త్రీ. అతిముక్తలత, పూలగురివెంద*: చూ, తులాబీజము.
కాముకప్రియము, సం. వి. అ. పుం. కస్తూరి పసుపు*: చూ, వర్ణము. 6-౭. (౨.)
కాముకము, సం. వి. పుం. 1. ఇరుగుడు*. చూ, శింశప; 2. నెమ్మి*: చూ, తినాసము; 3. పూలగురివెంద*: చూ, తులాబీజము; 4. కంగేలి*: చూ, హేమపుష్పము; విణ. 5. ఇచ్ఛగలది: చూ, వాంఛ. 1-౩౧.
కాముకి, సం. వి. ఈ. స్త్రీ. సంభోగమునం దిచ్ఛగల యాఁడుది: చూ, స్త్రీ. 1-౩౬.
కామురుఁడు, సం. విణ. కామయిత: చూ, వలపుకాఁడు.
కామృతి, సం. వి. ఇ. స్త్రీ. చెడ్డచావు: చూ, సావు. 1-౪. (ఇట్టి శబ్దంబు లూహ్యంబులు.)
కామృత్తిక, సం. వి. ఆ. స్త్రీ. చెడ్డమన్ను: చూ, భూమి. 1-౩౫.
కామెల, వై. వి. = కామల: చూ, పసరిక.
కామేశ్వరి, సం. వి. ఈ. స్త్రీ. పరాశక్తి: చూ, మహాలక్ష్మి. 3.
కామేశ్వరుఁడు, సం. వి. అ. పుం. సగుణబ్రహ్మము.
కామేష్టము, సం. వి. అ. పుం. రాచమామిడి*: చూ, మామిడి.
కామోత్సవము, సం. వి. అ. పుం. నూతనదంపతుల కలియిక: చూ, సంయోగము.
కామ్యదానము, సం. వి. అ. న. కోరినది ఇచ్చుట. ప్రవారణము: చూ, స్పర్శము. 3-౬.
కామ్యము, సం.వి.అ.న.1. అగ్నిహోత్రాది; విణ. 2. కోరఁదగినది: చూ, వాంఛ, 1-౩౨; పుం. 3. సర్జకము*: చూ, వేఁగిస.
కాయ, దే. వి. 1. చెట్టునఁగాచెడుకాయ: చూ, ఫలాటువు. 2; 2. కఠినవస్తుసంస్పర్శనముచే హస్తాదులయందు కాఁచెడు కాయ; భార. విరా. 2. ఆ. 221: (సం. ప.):— కిణము, ఖాటీ; 3. కంటితెవులు: చూ, హర్షణము. 3-౩; 4. పెసలు లోనగువాని పైతోలు: చూ, శింబ; 5. జూదమునందలి

కారడవి, ద్వ. వి. చిట్టడవి: చూ, విపినము.
కారపుగు, ద్వ. వి. (కారు + అపుగు) 1. రెండవకాపు; 2. అల్ప ధాన్యము: చూ, ధాన్యము.
కారణ, సం. వి. ఆ. స్త్రీ. కాఠియ: చూ, యాతన.
కారణగుణన్యాయము, న్యా. "కారణగుణాః కార్యేషు సంక్రామంతి" అనఁగా ఘటమున కుపాదానకారణమగు మంటి యొక్క గుణమైన నైల్యాదులు కార్యమగు ఘటమందుఁ గనఁబడును.
కారణనిబంధనాప్రస్తుతప్రశంస, సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అలంకారము: చూ, హేతువు. 2: (చూ, అలంకారము. 3.)
కారణమాల, అం. ఒకానొక అర్థాలంకారము.— పూర్వపూర్వములకుఁ గాని, ఉత్తరోత్తరములకుగాని క్రమముగ నొకదాని కొకటి హేతువులుగ వర్ణించుట ఉ:—విద్యవలన వినయము, వినయముచే గౌరవము, గౌరవమున ధనము, ధనముచేత ధర్మము, ధర్మమువలన మోక్షము గలుగుచున్నది: చూ, అలంకారము 3.
కారణము, సం వి. అ. న. 1. సబబు: చూ, హేతువు; 2. కొల: చూ, వధము; 3. ఉపకరణము: చూ, పనిముట్టు; అం. 4. లక్ష్యములు ఆజింటిలో నొకటి: చూ, లక్ష్యములు.
కారణికుఁడు, సం. విణ. పాత్రాపాత్రములఁ బరిశోధించువాఁడు: చూ, పరీక్షకుఁడు.
కారపుఁజెక్క, వై. వి. (కారము + చెక్క) ద్రాక్షత్వక్కు: చూ, తోలు. 1.
కారపుఁబడుగు, ద్వ. వి. (కారము + పడుగు) గట్టి నూలిపడుగు; హంస. 2, ఆ. 11: చూ, మగ్గము.
కారపుకిళ్ళి, వా. వి. మసాలావస్తువులు చేరిన తాంబూలము. (రూ-కారాకిళ్లి.)
కారపుమన్ను, ద్వ. వి. ఊషరమృత్తిక: చూ, భూమి. 1-౭.
కారభి, సం. వి. ఇ. పుం. ఇల్లింద*: చూ, మాపులుంగము.
కారభూషణుఁడు, సం. వి. అ. పుం. శాక్యబుద్ధదేవుఁడు: చూ, బుద్ధుడు. 1.
కారమిహిక, సం. వి. ఆ. స్త్రీ. కర్పూరము: చూ, సిరము.
కారము, సం. వి. అ. పుం. 1. = కోరు, కప్పము: చూ, సిస్తు.1; 2. ఏర్పాటు: చూ, నిజము. 2; 3. మంచుకొండ: చూ, పర్వతము; 4. ఆయతము: చూ, యత్నము; 5. కొల: చూ, వధము; అం. 6: చూ, రసములు; వై. వి. (1.) = క్షారః. ఒట్టు, ఒట్టుదనము, ఒట్టన, ఒట్టు, కారము, గాటు, (వా) వట్ట; (సం. ప.):— కటువు, క్షారము; (2) వస్త్రభావన పదార్థము: చూ, సబ్బు; (3) ఉప్పుమన్ను; భార. శాం. 3, ఆ. 364: చూ, భూమి. 1-౭; 4. నూలుతడిపెడి యొకానొక ద్రవద్రవ్య విశేషము; 5. బిడ్డలకుఁ బోసెడిమందు; చమ. 1, ఆ. 32: చూ, మందు. 1.
కారయిత, సం. విణ. కర్త: చూ, పనివాఁడు.
కారవల్లి, సం వి. ఈ. స్త్రీ. కాఁకర*: చూ, సుషవి. 1.
కారవి, సం. వి. ఈ స్త్రీ. 1. ఇంగువమాను*: చూ, హింగువు.1; 2. ఓమము*: చూ, యవాని; 3. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2-౧; 4. శతపుష్ప*: చూ, సదాప; 5. చిత్తానక్షత్రము, ముత్తెపుసవతు: చూ, నక్షత్రము. 1.
కారవేచి, సం. వి. ఈ. స్త్రీ. కారవి*: చూ, సదాప.
కారవుఁడు, సం. వి. అ. పుం. పిచ్చుకకుంటు: చూ, సూరనూతుఁచు.
కారవేల్లకము, సం. వి. అ. పుం. = కాఁకర*: చూ, సుషవి. 1.
కారవేల్లము, సం. వి. అ. పుం. = —పై.— (రూ-కారవల్లి)
కారస్కరము, సం వి. అ. పుం. ఒకవంకముచెట్టు: కాంపిలుకము, కుపీలువు.
కారస్కరాటిక, సం. వి. ఆ. స్త్రీ. శతపది, చెవిఁజొఱపాము: చూ, సర్పము. 1-౪-(౪౧).
కారాకిళ్ళి, వా. వి: చూ, రూ-కారపుకిళ్ళి.
కారాకు, దే.వి.(కారు + ఆకు) 1 చెట్టునపండిన ఆకు; పార. భీష్మ. 1, ఆ. 201: చూ, పర్ణము. 1; 2. ఎండాకు: చూ, పర్ణము. 1.
కారాహారము, దే. విణ. 1. కలఁగినది. చూ, మలినము 3; జా. 2 చిందఱవందఱ. ఉ. రా. 1, ఆ 75.
కారాగారము, సం. వి. అ న. చెఱ: చూ, బంధనాలయము: (చూ, సదనము. 1.)
కారాట, దే. వి. వ్యాపించుట: చూ, వ్యాపనము.
కారామళ్లు, దే. వి. బ. తెల్ల అలచందలు: చూ, రాజమాషము: (చూ, సంబకరి. 1-౨౬-౧౦).
కారాగుప్తుఁడు, సం. విణ. చెఱయందున్నవాఁడు.
కారాబ్రాహ్మణులు, అం. ఉత్కళ దేశమున వసించు బ్రాహ్మణులలో నొకతెగవారు. వీరు శుక్లయజుర్వేదులు. కాణ్వశాఖీయులు: చూ, బ్రాహ్మణులు.
కారాయిక, సం. వి. ఆ. స్త్రీ. పెద్దకక్కెర: చూ, బకము.
కారాలుమిరియాలునూఱుట, జా. మిక్కిలి కోపముచేయుట; మొదలు కారము, అందులో మిరియములు గూడ గలిపి నూఱినపక్షమున మఱింత కారముగానుండును. "నోరెఱుఁగని వానిపై కారాలు మిరియాలు నూఱుచు." (ధర్మజరాజసూయము)
కారావేశ్మ, సం. వి. న్. న. చెఱ: చూ, బంధనాలయము: (చూ, సదనము. 1.)
కారి, సం. వి. ఇ. స్త్రీ. 1 ఉత్తరప్రత్యుత్తరములు: కారిక; 2. నాఁగటిమేఁడి: చూ, మేఁడికోఁక; 3. ఒకానొక చెట్టు. కార్య.
కారించు, సం. స క్రి. = కారిక. నొగుల్చు; లక్ష్మీ. 2, ఆ. 113: చూ, బాధించు.
కారిక, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, కారి. 1; 2 = కాఠియ. తినుకు: చూ, యాతన; 3. కృతి, చేయుట: చూ, వ్యాపారము.1; 4. మంగలిపని: చూ, ముండనము; 5. నట్టువునిపెండ్లాము: చూ, భార్య; 6. పద్యము: చూ, వృత్తము. 1.
కారికము, దే. విణ. చలువచేయని క్రొత్తది. (బట్ట): చూ, వస్త్రము. 1-౩.
కారిజము, వై. వి. = కాలేయము రూ-కార్జము, కడుపులో నీరు తిత్తిక్రింద నుండెడి మాంసఖండ విశేషము, కాలఖండము; రుక్మాం. 3, ఆ. 226: చూ, యకృత్తు. (లివర్.)
కారిత, సం. వి. ఆ. స్త్రీ. అడిగినప్పుడిచ్చెడి వడ్డి, ఒడఁబాటు వడ్డి: చూ, వడ్డి.

కారితవృద్ధి, అం: చూ, ధనవృద్ధులు.

కారితుఁడు, సం. విణ. చూ, శిక్షితుఁడు.

కారియ, వై. వి. 1. రూ-కాటియ. నలుపు: చూ, వర్ణము. 6-ఒ; 2. = కారికా. రూ-కాటియ. వగ: చూ, శోకము. 2.

కారియము, వై. వి. 1 = కార్యమ్. కృత్యము, చేఁత: చూ, వ్యాపారము. 1; 2. = కార్యమ్ రూ-కర్జము, పని: చూ, ప్రయోజనము. 1.

కారీషము, సం. వి. అ. న. 1. కరీషముల సమూహము (కరీషము = ఎఱుపిడక): చూ, పిడక; 2. అథర్వణమంత్రముల సమూహము: చూ, ఆథర్వణము.

కారు, వై. వి = కాలః. 1. జ్యేష్ఠమాసము మొదలు నాలుగేసి నెలల కాలము. "ముక్కారు." ఆయుక్తి, (సం. ప.):— కందాయము. (ఆం, భా. మున తెలుగున కలదు): చూ, మాసద్వయము 2. వర్షఋతువు; పాండు. 4, ఆ. 19: చూ, మాసద్వయము; 3. అదను; "ననకారు.": చూ, సమయము. 1; 4. నలుపు; "కారుమొగులు": చూ, వర్ణము. 6-ఒ; దే. వి. 5. ఊషరపృథివి; భార. సౌ. 1, ఆ. 31: చూ, భూమి. 1-౽;6. అడవి; "కారుచిచ్చు": చూ, విపినము; 7. ఎండకాలమున పడ్డపి వరిధాన్యము: చూ, స్తంబకరి 1-౨౬-౧౧; ధాన్యము; (స్తంబకరి. 1-౪); "కారువడ్లు"; 8. ముదిమి; "కారాకు": చూ, ముసలితనము; 9 కోరకము, నన; "కారుపిందె"; చూ, మొగ్గ. 1; 10. రూ-కాఱు పటకారు: చూ, సందంశకము; వా. 11. ధూమశకటభేదము, రహదారిని పట్టు లోనగునవి లాగనక్కఱలేకుండఁగ పోవునది (బస్సు-మోటారు-మోటారుకారు; హ్రామ్, డిసెల్, కారు-రైలు.): చూ, పొగబండి.

కారుండి, సం. వి. ఈ. స్త్రీ జలగ. చూ, బుద్ధపిడుఁదు.

కారుకంద, దే. వి. రూ-కాఱుకంద, వనసూరణ*: చూ, సూరణము.

కారుకుఁడు, సం. విణ. వడ్లంగి: చూ, స్వస్తికారుఁడు

కారుకొను, ద్వ. అ. క్రి) రూ-కార్కొను-కాఱుకొను, నల్లబాఱు; భార. భీష్మ. 2, ఆ. 169: చూ, సంపడించు.

కారుకొమ్ముమెకము, ద్వ. వి దుప్పి: పృషతము: చూ, హరిణము. 1-౧.

కారుకొట్టి, వై. వి = కాకోలి*: చూ, వాయసోలి.

కారుకొల్లి, వై. వి. = —పై.—

కారుకోడి, ద్వ. వి. అడవికోడి: చూ, పుంజు. (రూ-కాఱుకోడి.)

కారుగచ్చ, ద్వ. వి. వాగుచి*: చూ, సోమరాజి.

కారుగృహము, సం. వి. అ. న. వడ్లవాఁడు పనిచేయుసాల, అన్వాసము: చూ, సదనము 1.

కారుచిచ్చు, ద్వ. వి. (రూ - కార్చిచ్చు - కాఱుచిచ్చు - కాఱ్చిచ్చు) దావానలము, ఎరగలి: చూ, వహ్ని. 1-౨౩.

కారుచు, దే. స. క్రి 1. ఒలుకు; (రూ-కార్చు-కాఱుచు): చూ; వచుచు; 2. కాఱఁజేయు: రూ-కార్చు-కాఱుచు.

కారుజము, సం. వి అ పుం. 1. కలుఁగానుగు, కాఱునువ్వు*: చూ, వార్షికము. 1; 2. జగడము: చూ, యుద్ధము; 3. నురుగు: చూ, ఫేనము; 4. గైరికము: చూ, శిలాజిత్తు; 5 నాభి, విషభేదము*: చూ, విషము. 1; 6. అగ్నికేసరము*: చూ, నాగకేసరము; 7. ఏనుఁగుపిల్ల: చూ, హస్తి. 1-(౬౯); 8. శిల్పచిత్రము: చూ, శిల్పము; 9. పుట్ట: చూ, వల్మీకము.

కారుజనము, ద్వ. వి. గిలిగిచ్చ*: చూ, శణపుష్పిక.

కారుజీవుఁడు, సం. విణ. వడ్లవాఁడు: చూ, సురకుఁడు.

కారుణ్యము, సం. వి. అ. న. రూ-కరుణ: చూ, దయ.

కారునువ్వు, దే. వి. జర్తిలము. రూ-కాఱునువ్వు*: చూ, వార్షికము. 1.

కారుపెసర, దే. వి. 1. ముద్గపర్ణి, పిల్లపెసర*: చూ, పెసర; 2. వనముద్గము*: చూ, పెసర. (రూ-కాఱుపెసర.)

కారుపోఁక, ద్వ. వి. కైలపూగము*: చూ, పోఁక.

కారుపోఁతు, దే. వి. కాఱుమన్ను: చూ, మహిషము.

కారుబుడము, దే. వి. తీవ్రగంధము*: చూ, బుడము.

కారుమినుము, దే. వి. మాషపర్ణి. రూ-కాఱుమినుము*: చూ, మినుము.

కారుమునగ, ద్వ. వి. వనశిగ్రువు*: చూ, శిగ్రువు

కారువు, సం వి. ఉ. పుం. 1. విశ్వకర్మ: చూ, పనివాఁడు; విణ. 2.—పై.—; 3. వడ్లంగి, శిల్పి: చూ, స్వస్తికారుఁడు.

కారుషుఁడు, సం. వి. అ. పుం. 1. కరూషదేశస్థుఁడు: రూ-కారూషుఁడు-కారూషుఁడు; 2. కరూశదేశాధిపతి: రూ-కారూషుఁడు-కారూషుఁడు.

కారూత్తముఁడు. సం. విణ. శిల్పులలో శ్రేష్ఠుఁడు: చూ, స్వస్తికారుఁడు.

కారూరు, దే. వి. (కారు + ఊరు) అడవిపల్లె; హరి. పూ. 5, ఆ. 143: చూ, దేశము.

కారూశము, సం. వి. అ. పుం. బృహత్సంహితోక్తదేశము: చూ, దేశము.

కారూశుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-కారుషుఁడు.

కారూషుఁడు, సం. వి. అ. పుం: చూ, కారూశుఁడు.

కారె, వై. వి. = క్షార. ఉప్పుగడ్డి*: చూ, తృణము. 1.

కారెము, దే. వి. మక్కుటనీరెత్తెడు తాటిదోనె: చూ, తలము. 2.

కారేలకి, ద్వ. వి.(కారు + ఏలకి)ఏలాపర్ణి*: చూ, సన్నరాష్ట్రము.

కారోత్తమము, సం. వి. అ. పుం, కల్లుమీఁది: చూ, (సురామండము). సుర. 2-౨౧; (సుర. 2-౧౪.)

కారోత్తరము, సం వి. అ. పుం. 1. సురాగ్రభాగము: చూ, సుర; 2. బావి: చూ, సరస్సు. 1-౧౫.

కార్కటకము. అం: చూ, ఉత్తానకరణబంధములు.

కార్కటము, సం. వి. అ. న. 1.—పై—; 2 రతిబంధవిశేషము: చూ, రతిబంధములు.

కార్కరకము, సం.వి.అ.పుం. పాలసురుగు: చూ, స్తన్యము. 1-౫.

కార్కరికము, —పై.—

కార్కశ్యము, సం. వి. అ. న. = కఱకుఁదనము, గట్టి: చూ, బెడిదము.

కార్కొను, ద్వ. అ. క్రి: చూ, రూ-కారుకొను.

కార్ఖానా, ఖార్ఖానా. వా. పనిచేయుస్థలము.

కార్చిచ్చు, దే. వి. రూ-కారుచిచ్చు: చూ, వహ్ని. 1-౨౩.

కార్చు, దే. స. క్రి: చూ, రూ-కారుచు.

కార్జము, వై. వి. = కాలేయము: చూ, రూ-కాలిజము. (లివర్).

కార్తవీర్యంపువు, సం. వి. ఉ. పుం. జమదగ్నికొడుకు: చూ, పరశురాముఁడు.

కార్తవీర్యార్జునుఁడు, అం. 1: చూ, చక్రవర్తులు; పుం. 2. బాహుసహస్రభృత్తు: చూ, హైహయుఁడు.

కార్తవీర్యుఁడు, సం. వి. అ. పుం. బాహుసహస్రభృత్తు: చూ, హైహయుఁడు.

కార్తస్వరము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. పెద్దదీనధ్వని: చూ, స్వరము. 2-౪౬-(౭౩).

కార్తాంతికుఁడు, సం. వి. అ. పుం. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు.

కార్తికము, సం. వి. అ. పుం. కత్తెరనెల: చూ, మాసము. 1. (రూ-కార్తీకము - కార్తికికము - కృత్తికానక్షత్రయుక్తమైన పున్నమగలనెల. శత్రుల గెలువ నిశ్చయించినవారికి నుత్సాహముగలది.)

కార్తికి, సం. వి. ఈ. స్త్రీ. విశ్వేదేవులలో భేదము. తద్విశేషములు.— కాలుఁడు, కువేరుఁడు, కుష్మాండుఁడు, క్రతువు, క్షేత్రపాలుఁడు-ఇ. మొ: చూ, విశ్వేదేవులు.

కార్తికికము, సం. వి. అ. పుం: చూ, కార్తికము.

కార్తికేయుఁడు, సం. వి. అ. పుం. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

కార్తికేయప్రసువు, సం. వి. ఊ. స్త్రీ. వెనకయ్యతల్లి: చూ, పార్వతి. 1.

కార్తికోత్సవము, సం. వి. అ. పుం. చంద్రిక: చూ, వెన్నెల.

కార్తీకము, అం: చూ, కార్తికము: చూ, మాసములు.

కార్తస్వరి (?), సం. వి. ఆ. స్త్రీ. 1. భుజంగాక్షి*: చూ, సర్పాక్షీ; 2. ఏలాపర్ణి*: చూ, పిరంగిచెక్క.

కార్త్స్న్యము, సం. వి. అ. న. అంతయు: చూ, సర్వము.

కార్తె, వై. వి. 1. = కృత్తికా. కృత్తికానక్షత్రము; భార. అను. 2, ఆ. 378: చూ, రిక్క. 1-౩; 2. = క్రాంతి. సూర్యుఁ డుండు నక్షత్రము; "చిత్తకార్తె, స్వాతికార్తె" మొ: చూ, నక్షత్రము. 1.

కార్దమి, సం. వి. ఇ. పుం. కడలిఱేఁడు: చూ, వరుణుఁడు.

కార్దమికము, సం. విణ. బురదలోఁగూడుకొన్నది: కార్దమికి.

కార్దమికి, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కార్దముఁడు, సం. వి. అ. పుం: చూ, కార్దమి.

కార్పటము, సం. వి. అ. పుం. 1. లాక్ష: చూ, లక్క; విణ. 2. చింపిగుడ్డల సంబంధమయినది.

కార్పటికుఁడు, సం. వి. అ. పుం. 1. = కోమటి: చూ, వైశ్యుఁడు; 2. తీర్థము మోసికొనిపోయెడు బాటసారి: చూ, పాంథుఁడు; 3. పరాయివానిగుట్టు తెలిసినవాఁడు: రూ- కార్పాటకుఁడు.

కార్పణ్యము, స. వి. అ. న. 1. కృపణత్వము; 2. విషవిశేషము: చూ, విషము. 1.

కార్పాటకుఁడు, సం. వి. అ. పుం. 1. పరాయివానిగుట్టు తెలిసిన వాఁడు: చూ, కార్పటికుఁడు. 3; 2. సినువుఁడు: చూ, శిష్యుఁడు.

కార్పారి, వై. వి. = కార్యకారి: చూ, వ్యవహర్త. 2.

కార్పాసనాసిక, సం. వి. ఆ. స్త్రీ. కదురు: చూ, తర్కువు.

కార్పాసము, సం. వి. అ. పుం, న. 1. రూ-కర్పాసము*: చూ, ప్రత్తి; విణ. 2 నూలిచేత నేయఁబడినది (చీర): చూ, వస్త్రము 1-౧. (1-౧౦౩.)

కార్పాసి, సం వి. ఈ. స్త్రీ. రూ-కర్పాసి*: చూ, ప్రత్తి.

కార్పాసిక, సం, వి. ఆ. స్త్రీ. —పై —

కార్పారి, వై. వి. = కార్యకారి. రూ-కార్పారి: చూ, వ్యవహర్త. 2.

కార్భీజ, వ్య. వి. అవవిగిజ*: చూ, వీజ. 2.

కార్బురము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. దోసము: చూ, పాపము; 3 జలము: చూ, నీరు. 1; 4. ఆకాశము: చూ, విన్ను; విణ 5. బంగరుచేఁజేయఁ బడినది.

కార్మణము, సం. వి. అ. న, 1. చిల్లింగి, మూలికలచేతఁజేసెడి యుచ్చాటనాదిక్రియ: చూ, మూంకర్మ; విణ. 2. నెఱవేఱు దాఁకఁ బనిచేయునది; పు. 3. హింసాకర్మ.

కార్మణశీలుఁడు, సం. విణ: చూ, లోపుదోరు. 2.

కార్మిఁడు, సం. విణ: చూ, కర్మశీలుఁడు.

కార్ముకము, సం. వి. అ. న. 1. విల్లు: చూ, బాణము. 1-౩౭; 2 శాస్త్రము: చూ, శాస్త్రములు; పుం. 3. వెదురు*: చూ, వేణువు; 4. పెద్దవేప*: చూ, వేము; 5. తెల్లతుమ్మ*: చూ, విట్టదిరము; 6. కులము: చూ, వంగడము; అం. 7 . ఇది . చాపము, ధనుస్సు, కోదండము అని త్రివిధము. (ఇది బ్రాహ్మణునకు ఉపనయనకాలమునందు యజ్ఞోపవీతధారణము వలెను క్షత్రియునకు వామభుజాగ్రమందు నాఁటరక్షణ దీక్ష పూర్వకముగను ధరింపఁదగినదిగా వేదవిధివాక్యములచేత విధింపఁబడియున్నది): చూ, బాణము. 1-౧౯. (1-౩౯ )

కార్ముకుఁడు, సం. విణ: చూ, పనివాఁడు.

కార్య, సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకచెట్టు: చూ, కారి 3: (చూ, వృక్షము.) [పెద్దచి.

కార్యంలఘు; ప్రయోజనంగుర్వేన, కార్యముచిన్నది. లాభము

కార్యకము, సం. వి. అ. పుం. దూసరతీఁగె*: చూ, వత్సాదని.

కార్యకర్త, సం. వి. ఋ పుం. ఉత్సాహముచేఁ బనులు చేయు వాఁడు: చూ, వ్యవహర్త. 2.

కార్యకారణన్యాయము, న్యా. కార్యవస్తువుంబట్టి కారణవస్తువు ఉన్నట్లూహించురీతి.

కార్యకారి, సం. వి. న్. పుం: చూ, కార్యకర్త.

కార్యకుశలుఁడు, సం. విణ. —పై.—

కార్యకూటుఁడు, సం. వి. అ. పుం. 1. పిసినిగొట్టు: చూ, లోభి; 2. ఉన్మత్తుఁడు: చూ, వెఱ్ఱివాఁడు; 3. ఉన్మాదుఁడు. మార కుఁడు.

కార్యక్షముఁడు, సం. విణ, తాపములేనివాఁడు: చూ, వేడిమి లేనివాఁడు.

కార్యత్రయము, అం. సృష్టి, స్థితి, లయములు, (3): చూ, త్రయము.

కార్యదర్శి, సం. విణ: చూ, కార్యకర్త.

కార్యనిబంధనాప్రస్తుతప్రశంస, సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అలంకారము: చూ, హేతువు. 2.

కార్యపుటము, సం. వి అ. పుం. 1. అశుచిభావము: చూ, క్షపణము; 2. ఉన్మత్తు*: చూ, హాలాపుష్పము.

కార్యప్రద్వేషము, సం. వి. అ. పుం. ఆలస్యము: చూ, విలంబము. 1.

కార్యము, సం. వి. అ. న. 1. = కారియము. కృత్యము: చూ, వ్యాపారము. 1; 2. = కర్జము. పని: చూ, ప్రయోజనము. 1; 3. కారణము: చూ, హేతువు; వా. 4. సంపూర్ణఫలప్రాప్తి. ఫలాగమము. ఫలవంతమైనకృత్యము, కార్యము; వా. 5, గర్భాధానము. "మా అబ్బాయికార్యము, ఆశీర్వాదమునకు తాంబూలమునకు దయచేయండి." (వివాహమందును కార్యము వాడుక.)

కార్యములుగట్టెక్కించుట, జా. నెఱవేర్చుట. "సమరంబున నరినేలమట్టి కార్యము గట్టెంచుకొనువాఁడను." (ధర్మజరాజసూయము)

కార్యసముద్భవుఁడు, వా. వి. స్వపక్షమువారేడుగురిలో నొకఁడు: చూ, అహిభయము.

కార్యసిద్ధి, అం. అంగపంచకములోనొకటి: చూ, అంగపంచకము.

కార్యాధికారి, అం. 1. సాక్షులు పండ్రెండుగురిలో నొకఁడు: చూ, సాక్షులు; 2. అకృతసాక్షులలో నొకఁడు: చూ, అకృతసాక్షులు.

కార్యార్థిన్యాయము, న్యా. కార్యములఁ గోరినవారికి గర్వమేల? గర్వమువలనఁ గార్యము చెడుననుకీతి.

కార్మునగ, ద్వ. వి. రూ-కారుమునగ, వనశిగ్రువు*: చూ, శిగ్రువు. 1.

కార్మ్యము, సం. వి. అ. పుం. 1. సర్జము*: చూ, సాలము. 3-అ; 2. ద్వాదశావస్థలు: (చూ, అవస్థలు.)

కార్షకుఁడు, సం. వి. అ. పుం. 1. అరకాఁడు: చూ, వ్యవసాయి; 2. ఆకర్షించువాఁడు: చూ, తిగుచువాఁడు.

కార్షాపణము, సం. వి అ. పుం. 1. పదియాఱుపణముల యెత్తు; 2. కర్షమెత్తు వెండిటంకము: కార్షికము.

కార్షి, సం. వి. ఈ. స్త్రీ. నీటిప్రాచి*: చూ, శైవలము. 1.

కార్షికము, సం. వి. అ. పుం. కర్షమెత్తు వెండిటంకము: కార్షాపణము 2.

కార్షుఁడు, సం. విశ. అరకాఁడు: చూ, వ్యవసాయి.

కార్ష్యము: చూ, రూ-కార్శ్యము*. 1.

కార్ష్ణి, సం. వి. ఇ. పుం. 1. మరుఁడు: చూ, మన్మథుఁడు; ఈ. స్త్రీ. 2. పిల్లపీఁచర*: చూ, శతమూలి.

కార్ష్ణ్యము, సం. వి. అ. న. నలుపు: చూ, వర్ణము. 6-ఉ.

కాఱించు, దే. స. క్రి. ఏఁచు: చూ, బాధించు.

కాఱియ, వై. వి. రూ-కారియ, 1. నలుపు: చూ, వర్ణము. 6-ఉ; 2. = కారికా. వగ: చూ, దుఃఖము; 3. = కారికా. తినుకు; హరి, ఉ. 1, ఆ. 163: చూ, యాతన; 4. కష్టము. చూ, శోకము.

కాఱియపడు, వై. అ. క్రి. యాతనపడు; రా. సుం, కాం. 222: చూ, తినుకు.

కాఱియపెట్టు, ద్వ. స. క్రి. యాతనపఱచు; భార. అను. 5, ఆ. 373.

కాఱు, దే. వి. 1. అజ్ఞానము; భార. అను. 4, ఆ. 202: చూ, మఱపు. 2; 2. కిఱ్ఱు, డాగు: చూ, మఱుక; 3. (రూ-కారు-పటకాఱు-సటుకాఱు-పట్టుకాఱు-నీరుకాఱు) కంపాలిపనిముట్టు: చూ, సందంశకము; విశ 4. వట్టము; భార, ఆది. 4, ఆ. 19: చూ, సాంద్రము. 2; 5. మిక్కిలి కాఱుట: చూ, స్రవణము; దే. అ. క్రి, వై. అ. క్రి. 6. = క్షరణ. వడియు: చూ, స్రవించు; దే. అ. క్రి. 7. ఊడు; హరి. పూ, 4, ఆ. 148: చూ, రాలు.

కాఱుకంద, దే. వి. రూ-కారుకంద*.

కాఱుకొను, దే. అ. క్రి: చూ, రూ-కార్కొను-కారుకొను.

కాఱుకోడి, ద్వ. వి: చూ, రూ-కారుకోడి.

కాఱుచిచ్చు, ద్వ. వి: చూ, రూ-కాఱుచిచ్చు.

కాఱుచు, దే. స. క్రి: చూ, రూ-కారుచు.

కాఱుదున్న, దే. వి: చూ, కారుపోఁతు.

కాఱునువ్వు, దే. వి. జర్తిలము*: చూ, రూ-కారునూవు.

కాఱుపెసర, దే. వి: చూ, కారుపెసర.

కాఱుపోఁతు, దే. వి: చూ, రూ-కారుపోఁతు. (రూ-కార్పోఁతు).

కాఱుమినుము. దే. వి: చూ, రూ-కారుమినుము.

కాఱులు, దే. వి. బ. 1. రూ - కాఱొడ్డెము - కఱుకులు - కరుసు. కల్ల: అప్ప. అ. కాం. 30: చూ, వితథము; 2. కష్టపిఱుపు మాట; పర. 3, ఆ. 294: చూ, పరుషము; 3. శూన్యమగు మాట; భార. ఉద్యో. 3, ఆ. 107: చూ, వ్యాఖ్యాతము. 2.

కాఱెనుఁబోఁతు, ద్వ. వి: చూ, కారుపోఁతు.

కాఱొడ్డెము, దే. వి. కష్టపిఱుపుమాట: చూ, పరుషము. (ఆం. భా. ప్ర. వాగ్వ. 117.)

కాఱ్చిచ్చు, ద్వ. వి. 1. దావానలము: చూ, రూ-కాఱుచిచ్చు; 2. కుక్కుటభేదము: చూ, పుంజు; 3. ఒకానొక వేఁటకుక్క: చూ, శునకము.

కాల, సం. వి. ఆ. స్త్రీ. 1.కలిగొట్టు*. చూ, స్థాలి. 2; 2. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి.2-గ: 3. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి; 4. నీలి*: చూ, రంజని; 5. మంజిష్ఠ*: చూ, మంజిటి.

కాలంకతము, సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

కాలంజరము, సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము. 1.

కాలంజరి, సం. వి ఈ. స్త్రీ. గర్భామాలి: చూ, పార్వతి. 1.

కాలంజరుఁడు, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కాలకంటకము, సం. వి. అ. పుం. రూ-కాలకంఠకము. కూకుడుగుండంగి: చూ, దాత్యూహము.

కాలకంఠకము, సం. వి. అ. పుం. —పై.—

కాలకంఠము, సం. వి అ. పుం. —పై.—; 2. ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక; 3. నెమలి: చూ, మయూరము; 4. ఏట్రింత: చూ, వ్యాఘ్రాటము 5. సర్జకము*: చూ, వేఁగిస.

కాలకంఠిక, సం. వి. ఆ. స్త్రీ. జ్యేష్ఠాదేవి: చూ, పెద్దమ్మ. 1.

కాలకంఠుఁడు, సం వి అ. పుం 1. కఱకంఠుఁడు: చూ, శివుఁడు; 2. జముఁడు: చూ, యముఁడు.

కాలకంఠకము, సం. వి. అ. పుం. నీరుపాము: చూ, సర్పము. 1-ళ-(౨౭).

కాలకము, సం. వి. అ. పుం. తిలకము. పుట్టుమచ్చ: చూ, లక్షణము. 1-౨౭.

కాలకర్ణి, సం. వి. ఈ. స్త్రీ. కాలకంఠిక: చూ, పెద్దమ్మ. 1.
కాలకర్ణిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—
కాలకలన, సం. వి. ఆ. స్త్రీ. కాలముయొక్క యేర్పాటు: చూ, కాలనియతి, కాలనియమము.
కాలకలము, సం. వి. అ. న. కృకము, ముచ్చిలిగుంటమీఁది బుడిపి: చూ, బుడిపి.
కాలకాములు, అం. ఇద్దఱు విశ్వేదేవులు; విశ్వేదేవులు అయిదు గురిలో నొకరు: చూ, విశ్వేదేవులు.
కాలకాఁడు, సం. వి. అ. పుం. కఱకంఠుఁడు: చూ, శివుఁడు.
కాలకాహము, సం. వి. అ. న. ఇనుము: చూ, లోహము 1.
కాలకిలము, సం. వి. అ. పుం. కోలాహలము: చూ, స్వరము. 2.
కాలకంయుఁడు, సం. వి. అ. పుం. జముఁడు: చూ, యముఁడు
కాలకుంతి, సం. వి. ఈ. స్త్రీ. గచ్చ*: చూ, సోమరాజి.
కాలకుద్ధుఁడు, సం. వి. అ. పుం. జముఁడు: చూ, యముఁడు.
కాలకుష్ఠము, సం. వి. అ. న. కాకపుష్ఠము, కంపుష్ఠమను గజజాత గ్రంథ్యము: చూ, రాజార్హము. 1-౪.
కాలకూటము, సం. వి. అ. న. 1. విషభేదము: చూ, విసము. 1; 2. విషవిద్యాతంత్రము: చూ, మాయము. 1; 3. ఆయుర్వే దౌషధములలో నొకటి.
కాలకృత్తు, సం. వి. త్. పుం. సూర్యుఁడు: చూ, సూర్యుఁడు.
కాలక్షేపము, సం. వి. అ. పుం. 1. సర్గప్రతివర్గాది పంచలక్షణ ములతోఁ గూడిన బ్రాహ్మాది. ఇవి పదునెనిమిది: చూ, పురాణ ములు; వా. 2. వృథాగాచేయు నాలస్యము: చూ, విలంబము. 1.
కాలఖంజనము, సం. వి. అ. న: చూ, కారిజము.
కాలఖండము. —పై.—
కాలగుంజ, సం. వి. ఆ. స్త్రీ. నల్లగురివెంద*: చూ, తులాబీజము.
కాలగ్రంథి. సం. వి. ఇ. పుం. ఏఁడాది: చూ, సంవత్సరము.
కాలచక్రము, సం. వి. అ. న. 1. కాలరూపమైన చక్రము: అం 2: చూ, అస్త్రములు. (దండచక్రము, కాలచక్రము, విష్ణు చక్రము మొ.)
కాలజము, అం: చూ, మేఘములు.
కాలజ్ఞము, సం వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. కోయిల: చూ, పికము.
కాలజ్ఞుఁడు, సం. వి. అ. పుం. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు.
కాలటుక, దే. వి. (కాలు + అటుక) కుండలు. దించుటకై రెండు మొనలు ఇరుప్రక్కల గోడలయందుఁ బొదిగి యాఁతగాఁ గాఁల్లుంచి యడ్డముగా నమర్చిన మ్రాను.
కాలతాళము, సం. వి. అ. పుం. ఉలిమిరి*: చూ, శ్వేతపుష్పము.
కాలతులసి, సం. వి. ఈ. స్త్రీ. రామతులసి: చూ, హరిప్రియ. 3-౩.
కాలత్రయము, అం. భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమాన కాలము. (3): చూ, త్రయము.
కాలధర్మము, సం. వి. అ. పుం. 1. చావు: చూ, సావు; 2. కాలముయొక్క ధర్మము.
కాలధామము, సం. వి. అ. పుం. = కతిమాపము, కచమాలము: చూ, పొగ.
కాలనిర్యాసము, సం. వి. అ. పుం. గుగ్గిలము*: చూ, మహిసాక్షి.
కాలనేమియవహారి, సం. వి. ఇ. పుం. వెన్నుఁడు; (త్రికాండ శేషము, సర్గ. 31.): చూ, విష్ణువు 1.
కాలనేమిరిపువు, సం. వి. ఉ. పుం.—పై.—
కాలపంచకము, అం. ప్రాతస్సంగమ మధ్యాహ్నాపరాహ్ణ సాయం కాలములు. (5).
కాలపత్రి సం. వి. ఈ. స్త్రీ. గచ్చ*: చూ, సోమరాజి.
కాలపర్ణము, సం. వి. అ. పుం నంది*: చూ, నందివర్ధనము.
కాలపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. ముయ్యాకుపొన్న*: చూ, వాలపర్ణి.
కాలపాలకము, సం. వి. అ. న. కంకుష్ఠమృత్తిక: చూ, భూమి. 1-౩౦.
కాలపాశము, అం: చూ, అస్త్రములు. (ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము మొ.)
కాలపీయకము, సం. వి. అ. పుం: చూ, కారస్కరము*.
కాలపురుషదానము, అం. షోడశమహాదానములలో నొకటి: చూ, షోడశమహాదానములు.
కాలపురుషుఁడు, సం. వి. అ. పుం. 1. యముని సహాయుఁడు, 2 జ్యోతిశ్శాస్త్రము: చూ, జోస్యము: (చూ, శాస్త్రములు)
కాలపృష్ఠము, సం. వి. అ. న. 1. కర్ణుని విల్లు: చూ, బాణము. 1-౨౪; 2. విల్లు: చూ, బాణము. 1-౩౩; 3. ఒకరకము ఇఱ్ఱి: చూ, హరిణము. 1-౧౪-(౪); 4. కంకము: చూ, రాబందు.
కాలపేయి, సం. వి. ఈ. స్త్రీ. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి.
కాలప్రకాశిక, సం. వి. ఆ. స్త్రీ. ముహూర్తగ్రంథము.
కాలప్రభాతము, సం. వి. అ. న. శరదృతువు: చూ, మాస ద్వయము.
కాలప్రాణము, అం. (గాంధర్వ వేదమునందలి తాళాధ్యాయము లోనివి) ఇవి పండ్రెండు:—క్షణము, లవణము, కాష్ఠ, నిమే షము, కళ, చతుర్భాగము, అనుద్రుతము, ద్రుతము(బిందువు), లఘువు, గురువు, ప్లుతము. నిశ్శబ్దము, (కాకపదము).
కాలబలనము, సం. వి. అ. న. వర్మము, కవచము: చూ, వార వాణము.
కాలభృత్తు, సం వి. త్. పుం. ఒంటిపోఁగు: బలరాముఁడు: చూ, హలాయుధుఁడు.
కాలభాండిక, సం. వి. ఆ. స్త్రీ మంజిష్ఠ*: చూ, మంజటి.
కాలమానము, సం. వి. అ. పుం. 1. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము; వా. 2. కాలముయొక్కస్థితి.
కాలమాలము, సం. వి. అ. పుం: చూ, కాలమానము. 1.
కాలము, సం. వి. అ. పుం. 1. తఱి: చూ, సమయము. 1; (ఈశ్వర స్వరూపము. దీనిచేత లెక్కపెట్టఁబడును. ప్రేరే పింపఁ జేయునది. దీనివలన సుఖదుఃఖాదులీయఁబడుచున్నవి.) 2. చావు: చూ, సావు; 3. = కఱ. నలుపు: చూ, వర్ణము. 6-౬; 4. ఎఱ్ఱచిత్రమూలము *: చూ, వహ్నిసంజ్ఞికము; 5. తాడి*: చూ, తాడు. 2; 6. = కారు: చూ, కాలత్రయము; విశ. 7. = కఱ. నల్లనిది: చూ, వర్ణము. 6 ౬-(౧); అం. 8: చూ, తాళప్రాణములు: (చూ, తాళము. 2); 9: చూ, ద్రవ్యములు.

కాలములు, అం. 1.ఉదయము,మధ్యాహ్నము, సాయంత్రము.(3) (ప్రాహ్ణము, అపరాహ్ణము, మధ్యాహ్నము) : చూ, త్రయము; 2. గ్రీష్మము, వర్షము, శీతము, (3): చూ, త్రయము; 3: చూ, కాలత్రయము; 4: చూ, కాలపంచకము.
కాలముష్కకము, సం. వి. అ. పుం. ముష్కకము*: చూ, మొక్కము.(మొక్కపుచెట్టు.)
కాలమూలము, సం. వి. అ. పుం. ఎఱ్ఱ చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞికము.
కాలమేశి, సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠ*: చూ, మంజిష్ఠ.
కాలమేశిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.— (రూ-కాలమేషిక.)
కాలమేషి, సం. వి. ఈ. స్త్రీ. 1 —పై.—; 2. కారుగచ్చ*: చూ, సోమరాజి; 3, తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి.
కాలమేషిక, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, రూ-కాలమేశిక; 2. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి.
కాలయాపనము, వా: చూ, కాలక్షేపము. 2.
కాల(శ)యుక్తి, అం: చూ, సంవత్సరములు.
కాలరసము, సం. వి. అ. పుం: చూ, కుహిషాకము*.
కాలరాత్రి, సం. వి. ఇ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. ఒకానొక రాత్రి: చూ, రాత్రి; 3. భీమరథీనది: చూ, నది.
కాలరి, దే. వి. (కాలు + అరి) 1. కాలిబంటు. (రూ-కాలిబంటు-కాలుమానిసి-కాలుపుచ-కాల్వురు-కాల్బంటు.): చూ, భటుడు. 1; 2. రూ-కాలారి. దారిపన్ను: చూ, సిస్తు. 1-ఉ; 3. సమాచారమును దెలిసికొని పోయెడు వాడు; భార. ఉద్యో. 1, ఆ. 37: చూ, రాయబారి.
కాలలవణము, సం. వి. అ. న. బిడలవణము: చూ, లవణము.1.
కాలవ, వై. వి. = కుల్యా. రూ-కాలువ: చూ, నది.
కాలవలనము, సం. వి. అ. న. కవచము: చూ, వారవాణము.
కాలవిదుర్మిమసన్మక, సం. వి. ఆ. స్త్రీ. ఒకరకము తీగె*: చూ, లత. 1.
కాలవిలంబము, వా: చూ, కాలయాపనము.
కాలవిహీనత, అం: చూ, కాయకదోషములు.
కాలవృంత, సం. వి. ఆ. స్త్రీ పాటలి*: చూ, స్థాలి 2.
కాలవృంతము, సం. వి. అ. న. అడవిఉలవలు: చూ, సరటి.
కాలవృంతి, సం. వి. ఇ. స్త్రీ పాటలి*: చూ, స్థాలి. 2.
కాలశాకము, సం. వి. అ. పుం. కలివెపాకు*: చూ, ఐల.
కాలశారము, సం. వి. అ. పుం. ఉసుత: చూ, చికోర్జము.
కాలశాలి, సం. వి. ఇ. పుం. కృష్ణశాలి ధాన్యము: చూ, ధాన్యము
కాలశేయము, సం. వి. అ. న. చల్ల: చూ, మజ్జిగ.
కాలసర్పము, సం. వి. అ. పుం. కృష్ణసర్పము, నల్లత్రాచు: చూ, సర్పము. 1-౨.
కాలసారము, సం. వి. అ. న. పీతచందనము: చూ, వాసన. 1-౨.
కాలసూత్రము, సం. వి. అ.న. ఇనుపతంతులుగల నరకవిశేషము: చూ, నరకములు.
కాలసేయము, సం. వి. అ. న. చల్ల: చూ, మజ్జిగ.
కాలస్కంధము, సం. వి. అ. పుం. 1. చీకటిమ్రాను*: చూ, తమాలము; 2. తిందుకము*: చూ, తుమికె; 3. సర్జకము*: చూ, వేగిస; 4. పొగడ*: చూ, వకుళము.
కాలస్థాలి, సం. వి. ఈ. స్త్రీ. పాటలి*: చూ, స్థాలి. 2.
కాలస్యకుటిలాగతిః, న్యా. కాలము వంకరగా నడచును.
కాలహీనము, సం. వి. అ. పుం. లోధ్రము*: చూ, లొద్దుగ.
కాలాంజనము, సం. వి. అ. పుం. కాలాంజనపర్వతము: చూ, పర్వతము.
కాలాంజని, సం. వి. ఈ. స్త్రీ. పొట్టికొమ్మ లాదలుగల చెట్టు: చూ, హ్రస్వశాఖాశిఫము.
కాలాంతకుడు, సం. వి. అ పుం. ముక్కంటి: చూ, శివుడు.
కాలాంతరము, వా. వేఱుసమయము
కాలాక్షరికుడు, సం. వి. అ. పుం. కావ్యకర్త: చూ, శిక్షితాక్షరుడు
కాలాగురువు, సం. వి. ఉ. న. నల్లఅగరు: చూ, రాజార్హము. 1-౧౫.
కాలాగ్ని, సం. వి. ఇ. పుం. ప్రళయకాలమునందలి అగ్ని: చూ, వహ్ని. 1-౧౬.
కాలాగ్నిభైరవము, అం: చూ, తంత్రములు.
కాలాగ్రజుడు, సం. వి. అ. పుం: చూ, మనుష్య.
కాలానుజ, సం. వి. ఆ. స్త్రీ. యమునానది: చూ, నది.
కాలానుజుడు, సం. వి. అ. పుం. శని: చూ, శని.
కాలానునాది, సం. వి. న్. పుం 1. తుమ్మెద: చూ, భ్రమరము; 2. ఊరపిచ్చుక: చూ, పిచ్చుక; 3. కముజు: చూ, చాతకము; 4. చాతకము: చూ, వానకోయిల.
కాలానుశారిబ, సం. వి. ఆ స్త్రీ. తగరము: చూ, లోహము. 1.
కాలానుసారకము, సం. వి. అ. న. తగరము, నంది*: చూ, నందివర్ధనము.
కాలానుసారి, సం. వి. న్. న 1. దేవదారువంకలోఁ జేసిన ధూపద్రవ్యము: చూ, రాజార్హము. 1-౨౦; 2. మరియొక గంధద్రవ్యము: చూ, సిల్లకి; ఈ. స్త్రీ. 3. మామెన*: చూ, శారిబ.
కాలానుసార్యకము, సం. వి. అ. న జాపకమనెడి కొండయందుఁ బుట్టిన నల్లచందనము; నల్లఅగరు*:చూ, రాజార్హము. 1-౧౫.
కాలానుసార్యము, సం. వి. అ. పుం. న. ఇరుగుడు*: చూ, శింశప; న. 2. నల్లఅగరు*: చూ, రాజార్హము; 3 అశ్మపుష్పము*: చూ, రాపువ్వు; 4. తగరము, నంది*: చూ, నందివర్ధనము. (గ్రంథి తగరమని అభిధానరత్నమాల.)
కాలాపుడు, సం. వి. అ. పుం. 1. రక్కసుడు: చూ, రాక్షసుడు. 1; 2. నెమలి: చూ, మయూరము.
కాలాభుడు, సం. వి. అ. పుం. 1. నైరృతి: చూ, మూలజేఁడు; 2. జముడు: చూ, యముడు.
కాలాయసము, సం. వి. అ. న. ఇనుము: చూ, లోహము. 1.
కాలారి, దే. వి. రూ-కాలరి. దారిపన్ను: చూ, సిస్తు. 1-ఉ.
కాలి, సం. వి ఈ. స్త్రీ. రూ-కాళి. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. గౌరిభేదము: చూ, పార్వతి. 1; 3. మట్టుబచ్చలి*: చూ, బచ్చలి; 4. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2-౧; 5. నీలి*: చూ,రంజని; 6. సిరాముదిప్ప:చూ, సిరా; 7. క్రొత్తమబ్బు: చూ, మేఘము. 1; 8. శంతనునిభార్య: చూ, భార్య; న్. పుం. 9. పగటిజోతి: చూ, సూర్యుడు.

కాళింగము, సం. వి. అ. న. 1. ఒకానొకపండు: చూ, కాళింగము, కాళిందకము; పుం. 2. కర్కారుకము*: చూ, పుచ్చ; 3. ఏనుఁగు: చూ, హస్తి; 4: చూ, రూ. కాళింగము. 2.

కాళింగి, సం. వి. ఈ. స్త్రీ. పెద్దదోస*: చూ, హరివాలుకము. 1-౨.

కాళింగిక, సం వి ఆ. స్త్రీ. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

కాళింగుఁడు, సం. వి. అ. పుం. రూ - కాళింగుఁడు. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. కాళింగుఁడను పాము: చూ, సర్పము. 1-౧; 3. మంత్రవిద్య తెలిసినవాఁడు: చూ, మాంత్రికుఁడు: 4. కళింగదేశపు రాజు: చూ, రాజు. 1-౩౫.

కాళిందకము, సం. వి. అ. న. ఒకరకము పండు: చూ, కాళింగము. 1.

కాళింది, సం వి. ఇ పుం. రూ-కాళింది. 1. నీటి యావు: చూ, ధేనువు; ఈ. స్త్రీ 2. యమునానది: చూ, నది; 3. చిఱుతేఁకు*: చూ, బారంగి; 4. కాకిదొండ*: చూ, దొండ; 5. గింజెన*: చూ, దింజెన; 6 సగరమహారాజు తల్లి: కాళింది; 7. కృష్ణుని అష్టభార్యలలో నొకతె: కాళింది; 8. కాళిందియను నది: చూ, నది.

కాళిందీకర్షణుఁడు, సం. వి. అ. పుం. రూ-కాళిందీకర్షణుఁడు. ఒంటిపోఁగు: చూ, బలరాముఁడు.

కాళిందీభేదనుఁడు, సం. వి. అ. పుం రూ-కాళిందీభేదనుఁడు. —పై.—

కాళిందీసువు, సం. వి. ఊ. స్త్రీ. 1. సూర్యునిభార్య: చూ, భార్య; 2. యమునితల్లి.

కాళిందీసోదరుఁడు, సం. వి. అ. పుం. జముఁడు: చూ, యముఁడు.

కాళిక, సం. వి. ఆ. స్త్రీ. రూ-కాళిక. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. పార్వతీభేదము: చూ, పార్వతి. 1; 3. ద్రుపదరాజు కూఁతురు: చూ, నూన. 1-౭; 4. అగ్నిచిత్తు: చూ, బొగ్గు; 5. నలుపు: చూ, వర్ణము. 6-౬; 6. చీఁకటి: చూ, మేచకము. 1; 7. ఆఁడుకాకి: చూ, వాయసము; 8. నూఁగారు: చూ, రోమరాజి; 9. పొగబంతి: చూ, పొగ; 10. బంగారునందలి దోషము: చూ, లోహము 1; 11. కల్లు: చూ, సుర. 1; 12 క్రొత్తమబ్బు: చూ, మేఘము. 1; 13. మబ్బుగుంపు: చూ, మేఘము. 1; 14. వెల్లఁబాటు: చూ, వైవర్ణ్యము; 15. తేలు: చూ, వృశ్చికము. 1; 16. పాలలోని పురుగు, క్షీరకీటకము: చూ, పురుగు; 17. నెలవడ్డి: చూ, వడ్డి; 18. జటామాంసి*: చూ, మాంసి 1; 19. తేలుకొండి*: చూ, వృశ్చికము. 2; 20. పబోలి*: చూ, పొట్ల; 21. కాళికాదేవి: చూ, మహాలక్ష్మి. 3.

కాలికంచము, దే. వి. బాలక్రీడా విశేషము: చూ, బాలక్రీడ.

కాలికము, సం. వి. అ. న. 1. నల్లఅగలు: చూ, రాజార్హము. 1-౧౫; 2. అగ్నిచిత్తు: చూ, బొగ్గు.

కాలికవృద్ధి, అం: చూ, ధనవృద్ధులు.

కాలితనయము, సం. వి. అ. పుం. దున్నపోతు: చూ, మహిషము.

కాలిత్రొక్కుపాటు, దే. వి. ఉద్ఘాతము: చూ, కాలుజాఱుట.

కాలిత్రోవ, దే. వి. (కాలు + త్రోవ) ఒకఁడు నడిచిపోఁదగిన దారి: చూ, మార్గము. 1.

కాలినడ, దే. వి. (కాలు + నడ) రూ-కాల్నడ: చూ, పాదచారము.

కాలిని, సం. వి. ఈ. స్త్రీ. ఆర్ద్రానక్షత్రము: చూ, రిక్క. 1-౬.

కాలిపాదువ, దే. వి: చూ, మల్లశాస్త్రము.

కాలిపుట్టువు, దే. వి. (కాలు + పుట్టువు) అడుగుపుట్టువు: చూ, శూద్రుఁడు.

కాలిబంటు, ద్వ. వి. (కాలు + బంటు) పదాతి. రూ-కాల్బంటు: చూ, భటుఁడు. 1.

కాలిబోను, దే. వి. (కాలు + బోను) మృగముల కాళ్ళు తగులుకొన నొడ్డియుండెడి యురితో సంతసపఱచిన మ్రాను; స్వా. 4, ఆ. 37: చూ, బోను.

కాలియ, వై. వి. = కాళికా. పిశాచము; మార్క. 1, ఆ. 236: చూ, భూతము.

కాలియెబ్రాహ్మణులు, అం. కపూరియెబ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు: (చూ, కపూరియెబ్రాహ్మణులు.)

కాలిసంకెల, జా. అడ్డగింత. నిరోధము. "తరుణీతనుగంధము కాలిసంకెలై నెరయఁగఁల్చి." (కువలయాశ్వ చరిత్ర.)

కాలీకము, సం. వి. అ. పుం. కొంగ: చూ, బకము. (రూ-కలీకము.)

కాలీచి, సం. వి. ఈ. స్త్రీ. 1. = కచ్చేరి. న్యాయవిచారణస్థలము: చూ, సభ. 2; 2. = కచ్చేరి. యముని కొలువుపావడి. త్రి. శే: చూ, సభ. 2. ఆం. 3. బాలురు చదువుచోటు: చూ, పాఠశాల, (రూ-కాలేజి.): (చూ, సదనము. 1.)

కాలీపతి, సం. వి. ఇ పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కాలీయకము, సం. వి. అ. న. 1. పీతవర్ణసుగంధి కాష్ఠము: చూ, రాజార్హము. 1-౧౫; 2. దారుహరిద్ర*: చూ, మ్రానిపసుపు.

కాలీయము, సం. వి. అ. న. 1. నల్లఅగలు, జాపకపర్వతమునఁ బుట్టిన కృష్ణచందనము: చూ, రాజార్హము. 1-౧౫; పుం. 2. కాళీయసర్పము: చూ, సర్పము. 1-౪-(౭).

కాలీశుఁడు, సం. వి. అ. పుం 1. ముక్కంటి: చూ, శివుఁడు; 2. నీటిజేఁడు: చూ, వరుణుఁడు.

కాలు, దే. వి. 1. అడుగు: చూ, పాదము. 1; 2. $\frac{1}{4}$ భాగము: చూ, పాతిక; 3. మంచపుఁగోడు లోనగునది. "కంగటికాలు నమ్మఁదగుకైదువు." జై. 5, ఆ. 85: చూ, స్తంభము. 1-౫: (చూ, మంచపుకోడు); 4. బొట్టనవ్రేలు మొదలు తొడవరకు; అంఘ్రి. 4; అ. క్రి. 5. దగ్ధమగు: చూ, మండు.

కాలుఁడు, సం. వి. అ పుం. 1. జముఁడు: చూ, యముఁడు; 2. దేవగణ విశేషము: చూ, దేవతావిశేషము. 3. ముక్కంటి: చూ, శివుఁడు; 4. శని: చూ, శని.

కాలుకొను, దే. స. క్రి. కాలూఁదు: రూ-కాల్కొను, కాలుకొలుపు.

కాలుకొలుపు, దే. ప్రే. —పై.—

కాలుగదల్చుట, జా. నడచుట, వెళ్లుట. "తమరు కాసంత కాలుగదల్చినంతన మెంతటివారును." (ధర్మజరాజవిజయము.)

కాలుచు, దే. స. క్రి. రూ-కాల్చు: చూ, దహించు.

కాలుచ్చులు, దే. వి. బ. తేళ్ళు మొదలగువానిని పట్టుటకు నుపయోగమగు రజ్జుసాధనము: చూ, వాగుర.

కాలుజాఱుట, ద్వ. వి: కాలితొట్రుపాటు; (సం. ప):—ఉద్ఘాతము. (కాలుజాఱినను నోరుజాఱినను కూడిరానేరవు)"

కాలుత్రొక్కుకొనవచ్చుట, జా. వెంబడివచ్చుట. "మీకునుమాఱను నీవైరంబెక్కడనుండి కాలుత్రొక్కుకొని వచ్చెనో యెఱుఁగను." (ధర్మజరాజసూయము)

కాలుద్రవ్వుట, జా. కయ్యమునకుసిద్ధపడుట-ఆఁబోతు పొట్లాడునపుడు కాలిచే నేలత్రవ్వును. అందువలన రెండవవానికి రోషమెక్కును. "దవ్వుదవ్వుగాఁ నిలిచి చివ్వకుఁ గాలు ద్రవ్వుచు." (ధర్మజరాజసూయము.)

కాలుదివియ, ద్వ. వి. కాగడా: చూ, స్నేహాశము. 1-ఇ.

కాలుద్రివ్వు, దే. అ. క్రి. (కాలు+త్రివ్వు.) కారణము లేక యుద్ధమునకు యత్నించు: రూ-కాల్ద్రివ్వు.

కాలుద్రొక్కు, దే. వి. (కాలు+త్రొక్కు) 1. రూ-కాల్ద్రొక్కు. పెండ్లి: చూ, వివాహము; అ. క్రి. 2. రూ-కాల్ద్రొక్కు. కదియు: చూ, సమీపించు.

కాలుబలము, మి. వి. పదాతిసేన, మంది: చూ, భటుఁడు. 1. (రూ-కాల్బలము.)

కాలుమడి, దే. వి. రూ-కాల్మడి, ఉచ్చ: చూ, మూత్రము.

కాలుమడుచు, దే. అ. క్రి. మూత్రవిసర్జనముచేయు: రూ-కాల్మడుచు.

కాలుమానిసి, ద్వ. వి. పదాతి; భార. ద్రోణ. 3, ఆ, 43: చూ, భటుఁడు. 1.

కాలువ, వై. వి. 1=కుల్య. రూ-కాలవ-కాల్వ; ఆము. 6, ఆ. 8: చూ, నది; 2. రూ-కాల్వ. పరంపర; భార. భీష్మ. 3, ఆ. 234: చూ, వెల్లి. 4.

కాలువురు, దే. వి. బ. రూ-కాల్వురు పదాతి: చూ, భటుఁడు. 1.

కాలుష్యము, సం. వి. అ. న. రూ-కలుషము. కలఁక: చూ, పాపము. 1.

కాలెండరు, వా. తారీఖుల సూచిక. (రూ-కేలెండరు.)

కాలేఖలుసమారబ్ధాః ఫలంబధ్నంతినీతయః, న్యా, ఉచితమగు కాలమునఁ బ్రారంభింపఁబడిన నీతులు ఫలించును.

కాలేజము, సం. వి. అ. న.=కారిజము: చూ, యకృత్తు.(లివర్.)

కాలేజి, కాలేజీ, వా. పెక్కుమంది బాలురుచదువుచోటు: చూ, పాఠశాల. (చూ, సదనము 1.)

కాలేయకము. సం. వి. అ. న. 1. పీతవర్ణ సుగంధకాష్ఠవిశేషము: చూ, రాజార్హము; 2. జాపకము. నల్లఅగలు: చూ, రాజార్హము 1-గ; 3. అంకపీలి*: చూ, మ్రానిపసుపు; 4. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

కాలేయము, -పై.- (3 కస్తురిపసుపు అని కొందఱు.)

కాలేయుఁడు, సం. వి. అ. పుం. 1. కాలకేయుఁడనెడు రాక్షసుఁడు: చూ, రాక్షసుఁడు. 1-ళ; 2. పార్వతికొడుకు: చూ, సూనుఁడు. 1-ఆ.

కాలోహిబలవత్తరః, న్యా. అన్నింటికన్నఁ గాలము బలవత్తరము.

కాల్కొను, దే. స. క్రి: చూ, రూ-కాలుకొను; రా. కిష్కిం, కాం. 468.

కాల్చు, దే. స. క్రి: చూ, రూ-కాలుచు.

కాల్ద్రివ్వు, దే. అ. క్రి: చూ, రూ-కాలుద్రవ్వు; భార. శాం. 3, ఆ. 15.

కాల్ద్రొక్కు, దే. వి. అ. క్రి: చూ, రూ-కాలుద్రొక్కు.

కాల్నడ, దే. వి: చూ, రూ-కాలినడ; భార. భీష్మ. 1. అ. 154.

కాల్పకము, సం. వి. అ. పుం. అంకపీలి *: చూ, మ్రానిపసుపు.

కాల్పము, సం. వి అ. పుం.—పై.—

కాల్బంటు, ద్వ. వి: చూ, రూ-కాలిబంటు.

కాల్బంట్లు, అం: చూ, చతురంగములు.

కాల్బలము: చూ, కాలుబలము.

కాల్మడి, దే. వి: చూ, రూ-కాలుమడి; హరి. పూ. 6, ఆ. 5.

కాల్మడుచు, దే. అ. క్రి: చూ, రూ-కాలుమడుచు.

కాల్య, సం. వి ఆ. స్త్రీ కట్టుటకు ఈడువచ్చిన యావు: చూ, ధేనువు.

కాల్యకము, సం. వి అ. పుం. 1. కచోరము *: చూ, షడ్గ్రంథ; 2. దారుహరిద్ర *: చూ, మ్రానిపసుపు.

కాల్యము, సం. వి. అ. న. 1. రూ-కల్యము. తెల్లవాఱుగడ: చూ, వేగుజాము; విశే. 2. తరుణమునకుఁదగినది: చూ, కల్యము. 9.

కాల్వ, వై. వి.=కుల్య: చూ, రూ-కాలువ.

కాల్వురు, దే. వి. బ: చూ, రూ-కాలువురు.

కావంచి, వై. వి.=కామంజిక *: చూ, రూ-కామంచి.

కావటి, సం. వి. ఈ. స్త్రీ.=కావడి: చూ, స్కంధాటిక.

కావడె, వై. వి.=కావటి:—పై.—

కావడించు, వై. స. క్రి. కావడినుండెత్తు; పాండు. 3, ఆ. 87.

కావడిబద్ద, ద్వ. వి: చూ, కావటి.

కావడిమట్టు, ద్వ. వి. ఉట్టి: చూ, శిక్యము. 1.

కావరము, సం. వి. అ. న. 1. నాఁచు *: చూ, శైవలము; దే. వి. (1) క్రొవ్వు: చూ, మదము 1. (రూ-కండకావరము-కావలము); (2) గర్వము: చూ, హంకారము.

కావరి, దే. వి. రూ-కావరుఁడు. మర్కటుఁడు: చూ, వ్యాధుఁడు 2.

కావరించు, దే. అ. క్రి. క్రొవ్వు: చూ, మదించు.

కావరుఁడు, దే. వి: చూ, రూ-కావరి; భార ఆర. 6, అ. 62.

కావలము, దే. వి. 1. క్రొవ్వు: చూ, మదము 1; 2. దోసము; వి, పుం. 3, ఆ. 135: చూ, పాపము.

కావలయు, దే. అ. క్రి. (కాఁ+వలయు) అగుట యావశ్యకమగు. 2. కోరఁదగినదియగు; 3. అవు. "వాఁడు నీకేమి కావలయును" (ఏమి=ఏవిధమైన బంధువు.)

కావలి, దే. వి. ఏలుబడి, ఉ, హరి 2, అ. 128: చూ, రక్షణము

కావలికాఁడు, దే. విశే. కాచువాఁడు: చూ, రక్షకుఁడు.

కావలిబొట్టు, ద్వ. వి. (రూ-కావిరిబొట్టు-కావు.) బిడ్డలకు రక్షగా నుంచెడు నల్లని తిలకము: చూ, బొట్టు. 1.

కావా, దే. వి. అశ్వమండలగతి.

కావారము, సం. వి. అ. న. నాఁచు *: చూ, శైవలము.

కావారి, సం. వి. ఈ. స్త్రీ. మొగలాతు తోనగువానితో నేర్పఱుపఁబడిన గొడుగు: చూ, ఛత్రము.

కావి, దే. వి. 1. ఎఱుపు : చూ, వర్ణము 6; 2. బ. కాషాయ వస్త్రము: చూ, వస్త్రము. 1-౫౨.

కావించు, దే. స. క్రి : చూ, కాఁజేయు; భార. అర. 2, ఆ 253.

కావిగొను, దే. అ. క్రి. (కావి + కొను) ఎఱ్ఱనగు; స్వా. 2, ఆ. 71 : చూ, పల్లటిల్లు.

కావిగోఁచివారి, ద్వ. వి. సన్యాసి : చూ, ముని. 1.

కావిచీర, దే. వి కాషాయవస్త్రము : చూ, వస్త్రము. 1-౫౨.

కావిటాలపు, దే వి : చూ, కావిగోఁచివారి.

కావిరి, దే. వి నలుపు; ఉ. హరి 5, ఆ. 210 : చూ, వర్ణము. 6-౬.

కావిరిబొట్టు, ద్వ. వి: చూ, రూ-కావలిబొట్టు; భాగ. 10. స్కం. పూ. 297.

కావిఱాయి, దే. వి. కతికిక, ఎఱ్ఱని సుద్దఱాయి : చూ, రత్నములు. 1-౧౨-(౧౨)

కావు, దే. వి. 1. అఱచుట ఏడ్చుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము; పాండు. 1, ఆ. 145: చూ, హాహాహా; 2. కాకికూఁత : చూ, స్వరము. 2-౪౬-(౧౨౬); 3. పాఁతఱ లోనగువాని పైకప్పు; స్వా. 4, ఆ. 60; 4. కావలి బొట్టు: చూ, బొట్టు. 1; 5. కాదు. నఙ్ అర్థకము: చూ, లేదు. 2; 6. కుమ్మరివాని ఆమము : ఆమము-రూ-ఆవము; (సం. ప.):—ఆవాపము.

కావుట, దే. వి. 1. ఒప్పిదమగుట, భార. ఆది 1, ఆ. 138; భార. శాం. 6, ఆ. 385: చూ, అగుట; పా. 2. అగుట = కావుట -భావార్థక ప్రత్యయమైన 'ట' ముత్తులలోఁ జేరలేదు: చూ, కాదేశాదులు.

కావుత, దే. ద్ర: చూ, కాత. స్వా. 1. ఆ. 2.

కావున, దే ద్ర. హేతువును దెలుపునది. స్వా. 1. ఆ. 67: చూ, హేతువు.

కావుపాఁతఱ. దే. వి. ధాన్యముంచెడి కుండ: చూ, భాండము. 3 - ౫.

కావులగలాఁడు, దే వి. సాంబ. మాన, 7: చూ. సన్యాని 1.

కావులు, దే. వి. బ. యతిశాటీలు: చూ, వస్త్రము. 1-౮౫.

కావృకము, సం. వి. అ. పుం. 1 కోడి: చూ. పుంజు; 2. పచ్చని తుంగమునైన*: చూ, తృణము. 1; 3. చక్రవాకపక్షి: చూ, చక్రవాకము; 4 కలికారమనుపక్షి: చూ, పీతమస్తకము.

కావేరి, సం. వి. ఈ. స్త్రీ 1. కవేరుఁడను రాజుకూఁతురు, కావేరీనది: చూ, నది; 2. బోగముదాన: చూ, వేశ్య; 3 పసుపు: చూ, వర్ణము. 6 ౫; అం. 4: చూ, గంగలు: (చూ, నది.)

కావేషము, వా. వి. పగ: చూ, విరోధము. 1.

కావేషి, వా.వి.—పై—.

కావ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పూతనయనురాక్షసి: చూ, రాక్షసి. 1. 2. తెలివి: చూ, బుద్ధి.

కావ్యకర్త, సం. వి. ఋ. పుం. కాలాక్షరికుఁడు: చూ, శిక్షితాక్షరుఁడు.

కావ్యగీతప్రయత్నము, అం: చూ, నాయకస్వరూపములు.

కావ్యగుణములు, అం. శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము. ఔదార్యము. కాంతి, ఓజము, సమాధి. (10).

కావ్యచౌరకము, సం. వి. అ. పుం: చూ, చంద్రరేణువు.

కావ్యదోషములు, అం. ఇవి పదఅర్థగతములై దోషములతో నిండియుండును. పదగతములు వాక్యగతములు నని పదదోషములు ద్వివిధములు:— అందుపదదోషములు. 17. అప్రయుక్తము (కవులుప్రయోగింపనిది) అపుష్టార్థము ప్రస్తుతోపయోగములేని ప్రయోగము) నేయార్థము తనకెసంకేతమైనది) అసమర్థము (అప్రసిద్ధము, నిరర్థకము (పదపూర్ణము) గ్రామ్యము (వ్యాకరణనిషిద్ధమైన పామరభాష) చ్యుతసంస్కారము (వ్యాకరణ దూష్యము) గూఢార్థము (అర్థము వెల్లడి కానిది) అన్యార్థము (వేఱర్థమిచ్చునది) అశ్లీలము (సిగ్గు గల్గించునది) అప్రతీతము (శాస్త్రపురాణాదులలోని మాటలు వాడుట) అప్రయోజకము (విశేషము లేకుండుట) క్లిష్టము (దూరాన్వయము) సందిగ్ధము సందేహార్థమిచ్చునది) విపరీతధీప్రదము (విరుద్ధార్థముఁ దోపించునది) అవిమృష్టవిధేయము (అప్రధానవర్ణనము) పరుషము (కఠినకటువు): చూ, అర్థదోషములు); (పద. వాక్య. అర్థదోషములు అని మఱియొక గ్రంథము.)

కావ్యపాకములు, అం. ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము. (3) (పాకత్రయము): చూ, త్రయము.

కావ్యప్రకాశిక, పా. ఈగ్రంథకర్త మమ్మటభట్టు: చూ, కావ్యనాటకములు.

కావ్యము, సం. వి. అ. న. 1. = కబ్బము, కవికృతగ్రంథము. కృతి: చూ, పుస్తకము; 2. కావ్యము - విశ్వశ్రేయస్కరము; 3 కావ్యము - కవికల్పితమైనది. దీనికె గ్రంథము, కతియని పేర్లు; 4. కావ్యము-దృశ్యము, శ్రవ్యము నని ద్వివిధము. దృశ్యము (చూడఁదగినది; నాటకము (మురారి-శాకుంతలము లోనగునవి) శ్రవ్యము (వినఁదగినది రామాయణాది గ్రంథములు. 5. కావ్యము మఱలఁ ద్రివిధము.- కాంతాసమ్మితము (ప్రబంధము) సుహృత్సమ్మితము (పురాణము) ప్రభుసమ్మితము (వేదము); 6. నాటకలు పదునెనిమిదింటిలో నొకటి ఇది దేవమనుష్యమిశ్రితము. కావ్యము.—ఒక అంకము. ప్రణయకథ. మధ్యమధ్య పాటగలది. ఇత్యాది

కావ్యములు, అం. రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, భారవి, మాఘము. (5).

కావ్యరీతులు, అం. వైదర్భి, గౌడి, పాంచాలి. (3).

కావ్యలింగము, అం అర్థాలంకారములలో నొకటి. కార్యముచేఁ గారణమును కారణముచేఁ గార్యమును సమర్థించుట. వాక్యార్థహేతుకము, పదార్థహేతుకము నని ద్వివిధము. ఉ.—మదనుఁడ యోడుదువు. నామది త్రిలోచనుఁడుండెడు: చూ, అలంకారము. 3.

కావ్యవృత్తులు, అం. కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి. (4): చూ, వృత్తులు.

కావ్యార్థాపత్తి, అం. అర్థాలంకారములలో, నొకటి. కైముతి (ఇంకేల) న్యాయమును వర్ణించుట. ఉ.—వనితనీ మొగముచే శశియెయోడె. పద్మములనింకఁజెప్పనేల ? : చూ, అలంకారము. 3.

కావ్యుఁడు, సం. వి. అ. పుం: చూ, శుక్రుఁడు; భార. ఆది. 6, ఆ. 119.

కాష్ఠమల్లము, సం. వి. అ. పుం. పాడె: చూ, శవయానము.
కాష్ఠము, సం. వి అ. న. 1. కట్టె, కొయ్య: చూ, వంటచెఱకు; వా. 2 వల్లకాడు: చూ, శ్మశానము.
కాష్ఠలేఖకము, సం. వి. అ. పుం. ఘుణము: చూ, పురుగు.
కాష్ఠలోహి, సం. వి. న్. పుం. వాతర్ధి. లోహాయుక్తముద్గరము: చూ, ముద్గరము.
కాష్ఠవల్లిక, సం. వి. ఆ. స్త్రీ. 1. ఖట్వా *: చూ, సుకాష్ఠ; 2. కటుక రోహిణి *: చూ, కటుకురోహిణి. 1.
కాష్ఠశారిబ, సం. వి. ఆ. స్త్రీ తెల్లసుగంధిపాల *: చూ, శారిబ.
కాష్ఠాంబువాహిని, సం వి. ఈ. స్త్రీ కాష్ఠముచే చేయఁబడిన అంబువాహిని; దోనె: చూ, హోడము.
కాష్ఠీల, సం. వి ఆ. స్త్రీ కదళి *: చూ, రంభ. 2.
కాష్ఠీలము, సం. వి. అ. పుం 1. రాజార్కము *: చూ, జిల్లేడు; 2. ఉచ్చింత *: చూ, ఖండ. 5.
కాస, వై. వి. = కచ్చ దట్టీ; చూ, వస్త్రము. 1-౯-(౯.) (ఇది ఎదంతముగా వాడుక).
కాసండీ, వా. వి. ఒకరకముచెంబు: చూ, పాత్రము. 6.
కాసండి,—వై.—.
కాసకందము, సం. వి అ. పుం. కొంకణదేశపు ఆలువ: చూ, మూకరము. 1-౭.
కాసఘ్నము, సం. వి. అ. పుం. తౌళసి *: చూ, హరిప్రియ.8.
కాసఘ్ని, సం. విశ. ఇ. 1. కంద నల్లేరు మొదలగునవి నలిపిన పులుస; ఈ. స్త్రీ. 2. కసింద *: చూ, బలుసు.
కాసజిత్తు, సం. వి. త్. స్త్రీ. చిఱుతేకు *: చూ, భారంగి.
కాసనాశిని, సం. వి. ఈ. స్త్రీ. కర్కటకశృంగి *: చూ, శృంగి.
కాసనుత్తు, సం. వి. త్. పుం. చేఁతిపొట్ల *: చూ, పొట్ల.
కాసందీపటిక, సం. వి. ఆ స్త్రీ. పేశవారవిశేషము: చూ, సంబారము.
కాసమర్దకము, సం. వి. అ. పుం. = కసంద *: చూ, బలుసు.
కాసమర్దనము, సం. వి. అ. పుం. చేఁతిపొట్ల *: చూ, పొట్ల.
కాసమర్దము, సం. వి. అ. పుం. 1. = కసింద *: చూ, బలుసు; 2. గుల్మభేదము *: పొద. ?.
కాసము, సం. వి. అ. పుం. ఉక్కిరిస: చూ, దగ్గు.
కాసర, వై. వి. = కాళహర *: చూ, రూ - కాఁచర.
కాసరకూసర, జా. చెడుట; నెఱవేఱకపోవుట.
కాసరము, సం. వి. అ. పుం ఎనుపోతు: చూ, మహిషము.
కాసరవడ్లు, దే. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము.
కాసలనాటిబ్రాహ్మణులు, అం వీరినే కాసలేయులు, కోసలేయులు, కౌసలేయులు అని అందురు. వీరు శుక్లయజుర్వేదులు. ప్రథమ శాఖీయులనియు, వాజసనేయులనియు అందురు: చూ, బ్రాహ్మణులు. (రూ-కోసలనాటి బ్రాహ్మణులు).
కాసా, దే. వి. దాసీపుత్రుఁడు.
కాసారము, సం. వి. అ. పుం. 1 కొలను: చూ సరస్సు. 1; 2. బ. కొఱ్ఱలు: చూ, ధాన్యము.
కాసారి, సం. వి. ఇ. పుం. కసింద *: చూ, బలుసు.
కాసాలువు, సం. వి. ఉ. పుం: చూ, కాసకందము.
కాసించు, వై. స. క్రి. కాసెగాఁగట్టు. "ద్వి. కడుమైలపేలికి గాసించు." హరిశ్చ. 2, భా 1361.

కాసియ, వై. వి. రూ-కాసె. 1. = కచ్చ కుట్టి: చూ, వస్త్రము. 1-౯-(౯); 2. గ్రావకారుఁడు: చూ, జాతిపనివాఁడు.
కాసీఁడు, వై. వి. గ్రావకారుఁడు; పర. 5, ఆ 48: చూ, జాతి పనివాఁడు.
కాసీసము, సం. వి. అ. న. = కసీసము. మయిలుతుత్తము: చూ, రసాంజనము.
కాసు, వై. వి. 1. = కాకణి - కాచ. 1. దుగ్గానిలో నాలవభాగము; దుగ్గానిలో పదియవభాగము (అని కొందఱు) అఱపైస అని పురుషోత్తమకవీయము: చూ, కాచము. 6; 2. పదునైదు రూపాయల విలువగల బంగారునాణెము (వాడుక) (కాసుధర తఱచుగా మాఱుచుండును.) 3. ధనము: చూ, విత్తము. 1.
కాసువీసము, జా. కొంచెము. (పైసలో 80 వ వంతు అని ఉపన్యాసదర్పణము) "కాసువీసమేని వసూలుచేయ శక్యము కాదయ్యె." (ధర్మజరాజవిజయము)
కాసువు, సం. వి. ఉ. పుం. న. 1. కుత్సితవాక్యము: చూ, శబ్దము. 2-౨౦; (2-౭౧); 2. శక్తియను నాయుధవిశేషము: చూ, బాణము. 1-౮౧; ఊ. స్త్రీ. 3. మతి: చూ, బుద్ధి; 4. తెవులు: చూ, రోగము 1; 5. కాంతి: చూ, వెలుతురు. 1; 6 మాట: చూ, శబ్దము. 2.
కాసె, వై. వి. రూ-కాసియ 1. = కచ్చ. దట్టి: చూ, వస్త్రము; 1-౯ - (౯); 2. గ్రావకారుఁడు: చూ, జాతిపనివాఁడు; ఱాయితొలుచుపని.
కాసెగట్టు, వై. అ. క్రి. కచ్చగట్టు: చూ, దట్టీగట్టు.
కాసెకోక, వై. వి దట్టి: చూ, వస్త్రము. 1-౧౦.
కాసెనిల్కడ, అం: చూ, విన్నాణములు.
కాసెయులి, దే. వి. (కాసె + ఉలి.) ఱాయితొలిచెడి ఉలి, టంకము: చూ, వృక్షాదనము. 1.
కాసెవాఁడు, దే. వి: చూ, జాతిపనివాఁడు.
కాసెపోయు, దే. అ. క్రి. (కాసె + పోయు) (వస్త్రమును) గోఁచివలె వెనుకకు దెక్కు.
కాహక, సం. వి. ఆ. స్త్రీ. నఫిరి. కాహళవాద్యము: చూ, వీణె.
కాహలజఙ్ఘ, సం. వి ఆ. స్త్రీ. సులక్షణముఁ గల యాఁడుది: చూ, స్త్రీ. 1-౧౪౪.
కాహలప్రియ, సం. వి. ఆ. స్త్రీ. గోరింక: చూ, శారిక.
కాహలి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కాహళి. 2.
కాహళ, సం. వి. ఆ. స్త్రీ. 1 = కాళియ: చూ, కాహక; 1. ఒకానొక అప్సరస్త్రీ: చూ, వేలుపులు. 2.
కాహళజంఘలు, అం. స్త్రీలక్షణాంగములందలి జంఘల (పిక్కలు) యందలి విశేషము. (కాహళజంఘలైనను గజజంఘలైనను సుఖవతియగు: చూ, స్త్రీలక్షణాంగములు.
కాహళము, సం. వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. శబ్దమాత్రము, సద్దు: చూ, స్వరము. 2-౪౬-(౧౫); 3. పిల్లి; చూ, మార్జాలము; 4. బృహడ్ఢక్క, కాహళవాద్యము: చూ, వీణ. 1-౩౬; 5. పక్కి: చూ, పక్షి; న. 6. అతిశయము: చూ, హెచ్చు. 2; 7. కష్టము: చూ, దుఃఖము; 8. అవ్యక్త వాక్యము: చూ, స్వరము. 2. ౪౬.(౭౧); (౨-౪౬-) (౯౯); ౪౬-(౩౨); విణ. 9. పామరోక్తి: చూ, స్వరము.

2, 10. ఎండినది: చూ, శుష్కము. 2; 11. పెల్లయినది, అతిశయించినది: చూ, హెచ్చు. 2; 12. చెడ్డది, ఖలము: చూ, పాపము. 1; (తెనుఁగు కావ్యములందు వాద్యమను నర్థమందును తఱుచుగ ఇది పుంలింగముగాఁ గానఁబడుచున్నది: భాగ. 10, స్కం. పూ. 1740. మొ.; అం. 13: చూ, పంచమహావాద్యములు.

కాహళాపుష్పము, సం. వి. అ. పుం. ఉమ్మెత్త*: చూ, హలాపుష్పము.

కాహళి, సం. వి. ఈ. స్త్రీ. 1. = కాళియ, నఫిరె, కాహళవాద్యము: చూ, వీణ. 1-౫౩; 2. యౌవనస్త్రీ, తరుణి: చూ, స్త్రీ 1-౨౬; 3. వాయించెడి యొకానొకకుండ: చూ, వీణె: (చూ, భాండము.) 3; 4. దుర్మార్గుఁడు: చూ, వ్యాధుఁడు; అం. 5: చూ, సుషిరవాద్యములు.

కాహళిక, సం. వి. అ స్త్రీ. నఫిరి; చూ, వీణ. 1-౩౬. (రూ-కాహళి).

కాహళికుఁడు, సం. వి. అ. పుం. కాహళియూదువాఁడు; పర. 5, ఆ. 91.

కాహి. సం. వి. ఈ. స్త్రీ. కొడిసె*: చూ, వత్సకము.

కాళంజి, వై. వి. = కలాచి, తమ్మపడిగము: చూ, పాత్రము. 6. (రూ-కాళాంజి-కళాంజి కళాసిక).

కాళయుక్తి, సం. వి. ఇ. పుం: చూ, సంవత్సరములు.

కాళాంజి, వై. వి. = కలాచి; చూ, రూ - కాళంజి.

కాళి, సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. పార్వతీభేదము: చూ, పార్వతి. 1; (ఆదిశక్తులలో నొకతె: చూ, ఆదిశక్తులు); 3. కాళిక: చూ, బొగ్గు; 4. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2. ౧; 5: చూ, వహ్ని. 1-౪; వా. వి (1) మనుష్యాదులులేనిచోటు.

కాళింగము, సం. వి. అ పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. నేలగుమ్మడి*: చూ, సర్వతోభద్ర. 1-౨. (నల్లనేలగుమ్ముడు అనియు) (రూ - కాలింగము.)

కాళింగి, సం. వి. ఈ స్త్రీ: చూ, పుచ్చ*. (నక్కదోసతీఁగె అని విశ్వకోశము).

కాళింగుఁడు, సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము. 1-౧.

కాళింది, సం. వి. ఈ. స్త్రీ. 1. యమునానది: చూ, నది; 2. నీటియావు: చూ, ధేనువు. (రూ-కాలింది); అం. 3: చూ, భాష, భిన్నషడ్జ విభాషలు.

కాళిందీభేదనుఁడు, సం. వి. అ. పు: చూ, రూ-కాలిందీభేదనుఁడు.

కాళిక, సం. వి. అ. స్త్రీ. 1. = కాలియ: చూ, కాలిక; 2. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2-౧.

కాళికాదేవి, అం: చూ, దిక్పాలభార్యలు.

కాళికాపురాణము, అం: చూ, ఉపపురాణములు. (కాళీపురాణము).

కాళిదాసుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-కాలిదాసుఁడు.

కాళియ, వై వి. = కాహళిక. బూరగొమ్ము, నఫిరి; శుక్సం. 2, ఆ. 108: చూ, వీణ. 1-౩౬.

కాళీపురాణము, అం: చూ, కాళికాపురాణము

కాళీయుఁడు, సం. వి. అ. పుం. రూ-కళీయుఁడు. కాళీయుఁడను సర్పము: చూ, సర్పము. 1-౧.

కాళ్లె, వై. వి: = చూ, రూ-కాళియ.

కాళ్లజెఱ్ఱి, దే. వి. చెవిజోరు పాము: చూ, సర్పము. 1-౪-(౪౧.)

కాష్ఠపట్టుకొనుట, జా. బ్రతిమాలుకొనుట. "పొట్టకై యట్టిహీనుని కాళ్లపట్టుకొని కష్టపుజీవనము జీవించుటకం టె." (నీతిచంద్రిక-విగ్రహము.)

## కి

కి, దే. అవ. షష్ఠీవిభక్తియందు వచ్చెడు ప్రత్యయము: కు, యొక్క, లో, లోపల.

కిమ్, సం. విణ. మ్. 1. జ్ఞానేచ్ఛ, ఊహ: చూ, యోచన; 2. అడుగుట: చూ, ప్రశ్నము; 3. దూఱు: చూ, నింద. 1; 4. రీతి: చూ, విధము 1; అవ్య. 5. అడుగుట: చూ, ప్రశ్నము; 6. దూఱు: చూ, నింద. 1; 7. అదియో యిదియో యను సందియము; 8. మఱియొకపక్షము; 9. కొంచెము: చూ, స్వల్పము; 10. ముంచు: చూ, వెండియు; 11. ఎక్కుడు, అతిశయము: చూ, హెచ్చు. 2; 12. కారణము: చూ, హేతువు; 13. కాదనుట: చూ, లేదు. 2.

కింక, దే. వి. 1. కోపము; భార. ద్రో. 3, ఆ. 15: చూ, రోషము. (రూ-కింకిరి - కినుక - కినుకము - కినుపు-కిన్క); 2. పశువులను మేఁకలను చంపెడి ఒకరకము తెగులు: చూ, పశురోగము.

కింకనీరు, ద్వి. వి. శిశువులు పోరుపెట్టినపుడు దృష్టిదోషము బోవుటకై మూఁడు బొగ్గులు వేసి తీయు పారాణినీళ్లు, (పారాణి = పసుపు సున్నము కలిపినది.)

కింకర, సం. వి. ఆ. స్త్రీ. దాసి: చూ, దాసిదె.

కింకరి, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

కింకరుఁడు, సం. వి. అ. పుం. 1. పరిచారకుఁడు: చూ, సేవకుఁడు; విణ. 2. కూలివాఁడు: చూ, సంబళకాఁడు.

కింకిణము, సం. వి. అ. పుం. రూ-కింకిణి, పాంజేబు: చూ, భూషణము. 2.

కింకిణి, సం. వి. ఈ. స్త్రీ. 1. —పై.—; 2. చిఱుగంట: చూ, భూషణము. 2; 3. కానరేఁగు*: చూ, రేఁగు. 1; 4. గిలక*: చూ, ఘంటారవ.

కింకర, సం. వి. ఆ. స్త్రీ. నెత్తురు: చూ, రక్తము. 1.

కింకరము, సం. వి. అ. పుం. 1. కోయిల: చూ, పికము; 2. తుమ్మెద: చూ, భ్రమరము. 1; 3. గుఱ్ఱము: చూ, హయము; న. 4. ఏనుఁగు గండస్థలము: చూ, లెంప. 2: (చూ, హస్తి.)

కింకిరాటము, సం. వి. అ. పుం. రూ-కింకరాతము*: చూ, వన్నె. 15.

కింకిరాటుఁడు, సం. వి. అ పుం: చూ, రూ-కింకిరాతుఁడు.

కింకిరాతము, సం. వి అ. పుం. 1. కొండగోనుఁగు*: చూ, పీతపుష్పము; 2. పచ్చపువ్వుల పెద్దగోరంట*: చూ, మహాసహ. 2-౫; 3. రూ-కింకరాటము*: చూ, వన్నె. 15.

కింకిరాతుఁడు, సం. వి అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు. (రూ-కింకిరాటుఁడు)

కృష్ణనింబము, సం. వి. అ. పుం కరివేప*: చూ, బల.
కృష్ణపక్షచతుర్దశి, అం: చూ, పర్వములు.
కృష్ణపక్షతిథులు, అం: చూ, తిథులు.
కృష్ణపక్షము, సం. వి. అ. పుం. 1. కటిపక్కము: చూ, పక్షము. 1; అం. 2: చూ, పక్షములు.
కృష్ణపక్షాష్టమి, అం: చూ, పర్వములు.
కృష్ణపన్నగము, సం. వి. అ. పుం. పెద్దమంగ*: చూ, శ్వాసనము.
కృష్ణపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. కొలతులసి*: చూ, తులసి.
కృష్ణపాకఫలము, సం. వి. అ. పుం. కలివె*: చూ, సొమ్ము పుష్పఫల (కృష్ణపాకఫల అని కొందఱు.)
కృష్ణపాకము, —పై.—.
కృష్ణపాకి, సం. వి. ఈ స్త్రీ. నల్లగురిగింజ*: చూ, తులాబీజము.
కృష్ణపింగళ, సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.
కృష్ణపిండీతకము, సం. వి. అ. పుం. నల్లమంగ*: చూ, శ్వసనము.
కృష్ణపిండీరము, —పై.—
కృష్ణపిపీలి, సం. వి. ఈ. స్త్రీ. నల్లచీమ: చూ, పిపీలిక.
కృష్ణపులంగవము, సం వి. అ. పుం. పెద్దకందచీమ: చూ, పిపీలిక.
కృష్ణపుష్పము, సం వి. అ. పుం: చూ, కృష్ణధుత్తూరకము*.
కృష్ణపుష్పి, సం. వి. ఈ. స్త్రీ. అంకోలగిరి*: చూ, ప్రేంకణము.
కృష్ణపుష్పిక, సం. వి ఆ. స్త్రీ: చూ, కృష్ణపుష్పము.
కృష్ణఫల, సం. వి. ఆ. స్త్రీ. కారుగచ్చ*: చూ, సోమరాజి.
కృష్ణఫలపాకము, సం. వి. అ. పుం. ఓంకపండు: చూ, సొమ్ము పుష్పఫల.
కృష్ణఫలము, సం. వి అ. న. 1. తక్కోలం*: చూ, వైజయంతి; పుం. 2. ఓంకపండు: చూ, సొమ్ముపుష్పఫల; 3: చూ, ఏలకిపండు. 2.
కృష్ణఫలి, సం. వి. ఈ. స్త్రీ: చూ, కృష్ణఫల*.
కృష్ణబర్బరకము, సం. వి. అ. పుం. చిఱుతేకు*: చూ, బారంగి.
కృష్ణబీజము, సం. వి. అ. న. 1. కాలింగము*: చూ, పుచ్చ; పుం. 2. కుంకుడు*: చూ, ఫేనిలము. 2; 3. ఎఱ్ఱమునగ*: చూ, శిగ్రువు. 1.
కృష్ణభూమి, సం. వి. ఇ. స్త్రీ. నల్లనేల: చూ, భూమి. 1-౩౦.
కృష్ణభూమిజ, సం. వి. ఆ. స్త్రీ. గోమూత్రిక*: చూ, తృణము.1.
కృష్ణభేద, సం. వి. ఆ. స్త్రీ. రూ-కృష్ణభేది, కటుకరోహిణి*: చూ, కటుకాదని. 1.
కృష్ణభేది, సం. వి. ఈ స్త్రీ. —పై.—
కృష్ణభోజికుఁడు, సం. వి. అ. పుం. జూదమాడెడివాఁడు: చూ, పందెకాఁడు.
కృష్ణమల్లిక, సం. వి. ఆ. స్త్రీ. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము.
కృష్ణము, సం. వి. అ. న. 1. ఇనుము: చూ, లోహము. 1; 2. మరీచము: చూ, మిరియము; 3. దోషము: చూ, పాపము. 1; 4. సీలాంజనము: చూ, సౌవీరము. 2; 5. కాళాగురువు చూ, రాజార్హము. 1-౧౫; పుం. 6. నలుపు: చూ, వర్ణము 6-౧; (6-౬); 7. కాకి: చూ, వాయసము. 1; 8. కోకిలము: చూ, పికము; 9 దున్న: చూ, మహిషము; 10. కృష్ణపక్షము: చూ, పక్షము. 1; 11. నల్లని కడుపుగల మందపిచ్చుక: చూ, పిచ్చుక; 12. ఓంక*: చూ, సామ పుష్పఫల; 13. ఏనుఁగు: చూ, హస్తి; 14. (యజ్ఞముకుఁదగిన చిత్రవర్ణముగల) ఇఱ్ఱి: చూ, హరిణము. 1-౧౧; 15. శూద్రజాతి: చూ, వర్ణము. 7; విణ. 16. నల్లనిది: చూ, వర్ణము. 6 ౬-(౧).
కృష్ణముద్గము, సం. వి. అ. పుం నల్లపెసర*: చూ, పెసర.
కృష్ణమూర్తి, అం: చూ, కృష్ణావతారము.
కృష్ణమూలి, సం. వి. ఈ. స్త్రీ నల్లసుగంధిపాల*: చూ. శారిబ.
కృష్ణమూలిక, సం. వి. ఆ స్త్రీ. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము.
కృష్ణరక్తకము, సం. వి. అ. పుం. గురివెంద*: చూ, తులాబీజము.
కృష్ణరక్తిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—
కృష్ణరుహా, సం. వి. ఆ. స్త్రీ. కృష్ణవల్లి*: చూ, సురలి. (సరళి).
కృష్ణరేఖ, సం వి ఆ. స్త్రీ. దాస్యలక్షణము: చూ, లక్షణము. 1-౧౭.
కృష్ణల, సం. వి. ఆ. స్త్రీ. గురిజ. ఎఱ్ఱగురిజ (అని కొందఱు *: చూ, తులాబీజము.
కృష్ణలకము, సం. వి అ. పుం. —పై.—
కృష్ణలము, సం. వి. అ. న. సేతిక, మూఁడు యవల యెత్తు వెండి: చూ, లోహము. 1.
కృష్ణలవణము, సం. వి అ. న 1. సౌవర్చలవణము: చూ, లవణము. 1; 2 కాచలవణము: చూ, లవణము 1.
కృష్ణలోహము, సం. వి. అ న. ఇనుము: చూ, లోహము. 1.
కృష్ణలోహమయము, సం. వి. అ పుం చిట్టెము: చూ, లోహము. 1.
కృష్ణలోహితము సం వి. అ పుం. 1. నలుపు మించఁగలిసిన యెఱుపు, ధూమ్రము. చూ, వర్ణము. 6-౪-(౪); విణ 2. నలుపు మించఁగలసిన యెఱుపుగలది, ధూమ్రము: చూ, వర్ణము. 6-౪ (౪.)
కృష్ణవక్త్రము, సం. వి. అ. పుం కోఁతి: చూ, వానరము.
కృష్ణవర్త్మ, సం వి. న. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు 2; 3. తలగాము, రాహుగ్రహము: చూ, రాహువు 1.
కృష్ణవల్కలము, సం. వి. అ. పుం ఏపె*: చూ, మద్ది
కృష్ణవల్లి, సం. వి. ఈ. స్త్రీ. 1. కమ్మెరాకుతీఁగె, నల్లతీఁగె*, చూ, సురలి (సురళి); 2. మామెన*: చూ, శారిబ.
కృష్ణవల్లిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—
కృష్ణవృక్షము, సం. వి. అ. పుం. అగరుమాను*: చూ, చందనము.
కృష్ణవృంత, సం. వి. ఆ. స్త్రీ 1. కలిగొట్టు*: చూ, సాలి 2. 2. కారుమినుము*: చూ, మినుము; 3. పెగ్గుమ్మడు*; శ్రీపర్ణి: చూ, సర్వతోభద్ర 1-౬.
కృష్ణవృంతిక, సం. వి ఆ. స్త్రీ. 1. గుమ్మడి*: చూ, మహాఫలము; 2. పేటికావృక్షము: చూ, పేటిక.
కృష్ణవేణి, సం. వి. ఈ. స్త్రీ 1. కృష్ణ అనియెడు నది: చూ, నది; అం. 2. చూ, గంగలు (రూ కృష్ణవెణ్ణ).
కృష్ణవేణ్ణ, సం. వి. ఆ. స్త్రీ. —పై.—

కృష్ణవ్రీహి, సం. వి. ఇ. పుం. ఒకరకము వ్రీహిధాన్యము: చూ, ధాన్యము.

కృష్ణశారము, సం. వి. అ. పుం. 1. యజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణపులేడి(రూ-కృష్ణసారము): చూ, హరిణము. 1-౧౨; 2. ఇరుగుడు*: చూ. శింశుప; 3. జెముడు*: చూ, స్నుహి.

కృష్ణశాలి, సం. వి. ఇ. పుం. ఒకరకము శాలిధాన్యము: చూ, ధాన్యము.

కృష్ణశింశుప, సం. వి. ఆ స్త్రీ. నల్లఇరుగుడు*: చూ, శింశుప.

కృష్ణశిగ్రువు, సం. వి. ఉ. పుం. శోభాంజనము*: చూ, శిగ్రువు. 1.

కృష్ణశర్కర, సం. వి. ఆ స్త్రీ. గురివెంద*: చూ, తులాబీజము.

కృష్ణశీర్షకము, సం. వి. అ. న. అగరువు: చూ, రాజార్హము. 1.

కృష్ణశృంగము, సం. వి. అ. పుం. దున్నపోతు: చూ, మహిషము.

కృష్ణసఖి, సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ: చూ, సుషవి. 2.

కృష్ణసర్పము, సం. వి. అ. పుం. 1. నల్లత్రాచు: చూ, సర్పము. 1-౨; 2. కేతకి*: చూ, మొగలి.

కృష్ణసర్పరాజు, సం. వి. అ. పుం. కర్కోటకమను మొదటి రకము పాము: చూ, సర్పము. 1. ౧.

కృష్ణసర్షపము, సం. వి. అ. పుం. నల్లావలు*: చూ, సర్షపము.

కృష్ణసార, సం. వి. ఆ. స్త్రీ. ఇరుగుడు*: చూ, శింశుప.

కృష్ణసారకము, సం. వి. అ. పుం. 1. వెదురు: చూ, వేణువు; 2. ఇరుగుడు*: చూ, శింశుప; 3. జెముడు*: చూ, స్నుహి; 4 యజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణపులేడి: చూ, హరిణము. 1.-౧౨.

కృష్ణసారధి, సం. వి. ఇ. పుం. అర్జునము, ఏఱుమద్ది *: చూ, సాలము. 3-౧.

కష్ణసారము, సం. వి. అ. పుం: చూ, రూ-కృష్ణశారము.

కృష్ణస్కంధము, సం. వి. అ. పుం. కాలస్కంధము*: చూ, తమాలము.

కృష్ణహయము, సం వి. అ. పుం. సూర్యాశ్వము: చూ, హయము. 1-౨.

కృష్ణాంగన, అ: చూ, దిక్పాలపట్టణములు: (చూ, దేశము.)

కృష్ణాంగము, సం. వి. అ. న. విషవిన్యాతంత్రవిశేషము: చూ, మాయము. 1.

కృష్ణాంజని, సం. వి. ఈ. స్త్రీ కాలాంజని*: చూ, హ్రస్వ శాఖశిఫము.

కృష్ణాగురువు, సం. వి. అ. న. నల్లఅగిలు: చూ, రాజార్హము. 1-౧౩.

కృష్ణాచలము, సం. వి. అ. పుం. రైవతపర్వతము: చూ, పర్వతము.

కృష్ణానది, సం. వి. ఈ. స్త్రీ. కృష్ణాజిల్లాయందున ప్రవహించు చున్ననది: చూ, నది.

కృష్ణాభ, సం. వి. ఆ. స్త్రీ: చూ, కృష్ణాంజని*.

కృష్ణామిషము, సం. వి. అ. న: చూ, కృష్ణలోహము.

కృష్ణామము, సం. వి. అ. పుం. చింత*: చూ, తింత్రిణీ.

కృష్ణాయసము, సం. వి అ. న. —పై.—

కృష్ణార్చి, సం. వి. స్. పుం. అగ్ని: చూ, నిప్పు.

కృష్ణార్జకము, సం. వి. అ. పుం. 1. నల్లగగ్గెర*: చూ, పర్ణాసము; 2. నల్లతులసి*: చూ, హరిప్రియ 3-3.

కృష్ణార్పణము, వా. శ్రీకృష్ణభగవానునికి సమర్పణము." నీవు చేసిన పని కృష్ణార్పణము."

కృష్ణాలువు, సం. వి. ఉ. పుం. నీలాలువు, నల్లకంద*: చూ, సూరణము.

కృష్ణావతారము, అం. ఇది యొక అవతారము. ఇది దశావతార ములలోఁ జేరియుంట లేదు.

కృష్ణావాసము, సం. వి. అ. పుం. అశ్వత్థము *: చూ, రావి.

కృష్ణిక, సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లావలు *: చూ, సర్షపము; 2. తవిదె అను వస్తు: చూ, ధాన్యము; 3. నల్లపిచ్చుక: చూ, పిచ్చుక.

కృష్ణుఁడు, సం. వి. అ. పుం. 1 = పన్నెండ్రు (చూ, కృష్ణావతారము) వెన్నుఁడు (అన్నిటినిఁ జేయువాఁడు, దైత్యులను నలిపివేయువాఁడు, కృష్ణవర్ణుఁడు, గీత నుపదేశించిన శ్రీకృష్ణభగవానుఁడు మొ): చూ, విష్ణువు. 1; 2. వేదవ్యాసుఁడు: చూ, సన్న్యాసి. 1; 3. అర్జునుఁడు (పాండవమధ్యముఁడు): చూ, విజయుఁడు. 1; 4 అగ్నిహోత్రుఁడు: చూ, నిప్పు.

కృష్ణేక్షువు, సం. వి. ఉ. పుం. నల్లచెఱకు *: చూ, సుకుమారము. 1-3.

కృష్ణోదుంబరిక, సం. వి. ఆ. స్త్రీ కాకోదుంబరిక *: చూ, బొమ్మమేడి.

కృష్య, సం. వి. ఆ. స్త్రీ. 1. తాళప్రాణరణావిశేషము: చూ, తాళము. 2; అం. 2: చూ, దేశీయక్రియలు.

కృసరము, సం. వి. అ. న. 1. పులగము: చూ, సాదము. (1)-౧౨; 2. శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజనకాల మందు కలిపియిచ్చెడు నువ్వులు బెల్లము. (నువ్వుల పులగ మని హారావళి.)

## క్లృ

క్లృప్తకీల, సం. వి. ఆ. స్త్రీ. వ్యవస్థాపత్రము, పట్టోలికా: చూ, పట్టా.

క్లృప్తధూపము, సం. వి అ. పుం. అందుగుల కలఁ జేసిన ధూపద్రవ్యము, సిహ్లకము: చూ, రాజార్హము. 1.

క్లృప్తము, సం. విశే. ఏర్పాటుచేయఁబడినది: చూ, స్థితము. 3.

క్లృప్తి, సం. వి. ఇ. స్త్రీ. 1. ఏర్పాటు: చూ, నిజము. 2; 2. కల్పనము: చూ, సంగ్రహము.

క్లృప్తికుఁడు, సం. విశే. క్రీతుఁడు: చూ, పుత్రుఁడు: 1.

## కె

కె, దే. విశే. వృత్తియందు కెంపుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పర మగునపుడు నుగాగమమును, తదితరములు పరమగునపుడు మీఁదిదానికి ద్విత్వమును వచ్చును. కెంగేలు, కెంజడ, కెంజాయ, కెంజిగ, కెంజిగురు, కెంపలిరు, కెందమ్ము,

కెందామర, కెందొవ, కెంబట్టు, కెంబువ్వు, కెంపెదవి, కెన్నుసువు, కెమ్మొక్క, కెమ్మోవి మొ.)

కెంగటు, దే. వి. తాళవిజము. రూ-గెంగెట. అం, భా. ద్వి. 78: చూ, తేగ.

కెంజాయ, దే. వి. ఎఱుపు. వేం, అం. 83: చూ, వర్ణము. 6-ఴ.

కెంజిగురు, దే. వి ఎఱ్ఱనిచిగురు.

కెంపమ్మి, ద్వ. వి. (కెంపు + తమ్మి) ఎఱ్ఱదామర *: చూ, సహస్రపత్త్రము 1-3.

కెందామర, —పై.—

కెంపొగ, ద్వ. వి. ఎఱ్ఱగలువ *: చూ, సహస్రపత్త్రము. 1-౧౨-(౧).

కెంపు, దే. వి. 1. ఎఱుపు. భార. విరా. 2, ఆ. 318: చూ, వర్ణము. 6—ఴ; 2. పద్మరాగమణి: చూ, రత్నములు. 1-౨: 3. అధరమందలి దంతక్షతము: చూ, దంతక్షతములు. విజ. 4. ఎఱ్ఱనిది. చమ. 1, ఆ. 86: చూ, వర్ణము 6-ఴ-(౧); (ఈయర్థమున వృత్తియందుఁ గొన్నియెడల నంత్యవర్ణలోపము. కెం.)

కెంపుఁగంటి, దే. వి. (కెంపు + కన్ను) కోయిల: చూ, పికము.

కెంపుకనుబవులుఁగు, దే. వి.—పై.— సాంబ. తిర్య. 7.

కెంపుగాతు, ద్వ. వి. అంగారకుఁడు, రూ-కెంపుగాము: చూ, వక్రుఁడు. 1.

కెంపుగాము, —పై.—

కెంపురా, ద్వ. వి. ఇనుఁడు. అం. పదా. సుర. 21:చూ, సూర్యుఁడు.

కెంపుసవతు, ద్వ. వి. స్వాతి: చూ, నక్షత్రము. 1.

కెడ, దే. వి. వైపు. భార. ద్రోణ. 4, ఆ. 303: చూ, పార్శ్వము. 1. (రూ-కెడను-కెలఁకు-కెలను-కెలవు-కెళవు).

కెడను, దే. వి. —పై —

కెడపు, దే. ప్రే. 1. పడఁజేయు. జై. 3, ఆ. 109; 2.త్రోయు. రామా. 4, ఆ. 50; 3. చంపు: చూ, సంహరించు.

కెడయిక, దే. వి. 1. పడుట: చూ. పతనము: 2. చావు: చూ, మరణము.

కెడయు, దే. అ. క్రి. 1. పతనమగు. ఉ, హరి. 2, ఆ. 131: చూ, పడు. 5; 2. చచ్చు: చూ, మరణించు; 3. భేదమగు ఆం, భా. తృ. 85: చూ, వేఱుపడు; స. క్రి. 4. ఉద్దేశించు: చూ, విషయీకరించు.

కెడవు, దే. వి. పడుట: చూ, పతనము.

కెమ్మోవి, దే. వి. ఓష్ఠము. సాంబ. దేవ. 51; చూ, పెదవి.

కెమ్మోవిగుఱి, దే. వి. పలునొక్కు, సాంబ. దేవ. 51: చూ, దంతక్షితము.

కెరకొట్టు, దే. అ. క్రి. (కెరలు + కొట్టు) కలకలనాయు: చూ, కిలకిలలాడు.

కెరలియాడు, దే. అ. క్రి. (కెరలి + ఆడు) చెలరేఁగు. ఉ, హరి. 5, ఆ, 42: చూ, విజృంభించు. (కెరలువొడుచు-కెరయు-కెరలు-కేరు-కేరించు).

కెరలు, దే. అ. క్రి. 1. అతిశయించు. స్వా. 6, ఆ. 35: చూ, ముమ్మరించు; 2. ఆగ్రహించు. స్వా. 6, ఆ. 47: చూ, రోషించు; 3. కూయు. స్వా. 3, ఆ. 111; 4: చూ, శబ్దించు; 5. చెలరేఁగు. హరి. ఉ. 7, ఆ, 42: చూ, విజృంభించు; 6. తొట్రుపడు. రా. యు, కాం. 408. పొరబ: చూ, సంభ్రమించు.

కెరలుచు, దే. ప్రే. కెరలఁజేయు.

కెరలువొడుచు. దే. అ. క్రి. (కెరలు + పొడుచు) 1. వృద్ధిఁబొందు. భాగ, 5, స్కం. 1, ఆ. 106: చూ, వర్ధిల్లు; 2. చెలరేఁగు. భాగ. 8, స్కం. 295: చూ, విజృంభించు.

కెరసనాయిలు, వా. వి. మట్టిగూనె చూ, కిరసనాయిలు.

కెర్జము, వై. వి. కేరజమనుపక్కి. రూ-కేరజము-కేర్జము: చూ, పక్షి.

కెర్ల, దే. వి. తాపము: చూ, సంతాపము.

కెర్లి: చూ, రూ-కిర్లి.

కెలఁకు, దే. వి. 1. దిక్కు భార. అర. 3, ఆ. 297 చూ, హరిత్తు; 2. వైపు: చూ, పార్శ్వము. 1; స. క్రి. 3 కలపెట్టు. ఆము 6, ఆ. 34; 4 ఉన్మూలించు. "బగుని కన్నులు కెలఁకె." కాశీ 7, ఆ. 95: చూ, భేదిల్లు. 2.

కెలను, దే. వి. 1. దిక్కు: చూ, హరిత్తు; 2. వైపు: చూ, పార్శ్వము. 1. (రూ-కెలఁకు-కెలవు-కెళవు).

కెలయు, దే. అ క్రి. చెలరేఁగు. రా. అర, కాం. 166. పొరబ: చూ, విజృంభించు.

కెలవు, దే. వి. 1. వైపు: చూ, పార్శ్వము. 1; 2. అనురాగము. కాశీ. 3, ఆ. 114: చూ, స్నేహము. 1.

కెలసము, దే వి. 1. అరసము: చూ, సంతోషము; 2. ఉత్సాహము: చూ, యత్నము; 3. కాంక్ష: చూ, వాంఛ; 4. పని. భార. అర. 6, ఆ. 30; భార. అర. 5, ఆ. 228: చూ, వ్యాపారము. 1.

కెల్లగించు, దే. స. క్రి 1. పెల్లగించు: చూ, భేదిల్లు. 2; 2. పురికొలుపు: చూ, ప్రేరేపించు.

కెల్లి, వా. వి: చూ, రూ కిర్లి-కెర్లి.

కెళకుళి, వై. వి. = ఖేలాకూలమ్. నడబావి క్రీడాసరస్సు చూ, సరస్సు. 1, (రూ-కెళాకుళి-కెళాకూళి-కేళకుళి - కేళకూళి - కేళాకుళి-కేళాకూళి).

కెళగు, దే. వి. ఆర్తవము. అం, పదా. ర. 68: చూ ముట్టు. 1.

కెళవు, దే. వి. 1. వైపు: చూ, పార్శ్వము. 1; 2. దూరము. జై 5, ఆ. 53; ఆము. 5 ఆ 26: చూ విప్రకృష్టము.

కెళాకుళి, వై వి.=: చూ, రూ-కెళకుళి. రసి. 3, ఆ. 117.

కెళాకూళి, —పై.—

## కే

కే, దే. వి, ధ్వన్యనుకరణము. హరి: పూ. 5, ఆ. 215: చూ, హుూహుూ. (రూ-కేప).

కేందుకము, సం. వి. అ. పుం. 1. కప్పు: చూ, హరి. 12; 2. గాలవము *: చూ, లొద్దుగు.

కేందువు, సం. వి. ఉ. పుం. తిందుకము*: చూ, తుమికి.

**కేక**, సం. వి. ఆ. స్త్రీ. 1.= కేస. నెమలికూఁత: చూ, స్వరము. 2-౪౽-(౧-౨౭); దే. వి. (1) పెద్దకూఁత, రూ-కే: చూ, స్వరము. 2.

**కేకయము**, సం. వి. అ. పుం. 1: చూ, దేశములు; 2. స్త్రీలు కాళ్ళనుధరించు అందియ: చూ, భూషణము. 2.

**కేకయి**, సం. వి. ఈ. స్త్రీ: చూ, కైకేయి.

**కేకయుఁడు**, సం వి. అ. పుం. కేకయదేశపురాజు: చూ, రాజు. 1-౪౩.

**కేకరము**, సం. వి. అ. పుం. 1. కడకన్ను: చూ, లోచనము. 1-౧; 2. మెల్లకన్ను: చూ, నేత్రము. 1.

**కేకరాక్షన్యాయము**. న్యా. మెల్లకంటివాఁడు ఒకనివైపు చూచుచుండ మఱియొకనివైపుఁ జూచుచున్నట్లు గాన్పించువిధము.

**కేకరించు**, సం. స. క్రి. 1. కటాక్షించు. హరి. పూ. 7, ఆ. 196: చూ, చూపు; దే. అ. క్రి. (1) కేకలువేయు: చూ, శబ్దించు. 1-3; (2) సకిలించునట్లు శబ్దించు: చూ, శబ్దించు. 1-౪.

**కేకరింత**, దే. వి. 1. కేకలువేయుట; 2. సకిలించునట్లు శబ్దించుట. ఆము. 5, ఆ. 60.

**కేకరుఁడు**, సం. వి. అ. పుం. వశిరుఁడు: చూ, మెల్లకంటివాఁడు.

**కేకలబండి**, వా. వి. రైలు: చూ, పొగబండి: (చూ, కమ్మలపైబండి) (చప్పుడుతోఁగూడినది.)

**కేకాలము**, సం. వి. అ. పుం. నెమలి: చూ. మయూరము.

**కేకావలము**, సం. వి. అ. పుం.—పై.—

**కేకి**, సం. వి. న్. పుం.—పై.—

**కేకిశిఖ**, సం. వి. ఆ. స్త్రీ. బర్హిపర్ణి *: చూ, పూతికరజము.

**కేకిస**, దే. వి. నెమలికూఁత. ఆం, పవా. 5-33: చూ, స్వరము.2.

**కేకిసలు**, దే. వి. బ. 1: చూ, చప్పట్లు; 2. నతి. హంస. 4, ఆ. 213; బహు. 2, ఆ. 41: చూ, నమస్కారము; 3. నతివిశేషము: చూ, నమస్కారము.

**కేకుందకము**, సం. వి. అ. పుం. కుడుము: చూ, భక్ష్యము.

**కేకుందము**, సం. వి. అ. పుం.—పై.—

**కేకేయి**, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కేకయి.

**కేజు**, దే. వి. 1. అడుసు: చూ, బురద; వా. వి. 2 దావా. రూ-కేసు.

**కేటత్రాడు**, దే. వి. యమపాశము. నీలా. 1, ఆ. 2?: చూ, సూత్రము. 1.

**కేటభ**, సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి 1.

**కేటాయించు**, వా. క్రి. వేఱుపఱుచు. (రూ-ఖేటాయించు.)

**కేటలాగు**, వా. వి. రూ-కేట్లాగు. అమ్మకమునకు సిద్ధపఱచిన పొత్తములు లోనగువాని పట్టిక.

**కేట్లాగు**, వా వి.—పై.—

**కేడ**, దే. వి. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

**కేడము**, వై. వి.= ఖేటకము డాలు: చూ, హరిగ. (రూ-కేడియము-కేడెము-కేవడము-కేశము.)

**కేడి**, వా. వి. ప్రాత నేరస్థుడు. "కేడీలరిజస్టరు."(రూ-కేడీ-కేశీ.)

**కేడించు**, దే. అ. క్రి. 1. తొలఁగు: చూ, విరియు. 5; స. క్రి. 2. అలక్ష్యముచేయు: చూ, రూ-క్రేడించు; 3. ఎడఁబాయు. ఆం, భా. తృ. 85: చూ, వేఱుపడు. (వేటాయించు అని వాడుక.)

**కేడియము**, వై. వి.= ఖేటకము. డాలు. రూ-కేడెము: చూ, హరిగ.

**కేడెము**, వై. వి. = —పై.—

**కేణిక**, సం. వి. ఆ. స్త్రీ. డేరా: చూ, సదనము. 1.

**కేతకము**, సం. వి. అ. పుం.= గేదఁగి *: చూ, మొగలి.

**కేతకి**, సం. వి. ఈ. స్త్రీ. 1.=—పై.—(ఇది శివపూజ కనర్హము.; 2. జాజి *: చూ, మాలతి; వా. 3. ఒకానొకతైలము: చూ, స్నేహము. 1-౨౩.

**కేతకీకుసుమన్యాయము**, న్యా. మొగలిపూవు సుగంధము గలదియైనను ముండ్లచేత కోసికొన శక్యముకాదు అనెడి విధము.

**కేతనము**, సం. వి. అ. న. 1. టెక్కెము: చూ, సిడము; 2. గుఱుతు: చూ, లక్షణము. 1: 3. ఇల్లు: చూ, సదనము 1: 4. పిలుచుట, బ్రాహ్మణుల నిమంత్రణము చేయుట. (అని కొందఱు): చూ, సంబోధనము.

**కేతుధరము**, సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు. 1.

**కేతుధరుఁడు**, సం. వి. అ. పుం. టెక్కెముపట్టువాఁడు: చూ, ధ్వజధరుఁడు.

**కేతుప్రియము**, సం. వి. అ. న. వైడూర్యము: చూ, రత్నము. 1.౯.

**కేతుభము**, సం. వి. అ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.

**కేతుమతి**. అం. ఒకానొక వృత్తము. — ఇందు బేసిపాదములందు స, జ, స, గురువులును, సరిపాదంబుల భ, ర, న, గగములును గలిగి ఏడింటయతిగల వృత్తము. ఉదా. — "జితబేసులన్న-జనగముల్,భాతసరిగాభరే-పనగగంబుల్.యతిశైలసంఖ్య. నమరఁగా.": చూ, వృత్తము, 1.

**కేతుమాలము**, అం. చూ, వర్షములు.

**కేతురత్నము**, సం. వి. అ. న. వైడూర్యము: చూ, రత్నములు. 1-౯.

**కేతువు** సం. వి. ఉ. పుం. కేతువను నొక గ్రహము: చూ, సుకేతనము: (చూ, ఆశ్లేషాభవము) కేతువునకు శుభవర్గములు 13. పాపవర్గములు 3; కేతుదశాపత్యములు యేడు ఇత్యాది; 2. టెక్కెము; చూ, సిడము; 3. గురుతు: చూ, లక్షణము. 1; 4. అగ్ని: చూ, నిప్పు; 5. కాంతి: చూ, వెలుతురు. 1; 6. దుమగతికేతువు: చూ, తోఁకచుక్క; 7. తక్కెల *: చూ, వైజయంతి; అం. 8: చూ, గ్రహములు.

**కేదంతి**, సం. వి. ఇ. పుం. అనిరుద్ధుఁడు: చూ, విశ్వకేతువు.

**కేదరము**, సం. వి. అ. పుం. 1. తుమ్మ *: చూ, విట్ఖదిరము; 2. రూ-కేదారము, ఊడుపుమడి: చూ, భూమి. 1: (చూ,రూ-కేదారము.)

**కేదారకటుక**, సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి *: చూ, శకులాదని. 1.

**కేదారము**, సం. వి. అ. పుం. న. 1. వరిమడి: చూ, భూమి.1; (కైదారకము-కైదార్యము-కేదారికము): 2. వరిపండుసేల,

ఊసుపుమడి: చూ, భూమి. 1.-౪౨; (కైదారము - కైదార్యము - కేదారికము); పుం. 3. కొండ: చూ, పర్వతము; 4. కేదారపర్వతము: చూ, పర్వతము; 5. కుదురు: చూ, పాదు 1; 6. కాశీపట్టణమునందలి పుణ్యక్షేత్రములలో నొకటి. (కేదారఘట్టమని వాడుక.)

కేదారశృంగము, సం. వి. అ. న. బోదాపసింగి *: చూ, మూర్ధజకరంజము.

కేనతి, సం. వి. ఈ. స్త్రీ. మన్మథుని భార్య: చూ, భార్య.

కేనారము, సం. వి. అ. పుం. 1. కుంభీపాకమను నరకము: చూ, కుంభీపాకము: చూ, నరకములు; 2. చెక్కిలి, పుట్టె ప్రదేశము (అనికొందఱు): చూ, లెంప. 2; 3. సంధి: చూ, బుజ్జగింత. (ఇది విచార్యము.)

కేనారుఁడు, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కేనిపాతకము, సం. వి. అ. పుం. చుక్కాని; ఓడతెడ్డు (అని కొందఱు): చూ, పీలి. 2.

కేనిపాతనము, సం. వి. అ. పుం.—పై.—

కేనిపాతము, సం. వి. అ. పుం.—పై.—

కేమము, సం. వి. అ. న. పులిపిరికాయ: చూ, వ్రణము. 1-౧౬.

కేముకము, సం. వి. అ. పుం. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

కేయూరము, సం. వి. అ. న. 1. భుజకీర్తులు: చూ, భూషణము.2; పుం. 2. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధములు.

కేరజము, వై. వి. = గేరజ్జ. రూ-కేరిజము-కేర్జము - కెర్జము: చూ, పక్షి.

కేరడము, దే. వి. 1. ఉపేక్ష. హరి. పూ. 1, ఆ. 180: చూ, మందెమేలము. 1; 2. తిరస్కారము. ఉ. హరి. 5, ఆ. 276: చూ, వహేలనము; 3. తిరస్కారపుమాట. ఉ. రా. 1, ఆ. 89: చూ, శబ్దము. 2-౩౭; 4. వంకరమాట. కా. 2, ఆ. 21: చూ, వ్యాఖ్యానము. 2; 5. ఒయ్యారము: చూ, విలాసము; 6. ఎగతాళి: చూ, పరిహాసము.

కేరడములవు, దే. వి. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

కేరడములవుఁదనము, దే. వి. ధూర్తత్వము: చూ, నీచుతనము.

కేరడించు, దే. స. క్రి. వక్రముచేయు. పసు. 5, ఆ. 76: చూ, వంకరపోవు.

కేరళము, సం. వి. అ. న. 1. చిత్రతండులము*: చూ, వాయువిడంగము; 2: చూ, దేశము. (రూ-కేరళము).

కేరలి, సం. వి. ఈ. స్త్రీ. 1. జ్యోతిర్గ్రంథవిశేషము, ఒకరకము వేఁపుడుపిండి: చూ, పాదము. (1); -౩౭; 2. అహోరాత్రము: చూ, రోజు.

కేరించు, దే. అ. క్రి. చెలరేఁగు; య. 5, ఆ. 76: చూ, విజృంభించు.

కేరింత, దే. వి. అలరింత: చూ, హాస్యము. 1.

కేరిజము, వై. వి. = గేరజ్జ. రూ-కేరజము: చూ, పక్షి.

కేరు, దే. అ. క్రి. 1. ఉత్సహించు. రుక్మి. 2, ఆ. 16: చూ, యత్నించు; 2. చెలరేఁగు. కళా. 6, ఆ. 195: చూ, విజృంభించు; 3. కుతూహలపడు. రుక్మి. 5, ఆ. 26: చూ, సంతోషించు; స. క్రి. 4. అనాదరించు. అచ్చ. అర. కాం. 32: చూ, తిరస్కరించు; 5. అపహసించు. పా. 4, ఆ. 67: చూ, వెక్కిరించు.

కేరుపు. దే. వి. జృంభణము: చూ, విజృంభణము.

కేర్జము, వై. వి = గేరజ్జ. రూ-కేరజము: చూ, పక్షి.

కేల, సం. వి. ఆ. స్త్రీ. 1. మోఁచేతిపోటు: చూ, పోటు. 4; 2. గనిక: చూ, మేక, 3. ఘంట: చూ, వహ్ని. 1—౨౬.

కేలకుఁడు, సం. వి. అ. పుం కత్తివాయిపైన ఆడెడువాఁడు: చూ, ప్లవకుఁడు.

కేలాసము, సం. వి. అ. పుం. కైలాసము: చూ, పర్వతము.

కేలి, సం. వి. ఇ. పుం. స్త్రీ: చూ, రూ-కేళి.

కేలికము, సం. వి. అ. పుం. అశోకము*: చూ, హేమపుష్పము.

కేలికల, సం. వి. ఆ. స్త్రీ. సరస్వతీదేవియొక్క వీణె: చూ, వీణ. 1—౨.

కేలికళావతి, సం. వి. ఈ. స్త్రీ. మన్మథునిభార్య: చూ, భార్య.

కేలికిలము, సం వి. అ. పుం గుమ్మడు*: చూ, మహాఫలము.

కేలికిన్నము, సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

కేలికుంచిక, సం. వి. ఆ. స్త్రీ. భార్యతోఁబుట్టువు: చూ, శ్యాలిక.

కేలికోశుఁడు, సం. వి. అ. పుం. నటుఁడు: చూ, శైలూషుఁడు.

కేలివృక్షము, సం. వి. అ. పుం. కదంబము*: చూ, నీపము.

కేలు, వై. వి. = కులి. కులికి. 1. చేయి: చూ, హస్తము; 2. తొండము. భార. అర. 6, ఆ. 229: చూ, హస్తి. 1-(౬౩.)

కేలుదమ్మి, వై. వి. పద్మమువంటి హస్తము: చూ, హస్తము. 1-౮.

కేలుపట్టు, వై. వి. పాణిగ్రహణము: చూ, వివాహము. (రూ-కేల్పట్టు.)

కేలుమొగుప, వై. వి. చేమోడ్పు: చూ, నమస్కారము. (రూ-కేలుమొగుపు- కేలుమొగ్గ - కేలుమోడుపు - కేలుమోడ్పు - కేల్మొగుప - కేల్మొగుప్పు- కేల్మోడుపు- కేల్మోడ్పు - కేల్మోడుపు- కేల్మోడ్పు).

కేలుమొగుపు, —పై.—

కేలుమొగ్గ, —పై.—

కేలుమోడుపు, —పై.—

కేలుమోడ్పు, —పై.—

కేల్పట్టు, వై. వి: చూ, రూ-కేలుపట్టు.

కేల్మొగుప, వై. వి: చూ, రూ-కేలుమొగుప.

కేల్మొగుప్పు, —పై.—

కేల్మోడుపు, —పై.—

కేల్మోడ్పు, —పై.—

కేల్మోడుపు, —పై.—

కేల్మోడ్పు, —పై.—

కేవ, దే. వి. దగ్గఱ. అం, భా. త్ర. 242: చూ, సమీపము. 1.

కేవడము, వై. వి: చూ, రూ - కేవెఱ. స్వా. 4, ఆ. 28.

కేవరి, దే. వి. (కేవు + అరి) రేవు పుచ్చుకొనువాఁడు: చూ, సుంకరి.

కేవలద్రవ్యము, సం. వి. అ. న. మరిచము: చూ, మిరియము.

కేవలము, సం. వి. అ. న. 1. నిర్ణయింపఁబడినది: చూ, స్థితము. 3; 2 జ్ఞానవిశేషము: చూ, బుద్ధి; విణ. 3. అంత : చూ, సర్వము; 4. ఒకటి : చూ, పంచి.

కేవలి, సం. వి. న్. పుం. 1. బుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 2. శాక్యబుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 3. జైనవిశేషము: చూ, బుద్ధుఁడు. 1.

కేవలుఁడు, సం. వి. అ. పుం పరమాత్మ: చూ, హంసుఁడు.

కేవు, దే. వి. ఓడకిచ్చెడు కూలి: చూ, తంపన్యము.

కేశకలాపము, సం. వి. అ. పుం 1. వెండ్రుకలముడి: చూ, ముడి. 3; 2. వెండ్రుకల సమూహము: చూ, వెండ్రుక. 1.

కేశకారము, సం. వి. అ. పుం. 1. కరపలము: చూ, దాణము. 1-౨. 2. ఒక రకము చెఱకు*: చూ, సుకుమారము. 1-౭-(౧.)

కేశకీటము, సం. వి. అ పుం పేను: చూ, యూకము.

కేశగర్భకము, సం. వి. అ. పుం. కబరి: చూ, వేనలి.

కేశఘ్నము, సం. వి. అ. న. పేనుకొఱుకుట: చూ, బట్టతల.

కేశచ్ఛిత్తు, సం. వి ద్. పుం. నాపితుఁడు: చూ, మంగలి.

కేశటము, సం. వి అ. పుం. 1. ఛాగము: చూ, మేషము. 1; 2 జంతుపేను: చూ, యూకము: 3. దుంపిగము*: చూ, శోణకము; 4. కామదేవుని యొక్క శోషణమను బాణము: చూ, బాణము. 1-౨౬

కేశటుఁడు, సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. తోడఁబుట్టినవాఁడు, భ్రాత: చూ, సహోదరుఁడు.

కేశనామము, సం. వి. న్. న: చూ, రూ - కేశాంబునామము*.

కేశపక్షము, సం. వి అ.పుం. కేశసమూహము. (రూ-కేశపాశము-కేశహస్తము): చూ, వెండ్రుక. 1.

కేశపద్ధతి, సం. వి. ఇ. స్త్రీ. పాపట: చూ, సీమంతము. 1.

కేశపల్లి, సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేణు*: చూ, శైఖరికము.

కేశపాశము, సం. వి. అ. పుం: చూ, రూ-కేశపక్షము.

కేశపాశి, సం. వి. ఈ. స్త్రీ. సిగ, మొగవాండ్రజుట్టు. (అని కొందఱు): చూ, సిక. 1-౧.

కేశబంధము, సం. వి. అ పుం. (1. పువ్వులు ముడిచిన) కొప్పు: చూ, వేనలి; అం. 2: చూ, నృత్తహస్తములు

కేశభువు, సం. వి. ఊ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

కేశమథని, సం. వి. ఈ. స్త్రీ. జమ్మి*: చూ, శమి.

కేశమార్జకము, సం. వి. అ. న కంకతము: చూ, ప్రసాధని.

కేశమార్జనము, సం. వి. అ. న. —పై.—

కేశము, సం. వి. అ పుం. 1. తలవెండ్రుక: చూ, వెండ్రుక. 1; 2. కురువేరు*: చూ, హ్రీబేరము.

కేశముష్టి, సం. వి. ఇ. పుం. 1. విషముష్టి*: చూ, ముసిఁడి; 2. మహానింబము*: చూ, వేము; 3: చూ, తేనెమ్రాను.

కేశముష్టిక, సం. వి. ఆ. స్త్రీ. విషముష్టి*: చూ, ముసిఁడి.

కేశముష్టికము, సం. వి. అ. పుం. పెద్దవేము*: చూ, వేము.

కేశరంజనము, సం. వి. అ. పుం. గుంటగలగర*: చూ, భృంగరాజము. 1.

కేశరంజని, సం. వి. ఈ. స్త్రీ. పిన్నగోరంట*: చూ, సహ. 2.

కేశరము, సం. వి. అ. పుం. న. రూ-కేసరము. 1. అకరువు: చూ, సహస్రపత్రము. 1-౧౦-(౨); 2. విషవిశేషము: చూ, విసము. 1; 3. అహికేసరము*: చూ, నాగకేసరము; 4. పొగడ*: చూ, వకుళము. 5. పున్నాగము*: చూ, పొన్న; 6. = కోస. జూలు. సింగములోనగువాని మెడమీఁది వెండ్రుక: చూ, వెండ్రుక. 1; న. 7. ఇంగువ*: చూ, హింగువు. 2; 8. వింజామరము: చూ, సురటి; 9. లవంగపుపువ్వు: చూ, లవంగపుష్పము.

కేశరామ్లము, సం. వి. అ. పుం. మాదీఫలము*: చూ, మాతులుంగము.

కేశరి, సం. వి. న్. పుం. రూ-కేసరి. 1. సింగము: చూ, సింహము; 2. గుఱ్ఱము: చూ, హయము; 3. పున్నాగము*: చూ, పొన్న; 4. అహికేసరము*: చూ, నాగకేసరము.

కేశరుహ, సం. వి ఆ. స్త్రీ. భద్రదంతిక*: చూ, విశల్య. 5.

కేశరూప, సం. వి. ఆ. స్త్రీ. వృక్షోపరివృక్షము, బదనిక: చూ, వదనిక.

కేశవము, సం. వి. అ. పుం. పున్నాగము*: చూ, పొన్న.

కేశవర్ధని, సం. వి. ఈ. స్త్రీ. 1. సహదేవి*: చూ. ముత్తవపులగము; వా. 2. వెండ్రుకలు పెరుగు తైలము. (దుకాణములలో విక్రయమునకు దొరకును).

కేశవాయుధము, సం. వి. అ. న. 1. రథాంగము: చూ, బండికన్ను; పుం. 2. ఆమ్రము*: చూ, మామిడి.

కేశవాలయము, సం. వి. అ. పుం. అశ్వత్థము*: చూ, రావి.

కేశవావాసము, సం. వి. అ పుం.—పై —

కేశవుఁడు, సం. వి. అ. పుం. 1. రూ-కేశిఘ్నుఁడు-కేశి. వెన్నుఁడు: చూ, విష్ణువు. (కేశవాయుక్త్వాత్ = బ్రహ్మరుద్రయందు బ్రహ్మ విష్ణు రుద్రస్వరూపులుగాను ఉండువాఁడు పరమాత్మగా నుండుటయే స్వభావముగా గలవాఁడే కేశవుఁడు. అట్టివిష్ణువు నాపాపములను భస్మీకరించుఁగాక! అభిధానము: చూ, ఓమ్); 2. పసుపుదేంట్ల బాలుఁడు: చూ, శిశువు. 1-౬; విణ. 3. మంచి తలవెండ్రుకలు గలవాఁడు: చూ, సుకేశుఁడు.

కేశవేశము, సం. వి. అ. పుం. కొప్పు: చూ, వేనలి.

కేశహంత్రుఫల, సం. వి. ఆ. స్త్రీ జమ్మి*: చూ, శమి.

కేశహంత్రి, సం. వి. ఈ. స్త్రీ —పై.—

కేశహస్తము, సం. వి. అ. పుం: చూ, కేశపక్షము.

కేశాంతజములు. అం: చూ, ఆగంతుకములు. (అనుబంధములో చూడుము.)

కేశాంబునామము, సం. వి. న్. న. కురువేరు*: చూ, హ్రీబేరము.

కేశాకేశి, సం. అవ్య. సిగపట్ల పోట్లాట: చూ, యుద్ధము.

కేశాగ్రము, సం. వి. అ. న: అగ్రకేశము.

కేశారుహ, సం. వి. ఆ స్త్రీ: చూ, కేశవర్ధని*.

కేశార్హ, సం. వి. ఆ స్త్రీ. పెద్దసిలి*: చూ, రంజని.

కేశాహ్వము, సం. వి. అ. పుం. కురువేరు*: చూ, హ్రీబేరము.

కేశి, సం. వి. న్. పుం. 1. ఒకానొక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1-౪; 2. ప్రచేతసుఁడు: చూ, వరుణుఁడు. 1; 3. కురువేరు*: చూ, హ్రీబేరము; 4. వెన్నుఁడు: చూ, విష్ణువు 1;

5. సింగము: చూ, సింహము: విశే. 6. మంచి తల వెండ్రుకలు గలవాఁడు: చూ, సుకేశుఁడు: ఈ. స్త్రీ. 7 నఖముఁడప్పు: చూ, నఖము; 8. నీలి*: చూ, రంజని; 9. ఉప్పుగడ్డి*: చూ, తృణము. 1; 10. అగ్రవల్లి, అజలోమ*. 11. జటామాంసి*: చూ, మాంసి 2; 12. పిల్లపీఁచర*: చూ, శతమూలి.

కేశిక, సం వి. ఆ. స్త్రీ. పిల్లపీఁచర*: చూ, శతమూలి

కేశికుఁడు, సం. విణ. మంచి తలవెండ్రుకలుగలవాఁడు: చూ, సుకేశుఁడు.

కేశిని, సం. వి ఈ. స్త్రీ. 1. కట్లపీఁగె*: చూ, పస్యింపసాళిక; 2. పచ్చపులిఁగె*: చూ, శంఠిని; విణ. 3. మంచితలవెండ్రుకలుగలది. (ఆఁడుది): చూ, స్త్రీ 1-౧౪౮.

కేశినిషూదనుఁడు, సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు: చూ. విష్ణువు. 1.

కేశిమథనుఁడు, సం. వి న. పుం. —పై—

కేశుఁడు, సం వి అ. పుం. 1. నీటిపేఁను: చూ, వరుణుఁడు; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కేశ్యము, సం. వి. అ. న. 1. కృష్ణాగురువు: చూ, రాజార్హము. 1; (1-౧౫); పుం. 2 గుంటగలగర*: చూ, భృంగరాజము.

కేస, వై. వి. = కేశ. నెమలితురాయి. ఆం. భా. ద్వి. 96: చూ, స్వరము. 2.

కేసర, సం. వి. ఆ. స్త్రీ. కార్పాసము*: చూ, ప్రత్తి.

కేసరపూరకము, సం. వి. అ. పుం. పుల్లమాదీఫలము*: చూ, మాతులుంగము.

కేసరబ్రాహ్మణులు, ఆం. పంచగౌడులందలి సారస్వతులలోని మూఁడవతెగవారు: చూ, బ్రాహ్మణులు: (చూ, అసుగోత్ర బ్రాహ్మణులు.)

కేసరము, సం. వి. అ. పుం, న: చూ, రూ-కేశరము.

కేసరవరము, సం. వి. అ. న. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

కేసరాంజనము, సం. వి. అ. పుం. గుంటగలగర *: చూ, భృంగరాజము.

కేసరామ్లము, సం. వి. అ. పుం. బీజపూరము *: చూ, మాతులుంగము.

కేసరి, సం. వి. ఇ. పుం. 1. సింగము: చూ, సింహము; 2. గుఱ్ఱము: చూ, హయము; 3. పున్నాగము*: చూ, పొన్న; 4. అహికేసరము*: చూ, నాగకేసరము; 5. హనుమంతుని తండ్రి: చూ, వానరము; 6. మాదీఫలము *: చూ, మాతులుంగము; 7. రక్తశిగ్రువు *: చూ, మునగ; వై. వి. (1) = ఖేచరః. ఖేచరమను మృగము: చూ, ఖేచరము; (2) ఒకరకము వరిపైరు: చూ, సస్యము; (3) బ. కేసరి యను వడ్లు: చూ, ధాన్యము. (స్తంబకరి. 1-౨౬—౧౫).

కేసరిక, సం. వి. ఆ. స్త్రీ. సహదేవి *: చూ, ముత్తవపులగము.

కేసరిజుఁడు, సం. వి. అ. పుం. ఆంజనేయుఁడు: చూ, వానరము.

కేసు, వా. వి. 1. అచ్చుకూర్పు అక్షరములు గల గళ్ళతొట్టె; 2. దావా: (చూ, కేజు.) ఉ. "కేసు వాయిదావేసిరి"

కేళకుళి, వై. వి. = ఖేలాకులమ్. క్రీడాసరస్సు. ఉపిక. 2, ఆ. 57 : చూ, రూ-కెళకుళి.

కేళటాళి, వై. వి. = -పై.-విక్ర. 5, ఆ. 19 భీమ. 3, ఆ. 190.

కేళాకుళి, వై. వి. = —పై.—

కేళాకూళి, వై. వి. = —పై.—

కేళి, సం. వి. ఇ. పుం. స్త్రీ. = కేళిక. గేలి-రూ-కేలి. 1. పురుషుఁడు స్నేహముననైన స్త్రీలు లోనగువారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁగలది; 2. ఆట: చూ, విలాసము. 1; 3. ప్రియునితోడి విహారమునందలి నాయికయొక్క క్రీడ: చూ, విలాసము. 1; 4. స్త్రీపురుషులు వినోదము నిమిత్తమై యాడెడు చతురంగము మొదలైన యాట: చూ, విలాసము. 1; 5. పుడమి చూ, భూమి. 1; వా. 6. ప్రాంతదొంగ, కేడి "నిన్ను కేడీ(ళీ)ల రిజిస్టరులో చేర్చినారు."

కేళిక, వై. వి. = కేళి. శరీర హస్త నేత్రాభినయములచేత భావమును తెలుపుచు నాడెడు ఆట. రామా. 2, ఆ. 131: చూ, నృత్యము.

కేళికిలుఁడు, సం. విణ. నవ్వించువాఁడు: చూ, హాస్యగాఁడు.

కేళిముఖము, సం. వి. అ. న. పరియాచకము: చూ, పరిహాసము.

కేళిశీలుఁడు, సం. విణ: చూ, కేళికిలుఁడు.

కేళీలు, వా. సస్యమునందు అక్కడక్కడఁ గనఁబడు సామాన్యపు మొక్కలు (Sports.)

## కై

కై, దే. అవ. 1. చతుర్థీవిభక్తియందు వచ్చెడు ఒకప్రత్యయము: కొఱకు; వై. వి. 2. = కర. చేయి. రూ-కయి. ఉ. రా: 6, ఆ. 56: చూ, హస్తము; 3. తొండము. రూ-కయి: చూ, హస్తి. 1-(౬౫) (దేశ్యమని శబ్దరత్నాకరము); వా. 4. కోపము చూపుటయందగు ధ్వన్యనుకరణము. "మాట్లాడిన 'కై' అని మీఁదపడెదవు. నీలో మాటలాడుటెట్లు: చూ, హూహూ (రూ-కయి-కయ్యి.)

కైంకర్యము, వా. వి. 1. రూ-కయింకర్యము: చూ, శుశ్రూష; 2. దొంగతనము.

కైక, వై. వి. = కైకేయి, రూ-కయిక. అచ్చ. అ, కాం. 49: వేమన. 1167: చూ, కైకేయి.

కైకట్టు, ద్వ. వి: చూ. రూ-కయికట్టు.

కైకయి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కైకేయి.

కైకలవాఁడు, దే. వి: చూ, రూ కయికోలవాఁడు.

కైకానుక, దే. వి: చూ, రూ-కయికానుక. రామా. 2, ఆ. 5: య. 1, ఆ. 104.

కైకుంచితము, సం. వి. అ. న. కుడుములరాసి: చూ, భక్ష్యము.

కైకేయి, సం. వి. ఈ. స్త్రీ. = కేకయ - కైక. కేకయరాజు కూఁతురు. దశరథుని భార్య. భరతునితల్లి: కేకయి-కేకేయి-కైకయి; (తె.వ.):-కయిక-కైక.

కైకొను, దే. అ క్రి: చూ, రూ-కయికొను. (పూను-ఉ, హరి. 4, ఆ. 96; లక్ష్యపెట్టు. భార. శాం. 3, ఆ. 173.)

కైకొలుపు, దే. ప్రే: చూ, రూ-కయికొలుపు. భో. 4, ఆ. 74.

కైకోల, దే. వి: చూ, రూ-కయికోల.

కైకోలవాఁడు, దే. వి: చూ, రూ-కయికోలవాఁడు.

కైకోలు, దే. వి: చూ, రూ-కయికోలు (అం:కారము.— భాగ. 8. స్క-ం. 192; గ్రహణము -కా. 1, ఆ. 5.)

కైచాఁపులు, దే. వి. బ: చూ, రూ - కయిచాఁపులు. హంస 4, ఆ. 213.

కైజీతకాఁడు, దే. వి. శంబళాయుధసేవి. ఆం, భా. ద్వి. 166: చూ, గురిమాస్తి.

కైజీతము, ద్వ. వి: చూ, రూ-కయిజీతము.

కైజా, దే. వి: చూ, రూ-కయిజా. చంద్రా. 2, ఆ. 58.

కైజామోర, దే. వి. హయశిరఃకంపము.

కైజాలు, దే. అ. క్రి: చూ, రూ-కయిజాలు

కైజు, వై. వి.= కపింజల: చూ, రూ-కయిజు (దేశ్యమని శబ్దరత్నాకరము.)

కైటజము: సం. వి. అ. పుం కుటజము*: చూ, వత్సకము.

కైటభ, సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

కైటభజిత్తు, సం. వి. త్. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

కైటభహాసుఁడు, సం. వి. న్. పుం.—పై.—

కైటభారి, సం వి. ఇ. పుం.—పై —

కైటభి, సం. వి. ఈ. స్త్రీ దుర్గ: చూ, పార్వతి. 1.

కైటభుఁడు, సం. వి. అ. పుం. కైటభుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.-౪.

కైటర్యము, సం. వి. అ. పుం. 1. కట్ఫలము *: చూ, పినగుమ్మడు; 2. నింబము *: చూ, వేము; 3. మహానింబము *: చూ, వేము; 4. ఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము.

కైతికము, సం. వి. అ. పుం. కొండనిమ్మ *: చూ, నిమ్మ.

కైడర్య, సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లగినియ *: చూ, శుకనాసము. 1; 2. కఱివేము *: చూ, బల.

కైడర్యము, సం. వి అ. పుం. 1. కఱివేము *: చూ, బల; 2. కట్ఫలము *; పినగుమ్మడు : చూ; సర్వతోభద్ర. 1-3; 3. సెమలియడుగుమ్రాను *: చూ, పూతికరజము: 4. గుమ్మడు *: చూ, మహాఫలము.

కైడువు, దే. వి. చూ, రూ-కయిదువు.

కైత, వై. వి. = కవితా: చూ, రూ-కయిత.

కైతకము, సం. వి. అ. న. 1. కేతకీపుష్పము: చూ, మొగలి (గేదంగిపువ్వు); 2. తిక్తకటుకము *: చూ, శకులాదని. 1.

కైతట్ట, దే. వి. గిండి: చూ, పాత్రము. 6.

కైతము, వై. వి. = కవితా: చూ, కైత.

కైతవము, సం. వి. అ. న. 1. కపటము: చూ, వ్యాజము. 1; 2. జూదము: చూ, వ్యవహారము. 4; 3. వైడూర్యమణి: చూ, రత్నములు. 1-౯.

కైతవాపహ్నుతి, అం: చూ, అలంకారములు. 3.

కైతాళము, మి. వి. చేతితోవాయించు కంచుతాళము: చూ, వీణ. 1-౪౬. (౧).

కైదండ, దే. వి: చూ, రూ-కయిదండ.

కైదారకము, సం. వి. అ. న. కేదారముల సమూహము (కేదారము = వరిమడి) (రూ-కైదారికము-కైదార్యము.): చూ. భూమి. 1-౪౩.

కైదారము, 1. —పై.—; పుం. 2. శాలిధాన్యము: చూ, ధాన్యము.

కైదారికము, చూ, కైదారకము.

కైదారిణము, —పై.—

కైదార్యము, —పై.—

కైది, దే. వి: చూ, ఖైది.

కైదు, దే. వి: చూ, రూ-కయిదు.

కైదువ, దే. వి. రూ - కైదువు. 1. ఆయుధము: చూ, బాణము.1; 2. కత్తి: చూ, రిష్టి. 2.

కైదువు, దే. వి. —పై.— రూ-కయిదువు. భార. ద్రో. 5, ఆ. 51; హరిశ్చ. 4, ఆ. 71.

కైపదము, వై. వి. = దిపిపది. భో. 2, ఆ. 50: చూ, రూ-కయిపదము.

కైపాల, ద్వ. వి. 1. మంగలికత్తి: చూ, హడపము. 2; వై. వి. 2. = కక్షపాల. బైరాగులజోలె: చూ, పాత్రము. 6. (రూ-కరపాల-కక్షపాల.)

కైపు, దే. వి. చూ, రూ-కయిపు. (అందము - రాము. ?, ఆ. విజృంభణము. - వేమన 1170: పా-ము. 4, ఆ. 19; విధము.-రామా. 6, ఆ. 103.)

కైఫీయతు, దే. వి. సమాధానము: చూ, [illegible].

కైముడి, ద్వ. వి: చూ, రూ-కయిముడి.

కైముతికన్యాయము, న్యా. అధికుల పొందు బాధలకంటె అల్పులు పొందు బాధ లెక్కువ కావను రీతి.

కైమోడుపు, ద్వ. వి: చూ, రూ-కయిమోడుపు. హంస. 4, ఆ. 213. (రూ-కైమోడ్పు-కయిమోడుపు-కయిమోడ్పు.)

కైరఁడు, దే వి: చూ, రూ-కయిరఁడు.

కై రజీర్ణభయా ద్భ్రాతః భోజనం పరిహీయతేన్యా. సోదరుఁడా! అజీర్ణభయమున నెవఁడు భోజనమును మానును?

కైరపడి, వై. వి. = ఖాదిరపటర: చూ, రూ-కయిరపడి.

కైరవము, సం. వి. అ. పుం. 1. కేతకి* : చూ, మొగలి; 2. = ; [illegible]*: చూ, 1. సహస్రపత్రము. 1-౧౨ (3).

కైరవి, సం. వి. న్. పుం, 1. చందమామ: చూ, చంద్రుడు, ఈ. స్త్రీ. 2. చంద్రిక: చూ, వెన్నెల; 3. మెంతి*: చూ మేంథి; 4. వేఁపుడుపిండి: చూ, సాదము. (1)-౩౩.

కైరవిణి, సం. వి. ఈ. స్త్రీ. కలువయుండు కొలను: చూ, సరస్సు. 1.

కైరవుఁడు, సం. వి. అ. పుం. 1. వైరి: చూ, శత్రువు. 1; 2. కితవుఁడు: చూ, వంచకుఁడు. 1.

కైరాతతండులము, సం. వి. అ. పుం. విడంగము*: చూ, వాయువిడంగము.

కైరాతము, సం. వి. అ. న. 1. నేలవేము*: చూ, భూనింబము; 2. శంబరచందనము: చూ, వాసన. 1-౮.

కైరాతుఁడు, సం. వి. అ. పుం. బలవంతుఁడు: చూ, లాపరి.

కైరాలము, సం. వి. అ. న. విడంగము*: చూ, వాయువిడంగము.

కైరాలి, సం. వి. ఈ. స్త్రీ. భోగముది: చూ, వేశ్య.

కైలాగు, దే. వి: చూ, రూ-కయిలాగు.

కొంకరలువోవు, దే. అ. క్రి. (కొంకరలు + పోవు) శైత్యాదుల చేతఁ గాళ్ళుచేతులు లోనగునవి నిగిడికొను. రామా. 7, ఆ. 258: చూ, వంకరవోవు.

కొంకి, దే. వి. రూ-క్రొంకి. 1. వంపుచీల; 2. ఆంపని యిండ్లు లోనగువానిఁ గోయుటకు ఉపయుక్తముగా వంకరచీల్లువోవిన కోల: క్రొంకి, దోఁటి; బ. 3. ముక్కోలి గుబ్బికిఁ బార్శ్వములనుండెడి యెముకలు: చూ, శల్యము. 1-౪; 4. మోఁకాలిచిప్పకు లోతట్టు రెండుప్రక్కలనుండెడి యెముకలు: చూ, శల్యము. 1-౫; (కొంకిప్రేళ్ళు = గొంకి వడెనుండు ప్రేళ్ళు.)

కొంకిపురుగు, వా. వి. మనుజునిశరీరమునఁ బ్రవేశించి హింసించు ఒకానొక పురుగు, (నులిపురుగువంటిది): చూ, పురుగు.

కొంకు, దే. వి. 1. భయము: చూ, వెఱపు. 2: చూ, వెనుదీయుట. విక్ర. 3, ఆ. 97; 3. జంకు: చూ, సంకోచము. 3; అ. క్రి. 4 జంకు. విక్ర. 7, ఆ. 127: చూ, భయపడు; 5. వెనుకదీయు: చూ, వెనుదీయు. 1; 6. మోమోటు: చూ, సంకోచించు.

కొంకుపాటు, ద్వి. వి. 1. భయపడుట. కవిక. 4, ఆ. 107; 2. సంకోచపడుట. హంస. 3, ఆ. 220; 3. జాఱుపాటు: చూ, స్ఖలనము. 2.

కొంకువోవు, దే. అ. క్రి. (కొంకు + పోవు) కాళ్ళేతులు నిగుడుకొను; భార. శాం. 3, ఆ. 313: చూ, వంకరపోవు. (రూ-కొంకరలువోవు-కోరవోవు).

కొంగ, వై. వి = క్రుఞ్. క్రౌంచము: చూ, బకము.

కొంగకాళ్ళవాఁడు, ద్వి. విశే. నిడుపుమోఁకాళ్ళవాఁడు: చూ, ఊర్ధ్వజానువు. 1.

కొంగవాలు, వై. వి. = కృఞ్వాల. మాడిగకత్తి. య. 2, ఆ. 10: చూ, రిష్టి. 2-౩.

కొంగు, దే. వి: చూ, చెంగు.

కొంగుపసిఁడి, జా. కొంగుబంగారు. సులభముగా నభీష్టమును దీర్చునది. "కోపమొకింత లేదు. బుధకోటికిఁ గొంగుపసిండి." (విజయవిలాసము).

కొంగుమాయు, దే. అ. క్రి: చూ, సమర్తాడు.

కొంగోడువడు, ద్వి. అ. క్రి. (కొంగోడు + పడు) అవనతమగు: చూ, వ్రాలు. 3.

కొంగోడువోవు, దే. అ. క్రి. (కొంగోడు + పోవు) —వై.—

కొంచించు, దే. అ. క్రి. రూ-కొంచు. రసి. 5, ఆ. 139: చూ, సంకోచించు.

కొంచియము, వై. విశే. = కించిత్. రూ-కొంచెము. 1. = కుంచః. న్యూనత: చూ, వెలితి. 2; విశే. 2. అల్పము. కాశీ. 3, ఆ. 140: చూ, స్వల్పము.

కొంచెకత్తె, వై. వి. (కొంచెము + కత్తె) 1. సామాన్యురాలు: చూ, స్త్రీ. 1-౩౨; 2. అల్పురాలు: చూ, స్త్రీ. 1-౩౩.

కొంచెకాఁడు, ద్వి. విశే. (కొంచెము + కాఁడు) 1. అల్పుఁడు: చూ, హీనుఁడు; 2. సాధారణుఁడు: చూ, సామాన్యుఁడు.

కొంచెకొంచెము, వై. వి. (కొంచెము + కొంచెము) ఇంచించుక: చూ, స్వల్పము.

కొంచెతనము, వై. వి. (కొంచెము + తనము) అల్పభావము. అప్ప. అర, కాం. 23: చూ, సన్నదనము.

కొంచెపడు, వై. అ. క్రి. (కొంచెము + పడు) 1. తప్పువడు, భో. 6, ఆ. 191: చూ, లోపించు. 2; 2 సన్నగిల్లు: చూ, సన్నవాఱు.

కొంచెము, వై. వి, విశే: చూ, రూ-కొంచియము (న్యూనత.—భాగ. 1, స్కం. 95.)

కొంచ, వై. వి. = క్రౌంచః. 1. క్రౌంచపర్వతము: చూ, పర్వతము; 2. కొంగ. భార. భీష్మ. 2, ఆ. 30: చూ, బకము.

కొంచగుబ్బలి, ద్వి. వి. క్రౌంచపర్వతము: చూ, పర్వతము. (ఇట్లు కొంచమల).

కొంచదీవి, వై. వి. = క్రౌంచద్వీపము: చూ, లంక. 1.

కొంచమలఁగొట్టిన జాణఁడు, ద్వి. వి. షణ్ముఖస్వామి. ఆం, భా, స్వ. 44: చూ, స్కందుఁడు.

కొంచమొగ్గరము, ద్వి. వి. క్రౌంచవ్యూహము.

కొంచసారము, వై. వి. = క్రౌంచస్వరము. మధ్యమస్వరము: చూ, స్వరము. (2-3-౪).

కొంచు, దే. వి. 1. మలినస్వేదము. ఆం. భా. ప్ర. నా. 140: చూ, స్వేదము; వై. అ. క్రి. 2. జంకు. భార. ఆది. 5. ఆ. 166: చూ, సంకోచించు. (రూ-కొంచించు-కొంజు-కొంగు.)

కొంజు, వై. అ. క్రి. రూ-కొంచు. భాగ. 10, స్కం. పూ. 1317: చూ, సంకోచించు.

కొంట, దే. వి. కొనుట (అనుప్రయుక్తమైన కొను ధాతువునకు రూపమిట్లుండును. వసుఁగొంట - తియుకొంట - పయికొంట మొ.)

కొంటె, దే. విశే. అకార్యశీలుఁడు. భో. 5, ఆ. 331: చూ, వ్యాధుఁడు. 2.

కొంటెతనము, ద్వి. వి: చూ, పైశున్యము.

కొంటెపనులు, దే. వి. బ: చూ, ఆగడులు.

కొండ, వై. వి. = కుండ. 1. మల: చూ, పర్వతము; 2. ఒకానొక యింటిపేరు.

కొండంగి, వై. వి. = కుండగ: చూ, రూ-కుండఁగి (రూ-కొండెంగ, కుండంగి, కొండముచ్చు.)

కొండకంది, ద్వి. వి. 1. సస్యవిశేషము: చూ, సస్యము; బ. 2. కొండకందులను ధాన్యము: చూ, సురాష్ట్రిజము (స్తంబకరి. 1-౨౬-౧౩.)

కొండకసింద, వై. వి. ఒకరకపు కసింద *: చూ, బలుసు. (దీనివేరుయొక్క కషాయము జ్వరమును, మస్తిష్కజ్వరమును తగ్గించును.)

కొండకాకి, వై. వి. అద్రికాకము: చూ, వాయసము. 1.

కొండకాలువ, వై. వి. ఝరము: చూ, నది.

కొండకావిజాయి, ద్వి. వి. ఇంగిలికము: చూ, హింగుళము.

కొండకొన, వై. వి. కొండకొమ్ము: చూ, శిఖరము. 1.
కొండకొమ్ము, ద్వ. వి. —పై.—
కొండకోఁతి, ద్వ. వి. బాలక్రీడావిశేషము: చూ, బాలక్రీడ.
కొండకోట, ద్వ. వి. వరణాకారమైన కోట: చూ, పర్వతము.
కొండకోలు, ద్వ. వి. కొద్దియుగట.
కొండగీఁడు, ద్వ. వి. కొండెము చెప్పువాఁడు: చూ, దంటల మారి 1.
కొండగుద్దలి, వై. వి. జాపు పెకలించుగుద్దలి: చూ, ముద్గరము.
కొండగుఱుతు, ద్వ. వి. సామాన్యలక్షణము: చూ, లక్షణము. 1-౫౦.
కొండగొనుగు, ద్వ. వి. అక్షోటము *: చూ, మృదుద్రుమము.
కొండగొఱియ, వై. వి =కుండపరరి. గాడిదవంటి మృగము, రాహిషము: చూ, మేషము. 1. (రూ-కొండగొఱ్ఱియ- కొండ గొఱ్ఱె.)
కొండగోఁగు, ద్వ. వి. చూ, కొండగొనుగు *.
కొండగోసు, ద్వ వి. —పై—
కొండగోల, ద్వ. వి. ఒకాకొండమృగము: చూ, మృగము.
కొండచఱియ, ద్వ. వి. తటము: చూ, చఱియ.
కొండచిలువ, ద్వ. వి. కొండపాము, అజగరము: చూ, సర్పము. 1-౪-(౨౦) (కొండచెలువ అనియువాడుక.)
కొండచీమ, ద్వ. వి. ఉద్దీపకము: చూ, పిపీలి.
కొండచూలి, ద్వ. వి. గట్రిచూలి. భాగ. 9, స్కం. 514: చూ, పార్వతి. 1. (ఇట్లుకొండరాచూలి.)
కొండజొన్న, వై. వి. =దుండజార. 1. ఒకరకము సస్యము: చూ, సస్యము; బ. 2. జొన్నలను ధాన్యము: చూ, ధాన్యము. (స్తంబకరి. 1-౨౬-౧౬.)
కొండతంగేడు, ద్వ. వి. శైలగోత్రేటి *: చూ, తంగేడు.
కొండతలక్రిందఁబెట్టుకొని రాళ్ళకుపదువెత్తినట్లు, లో. తడకోరిక దగ్గఅనే ఫలించుచుండఁగా అదితెలిసికొనక దూరమేగిన విధము. (ఉయ్యాలలోని బిడ్డంగానక ఊరంతయు వెదకుట వంటిది.)
కొండతేనె, ద్వ. వి. కొండయందుఁబుట్టిన తేనె: చూ, మధువు.5.
కొండతిమ్మరి, ద్వ. వి. కోఁతి. (ఇట్లు చిప్పతిమ్మరి, మలతిమ్మరి మొ.): చూ, వానరము.
కొండనఱము, ద్వ. వి: చూ, కొండచఱియ.
కొండనాలుక, ద్వ. వి 1. ఉపునాలుక, గళశుండిక: చూ, రోగము. 1; 2. తాలూర్ధ్వసూక్ష్మజిహ్వ: చూ, రసన
కొండపగతుఁడు, ద్వ. వి. ఇంద్రుఁడు: చూ. సహస్రాక్షుఁడు.
కొండపగులు, ద్వ. వి: చూ, లోయ.
కొండపలుకు, ద్వ. వి. పర్వతబిలమునందలి ప్రతిధ్వని: చూ, స్వరము. 2-౪౬-(౪౦.)
కొండపిండి, వై. వి. నగభేది. అం, భా. ద్వి. వ. 65: చూ, పిండికొండ.
కొండపిండికొట్టుట, జా. దుర్ఘటమైన కార్యము సాధించుట. "మెము ముగ్గురము పనికి మ్రొగ్గితిమేనిఁ గొండపిండి కొట్టనేర్తుము." (ధర్మజరాజసూయము.)

కొండప్రత్తి, వై. వి ఒకరకము ప్రత్తి *: చూ, ప్రత్తి.
కొండబూరుగు, ద్వ. వి. కూటశాల్మలి *: చూ, వారిజము.
కొండబెండ, ద్వ. వి. 1. తస్కరి *: చూ, షడ్గ్రంథ; 2. కచ్ఛారకము *: చూ, షడ్గ్రంథ.
కొండమల్లయ్య, ద్వ. వి. ముక్కంటి: చూ, శివుఁడు. 1.
కొండమల్లె, వై. వి. =కుండమల్లికా. గిరిమల్లిక *: చూ, వత్సకము.
కొండమామిడి, ద్వ. వి. కోశామ్రము *: చూ, మామిడి.
కొండమారేడు, ద్వ. వి. గంధగర్భము *: చూ, మారేడు.
కొండము, వై. వి. =కుండమ్. గుండము; నిప్పులగుండము. అం, భా. ద్వి. వై. 241: చూ, వహ్ని. 1-33.
కొండముచ్చు, ద్వ. వి. గోలాంగూలము. నల్లని మూఁతిగల కోఁతి. వేమన. 1180: చూ, వానరము. 1-౫. (రూ-కొండ ముచ్చు-కొండముసువ.)
కొండముసువ, —పై.—
కొండమ్రుచ్చు, —పై—
కొండయల్లుఁడు, ద్వ. వి. (కొండ + అల్లుఁడు): చూ, కొండ మల్లయ్య
కొండయూట, ద్వ. వి: చూ, నెలయూట.
కొండరాచూలి, ద్వ. వి: చూ, కొండచూలి.
కొండఱెక్కలుఁగొట్టినదఱి, ద్వ. వి. ఇంద్రుఁడు. సాంబ. దే. 11: చూ, సహస్రాక్షుఁడు.
కొండఱేఁడు, ద్వ. వి. హిమవంతుఁడు. భోజ. 5, ఆ. 191: చూ, పర్వతము.
కొండల్లము, వై. వి. =కుండవోల్ల. (కొండ + అల్లము) తృణపుష్పిక *: చూ, శృంగబేరము.
కొండవాఁడు, ద్వ. వి. కొండబోయ: చూ, వ్యాధుఁడు. 1.
కొండవీటిజంగము, ద్వ. వి: చూ, కొండమల్లయ్య. అం, సం. దేవ. 6.
కొండసిక, వై. వి. పర్వతశృంగము: చూ, శిఖరము.
కొండాటము, దే. వి. ఆనందము. వీర. 1, ఆ. 201: చూ, సంతోషము.
కొండాడు, దే. అ. క్రి. పొగడు: చూ, స్తుతించు.
కొండి, దే. వి. 1. తేలుతోఁక: చూ, వాలము. 1; 2. తెక్కతలుపునకు ఎంచులయందుఁ గొట్టెడు తేలుతోఁకవంటి యినుపగొళ్ళెము. (రూ-కొండె): చూ, గొళ్ళెము.
కొండిక, వై.వి. =కుణక. రూ-కొండొక. 1. చిన్న. య. 4, ఆ. 127; పాండు. 2, ఆ. 60: చూ, స్వల్పము; 2. బాలుఁడు: చూ, శిశువు. 1-౫; 3. బాలిక: చూ, స్త్రీ. 1-౧.
కొండికనాఁడు, ద్వ. వి. బాల్యకాలము.
కొండికవాఁడు, ద్వ. వి. బాలుఁడు. సాంబ. మాన. 5: చూ, శిశువు 1.౫.
కొండియ, దే. వి. రాజులలోనగువారు మొగముతట్టువేసికొనెడు పెంద్రుకలముడి (రూ-కొండె: చూ, సిక. 1-౪; కొండెసిగ అనివాడుక.)
కొండియము, వై. వి. =కుండకీట. 1. రూ-కొండెము, చాడి: చూ, దంటా; 2. పిశునత్వము: చూ, పైశున్యము. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

కొండీయుఁడు, వై. విశ. = కుంటకీట, (రూ-కొండీడు. కొండెము చెప్పువాఁడు. భార. శాం. 3, ఆ. 469: చూ, సూచకుఁడు. 1. (దేశ్యమని శబ్దరత్నాకరము.)

కొండీఁడు, వై. విశ. —వై.— మార్క. 2, ఆ. 96.

కొండె, దే. వి. 1. తేలుకొండి: చూ, వాలము. 1; 2: చూ, రూ-కొండియ

కొండెంగ, వై. వి. = కుంతగః: కొండముచ్చుమున్నది నల్లకోఁతి. హరిశ్చ. 2, ఆ. 1059: చూ, వానరము. 1-౫.

కొండెకత్తె, ద్వ. విశ. (కొండెము + కత్తె) కొండెము చెప్పునది (ఆఁడుది): చూ, స్త్రీ. 1-౨౦౨.

కొండెకానితనము, ద్వ. వి. కొండెతనము: చూ, పైశున్యము.

కొండెగాఁడు, ద్వ. విశ. (కొండెము + కాఁడు): చూ, రూ-కొండియఁడు.

కొండెము, వై. వి: చూ, రూ-కొండియము. (తంటా.—అచ్చ. బాల, కాం. 21.)

కొండెవల, దే. వి. చేఁపలఁబట్టుటకు ఒకరఁడు వేసెడు వల: చూ, వల. 1.

కొండొక, వై. విశ. 1. రూ-కొండిక. చిన్న. రాఘ. 1, ఆ. 71: చూ, స్వల్పము; 2. కొంచెము. "కొండొకసేపు": చూ, స్వల్పము; 3. రూ-కొండిక. బాలుఁడు. భార. శ్రీ. 2, ఆ. 84: చూ, శిశువు. 1-౫.

కొంద్ర, దే. వి. మళ్ళించిదున్నినచాలు. కాశీ. 4, ఆ. 299: చూ, గొంౘ.

కొంద్రకైదువు, దే. వి. నాఁగలి: చూ, లాంగలము. 1.

కొంత, వై. స. (కొంచెము + అంత) ఇంచుక కొలఁది. "కొంతదవ్వు": చూ, స్వల్పము.

కొంతము, వై. వి. = కుంతము. అత్తలము: చూ, బాణము. 1-౧౮.

కొందఱు, వై. స. (కొంత + వారు) కొంతశబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనరూపము: చూ, అపరము. 8.

కొందలపడు, ద్వ. అ. క్రి. (కొందలము + పడు) కలఁతపడు: చూ, సంక్షోభించు.

కొందలపాటు, ద్వ. వి. కలఁత, కొందలపడుట: చూ, సంతాపము.

కొందలము, దే. వి. 1. —వై.— భార. విరా. 4, ఆ. 172; 2. వగ: చూ, శోకము. 2.

కొందలించు, దే. అ. క్రి. కలఁతపడు: చూ, సంక్షోభించు.

కొందు, దే. స. క్రి. నజ్జుగనఁటకు (నజ్జు = అణువు).

కొంప, దే. వి. 1. లొంప. చిన్న ఇల్లు: చూ, సదనము. 1; 2. ఇల్లు. సానం. 5, ఆ. 211; వేమన. 1190: చూ, సదనము. 1. (పిందమొదలగు సమయములయందే యిది ప్రయోగింపఁబడును.)

కొంపచెఱుపు, దే. వి: చూ, ద్రోహ.

కొంపతీయుట, జా. మోసముచేసి నష్టపుచ్చుట, గుట్టుచెప్పుట మొ.

కొంపోవు, దే. స. క్రి. (కొని + పోవు). రూ-కొనిపోవు. తీసికొనిపోవు. ప్రభా. 3, ఆ. 148: చూ, లాగించు.

కొకిబికి, దే. విశ. చక్కనతప్పినది. స్వా. 4, ఆ. 73.

కొక్కరాయి, వై. వి. = ప్లవః. పక్కికొంగ. రూ-కొక్కెరాయి: చూ, బకము.

కొక్కరించు, దే. అ. క్రి. 1. (కోడి) వెక్కిరించు. రా. సుం.కాం. 274 పొలట: చూ, వెక్కిరించు. 2; 2. (పిల్లలకాళ్ళతో) కెల్లగించు. మను. నా. 2, ఆ. 281: చూ, ఛేదిల్లు.

కొక్కరింత, దే. వి. కొక్కరించుట.

కొక్కరాయి, వై. వి. =: చూ, కొక్కెరాయి.

కొక్కి, దే. విశ. ఎప్పు తప్పకపైన [illegible] చూ, గొగ్గి.

కొక్కిస, దే. వి: చూ, విన్నాణములు.

కొక్కు, దే. వి. పందికొక్కు. వేమన. 1173: చూ, మూషికము.

కొక్కురవుతు, ద్వ. వి. గణపతి: చూ, వినాయకుఁడు. 1. (రూ-కొక్కురౌతు).

కొక్కెము, వా. వి తగిలించుకొక్కు.

కొక్కెర, వై. వి. = ప్లవః. (రూ-కొక్కిర - కొక్కిరాయి - కొక్కురాయి-కొక్కెర-కొక్కు-కొక్కెరాయి-కొంక్కిరాయి). భార. శాం. 3, ఆ. 478: చూ, [illegible].

కొక్కెరగొలిసెల్లు, ద్వ. వి. [illegible]: చూ, [illegible]. 1-౮.

కొక్కెస, దే. వి. ఒకానొకచెట్టు: చూ, [illegible].

కొక్కొరొకో, దే. వి. కోడికూయుటయందగు ధ్వన్యనుకరణము. కాశీ. 3, ఆ. 235: చూ, [illegible] (కొక్కొరొకో).

కొక్కొరోకో, —వై.— (కొక్కురూకో యనియునగు).

కొచ్చెమాట, దే. వి. రెండర్థములమాట: చూ, శబ్దము. 2-౩౧.

కొజ్జ, దే. వి. రూ-కొజ్జా. రాణివాసపు కావలివాఁడు; అం, న. నర. 44: చూ, నపుంసకుఁడు.

కొజ్జా. —వై.— భో. 4, ఆ. 319.

కొటారము, దే. వి. 1. ధాన్యాదికాలయుంచెడి చోటు. వసు. 2, ఆ. 149: చూ, పంటసాల; 2. ఉప్పునిలువయుండెడి చోటు. "ఉప్పుకొటారు." (ఇట్లు గోదావరిమండలమునవాడుదురు): చూ, భూమి. 1. (రూ-కొటారు-కొట్టరువు-కొఠారు).

కొటారి, దే. వి. ఉగ్రాణపువాఁడు; బస. 2, ఆ. 48: చూ, కొట్టుపెద్ద.

కొటారు, దే. వి: చూ, కొటారము. అచ్చ. బాల, కాం. 8.

కొటిక, వై. వి. = 1. ఖేటకః. రూ-కొట్టిక. గ్రామము జై. 1, ఆ. 88: చూ, దేశము; 2. పొట్టివాఁడు: చూ, వామనుఁడు. 3. = కశేర. పిసినిగొట్టు: చూ, లోభి.

కొటికాఁడు, దే. వి. రూ-కొట్టికాఁడు. జై. 8, ఆ. 41: చూ, వేఁగువాఁడు. (రూ-కొట్టికాండ్రు - కోటికాండ్రు - గొట్టికాండ్రు)

కొటిక్బ్రాహ్మణులు. అం. వీరు ఉత్కళదేశపు బ్రాహ్మణులు. ఋగ్వేదులు. ఆశ్వలాయన సూత్రమువారు: చూ, బ్రాహ్మణులు.

కొట్టఁబడినవాఁడు, దే. వి: చూ, ఆహతుఁడు. 2.

కొట్టకొన, దే. వి. (కొన + కొన) అన్నిటికిఁ గొన: చూ సుద. 2.

కొట్టడి, వై. వి. = కోష్ఠము. సామగ్రులుంచెడు గది: చూ, పంటసాల.

కొట్టము, దే. వి. 1. హర్మ్యశకటము, కోలాటము. ఆం, భా. ప్ర. నా 130: చూ, వ్యంజనము. 1: (రూ-కొట్టాము); వై.వి.= కోష్ఠ. 2. అనుకూలమగు సాల: చూ, సదనము. 1; 3. పసులు లోనగువానికి గట్టెడుసాల: చూ, సదనము. 1; 4. ఉగ్రాణము: చూ, పంటసాల: (చూ, సదనము. 1.)

కొట్టరువు, దే. వి: చూ, రూ-కొటారు 1, 2, 3; 4. ఒకానొక గ్రామము; 5. కొట్టరువు అను గ్రామనామము, తిక్కన సోమయాజిగారి యింటిపేరని కొందఱు; 6. ఆంధ్రభాషావ్యాప్తి కర్త యింటిపేరు మొదట కొట్టరువువారనియు రానురాను కొత్ర అను పేరుగ మారెననియు కొందఱు:(చూ,కొత్ర. 3,4.)

కొట్టాడు, దే. అ. క్రి. (కొట్టు+ఆడు) 1. జగడమాడు: చూ, వాటులాడు; 2. గాసిల్లు; భాగ. 6,స్కం. 43: చూ, బాధపడు.

కొట్టాము, దే. వి. ఒకానొకదేశము. స్వా. 1, అ. 37: చూ, దేశము; వై వి. 2. = కోష్ఠ : చూ, రూ-కొట్టము. 2-3-4.

కొట్టి, దే. వి. రూ-కోటి. రాజ్యసమూహము: చూ, వేగు.

కొట్టిక, వై. వి. = ఖేటక. ఊరు: చూ, రూ-కొటిక.

కొట్టికాఁడు, దే. వి: చూ, రూ-కొటికాఁడు. ఆము. 3, అ. 26.

కొట్టికోలాహలముచేయుట, జా. ఎక్కువ సంభ్రమగోళముచేయుట. (చెండి చెకపికలాడుట) "ఎ, గీ. కొట్టి కోలాహలముఁజేసి కూలఁద్రుమ్మి, చెండి చెకపికలాడమూ యంతసేసి". (సార 1, అ. 74.)

కొట్టిగడ్డ, ద్వ. వి. సమ్మడుంప *: చూ, సుపుష్పము.

కొట్టినపిండి, జా. స్వాధీనము, ఎఱిఁగినది. "డి. కోమలినాకు నెట్టిమెడఁ గొట్టినపిండి సమస్తరోగముల్." కళా. 6, అ. 34. (చెల్లుబడిన పొయ్యిపంటిదని వాడుక.)

కొట్టు, వై. వి. 1.=కోష్ఠము. ఉగ్రాణము. అచ్చ. బాల, కాం. 21: చూ, పంటసాల: (చూ, సదనము. 1.); దే. వి. 2. చతురుపాయములలో నొకటి (కొట్టు=దండ:(చూ, దంగి): చూ, ఉపాయములు; 3 అసుపు: చూ, మొత్తు. 1; స. క్రి. 4. అడుచు: చూ, మొత్తు. 2; అం. 5: చూ, చిహ్నములు.

కొట్టుపడు, ద్వ. అ క్రి. వ్యయమగు చూ, వ్యయించు.

కొట్టుపెద్ద, ద్వ. వి: చూ, కొటారి.

కొట్టులాడు, దే. అ. క్రి. (కొట్టుట+ఆడు) పోట్లాడు: చూ, వాటులాడు.

కొట్టులాట, దే. వి. రూ-కొట్లాట: చూ, యుద్ధము.

కొట్టె, దే. వి. 1. మట్టిమొదలగుయంతటి దిగుఁగల కాఁగు. ఆం, భా. ద్వి. వై. 240: చూ, పాత్రము. 6; 2. కొట్టు: చూ, పంటసాల: (చూ, సదనము. 1.)

కొట్నము, దే. వి. 1. వడ్లదంపు: చూ, దంపుడు; 2. వివాహతంత్రములలో నొకటి, వడ్లదంపు. "పేరటాండ్రు కొట్నాల పాట పాడుచున్నారు.": చూ, దంపుడు; 3. ఊడిగము. య. 2, అ. 61: చూ, శుశ్రూష.

కొత్ర, వై. వి. 1.= ఖర్వరక: రూ-కొత్రి, పొట్టివాఁడు: చూ, వామనుఁడు; దే. వి. 2. పిండి లోనగువాని నుదకఁబెట్టుటకుఁ బెట్టెడి యెసరు. కాశ. 3, అ. 36: చూ, సాదము (1)-౧౦; 3. ఒకానొక యింటిపేరు. "కొత్రవారు" 4. ఒకానొక గ్రామనామము: (చూ, కొట్టరువు.)

కొత్రి, వై. వి.=ఖర్వరక: చూ, రూ-కొత్ర. 1.

కొట్లమారి, దే. విశ. (కొట్లు+మారి) కొట్లుపడు స్వభావము గలవాఁడు.

కొట్లాట, దే వి: చూ, కొట్టులాట.

కొతారు, వా. వి.=కోష్ఠము. అం, భా. ద్వి. 15: చూ. రూ-కొటారు.

కొఠే, వా. వి. 1. సాహుకారు ఇల్లు: చూ, సదనము. 1; 2. వర్తకసంఘము; 3. ఒకానొక యింటిపేరు.

కొడపము, వై. వి. = కురప, గొఱపము: చూ, బాణము.1-౨౬.

కొడమ, దే. వి. ముఖభాగమునఁగట్టు లేక నడుమ వలవలె నల్లికగల యూఁతవంటియొక మత్స్యగ్రహణ సాధన విశేషము, అడ్డకొడమ. తిక్క: వల. 1.

కొడవలి. దే. వి. లిక్కి: చూ, రిష్ట. 2-౨౫. (చిన్నకొడవలిని "గిద్ద" అని గోదావరిమండలమున వాడెదరు:)

కొడస, వై. వి.=కుటజ. కొండమల్లె. రూ-కొడిస *: చూ: వత్సకము.

కొడి, వై. వి.=కోటి. 1. దీపశిఖ. పాండు. 2, అ. 127: 2. జుట్టుముడి =: చూ, సిగ. 1-౫.

కొడిద, దే. వి సంకుంచ్య చతురంగుళి. వంచినచేర. ఆం, భా. ద్వి. 140: రూ-కొడిదిలి-కొణిదిలి: చూ, హస్తము. 1-౧౪.

కొడిది, దే. వి. కొడిదిచెట్టు. పంచ. వేం. 1, అ. 598: చూ, రూ-కొడ్డి.

కొడిదిలి, దే. వి. రూ-కొణిదిలి. 1: చూ, రూ-కొడిద.

కొడిమె, దే. వి. 1. దోషము. జై. 1, అ. 2: చూ, పాపము. 1; 2. అన్యతవాక్కు: చూ, వితథము; 3. అపదూఱు. కళా. 5, అ. 56: చూ, నింద. 1; 4. కష్టము: చూ, శోకము; 5. చేపలబుట్ట. ఆం, భా. ప్ర. వారి. 159: చూ, వల. 1; 6. దురవస్థ: చూ, పీనుఁగుపెంట.

కొడిమెలాఁడు, దే. విశ. (కొడిమెలు+ఆఁడు) పాపాలముద్ద: చూ, పాపాత్ముఁడు.

కొడివె, దే. వి. 1. అబద్ధోక్తి: చూ, వితథము; 2. కష్టము: చూ, దుఃఖము; 3. చేపలబుట్ట: చూ, వల. 1; 4. దురవస్థ: చూ, పీనుఁగుపెంట.

కొడిస, వై. వి.=కుటజః రూ-కొడిసె *: చూ, వత్సకము.

కొడిసె, వై. వి =—వై.—(దీనికాయ ఇంద్రయవము.)

కొడిసెరాము, ద్వ. వి: చూ, ఇంద్రయవము (గ్రామీణ. అతిసారాదులకు వాడెదరు)

కొడిసెపాల, ద్వ.—వై.—

కొడిసెప్రాలు, ద్వ. —వై —

కొడుఁగురు, దే. వి. (రూ - కొణుఁగురు - కొణుసురు) దీపము యొక్క చిట్టెము: చూ, సిగ. 4

కొడుకఁడు, వై. వి. = కుణకః (రూ-కొడుకు-కొడుక్కు-చిన్న కొడుకు): చూ, పుత్త్రుఁడు. 1.

కొడుకు, వై. వి.=కుణకః. 1.—వై—; అం, 2: చూ, స్త్రీ రక్షకులు.

కొడుకులుచెడుట, అం: చూ, నష్టములు.

కౌపీనవంతః ఖలు భాగ్యవంతః, న్యా. గోచీగలవారే యనఁగా మునులు భాగ్యవంతులు (బ్రహ్మసుఖము గలవారు.)

కౌపోదకి, సం. వి. ఈ. స్త్రీ. విష్ణుప్రయొక్క గద: చూ, నాణము. 1-౭౮. (రూ-కౌమోదకి.)

కౌబేరము, సం. వి. అ. న. 1. చెంగల్వకోష్ఠు*: చూ, పారిభాద్యము; 2. పాలుపిండికలిపి వండినపిండివంట: చూ, భక్ష్యము.

కౌమారము, సం. వి. అ. న. 1. బాల్యమునకు అనువివయోవస్థ (మూఁడవయేఁట మొదలు ఎనిమిదేఁడ్లవఱకునైన ప్రాయము): చూ, వయస్సు. 1; అం. 2: చూ, అవస్థలు.

కౌమారి, అం. 1. బ్రాహ్మ్యాది సప్తమాతృకలలో నొకతె: చూ, మాతృకలు: 2. దుర్గ: చూ, పార్వతి. 1.

కౌమారీభైరవతంత్రము, అం: చూ, తంత్రములు.

కౌముదము, సం. వి. అ. పుం. కార్తికమాసము: చూ, మాసము.1.

కౌముది, సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ముది. చంద్రిక: చూ, వెన్నెల; 2. ఉత్సవము: కార్తికోత్సవము (అని కొందఱు): చూ, పండుగ. 2; 3. ఒకానొక గ్రంథము. "సిద్ధాంతకౌముది."; అం. 4. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమునందు న, త, త గురువులతోఁగూడి ఆఱింట యతిగలిగి పదివ ఛందస్సునందుఁ బుట్టినవృత్తము. ఉదా:— "మునినుతా కౌముదీవృత్త మొప్పును నతాంగం-బులఁ షడ్యతిన్. దునిమెఁ బొల - స్త్యు భూపుత్రికై కినుక రామ - క్షితీశుండనన్.": చూ, వృత్తము. 1.

కౌముదీచారము, సం. వి. అ. పుం. న. ఆశ్వయుజ పూర్ణిమ, శరత్కాలపూర్ణిమ: చూ, పున్నమ.

కౌముదీద్రుమ, సం. వి. ఉ. పుం. దీపపుస్తంభము, శిఖాతరువు: చూ, స్తంభము. 1.

కౌముదీపతి, సం. వి. ఇ. పుం. చందురుఁడు: చూ, హిమాంశువు.

కౌముదీవృక్షము, సం. వి. అ. పుం: చూ, కౌముదీద్రుమ.

కౌమోదకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-కౌపోదకి.

కౌమోది, —పై.—

కౌయ, దే. వి. 1. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1: 2. చేప మీఁదిపొలుసు: చూ, శల్కము. 3.

కౌరవులు, పా. కురురాజుయొక్క సంతతి.

కౌరవ్యము, సం. వి. అ. పుం. దేవయోని సర్పవిశేషము: చూ, సర్పము. 1-౪.(౭).

కౌరవ్యుఁడు, సం. వి. అ. పుం. కౌరవేయుఁడు. కురువంశజుఁడు.

కౌరు, దే. వి. వర్ణాధిక్యము, రూ-కవురుహంస. 3, ఆ. 193: చూ, వర్ణము. 6-౧౨.

కౌరులు, దే. వి. బ. నాట్యగతిభేదము: చూ, నాటకము. 1.

కౌర్పము, సం. వి. అ. పుం. వృశ్చికరాశి: చూ, రాశి. 2.

కౌర్మము, సం. వి. అ. న. రతిబంధవిశేషము: చూ, రతిబంధములు. 1-౩.

కౌలకేయుఁడు, సం. వి. అ. పుం. అసతీపుత్త్రుఁడు: చూ, పుత్త్రుఁడు. 1.

కౌలటినేయుఁడు, సం. వి. అ. పుం. భిక్షుకియైన పతివ్రత కొడుకు: చూ, మానుఁడు. 1-౧౭. (రూ-కౌలటేయుఁడు.)

కౌలటేయుఁడు, 1.—పై.—; 2. రూ-కౌలటేరుఁడు. అంకుటాలి కొడుకు: చూ, మానుఁడు. 1-౧౭.

కౌలటేరుఁడు, —పై.—

కౌలవ, అం. చూ, కరణము. 11: (చూ, కరణములు. 2.)

కౌలికుఁడు, సం. వి. అ. పుం: చూ, [illegible].

కౌలీనము, సం. వి. అ. న. 1. గొప్పవంశమునందలి పుట్టుక; 2. స్త్రీపురుషుల గుహ్య: చూ, భగము. 12; 3. పశుపక్ష్యాదుల జగడము: చూ, యుద్ధము; 4. జగడము: చూ, యుద్ధము; 5. నిందింపఁదగినపని: చూ, [illegible]. 1; 6. అపవాదము: చూ, నింద. 1.

కౌలిని, సం. వి. ఇ. స్త్రీ. [illegible]*: చూ, శృంగి.

కౌలు, దే. వి. [illegible]. "కౌలు [illegible].": చూ, ముచ్చలవా.

కౌలుఁడు, సం. వి. అ. పుం. కౌలమతస్థుఁడు: చూ, అన్యమతుఁడు.

కౌలుత్థీనము, సం. విశే. ఉలవలుగలచేను (నేల). రూ-కౌలత్థీనము: చూ, భూమి. 1-[illegible].

కౌలేయకము, సం. వి. అ. పుం. 1. కుక్క: చూ, శునకము; విశే. 2. మంచికులమునఁ బుట్టినది.

కౌలేయకుఁడు, సం. వి. అ. పుం. 1. సత్కులీనుఁడు: చూ, సజ్జనుఁడు; 2. ఇంద్రుఁడు: చూ, [illegible]; 3. మిక్కిలి స్త్రీలోలుఁడు: చూ, వలపుకాఁడు.

కౌలేయుఁడు, సం. విశే. కులీనుఁడు: చూ, సజ్జనుఁడు.

కౌల్యుఁడు, —పై.—

కౌశప, సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రమ్మిద: చూ, ప్రమిదె: (చూ, పాత్రము. 6): 2. గిన్నె: చూ, పాత్రము. 6.

కౌశము, సం. వి. అ. న. కాన్యకుబ్జము: చూ. దేశములు.

కౌశలము, సం. వి. అ. న. నేర్పరితనము: చూ, నైపుణ్యము. 1: (రూ-కౌశల్యము.)

కౌశలి, సం. వి. ఇ. స్త్రీ. 1. కుశలప్రశ్నము: చూ, స్వాగతము; 2. వర్తమానము: చూ, సందేశము.

కౌశలేయుఁడు, సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

కౌశల్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, కోసలాత్మజ.

కౌశల్యము, సం. వి. అ. న: చూ, రూ-కౌశలము.

కౌశాంబి, సం. వి. ఈ. స్త్రీ. వత్సపట్టణము: చూ, దేశము.

కౌశికప్రియుఁడు, సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

కౌశికఫలము, సం. వి. అ. పుం. కొబ్బరి*: చూ, స్కంధఫలము.

కౌశికము, సం. వి. అ. పుం. 1. గుగ్గులము*: చూ, మహిసాక్షి; 2. గుడ్లగూబ: చూ, [illegible]; 3. నకులము: చూ. ముంగిస; 4. అశ్వకర్ణము*: చూ, సాలము. 3-౨; 5. ఖజాంచి. మొదలగు బొక్కసమునకు అంగము: అ. 6: చూ, [illegible].

కౌశికస, అం. గోత్రములలో నొకటి: చూ. గోత్రములు. ప్రవరము-వైశ్వామిత్ర. అఘమర్షణ, కౌశిక: చూ, గోత్రము. 13.

కౌశికాత్మజుఁడు, సం. వి. అ. పుం. అర్జునుఁడు: చూ, విజయుఁడు.

కౌశికాయుధము, సం. వి. అ. న. ఇంద్రధనుస్సు: చూ, బాణము. 1-౧౬.

కౌశికారాతి, సం. వి. అ. పుం. కాకి: చూ, వాయసము. 1.

కౌశికి, సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1: 2. కౌశికి యను గోదావరినది: చూ, నది: 3. కౌశికి యను గ్రంథము;

క్రకచపృష్ఠి, సం. వి. ఈ. స్త్రీ. అంపపుఱంపువంటి వీపుగల, వడయి యను చేప: చూ, మత్స్యము. 1-అ.

క్రకచము, సం. వి. అ. పుం. 1.= కరపత్రము. రంపము: చూ, అంపము; 2. కరీరము*: చూ, వెదురు; అం. 3. = కరగసము. ధనుర్వేదమునందలి ముప్పదిరెండాయుధములలో నొకటి: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1)

క్రకచారకము, సం. వి. అ. పుం. గుఱ్ఱపుకొరడా: చూ, ముని కోల. 2.

క్రకణము, సం. వి. అ. పుం. చిన్నకకెక్కెర: చూ, జక్కెర.

క్రకరము, సం. వి. అ. పుం. 1.= కకెక్కెర. —పై —; 2. రంపము: చూ, అంపము: 3. కరీరము*: చూ, వెదురు.

క్రకరుఁడు, సం. వి. అ. పుం. పేదవాఁడు: చూ, బీదవాఁడు.

క్రక్కన, వై. వి జ. = కర్కశ. కఠినము. వై. 5, అ. 116: చూ, బెడిదము.

క్రక్కు, దే. వి. 1. కడుపున వికారమెత్తి తిన్నది వెడల నుమియుట: చూ, వాంతి; 2. కక్కు తెవులు: చూ, వాంతి; స. క్రి. 3. కడుపున వికారమెత్తి అన్నది వెడలనుమియు: చూ, వెళ్ళగొట్టు.

క్రక్కుడు, దే. వి; చూ, క్రక్కు.

క్రక్కున, దే. ప్ర క్రి. విణ: చూ, క్రంచఱ. (రూ-గ్రక్కున-గ్రక్కున-క్రచ్చఱ-క్రన్న.)

క్రక్కెర, వై. వి. = క్రకరః: చూ, రూ-కక్కెర.

క్రచ్చ, దే. వి. కాంక్ష: చూ, వాంఛ. (రూ-క్రచ్చు-కచ్చు.)

క్రచ్చఱ, దే. ప్ర. క్రి. విణ. (క్రచ్చు+అఱా) క్రంచఱ. భార. ఉద్యో: 1, అ. 176; రా. యు, కాం. 1447: చూ, వేగము. 3; 2. నిష్కల్మషముగా. భార. అర. 7, అ. 367.

క్రచ్చు, దే. వి. 1. కాంక్ష: చూ, వాంఛ; 2. మాలిన్యము: చూ, మలినము; 3. పేనినత్రాడు లోనగువానియందు దువయు త్తము కాని తృణాదుల యంశము; స. క్రి. 4: చూ, కొను. రామా. 5, అ. 190: చూ, వేష్టించు.

క్రచ్చుకొను, దే. స. క్రి. చుట్టుకొను. వసు. 4, అ. 57: చూ, వేష్టించు.

క్రతుచతుష్టయము, అం ప్రథమచష్టోమము, ద్వితీయోష్టోమము, తృతీయాతిరాత్రము, జ్యోతిష్టోమము. (4)

క్రతుదక్షులు, అం. వీరు విశ్వేదేవులు పదియుందిలో నివారు: చూ, విశ్వేదేవులు.

క్రతుధ్వంసి, సం. వి. న్. పుం. జన్నపుగొంగ: చూ, శివుఁడు.

క్రతుపశువు, సం. వి. ఉ. పుం. గుఱ్ఱము: చూ, హయము. 1-అ.

క్రతుపావకము, సం. వి. అ. పుం. యజ్ఞవహ్ని: చూ, వహ్ని. 1-ఎ.

క్రతుపురుషుఁడు, సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు.

క్రతుభుజుఁడు, సం. వి. జ్. పుం. జన్నపుదిండి, దేవత: చూ, వేలుపు.

క్రతురాజము, సం. వి. అ. పుం. రాజసూయయజ్ఞము: చూ, యజ్ఞము.

క్రతువు, సం. వి ఉ. పుం. 1. జన్నము, యూపస్తంభముగల యజ్ఞము. (అని కొందఱు): చూ, యజ్ఞము: 2. సప్త ఋషులలో నొకఁడు: (చూ, ఋషి): చూ, సన్న్యాసి-1: 3. ఫలోద్దేశ విశేషము: చూ, దేవనావిశేషము; 4. సత్యాగము: చూ, స్తనము: 5. యాగిపె: చూ, ఛస్మము; 6. పెసరపప్పు: చూ, నూనము: 7. చూ, వహ్ని. 1-అ; అం 8: చూ, బ్రహ్మ. 1.

క్రతువులు, అం. ప్రథమచష్టోమము, ద్వితీయోష్టోమము, తృతీయాతిరాత్రము, జ్యోతిష్టోమము.

క్రతూత్తమము, సం. వి. అ. పుం: చూ, క్రతురాజము.

క్రథనకము, సం. వి. అ. పు. ఒంటె: చూ, రాజార్హము. 1-అ.

క్రథనము, సం. వి. అ. పు. కొల: చూ, వధము.

క్రన్న, దే. ప్ర. క్రి. విణ. 1. ... క్రంచఱ: భార. సభా. 2, అ. 268: చూ, వేగము. 3; 2. ... భార. సభా. 2, అ. 203: చూ, ...; 3. ... భార. ఆది. 3, అ. 163; చూ, ...

క్రన్నన, దే. ప్ర క్రి ... అం. హా. తృ. 71: చూ, వేగము. 3.

క్రమజుఁడు, సం. వి. అ. పుం. స్త్రీ. ... క్రమముగ జనిపినవాఁడు.

క్రమచ్ఛదము, సం. వి. అ. పుం: చూ, ...*:

క్రమణము, సం. వి. అ. న. అడుగిడుట: చూ, హజ్జ.

క్రమభ్రష్టము, అం. (అక్రమము) (భగ్నక్రమము) క్రమములేనిదప్పుట (వాక్యదోషములు ఇరువది నాలుగింటిలో నొకటి): చూ, వాక్యదోషములు. ఉదా.— మొదటి వరుసను దప్పించి దానికి భిన్నముగా వరుసగా వ్రాయుట. రాము భరత లక్ష్మణ శత్రుఘ్నులు. కైకేయీ సుమిత్రా కౌసల్యా నందనులు. ఇట్లు క్రమము దప్పించి వ్రాయుటయు. రామభరత లక్ష్మణ శత్రుఘ్నులు చేయవలసిన ... వారితల్లుల పేర్లు చెప్పవలయును. ముందు వెనుక చెప్పుటచే క్రమము భంగమయ్యెను. రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు కౌసల్యా కైకేయీ సుమిత్రా నందనులని చెప్పవలయును.

క్రమపూరకము, సం. వి. అ. పుం. అటిమము*: చూ, బక పుష్పము.

క్రమము, సం. వి. అ. పుం. 1. సొరిది: చూ, విధము. 1; 2. అడుగిడుట: చూ, పాదము. 1; 3. అఱుయుట: చూ, తలపోటు. 2; 4. బలిమి: చూ, శక్తి. 1; 5. వడఁకు: చూ, లోలము; 6. వేదములోని క్రమము; 7. వేదశాస్త్రములచేత నిర్ణయింపఁబడిన విధి: 8. అంఘ్రి: చూ, పాదము. 1: అం. 9. క్రమాలంకారము: చూ, అలంకారము. 3; 10: (చూ, అలంకారము. 3): చూ, సంచారివర్ణగతాలంకారములు.

క్రమరేచితము, అం: (చూ, అలంకారము 3): చూ, స్థాయీ వర్ణగతాలంకారములు.

క్రమశీర్షము, సం. వి. అ. న ప్రాకారగృహము: చూ, సదనము. 1.

క్రమి, సం. వి. ఇ. పుం: చూ, రూ-కృమి.

క్రమించు, సం. స. క్రి. 1. అతిక్రమించు; అని. 3, అ. 14: చూ, దాఁటు. 6; 2. ఆక్రమించు. భార. ద్రో. 1, అ. 10: చూ, మొగడించు,

**క్రమికంటకము**, సం. వి. అ. న. 1. చిత్రాంగము: చూ, నహిస్సంజ్ఞికము; 2. విడంగము*: చూ, వాయువిడంగము; 3. ఉదంబరము*: చూ, మేడి.

**క్రమిఘ్నము**, సం. వి. అ. న. విడంగము*: చూ, వాయువిడంగము.

**క్రమిజ**, సం. వి. ఆ. స్త్రీ: చూ, లక్క.

**క్రమిజము**, సం. వి. అ. న. అగురు: చూ, రాజవృక్షము. 1.

**క్రమిశత్రువు**, సం. వి. ఉ. పుం. విడంగము*: చూ, వాయువిడంగము.

**క్రముకము**, సం. వి. అ. న. 1. పోకచెట్టు: చూ, పోఁక; 2. పట్టలము, తాంబూలపు పీట: చూ, పీనియము: పుం. 3. పరాగము*: చూ, పోఁక: 4. నాగరోష్టగము*: చూ, రొట్టుగు; 5. గంగరావి*: చూ, రావి; 6. నాగముస్త*: చూ, పత్సరము; 7. కార్పాసము*: చూ, ప్రత్తి; 8. ప్రత్తిపాయ: చూ, ప్రత్తి.

**క్ర...కి**, సం. వి. ఈ. స్త్రీ. పరాగము*: చూ, పోఁక.

**క్రమేలకము**, సం. వి. అ. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.

**క్రమేలము**, సం. వి. అ. పుం. — పై —

**క్రమ్మట**, దే. క్ర. క్రి. విశే. రూ-క్రమ్మఱ-క్రన్న. పునరర్థకము, మరల. అం. భా. తృ. 69: చూ, మెండియు.

**క్రమ్మరిలు**, దే. అ. క్రి. (రూ - క్రమ్మఱబడు - క్రమ్మరిల్లు-క్రమ్మఱు) మరలు, నివర్తిల్లు. అం. భా. తృ. 114: చూ, వర్తిల్లు.

**క్రమ్మఱ**, దే. క్ర. క్రి. విశే: చూ. క్రమ్మట.

**క్రమ్మఱబడు**, దే. అ. క్రి. (క్రమ్మఱ + పడు): చూ, రూ-క్రమ్మరిలు. భార. ఉద్యో. 3, ఆ. 393. (స్వార్థమునపడు).

**క్రమ్మఱిలు**, దే. అ. క్రి- పై- (రూ-క్రమ్మరిల్లు).

**క్రమ్మఱిల్లు**, దే. అ. క్రి- పై-: (పాండు. 4, ఆ. 80.)

**క్రమ్మఱు**, దే. అ. క్రి.— పై. —; (భార. అర. 6, ఆ. 327.)

**క్రమ్మఱుచేయు**, దే. ప్రే. క్రమ్మఱఁజేయు. భార. అర. 3, ఆ. 170: చూ, మరలించు.

**క్రమ్ము**, దే. అ. క్రి. 1. కవియు, భార. అర. 3, ఆ. 113; రా. అర. 2, ఆ. 393: చూ, వ్యాపించు; 2. పైకుబుకు. భార. స్త్రీ. 2. ఆ. 64: చూ, ప్రసరించు.

**క్రమ్ముదల**, దే. వి. క్రమ్మట.

**క్రమ్ముదెంచు**, దే. అ. క్రి. (క్రమ్ము + తెంచు) పైకుబుకు. భార. విరా. 2, ఆ. 70: చూ, క్రమ్ము 3. (స్వార్థమున తెంచు.)

**క్రయము**, సం. వి. అ. పుం. 1. ఖరీదు; చూ, వెల. 1; 2. (వెలయిచ్చి) కొనుట: చూ, పణము.

**క్రయవిక్రయము**, సం. వి. అ. పుం. కొనుట అమ్ముట: చూ, వాణిజ్యము.

**క్రయవిక్రయములుచేసి, తిరుగఁబడుట**, అం. వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు.

**క్రయవిక్రయికుఁడు**, సం. వి. అ. పుం. (నరకును) కొని యమ్మెడువాఁడు: చూ, వర్తకుఁడు.

**క్రయారోహము**, సం. వి. అ. పుం. 1. అంగడి: చూ, దుకాణము; 2. అంగడివీధి: చూ, మార్గము. 1.

**క్రయించు**, సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను: చూ, విలుచు.

**క్రయికుఁడు**, సం. వి. అ. పుం. (సరకును వెలయిచ్చి) కొనువాఁడు: చూ, విలువకాఁడు.

**క్రయ్య**, పై. వి. = కుల్య. కాలువ. రా. యు, కాం. 698: చూ, నది (దేశ్యమని శబ్దరత్నాకరము.)

**క్రయ్యఁబడు**, ద్వి. అ. క్రి. (క్రయ్యక + పడు) కలయు: చూ, కలుచు (స్వార్థమునపడు.)

**క్రయ్యము**, సం విశే. కొనుటకు అంగడియందు పరుపఁబడినది (సరకు): చూ, దుకాణము.

**క్రయ్యు**, దే. అ. క్రి: చూ, క్రయ్యఁబడు (రూ. క్రియ్యు-క్రయ్యు.)

**క్రల్లపడు**, ద్వి. అ. క్రి. ఎండు. హరి. పూ. 6, ఆ. 37: చూ, మిడుకు. 8.

**క్రవ్యదుఁడు**, సం. వి. అ. పుం. రక్కసుఁడు. రూ-క్రవ్యాదుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

**క్రవ్యము**, సం. వి. అ. న. పొల: చూ, మాంసము.

**క్రవ్యాత్తు**, సం. వి. ద్. పుం. 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. మాంసము తినువాఁడు: చూ, మాంసభక్షకుఁడు; 3: చూ, పక్షి. 1-౧.

**క్రవ్యాదుఁడు**, సం. వి. అ. పుం. — పై. —

**క్రవ్యాశి**, సం వి. న్. పుం. — పై. —

**క్రష్ట**. సం. విశే. ఋ. దిష్టకుఁడు: చూ, వ్యవసాయి.

## క్రా

**క్రాంత**, సం. వి. అ. స్త్రీ. బృహతి*: చూ, వాఁకుడు.

**క్రాంతము**, అం: చూ, ఆకాశమండలములు.

**క్రాంతి**, సం. వి. ఇ. స్త్రీ. 1. అడుగిడుట: చూ, పాదము. 1; 2. ఆక్రమణము: చూ, పురి. 4. 3. నడవడి: సిం-అమల్. చూ, వర్తనము. 1; 4. గీఱ: చూ, రేఖ. 3; పా.గ. = కాన్తి. నక్షత్రములు భూమియందు మనమున్నచోటి మధ్యాహ్న రేఖను దాటుటకు "క్రాంతి" అనిపేరు.

**క్రాంతికము**, అం: చూ, చుంబనములు.

**క్రాంతువు**, సం. వి. ఉ. పుం. పక్కి: చూ, పక్షి.

**క్రాఁక**, దే. వి: చూ, రూ-కాఁక.

**క్రాఁగు**, దే. అ. క్రి: చూ, రూ-కాఁగు. 2-3. (తపించుటకు.— భార. శాం. 1, ఆ. 28.)

**క్రాఁగుడు**, దే. వి: చూ, రూ-కాఁగుడు.

**క్రాఁచు**, దే. ప్రే: చూ, రూ-కాఁచు. 2.

**క్రానుఁగు**, దే. వి: చూ, రూ-కానుఁగు*.

**క్రాయకుఁడు**, సం. వి. అ. పుం. క్రయికుఁడు: చూ, విలువకాఁడు.

**క్రాయు**, దే. స. క్రి. 1. ధ్వనిపూర్వకముగా కళ్ళ లోనగువానిని కంఠమునుండి నోటికిఁదెచ్చికొను. కాశీ. 4, ఆ. 269: 2. ఉమియు. ఆము. 4, ఆ. 81: చూ, తూపొడుచు; 3. క్రక్కు: చూ, వెళ్లగొట్టు.

**క్రార**, దే. వి. (క్రయ్య + ర.) (జడ్డమై యొక యక్షరముతో) కలయురేఫము: రూ-క్రారవడి, గిఱక.

క్రారవడి, దే. వి. —పై.— (స్వార్థమునవడి.)

క్రాలు, దే. అ. క్రి. 1. ఒప్పు. అం. ధా. తృ. 83: చూ, సమ్మతించు; 2. (బెక్కెము) అల్లలాడు. రా. అ. కాం. 52: చూ, సలించు; 3. గిరగిరఁదిరుగు. భార, ద్రో. 5, అ. 317: చూ, వేష్టించు; 4. చెదరు. భాగ. 6, స్కం. 425: చూ, వెల్లివిరియు; 5. సంచలించు, రా. అర, కాం. 187. పొరటు: చూ, సలించు; 6. తొట్రుపడు. భార, ద్రో. 4, అ. 29: చూ, సంభ్రమించు; 7. మెలఁగు. వి, పు. 7, అ. 339: చూ, వర్తించు; 8. ప్రవర్తిల్లు. నిర్వ. 6, అ. 6: చూ, వర్తించు.

క్రాలుగంటి, దే. వి. (క్రాలు + కన్ను) 1. చలించునట్టి కన్నులు గల ఆఁడుది: చూ, స్త్రీ; 1-౽శం; 2. ఆఁడుది: చూ, స్త్రీ. 1.

క్రాలుగచ్చ, దే. వి. కఁజగచ్చ*: చూ, సోమరాజి.

క్రాసుపరీక్ష, వా. వి. 1. అడ్డుసవాలు; 2. సవాలు.

క్రాస్టాఫ్, ఆం. వి. ఆఫ్‌సెట్టుకొలత యొక్క. మార్గమునుచూపు సమకోణపుఁళ్ళ.

# క్రి

క్రి, దే. విణ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము (దీనికి పరుషసరళములు పరములగునపుడు నుగాగమమును, తదితరములు పరములగునపుడు పరవర్ణకమునకు ద్విత్వమును వచ్చును. ఉదా.—క్రింపల, క్రియ్యోట మొ.) (ఇది దీర్ఘాంతమునగు: చూ, క్రీ.)

క్రించు, వై. విణ. = కించిత్. అల్పుఁడు. రూ-క్రించుఁడు-క్రించు, భాగ. 9, స్కం. 116: చూ, హీనుఁడు.

క్రించుఁడు, వై. విణ. రూ—పై.— ఉ. రా. 8, అ. 96.

క్రింద, దే. అవ్య. అధస్సంజ్ఞ. అం. ధా. తృ. 67: చూ, దిగువ.

క్రిందల, దే. వి. (క్రింది + తల) క్రిందగుతల. పాండు. 2, అ. 29.

క్రిందపడఁజేయుట, జా. జయించుట. "కినుక మీఱుననంతగిరి, క్రిందుపడఁజేసె". పా. 1, అ. 23.

క్రిందు, దే. వి. 1. అధోభాగము. ఆము. 4, అ. 177: చూ, దిగువాటు; 2. గతకాలము. "క్రిఁద జరిగినవన్నిపోనీ యిఁక జరగవలసినది యోచింపుము". (వృత్తియందు అంత్యవర్ణలోపము: చూ, క్రి-క్రీ).

క్రిందుపడు, ద్వ. అ. క్రి. అడుగునకుపడు. ఉ, రా. 3, అ. 83: అడుగుపడు, క్రిందుపడు; (మి. ప):— అధమమగు. (ప్రే. క్రిందుపఱచు.)

క్రిందుపఱచు, ద్వ. ప్రే. అధఃకరించు, తక్కువపఱచు (అనికొందఱు.)

క్రిందుపఱచుట, ద్వ. వి. తక్కువపఱచుట: (సం.ప):—అధఃకరణము, అధఃకారము.

క్రిక్క, దే. వి. బట్టువాఁడు. వేంక. అం. 32: చూ, పాఠకుఁడు.

క్రిక్కిఱించు, దే. అ. క్రి. రూ - క్రిక్కిఱియు. ఎడము లేక వ్యాపించు. జై. 8, అ. 127: చూ, వ్యాపించు.

క్రిక్కిఱియు, 1. —పై.— భార. విరా. 3, అ. 216 (కొన్నిచోట్ల వృత్తియందంత్యవర్ణలోపము "క్రిక్కిఱి పన్నుదోయి." మొ. ; స. క్రి. 2. అత్తు. అం, ధా. తృ. 119: చూ, ప్రాపించు.

క్రిక్కు, దే. వి: చూ, రూ-కిఱుకు.

క్రిమి, సం. వి. ఇ. పుం. 1. రూ-క్లిమి. కీటకము: చూ, పురుగు; 2. చెట్లమీఁది సల్లప్పురుగు: చూ. పురుగు: 3. లత్తుక: చూ, లక్క; 4. ఋతు: చూ. సాలెపురుగు.

క్రిమికంటకము, సం. వి. అ. న. 1. ఎఱ్ఱచెవి*: చూ, భల్లాతకి; 2. అంజూరు*: చూ, పేడి; 3. విడంగము*: చూ, వాయువిళంగము.

క్రిమిఘ్న, సం. వి. ఆ. స్త్రీ. [illegible]*: చూ, పొగచెట్టు.

క్రిమిఘ్నము, సం. వి. అ. పుం. 1. విడంగము*: చూ, వాయువిళంగము; 2. పలాశము*: చూ, మోదుగు.

క్రిమిఘ్ని, సం. వి. ఈ. స్త్రీ. [illegible]*: చూ, సోమరాజి.

క్రిమిజ, సం. వి. ఆ. స్త్రీ. అత్తుక: చూ, లక్క.

క్రిమిజము, సం. వి. అ. న. అగురువు: చూ, రాజార్హము. 1.

క్రిమిజిత్తు, సం. వి. త. పుం. విడంగము*: చూ, వాయువిళంగము.

క్రిమిద్రువు, సం. వి. ఉ. పుం. తుమ్మెదమామిడి*: చూ, మామిడి.

క్రిమినల్ లా, వా. వి. నేరములకు సంబంధించిన చట్టము.

క్రిమిలాసము, సం. వి. అ. పుం. 1. ఈఁగ: చూ, మక్షిక. 1; 2. పిల్లియొగము.

క్రిమిశాత్రవము, సం. వి. అ. పుం. చంద్ర*: చూ, విట్టిదిరము.

క్రిమిశైలము, సం. వి. అ. పుం. పుట్ట: చూ, వల్మీకము.

క్రియ, సం. వి. ఆ. స్త్రీ. 1. ధాత్వర్థము. (వ్యాపారావబోధము) క్రియ. ఉదా.—'చంపెను' అనునది యొక వ్యాపారమును గురించి బోధించును గనుకఁ గ్రియ: చూ, క్రియలు; 2. చేయుట: (చూ, కర్మ. 1): చూ, విధి; 3. చేష్ట, చేఁత: చూ. వ్యాపారము. 1; 4. పని: చూ, ప్రయోజనము. 1; 5. ఆరంభము: చూ, యత్నము; 6. పూజ: చూ, సపర్య; 7. ఉపాయము: చూ, వెరవు; 8. చికిత్స: చూ, వైద్యము; 9. పాపపరిహారార్థము చేసెడు కర్మము: చూ, ప్రాయశ్చిత్తము; 10. వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖితము, సాక్ష్యములోనగునవి; 11. ఖైదు: (చూ, బంధనాలయము): చూ, సదనము. 1. (శిక్షను అనుభవించుస్థలము అని వాడుక; శిక్షఅనఁగా జరిమానా అనియును ఖైదు అనియును రెండర్థములను వాడుదురు): 12. రీతి. భార. సౌ. 1. అ. 168; చూ, విధము. 1; 13. తాళప్రాణ విశేషము: (చూ, అంగము. 9): చూ, తాళము. 2: 14. స్త్రీపురుషులకు సంతోషకరమగు విలాసము, పేరుట: చూ, విలాసము. 1; 15. మేషరాశి: చూ, రాశి. 2: అం. 16: చూ, తాళప్రాణములు: (చూ, తాళము. 2.).

క్రియము, సం. వి. అ. పుం. మత్స్యాక్షి*: చూ, పొన్నగంటి; వా. 2. అమ్మకము. 'క్రియదస్తావేజు.' (క్రియమును క్రియమని వాడుచున్నారు.)

క్రియలు, అం. 1. క్రియలు.— తత్సమములు, అచ్ఛికములు అని రెండువిధములు; సంస్కృత ధాత్వాదులకు 'ఇంచు' చేర్పఁగానైనవి తత్సమ క్రియలు; మిగిలినవి అచ్ఛికములు; అం. 2. మణి, మంత్రము, ఔషధము అని క్రియలు త్రివిధము: చూ, త్రయము.

క్రియాంగము, అం: చూ, అష్టాదశపదార్థములు.

క్రియాంగములు, అం. ధాపక్రియ, స్వభావక్రియ, శివక్రియ, మకరక్రియ, త్రినేత్రక్రియ, పయుక్రియ, హంసక్రియ టమిక్రియ, ఇంద్రక్రియ, నాగస్పతి, ధాన్యకృతి, విజయ క్రియ. (12.): (చూ, అంగము. 9.): (చూ, గౌడకృతి).

క్రియాకారము, సం. వి. అ. పుం. పట్టుదల: చూ, పట్టు. 1.

క్రియాకారుఁడు, సం. వి. అ. పుం. క్రొత్తశిష్యుఁడు: చూ, శిష్యుఁడు.

క్రియాకాలములు, అం: భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమానకాలము. (3): చూ, త్రిలయము.

క్రియాకేవలముత్తరమ్, న్యా. (స్పష్టము.)

క్రియానాంది, అం. నాంది వస్తునాంది, క్రియానాంది యని ద్వివిధము. వానిలో నిది యొకటి. (అక్షతలు, పుష్పములు చల్లించి సభ్యులమీఁదఁజల్లుచు మంగళగీతములఁబాడుట క్రియానాంది.)

క్రియావంతుఁడు, సం. విణ. (త్రి. ఈ. ఈ.) పనియందు పూనిక గలవాఁడు.

క్రియాపతి, సం. వి. ఈ. స్త్రీ. పనిని నెఱవేర్చు అఁడుది: చూ, స్త్రీ. 1-౨౨.

క్రియావాది, సం. వి. న్-పుం. ప్రమాణవాది.

క్రియాశక్తి, అం. 1: చూ, శక్తులు; 2: చూ, ఇచ్ఛాదులు; చూ, త్రయము.

క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే, న్యా. మహాత్ములకు వారి మహత్త్వమువలననే కార్యసిద్ధి యగును. కాని సాధనమువలనఁగాదు.

క్రియేంద్రియము, సం. వి. అ. న. కర్మేంద్రియము.

క్రియ్యు, వై. అ. క్రి. = కృశ్. కృశించు, భాగ. 10, స్కం. పూ. 707: చూ, సొటసొటవోవు.

క్రిస్టమస్ సెలవులు, వా. వి. బ. డిశెంబరునెల తుదివారపు దినములు.

క్రిస్టియను, వా. వి: చూ, క్రైస్తవుఁడు.

## క్రీ

క్రీ. దే. విణ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. ('వెదా... క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీనీడ, క్రీయూట' మొ. ఇక్కడ దీర్ఘాంతము గాన నిండుసున్నయును పరవర్ణమునకు ద్విత్వమును రాదన్యో: చూ, క్రి.)

క్రీఁగడుపు, ద్వ. వి. (క్రిందు + కడుపు) పొత్తికడుపు: చూ, వస్తి. 2: (చూ, కడుపు.)

క్రీఁదొడ, దే. వి. (క్రిందు + తొడ) తొడకు లోపలిభాగము: చూ, తొడ.

క్రీడ, సం. వి. అ. స్త్రీ 1. = గొండిలి, అల్లాట: చూ, విలాసము. 1; 2. ఎగతాళి: చూ, పరిహాసము; 3. దూఱు: చూ, నింద. 1.

క్రీడనము, సం. వి. అ. న. పేల: చూ. విలాసము. 1.

క్రీడము, సం. వి. అ. పుం. 1. తాళప్రాణకళావిశేషము: చూ, తాళము. 2; 2. క్రీడ: చూ, పరిహాసము.

క్రీడాకిరాతుఁడు, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

క్రీడాతాళము, అం: చూ, అన్యతాళములు.

క్రీడామయూరము, సం. వి. అ. పుం. అప్పసకాయము: చూ, పాపిడాక్రీడ.

క్రీడావ్యూత్తము, సం. వి. అ. పుం. పందెమువేసి యాడెడు జూదము: చూ, వ్యవహారము. 4.

క్రీడాశ్వకుఁడు, సం. వి. అ. పుం. ఓరిభలుఁడు. పందెమువేసి యాడెడువాఁడు: చూ, పందెగాఁడు.

క్రీడారత్నము, సం. వి. అ. న. 1. రతి (మహానుభవమునిచ్చు సంభో... ము): చూ, రతిబంధములు. ...; 2. కూడిక: చూ, సంయోగము.

క్రీడారథుఁడు, సం. వి. అ. పుం. క్రీడార్థరథుఁడు.

క్రీడాస్థానము, సం. వి. అ. న: చూ, నాట్యశాల.

క్రీడి, వై. వి. = కిరీటి. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1.

క్రీడించు, సం. అ. క్రి. ఆడ్లాడు: చూ, చేరలాడు.

క్రీగిచెలితేరు, దే. వి. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు. (సాంబ. దేవ. 15.)

క్రీడిత, అం: చూ, భూచారులు.

క్రీతకిర, సం. వి. అ. స్త్రీ నీలి *: చూ, రంజని.

క్రీతకుఁడు, సం. వి. అ. పుం. తల్లిదండ్రులయొద్ద వెలకుఁగొన్న కొడుకు: చూ, సూనుఁడు. 1-౧౪.

క్రీతానుశయము, అం: చూ, వ్యవహారపదములు.

క్రీతుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, క్రీతకుఁడు; అం. 2: చూ, పుత్త్రులు.

క్రీనీడనేల, దే. వి: చూ, రూ. క్రీనీడనేల.

క్రీవాడ, ద్వ. వి. (క్రింది + వాడ) వాటిపొలము: చూ, భూమి. 1-౪౨.

## క్రు

క్రుంకు, దే. వి. రూ-క్రుంకుడు, అస్తమించుట: చూ, అస్తమనము; 2. మునుక: చూ, స్నానము. 1; అ. క్రి. 3. చాప్పు. ఉ, హరి. 6, ఆ 180: చూ, మరణించు; 4. అస్తమించు: చూ, వింగివడు; 5. స్నానముచేయు: చూ, నీళ్లాడు. 2.

క్రుంకుకొండ, దే. వి. సూర్యుఁడు అస్తమించుకొండ: చూ, పర్వతము. (ఇట్లు క్రుంకుమల.)

క్రుంకుడు, దే. వి: చూ, రూ క్రుంకు.

క్రుంకుడుగట్టు, ద్వ. వి: చూ, క్రుంకుకొండ. య. 3, అ. 35.

క్రుంగఁబడు, ద్వి. అ. క్రి. (క్రుంగన్ + పడు) 1. రూ - క్రుంగిలు-క్రుంగు. రా. యు, కాం. 65. (స్వార్థమునపడు): చూ, మ్రగ్గు; 2. దిగఁబడు: చూ, మ్రొక్కు. 4.
క్రుంగిలు, దే. అ. క్రి.—పై.—
క్రుంగు, దే. అ. క్రి: చూ, రూ-క్రుంగిలు.
క్రుంచ, సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమగు వీణ: చూ, వీణ. 1-౧౮.
క్రుంచము, సం. వి. చ్. పుం. 1. = కొంచ. రూ-క్రౌంచము: చూ, బకము; 2. = కొంచ. క్రౌంచపర్వతము: చూ, పర్వతము.
క్రుక్కి, దే. వి. 1. మోసము: చూ, వంచన; వా. 2. క్రొత్త తెగిన నులకమంచము, "ఈ క్రుక్కిలో పరుండుట కష్టము." (రూ-కుక్కి.)
క్రుక్కు, దే. స. క్రి. 1. పేలు రోసెడువాని చేతిబొటనవ్రేలి గోటితో చదుపు: చూ, రూ-కుక్కు; 2. అడఁచు. స్వా. 3, ఆ. 97; చూ, పిసుకు. 3; 3. బలవంతమున లోపలవేసి క్రుక్కు. వి. పు 7, ఆ. 234: చూ, తురుగు.
క్రుక్కుడు, దే. వి. క్రుక్కుట. (క్రుక్కఁబడునది.)
క్రుచ్చిక, వా. వి. గొప్పుత్రవ్వు పనిముట్లలో నిదియొకటి. గొప్పు త్రవ్వు పనిముట్లు:— గుద్దలి, గొర్తాశికము, చిన్నగొర్తాశికము, త్రొళ్ళిక, త్రికూలము, చెంతి, పండ్లగుద్దలి లోనగునవి): చూ, ముద్గరము.
క్రుధ, సం. వి. ఆ. స్త్రీ. కోపము: చూ, రోషము. (ఇది ధకారాంతమునగు. ఇట్లు క్రుత్-క్రుద్ మొ.)
క్రుద్ధుఁడు, సం. విణ. కోపము నొందినవాఁడు: చూ, రోషణుఁడు.
క్రుమ్మరిలు, దే. అ. క్రి. రూ-క్రుమ్మరిల్లు-క్రుమ్మరు, తిరుగు: చూ, సంచరించు.
క్రుమ్మరిల్లు, —పై.—
క్రుమ్మరు, దే. అ. క్రి: చూ, క్రుమ్మరిల్లు.
క్రుమ్ము, దే. వి. 1. (కొమ్ముల) పోటుపు: చూ, పోటు: 4; స. క్రి. 2. రూ-క్రుమ్ముడు-కుమ్ము. య. 2, ఆ. 17: చూ, పొడుచు.
క్రుమ్ముడు, దే. వి: చూ, క్రుమ్ము. 1.
క్రుమ్ముడుపడు, ద్వి. అ. క్రి. (క్రుమ్ముడు + పడు): చూ, పోటుపడు.
క్రుమ్ములాడు, దే. అ. క్రి (క్రుమ్ములు + ఆడు) క్రుమ్ముకొని పోట్లాడు. కాశీ. 2, ఆ. 104.
క్రుయ్యఁబాఱు, ద్వి. అ. క్రి. (క్రుయ్యన్ + పాఱు) 1. క్రుయ్యు, కృశించు. హరి. పూ. 6, ఆ. 144: చూ, సొటసొటవోవు; 2. క్రుయ్యు, వెనుకంజవేయు. హరి. పూ. 8, ఆ. 116: చూ, వెనుదీయు. 1.
క్రుయ్యు, వై. అ. క్రి. = కృశ. —పై.—
క్రుష్టము, సం. వి. అ. న. 1. = గోడు. ఏడుపు: చూ, శోకము; 2. = గోడు. సద్దు, అలికిడి: చూ, స్వరము. 2-౪౬-(౨౭).
క్రుళ్ళగించు: దే. అ. క్రి. రూ - క్రుళ్ళు-కుళ్లు. (మనసులో) దుఃఖించు: చూ, క్రుక్కు. 5.
క్రుళ్ళగింత, దే. వి. (మనసులో) దుఃఖించుట: చూ, దుఃఖము.
క్రుళ్ళు, దే. అ. క్రి: చూ, రూ-కుళ్ళు. (మనసులో దుఃఖించు. భాగ. 6, స్కం. 509; అవియు.భో. 6, ఆ. 150.)
క్రుళ్లుపోతు, దే. విణ. క్రుళ్ళగించు స్వభావము గలవాఁడు: చూ, రూ-కుళ్లుపోతు.

## క్రూ

క్రూరకంద, సం. వి. ఆ. స్త్రీ. కసరుగలకంద. దురదకంద*: చూ, సూరణము.
క్రూరకర్మ, సం. వి. న్. పుం. కటుతుంబి*: చూ, సొర.
క్రూరకర్ముఁడు, సం. వి. న్. పుం. భయంకరమగు పనిచేయువాఁడు: చూ, ఇత్వరుఁడు. 3.
క్రూరక్షవకము, సం. వి అ. పుం. నెఱవెండ*: చూ, రాజవృక్షము.
క్రూరగంధ, సం. వి. ఆ. స్త్రీ: చూ, కంథారి*.
క్రూరదృక్కు, సం. విణ. ఎ. 1. పిసునుఁడు: చూ, హీనుఁడు; పుం. 2. శని: చూ, శని.
క్రూరదృష్టి, సం. వి. ఇ. పుం. అంగారకుఁడు: చూ, వక్రుఁడు. 1.
క్రూరధూర్తము, సం. వి. అ. పుం. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.
క్రూరము, సం. వి. అ. పుం. 1. నెరపంజి*: చూ, సరవెండ; 2. పూగము*: చూ, పోఁక; 3. గుగ్గిలము*: చూ, మహిసాక్షి; 4. ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము; 5. డేగ*: చూ, శ్యేనము; 6. రాఁబులుగు: చూ, రాబందు; న. 7. భయానకరసము. రసములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రసములు; 8. అన్నము: చూ, సాదము (౧); విణ. 9. వేఁడిగలది: చూ, వేఁడిమి; 10. నొప్పించునది; 11. భయంకరమైనది: చూ, రౌరవము. 2; 12. గట్టిది: చూ, బెడిదము.
క్రూరరావి, సం. వి. న్. పుం. బొంతకాకి: చూ, వాయసము. 1.
క్రూరలోచనుఁడు. సం. వి. అ. పుం. శని: చూ, శని.
క్రూరాకృతి, సం. వి. ఇ. పుం. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1-౩.
క్రూరు, దే. విణ. వాఁడి. భార. స్త్రీ. 2, ఆ. 20: చూ, వాలు. 6.
క్రూరుఁడు, సం. వి. అ. పుం. 1. దయలేనివాఁడు, పరపీడానిరతుఁడు (అనికొందఱు): చూ, నిర్దయుఁడు; 2. కఠినుఁడు: చూ, వ్యాఘుఁడు. 2; 3. ఘాతకుఁడు: చూ, హింసకుఁడు; 4. కినుకకాఁడు: చూ, రోషణుఁడు; 5. భయానకరసముగలవాఁడు.

## క్రె

క్రెడిటరు, ఆం. వి. ఋణప్రదాత.

## క్రే

క్రే, దే. విణ. వృత్తియందు క్రేవ శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా.— క్రేఁగన్ను-క్రేఁగయి మొ.)

క్రేంకృతము, సం. వి. అ. న. 1. హంసధ్వని: చూ, స్వరము. 2-ఆ. (గతిల); 2. కొంగధ్వని: చూ, స్వరము. 2-ఆ. (గతిల.)

క్రేఁటు, దే. అ. క్రి. 1. రూ-క్రేఁటుకొను-క్రేడించు గొంతుకుపు తీయుటకు సకిలించునట్లు శబ్దించు: చూ, శబ్దించు; 1-ఇ; 2. తొట్రుపడు: చూ, సంభ్రమించు.

క్రేఁటుకొను, —పై.—(శబ్దించు-స్వా. 3, ఆ. 92. స్వార్థమున కొను.)

క్రేఁగన్ను, దే. వి. (క్రేవ+కన్ను) కడకన్ను, కటాక్షము: చూ, లోచనము. 1-ఇ.

క్రేఁగయి, ద్వ. వి. (క్రేవ+కయి) 1. హస్తాగ్రము. అచ్చ. యు, కాం. 18: చూ, హస్తము; 1-అ; 2. వామహస్తము: చూ, పుల్లచెయి: (చూ, హస్తము.)

క్రేడి, దే. వి. సంబావుతోఁగలసిన కాపలోనగు ఎట్టివస్తు: చూ, ధాన్యము.

క్రేడించు, దే. అ. క్రి. 1. రొంఁగు భార. ద్రో. 1, ఆ. 374: చూ, విరియు. 5; స. క్రి. 2. అలక్ష్యముచేయు. భార. భీష్మ. 2, ఆ. 38: చూ, రూ-కేడించు. 2.

క్రేడిసేయు, దే. స. క్రి. (క్రేడి+చేయు) రూ-క్రేణిసేయు. పరిహాసముచేయు. వై. 5, ఆ. 42: చూ, వెక్కిరించు.

క్రేణి, దే. వి. 1. ఉన్నతపదము. కవిక. 2, ఆ. 19; 2. ఎగతాళి. చమ. 1, ఆ. 68: చూ, పరిహాసము.

క్రేణించు, దే. స. క్రి. అలక్ష్యముచేయు. రామా. 1, ఆ. 188. (రూ-కేడించు-క్రేడించు.)

క్రేణిసేయు, దే. స. క్రి. (క్రేణి+చేయు): చూ, రూ-క్రేడిసేయు-క్రేడించు. భార. విరా. 1, ఆ. 234.

క్రేతొట్టు, దే అ. క్రి: చూ, గట్టొరయు. "వ. క్రేతొట్టుకడళ్ళ కైవడిఁ గలయబెరయ." ఉ, హరి. 2, ఆ. 64.

క్రేపు, దే. వి. 1. (పర్వత) శిఖరము. "గిరిగ్రేపుల మూఁపులు" స్వా. 3, ఆ. 6: చూ, శిఖరము; 2. దూడ. భాగ. 10, స్కం. పూ. 510: (చూ, వత్సము. 2.): చూ, ధేనువు.

క్రేయో, దే. వి. వెడలఁగొట్టుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

క్రేవ, దే. వి. వైపు: చూ, పార్శ్వము. 2. (వృత్తియందంత్య వర్ణలోపము: చూ, క్రే.)

క్రేవు, దే. వి. సింహనాదమునందగు ధ్వన్యనుకరణము. అని. 4, ఆ. 46: చూ, హూహూ.

క్రేళ్లు, దే. వి. బ. ఉన్నతి; రా. యు, కాం. 2280: చూ, పోగ 2.

క్రేళ్లదాఁటు, దే. అ. క్రి. 1. రూ-క్రేళ్లుఉకు-క్రేళ్లవాఱు. ఎగిరిపడు: చూ, లంఘించు; 2. గంతులిడు. స్వా 2, ఆ. 7: చూ, లంఘించు.

క్రేళ్లుబ్బు, దే. అ. క్రి. (క్రేళ్ల+ఉబ్బు) అతిశయించు. కా. 5, ఆ. 102: చూ, ముమ్మరించు.

క్రేళ్లుఱు, దే. అ. క్రి. (క్రేళ్ల+ఉఱుకు) 1. ఎగిరిపడు: చూ, లంఘించు; 2. గంతులిడు. కళా. 7, ఆ. 72: చూ, లంఘించు; 3. దూఁకు; హరి. పూ. 7, ఆ. 105: చూ లంఘించు.

క్రేళ్లవాఱు, దే అ. క్రి. (క్రేళ్ల+పాఱు) గంతులిడు; భార. భీష్మ. 2, ఆ. 70: చూ, లంఘించు.

## క్రై

క్రైలు, దే. వి. రూ-కైలు. ధాన్యము కుప్పచేసి కొలుచుట, ఒప్పిడి: చూ, సూఱుపు.

క్రైలుదారి, దే. వి. రూ-కైలుదారి. క్రైలుచేయించెడి యధికారి.

క్రైస్తవత్రిపుటి, ఆం. తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ. క్రైస్తవ త్రిపుటియొక్క భావము వైదికమతమునుండియే గ్రహింపఁబడినది: చూ, త్రయము.

క్రైస్తవుఁడు, నా. వి. క్రస్తియుఁడు; క్రైస్తవమతము స్వీకరించిన వాఁడు.

## క్రొ

క్రొ, దే. విశే. వృత్తియందుఁ గ్రొత్తశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము (దీనికంటెఁ బరములైన పరుషసరళస్థిరవర్ణములకు ద్విత్వము కలుగును.-క్రొక్కన్ను, క్రొక్కాఁడు, క్రొగ్గండి, క్రొచ్చెలిక, క్రొత్తరఁగ, క్రొత్తలిరు, క్రొత్తావి, క్రొన్నన, క్రొన్నలుపు, క్రొన్నురువు, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొన్నేయి, క్రొమ్మంచు, క్రొమ్మెఱుగు, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్మిడుఁగుఱు, క్రొమ్ముడి, క్రొమ్మెదడు, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మొగడ, క్రొమ్మొన, క్రొమ్మొలక, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వెద, క్రొవ్వేఁడి మొ॥ కొన్ని చోట్లఁ దత్సమపదము పరమగునపుడును ద్విత్వము కానఁబడుచున్నది. "సీ. పుష్కలావర్తంబులు లోనుగాఁగల క్రొమ్మేఘములు వృష్టి కురియకుండ" భీ. 3, ఆ. 87; కొన్ని యెడల పరుషములు పరములగునపుడు దీనికి నుమాగమము వచ్చును. క్రొంజాయ, క్రొంజెమట, క్రొంపమ్మి, క్రొందలిరు, క్రొంబంట, క్రొంబడపు, క్రొంబసిఁడి, క్రొంబసిమి, క్రొంబుట్టము, క్రొంబువ్వు, క్రొంబొగ, క్రొంబొగడ మొ.) కొన్నిచోట్లఁ దత్సమపదములు పరములగునపుడును నుమాగమము కానంబడియెడి. ఉదా.-క్రొంబులకలు మొ.) (శ.ర.)

క్రొంకి, దే. వి: చూ, రూ-కొంకి.

క్రొంచ, వై. వి.=క్రొంచః: చూ, రూ-కొంచ.

క్రొంజిగురులవిల్కాఁడు, ద్వ. వి. మరుఁడు. ఆం. భా. ప్ర. స్వ. 45: చూ, మన్మథుఁడు.

క్రొక్కారము, దే. వి: చూ, కోడికూఁత.

క్రొత్త, దే. విశే. 1. నవీనము. కాశీ. 1, ఆ. 39: చూ, నూతనము: 2. అపూర్వము. కళా. 6, ఆ. 9: అపురూపము, అబ్బురము. రూ-అబ్రము, అరుదు, వింత. (సం.వ):— అనిప పూర్వము, అపూర్వము. (వృత్తియందు అంత్యవర్ణలోపము: చూ, క్రొ.)

క్రొత్తవము, దే. వి: చూ, రూ-కొత్తదము. య. 1, ఆ. 3.

క్రొత్తడి, దే. వి. రూ-గొత్తడి-కొత్తడి. 1. మగనాలు. భార. ఉద్యో. 3, ఆ. 187: చూ, స్త్రీ. 1-౧౫; 2. పతివ్రత: చూ, స్త్రీ. 1-౧౬.

క్రొత్తమెట్టు, దే. వి. 1. వసుక నారంభించినప్పుడు ఏకునుండి పురి లేక చాగఁదీసి కదుమునకంటించెడు నూలు. భార. విరా. 1, ఆ. 95: చూ, నూలుపోగతుకు; 2. ప్రథమావర్తవము, సమయత: చూ, మెట్టు. 1.

క్రొత్తయముఁడా? పాతయముఁడా? లో. మిక్కిలి యుక్తిశాలిగ ఉన్నవానిని చూచి «క్రొత్తయముఁడా? పాతయముఁడా? అను రక ఎవో చేరినవాఁడు అని అందురు.

క్రొత్తవాఁడు, దే. వి: చూ, నూతనుఁడు.

క్రొత్తళము, దే. వి: చూ, రూ-కొత్తడము.

క్రొన్ననవిలుకానితండ్రి, దే. వి. వెన్నుఁడు. ఆం. భా. ప్ర. స్వ. 38: చూ, విష్ణువు. 1.

క్రొన్నెలలు, దే. వి. బ కపోతోంతకపోవరి ప్రదేశములయందలి నక్షత్రములు: చూ, నక్షత్రము.

క్రొమ్మి, వై. వి. = కురువక-కురవక. ఎఱ్ఱగోరంట*. ఆం. భా. ద్వి. వ. 63: చూ, సహ. 2-౧.

క్రొమ్ముడి. దే. వి. కేశబంధవిశేషము: చూ, వేనలి.

క్రొవ్విదము, దే. వి. (క్రొవ్వు+ఇదము) 1. దుష్కార్యము: చూ, వ్యాపారము. 1; 2. పరువము. లక్ష్మి. 3, ఆ. 75: చూ, పరుషము. 1.

క్రొవ్వు, దే. వి. 1. గరువము: చూ, హంకారము; 2. కడుపులో బొడ్డుక్రిందను౦డెడి యుల్లిపొరవంటి క్రొవ్వు: చూ, వప. 1; 3. మస్తిష్కము: చూ, మెదడు; 4. కావరము: చూ, మదము. 1; 5. బలము: చూ, శక్తి. 1; వా. 6. బోలు: చూ, మాంసము; 7. కండరములలోని చమురు: చూ, తైలము; అ. క్రి. 8. బోతరించు: చూ, మదించు.

క్రొవ్వుగొను, దే. అ. క్రి. (క్రొవ్వు+కొను) బోతరించు. హరి. పూ. 9, ఆ. 72: చూ, మదించు.

క్రొవ్వెద, దే. వి. కొప్పు: చూ, వేనలి.

క్రొవ్వొత్తి, వా. వి. రూ-కొవ్వొత్తి. క్రొవ్వుతోఁ జేయఁబడిన కడ్డీవంటి దీపపువత్తి: చూ, వత్తి.



క్రోఁతి, దే. వి: చూ, రూ-కోఁతి. రా. యు. కాం. 376. (కోఁతపనువట్లు కోఁగునది.)

క్రోడకన్య, సం. వి. ఆ. స్త్రీ. వారాహీకంద*: చూ, సూరణము.

క్రోడచూడ, సం. వి. ఆ. స్త్రీ. మహాశ్రావణిక*: చూ, బోడతరము.

క్రోడపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. కంటకారిక*: చూ, వాఁకుడు.

క్రోడపాదము, సం. వి. అ. పుం. కమఠము: చూ, తాఁబేలు.

క్రోడము, సం. వి. అ. న, ఆ. స్త్రీ. 1. ఒడి, తొడపైభాగము: చూ, తొడ; 2. తొమ్ము. రెండుభుజముల నడిమిభాగము (అవి కొందఱు): చూ, వక్షము; అ. పుం. 3. పంది: చూ, సూకరము; 4. ఏనుఁగు: చూ, హస్తి; 5. ఉదకము: చూ, సలిలము; 6. శని: చూ, రాహువు. 2.

క్రోడాంఘ్రి, సం. వి. ఇ. పుం: చూ, క్రోడపాదము.

క్రోడాడు, దే. అ. క్రి. దుమ్మెత్తిచల్లు. (రూ-కోరాడు-కోరు.)

క్రోడాయుధము, సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

క్రోడి, సం వి. ఈ. స్త్రీ: చూ, క్రోడకన్య*.

క్రోడీకరణము, సం. వి. అ. న. 1. అలింగనము: చూ, సంశ్లేషము; 2. క్రోడీకరించుట.

క్రోడీకరించు, సం. స. క్రి. ఒకటిగాచేర్చు.

క్రోడీకృతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, క్రోడీకరణము.

క్రోడీముఖము, సం. వి. అ. పుం. పిల్లచేఁప: చూ, మత్స్యము. 1.

క్రోడుఁడు, సం. వి. అ. పుం. 1. శని: చూ, శని; 2. ముక్కంటి: చూ, శివుఁడు.

క్రోథము, సం వి. అ. పుం. 1. త్రుంచఁబడినది, చూ, త్రుటితము: 2. నేత్రభేదము: చూ, లోచనము. 1-౧౨.

క్రోథుఁడు, సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

క్రోథనము, సం. వి. అ. పుం. మోహము: చూ, వలపు. 2.

క్రోధజములు, అం. వాక్పారుష్యము, దండపరుషము. (2).

క్రోధన, సం. వి. అ. స్త్రీ. 1. ఎద్దునాలుక*: చూ, బెండ; 2. కొండబెండ*: చూ, షడ్గ్రంధ; 3. కోపవతి: చూ, స్త్రీ: 1-౩౫; అం. 4. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ, సంవత్సరములు.

క్రోధనుఁడు, సం. విణ: చూ, రోషణుఁడు.

క్రోధము, సం. వి. అ. పుం. 1. రూ-కృత్తు-కృధము. కోపము: చూ, రోషము; 2. ఎనుబోతు: చూ, మహిషము; అ. 3: చూ, రసస్థాయీభావములు. (రోషము); 4: చూ, శ్రుతులు; (క్రోధ అని కొందఱు); 5: చూ, అరిషడ్గములు.

క్రోధమూర్ఛితము, సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము: చూ, రాజార్హము. 1-౧౩.

క్రోధమూర్ఛితుఁడు, సం. విణ. ఎక్కుడుకోపము గలవాఁడు: చూ, రోషణుఁడు.

క్రోధయుక్తుఁడు, సం. విణ. — పై. —

క్రోధి, సం. వి. న్. పుం. 1. సంవత్సరములు అఱువదింటిలో నొకటి: చూ, సంవత్సరములు; విణ. పుం. 2. కోపము గలవాఁడు: చూ, రోషణుఁడు.

క్రోధించు, సం. అ. క్రి. కోపగిల్లు: చూ, రోషించు.

క్రోధుఁడు, సం. వి. అ. పుం. క్రోధుఁడను ఒకరాజు: చూ, రాజు. 1-౧. (1-౪౫.)

క్రోయు, దే. స. క్రి. విషమముగాచాఁచు. భార. అర. 6, ఆ. 178.

క్రోరు, అం. వి. కోటి, నూఱులక్షలు. (1,00 00, 000).

క్రోల, దే. వి: చూ, కోవి. 1.

క్రోలు, దే. వి. 1. క్రోల. ఆము. 3, ఆ. 20: చూ, కోవి. 1; 2. తామరనాళము: చూ, సహస్రపత్రము. 1-౯; స. క్రి. 3. తిను. స్వా. 3, ఆ. 51: చూ, సాపడు; 4. పానము చేయు. హరి. పూ. 5, ఆ. 196: చూ, త్రాగు; 5. గ్రహించు. భార. విరా. 2, ఆ. 35. (రూ-కొలులు): చూ, పుచ్చుకొను; 6. అనుభవించు. హరి. ఉ. 7, ఆ. 204: చూ, భుజించు. 2.

క్రోలుకసవు, ద్వ. వి. నడము, కికిసరసపు*: చూ, తృణము.
క్రోలుగచ్చు, దే. వి: చూ, రూ-క్రౌలుగచ్చు*.
క్రోలుచు, దే. అ. క్రి. రూ-క్రోల్చు. కూయు: చూ, శబ్దించు. (ప్రే. క్రోలఁజేయు-లక్ష్మి. 1, ఆ. 17.)
క్రోలెముక, దే. వి: చూ, రూ-కోలెముక.
క్రోల్చు, దే. అ. క్రి: చూ, రూ-క్రోలుచు.
క్రోవ, దే. వి 1. సరము. రామా. 7, ఆ. 140: చూ, భూషణము.2-ఉ-(౩౨); 2. దర్భామయము. అం. భా. ద్వి. 126.
క్రోవి, దే. వి. 1. తామరనాళము: చూ, సహస్రపత్రము, 1-ఉ; 2. సస్యాదినాళము: చూ, నాళము. 5; వై. వి. 3. = కురవక. ఎఱ్ఱగోరంట*:. భార. ఆది, 4, ఆ. 20: చూ, సహ. 2-౧; దే. వి. 4. ఊఁదుగ్రోవి: చూ, గొట్టము; 5. అనుపోసెడి గొట్టము. హంస. 2, ఆ. 11; 6. తుపాకి, అగ్నిప్రసరణాయుధము: చూ, బాణము. 1-౧; 7. బుడ్డి. సిలా. 3, ఆ. 90: చూ, పాత్రము. 6; 8. భూమిలోపల నీళ్ళువచ్చుట కేర్పఱచిన దారి. భార. అర. 4, ఆ. 332; 9. మూష. కళా. 8, ఆ. 9: చూ, మూస.
క్రోశతాలము, సం. వి. అ. పుం. ఢక్క: చూ, వీణ. 1-ఉం.
క్రోశధ్వని, సం. వి. ఇ. పుం. —పై.—
క్రోశద్వయము, సం. వి. అ. న. రెండుకోసులు: చూ, పరువు. 2.
క్రోశము, సం. వి. అ. పుం = కోసు: చూ, కోసు.
క్రోశయుగము, సం. వి. అ. న: చూ, క్రోశద్వయము.
క్రోష్ట, సం. వి. ఋ. పుం. నక్క: చూ, సృగాలము.
క్రోష్టము, సం. వి. అ. పుం, న. గెనుసు*: చూ, గెనుసుదుంప.
క్రోష్టుకమేఖల, సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న*: చూ, ప్రశ్నిపర్ణి.
క్రోష్టుపుచ్ఛి, సం. వి. ఇ. స్త్రీ. —పై.—
క్రోష్టుపుచ్ఛిక, సం. వి. ఆ. స్త్రీ. 1. —పై.—; 2. క్షుద్రక్షుపవిశేషము: చూ, గోలోమిక.
క్రోష్టుఫలము, సం. వి. అ. పుం. గార*: చూ, హింగుది.
క్రోష్టువిన్న, సం. వి. ఆ. స్త్రీ. నక్కతోఁకపొన్న*: చూ, సృగాలవిన్న.
క్రోష్టువు, సం. వి. ఉ. పుం. నక్క: చూ, సృగాలము.
క్రోష్టేక్షువు, సం. వి. ఉ. పుం. తెల్లచెఱకు*: చూ, సుకుమారము. 1-౨.
క్రోష్ట్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడునక్క, రూ-కోష్ట్రి: చూ, సృగాలము; 2. తెల్లనేల గుమ్ముడు*: చూ, కోష్ట్రి;3.లాంగలి*: (లాంగలిశబ్దమునకు తలిగొట్టియు. నీరుపిప్పలియు నర్థములు): చూ, హలిని.
క్రోష్ఠి, సం. వి. ఈ. స్త్రీ. నల్లనేలగుమ్ముడు*: చూ, సర్వతోభద్ర. 1-౨.

## క్రౌ

క్రౌంచదారణుఁడు, సం. వి. అ. పుం. గుహుఁడు, కుమారస్వామి: చూ, స్కందుఁడు.
క్రౌంచపదము, అం. ఒకానొక వృత్తము. ఇదియొక్కొక్కపాదమునందు భ, మ, స, భ, న, న, న, య గణములు గలిగి పదునొకండవయింటను యతిగల ఇరువదినాలుగవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.— "ప్రాంచితలీలస్వంకరనంది-ప్రకటితవిరతులు-భమసభననాన్యల్, క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నా-రఁగఁ బలుకుదు రిలఁ-గవివరులెల్లన్.": చూ, వృత్తము. 1.
క్రౌంచము, సం- వి. అ. పుం = కొంచ. 1. క్రౌంచమనుకొండ. రూ-కౌంచము: చూ,పర్వతము. 1; 2. క్రౌంచమను ద్వీపము: చూ, లంక. 1; 3. క్రౌంచమనుపక్షి: చూ, బకము; అం. 4. ద్వీపములు ఏడింటిలో నొకటి: చూ, ద్వీపములు; 5 ఆసనములు ముప్పదింటిలో నొకటి: చూ, ఆసనములు; 6. ఒకానొకవ్యూహము.
క్రౌంచాదనము, సం. వి. అ. న. 1. మృణాలము: చూ, సహస్రపత్రము. 1-ణ; 2. చించోటకమను తృణము: చూ, తృణము. 1; 3. పిప్పలితీఁగె*: చూ, పిప్పలి. 1.
క్రౌంచాదని, సం. వి. ఈ. స్త్రీ. పద్మబీజము: చూ, సహస్రపత్రము. 1-ఉ.
క్రౌంచానుజము, సం. వి. అ. పుం. మైనాకపర్వతము: చూ, పర్వతము.
క్రౌంచారాతి, సం. వి. ఇ. పుం: చూ, క్రౌంచదారణుఁడు.
క్రౌంచారి, సం. వి. ఇ. పుం. 1.—పై.—;2. కార్తవీర్యరిపువు: చూ, పరశురాముఁడు.
క్రౌంచాస్త్రము, అం. అస్త్రములు ఏఁబదిమూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు.
క్రౌను, ఆం. వి. 1. కొలతలోభేదము. (ఇట్లు క్రౌనుప్రెస్, క్రౌనుపేపరు మొ.); వా. వి. 2. 5కి షిల్లింగులు (రు 2-0-0 విలువగల నాణెము.)
క్రౌర్యము, సం. వి. అ. న. క్రూరభావము.

## క్ల

క్లమథము, సం. వి. అ. పుం. (పుష్పాదులు) వాడుట: చూ, మ్లాని.
క్లమము, సం. వి. అ. పుం. 1.—పై.—; 2. బడలిక: చూ, శ్రమము. 1.

## క్లా

క్లాంతము, సం. విశ. బడలినది.
క్లాకాంతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, క్లమథము.

## క్లి

క్లితకము, సం. వి. అ. న. రూ-క్లీతకము. అతిమధురము*: చూ, యష్టిమధుకము.
క్లితకిక, సం. వి. ఆ. స్త్రీ. రూ క్లీతకిక, నీలి*: చూ, రంజని.
క్లిన్నము, సం. వి. 1. ఆర్ద్రిత: చూ, పదను. 2; విశ. 2. తడిసినది: చూ, వోదము.

క్లిశితము, సం. విణ. దారిద్ర్యాదులచేత క్లేశము నొందినది: చూ, దుఃఖితము.

క్లిష్టము, అం. 1. ఒకానొక శబ్దదోషము. పదదోషములు పదు నేడింటిలో నొకటి: చూ, పదదోషములు; 2. క్లిష్టము అనఁగా,- దూరమైన యర్థముకలది. ఉదా.— పవనాశనేంద్రధరమకు టాలఃకారమణి జనః పుత్రీరమణ కుమారుపూపదిపిపుఁడు. (మన్మథుఁడని చెప్పుట కింతదూరము చెప్పుట దోషము.) దీనినే క్లేషము అందురు; విణ: చూ, క్లిశితము; 3. పూర్వోత్తరవిరుద్ధమైనది. (వాక్యము): చూ, వ్యాఘాతము. 2.

క్లిష్టుఁడు, సం. వి. ణ. క్లేశితుఁడు: చూ, దుఃఖితుఁడు.

## క్లీ

క్లీ, సం. వి. న్. పుం. నపుంసకుఁడు: చూ, షండుఁడు.

క్లీతకము, సం. వి. అ. న: చూ, రూ-క్లీతకము.

క్లీతకిక, సం. వి. ఆ. స్త్రీ. చూ: రూ- క్లీతికిక.

క్లీబని, సం. వి. ఈ. స్త్రీ. అంబుదఫలి*: చూ, మూలుగు. 2.

క్లీబము, సం. వి. అ. న. 1. నపుంసకము: చూ, షండము; విణ. 2. విక్రమములేనిది.

క్లీబుఁడు, సం. వి. అ. పుం. నపుంసకుఁడు: చూ, షండుఁడు.

క్లీవుఁడు, సం. వి. అ. పుం. 1. —పై.—; 2. పౌరుషహీనుఁడు.

## క్లు

క్లుప్తధూపము, అం: చూ, కపినామము.

## క్లే

క్లేదము, సం. వి. అ. న. తడి: చూ, పదను. 2.

క్లేదుఁడు, సం. వి. అ. పుం: చూ, హిమాంశువు.

క్లేదువు, సం. వి. ఉ. పుం. 1. —పై.—; 2. జన్నె: చూ, సన్నిపాతము. 1.

క్లేశము, సం. వి. అ. పుం. 1. వగ: చూ, దుఃఖము; 2. కోపము: చూ, రోషము; 3 కృషి: చూ, వ్యవసాయము.

క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే, న్యా. పడినక్లేశము ఫలించి నపుడు క్లేశముగాఁ దోఁపదు.

క్లేశితము, సం. విణ: చూ, క్లిశితము.

## క్లో

క్లోమము, సం. వి. న్. న. 1. కడుపులో నొక ప్రక్కనుండెడి యెఱ్ఱని మాంసము: చూ, శుక్తము. 2-ఉ; 2. ఉచ్చబుడ్డ: చూ, మూత్రకోశము.

## క్వ

క్వ, సం. అవ్య. ఎక్కడ: చూ, యత్ర. 1.

క్వంగువు, సం. వి. ఉ. పుం: చూ, రూ-కంగువు.

క్వణనము, సం. వి. అ. పుం. 1. వీణ లోనగువాని మ్రోఁత: చూ, స్వనము 2-ఇ; 2. చిన్నకుండ: చూ, భాండము. 3-ం౨.

క్వణము, —పై.— (నపుంసకమని కొందఱు) (రూ-క్వాణము.)

క్వథితము, సం. విణ. చక్కఁగా కాఁగినది: చూ, క్వంగుడు. 1.

క్వయినా-క్వైనా, వా. వి. ఇది మలేరియా జ్వరములకు పరమౌషధము.

## క్వా

క్వాణము, రూ-క్వణము.

క్వాథము, సం. వి. అ. పుం. 1. బాధ: చూ, దుఃఖము; 2. వృక్షరసము.

క్వాథోద్భవము, సం. వి. అ. న. రసాంజనము, మ్రానిపసుపున వండిన అంజనవిశేషము: చూ, రసాంజనము.

## క్వి

క్విటిరెంటు, వా. వి. ఈనాముల (మాన్యముల) మీఁద వేయఁబడు పన్ను. (రూ-క్విట్రెంటు. ఆంగ్లపదము వాడుక పదమయ్యె.)

క్విట్రెంటు, వా. వి. —పై.— "క్విట్రెంటు యీనాము."

## క్ష

క్ష, సం. వి. అ. పుం. 1. అడ్డగించుట: చూ, విరోధము. 1; 2. పగ: చూ, విరోధము. 1; 3. క్షేమము చూ, శుభము. 1; 4. దుస్స్వప్నము: చూ, స్వప్నము. 2; 5. క్షత్రియుఁడు: చూ, రాజు. 1; 6. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 7. నరసింహస్వామి: చూ, నరసింగఁడు; 8. బొమ్మ: చూ, వక్షము; 9. వ్యాకరణశాస్త్రము: చూ, వ్యాకరణము; 10 ఓరుపు. (స్త్రీలింగమని కొందఱు): చూ, శాంతము. 1; 11. పుడమి, పంటభూమి (అని కొందఱు): చూ, భూమి. 1; 12. కల్పము: చూ, సంవర్తము. 1; 13. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 14. నాశము: చూ, రుత్తు; స్త్రీ. 15. నిద్ర: చూ, స్వప్నము 2.

క్షమ్, సం. వి. అ. న. 1. క్షేత్రము: చూ, భూమి. 1; 2. చెట్టు: చూ, వృక్షము. 1.

క్షంత, సం. విణ. ఓర్పరి: చూ, సహనుఁడు.

క్షణంక్షణము, సం. వి. అ. పుం. వెంటవెంటనే, అప్పటికప్పుడు.

క్షణకము, సం. వి. అ. న. పిన్నముల్లంగి*: చూ, ముల్లంగి.

క్షణతువు, సం. వి. ఉ. పుం. గాయము: చూ, సఱుకు.

క్షణద, సం. వి. ఆ. స్త్రీ. 1. రేయి: చూ, రాత్రి; 2. పసుపు రంగు: చూ, వర్ణము. 6.ఒ.

క్షణదము, సం. వి. అ. న. ఉదకము: చూ, సలిలము. 1.

3. గౌరి: చూ, పార్వతి. 1; 4. రేయి: చూ, రాత్రి; అం. 5. (క్షప) ఒకానొక వృత్తము. ఇందొక్కొక్క పాదమున న, న, త, త. గురువులు గలిగి యెనిమిదవయంట యతిగల త్రయోదశ ఛందస్సునందు బుట్టిన వృత్తము. ఉదా.— "క్రమమున నిఖవిక్రాంతినాతాగయుక్తముగ సుకవిపద్యంబు లూహించినక్కా, క్షమలనరబరగుంగంజపత్రేక్షణా, సుమశర జనకా ఘూరవంశోత్తమా.": చూ, వృత్తము. 1; 6: చూ, సుజ్ఞానదాయకముల.

క్షమము, సం. విణ. 1. యుక్తము: చూ, సమంచినము. 1; 2. చాలునది.

క్షమయా కింనసిధ్యతి, లో. ఓర్పుగలవానికి నన్నికార్యములు సిద్ధించును.

క్షమాదంశము, సం. వి. అ. పుం. మునగ*: చూ, శిగ్రువు. 1.

క్షమాపణ, వా. శరణువొచ్చుట.

క్షమావంతుడు, సం. విణ. త్. ఓరుపరి: చూ, సహనుడు.

క్షమి, సం. విణ. —పై.—

క్షమించు, సం. స. క్రి. ఓర్చు: చూ, సహించు.

క్షమిత, సం. విణ: చూ, క్షమి.

క్షమియించు, సం. స. క్రి: చూ, క్షమించు.

క్షముడు, సం. విణ. 1. శక్తుడు: చూ, లావరి; 2. నేర్పరి: చూ, సమర్థుడు; 3. హితవును చెప్పువాడు: చూ, హిత వరి.

క్షయ, అం: చూ, క్షయము. 7.

క్షయకరము, సం. వి. అ. పుం. జీడి*: చూ, భల్లాతకి.

క్షయతరువు, సం. వి ఉ పుం. పాదిరి*: చూ, స్థాలి. 2.

క్షయథువు, సం. వి. ఉ. పుం. కాసరోగము: చూ, దగ్గు.

క్షయము, సం. వి. అ. పుం. 1. —పై.—; 2. అజుడెవులు: చూ, రోగము. 1; 3. రూ-క్షయి. చెరుట, తగ్గుదల: చూ, వెలితి. 2; (క్షయము, స్థానము, వృద్ధి. ఇది యీ త్రివర్గములలో నొకటి: చూ, వర్గము); 4. ప్రళయము: చూ, సంవర్తము. 1; 5. ఇల్లు: చూ, సదనము. 1; 6; నాశనము: చూ, రుత్త; 7. క్షయనామ సంవత్సరము (రూ-క్షయ-అక్షయ): చూ, సంవత్సరము; 8. శత్రువునకంటెం దాను దగ్గియుండుట.

క్షయించు, సం. అ. క్రి. క్షీణించు, తగ్గు: చూ, స్రుక్కు. 4.

క్షయే క్షేమం సుదుర్లభమ్, న్యా. కృశించుకాలమున ఎనగా నాప త్కాలమున క్షేమము మిక్కిలి దుర్లభము.

క్షయ్యము, సం. విణ. క్షయింపదగినది.

క్షరము, సం. వి. అ. న. 1. ఉదకము. చూ, సలిలము; పుం. 2. మబ్బు: చూ, మేఘము. 1; 3. మహాపిండీతకము*: చూ, శ్వసనము; 4. కోకిలాక్షము*: చూ, మొగబీర.

క్షవకము, సం. వి. అ. పుం. 1. జిల్లెడు*: చూ, జిల్లేడు; 2. ఉత్తరేణి*: చూ, శైఖరికము; 3. రాజిక*: చూ. సర్షపము; 4. అడవితొంలని*: చూ, హరిప్రియ. 3-ళ; 5. కొడిసె*: చూ, వత్సకము; 6. మోదెన *: చూ, శివమల్లి; 7. కాస రోగము: చూ, దగ్గు.

క్షవకృత్తు, సం. వి. త్. స్త్రీ: చూ, పోత*.

క్షవథువు, సం. వి. ఉ. పుం. 1. క్షుతము; చూ, తుమ్ము; 2. కాశరోగము: చూ, దగ్గు; 3. ఎక్కిలి: చూ, హిక్క. 1.

క్షవపత్ర, సం. వి. అ. స్త్రీ. ఏనుగుతుమ్మి*: చూ, తుమికి.

క్షవము, సం. వి. అ. పుం. 1. క్షుతము: చూ, తుమ్మ; 2. నల్లని యావాలు: చూ, సర్షపము.

క్షవరము, సం. వి. అ. న. 1. మంగలిపని: చూ, ముండనము; వా. వి. 2. అపజయము. "నీ వ్యాజ్యము క్షవరమైనది." (గోదావరిమండల ప్రాంతమున వాడుక.) (క్షౌరము యొక్క రూపాంతరమని కొందఱు.)

## క్షా

క్షా, సం. వి ఆ. స్త్రీ. 1. నిద్ర: చూ, స్వప్నము. 2; 2. ఓరిమి: చూ, శాంతము. 1.

క్షాంతము, సం. విణ. ఓర్వబడిన తిట్టుకొట్టు మొదలైనది. చూ, క్రోధము.

క్షాంతి, సం. వి. ఇ. స్త్రీ. ఓర్పు: చూ, శాంతము. 1.

క్షాత్రము, సం. వి. అ. న. క్షత్రధర్మము.

క్షామము, సం. వి. పుం. 1. కఱవు: చూ, దుర్భిక్షము; విణ. 2. తక్కువైనది: చూ, హీనము. 1; అం. 3: చూ, జఠర క్రియలు.

క్షామవతి. సం. వి. ఈ. స్త్రీ. యాగవిశేషము: చూ, యజ్ఞము.

క్షామవతీష్టి, సం. వి. ఇ. స్త్రీ.—పై.—

క్షాముడు, సం. వి. అ. పుం. బలవంతుడగు పురుషుడు: చూ, లావరి.

క్షారం క్షతే ప్రక్షేపణమ్, గాయముమీద ఉప్పుజల్లినట్లు దుఃఖితుడైన వానిని మరింత దుఃఖపెట్టడము.

క్షారకము, సం. వి. అ. పుం. 1. కసుగాయి: చూ, శలాటువు, 2; 2. (పక్షులు మత్స్యములు లోనగు వానిబట్టి వేసెడు) బుట్ట: చూ, వల. 1; 3. పసరుమొగ్గ, మొగ్గలగుత్తి (అని కొందఱు): చూ, మొగ్గ. 1; 4. నెరవంజి*: చూ, సర వెదు; న. 5. మూలకము, పెద్దముల్లంగి (అనికొందఱు): చూ, ముల్లంగి.

క్షారణము, సం. వి. అ. న. తిట్టుట: చూ, శాపము. 1.

క్షారతైలము, సం. వి. అ. న. పక్వమైన తైలము: చూ, స్నేహము. 2-ఞా.

క్షారత్రయము, సం. వి. అ. న. త్రివిధక్షారములు: చూ, లవణము. 1.

క్షారదళ, సం. వి. ఆ. స్త్రీ, చూ, లొద్దుగు*.

క్షారదశకము, సం. వి. అ. న. దశవిధక్షారములు: చూ, లవణము. 1.

క్షారద్రావణము. సం వి. అ. న. మార్దము, చౌటి ఉప్పు: చూ, లవణము. 1.

క్షారద్రువు, సం. వి. ఉ. పుం. 1. కింశుకము*: చూ, మోదుగు; 2. ఘంటాపాటలి*: చూ, ముక్కము.

క్షారభూమి, సం. వి. ఇ. స్త్రీ, చౌటినేల: చూ, భూమి. 1.—ఱ.

క్షారమధ్యము, సం. వి. అ. పుం. ఉత్తరేణి*: చూ, శైఖరికము.

క్షారము, సం. వి. అ పుం. 1. ఉప్పు: చూ, లవణము. 1.2.= కారము. ఒట్టు: చూ, కారము. 3. గాజు, గాజుమన్ను; చూ, భూమి. 1, ३४; 4. బూడిదె: చూ, భస్మము; 5. యవక్షారము; యవలవలన గిలిగిన ఉప్పు: చూ, లవణము. 1- 6. వెలిగారము, టంకణము: చూ, లవణము. 1; 7. సజ్జికాక్షారము: చూ, లవణము. 1.

క్షారమృత్తిక, సం. వి. ఆ. స్త్రీ. ఉప్పుమన్ను: చూ, భూమి. 1.—ఆ.

క్షారమేలకము, సం. వి. అ. పుం. సర్వక్షారము: చూ, లవణము. 1.

క్షారవృక్షము, సం. వి. అ. పుం. ముష్కకము*: చూ, మొక్కము.

క్షారశ్రేష్ఠము, సం. వి. అ. న. 1. వజ్రక్షారము: చూ, లవణము. 1; పుం 2. పలాశము*: చూ, మోదుగు: 3. ముష్కకము*: చూ, మొక్కము.

క్షారషట్కము, సం. వి. అ. న, షడ్విధక్షారములు: చూ, లవణము. 1.

క్షారసింధువు, సం. వి. ఉ. పుం. ఉప్పుసముద్రము: చూ, సముద్రము.

క్షారాచ్ఛము, సం. వి. అ. న. సముద్రపు ఉప్పు, సైంధవ లవణము (అని కొందఱు); చూ, లవణము. 1.

క్షారాబ్ధి, సం. వి. ఇ. పుం: చూ, క్షారసింధువు.

క్షారాయము, సం. వి. అ. పుం. కాలముష్కకము*: చూ, మొక్కము.

క్షారాష్టకము, సం. వి. అ. న. ఎనిమిది విధముల క్షారములు: చూ, లవణము. 1.

క్షారిక, సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి: చూ, బుభుక్ష.

క్షారితము, సం. విణ. కాఱినది: చూ, స్రుతము.

క్షారితుఁడు, సం. విణ. పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడిన వాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

క్షారోదము, సం. వి. అ. పుం: చూ, క్షారాబ్ధి.

క్షావకము, సం. వి. అ. పుం. నెరవంటి*: చూ, సరమేద.

క్షాళనము. సం. వి. అ. న. కడుగుట: చూ ప్రక్షాళనము.

క్షాళితము, సం. విణ. కడుగఁబడినది: చూ, ప్రక్షాళితము.

## క్షి

క్షి, సం. విణ. ఇ. 1. నివాసము: చూ, స్థానము. 1; 2 గతి, నడవడి: చూ, వర్తనము 1; 3. కల్పక్షయము: చూ, సంవర్తము. 1.

క్షితము, సం. విణ. క్షీణము: చూ, హీనము. 1.

క్షితి, సం. ఇ. స్త్రీ. 1. నేల: చూ, భూమి. 1; 2. ఉనికి: చూ, స్థానము. 1: 3. చిటికవేయు నంతకాలము: వ్రేల్మిడి: చూ, స్వరము. 2- (४३); 4. నాశము: చూ, రుత్త; 5. ఇల్లు: చూ, సదనము. 1; 6. సంఖ్యావిశేషము, క్షితియనులెక్క: చూ, సంఖ్య. 1; 7. కాలభేదము: చూ, సమయము. 1; 8 రోచనమను గంధద్రవ్యము: చూ, రాజార్హము; అం. 9: చూ, శ్రుతులు.

క్షితికణము, సం. వి. అ. పుం. దూళి: చూ, రేణువు. 1

క్షితిక్షమము, సం. వి. అ. పుం. చంద్రిక*: చూ, వెదెసంత్ర.

క్షితిజంతువు, సం. వి. ఉ. పుం. వానపాము: చూ, సర్పము. 1-४-(౨౨).

క్షితిజము, సం. వి. అ. పుం. 1. వేస్తరము: చూ, వేసడిము; 2. నేలవేము*: చూ, భూనింబము: 3. మంగళగ్రహము.

క్షితిధరము, సం. వి. అ. పుం. నేలదాల్పు, కొండ: చూ, పర్వతము.

క్షితినాగము: చూ, క్షితిజంతువు. (అ. పుం.)

క్షితిపతి, సం. వి. ఇ. పుం. భూమిపతి: చూ, రాజు. 1-౨౧. (ఇట్లు క్షితిపాలుఁడు, క్షితిపుఁడు మొ.)

క్షితిపుత్త్రుఁడు, సం. వి. అ. పుం. నరకరాజు: చూ, రాజు. 1-४౦.

క్షితిబదరి, సం. వి. ఈ. స్త్రీ. భూబదరి*; చూ, రేగు 1.

క్షితిరుహము, సం. వి. అ, పుం. చెట్టు: చూ, వృక్షము.

క్షితివర్ధనము, సం. వి. అ. పుం. పీనుఁగు: చూ, శవము.

క్షితివృద్ధాసము, సం. వి. అ. పుం. గర్తము: చూ, రంధ్రము. 1.—౧.

క్షితిసంభూతము, సం. వి. అ. న. అట్టుప్పు: చూ, లవణము. 1.

క్షిత్యాదితి, సం. వి. ఈ. స్త్రీ. విష్ణుమూర్తి తల్లి.

క్షిత్వా, సం. వి. న్. పుం. గాలి: చూ, వాయువు.

క్షిద్రము, సం. వి. అ. పుం. 1 తెగులు: చూ, రోగము 1; 2. విషాణము, కొమ్ము; చూ, శృంగము. 1.

క్షిద్రుఁడు, సం. వి. అ. పుం. ఇనుఁడు: చూ, సూర్యుఁడు.

క్షిప, సం. వి. ఆ. స్త్రీ. 1. క్షేపణము: చూ, విమోచనము; 2. రేయి: చూ, రాత్రి.

క్షిపక, సం. వి. ఆ. స్త్రీ.—1. —పై.—

క్షిపకుఁడు, సం. వి. అ. పుం. యోద్ధ: చూ, భటుఁడు. 1.

క్షిపణి, సం. వి. ఇ. పుం. 1. అస్త్రము: చూ, బాణము. 1; ఇ. స్త్రీ. 2. నౌకాదండము: చూ, పీలి. 2; 3. జాలవిశేషము: చూ, వల. 1; 4. మంత్రము: చూ, మంత్రము 1; 5. యజ్ఞమునందు యజుర్వేదతంత్రము నడపువాఁడు: చూ, అధ్వర్యుఁడు.

క్షిపణువు, సం. వి. ఉ. పుం. గాలి: చూ, వాయువు. 1.

క్షిపణ్యువు, సం. వి. ఉ. పుం. 1. వసంతఋతువు: చూ, మాసద్వయము; 2. దేహము: చూ, శరీరము; విణ. 3. సురభి; చూ, రాజార్హము. 1-౯: (చూ, వాసన. 1-౧౯.)

క్షిపము, సం. వి. అ. పుం. 1. ఎత్తుమూఁతికోఁతి: చూ, వానరము; 1-3; 2. క్షేపణము, ప్రేరేపించుట: చూ, విమోచనము.

క్షిప్త, సం. వి. ఆ. స్త్రీ. రాతిరి: చూ, రాత్రి.

క్షిప్తము, సం. విణ. 1. త్రోయఁబడినది: చూ, విద్ధము; 2. వైవఁబడినది, పాతఁబడ్డది: చూ, స్థాపితము. 1; న. 3. యోజితము, లెక్క కలియఁగూడడము: చూ, సంకలనము; అం. 4: చూ, జంఘాక్రియలు.

క్షిప్నువు, సం. విణ. ఉ. తిరస్కరించువాఁడు: చూ, నిరాకరిష్ణువు.

క్షిప్రకము, సం. వి. అ. న. పొడిపిండి: చూ, సాదము. (1)-३४.

క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః, న్యా. కార్యములు త్వరగా ముగింపకున్నచో( గాలము సంపదలను నశింప( జేయును "అనాస్వాదమ్మృతంవిషం" వంటిది.

క్షిప్రము, సం. క్రి. విణ, అ న. 1. శీఘ్రము: చూ, వేగము. 3; విణ. 2. వడిగలది: చూ, వేగము. 3. (క్షిప్రాదులు.— క్షేపిష్ఠము, క్షేపీయము, ప్రేష్ఠము, వరిష్ఠము, స్థవిష్ఠము, బంహిష్ఠము.); అం. 3: చూ, ప్రహారములు.

క్షిప్రశ్యేనము, సం. వి. అ. పుం. ఏట్రింత: చూ, వ్యాఘ్రాటము.

క్షియు, సం. వి. ఆ. స్త్రీ. క్షయము, తగ్గుదల: చూ, వెలితి. 2.

## క్షీ

క్షీణము, సం. విణ. క్షయించినది: చూ, హీనము. 1.

క్షీణా నరాః కాపురుషా భవంతి, న్యా. ఆపన్నులయి క్షీణించిన వారు దుర్జనులగుదురు.

క్షీణించు, సం. అ. క్రి. క్షీణమగు: చూ, ప్రుక్కు. 4.

క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి. న్యా. పుణ్యక్షయము కాఁగానే మరల మర్త్యలోకమునకు వత్తురు.

క్షీబుడు, సం. విణ. తాగుఁబోతు, క్రొవ్వినవాఁడు (అని కొందఱు): చూ, మత్తుఁడు.

క్షీరకంఠుఁడు, సం. వి. అ. పుం. బాలకుఁడు: చూ, శిశువు. 1-౫. (రూ-క్షీరకంఠకుఁడు.)

క్షీరకంద, సం. వి. ఆ. స్త్రీ. పాలనేలగుమ్మడు *: చూ, సర్వతోభద్ర. 1-౧. (ఇట్లు క్షీరకందము.)

క్షీరకాండకము, సం. వి. అ. పుం. 1. జెముడు *: చూ, స్నుహి; 2: చూ, జిల్లేడు*.

క్షీరకాకోలి, సం. వి. ఈ. స్త్రీ పిన్నపాల *: చూ, మనుపాల. (రూ-క్షీరకాకోలిక.)

క్షీరకాష్ఠ, సం. వి. ఆ. స్త్రీ. నల్లమఱ్ఱి*: చూ, మఱ్ఱి.

క్షీరకీటము, సం. వి. అ. పుం. దుగ్ధపాలకీటము: చూ, పురుగు.

క్షీరక్షరము, సం. వి. అ. పుం. పాలరాయి: చూ, రత్నములు. 1-౧౨-(౨౩).

క్షీరజము, సం. వి. అ. న. 1. పెరుఁగు: చూ, స్తన్యము. 1-౧౬; విణ. 2. క్షీరజాతద్రవ్యము: చూ, రాజార్హము. 1-౬;(1-౨౦) (1.3౫.)

క్షీరదళము, సం. వి. అ. పుం: చూ, జిల్లేడు *.

క్షీరద్రుమము, సం. వి. అ. పుం. 1. అశ్వత్థము*: చూ, రావి; 2. వటము*: చూ, మఱ్ఱి.

క్షీరధేనువు, సం. వి. ఉ. స్త్రీ. దానార్థమై యేర్పఱచిన ఆవు: చూ, ధేనువు.

క్షీరనాశము, సం. వి. అ. పుం. పెద్దబేఁకు*: చూ, శాకోటము. (రూ-క్షీరనాశకము).

క్షీరనింబన్యాయము. న్యా. వేపచెట్టునకు పాలుపోసి పెంచినను చేఁదు పోనేరదు అనురీతి.

క్షీరనీరము, సం. వి. అ. న. 1. ఆలింగనవిశేషము: చూ. సంశ్లేషము; 2. దుగ్ధజలము: చూ, సలిలము. 1-౨౨.

క్షీరపర్ణి, సం. వి. న్. పుం: చూ, జిల్లేడు *.

క్షీరనీరన్యాయము, న్యా. పాలును నీళ్లును గలిసియుండుట ధర్మము అనురీతి.

క్షీరపాకి, సం. వి. ఈ. స్త్రీ. పెంపుడు*: చూ, యువతిక.

క్షీరపాషాణన్యాయము, న్యా. పాలకొఱకు రాయి మోయవలె నను రీతి.

క్షీరఫల, సం. వి. ఆ. స్త్రీ. కలిపె*: చూ, సాష్టపుష్పఫల.

క్షీరబల, సం. వి. ఆ. స్త్రీ—పై.—

క్షీరము, సం. వి. అ.న.1. దుగ్ధము. పాలు భూమన్యము. 1-౧; 2. నీళ్ళు (ఘనకక్షీరము ఘనాసారము): చూ, సలిలము; పుం. 3. వటము*: చూ, మఱ్ఱి; 4. పాషము: చూ. పాలపిట్ట; 5. క్షీరసముద్రము: చూ, సముద్రము; 6. తీఁపు: చూ, మాధుర్యము.

క్షీరమోరట, సం. వి. ఆ. స్త్రీ. చేకొణద. *: చూ, మోరట.

క్షీరవతి, సం. వి. ఇ. స్త్రీ పాలుగలది: చూ, అస్తిక్షీర.

క్షీరవల్లి, సం. వి. ఈ స్త్రీ. పాలనేలగుమ్మడు*: చూ, క్షీరకంద.

క్షీరవికృతి, సం. వి. ఇ స్త్రీ. జున్ను: చూ, స్తన్యము. 1-౪: (చూ, కూర్చిక. 2.)

క్షీరవిదారి, సం. వి. ఈ. స్త్రీ:చూ, క్షీరవల్లి. (రూ-క్షీరవిదారిక.)

క్షీరవిషాణిక, సం. వి. ఆ. స్త్రీ. క్షీరకాకోలి*: చూ, మనుపాల.

క్షీరవృక్షము, సం. వి. అ. పుం. 1. ఉదుంబరము *: చూ, మేడి; 2. క్షీరిక *: చూ, పాల.

క్షీరశీర్షుఁడు, సం. వి. అ. పుం. శ్రీరాముఁడు: చూ, రాముఁడు.

క్షీరశుక్త, సం. వి. ఆ. స్త్రీ. 1. తెల్లనేలగుమ్మడు *: చూ, క్షీరకంద; 2. పిన్నపాల: చూ, మనుపాల.

క్షీరశుక్ల, సం. వి. ఆ. స్త్రీ: చూ, క్షీరశుక్త. 1.

క్షీరశుక్తము, సం. వి. అ. పుం. జలకంటకము: చూ, మత్స్యము. 1.

క్షీరసము, సం. వి. అ. పుం. పాలమీఁది మీఁగడ: చూ, స్తన్యము. 1-౮ (క్షీరరసము అనియు.)

క్షీరసాగరకన్యక, సం. వి. ఆ. స్త్రీ. లచ్చి: చూ, లక్ష్మి. 1. (ఇట్లు క్షీరసాగరసుత. క్షీరాబ్ధిజ, క్షీరాబ్ధితనయ మొ.)

క్షీరసారము, సం. వి. అ. పుం: చూ, క్షీరసము.

క్షీరాకరము, సం. వి. అ. పుం. పాలసముద్రము: చూ, సముద్రము.

క్షీరాజి, సం. వి. ఈ. స్త్రీ. పిన్నపాల*: చూ, మనుపాల.

క్షీరాన్నము, సం. వి. అ. న. పరమాన్నము: చూ, పాచము. (1)-౧౧-(౧).

క్షీరాబ్ధి, సం. వి. ఇ. పుం: చూ, క్షీరాకరము.

క్షీరాబ్ధిజము, సం. వి. అ. న. 1. సముద్రపు ఉప్పు: చూ, లవణము. 1; 2. మౌక్తికము: చూ, రత్నములు. 1-౧.

క్షీరాబ్ధిజుఁడు, సం. వి. అ. పుం: చూ, చంద్రుఁడు. (ఇట్లు క్షీరాబ్ధితనయుఁడు.)

క్షీరాలింగనము, అం: చూ, ఆలింగనములు.

క్షీరావి, సం. వి. ఈ. స్త్రీ. పిన్నపాల*: చూ, మనుపాల. (రూ-క్షీరావిక.)

క్షీరాశము, సం. వి. అ. పుం. అంచ: చూ, హంస.

యుంకి సమయముచూచి దొంగిలించెడు దొంగ. కళా. 2, ఆ. 46: చూ, హారకుఁడు

గరిసియ, వై. వి. = కరండికా. పూలబుట్ట: చూ, సజ్జ.

గరిడీ, వై. వి (రూ-గరడి-గరిడి) 1. = ఖురళీ. సాముకూటము. వసు. 4, ఆ, 72: చూ, సదనము. 1; 2. గడసాదన: చూ, సాము. 3.

గరిత, వై. వి = గృహస్థా. 1. ఇల్లాలు: చూ, భార్య; 2. పతివ్రత. అచ్చ. యు, కాం. 365: చూ. స్త్రీ. 1-గఽ.

గరిమ, సం. వి. న్. పుం. 1. రూ-గరిమము. గొప్పతనము: చూ, యోగ్యత; అం. 2: చూ, సిద్ధులు (విభూతులు); వా. 3. (బరువు) ఒకవస్తువును భూమి యెంతశక్తితో నాకర్షించునో ఆశక్తిపరిమాణమే ఆ వస్తువుయొక్క గరిమ (దీనివలన బరువునకును, ద్రవ్యరాశికిని గల భేదము తేటపడుచున్నది.) గరిమము.

గరిమము: చూ, గరిమ; అం. 4. తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములలో నొకటి: చూ, కర్మములు. 2.

గరిమిడి, దే. వి. 1. రూ-గరిక, దూర్వ*: చూ, తృణము. 1; 2. ఎల్లెలుక: చూ, మూషికము.

గరిమిడికొక్కు, దే. వి. 2. —పై.—స్వా. 4, ఆ. 25.

గరియ, దే. వి. రూ-గరుగు*: చూ, ములుగ.

గరివడి, వై. వి. = ఖదిరవటకము: చూ, రంగదము.

గరివడియము, వై. వి. = —పై.—

గరివి, వై. వి. = గర్వి. గర్వముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

గరివించు, వై. వి. = గర్వించు: చూ, హంకరించు.

గరిష్ఠము, సం. విశ. 1. మిక్కిలిగురువు, మిక్కిలిబరువైనది: చూ, స్థవిష్ఠము.

గరిసె, వై. వి. = కర్ష. 1. రూ-గరిసె. గంజి. ధాన్యముంచెడు కొట్టు: చూ, పంటసాల; 2, రూ-గరిసె మానవిశేషము (గరిసె = 3 మలకపుట్లు. 7½ పల్లెపుట్లు, 15 పందుములు, 30 ఏనుములు, 150 తూములు, 600 కుంచములు.) (గోదావరిజిల్లాలో వాడుక.)

గరిసెబావి, వై. వి. మెల్లెలతో గరిసెవలెనల్లి భూమిలోవనికి కుచిమెత్తినూయి: చూ, సరస్సు. 1-గఽ.(౩).

గరు, దే వి: చూ, రూ-గగుర.

గరుగు, దే. వి: చూ, గరియ.

గరుజు, వా. వి. అక్కఱ, అగత్యము, అవసరము. "నాకేమి గరుజు అనుకొన్నావా" (గోదావరీమండలప్రాంతమున వాడుక.)

గరుటామంతుఁడు, వై. వి. = గరుత్మంతుఁడు (రూ-గరుటాలమంతుఁడు - గరుడాలమంతుఁడు-గరుటి-గరుడి): చూ, హరివాహనుఁడు.

గరుటాలమంతుఁడు, వై. వి. = —పై.—

గరుటి, వై. వి. = —పై.—

గరుడండు, దే. వి. ఒకానొక కోడి: చూ, పుంజు.

గరుడకంబము, వై. వి. = (విష్ణువు గుడియందలి) గరుడస్తంభము: చూ, స్తంభము. 1-ఱ. (విస్వారపుసంభాషణమందు గాడిదెగుడ్డు గరుడకంబము అని గోదావరీమండలమున వాడెదరు.)

గరుడతాళము, సం. వి. అ. పుం. తాళప్రాణకళావిశేషము: చూ, తాళము. 2.

గరుడధ్వజుఁడు, సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు.1.

గరుడపక్షము, అం: చూ, నృత్తహస్తములు.

గరుడపచ్చ, వై. వి. మరకతము: చూ, రత్నములు. 1-ఇ.

గరుడప్లుతము, అం: చూ, కరణములు.

గరుడము, అం. 1: చూ, సంయుతహస్తములు; 2: చూ, జన్యతాళములు.

గరుడసరులు, వై. వి. బ. మేలైన శాలిధాన్యము: చూ, ధాన్యము.

గరుడస్తంభము, సం. వి. అ. పుం. = : చూ, గరుడకంబము.

గరుడాంకితము, సం. వి. అ. న. మరకతమణి: చూ, రత్నములు. 1-ఇ.

గరుడాంజనము అం: చూ, అంజనములు.

గరుడాగ్రజుఁడు, సం. వి. అ. పుం. గరుత్మంతునియన్న: చూ, సూరసూతుఁడు.

గరుడారతి, ద్వ. వి. ఆరాత్రికావిశేషము: చూ, అళఘారతి.

గరుడాశ్మము, సం. వి. న. పుం: చూ, గరుడాంకితము,

గరుడి, వై. వి. = గరుడః: చూ, గరుటామంతుఁడు.

గరుడిరవుతు, వై. వి. = గరుడరావుత్త: చూ, విష్ణువు. 1 (రూ-గరుడిరౌతు.)

గరుడుఁడు, సం. వి. అ. పుం. = గరుడి: చూ, హరివాహనుఁడు.

గరుడోత్తీర్ణము, సం. వి. అ. న: చూ, గరుడాంకితము.

గరుత్తు, సం. వి. త్. పుం. 1. = గఱి. పక్షము: చూ, రెక్క. 1; 2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. ధ్వని: చూ, స్వరము. 2.

గరుత్మంతము, సం. వి. త్. పుం. పక్కి: చూ, పక్షి.

గరుత్మంతుఁడు, సం. వి. త్. పుం. 1. = గరుటామంతుఁడు: చూ, హరివాహనుఁడు.

గరుదాల్పు, ద్వ. వి: చూ, గగురు.

గరుద్యోధి, సం. వి న్. పుం. భారతీపక్షి: చూ, వ్యోమనావిక.

గరుపనేల, ద్వ. వి: చూ, రూ-గరపనేల.

గరుపాటు, ద్వ. వి: చూ, రూ-గగురు (శకాం. 3, ఆ. 64.)

గరుపాటు, ద్వ. వి: చూ, రూ-గగురు (శకాం. 3, ఆ. 64.)

గరుపాటుమొన, ద్వ. వి. పందిమూఁతి ముట్టె.

గరుపొడు, దే. అ. క్రి: చూ, గగురుపొడుచు.

గరుము, వై. విశ. 1. = ఖరభూ. (గులకరాలచే గట్టియైనది) నేల: చూ, గరపనేల; 2. విరివి: చూ, విస్తారము. 1.

గరువతనము, దే. వి. 1: చూ, నియమము; 2. (శృంగార) గర్వము: చూ, హంకారము.

గరువపడు, వై. అ. క్రి. = గర్వపడు: చూ, హంకరించు.

గరువము, వై. వి. 1. = గర్వము. రూ-గరువతనము. అచ్చ. యు, కాం. 116: చూ, హంకారము; 2. = గౌరవము: చూ, సన్మానము.

గరువు, దే. వి. 1. గర్వము: చూ, హంకారము; 2. చెక్కిలి. స్వా. 5, ఆ. 58: చూ, తెంప 2; పై. విశ. 3. = ఖరభూ. రూ-గరుసు. స్వా. 4, ఆ. 60: చూ, గరపనేల.

గరుసు, దే. వి. 1. మేర: చూ, మర్యాద; 2. చర్మము: చూ, బెరడు; 3. ముఖభీతి: చూ, మోమోటమి; పై. విశ. 4. = ఖరభూ. ఆం. భా. ద్వి. భూ. 4: చూ, గరపనేల.

గర్గము, సం. వి. అ. పుం. 1. దేవయోని సర్ప విశేషము: చూ, సర్పము; 2. గర్గముని: చూ, ముని. 1.

గర్గరము, సం. వి. అ. పుం. గర్గరమనుచేఁప: చూ, మత్స్యము. 1.

గర్గరి, సం. వి. ఈ. స్త్రీ. పెరుఁగుచిలికెడుకుండ, తరిగడవ: చూ, భాండము. 3-౫.

గర్గాటము. సం. వి. అ. పుం. యోగనాలికయను చేఁప: చూ, మత్స్యము. 1.

గర్జ, సం. వి. ఆ. స్త్రీ. 1. గర్జనము. (మేఘము లోనగువాని) ధ్వని: చూ, స్వరము. 2-౪౬-(౧౧౫); 2. ఏనుఁగుధ్వని: చూ, స్వరము. 2-౪౬-(౧౧౬); 3. సింహధ్వని: చూ, స్వరము. 2; 4. వ్యాఘ్రధ్వని: చూ, స్వరము. 2-౪౬-(౧౧౮).

గర్జకము, సం. వి. అ. పుం. గర్జకమను చేఁప: చూ, మత్స్యము. 1.

గర్జనము, సం. వి. అ. న. 1: చూ, గర్జ. 1; 2: చూ, రోషము.

గర్జము, సం. వి. అ. న. 1. ఏనుఁగుధ్వని: చూ, గర్జ. 2; 2. (మేఘములోనగువాని) ధ్వని: చూ, గర్జ. 1.

గర్జాఫలము, సం. వి. అ. పుం. 1: చూ, సముద్రాంత*; 2. పోరు: చూ, యుద్ధము; 3: చూ, బెదరింపు; 4: చూ, ప్రేరేచుట.

గర్జి, సం. వి. ఇ. పుం. మేఘధ్వని: చూ, స్వరము. 2.

గర్జించు, సం. అ. క్రి. 1. (మేఘము లోనగునవి) ధ్వనించు: చూ, శబ్దించు; 2. కోపించు: చూ, రోషించు; 3 = గద్దించు: చూ, గదుము.

గర్జితము, సం. వి. అ. న: చూ. గర్జము. 1-2; పుం. 3. మదపు టేనుఁగు: చూ, హస్తి. 1-(౭౨).

గర్తజంబుకన్యాయము, న్యా. గుంటనక్క చేష్టలరీతి.

గర్తము, సం. వి. అ. పుం. 1. = గుంట. క్రంత. గోయి-గర్త. పల్లము. (గొయ్యి, దొక్క నుయ్యి): చూ, రంధ్రము. 1-౧; 2. పిఱుఁదులమీఁది గుంతలు: చూ, రంధ్రము. 1-౬; 3. త్రిగర్తదేశవిశేషము: చూ. దేశములు.

గర్తాటము, సం. వి. అ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; 2. పందికొక్కు: చూ, మూషికము.

గర్తిక, సం. వి. ఆ. స్త్రీ. పట్టుసాలెవాని యిల్లు: చూ, సదనము. 1.

గర్దభకము, సం. వి. అ. పుం. తెల్లఁగలువ*: చూ, సహస్రపత్రము. 1-౧౨-(౩).

గర్దభగదము, సం. వి. అ. పుం. ఒకానొక రోగము: చూ. రోగము. 1.

గర్దభచందనన్యాయము, న్యా. గాడిదమీఁద నెంత గంధపుచెక్క వేసినను దాని వాసన తెలిసికొనలేనిరీతి.

గర్దభము, సం. వి. అ. న. 1: చూ, గర్దభకము*; 2: చూ, వాయువిడంగము*; 3. వావిలచెంగి*: చూ, దేవతాళము; పుం. 4. గాడిద: చూ, రాసభము; 5. క్షుద్రరోగము (స్త్రీలింగమని కొందఱు): చూ, రోగము. 1.

గర్దభాండ, సం. వి. ఆ స్త్రీ. పిఱుతేఁకు*: చూ, బారంగి.

గర్దభశాఖము, సం. వి. అ. పుం. —పై.—

గర్దభశాఖి, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్దభాంజనక, సం. వి. ఆ. స్త్రీ: చూ, దేవతాళము*.

గర్దభాండము, సం. వి. అ. పుం. కలజువ్వి. జువ్వి (అని కొందఱు)*: చూ, ప్లక్షము.

గర్దభాహ్వయము, సం. వి. అ. పుం. కుముదము*: చూ, గర్దభకము.

గర్దభి, సం. వి. ఈ. స్త్రీ. తెల్లవాఁకుడు*: చూ, వాఁకుడు.

గర్దభిక, సం. వి. ఆ. స్త్రీ. క్షుద్రరోగవిశేషము: చూ, రోగము. 1.

గర్ధనము, సం. విశ. 1. రూ-గృధ్నువు. ఇచ్ఛగలవాఁడు, ఇచ్ఛగలది (అనియు): చూ, వలపుకాఁడు; 2. పంద్రవ్యాక్తుఁడు: చూ, లుబ్ధుఁడు. (గర్ధనము అని శ.ర.) గర్ధనుఁడు (అని కొందఱు.)

గర్దము, సం. వి. అ. పుం: చూ, గర్దభాండము*.

గర్పాడు, దే. అ. క్రి. ఉండిపెను. ఆం, భా. త్ర. 97: చూ, మెఘమేయు.

గర్భండము, సం. వి. అ. పుం. కాయపొట్ట: చూ, నాభి గుడకము

గర్భకము, సం. వి. అ. న. వెంట్రుకల లోపల ముడుచుకొన్న పూవంత: చూ, భూషణము. 2-౬-(౪౦).

గర్భకరము, సం. వి. అ. పుం: చూ, పుత్త్రజీవి*.

గర్భకవిత్వము, వా. వి. (ఒక పద్యములో నొకటి రెండు మూఁడు పద్యముల గణాది నియమసమన్వితముగ నిముడ్చుట. (కవి వచనమే కవిత్వము. ఇది నాలుగువిధములు:— ఆశు కవిత్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము, చిత్రకవిత్వము అని) ఈ నాలుగువిధములలో గర్భకవిత్వ మొకటి): చూ, మాటలల్లుట.

గర్భఘాతిని, సం. వి. ఈ. స్త్రీ: చూ, శాకశింబి*.

గర్భదము, సం. వి. అ. పుం: చూ, గర్భకము*.

గర్భముత్తు, సం. వి. త్. పుం. ఒకరకము అవిసె*: చూ, విష.

గర్భపాతకము, సం. వి. అ పుం. ఎఱ్ఱమునగ*: చూ, శిగ్రువు. 1.

గర్భపాతన, సం. వి. ఆ. స్త్రీ. గుమ్మడి*: చూ, సర్వతోభద్ర. 1-౮.

గర్భపాతనము, సం. వి. అ. పుం. రీఠాకరంజము*: చూ, పూతికరజము.

గర్భపాతము, సం. వి. అ. పుం. కుంకుడు*: చూ, ఫేనిలము.

గర్భపాతని, సం. వి. ఈ. స్త్రీ: చూ, హాలిని*.

గర్భపాతిని, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్భము, సం. వి. అ. పుం. 1. = కడుపు: చూ, భ్రూణము. 1: (చూ, కడుపు. కుక్షి); 2. = కడుపు కడుపులోనిపిండము.

(గర్భసంస్కారములు మూఁడు:— ఆధానికము, పుంసవనము, సీమంతోన్నయనము) కడుపులోని పిల్ల: చూ, భ్రూణము. 1; 3. స్త్రీగర్భము: చూ, భ్రూణము. 1; 4. బిడ్డ. (నపుంసకమని కొందఱు): చూ, శిశువు. 1-గ; 5. పనసపండు తొక్క; 6. అన్నము: చూ, సాదము. (1); 7. అగ్ని: చూ, నిప్పు; అం. 8: చూ, నాటకసంధులు; (చూ, సంధి. 3.); విణ. 9. కొలిమితిత్తి, పవనసంకటము: చూ, తిత్తి; 10. ఇంటిలోపలి యిల్లు, అపవరకము: చూ, సదనము. 1.

గర్భవతి, సం. వి. ఈ. స్త్రీ: చూ, చూలాలు.

గర్భశయ్య, సం. వి. ఆ. స్త్రీ. గర్భోత్పత్తిస్థానము : చూ, మావి. 2.

గర్భాగారము, సం. వి. అ. న. శయనగృహము, లోనిల్లు (అని కొందఱు): చూ, సదనము. 1.

గర్భవిధము, అం. తానములు మూఁడు. అందు సర్వతానములు ఇరువదెనిమిది. అందు ని-గ-హీనతానములు ఏడు. అందు గర్భవిధమొకటి: చూ, ని-గ-హీనతానములు: (చూ. సర్వతానములు.)

గర్భాధానపుఁబంత, పా: చూ, పంట.

గర్భాధానము, అం: చూ, కర్మములు.

గర్భాశయము, సం. వి. అ. పుం. గర్భమును జుట్టుకొని యుండెడి సంచి: చూ, మావి. 2.

గర్భాష్టముఁడు, సం. వి. అ. పుం. ఎనిమిదవ నెలలోఁ బుట్టిన బాలుఁడు, దేవమానుఁడు: చూ, శిశువు. 1-ఖ.

గర్భిణి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, గర్భవతి; 2: చూ, మనుపాల*.

గర్భిణ్యవేక్షణము, సం. వి. అ. న. గర్భిణీస్త్రీ చర్య: చూ, బాలతంత్రము.

గర్భోజి, సం. వి. ఈ. స్త్రీ. రూ-గర్భోని. అర్ధచంద్రాకారపు తలగడ: చూ, లోడు.

గర్భోని, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

గర్భోపఘాతిని, సం. వి. ఈ. స్త్రీ. కట్టినతర్వాత నాఁటోతు పాఱఁగా నీచుకొన్న యావు: చూ, ధేనువు.

గర్ముత్తు, సం. వి. త్. న. 1. గంటెలు, చామలు, సజ్జలు మొ*: చూ, సస్యము. (తృణధాన్యవిశేషమును, తృణమును అనఁబడును.); పుం. 2. ఇనుఁడు: చూ, సూర్యుఁడు; 3. కిరణము: చూ, హాయనము. 2; స్త్రీ 4. ఎండించిన వరుగు: చూ, వరుగు. 1; 5. బంగారు: చూ, లోహము. 1; 6. తీఁగె*: చూ, లత. 1. (రూ-గర్ముతీ)

గర్ముటిక, సం. వి. ఆ. స్త్రీ. వ్రీహిభేదము: చూ, ధాన్యము

గర్మోటిక, సం. వి. ఆ. స్త్రీ. జరడీతృణము*: చూ, తృణము. 1.

గర్వటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, గర్ముత్తు. 4.

గర్వము, సం. వి. అ. పుం. 1. = గరువము: చూ, హంకారము (ఐశ్వర్యము-రూపము- తారుణ్యము- కులము- విద్య-బలము- ఇష్టవస్తు లాభాదులచే నితరులను ఎఱుఁగక యుండునట్టిది, గర్వమను శృంగార రసైక దేశ వ్యభిచారిభావము); 2. కావరము: చూ, మదము. 1; అం. 3: చూ, సంచారిభావములు (ఓరోరి కొండలం జెండుసెటులఁ జెండితెచ్చిన మాట నీ వౌకడ వెదురే.)

గర్వాటుఁడు, సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు: చూ, వేత్రధారుఁడు.

గర్వి, సం. విణ. (న్. ఈ. న్) = గరివి. గర్వముగలవాడు: చూ, పొగరుఁబోతు.

గర్వించు, సం. అ. క్రి. = గరివించు: చూ, హంకరించు.

గర్వితుఁడు, సం. విణ: చూ, గర్వి.

గర్వీ యాతి పరాభవం, లో. గర్వముగల మనుజుఁ డెల్లెడల నవమానము నొందును.

గర్హ, సం. వి. ఆ. స్త్రీ. దూఱు: చూ, నింద. 1.

గర్హణము, సం. వి. అ. న: చూ, గర్హ.

గర్హించు, సం. స. క్రి. దూఱు: చూ, నిందించు.

గర్హితము, సం. విణ. నిందింపఁబడినది: చూ, హీనము. 2.

గర్హ్యము, సం. విణ. నికృష్టము: చూ, హీనము. 1.

గర్హ్యవాది, సం. విణ. నిందింపఁదగు మాటలాడువాఁడు, కద్వదుఁడు: చూ, వ్యాఘుఁడు. 2. (గర్హ్యవాదికంటె కద్వదుఁడు నిందింపఁదగు మాటలు కొంచెము ఆడును. ఇదియే వారిద్దఱికిఁగల భేదము.)

గర్హ్యుఁడు, సం. విణ. 1. అధముఁడు: చూ, హీనుఁడు; 2. జాత్యాచారాదులచే నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

గఱగఱ, దే. వి. 1. భక్ష్యములు నములుటయందగు ధ్వన్యనుకరణము. రూ-కఱకఱ. చూ, హాహాహా; 2. కాఠిన్యము: చూ, బెడిదము.

గఱగఱలాడు, దే. అ. క్రి. (గఱగఱలు + ఆడు) గఱగఱయని మ్రోఁగు: చూ, శబ్దించు.

గఱగోలు, దే. వి. తక్కువ: చూ, వెలితి. 2.

గఱి, వై. వి. 1. = గరుత్. ఱెక్క: చూ, ఱెక్క. 1; 2. = గరుత్. బాణముఱెక్క: చూ, ఱెక్క. 1; వా. వి. 3. (ఆకుడాయి, పెద్దపులి నాలుక, నోటిపూఁతగలవాని నాలుకలోనగు వానియందలి) గఱుకు: చూ, గఱుకు. 2; 4. తాటికమ్మ (తొడిమె) కు ఇటునటుగల గఱుకు. "గఱికమ్మ-గఱిగమ్మ".

గఱిఁటె, దే. వి: చూ, రూ-గరిఁటె.

గఱిక, దే. వి. 1. దూర్వ*: చూ, తృణము. 1 (దీని రసము మూత్రమును జారీచేయును. మూత్రముమెంటపడు రక్తము తగ్గించును. పీనస, గ్రహణి, అతిసారము కట్టును. దీనివేరు చితుకకొట్టి పెరుఁగుతో నిచ్చిన సెగరోగము పోవును.). అం. 2: చూ, అర్ఘ్యము.

గఱికచెక్క, ద్వ. వి. పచ్చికతోడి మట్టిపెల్ల. పచ్చికపెల్ల (గఱికమోడిచెక్క అనియు): చూ, భూమి. 1.

గఱికమ్మ, వా. వి. గఱుకుగల తాటికమ్మ (తొడిమె): రూ - గఱిగమ్మ: చూ, మదురుకమ్మ.

గఱికమ్మి, ద్వ. వి. గఱిబద్ది (సంధిని వర్ణలోప వర్ణవికారములు)

గఱికసూదులు, ద్వ. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము.

గజిగమ్మ, వా. వి. (గజుకు + కమ్మ): చూ, రూ-గజికమ్మ. "గవిరిమాట గజిగమ్మ సదును." "మరుగు పోయుటకు గజి గమ్మలు తీసికొనిరమ్మ."

గజిచిప్ప, వ్య. వి. ముత్తెపుఁజిప్ప: చూ, సిపి.

గజిబద్ద, వ్య వి. (గజుకు + బద్ద) గజునులోడి రాటాకుబద్ద: చూ, గజికమ్మ.

గజిసె, వై. వి. =: చూ, రూ-గరిసె.

గజుకు, దే. వి. 1. కొడవలిలోనగువానికక్కు: రూ-కక్కు-కఱకు-కఱుకు; వా. వి. 2: చూ, గజి. 3.

గజుగు, దే. వి: చూ, గరియ*

గజుడు, వై. విశే. 1. = గురు, పెద్ద: చూ, విపులము; 2. = గురు. గుర్వి. గొప్పవాఁడు. ప్రభా. 3, ఆ. 5: చూ, హేమా హేమీలు.

గజువు, వై. వి. =: చూ, రూ-గరువు. 3.

గజ్జు, దే. వి. త్రేఁచుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గజ్జి, దే. వి. చేఁపలఁబట్టెడు సాధనము (దీని ఆకారము తిట్టి వంటిదిగాని యిది మిక్కిలి పెద్దది.): చూ. వల. 1.

గలంతిక, సం. వి. ఆ. స్త్రీ. గరిగెపిడత: చూ, పాత్రము. 6.

గలంతియ, వై. వి. = గలంతికా. గిండిచెంబు: చూ, పాత్రము. 6. (రూ-గలఁతి-గలంతి-గలంతియ-గళంతి-గళంతియ.)

గలకంబలము, సం. వి. అ. పుం. ఆఁబోతు గంగడోలు, ఆవు లకు మెడక్రింద వ్రేలాడునది: చూ, సాస్న (రూ-గళకంబ లము.)

గలగండము, సం. వి. అ. పుం. గలగండమాల: చూ, వ్రణము. 1-గ౩; (రూ-గళగండము.)

గలగల, దే. వి. 1. కదలుట, చెట్లఆకులు రాలుట, ఫలాదులు రాలుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 2. భూషణములు మ్రోగుటయందగు ధ్వన్యనుకరణము. కళా. 6, ఆ. 197: చూ, హూహూ,

గలజెర, దే. వి. రూ-గలిజేరు*: చూ, వర్షకేతువు. (రూ-గల జేరు-గలిజెర-గలిజెరు-గలిజేరు) (ఇది మూత్రము జారీ చేయును.)

గలజేరు, దే. వి.—పై.—

గలతరించు, దే. అ. క్రి. (మేను) జల్లుమను.

గలపడించు, దే. వి: చూ, నిష్ప్రయోజనుఁడు.

గలబ, దే. వి. కలఁత: చూ, సంతాపము.

గలబరించు, దే. అ. క్రి. కలఁగు: చూ, సంక్షోభించు.

గలబా, గల్బా. వా. వి. కలఁత: చూ, సంతాపము.

గలమేఖల, సం వి. ఆ. స్త్రీ. సూత్రాలి, గళసూత్రము: చూ, భూషణము 2-ఉ. (రూ-గళమేఖల.)

గలవ్రతము, సం. వి. అ. పుం నెమిలి: చూ, మయూరము (రూ-గళవ్రతము.)

గలశుండి, సం. వి. ఈ. స్త్రీ: చూ, గొంతుముడి. (రూ-గళ శుండి.)

గలశుండిక, సం. వి. ఆ. స్త్రీ కొండనాలుక: చూ, రసన. (రూ-గళశుండిక.)

గలస్తని, సం. వి. ఈ. స్త్రీ. ఛాగి: చూ, మేషము. 1. (రూ-గళస్తని).

గలానిలము, సం. వి. అ. పుం. ఒకరకపుచేఁప: చూ, మత్స్యము. 1. (రూ-గానిలము).

గలామ, వై. వి. = ఫల్ల. కిస్తము: చూ, ఫలము. 4.

గలిజెర, దే. వి: చూ, రూ-గలజెర *.

గలిజెరు, దే. వి. —పై.—

గలిజేరు, దే. వి. —పై.—

గలిబిలి, దే. వి. 1. సందడి: చూ, స్వరము. 2; 2. అలికిడి: చూ, స్వరము. 2. ఉ-(ఇ).

గలీజు, వా. వి: చూ, రూ-గలీజు.

గలేగండము, సం. వి. అ. పుం. ఒకరకము పక్షి: చూ, పక్షి. (రూ- గళేగండము.)

గలేస్తని, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గలస్తని. (రూ-గళేస్తని).

గల్యా, సం. వి. ఆ. స్త్రీ 1. = గాలక్య. కుతికలగుంపు. చూ, మెడ; 2. పొంగళకముల సమూహము: చూ, సూత్రము. 1-ఉ.

గల్యము, సం. వి. అ. న. ఉమ్మి: చూ, రసనామలము.

గల్ల, దే. వి. 1. బొత్తిగా గింజపట్టని ధాన్యము. పొల్ల, పొల్లు: చూ, ధాన్యము; 2. మాదిగవాఁడు తోలు నానవేసెడి చట్టి: చూ, భాండము. 3-గ.

గల్లంతు, వా. వి. అల్లరి.

గల్లచాతురి, సం. వి. ఈ. స్త్రీ ఒకరకము తలగడ: చూ, లోడు.

గల్లము, సం. వి. అ. పుం. చెక్కిలి: చూ, లెంప. 2.

గల్లు, దే. వి. భూషణములు మ్రోయుట యందగు ధ్వన్యను కరణము. కళా. 3, ఆ. 25. (ఆమ్రేడితమునందు గల్లుగల్లు-గలుగల్లు.): చూ, హూహూ.

గల్వర్కము, సం. వి. అ. పుం. 1. చషకము: చూ, పాత్రము. 6; 2. మద్యపానపాత్రము: చూ, పాత్రము. 6; 3. ఇంద్ర నీలమణి: చూ, రత్నములు. 1-ఉ.

గవఁక, దే. వి. దుర్గము పురద్వారము: చూ, పెద్దవాకిలి (రూ-గవను- గవని-గవిని-గవఁకు- గవుకు.

గవఁకు, దే. వి. —పై. —

గవడగొయ్యి. వా. వి. 1. చిక్కులోఁబడిన వ్యవహారము; 2. బయటికి రావీలులేని గొయ్యి.

గవతము, దే. వి. రూ-గవదము. కసవు: చూ, తృణము. 1.

గవద, వా. వి. రూ-గవుద. చెక్కిలి "గవద బిళ్లలు": చూ, లెంప. 2.

గవదము, దే. వి: చూ, రూ-గవతము.

గవని, దే. వి. —పై.—

గవను, దే. వి. —పై.—

గవయము, సం. వి. అ. పుం. 1. అడవి ఆవు: చూ, ధేనువు; 2. = గోవ. గురుపోతు, మృగవిశేషము: చూ, శరభము. 1.

గవరన, వై. వి. = గౌర. ఎఱుపు: చూ, వర్ణము. 6-ళ.

గవరనరు. వా. వి. రాష్ట్రపాలకుఁడు, గవర్నరు.

గవరమ్మ, వై. వి. = గౌరి. (రూ-గయిరమ్మ-గైరమ్మ): "గవ రమ్మ సంబరము": చూ, పార్వతి. 1. (వాడుక.)

గవరాజము, సం. వి. అ. పుం. ఎద్దు: చూ, వృషభము.
గవలము, సం. వి. అ. న. 1. ఎనుపకొమ్ము: చూ, శృంగము. 1; పుం. 2. నల్ల ఎనుబోతు: చూ, మహిషము.
గవాక్షము, సం. వి. అ. పుం, న. కిటికి: చూ, వాతాయనము.
గవాక్షి, సం. వి. ఈ. స్త్రీ. 1. పిన్నపాపర*(ఎముకండ్లవంటి పువ్వులు గలది): చూ, పాపర; 2. గోహలకర్కటి: చూ, ఎడమ*; 3. మల్లికాలత *: చూ, హసంతి. 2; 4. దింటెన*: చూ, విష్ణుక్రాంత; న. పుం. 5. పెద్దఉేతు*: చూ, కాకోటము.
గవాక్షుడు, సం. వి. అ. పుం. గవాక్షుడను కోతి: చూ, వానరము. 1-౧౩.
గవాచి, సం. వి. ఈ. స్త్రీ. గవాచియను చేప: చూ, మత్స్యము. 1.
గవాదనము, సం. వి. అ. న. ఘాసము *: చూ, తృణము. 1.
గవాదని, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పెద్ద పాపర *: 2. పసులు మేయుకంచె, కొఱను: చూ, భూమి. 1; 3. దింటెన*: చూ, విష్ణుక్రాంత.
గవాదిని, సం. వి. ఈ. స్త్రీ: చూ, చూ-గవాదని. 3.
గవామయము, అం. తానములు 3. అందు కూటతానములు 28. అందు రహీనతానములు 7, రిహీనతానములు 7, గహీన తానములు 7, మహీనతానములు 7. వీనిలోని రహీనతానములు ఏడింటిలో గవామయమొకటి: చూ, రహీనతానములు. (ఈవివరణము కూటతానములను పదముకడఁజేర్చి చదువుకొనవలెను): చూ, కూటతానములు: చూ, తానములు.
గవాలూకము, సం. వి. అ. పుం: చూ, గవయము.
గవాషిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, లక్క.
గవి, సం. వి. అ. స్త్రీ. 1. ఆవు: చూ, ధేనువు; 2. పాలుపితుకు చెంబు: చూ, పాత్రము. 6; వై. వి. (1) = గహ్వర. గుహ. స్వా. 4. ఆ. 46: చూ, పణకు; (2) పల్లము: చూ, రంధ్రము. 1-౧.
గవిని, దే. వి: చూ, గవక.
గవిలెము, దే. వి. గంచములో రాచి కలిపెడు విత్తు.
గవిసె, వై. వి. = కోశ. గాదె: చూ, పంటపాల (దేశ్యమని శబ్దరత్నాకరము.)
గవిసెన, వై. వి. = కోశ. చూ-గవుసెన-గౌసెన: చూ, నిచోళము (దేశ్యమని శబ్దరత్నాకరము.)
గవీనము, సం. విణ. ఆశితము, అంతకుముందే ఆవులు మేసినది (పొలము), మునుపు ఆవులుండినది (పొలము) (అని కొందఱు): చూ, భూమి. 1-౧౧. (౧-౧౪).
గవుండ్లవాఁడు, వై. వి. = గోండ. రూ-గౌండ్లవాఁడు. సారాయి నమ్మువాఁడు, కల్లు గీయువాఁడు (అని కొందఱు): చూ, సురాజీవి.
గవుఁడు, వై. వి. 1. = గోండః —పై.— (రూ-గౌఁడు); 2. కాఁపువారి పట్టపుపేరు: రూ-గౌఁడు.
గవుకు, దే. వి: చూ, గవక.
గవుతసరము, దే. వి. ఆఁడువారినగ: చూ, భూషణము. 2-౮-(౪).
గవుద, వై. వి. = గండ. రూ-గౌద. చెక్కిలి: చూ, లెంప. 2. (దేశ్యమని శబ్దరత్నాకరము.)
గవుర, దే. వి. రూ-గౌర. జెహోరి: చూ, వస్త్రకుఁడు.
గవురమ్మ, వై. వి =: చూ, గవరిమ్మ.
గవురు, దే. వి. రూ-గౌరు. 1. కపటము. అం. పదా. ఉర, 10: చూ, వ్యాజము. 1; 2. ఏనుఁగు: చూ, హస్తి; 3. రాహాళి: చూ, వీణ. 1-౩౬; 4. గవుళి. చూ, బల్లి; వై. వి. 5. = గౌరి: చూ, పార్వతి. 1. (రూ-గౌరు).
గవులు, దే. వి. రూ-గౌలు. 1. దుర్గంధము: చూ, వాసన. 1-౪; 2. గంధము: చూ, వాసన.
గవుళి, దే. వి. రూ-గౌళి-గౌరు. శకునములు చెప్పెడు బల్లి: చూ, బల్లి.
గవుసెన, వై. వి. = కోశః. రూ-గౌసెన-గవిసెన. వీణ మొదలగువాని యొఱ: చూ, నిచోళము.
గవేధువు, సం. వి. ఉ. స్త్రీ. అడవిగోదుమలు, వట్టివడ్లు. రూ-గవేధుకు: చూ, ధాన్యము.
గవేధుక, సం. వి. ఆ. స్త్రీ —పై.— "గవేధుర్నాగవేధుకః" రత్నకోశము.
గవేధువు, సం. వి. ఉ. పుం, స్త్రీ. —పై.—
గవేధుకము, సం. వి. అ. న. —పై.—
గవేశక, సం. వి. ఆ. స్త్రీ. ఒకరకముచెట్టు: చూ, వృక్షము.
గవేషణ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమంత్రణార్థము వెదకుట (శ్రాద్ధబ్రాహ్మణులను వెదకుట): చూ, పర్యేషణ; 2. వెదకుట: చూ, వెదకుడు.
గవేషించు, సం. స. క్రి. ఆరయు: చూ, వెదకు.
గవేషితము, సం. విణ. వెదకఁబడినది: చూ, మృగితము.
గవ్య, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవులమంద: చూ, ధేనువు; 2. వింటినారి: చూ, స్థావరము. 1; 3. రెండుకోసులు: చూ పరువు. 2.
గవ్యము, సం. వి. అ. న. 1. వింటినారి: చూ, స్థావరము. 1; 2: చూ, రాగద్రవ్యము; విణ. 3. ఆవుపాల లోనగునవి; 4. ఆవునకు హితమైనది: (చూ, గవ్యములు.)
గవ్యములు, అం. = పంచగవ్యములు:— గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము, (5) (ఇవి పవిత్రమైనవి. పాపములను పోఁగొట్టునవి)
గవ్యాదని, సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్దపాపర *.
గవ్యూతము, సం. వి. అ. న. రెండుకోసుల దూరము: చూ, పరువు. 2.
గవ్యూతి, సం. వి. ఇ. స్త్రీ. 1.—పై.— (ఈకారాంతమనియు, పుం-స్త్రీ. లింగమనియు కొందఱు.)
గవ్వ, దే. వి. ఒకరకము శంఖము: (చూ, వరాటము): చూ, నంకు. 1.
గవ్వచౌకము, ద్వ. వి: చూ, వెలిగారము.
గవ్వము, దే. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.
గవ్వసరులు, దే. వి. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

గవ్యసాంబ్రాణి, వా. వి. గవ్యపలుకు సాంబ్రాణి, ఒకరకము అంగడివస్తువు: చూ, సాంబ్రాణి. 1: (చూ, రాజార్హము. 1—౩౪.)

గశికము, సం. వి. అ. పుం. 1. నూనెమడ్డి, తైలశేషము: చూ, మడ్డి. 2; 2. మేకు: చూ, గసి. 2.

గస, దే. వి. కాసము: చూ, దగ్గు.

గసకము, సం. వి. అ. పుం.=గసగస. నల్లమందువిత్తు: చూ, సూక్ష్మతండులము.

గసగస, వై. వి.=ఖస్ఖసము. గసకము. —పై.—

గసగసాలు, వై. వి. బ.=—పై.—(గ్రహాబికట్టును. వీర్య పుష్టి జేయును.)

గసి, వై. వి. 1: చూ, గశికము. 1; 2. మేకు. హరిశ్చ. 2, అ. 6: చూ, కూలము.

గసిక, దే. వి. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. మేకు: చూ, శూలము; 3. సలాక: చూ, శలాక; 4. త్రవ్వుట కనువుగా కొనచెక్కిన కొయ్య: చూ, కత్తవ. 2.

గసిబిసి, దే. విణ: చూ, రూ-గజిబిజి.

గసిరా, దే. వి. ప్రవాళము. ఆం. పదా-4-5: చూ, రత్నములు. 1-3-(౪).

గస్తాలు, దే. వి. బ. మల్లబంధవిశేషము: చూ, మల్లశాస్త్రము.

గస్తీ, వా. వి: చూ, గస్తు.

గస్తీలు, దే. వి. బ. (గస్తు+యాలు) కావలివారు. "గస్తీల రిజష్టరు": చూ, రక్షకుఁడు.

గస్తు, దే. వి. (రాత్రులందు ఊరుతిరిగికాచు) కావలి: చూ, రక్షణము.

గహన, సం. వి. ఆ. స్త్రీ. పూర్వమీమాంసాశాస్త్రము. మీమాంసలు రెండింటిలో నొకటి: చూ, మీమాంసలు.

గహనము, సం. వి. అ. న. 1. అడవి: చూ, విపినము; 2. గుహ: చూ, రంధ్రము. 1; 3. వగ: చూ, శోకము; విణ. 4. ఎఱుఁగరానిది; 5. చొరరానిది: చూ, దుర్గమము.

గహరము, సం. వి. అ. న. పొయికిఁబెట్టెడి కఱ్ఱ, పిడక (అని కొందఱు): చూ, పిడక.

గహీనతానములు, అం. రాగాధ్యాయమునందలివి. — సర్వస్వ దక్షిణము, దీక్ష, సోమము, సమిత్తు, స్వాహాకారము, తనూనపాత్తు, గోదాహము. (7): (చూ, ఉపవిద్యలు: చూ, గవామయము): చూ, తానములు.

గహ్వరము, సం. వి. అ. న. 1. అడవి: చూ, విపినము; 2.=గవి. కొండగుహ: చూ, రంధ్రము. 1-౧; 3. వగ: చూ, శోకము; 4. కపటము: చూ, వ్యాజము. 1; పుం. 5. పొదరిల్లు (నపుంసకమని కొందఱు): చూ, సదనము. 1; విణ. 6. రంధ్రముతోఁగూడినది: బొరియ: చూ, రంధ్రము. 1—౨.

గహ్వరి, సం. వి. ఈ. స్త్రీ. నేల: చూ, భూమి. 1.

గళంతిక, సం. వి. ఆ. స్త్రీ.=కలంత - గలంతియ: చూ. రూ-గలంతిక.

గళకంబళము, సం. వి. అ. పుం: చూ, రూ-గలకంబలము.

గళకత్తెర, అం: చూ, విన్నాణములు.

గళగండము, సం. వి. అ. పుం: చూ, రూ-గలగండము.

గళగ్రస్తము, సం. వి. అ. పుం. కుత్తుక మొదటఁగల గుంట, అంగిటిగుంట: చూ, వాటిక.

గళగళ, దే. వి. చెప్పుట, త్రాగుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా.

గళనము, సం. వి. అ. న: చూ, జాఱుట.

గళము, సం. వి. అ. పుం. 1. కుత్తుక: చూ, మెడ; 2: చూ, సర్జరసము.

గళమేఖల, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-గలమేఖల.

గళవ్రతము, సం. వి. అ. పుం: చూ, రూ-గళవ్రతము.

గళశుండి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గలశుండి.

గళశుండిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-గలశుండిక.

గళస్తని, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గలస్తని.

గళస్వనము, అం. కళలు ఎనిమిదివిధములు. ఆ యెనిమిదింటిలో గళస్వనము అయిదవది: చూ, కళలు. 3.

గళాంకురము, సం. వి. అ. పుం. కొండనాలుక: చూ, గల శుండిక.

గళానిలము, సం. వి. అ. పుం: చూ, రూ-గలానిలము.

గళికము, సం. వి. అ. న. వెన్నకాఁచినమడ్డి: చూ, స్నేహము. 1-౧౫.

గళితమగు, మి. అ. క్రి. ఊడు: చూ, రాలు.

గళితము, సం. విణ. 1. జాఱినది: చూ, స్రస్తము; 2. తినఁబడినది; చూ, భుక్తము. 1.

గళేస్తని, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-గలస్తని.

గళోద్భవము, సం. వి. అ. న. గుఱ్ఱము మెడమీఁది సుడి: చూ, రోచమానము: (చూ, సుడి. 1.)

గళ్వ, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-గల్వ.

గళ్ల, దే. వి. రూ-కళ్ల: చూ, శ్లేష్మము.

గళ్ళచీర, వా. వి. సిగుబుచీర: చూ, వస్త్రము. 1-౫౦.

గళ్లా, వా. వి. గరగడ.

గల్లీ, వా. వి. ఇఱుకువీధి: చూ, సందు. 1: (చూ, మార్గము. 1.) గల్లీ (అనియు).

గళ్లగళ్ల, వా. వి. కింకిణ్యాది ధ్వన్యనుకరణము: చూ, హాహాహా.

గళ్లవేయు, వా. స. క్రి: చూ, గడికొళ్ళు వేయు.

గళ్లెము, దే. వి. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర: చూ, గుంజు.2.

## గా

గాంగటకము, సం. వి. అ. పుం. గాంగటకమను చేఁప: చూ, మత్స్యము. 1.

గాంగటము, సం. వి. అ. పుం. —పై.—

గాంగేయము, సం. వి. అ. పుం. —పై.—

గాంగము, సం. విణ. గంగయందుఁ బుట్టినది.

గాంగవరితము, సం. వి. అ. న. సూర్యునిశంఖము: చూ, సంకు. 1.

గాంగాయని, సం. వి. ఇ. పుం. 1. భీష్ముఁడు: చూ, శాంతనవుఁడు; 2. కుమారస్వామి: చూ, స్కందుఁడు.

గాంగుఁడు, సం. వి. అ. పుం. —పై.—

గాంగేయము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. ఇల్లిశమనుచేప: చూ, మత్స్యము 1; 3. వెన్నెముక: చూ, శల్యము 1; 4. తామర, తృణవిశేషము (అని కొందఱు): (చూ, తృణము. 1.), (గంగయందుఁబుట్టినది)*: చూ, సహస్రపత్రము. 1.

గాంగేయుఁడు, సం. వి. అ. పుం: చూ. గాంగాయని.

గాంగేరి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పులిచింత*.

గాంగేయకము, సం. వి. అ. పుం: చూ, బలుసు*.

గాంగేటకి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, బీఱ*; 2. జిబిలిక*: చూ, హ్రస్వగవేధుక. (రెండర్థము లొక్కటియే యని కొందఱు.)

గాంగేష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. మౌక్తికము: చూ, ముత్తెము; (చూ, రత్నములు. 1-౧;); 2. కటశర్కరాలత*: చూ, ముత్తెపుతీఁగె.

గాంజకాయము, సం. వి. అ. పుం. మీలవల్లంకి: చూ, వర్తిక.

గాంజ, దే. వి. = కలంజి. గాంధారి*: చూ, జనగాఁజ.

గాండివము, సం. వి. అ. పుం, న. రూ-గాండీవము. 1. అర్జునుని విల్లు (మనుపుగాఁ జేయఁబడని గణుపులు గలది): చూ, బాణము. 1-౫; 2. విల్లు: చూ, బాణము. 1-౩౭.

గాండీవము, సం. వి. అ. పుం, న. —పై.—

గాండీవి, సం. వి. న్. పుం. 1. అర్జునుఁడు: చూ, విజయుఁడు.1; 2. అర్జునము*: చూ, సాలము. 3-౧.

గాండ్రించు, దే. అ. క్రి. (ముఖము) ఉబ్బు. "ముఖము గాండ్రింపుగా నున్నది".

గాండ్రు, దే. వి: చూ, రూ-కాండ్రు. "పులి గాండ్రుమనెను."

గాండ్ల, దే. వి. నూనె అమ్మి జీవించెడుజాతి. "గాండ్లవాఁడు - గాండ్లది."

గాండ్లవాఁడు, దే. వి. రూ-గాళ్ళవాఁడు: చూ, తెలుకులవాఁడు.

గాంతుఁడు, సం. విశే. 1. తెరువరి: చూ, పాంథుఁడు; 2. పాటకాఁడు: చూ, సీకారి.

గాంత్రి, సం. వి. ఈ. స్త్రీ రూ-గంత్రి: చూ, శకటము. 1.

గాందిని, సం. వి. ఈ. స్త్రీ. గంగానది: చూ, నది.

గాందినీసుతుఁడు, సం. వి. అ. పుం. భీష్ముఁడు: చూ, శాంతనవుఁడు.

గాంధర్వము, సం. వి. అ. న. 1. రూ-గంధర్వము. పాట: చూ, స్వరము. 2-౧౩; 2. గంధర్వగానము: చూ, స్వరము. 2-౩౫: (చూ, ఉపవిద్యలు); 3. గుఱ్ఱము: చూ, హయము; 4. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము: చూ, వివాహము: 5. దినముయొక్క ఏడవభాగము: చూ, దినభాగములు: (చూ, వాసరము. 1-౩.)

గాంధర్వవేదము, అం. రూ-గంధర్వవేదము. 1: చూ, విద్యలు; (ఇందుకు సంబంధించినవి.—నృత్తగీతవాద్యము, అవాంతరములు, భావాధ్యాయము, రాగాధ్యాయము, తాళాధ్యాయము, నాటకపరీక్ష మొ.); 2: చూ, ఉపవేదములు.

గాంధర్వాస్త్రము, అం: చూ, అస్త్రములు.

గాంధర్వి, సం. వి. ఈ. స్త్రీ. సామవేదము: చూ, వేదము.

గాంధర్వులు, అం: చూ, రూ-గంధర్వులు.

గాంధారగతివి, అం: చూ, భాషాంగములు: (చూ, భాష. 1.)

గాంధారగ్రామ గతమూర్ఛనలు, అం. నంద, విశాల, సుముఖి, చిత్ర, చిత్రవతి, సుఖ, అలాప (7). (తానముల వివరము నందు షడ్జ మధ్యమ గ్రామములలోఁ జెప్పఁబడిన మూర్ఛనా సప్తకద్వయములో ప్రత్యేక మవాంతరభేదములు నాలుగు కలవు. వాటిచేత నొక్కొక్క సప్తక మిరువదెనిమిది భేదములుగా నైనది: (చూ, అవాంతరభేదములు, అచ్చుల అనుబంధములో): చూ, తానములు.

గాంధారగ్రామము, అం. గ్రామములు మూఁడింటిలో నొకటి: చూ. గ్రామములు.

గాంధారదేశస్త్రీ, అం. దేశస్త్రీలలో నొకతె: చూ, స్త్రీ 1-౩: (చూ, దేశస్త్రీలు.)

గాంధారపంచమి, అం. 1. గాంధర్వ వేదమునందలి రాగాధ్యాయములోని అంశములు 63, అందుగలజాతులు 11లో నిదియొకటి: చూ, అంశములు; 2. టక్కజభాషలు ఇరువదియొకటి-టిలో నొకటి: చూ, టక్కజభాషలు:(చూ, భాష. 1.): చూ, స్వరము. 2-౧౧.

గాంధారపంచమిజభాష, అం. గాంధారి యను భాష: చూ, గాంధారి. 5.

గాంధారము. సం. వి. అ. పుం. 1. గాంధారమను స్వరము, రణధ్వని (అని కొందఱు): చూ, స్వరము. 2-౩-(౩); 2. సిందూరము: చూ, వహ్నిశిఖము, 1; 3. బాలెంతబోలు: చూ, బోళము; అం. 4: చూ, దేశము; 5. సంగీతస్వరములు ఏడింటిలో నొకటి. (గాంధారము-గ): చూ, స్వరము. 2: చూ, సంగీతస్వరములు: (చూ, సప్తస్వరములు)

గాంధారరాజము, సం. వి. అ. పుం. నల్లపిచ్చుక: చూ, పిచ్చుక.

గాంధారవీథిక, అం: చూ, భిన్నషడ్జకజభాషలు: (చూ, భాష. 1.)

గాంధారి, సం. వి. ఈ. స్త్రీ. 1. = గంజాయి*: చూ, జనగాఁజ (గాంధారిమొంస); 2. ధృతరాష్ట్రునిభార్య: చూ, భార్య. (దుర్యోధనాదుల తల్లి); అం. 3: చూ, సౌవీరజభాషలు: (చూ. భాష. 1.); 4. గాంధర్వవేదములోని రాగాధ్యాయము నందలి అంశములు 63. అందుగల శుద్ధజాతులు 7 లో నిదియొకటి: చూ, అంశములు: 5: చూ, గాంధారపంచమిజ భాష; 6. భిన్నషడ్జకజభాషలు 17 లో నొకటి: చూ, భిన్నషడ్జకజ భాషలు: (చూ, భాష. 1.)

గాంధారేయుఁడు, సం. వి. అ. పుం. దుర్యోధనుఁడు: చూ, సుయోధనుఁడు: (చూ, రాజు. 1-౪౧.)

గాంధారోదీచ్యవ, అం. గాంధర్వవేదమునందలి రాగాధ్యాయములోని అంశములు 63, అందుగల జాతులు 11 లో నిదియొకటి: చూ, అంశములు: (చూ, స్వరము. ౩-౧౧.)

గాంధికుఁడు, సం. వి. అ. పుం. 1. లేఖకుఁడు: చూ, పంజీకరుఁడు; 2. సుగంధవస్తువులను విక్రయించువాఁడు: చూ, విక్రయికుఁడు.

గాంభీరి, అం: చూ, భాషాంగములు: (చూ, భాష. 1.)

గాంభీర్యము, సం. వి అ. న. 1. గంభీరభావము; 2. భ్రూనేత్రాది వికారములచేత కొంచెము తెలియఁదగిన మనోవికారవిశేషము: చూ, హావము; అం. 3: చూ, గుణములు; 4. దీని పోలిక:- సముద్రము.

గాణేయము, సం. విణ. గణనీయము.

గాత, సం. వి. ఋ. పుం. 1. పాటపాడువాఁడు: చూ, సీకారి; వై. వి. (1) = ఘాతము. దెబ్బ: చూ, మొత్తు. 1.

గాతము, వై. వి. = ఖాత. పల్లము; గుహ (అని కొందఱు): చూ, రంధ్రము. 1.

గాతవము, సం. వి. అ. న. గంధర్వగానము: చూ, స్వరము. 2.

గాతి, వై. వి. తిండి: చూ, సాపాటు. (వా).

గాతికలఁగు, దే. అ. క్రి: చూ, వేఁడుకొను.

గాతువు, సం. వి. ఉ. పుం. 1. మగకోయిల: చూ, పికము; 2. తుమ్మెద: చూ, భ్రమరము; 3. దిట్టమైన పాటకాఁడు. (విణ. పాటకాఁడు): చూ, సీకారి; 4. చయనము చేసినవాఁడు: అగ్నిచిత్తు-అగ్నిచిత్తుఁడు. (ఇది విచార్యము. ఆహితాగ్ని: చూ, వహ్ని. 1-౩౪; 5. సొద: చూ, శ్మశానము. (అగ్నిచిత్తు అనుపదమున కీయర్థము కలదని కొందఱు.): ఉ. స్త్రీ. 6. భూమిలో ఉఱుముట. స్తనితము: చూ, స్వరము. 2-౪౮-(౨౦); విణ. 7. కోపి: చూ, రోషణుఁడు.

గాత్రభంగ, సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి*: చూ, కూశింబి.

గాత్రమార్జని, సం. వి. ఈ. స్త్రీ. దేహము తుడుచుకొను బట్ట: చూ, వస్త్రము. 1-౨౮.

గాత్రము, సం. వి. అ. న. 1. దేహము: చూ, శరీరము; 2. అవయవము: చూ, విశేషము. 3; 3. ఏనుఁగుయొక్క ముందటి పిక్క లోనగుచోటు (ఈయర్థమునందిది ఆకారాంత స్త్రీలింగము: చూ, హస్తి. 1-౩-(౨౫); (వెనుకటికాళ్ల మొదలునాఁగల భాగము అపరము); 4. కంఠము: చూ, మెడ; దే. విణ. (1) లావు: చూ, స్థూలము.

గాత్రవృక్షము, సం. వి. అ. పుం. తపః*: చూ, మహాబల.

గాత్రసంకోచి, సం. వి. న్. పుం. 1. పిల్లి: చూ, మార్జాలము; 2. తొండ: చూ, సరటము.

గాత్రసంప్లవము, సం. వి. అ. పుం. ప్లవపక్షి: చూ, మహాపక్షము.

గాత్రానులేపని. సం. వి. ఈ. స్త్రీ. సుగంధద్రవ్యములు కూర్చి చేసిన గంధపుబిళ్ళ: చూ, వర్తి. 3.

గాథ, సం. వి. ఆ. స్త్రీ. 1. చరిత్రము; చూ, సమాచారము. 2; 2. పద్యము, శ్లోకము: చూ, వృత్తము. 1; 3. పాట: చూ, స్వరము. 2-౧౬; 4. చక్కఁబలుపఁబడని భాష, ప్రాకృత భాష (అని కొందఱు): చూ, భాష. 1; 5. ముందుగాఁజెప్పెడి వాగ్విశేషము: చూ, సమాచారము. 2; 6. పూర్వీకుల చరిత్రము: చూ, సమాచారము. 2; 7. ఊహ: చూ, యోచన; 8. వాయులక్ష్మి: చూ, వాయువు. 1-౨౭.

గాథకుఁడు, సం. వి. అ. పుం. విణ. (అని కొందఱు). పాటకాఁడు: చూ, సీకారి.

గాథము, సం. వి. అ. పుం. 1. చోటు: చూ, స్థానము. 1; 2. ఇచ్ఛ: చూ, వాంఛ.

గాద, దే. వి. చెమటకాయలతఱచు.

గాదము, దే. వి. 1. పైరులోని కసవు: చూ, తృణము. 1; 2. ఆకు: చూ, పర్ణము. 1; 3. కదుము. ఆం, భా. ద్వి 180: చూ, బొప్పి.

గాదిలి, దే. వి. 1. ప్రేమము: చూ, స్నేహము. 1; 2. చుట్టము: చూ, బంధువు.

గాదె, వై. వి = గంజ: చూ, గాజె.

గాధము, సం. వి. అ. పుం. 1. మిట్ట: చూ, భూమి. 1; 2. కోరిక: చూ, వాంఛ; విణ. 3. కొట్టఁదగినది: చూ, ప్రహతము. 1.

గాధిజుఁడు, సం. వి అ పుం. విశ్వామిత్రఋషి: చూ, ముని. 1.

గాధిని, సం. వి. ఈ. స్త్రీ. గంగానది: చూ, నది.

గాధిపురము, సం. వి. అ. న. కన్యాకుబ్జదేశము: చూ, దేశము.

గాధిసువు, సం. వి. ఉ. పుం: చూ, గాధిజుఁడు.

గాధేయుఁడు, సం. వి. అ. పుం. —పై.—

గాధేరము, సం. వి. అ. పుం: చూ, గౌధేరము.

గానము, సం. వి. అ. న. పాట (పాడఁబడినది : చూ, స్వరము. 2-౧౭: అం. 2. భోగములు ఎనిమిదింటిలో నొకటి: చూ, భోగములు.

గానశాస్త్రపండితుఁడు, వా. వి. గాయకదోషములు లేక ఆఱుమార్గములను (ఘనము - రాగాలాపము - మధ్యమకాలము - పంద్రాయెత్తు - పల్లవి - పదకీర్తన, వర్ణములు, స్వరజతులు, రాగమాలికలు) వినికిఁజేయఁదగినవాఁడు: చూ, సీకారి.

గానిఁగ, దే. వి. రూ - గానుఁగ - గనుఁగు - గానుగ: చూ, పరంజము. 1.

గానిని, సం. వి. ఈ. స్త్రీ. వచః: చూ, విష.

గానుఁగ, దే. వి: చూ, రూ-గానిఁగ.

గానుఁగపిండి, ద్వ. వి: చూ, తెలికపిండి. (ఎరువుల కిది ప్రశస్తము) రూ-గానుఁగుపిండి-గానుగపిండి.

గానుఁగాట, ద్వ. వి: చూ, ఆట. 5.

గానుఁగు, దే. వి: చూ, రూ-గానిఁగ.

గానుఁగుపిండి, ద్వ. వి: చూ, రూ-గానుఁగపిండి.

గానుగపిండి, ద్వ. వి. —పై.—

గాబ, దే వి. రూ-గాబము. ఒకరకము గడ్డి. "ఇక్కడ గాబ వింత పెరిగియున్నది": చూ, తృణము. 1.

గాబము, దే. వి. —పై.—

గాబరా, వా. వి. కలవరము.

గాబు, దే. వి. కొప్పెర. ఆం, భా. ద్వి. వై. 245: చూ, పాత్రము 6.

గామ, దే. వి. ఒకరకము చీమ: చూ, పిపీలిక.

గామము, వై. వి. = గ్రామము: చూ, దేశము.

గామిడి, వై. విణ. = గ్రామణి. మేలుబంతి: చూ, శ్రేష్ఠుఁడు.

గాము, వై. వి. = గ్రహము. 1. (సూర్యాది) గ్రహము: (చూ, గ్రహము): చూ, రాహువు. 2; 2. పిశాచము: చూ, భూతము.

గాయకదోషములు, అం. అనునాసికములు. తాళవర్జితము, భీతము, కంపితము, శిరఃకంపనము. అనునాసికము, వ్యాకులము. విస్వరము, కాలహీనత, అవ్యక్తము, విస్పష్టము, అకులము, విస్తరము, కాకస్వరము, ఉత్కృష్టము మొ.

గాముడ్రేఁడు, ద్వ. వి: చూ, సూర్యుఁడు.

గాయకము, దే. వి. 1. అనరు. సా. 2, ఆ. 36: చూ, పద్మము. 1: విణ. 2. గూఢము. సా. 3, ఆ. 204: చూ, రహస్యము. 1; వా. 3. హెచ్చువెల గలది: చూ, ప్రియము. 4.

గాయకుఁడు, సం. వి. అ. పుం. విణ. (అని కొందఱు) 1. పాట పాడువాఁడు: చూ, సీకారి; వై. విణ. (1) = గ్రాహకః. గ్రహణశక్తి గలవాఁడు; చూ, గ్రహీత.

గాయకులు, అం: (చూ, సభాంగములు, సభాసప్తాంగములు): చూ, అంగము 9.

గాయత్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. షడక్షరీమంత్రము: చూ, మంత్రము. 1. "గాయంతం త్రాయతే యస్మాద్గాయత్రీ తేన కథ్యతే."గానముచేయువానిని అనఁగా మననముచేయువానిని రక్షించునదిగావున గాయత్రి యనఁబడును.) ఈ మంత్రము ద్విజుల కుపనయనకాలమందు గురువులచే నుపదేశింపఁబడుటచే దీనికి గురుమంత్రమనియు, బ్రహ్మోపదేశమనియుఁ బేళ్ళుగలవు. గాయత్రీమంత్రము వేదత్రయమందును గలదు.

(ఓ 3 మ్భూర్భువఃస్వః। తత్స † వితుర్వరే§ణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్) శుక్ల యజుర్వేదః అ 40. మం 55; అ 22. మం 9; ఆ 30. మం 2; కృష్ణయజుర్వేదః. కాండ. 1. ప్రశ్న 5. అనువాకం 6. పదము 4. పనస. 24; కాం 4. ప్ర 1. అ 11. ప 1. ప 43; ఋగ్వేదః. మం 3. అను 5. సూ. 62. మం 11; సామవేదః. ఉ. ప్ర 6. అ 3. మం 10.)

•దక్షిణ దేశమందు 'సువః' అని వ్యవహరింతురు.

† "తథ్స...." అని కొన్ని మైసూరు వేదప్రతులయందు గలదు. "ప్రథమోఽమ్మపరే ద్వితీయః" పాణిని, ప్రథమకు ('త' కు) ఊష్మము (స) పరమైనపుడు ద్వితీయము ("థ") అగునని కొందఱి మతము.

§ దక్షిణదేశపు సాంప్రదాయానుసారముగ "రే", "యా" లపై దీర్ఘస్వరితమున్నది.

1 2 3 1ర 1ర 3
ఓ 3 మ్ త త్స వి తు ర్వ రే ణ్యం
1 2 3 1 2
భ ర్గో దే వ స్య ధీ మ హి।
2 3 1 2 3 1 2
ధి యో యో నః ప్ర చో ద యా త్॥
సామవేదః.

ఇందు ఓ 3 మ్ అనునది ప్రణవము. ప్రతి వేదమంత్రమునకును ముందును చివరను దీని నుచ్చరింపవలెనని ఋషుల మతము. "భూర్భువస్స్వః" (భూః-భువః- స్వః) అను నీ మూఁడును మహావ్యాహృతులు. చతుర్వింశత్యక్షరాత్మకంబగు "తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్." అనునది ముఖ్యమైన గాయత్రీమంత్రము. గాయత్రీమంత్రము ఎనిమిదేసి అక్షరములతోఁ గూడుకొనిన మూఁడుపాదములు గలది. ఇందు మొదటిపాదమునం దేడక్షరములు మాత్రమే యున్నవి. అందులకుఁగాను "వరేణ్యం" అను పదమును సామవేదమునందువలె "వరేణియం" అని విడదీసిగాని "ఓం"కారమును కలిపిగాని యెనిమిది అక్షరములుగ లెక్కించుచున్నారు. ("ఇయాదిపూరణః" అని పింగళఛందమునందున్నది) "నగాయత్ర్యాః పరంమంత్ర"మ్మని పెద్దలు నుడివినట్లు సర్వమంత్రములయందును గాయత్రీమంత్రమగ్రస్థానమలంకరించియున్నది. గాయత్రీ మంత్రమునకు ఋషి విశ్వామిత్రుఁడు అనఁగా మంత్రద్రష్ట. ఈమంత్రమును మంత్రార్థమును దెలిసికొని విస్తరించి ప్రచారము చేసినవాఁడు "సవితా" దేవత అనఁగా ప్రతిపాద్యవిషయము సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు. "(నిచృద్) గాయత్రీ" ఛందస్సు. స్వరము. "షడ్జమము." గాయత్రీ మంత్రము శుక్లయజుర్వేదమున నాలుగుపార్లును, కృష్ణయజుర్వేదమున రెండుపార్లును, ఋగ్వేదమున నొకసారియు, సామవేదమున నొకసారియు వచ్చినవి. కాని శుక్లయజుర్వేదమున 36. 3 లో వ్యాహృతియుతముగ నున్నది. అక్కడ మాత్రము స్వరము "మధ్యమము." తక్కినచోట్ల స్వరము. "షడ్జమము": చూ, మంత్రము. 1. 2. రూ-గాయత్రము. గాయత్రీ ఛందము. ఛందస్సులు ఇరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు. (ఇది ఆఱక్షరముల పాదము గలది. కడమఛందస్సులు ఆమీఁది నొక్కొక యక్షరము అధికముగాగల పాదము గలవి. ఇది తనను జపించువానిని రక్షించునది. గాయంతు లనఁగా వైద్యులు, వారిని రక్షించునది); ఈ. స్త్రీ. న్. పుం. 3. చంద్రః: చూ, వెలిచంద్రః (చూ, పిట్టదిరము,)

గాయత్రీబ్రహ్మచారి, సం. వి. న్. పుం. బ్రహ్మచారి విశేషము: చూ, వటువు.

గాయని, సం. వి. ఈ. స్త్రీ. = గాణి. (పాట పాడునది): చూ, పాటకత్తె: చూ, స్త్రీ. 1-ఆలా.

గాయనుఁడు, సం. వి. అ. పుం, విణ (అని కొందఱు) 1. = గాణః చూ, సీకారి; 2. జల్పాకుఁడు: చూ, వక్త. 1.

గాయమానములు, అం. బ: చూ, రూ-కాయమానములు. ఆం. భా. ద్వి. ష. 205.

గాయము, దే. వి. క్షతి: చూ, నలుకు.

గార, దే. వి. 1. ఇసుకఁజేర్చి దంచినసున్నము: చూ లేపనము; 2. మణిదోషవిశేషము: చూ, రత్నములు. 1-౧౦-(ఓ); 3. ఇంగుదిః: చూ, హింగుది.

గారకాఁడు, దే. వి. సున్నమును పూయువాఁడు: చూ, తాపీవాఁడు.

గారడము, వై. వి. 1 = గారుడః. విషమంత్రము: చూ, మంత్రము. 1; 2. మాయ. అచ్చ. యు, కాం. 327: చూ, మాయము. 1; 3. మోసము: చూ, వంచన,

గారడి, వై. వి. (గారడము + ఇ) 1. = గారుడః. రూ-గారడీఁడు- గారడివాఁడు. పాములవాఁడు. ఆం. భా. ప్ర. వా. 148: చూ, వ్యాళగ్రాహి; 2. = గారుడః. మాయ: చూ. మాయము. 1. (రూ-గారడీ).

గారడివాఁడు, ద్వ. వి. 1. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2. ఐంద్రజాలికుఁడు. ఆం, భా. ద్వి. 287: చూ, ప్రాతిహార్యకుఁడు.

గారడీ, వై. వి =: చూ, రూ-గారడి.
గారడీఁడు, వై. వి. (గారడము + ఈఁడు)—పై.—
గారపంచ, దే. వి: చూ, ఇంగుదము.
గారప్రొత, దే. వి: చూ, ఓరు.
గారబము, వై. వి. = గౌరవము: చూ, స్నేహము. 1. (మరియాద అని కొందఱు.)
గారము, వై. వి. = గౌరవము. —పై.—; 2. = గౌరవము. అచ్చ. బాల. కాం. 178: చూ, మర్యాద; వా. వి. 3. ఆజ్ఞనతిక్రమించునట్లుఁజాలుపఱుట. "మాపిల్లలు గారముచేత బడికివెళ్ళరు." (రూ-గారాబము-గారాబు-గారాము-గారవము.)
గారవము, —పై.—
గారవించు, వై. స. క్రి. 1. గౌరవపఱచు: చూ, సన్మానించు: 2. ఆదరించు: చూ, సంబాళించు.
గారవింపు: చూ, గారము.
గారవిలు, వై. అ. క్రి. గౌరవపడు: చూ, రూ-గారవిల్లు.
గారవిల్లు, వై. అ. క్రి. రూ—పై.— (విజ. 2, ఆ. 39.)
గారాబము: చూ, రూ-గారము.
గారాబు, —పై.—
గారాము, —పై.—
గారిత్రము, సం. వి. అ. న. ఓదనము: చూ, సాదము. (1).
గారియ, వై. వి. = ఘారిక. రూ-గారె, వడ: చూ, భక్ష్యము.
గారు, దే. అవ. పూజ్యత్వమును దెలుపునది. "అయ్యగారు-అమ్మగారు" మొ.
గారుడచిత్తు, సం. వి త్. పుం. గారుడచయనమను యజ్ఞమును చేయువాఁడు.
గారుడము, సం. వి. అ. పుం. 1. = కిరీటి. గరుడపచ్చ: చూ, రత్నములు. 1-ఞ; 2. = గారడము. విషమంత్రము, (విషమును బోఁగొట్టు మంత్రశాస్త్రము): చూ, మంత్రము. 1; 3. సూర్యనిగమనము; 4. బంగారు: చూ, లోహము. 1; విజ. 5. గరుడునిది; అం. 6. గరుడపురాణము: చూ, పురాణములు (ఇది 12000 శ్లో. గలది); 7. ఇందు గీతములు పది, భావదూషితములు పదునొకండు. గారుడము భావదూషితములలో నొకటి. (చూ, వ్యాకరణబంధములు): చూ, భావదూషితములు; 8: చూ, ఏకవింశతిస్థానకములు.
గారుడి, సం. వి. ఈ. స్త్రీ: చూ, వత్సాదని*.
గారుడికుఁడు, సం. వి. అ. పుం. 1. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2. విషవైద్యుఁడు: చూ, వైద్యుఁడు.
గారుత్మతపత్రిక, సం. వి. ఆ. స్త్రీ. పచ్చాకు*: చూ. హరితపత్రిక.
గారుత్మతము, సం. వి. అ. న. పచ్చ, మరకతము: చూ, రత్నములు. 1-ఞ.
గారువు, అం: చూ, దూతీచతుష్టయము.
గారె, వై. వి. = ఘారి: చూ, రూ-గారియ.
గార్గి, సం. వి. ఈ. స్త్రీ. రూ-గార్గ్యము. గర్గగోత్రమందుఁబుట్టినయాఁడుది: చూ, స్త్రీ. 1-౧౫౩.
గార్గేయసగోత్రము, అం: చూ, గోత్రము. 13: (చూ, ప్రవర.)
గార్దేష, సం. వి. ఆ. స్త్రీ. బండిగురివెంద *: చూ, శ్వేతపాకి.

గార్గ్యుఁడు, సం. వి. అ. పుం. 1. గర్గగోత్రమందుఁ బుట్టినవాఁడు; 2. గార్గేయమహర్షి: చూ, సన్న్యాసి. 1.
గార్దభము, సం. వి. అ. పుం. 1. = గాడిద: చూ, రాసభము; అం. 2. గార్దభము భావదూషితములలో నొకటి: (చూ, వ్యాకరణబంధములు.): చూ, భావదూషితములు.
గార్దభసత్త్వ, అం: చూ, ద్వాదశసత్త్వులు.
గార్ధ్యము, సం. వి. అ. న. ఇచ్ఛ: చూ, వాంఛ.
గార్భిణము, సం. వి. అ. న. చూ, లాంగ్రయొక్కగుంపు, గార్భిణ్యము: చూ, భ్రూణ.
గార్భిణ్యము, సం. వి. అ. న. —పై.—
గార్హపత్యము, సం. వి. అ. పుం. 1. ఒక శ్రౌతాగ్ని, యజ్ఞమునందు వేదికకుఁ బడమట గుండ్రని గుండమునందుండు అగ్ని: చూ, వహ్ని. 1-౧; (వహ్ని. 1-౩; అం. 2: చూ, అగ్నులు; 3: చూ, అగ్నులు.
గార్హస్థ్యము, సం. వి. అ. న. 1. గృహస్థధర్మము. ఆశ్రమములు నాలుగింటిలో నొకటి: చూ, ఆశ్రమము. 2; 2. తాంబూలము: చూ, వీడియము.
గాలకాఁడు, దే. వి. (గాలము + కాఁడు) చేఁపలను పట్టువాఁడు: చూ, వలఱేఁడు.
గాలకురాలు, దే. వి. ప్రౌఢ: చూ, స్త్రీ 1-౧౧౦.
గాలనము, సం. వి. అ. న. తిట్టుట: చూ, శాపము. 1.
గాలము, దే. వి. రూ-గాలాము: 1: చూ, మత్స్యబంధనము (దీని భేదములు - ఉంటగాలము-గోరుగాలము అని. ఇదియె గోదుగాలము): చూ, వల. 1; 2: చూ, గేలము. 1, 2.
గాలవము, సం. వి. అ. పుం. 1. తెల్లలొద్దుగు*: చూ, లొద్దుగు; 2. ముంగ*: చూ, శ్వసనము. 2.
గాలవుఁడు, సం. వి. అ. పుం. 1. గాలవముని: చూ, ముని. 1; 2. మహాతలమను క్రింది యాఱవలోకమునందుండు ఋషి: చూ, ముని. 1.
గాలాము, దే. వి: చూ, రూ-గాలము. పాండు 2, ఆ. 137.
గాలి, సం. వి. ఇ. పుం. 1. తిట్టు: చూ, శాపము. 1; దే. వి. (1) గాలి: చూ, వాయువు. 1. (రూ - గాడుపు - గాడ్పు); (2) దయ్యము: చూ, భూతము "దీనికి గాలి సోఁకినది"; (3) మృగముల దేహవాసన. స్వా. 4, ఆ. 42: చూ, వాసన; 1-౧౦.
గాలించు, దే. స. క్రి. 1. బియ్యము లోనగువానిని నీళ్ళలో పోసి రాళ్లులేక శోధించు: చూ, శోధించు. 1; 2. బియ్యము లోనగువానిని చేటలోఁబోసి ప్రక్కవాటుగా నిటునటుత్రిప్పు: చూ, కోడు; 3. అన్వేషించు: చూ, వెదకు.
గాలింపు, దే. వి: చూ, శోధనము.
గాలికుంటు, దే. వి. పశువులకు గొరిజలయందు పుండుపడెడు రోగము: చూ, పశురోగము.
గాలిగాఁడు, దే. వి. గాడిద: చూ, రాసభము.
గాలిగుంట, వా. వి: చూ, స్తంబకరి. 1-౨౬. ౧౯.
గాలిగుడి, ద్వ. వి. పరివేషము: చూ, వఱదగుడి.
గాలిగొను, దే. అ. క్రి: (గాలి + కొను); చూ, గాలిపొఱు.

గాలిగ్రుడ్డు, దే. విశ. పేద (అప్ర.): చూ, పేదవాఁడు.

గాలిమాలి, దే. వి. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2: చూ, భీముఁడు; 3. హనుమంతుఁడు: చూ, వానరము.

గాలితండ్రి, దే. వి. ఆకాశము: చూ, విన్ను.

గాలితేరెక్కుమన్నీఁడు, దే. వి: చూ, మన్మథుఁడు. ఆం. భా. ప్ర. 45.

గాలిదిండి, దే. వి. (గాలి + తిండి) పవనాశనము. అచ్చ. యు, కాం. 3: చూ, సర్పము.

గాలినెచ్చెలి, దే. వి. అగ్ని. వాయుసఖుఁడు: చూ, వహ్ని. 1.

గాలిపంట, దే. వి. నిర్ణయములేని పంట: చూ, సస్యము.

గాలిపటము, ద్వ. వి: చూ, బాలక్రీడ.

గాలిపడగ, ద్వ. వి. —పై.—

గాలిపాఱు, దే. అ. క్రి: చూ, గాలిగొను.

గాలిమాట, దే. వి. జనశ్రుతి: చూ, శబ్దము. 2-౧౬.

గాలిమేఁతరి, దే. వి: చూ, గాలిదిండి.

గాలిమేపరి, దే. వి. —పై.—

గాలియిల్లు, దే. వి. గాలికి ఎగిరిపోవునట్లు కట్టిన యిల్లు: చూ, సదనము. 1.

గాలిలేనిదీపకలికచందము, లో. గాలిలేమిచే నిటునటు కదలని దివ్వె రీతి. "ఆ. గాలిలేని దీపకలిక చందంబున..........నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున, నుండెనేని." వేమన. 1274.

గాలివాన, దే. వి. 1. ఝంఝ. గాలితోడి వాన: చూ, వాన. 1; 2. ఝంఝ. వానగాలి: చూ, వాయువు. 1-౪-(౬).

గాలివేఁత, దే. వి. 1. గాలికొట్టుట; 2. ఒకరకము జ్వరము: చూ, రోగము. 1.

గాలిసూడు, దే. వి. మబ్బు. ఆం. పదా. సుర. 143: చూ, మేఘము. 1.

గాలోద్యము, సం. వి. అ. న. పద్మబీజము: చూ, సహస్రపత్రము. 1. ౬.

గావ, దే. వి. ఒకానొకపక్కి: చూ, పక్షి.

గావంచ, వా. వి. కొల్లాయగుడ్డ: చూ, వస్త్రము. 1-౧౧-(౧).

గావు దే. వి. బలి: చూ, బలి.

గావుకోడి, ద్వ. వి. ఒకానొక మూలిక*: చూ, వృక్షము.

గావుపట్టు, దే. వి. 1. గట్టిపట్టు; స. క్రి. 2. చంపు. సా. 1, ఆ. 92: చూ, సంహరించు; 3. నాశముచేయు: చూ, సరిపెట్టు.

గాసటబీసట, దే. వి. సలక్షణముగా చదువు. లక్ష్మి. 1, ఆ. 9: చూ, విద్య.

గాసము, వై. వి. = గ్రాసము: చూ, సాపాటు.

గాసి, దే. వి. 1. అలసట: చూ, శ్రమము. 1; విశ. 2. గాసి నొందినది: చూ, అంజలి గుంజలి. 1.

గాసిఁబడు, ద్వ. అ. క్రి. (గాసిక + పడు): చూ, బాధపడు.

గాసిఁబెట్టు, దే. స. క్రి. (గాసిక + పెట్టు): చూ, బాధించు.

గాసిచేయు, ద్వ. స. క్రి: చూ, సరిపెట్టు.

గాసియగు, దే. అ. క్రి. (గాసి + అగు) నాశమగు: చూ, ఖాకారు.

గాసిలు, దే. అ. క్రి. రూ-గాసిల్లు. 1: చూ, బాధపడు; 2. శ్రమపడు: చూ, వేసరు. 2; 3: చూ, రోషించు. (ప్రేరణమందు రూపము గాసించు.)

గాసిల్లు, దే. అ. క్రి. —పై.—

గాహనము, సం. వి. అ. న: చూ, స్నానము.

గాహము, సం. వి. అ. పుం. 1. —పై.—; 2. ప్రాకృతశ్లోకము.

గాహితము, సం. విశ. మునిగినది: చూ, విగాహితము: చూ, స్నానము. 1-౫.

గాళకుఁడు. దే. విశ. 1. పేరుఁడు. విజ. 1, ఆ. 76: చూ, దిట్టఁడు; 2: చూ, పౌరుషుఁడు.

గాళపు, వా. వి. రూ-గాలుపు. ఎండవాఘ.

గాళ్ళవాఁడు, దే. విశ: చూ, రూ-గాంఢ్లవాఁడు.

## గి

గి, దే. అ. ప. నిందయందు హ్రస్వాదిస్థైన ఆమ్రేడిత శబ్దము యొక్క యాద్యక్షరమునకు వచ్చెడి యాదేశము. (చంద్రుఁడు గింద్రుఁడు, చిలుక గిలుక, వరములు గిరములు మొ.)

గింగురు, దే. వి. వింటినారినుండి బాణము వెడలుటయందును, చెవులు గళ్లపడుటయందును నగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గింజ, దే. వి. రూ-గిజరు-గిజురు-గురుజు-బ. గుఱుములు: చూ, విత్తనము.

గింజుకొను, దే. అ. క్రి. బిడ్డలు వెలికిలఁబండుకొని యేడ్చునప్పుడు కాళ్ల విదలించు: చూ, విదిలించు.

గింటన, దే. వి. రూ-గింటెన-దింటెన. గిరిసర్జ*: చూ, విష్ణుక్రాంత.

గింటెన, దే. వి. —పై.—

గింటెము, దే. వి. జంటనేతబట్ట. కళా. 7, ఆ. 181: చూ, వస్త్రము. 1-౪౩. (రూ-గెంటెము-గెంటెము-దేంటెము)

గిండి, దే. వి. సన్నని మెడగల చెంబు: చూ, పాత్రము. 6. (బ. గిండులు-గిండ్లు.)

గిడిచెంబు, దే. వి. —పై.—

గిచ్చు, దే. స. క్రి. రూ - గీచు. గీటుగీచు: చూ, వ్రాయు.

గిజిగాఁడు, దే. వి. రూ-గిజ్జిగాఁడు. పచ్చపిట్ట: చూ, హారితము. 3.

గిజ్జిగాఁడు, దే. వి. —పై.—

గిజగిజ, దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గిజగిజగొను, దే. అ. క్రి. (గిజగిజ + కొను) తత్తఱపడు. అచ్చ. యు. కాం. 217: చూ, సంభ్రమించు.

గిజగిజలాడు, దే. అ. క్రి. (గిజగిజలు + ఆడు) —పై.—

గిజురు, దే. వి. 1. మామిడిపండు లోనగువాని యందుండు బీసము: చూ, పీచెము; వా. వి. 2. ముదురు. "గిజురు వంకాయ: చూ, వృద్ధము.

గిటక, దే. విశ. రూ-గిట్ట-గిడ్డ-గిఋక. పొట్టి: చూ, వామనుఁడు.

గిటగిట, దే వి. పంట్లుకొఱుకుటయందగు ధ్వన్యనుకరణము: స్వా. ౬, ఆ. 19. చూ, హూూూ.

గిటగిటన, దే. విశ. 1. అల్పము: చూ, స్వల్పము; 2. కృశము: చూ: బక్క; 3 ఆలకన: చూ, సూక్ష్మము. 4; వి. 4. అల కన: చూ, సూక్ష్మము. 4.

గిటగిటమను, దే. అ. క్రి. (గిటగిట + అను) వడఁకు. ప్రభా. 2, ఆ. 33: చూ, వణఁకు. 2.

గిట్ట, దే. వి. 1, పశులకాలిగోరు: చూ, వింఖము; 2. అమ్మ. అచ్చ. యు, కాం. 191: చూ, బాణము. 1.

గిట్టమి. దే. వి. పగ: చూ, విరోధము.

గిట్టించు, దే. అ. క్రి. గిట్టుబడియగు. (ప్రే. చావఁజేయు.)

గిట్టింపు, దే. వి. 1. (అమ్మకమునందలి) లాభము. రూ-కిట్టుబడి-గిట్టుబడి: చూ, లాభము. 1; 2. చావు: చూ, సావు.

గిట్టు, దే. అ. క్రి. 1. అనుకూలించు: చూ, పొందుపడు; 2. చచ్చు: చూ, మరణించు; 3. చెడు: చూ, నశించు.

గిట్టుబడి. దే. వి. (అమ్మకమందలి) లాభము. రూ-కిట్టుబడి-గిట్టింపు: చూ, లాభము. 1.

గిడస, దే. విశ. పొట్టి, "గిడసవంకాయ." చూ, హ్రస్వము.

గిడిగి, దే. వి. మత్తువు: చూ, వీణ. 1-ఆఆ-(౧).

గిడిగిళ్లు, దే. వి. బ. 1. నతి: చూ, నమస్కారము; 2. నతి విశేషము: చూ, నమస్కారము.

గిడిబిడి, దె. వి: చూ, గిడిగి.

గిడియ, దే. వి. పటహవిశేషము. ఆం, భా. ప్ర. నా. 127: చూ, వీణ. 1-ఆఆ-(౧).

గిడుగు, దే. వి. (రూ-గొడుగు-గొడువు.) కామలేనిగొడుగు: చూ, వారిత్ర.

గిడ్డ, దే. విశ. పొట్టి: చూ, వామనుఁడు.

గిడ్డంగి, దే. వి. 1. సరుకుటుంచి అమ్మెడియిల్లు: (చూ, పంట సాల.): చూ, సదనము. 1; 2. చెఱసాల: చూ, బంధనాలయము.

గిడ్డి, వై. వి. ఆవు, పొట్టిఆవు (అని కొందఱు): చూ, ధేనువు; 2. పొట్టి: చూ, వామనుఁడు.

గిద్దు, దే. వి. ఒకరకముడేగ: చూ, శ్యేనము.

గిత్త, దే. వి. రూ-గిబ్బ. 1. ఎద్దుపట్టనికోడె: చూ, వృషభము. 1; 2. ఎద్దు: చూ, వృషభము. 1.

గిత్తతత్తడితేఁడు, దే. వి. నందివాహనుఁడు: చూ, శివుఁడు. (ఆం. పదా. ను. 10.)

గిత్వము, సం. వి. అ. పుం. ప్రాణవాయువు: చూ, వాయువు. 1-౧-(౧).

గిద్ద, దే. వి. 1. పావుసోల. రూ-గిద్దె: చూ. ప్రస్థము. 2; వా. వి. 2. చిన్నకొడవలి: చూ, రిష్టి. 2-అ౫.

గిద్దు, దే. వి. చూ, రూ-గిడ్డు.

గిద్దె, వా. వి: చూ, రూ-గిద్ద. 1.

గినియ, వై. వి. = కిణిహా-కిణిహి. నల్లగిసె*: చూ, శుకనాసము. 1. (గినెయనే నల్లగినియ అందురు.)

గినిమాడు, దే. స. క్రి. (గినుము + ఆడు): చూ, వంచించు.

గినుము, దే. వి: చూ, వంచన.

గిన్నియ, దే. వి. రూ-గిన్నె: చూ, పాత్రము. 6.

గిన్నె, —పై.—

గిబ్బ, దే. వి. 1. అచ్చుబోతు: చూ, వృషభము. 1; 2. ఎద్దు: చూ, వృషభము. 1.

గిబ్బరౌతు, ద్వ. వి: చూ, గిత్తతత్తడితేఁడు.

గిబ్బరౌతు సకుఁడు, ద్వ. వి. కుబేరుఁడు. ఆం, భా, పరి. 51: చూ, శ్రీదుఁడు.

గిర, సం. వి. ఆ. స్త్రీ. 1. వాక్కు: చూ, శబ్దము; 2; 2: చూ, సరస్వతి.

గిరక, దే. వి. రూ-గిరటి. నూతిరాట్నము: చూ, రాట్నము.

గిరకతాడి, దే. వి. ఈఁతచెట్టు*: చూ, హింతాళము.

గిరకతాడు, దే. వి. రూ. —పై.—

గిరగిర, దే. వి. తిరుగుటయందగు ధ్వన్యనుకరణము. కళా. 6, ఆ. 14. చూ, హూహూ.

గిరజ } వా. వి. రూ-గిరదా-గిఱజా, గిర: చూ, సిగ. 1-౧౮: గిరజా } (చూ, మెండ్రుక. 1.)

గిరణము, సం. వి. అ. న: చూ, మ్రింగుట.

గిరదా, వా. వి: చూ, రూ-గిరజా.

గిరవు, దే. వి చూ, తాకట్టు.

గిరస, దే. విశ. పిటికి: చూ, వెఱపరి.

గిరాకి, వా. విశ: చూ, గాయకము.

గిరాటువేయు, దే. స. క్రి. (కాయి) ఋవ్వు: చూ, వైచు.

గిరి, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, సాపాటు; పుం. 2. కొండ, చూ, పర్వతము; 3. ఏనుఁగు: చూ, హస్తి; 4. గుండుకాయి కొండనుండి పడినకాయి (అని కొందఱు): చూ, రాయి; 5. గళము: చూ, మెడ; 6. కందుకము: చూ, బంతి. 3: 7. యతిసంప్రదాయ జ్ఞానార్థమైన గుఱుతు: చూ, లక్షణము: 1-౩౭; 8. అచ్చనగాయలు: చూ, బాలికాక్రీడ; 9. నేత్ర రోగము: చూ, హర్షణము. 3-1; విశ. 10. పూజ్యము, పూజింపఁదగినవాఁడు (అని కొందఱు): చూ, పూజ్యము.

గిరిక, సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టెలుక: చూ, మూషికము; 2. జలగ: చూ, బుద్ధిపిఱుఁదు; 3. వసురాజుభార్య, అగిజాత, కోలాహలపర్వతమునకును శుక్తిమతినదికిని బుట్టిన స్త్రీ: చూ, స్త్రీ; 1-౧౫౫; 4 గౌరి: చూ, పార్వతి. 1; 5. అనాథ: చూ, చూ, స్త్రీ. 1-౪; 6. అడవిమల్లె *: చూ, హసంతి. 2-౧౧.

గిరికంట(ర)కము, సం. వి. అ. పుం. వజ్రము: చూ, రత్నములు. 1-3.

గిరికంఠము, సం. వి. అ. పుం. వజ్రాయుధము, నూఱంచుల వాలు: చూ, బాణము. 1-౭౨.

గిరికదంబము, సం. వి. అ. పుం: చూ, నీపము*.

గిరికదళి, సం. వి. ఈ. స్త్రీ. కొండఅరఁటి*: చూ, రంభ. 2.

గిరికము, సం. వి. అ. పుం: చూ, బొంగరము.

గిరికర్ణి, సం. వి. ఈ. స్త్రీ. దింతెన *: చూ, విష్ణుక్రాంత.

గిరికర్ణిక, సం. వి. ఆ. స్త్రీ. 1. —పై— (నల్లదింతెన అని కొందఱు); 2. తెల్లగినియ*: చూ, శుకనాసము. 1; 3. నేల: చూ, భూమి. 1.

గిరికాఖ్యము, సం. వి. అ. పుం. సిరిప్ప*: చూ, మధూకము.
గిరికోల, సం. వి. ఆ. స్త్రీ. దూడుగు*: చూ, మహాయమశపత్రిక.
గిరి టలు, దే. వి. బ. ఆడునప్పుడు వాయించెడు కంచుతాళము, రూ-గిగ్గిటలు: చూ, వీణ. 1-౪౬-(౧).
గిరిగుడము, సం. వి. అ. పుం. కందుకము: చూ, బంతి. 3.
గిరిజ, సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2: చూ, మాతులుంగము*.
గిరిజంబీరము, సం. వి. అ. పుం. కొండనిమ్మ *: చూ, నిమ్మ.
గిరిజము, సం. వి. అ. న. 1. అభ్రకము: చూ, బేగడ; 2. బంగారు లోనగునది. చిత్తాము (అనియు) ఇనుము (అనియు కొందఱు): చూ, లోహము. 1; 3: చూ, సిలాజిత్తు; 4: చూ, మధూకము *; 5. కొడిసె *: చూ, వత్సకము; విణ. 6. కొండయందుఁబుట్టినది.
గిరిజానుజ, సం. వి. ఆ. స్త్రీ. కలుఁగానుగు *: చూ, వార్షికము. 1.
గిరిజామలము, సం. వి. అ. న: చూ, గిరిజము. 1.
గిరిజ్వరము, సం. వి. అ. పుం: వజ్రము: చూ: రత్నములు. 1-3.
గిరిధన్వుఁడు, సం. వి. న్. పుం: చూ, శివుఁడు.
గిరిధరుఁడు, సం. వి. అ. పుం. గట్టుతాలుపు (కూర్మమై మందరగిరిని ధరించెననుట (లేక) కృష్ణుఁడై గోవర్ధనగిరిని ధరించెననుట): చూ, విష్ణువు. 1.
గిరిపక్షభిత్తు, సం. వి. ద్. పుం: చూ, గిరికంతము.
గిరిపీలువు, సం. వి. ఉ. పుం, న. చిట్టీత*: చూ, మధుఖర్జూరిక.
గిరిభవము, సం. వి. అ. పుం. జువ్వి *: చూ, ప్లక్షము.
గిరిమల్లిక, సం. వి. ఆ. స్త్రీ. కొడిసె *: చూ, వత్సకము.
గిరిమానము, సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.
గిరిమృత్తు, సం. వి. ద్. స్త్రీ. జేగుఱుడాయి: చూ, రత్నములు. 1-౧౨-(౧౨).
గిరిముత్పాట్య మూషికోద్వృలా, న్యా. కొండనుత్రవ్వి ఎలుకను పట్టినట్లు పెద్దప్రయత్నముచేసి, స్వల్పమును పొందడము.
గిరిమేదము, సం. వి. అ. పుం. వెలితుమ్మ *: చూ, పిట్టచిరిము.
గిరియకము, సం. వి. అ. పుం. 1. అచ్చనగాయలు: చూ, బాలికాక్రీడ; 2: చూ: రత్నములు. 1-౧౨-(౨).
గిరియాకము, సం. వి. అ. పుం. చర్మవస్త్రాది కృతమైనబంతి: చూ, బంతి. 3.
గిరివర్తికము, సం. వి. అ. పుం. ఒకానొకపక్కి: చూ, పక్షి.
గిరివాటకము, సం. వి. అ. పుం. నూఁగుబోస, శైలేయము *: చూ, దోస.
గిరివాసి, సం. వి. న్. పుం: చూ, ముల్లంగి *.
గిరిశాలిని, సం. వి. ఈ. స్త్రీ. అపరాజిత *: చూ, విష్ణుకాంత.
గిరిశుఁడు, సం. వి. అ. పుం. రూ-గిరీశుఁడు. 1. కొండయిల్లుఁడు: చూ, శివుఁడు: 2. ఈశానుఁడు: చూ, గిరీశుఁడు. 3.
గిరిసారము, సం. వి. అ. పుం. 1: చూ, గిరిజము 2; 2. మలయపర్వతము, శివలింగము (అని కొందఱు): చూ, పర్వతము; 3. మగగుఱి: చూ, శిశ్నము.
గిరిసింగన్నవృత్తి, మి. వి: చూ, బాలక్రీడ.
గిరిసుత, సం. వి. ఆ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.
గిరిసెము, వై. వి. = శిరీషము *: చూ, శిరీషము.
గిరిస్తని, సం. వి. ఈ. స్త్రీ. పుడమి: చూ, భూమి. 1.
గిగ్గిటలు, దే. వి. బ: చూ, రూ-గిరిగిటలు.
గిరీశుఁడు, సం. వి. అ.పుం.1: చూ, శివుఁడు;2. హిమవంతుఁడు: చూ, పర్వతము; అం. 3: చూ, దిగధిపతులు; 4: చూ, రుద్రులు; 5. బృహస్పతి: చూ, వేలుపుటొజ్జ; 6.నలువ: చూ, బ్రహ్మ. 1.
గిర్వాణుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-గీర్వాణుఁడు.
గిఱక, దే. విణ. 1. పొట్టివాఁడు: చూ, వామనుఁడు; 2: చూ, రూ-గిరక.
గిఱకతాడు, ద్వ. వి: చూ, రూ-గిరకతాడు*.
గిఱజా, వా. వి: చూ, రూ-గిరజా.
గిఱి, దే. వి. వలయాకారపురేఖ, బరి: చూ, రేఖ. 3.
గిఱికొను, దే. స. క్రి: చూ, వేష్టించు.
గిఱిపిల్లాఁడి, దే. వి. స్త్రీలు కాలధరించెడి మూఁడవవ్రేలి పిల్లాఁడి: చూ, భూషణము. 2.
గిఱుకు, దే. వి. 1. తప్పువ్రాతను గిఱికినగిఱుకు: చూ, తుడుపు; స. క్రి. 2. అక్షరములు ఒఱుపుగా నేర్పడ వ్రాయక వంకరకొంకరగాగీచు; 3. తప్పువ్రాఁతను తుడుచు.
గిఱుక్కు, దే. వి. మరలుటయందగు ననుకరణము: చూ, హూహూ.
గిఱుపు, దే. స. క్రి. 1. (కన్ను) త్రిప్పు. అచ్చ. యు, కాం. 125: చూ, గీఁటు. 2; 2. కదలునటులఁజేయు, కదలించు.
గిఱ్ఱు, దే. వి. తిరుగుటయందగు ననుకరణము: చూ, హూహూ. (ఆమ్రేడితమందు గిఱ్ఱుగిఱ్ఱు)
గిఱ్ఱుపురుగు, ద్వ. వి. చెట్లయందుండి ఎల్లప్పుడు గిఱ్ఱుమని కూయునట్టి యొక పురుగు: చూ, పురుగు.
గిలక, దే. వి. 1. గిలగిలమ్రోఁగు బాలక్రీడాసాధనము: చూ, బాలక్రీడ; 2. గిలగిలమని మ్రోఁగెడి యనుపతగటిబిళ్ళ; 3 గిలగిచ్చ*: చూ, శణపుష్పిక. (రూ-గిలగిచ్చ-గిలగింత-గిలగిల-గిలిగిచ్చ-గిలిగిట్ట-గిలిగిచ్చ); వా. వి. 4. నీరుతోడు సాధనములలో నొకటి: చూ, రాట్నము; 5. నరముజారెడి అండవ్యాధి (వా).
గిలకబండి, దే. వి. చిన్నచక్రములబండి: చూ, శకటము. 1.
గిలకరించు, దే. స. క్రి. 1. వ్రేళ్ళతోకలఁచు: చూ, గిలకొట్టు; 2. (కవ్వముతో) చిలుకు: చూ, మథించు.
గిలకొట్టు, దే. స. క్రి. 1: చూ, గిలకరించు. 1. పాండు. 1, ఆ. 117; 2. కుదిలించు, సా. 1, ఆ. 44; 3. (వ్రేళ్ళతో) పుణుకు: చూ, పుడుకు. 5.
గిలగింత, దే. వి. రూ-గిలిగింత *: చూ, శణపుష్పిక.
గిలగిచ్చ, —పై.—
గిలగిల, దే. వి. 1. —పై.—; వా. వి. 2. తిండిలేక మలమల మాడుటయందగు ననుకరణము: చూ, హూహూ.
గిలగ్రాహము, సం. వి. అ. పుం. నక్రము: చూ. మత్స్యము. 1.
గిలనము, సం. వి. అ. న. తిండి: చూ, సాపాటు.
గిలము. సం. వి. అ. పుం: చూ, నిమ్మ*.
గిలాబి, వా. వి. గచ్చుచేయుట' రూ-గిలాబా.

7. అగస్తి = అగస్త్య -ప్ర.- అగస్త్య, దార్ఢ్యచ్యుత, ఇధ్మ వాహ(లేక)అగస్త్య, దార్ఢ్యచ్యుత, సోమవాహ. (ఇత్యాది) (సగోత్రకన్యల వివాహమాడరాదను సంశయ మీ ప్రవరల వలనం దెలియగలదు. ఇందలి ప్రతిగోత్రనామము తుదను సకారమునుచేర్చి యుచ్చరింపవలెను): చూ, ప్రవరము.

గోత్రములు, వా. బ: చూ, గోత్రము. 13.

గోత్రుఁడు, సం. వి. అ. పుం. 1. గోవులఁగాచువాఁడు: చూ, మహాశూద్రుఁడు; 2. ఎఱుఁగఁదగిన దొంగ: చూ, ముచ్చు. 1; 3. నృపుఁడు: చూ, రాజు. 1.

గోద, సం వి. ఆ. స్త్రీ. 1. రూ-గోదావరి: చూ, నది; 2. విష్ణుచిత్తుని కూఁతురు, గోదాదేవి: చూ, సూన. 1-౧౧; 3: చూ, మెదడు; దే. వి. (1) ఎద్దు: చూ, వృషభము. 1.

గోదంతము, సం. వి. అ. న: చూ, హరితాళము.

గోదధి, అం: చూ, గవ్యములు.

గోదము, వై వి. = గోర్ధ. గోద: చూ, మెదడు.

గోదానము, అం. 1: చూ, కర్మములు; 2: చూ, దానములు; 3: చూ, మహాదానములు.

గోదారణము, సం. వి. అ. న. నాఁగలి. లాంగలము. 1.

గోదారి, దే. వి. వెన్నకాఁచిన మడ్డి: చూ, స్నేహము. 1-౧౬. (వైకృత మని కొందఱు.)

గోదావరి, సం. వి. ఈ. స్త్రీ. 1. గోల, గోదావరీనది: చూ, నది. (కృష్ణవేణీ-గోదావరి-సరయువు మొదలగునవి సరిత్తులనఁబడును.); వా. వి. 2 = : చూ, గోదారి.

గోదావల్లి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పుల్లబచ్చలి*.

గోదుగ్ధద, సం. వి. ఆ. స్త్రీ. చణికమను గడ్డి*; చూ, తృణము. 1.

గోదు, వా. వి: చూ, తుమ్మజిగురు. (ఉడికించిన పిండియు.)

గోదుమ, వై.వి. = గోధుమః. 1. గోధుమసస్యము: చూ, సస్యము. 1; విశే. బ. 2. గోధుమలను ధాన్యము: చూ, ధాన్యము. (మధుమూత్రవ్యాధికి గోధుమఅన్నము మంచిది. ఇది మూత్రమందలి చక్కెరను తగ్గించును.)

గోదుమపూసలు, ద్వ. వి. బ. స్త్రీ మెడనగ: చూ, భూషణము. 2-౬(౧౦).

గోదుమలు, అం: చూ, ధాన్యములు: (చూ, గోదుమ.)

గోదుహము, సం. వి. అ. న, గోపాలుర క్రీడ: చూ, విలాసము. 1.

గోదోహము, అం: చూ, గహీనతానములు: (చూ, కూటతానములు )

గోద్దాలము, సం. వి. అ. పుం. 1. మాఘమాసము: చూ, మాసము. 1; 2. బాల్యము: చూ, శైశవము. 2.

గోద్రవము, సం. వి. అ. పుం: చూ, గోమూత్రము.

గోధ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము: చూ, తేలుమేపరి; ఆ. స్త్రీ. అ. న. 2. వింటినారి దెబ్బ తగులకుండఁ జేతిని గట్టిన ఉడుముతోలు (ముంజేతిని జుట్టుకొని యుండునది): చూ, బెరడు.

గోధనము, సం. వి. అ. న. 1. గోకులము: చూ, ధేనువు; 2. ఆవులకొటారము: చూ, సదనము. 1; పుం. స్థూలాగ్ర బాణము: చూ, బాణము. 1—౮౩.

గోధాపది, సం. వి. ఈ. స్త్రీ: చూ, హంసపాది*.

గోధావని, సం. వి. ఈ. స్త్రీ: చూ, సోమలత*.

గోధాస్కంధము, సం. వి. అ. పుం. చంద్ర*: చూ, వెలిచంద్ర.

గోధి, సం. వి. ఇ. పుం. 1. నొసలు: చూ, అలాటము; 2. ఉడుము: చూ, తేలుమేపరి.

గోధిక, సం. వి. ఆ. స్త్రీ. రూ-గుధిక. 1. ఉడుము: చూ, తేలుమేపరి; 2. సీరుడుము: చూ, తేలుమేపరి

గోధుహుఁడు, సం. వి. హ. పుం. గొల్ల: చూ, మహాశూద్రుఁడు.

గోధూమము, సం. వి. అ. పుం. 1. = గోదుమ. గోదుమలను యవలు: చూ, ధాన్యము; 2. నారింజ*: చూ, శర్కరాంకము. 1-౧౧; అం. 3: చూ, దర్భలు.

గోధూమి, సం. వి. ఈ. స్త్రీ: చూ, గోలోమిక*

గోనర్ది, సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుబెగ్గురు: చూ, సారసము.

గోనర్దము, సం. వి. అ. న. 1. కయివర్తిముస్తె*: చూ, ముస్తకము; 2. ముక్కువైపు కంటిమూల: చూ, కోచనము. 1-౯; పుం. 3. బెగ్గురు: చూ, సారసము; 4. చేఁప: చూ, మత్స్యము. 1; 5. పాము: చూ, సర్పము.

గోనర్దీయము, అం: చూ, కామము. 8.

గోనర్దీయుఁడు, సం. వి. అ. పుం. పతంజలి: చూ, సన్న్యాసి. 1.

గోనర్దుఁడు, సం. వి. అ. పుం. గురుద్రోహముచేయువాఁడు.

గోనసము, సం. వి. అ. పుం. 1. రూ-గోనాసము. కొండచిలువ: చూ, సర్పము. 1-౪-(౨౦); 2. రూ - గోనాసము, వైక్రాంతమణి: చూ, రత్నములు. 3-(౧); 3. పొలసు: చూ, మాంసము; 4. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1.

గోనసుఁడు, సం. వి. అ. పు: చూ, నాసుఁడు.

గోనాథుఁడు, సం. వి. అ. పుం. ఎద్దు: చూ, వృషభము. 1.

గోనాసము, చూ, రూ-గోనసము. 1-2.

గోనిష్యందము, సం. వి. అ. పుం: చూ, గోమూత్రము.

గోనియ, వై. వి. = గోణికా. రూ-గోనె అడ్డముగా నడుమ గుట్టుపోసి ధాన్యమునించి యెద్దుమీఁదవేసెడు జనుపనారల పట్టలసంచి: చూ, సంచి.

గోను, దే. వి: చూ, రూ - గోగు*.

గోనె, వై. వి. = గోణీ: చూ, రూ - గోనియ.

గోనెకు అంకెమును లాగుట, లో. దురాశకుఁబోవుట.

గోనెయెద్దు, ద్వ. వి. ధాన్యాదులుగల గోనెలుమోయుయెద్దు: చూ, వృషభము. 1.

గోనెపణము, ద్వ. వి. (పురితోనేసి పట్టాలుకుట్టి పఱచుకొనునది) పటకాలుగలగుడ్డ: చూ, వస్త్రము. 1-౬౦.

గోనెసంచి, ద్వ. వి: చూ, గోనియ, (వాడుక).

గోపకంటకము, సం. వి. అ. పుం. కానరేఁగు*: చూ, రేఁగు. 1.

గోపఘోంట, సం. వి. ఆ. స్త్రీ: చూ, శమి*.

గోపతి, సం. వి. ఇ. పుం. 1. ఆఁబోతు: చూ, వృషభము. 1; 2: చూ, వేలుపుతేఁడు; 3. తేఁడు: చూ, రాజు. 1.-౫౦; 4: చూ, శివుఁడు; 5: చూ, సూర్యుఁడు; 6: చూ, షండుఁడు; 7. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 8. చందమామ: చూ, హిమాంశువు; 9. నలువ: చూ, బ్రహ్మ. 1; 10. నిప్పు: చూ, వహ్ని. 1.

గోపనము, సం. వి. అ. న. 1: చూ, దాఁచుట; 2. కాపాడుట: చూ, రక్షణము.

గోపభద్ర, సం. వి. ఆ. స్త్రీ. కాశ్మరి*: చూ, మహాఫలము.

గోపభద్రిక, —పై.—
గోపము, సం. వి. అ. పుం. రూ-గోసము: చూ, బోళము.
గోపవధువు, సం. వి. ఊ. స్త్రీ: చూ, శారిబ*.
గోపవల్లి, సం. వి. ఈ స్త్రీ. 1. —పై.—; 2: చూ, స్రవ*.
గోపాణి, సం వి. ఇ. పుం: చూ, వేలుపుతేడు.
గోపానసి, సం. వి. ఈ. స్త్రీ. = గొప్పె (ఇంటికప్పుపైన నాశిక వలె నుండునది): చూ, వెలిసె.
గోపాయితము, సం. విణ: చూ, రక్షితము.
గోపాలకర్కటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, బుడమ*.
గోపాలకుడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుడు; 2. శ్రీకృష్ణుడు: చూ, విష్ణువు 1.
గోపాలి, సం. వి. ఈ స్త్రీ. 1: చూ, బుడమ*; 2. గొల్లది: చూ, మహాశూద్రి.
గోపాలిక, సం. వి. ఆ. స్త్రీ. 1. గోపాలునిభార్య: చూ, భార్య; 2. ఒకానొకపురుగు: చూ, పురుగు.
గోపాలుడు, సం. వి. అ. పుం. 1. = గొల్ల: చూ, మహాశూద్రుడు; 2. భూపతి: చూ, రాజు. 1-ఇం; 3. శ్రీకృష్ణుడు: చూ, విష్ణువు. 1; 4: చూ, వేలుపుతేడు.
గోపి, సం. వి. ఈ. స్త్రీ. 1. = గొల్లది: చూ, మహాశూద్రి; 2. మామెన*: చూ, శారిబ; 3. నల్లసుగంధిపాల*: చూ, శారిబ; 4. బదరి*: చూ, రేగు.
గోపిక, సం. వి. ఆ. స్త్రీ. = గొల్లది: చూ, మహాశూద్రి.
గోపిచందనము, సం. వి. అ. న. ఒకరకము సుద్దమన్ను: చూ, రూ-గోపీచందనము.
గోపిత, సం. వి. ఆ. స్త్రీ: చూ, అనాస*.
గోపీచందనము, సం. వి. అ. న. రూ-గోపిచందనము: చూ, భూమి 1-ఇఆ.
గోపీతము, సం. వి. అ. పుం: చూ, వేగుజాము.
గోపీథము, సం. వి. అ. పుం. 1. నీటిదొన: చూ, నిపానము; 2. కావలి: చూ, రక్షణము.
గోపీద్దము, సం. వి. అ. పుం. 1. —పై.—; 2. నూతిదగ్గఱ నుండు నీళ్ళగాడి: చూ; నిపానము.
గోపు, దే. వి. ఆకతాయ: చూ, వ్యాధుడు. 2.
గోపుడు, సం. వి. అ. పుం. 1. రూ-గోపాలకుడు: చూ, మహాశూద్రుడు; 2. నృపుడు: చూ, రాజు. 1; 3. పెక్కుగ్రామముల కధికారుడు: చూ, రక్షకుడు; 4. గోవుల కధిపతి: గోమంతుడు, గోమి, గోమీనుడు, గోస్వామి; 5. మగడు: చూ, భర్త. 1; 6. మేలుచేయువాడు: చూ, శుభంకరుడు.
గోపుచ్ఛన్యాయము, న్యా. మొదట లావుగానుండి క్రమముగా సన్నముగానుండురీతి.
గోపుచ్ఛము, సం. వి. అ. పుం. 1. కోతి: చూ, వానరము. పుం, న. 2. నలుబది పేటలుగల హారము: చూ, భూషణము; ఉ-(౩౨)- 2; అం. 3: చూ, బాణాగ్రములు; 4: చూ, యతిప్రాణములు: (చూ, తాళము. 2); 5: చూ, యతులు; వ్యా. 6. ఆవుతోక.
గోపుటము, సం. వి. అ. న. శివునియొక్కయు వృషభము యొక్కయు మంటపము: చూ, సదనము. 1.
గోపురబంధము, అం: చూ, శబ్దాలంకారములు: (చూ, అలంకారము. 3.)
గోపురము, సం. వి. అ. న. 1. గవను, పురద్వారము, పెద్ద వాకిలి: చూ, సదనము. 1; 2. గృహద్వారము, వాకిలి: చూ, సదనము. 1; 3. తుంగముస్తె*: చూ, ముస్తకము; 4. విష్ణువు మేడ: చూ, సదనము. 1. "గాలిగోపురము."
గోపురీషము, సం. వి. అ. న. అవుపేడ: చూ, పిడక.
గోపేంద్రుడు, సం. వి. అ. పుం. వెన్నుడు: చూ, విష్ణువు 1.
గోపేశుడు, సం. వి. అ. పుం. శాక్యముని: చూ, బుద్ధుడు. 1.
గోప్త, సం. విశే. ఋ: చూ, రక్షకుడు.
గోప్యకుడు, సం. వి. అ. పుం. బంటు: చూ, సేవకుడు.
గోప్యము, సం. విణ. రక్షింపదగినది:-చూ, రక్షితవ్యము.
గోప్యుడు, సం. వి. అ. పుం. 1: చూ, గోప్యకుడు; విణ. 2. కావదగినవాడు.
గోబలీవర్దన్యాయము, న్యా. గోశబ్దమునకు అవులు ఎద్దులుకూడ నర్థము. బలీవర్దశబ్దమున కెద్దులర్థము. గోబలీవర్దమనునపుడు బలీవర్దశబ్ద మున్నందువలన గోశబ్దమున కావులే యర్థము చెప్పవలయునను విధము.
గోభండీరము, సం. వి. అ. పుం: చూ, బెళగువ్వ. (గ్రుడ్డి కొంగ అని వాడుక.)
గోమంతము, సం. వి. త్. పుం. అకారాంతము (అని కొందఱు). గోమంతపర్వతము: చూ, పర్వతము.
గోమంతుడు, సం. వి. త్. పుం. అకారాంతము (అనికొందఱు): చూ, గోపుడు. 4.
గోమక్షిక, సం. వి. ఆ. స్త్రీ. అడవియీగ: చూ, మక్షిక. 1-గ.
గోమతి, సం. వి. ఈ. స్త్రీ. 1. వాసి(శి)ష్ఠి. గోమతి యను నది: చూ, నది; 2: చూ, గోరోచన.
గోమతివాలురను బ్రాహ్మణులు, అం. గౌతముడను ఋషినిబట్టి వీరి కీపేరు గలిగినది. వీరు యజుర్వేదులు: చూ, బ్రాహ్మణులు.
గోమము, సం. వి. అ. న. మండపము: చూ, సదనము. 1.
గోమయచ్ఛత్రము, సం. వి. అ. న: చూ, పుట్టగొడుగు*.
గోమయచ్ఛత్రిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—
గోమయపాయసీయన్యాయము, న్యా. పేడ పరమాన్నమగునా యనురీతి. (పేడ పాలు రెండును గోవు దేహమునుండి వచ్చుటచే సమానము అని చేయు దుర్వాదము.)
గోమయప్రియము, సం. వి. అ. న. భూతృణము*: చూ, తృణము. 1.
గోమయము, సం. వి. అ పుం, న. 1. అవుపేడ: చూ, పిడక; 2. పేడ: చూ, పిడక; అం. 3: చూ, గవ్యములు.
గోమయోద్భవము, సం. వి. అ. పుం: చూ, తేల*.
గోమాయువు, సం. వి. ఉ పుం. నక్క (గోవులను బోదోలునది): చూ, సృగాలము.
గోమారి, మి. వి. (గోవు + మారి): చూ, పిణుజు.

గోమి, సం. వి. న్. పుం. 1: చూ, గోపుఁడు. 4; 2: చూ, వానరము; 3: చూ, సృగాలము; 4. కప్ప: చూ, హరి. 12; విణ. 5. బుద్ధభిక్షుక శిష్యుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 6: చూ, గోపుఁడు. 4.

గోమించు, దే. స. క్రి. గోముచేయు.

గోమితము, సం. వి. అ. న. కోసు: చూ, ఉరువు. 2.

గోమిని, సం. వి. ఈ. స్త్రీ. దుర్గ: చూ, పార్వతి. 1.

గోమీనము, సం. వి. అ. పుం. గోమీనమును చేప; చూ, మత్స్యము. 1.

గోమీనుఁడు, సం. వి. అ. పుం: చూ, గోమంతుఁడు.

గోము, దే. వి. 1. శ్రమమెఱుఁగనితనము: చూ, సుకుమారము; 2. లేఁత: చూ, సౌకుమార్యము. 1.

గోముఖబ్రాహ్మణులు, అం. వీరిని గోళకబ్రాహ్మణులనిసైత మందురు. తల్లి మాత్రము వితంతువు: చూ, బ్రాహ్మణులు.

గోముఖము, సం. వి. అ. న. 1. ఇల్లు అలుకుట: చూ, మెత్తు. 1; 2. కొంకరవంకరగా కట్టినయిల్లు: చూ, సదనము. 1; 3. పూరకమను వాద్యము, వాయించుకుండ (అనికొందఱు): చూ, వీణ. 1-౨౭; పుం 4. మొసలి, కొఱమొసలి (అని కొందఱు : చూ. మత్స్యము. 1; వా. 5. ఆవుమొగము.

గోముఖవ్యాఘ్రన్యాయము, న్యా. ఆవు మొగముగల పులినిఁజూచి, ఆవను నూహతో నితర జంతువులు దగ్గఱకు రాఁగా వానిని మ్రింగివేయుననురీతి. (ముఖమున సాధుత్వమును హృదయమున దుష్టత్వమును గలవానిఁ గూర్చి యిది యుపయుక్త మగును.)

గోముఖాసనము, అం: చూ, ఆసనములు.

గోముఖుఁడు, సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

గోమూత్రము, సం. వి. అ. న. 1. ఆవుఉచ్చ: చూ, మూత్రము; అం. 2: చూ, గవ్యములు.

గోమూత్రశిలాజిత్తు, సం. వి. ఉ. న. (పచ్చగానుండు) గోమూత్రశిలాజిత్తు: చూ, సిలాజిత్తు.

గోమూత్రి, సం. వి. న్. పుం. ఎఱ్ఱవేఁగిస*: చూ, సర్జకము. 2.

గోమూత్రిక, సం. వి. ఆ స్త్రీ. ఒకరకము గడ్డి*: చూ, తృణము. 1.

గోమూత్రికము, అం: చూ, భోగవ్యూహములు.

గోమూత్రికాబంధము, అం: చూ, శబ్దాలంకారములు. అలంకారము. 3.

గోమేదకము, సం. వి. అ. పుం. గోమేదకమణి: చూ, రత్నములు. 1-౭.

గోమేదము, సం. వి. అ. న.—పై.—

గోమేదికము, వై. వి. = గోమేధికము.—పై.—

గోమేధము, సం. వి అ. పుం. 1: చూ, రూ- గోమేదకము; 2. కొండ: చూ, పర్వతము; 1; 3. జన్నము: చూ, యజ్ఞము.

గోమేదసన్నిభము, సం. వి. అ. పుం. పాలతాయి; చూ, రత్నములు. 1-౧౨-(౨౮).

గోమేధికము. సం. వి. అ. న. 1. = గోమేదికము. పసుపువన్నెగల రత్నము. నవరత్నములలో నొకటి: చూ, రత్నములు: చూ, రత్నము. 1; 2. ఆకుపత్రికము *: చూ, రోమశము; 3. విషభేదము: చూ, విసము. 1.

గోయి, వై. వి. = గర్తమ్. రూ-గొయ్యి: చూ, రంధ్రము. 1-౧.

గోయుజ, సం. వి. అ. స్త్రీ. రెండుకోసులు: చూ, పరువు. 2.

గోర, వై. వి. 1. = గోరంకువు: చూ, రూ-గొరంకి; 2. అరఁటి పువ్వు లోపలనుండెడి యొకానొక వస్తువు: చూ, గోరు.

గోరంక, వై. వి. = :చూ, రూ గొరంకి.

గోరంకి, —పై.—

గోరంకువు, సం. వి. ఉ. పుం. 1. = గొరంకి-గోరంక - గోరః చూ, శారిక. 1; 2. బట్టఁ గట్టనివాఁడు: చూ, దిగంబరుఁడు; 3: చూ, బట్టువాఁడు; 4. జామీనుదారు: చూ, లగ్నకుఁడు.

గోరంత, వా. వి. మిక్కిలికొంచెము. "గోరంతలు కొండంతలుగాఁ జేసెను:" చూ, స్వల్పము: (చూ, కొంత. (1.)

గోరఁక, వై. వి. = గోరంకు: చూ, రూ-గొరంకి.

గోరఁకి, వై. వి. = —పై.—

గోరఁట, వై. వి: చూ, సహా. 2-౫.

గోరఁబోపునది గొడ్డఁటనఱకుట, లో. ఉదా-"మనకప్పుడు గోరం బోపుపని గొడ్డంటం దీర్పవలసివచ్చును." (నీతిచంద్రిక-మిత్రభేదము)

గోరకలి, వా. వి. గొప్పచిక్కు, అతివారుణము.

గోరక్ష, సం. వి. ఆ. స్త్రీ. 1. నారింజ*: చూ, శర్కరాంకము. 1-౧౧; 2. పసులఁగాచుట; 3. కుండానుఁగు*; చూ, నాదాలాబువు.

గోరక్షకము, అం. జాతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, జాతులు.

గోరక్షకుఁడు, సం. వి. అ. పుం. 1. వైశ్యస్త్రీకిని క్షత్రియునికినిఁ బుట్టిన గొల్లవాఁడు: చూ. మాహిష్యుఁడు; వా. 2. పసుల కాపరి.

గోరక్షతుంబి, సం. వి, ఈ. స్త్రీ: చూ, గోరక్ష 3.

గోరక్షి, 1. —పై.— 2; చూ, సర్వదండి*.

గోరక్షుఁడు. సం. వి. అ. పుం: చూ, గోరక్షకుఁడు.

గోరగింత, వై. వి. = ఘోరత్వ. భయంకరత్వము: చూ, రౌరవము. 2.

గోరచనము, వై. వి. =గోరోచన. 1. ఆవుకడుపునుండి యెత్తెడి యొకవస్తువు: రూ-గోరజనము: చూ, రోచన; 2: చూ, వర్ణము. 6-౪-(౫).

గోరజము, వై. వి. = —పై.—

గోరడము, దే. వి. ఎగతాళి: చూ, పరిహాసము.

గోరతనము, దే. వి. దౌష్ట్యము: చూ, వ్యళీకము. 2.

గోరత్నము, అం: చూ, చేతనరత్నములు.

గోరథుఁడు, సం. వి. అ. పుం. బృహస్పతి గ్రహము: చూ, రాహువు. 2.

గోరప దే. వి. గట్టిమ్రోఁత: చూ, స్వరము. 2-౪౬-(౩౧౮).

గోరపడు, ద్వ. అ. క్రి. (గోరము + పడు): చూ, రోఁత పడు.

గోరపన, దే. వి. రూ-గోరము-గోసు: చూ, ఏంద. 1.

గోరపము, వై. వి. = కురప: చూ, రూ-గొఱపము.

గోరము, వై. వి. = ఘోర. 1. భయము, భయంకరము (అని కొందఱు): చూ, వెఱపు; దే. వి. 2. ఆపద. అప్ప. యు. కాం, 142: చూ, విపత్తు; 3. దేహముయొక్క అస్వాస్థ్యము; 4. రోఁత: చూ, నింద, 1; విణ. 5. రోఁతకలది. కళా. 7, ఆ. 86: చూ, వికృతము. 3.

గోరవంక, వై. వి. = : చూ, రూ-గొరంకి.

గోరసజము, సం. వి. అ. న. చల్ల: చూ, మజ్జిగ.

గోరసము, సం. వి. అ. పుం. 1. —పై.—; 2. క్షీరము: చూ, గవ్యము. 1-౧; 3. దేవదారు బంకతోఁ జేసిన ధూప ద్రవ్యము: చూ, రాజార్హము. 1-౨౦.

గోరాండిక, సం. వి. ఆ. స్త్రీ. = గోరంక: చూ, శారిక. 1.

గోరాటక, సం. వి. ఆ. స్త్రీ. = —పై.—

గోరాటి, సం. వి. ఈ స్త్రీ. = —పై —

గోరి, దే. వి. కట్టినసమాధి: చూ, సమాధి. 1.

గోరింక, వై. వి. = చూ, రూ-గొరంకి.

గోరించు, దే. అ. క్రి. 1. ఎగయు. శశాం. 3, ఆ. 111: చూ, లంఘించు; 2. పెకిలేచు: చూ, రేఁగు.

గోరింపు, దే. వి. 1. ఎగపు: చూ, నెగపు; 2. గర్వము: చూ, హంకారము.

గోరక, వై. వి. = : చూ, రూ-గొరంకి.

గోరు, వై. వి. 1. = ఖుర: చూ, నఖము; 2. = ఖుర. తంత్రిమీటు ప్రతినఖము.- స్వా. 5, ఆ. 64: చూ, నఖము; 3: చూ, గోర; విణ. 4. అల్పము. "గోరువెచ్చని నీరు": చూ, స్వల్పము; అం. 5: చూ, రంధ్రములు.

గోరుగల్లు, ద్వ. వి. (మంగలి గోళ్లతీసెడి) ఇనుపసలాక. కళా. 3, ఆ. 109: చూ, నఖోత్పాటని (రూ-గోరుగొండి-గోర్గొండి).

గోరుగాలము, ద్వ. వి. చేపలను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁ జేసిన గాలము: చూ, వల. 1.

గోరుగొండి, ద్వ. వి. రూ-గోర్గొండి: చూ, గోరుగల్లు.

గోరుచిక్కుడు, ద్వ. వి: చూ, మట్టిక *.

గోరుచీరణము, ద్వ. వి. గోటివలె కొనయందు వంపుగల యులి: చూ, వృక్షాదనము 1.

గోరుచుట్టు, ద్వ. వి. 1. గోరుచుట్టులేచెడుపుండు: చూ, వ్రణము. 1-౧౨; 2. ఒకానొకగడ్డ.

గోరుచుట్టుపై రోఁకలిపోటు, జా. ఆపదపైన మఱియొక ఆపద.

గోరుతము, సం. విణ. కోసు: చూ, పరువు. 2.

గోరుపడము, వై. వి. = ఘోరపట: చూ, రూ-గోర్పడము.

గోరుపిళ్లాడు, దే. స. క్రి. 1. పుట్టచెండ్లాడు: రూ- గోరుపులాడు. గోర్పికులాడు- గోర్పిల్లాడు; 2. ఎగురవేయు : రూ - గోరుపులాడు - గోర్పికులాడు - గోర్పిల్లాడు.

గోరుపులాడు, దే. స. క్రి. — పై.—

గోరుమీటులు, దే. వి. బ: చూ, భక్ష్యము.

గోరురాజనాలు, దే. వి. బ. ఒకరకము వడ్లు : చూ, ధాన్యము.

గోరువంక, వై. వి. = : చూ, గొరంకి.

గోరువంకలు, వై. వి. బ. = ఖురవక్ర. రూ - గోర్వంకలు: చూ, నఖక్షతము. అం భా. ద్వి. 180.

గోరువెచ్చ, ద్వ వి. రూ - గోర్వెచ్చ: చూ, మందోష్ణము: (చూ, వేఁడిమి.)

గోరేక్షకము, సం. వి. అ. పుం. తంగేడు*: చూ, హేమ పుష్పకము.

గోరొత్తు, ద్వ. వి. (గోరు + ఒత్తు). కళా. 7, ఆ. 161: చూ, నఖక్షతము.

గోరొండి, ద్వ. వి: చూ, రూ - గోరుగొండి.

గోరోచన, సం. వి. ఆ. స్త్రీ. = గోరోజనము: చూ, రోచన.

గోరోచము, సం. వి. అ. న: చూ, హరిదళము.

గోరోజనము, వై. వి. = గోరోచన. రూ - గోరజము - గోర్జము: చూ, రోచన: (చూ, రాజార్హము. 1-౩౨.)

గోదము, సం. వి. అ. న: చూ, మెదడు.

గోర్దము, సం. వి. అ. న. —పై.—

గోర్పడము, వై. వి. = ఘోరపట. రూ - గోరుపడము. 1. కంబళి: చూ, రల్లకము; 2. ఏనుఁగుమీఁదఁ బఱచెడి యెఱ్ఱని కంబళి: చూ, రల్లకము.

గోర్పికులాడు, దే. స. క్రి: చూ, రూ - గోరుపిళ్లాడు.

గోర్పిల్లాడు, దే. స. క్రి.—పై.—

గోర్వంక, వై. వి. 1. = : చూ, గొరంకి; అం. 2: చూ, దూతీ చతుష్టయము.

గోర్వంకలు, వై. వి. = : చూ, రూ - గోరువంకలు.

గోర్వెచ్చ, ద్వ. వి: చూ, రూ - గోరువెచ్చ.

గోర్జము, వై. వి. = గోరోచన. 1. స్వా. 4, ఆ. 14: చూ, రోచన; 2: చూ, రూ - గోరసనము. 1, 2.

గోల, సం. వి. ఆ. స్త్రీ. 1. = గోలి. కాఁగు: చూ, పాత్రము. 6; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. గోదావరీనది: చూ, నది; 4. మణిసిల: చూ, రత్నములు. 1-౧౨-(౧౧) : దే. వి. (1) అతిదారుణధ్వని : చూ, స్వరము. 2- ౪౮-(౯౩); (2) రెమ్మ: చూ, శాఖ. 1-౨; (3) ఆఁడుది. అం, భా. ద్వి. 104: చూ, స్త్రీ; విణ. (4) ముగ్ధ. పండ్రెండేండ్ల పర్యంతమైన వయసుగలది (ఆఁడుది): చూ, స్త్రీ; (5): చూ, ముగ్ధుఁడు.

గోలకము, సం. వి. అ. పుం. 1. = గోలెము. రూ-గోళకము: కాఁగు: చూ, 6. పాత్రము; 2. గులి: చూ, గోలీ; 3. పోయినకుండ: చూ, రూ - గోళకము. భాండము. 3-౧౩; 4. బొమిడికము: చూ, సీసకము. 1; 5. కంబళి: చూ, రల్లకము; 6. ఇంద్రియములుండు తావు; 7. పోఁక గెల: చూ, పోఁక.

గోలకుఁడు, సం. వి. అ. పుం. విధవకు జారునివలనఁ బుట్టిన కొడుకు, రూ-గోళకుఁడు: చూ. సూనుఁడు. 1-౮.

గోలక్షణము, అం: చూ, కళలు.

గోలత్తిక, సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుఉపపిట్ట: చూ, పిచ్చుక.

గోళము, సం. వి. అ. పుం. రూ - గోళము 1. బాలెంతబోలు: చూ, బోళము; 2. మంటిఉంట: చూ, పూస; 3. కంటి గ్రుడ్డు: చూ, లోచనము. 1-౧౧; న. 4. (సూర్యచంద్రాదుల) బింబము: చూ, మండలము. 9.

గోలాంగూలము, సం. వి. అ. పుం. 1. కొండముచ్చు: చూ, వానరము. 1-౫; 2. కోతి; చూ, వానరము.

గోలాసము, సం. వి. అ. న: చూ, పుట్టగొడుగు*.

గోలి, సం. వి. ఈ. స్త్రీ. ఉడుము: చూ, బిలేశయ.

గోలించు, దే. స. క్రి. చముఱుపోని వేఁచు: చూ, వేఁచు.

గోలియము, వై. వి. = గోలకః. రూ - గోలెము. కాఁగు: చూ, పాత్రము. 6.

గోలిహము. సం. వి. హ. పుం: చూ, మొక్కజొన్న*.

గోలీ, వై. వి. = గోలకః. గోలీకాయ: చూ, బాలక్రీడ.

గోలీకాయ, ద్వ. వి. —పై.—

గోలీఢము, సం. వి. అ. పుం: చూ, గోలిహము*. (ఆవులచేత ఆస్వాదింపఁబడునది.)

గోలు, దే. వి. 1: చూ, పేడుబొద్దు. వా. వి. 2. బంతి ఆట యందలి గెలుపు.

గోలుఁడు, సం. వి. అ. పుం: చూ, గోలకుఁడు.

గోలుగోలు, దే. వి. రూ - గోల్గోలు. ఏడ్పుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

గోలురించు, దే. అ. క్రి. (పులి) కూయు: చూ, శబ్దించు.

గోలె, దే. అవ్య. ఆరంభకాలనిశ్చయార్థమందువచ్చు నిపాత. "నాటంగోలె" మొ.

గోలెము, వై. వి. = గోలకః: చూ, రూ - గోలియము.

గోలోకము, సం. వి. అ. న. శ్రీకృష్ణునియొక్క స్థానము.

గోలోమి, సం. వి. ఈ. స్త్రీ. తెల్లగరిక*: చూ, తృణము. 1; 2: చూ, మర్లమాతంగి*; 3. వస, నల్లవస (అని కొందఱు)*: చూ, విష; 4: చూ, నేలగొలిమిడి*; 5. భూతకేశము*: చూ, జటామాంసి; 6. శమీధాన్యము: చూ, ధాన్యము.

గోల్గోలు, దే. వి: చూ, రూ - గోలుగోలు.

గోవ, దే. వి. 1. యౌవనము. స్వా. 4, ఆ. 83: చూ, వయస్సు. 1; వై. వి. 2. = గవయః: చూ, శరభము. 1; దే. విశే. 3. మనోజ్ఞము. "గోవపని.": చూ, హృద్యము; వా. 4. పొడవు.

గోవందని, సం. వి. ఈ. స్త్రీ: చూ. ప్రేంకణము*.

గోవందిని, సం. వి. ఈ. స్త్రీ.—పై.—

గోవణము, వై. వి. = కౌపీనము: చూ, బొట్టము.

గోవత్సన్యాయము, న్యా. ఆవునమ్మినపుడు దూడకు వేరే ఖరీదు లేదనురీతి.

గోవమొలత్రాడు, దే. వి. మగవాని మొలనూలు. శృంఖలము: చూ, సూత్రము. 1-౬౪.

గోవర్ధనధరుఁడు, సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

గోవర్ధనము, సం. వి. అ. పుం. 1: చూ, సింహము; 2: చూ, మాతులుంగము*; 3. సారములేని మాది మొదలగు వస్తువు; 4. గోవర్ధన పర్వతము; చూ, పర్వతము.

గోవశ, సం. వి. ఆ. స్త్రీ. గొడ్డావు: చూ, ధేనువు.

గోవాలము, సం. వి. అ. పుం. ఆవుయొక్క రోమము: ఆవురోమ-రూ-ఆవురోమ.

గోవావు, దే. వి. (గోవు + ఆవు) సాధువుకాని యావు. కరట: చూ, ధేనువు.

గోవాళ్లు, దే. వి. బ: చూ, యౌవనుఁడు. స్వా. 4, ఆ. 83; 2. ముండలమారి. అం, ధా. ద్వ. 116: చూ, విటుఁడు.

గోవిందము, సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

గోవిందములు, దే. వి. బ. నతివిశేషము: చూ, హాణిగలు.

గోవిందములుకొట్టుచు, జా. ఉత్సాహముతో గోవిందస్మరణ చేయుచు. "చతుర్విధాహార పరిధానాభీష్టమృష్టాన్నంబుల విందుపెట్టులనుకొంచు గోవిందములు కొట్టుకొంచు జిహ్వాలు చివురించునట్లు భుజించుచు." (ధర్మజ రాజసూయము.)

గోవిందుఁడు, సం. వి. అ. పుం. 1. శ్రీకృష్ణుఁడు: చూ, విష్ణువు. 1; 2 ఆలకాఁపరి: చూ, మహాభూముఁడు; 3. బృహస్పతిగ్రహము: చూ, రాహువు. 2; 4. నలువ: చూ, బ్రహ్మ. 1; 5. ఇంద్రుఁడు: చూ, వేలుపు ఱేఁడు; 6. భూపతి: చూ, రాజు. 1-౩౧; 7. పరమాత్మ: చూ, హంసుఁడు; 8 మనస్సు మొదలగు నింద్రియముల నడపు అంతర్యామి (గోవిందాయ నమః): చూ, ఓమ్.

గోవిట్టు, సం. వి. ష. (ట్). పుం, స్త్రీ: చూ, గోమయము.

గోవిరేచనము, సం. వి. అ. న. 1: చూ, గోమూత్రము; వా. 2. ఆవుపేడ: గోవిష.

గోవిష, సం. వి. ఆ. స్త్రీ: చూ, గోమయము.

గోవు, సం. వి. ఓ. స్త్రీ. 1. ఆవు. (దీని ధ్వని హంభ. శిరోదేశము సైచికము): చూ, ధేనువు; 2. కన్ను (పుం, స్త్రీ అని కొందఱు): చూ, లోచనము. 1; 3. దిక్కు: చూ, హరిత్తు; 4. తూపు (పుం, స్త్రీ అని కొందఱు): చూ, బాణము. 1; 5. పుడమి: చూ, భూమి. 1; 6. వాక్కు: చూ, శబ్దము. 2; 7. బ. జలము (పుం, స్త్రీ అని కొందఱు): చూ, సలిలము; 8. నలువరాణి: చూ, సరస్వతి; 9. కోసుదూరము: చూ, పరువు. 2; 10. గుఱి: చూ, లక్ష్యము. 1; 11. చూపు: చూ, లక్షణము. 3; పుం. 12. (బండిలాగు) ఎద్దు: చూ, వృషభము. 1; 13. కిరణము. (పుం, స్త్రీ అని కొందఱు): చూ, హాయనము. 2; 14. నాకము (పుం, స్త్రీ అని కొందఱు): చూ, స్వర్గము; 15. చందమామ: చూ, హిమాంశువు; 16. వజ్రాయుధము. (పుం. స్త్రీ అని కొందఱు): చూ, బాణము. 1. ౬౨; 17: చూ, సూర్యుఁడు; 18. వెండ్రుక (పుం, స్త్రీ అనికొందఱు): చూ, వెండ్రుక. 1; 19 జన్నము: చూ, యజ్ఞము; 20. ఒక ముని: చూ, ముని. 1; 21. అర్జునుఁడు; చూ, విజయుఁడు. 1; స్త్రీ, న. 22. తేజస్సు: చూ, వెలుతురు. 1; అం. 23; చూ, దానములు.

గోవృందము, సం. వి. అ. న. ఆవులమంద: చూ, ధేనువు.

గోవృకము, సం. వి. అ. పుం. 1. కోడి: చూ, పుంజు; 2. జక్కవపిట్ట: చూ, బటువుగువ్వ.
గోవృషము, సం. వి. అ. పుం. ఆఁబోతు: చూ, వృషభము. 1.
గోశకృత్తు, సం. వి. త్. న: చూ, గోమయము.
గోశాల, సం. వి. ఆ. స్త్రీ ఆవులసాల. రూ - గోశాలము: చూ, సదనము. 1.
గోశాలము, సం. వి. అ. న. —పై.—
గోశీర్షము, సం. వి. అ. న. హరిచందనము: చూ, వాసన.1-ఉ.
గోశృంగము, సం. వి. అ. పుం. తుమ్మ*: చూ, విట్ఖదిరము.
గోశృంగోదకన్యాయము, న్యా. గోశృంగమునందు నీటినిపోసి గాయత్రిచేత మూఁడుపర్యాయము లభిమంత్రించి ఆయుదకము చేత స్నానమొనర్చుట అను విధము.
గోశ్రేణి, సం. వి. ఈ. స్త్రీ. తంగేడు*: చూ, హేమపుష్పకము.
గోషా, వా. వి. రాణివాసము (గోషా అనియు.)
గోష్ఠము, సం. వి. అ. న. = కొట్టము. రూ-గొష్టము. గోవుల మంద యుండు చోటు: చూ, సదనము. 1.
గోష్ఠశ్వుఁడు, సం. విశే. తానుండెడుచోట నుండుకొని పరులను ద్వేషించువాఁడు.
గోష్ఠి, సం. వి. ఈ. స్త్రీ. 1. సభ: చూ, సభ. 2; 2. రాజసభ: చూ, సభ. 2; 3. మహారాజసభ: చూ, సభ. 2; 4. పరిషత్సభ: చూ, సభ. 2; 5. ఇష్టాగోష్ఠి: చూ, సల్లాపము; అం. 6. నాటికలు పదునెనిమిదింటిలోనొకటి. (1. అంకము కథప్రణయము. పురుషపాత్ర 9 లేక 10. స్త్రీలు 5 లేక 6): చూ, నాటికలు.
గోష్ఠీనము, సం. వి. పుం, న. రూ-గొష్ఠీనము. మునుపావులున్న సాల: చూ, సదనము. 1.
గోష్పదము, సం. వి. అ. న. 1. ఆవుడెక్క, (ఆవుయొక్క అడుగుకొలఁది): చూ, వింబము; 2. గోవుగొరిసె యిడిన గుంట: చూ, రంధ్రము. 1-౧౩; 3. గోవులు తిరిగెడిచోటు: చూ, స్థానము. 1.
గోస, వా. వి. తిట్టు, (ఘోషశబ్దభవము గోస).
గోసంఖ్యుఁడు, సం. వి. అ. పుం. గొల్ల: చూ, మహాశూద్రుడు.
గోసంగము, సం. వి. అ. పుం: చూ, వేగుజాము.
గోసంగి, వై. వి. 1. = గోహింసకః. రూ - గోసఁగి. ఆం, భా. ద్వి. 289: చూ, మాదిగ; 2 కడజాతివాఁడు: చూ, మాల(1).
గోసఁగి, —పై.—
గోసడుచు, దే. స. క్రి. (గోసు + అడుచు): చూ, నిందించు.
గోసన, వై. వి. = ఘోషణ. రూ- గోసు - గోసున. చాటించుట: చూ, ఘోషణ.
గోసము, వై. వి. 1: చూ, కోశము; 2. చూ, వేగుజాము.
గోసరము, సం. వి. అ. పుం. గోమేధయజ్ఞము: చూ, యజ్ఞము.
గోసర్గము, సం. వి. అ. పుం: చూ, వేగుజాము.
గోసవము, అం: చూ, శిహీనతానములు: (చూ, శుద్ధతానములు.)
గోసు, వై. వి. 1. = ఘోషణ: చూ, రూ - గోసన; 2. అపదూఱు: చూ, నింద. 1; 3. దోషము: చూ, పాపము. 1.
గోసున, వై. వి. = ఘోషణ. ఆం. భా. ప్ర. 114; చూ, రూ. గోసన.
గోస్తన, సం. వి ఆ. స్త్రీ: చూ, గోస్తని*.
గోస్తనము, సం. వి. అ. పుం. నలువదిపూసలసరము (పుం, న. అని కొందఱు.): చూ, భూషణము. 2-ఉ-(౩౨).
గోస్తని, సం. వి. ఈ. స్త్రీ. 1. ద్రాక్ష*: చూ, స్వాదుఫల; వా, 2. ఒకానొకనది.
గోస్థానకము, సం. వి. అ. న: చూ, గోష్ఠము.
గోస్వామి, సం. వి. న్. పుం. 1: చూ, గోపుఁడు. 4; 2. (నాట్యపరిభాషయందు) ఇతరరాజుయొక్క కొడుకు: చూ, సూనుఁడు. 1-౨౩.
గోహన్నము, సం. వి. అ. న: చూ, గోమయము.
గోహరి, దే. వి. పరాక్రమము. జై. 6, ఆ. 154: చూ, శౌర్యము. 1.
గోహరితకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మారేడు *.
గోహలకుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
గోహలము, సం. వి. అ. పుం ఏఱుపిడక. రూ-గోహళము: చూ, పిడక.
గోహళము, సం. వి. అ. పుం. —పై.—
గోహింసకుఁడు, సం. వి. అ. పుం. = గోసంగి: చూ, మాదిగ.
గోహితము, సం. వి. అ. పుం: చూ, మారేడు*.
గోళకుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-గోలకుఁడు.
గోళము: చూ, రూ-గోలము.
గోళి, వై. వి. = ఘోలీ కుచ్చలి *: చూ, విచిల్లిక.
గోళ్లకుతికంటు, ద్వ. వి. స్త్రీకంఠభూష: చూ, భూషణము. 2.-ఉ-(౧౧).
గోళ్ళగొండి, ద్వ. వి. 1. ఒకరకము గడ్డి*: చూ, తృణము. 1; 2. తృణధాన్యము: చూ, ధాన్యము.

## గౌ

గౌంజికుఁడు, సం. వి. అ. పుం. బంగారు పనివాఁడు: చూ, స్వర్ణకారుఁడు.
గౌండవాఁడు, వై. వి. = గోండ. రూ - గవుండ్లవాఁడు: చూ, సురాజీవి.
గౌండ్లవాఁడు, —పై.—
గౌఁడు, —పై.—
గౌడకట్టు, దే. వి. చెంపలను మూసికట్టుట. ఆం. భా. తృ. 37.
గౌడకృతి, అం. క్రియాంగములకు సంబంధించిన సామకృతి, గౌడకృతి, దేవకృతి యను మూఁడింటిలో నిది యొకటి.
గౌడదేశిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, వాయసోలి*.
గౌడము, సం. వి. అ. పుం. రూ-గౌళము. 1. ఏఁబదియాఱు దేశములలో నొకటి: చూ, దేశము; అం. 2. రాగాంగములు పదుమూఁడింటిలో నొకటి: చూ, రాగాంగములు.
గౌడలి, వై. వి. మునలిడి (అఁడుది): చూ, స్త్రీ. 1-౫౦.
గౌడసరము, ద్వ. వి: చూ, రూ-గవుడసరము. కళా. 7, ఆ. 66.
గౌడి, సం. వి. అ. పుం. :. వాఙ్కలి. అరపూవుసారాయి బెల్లముతోఁజేసిన సారాయి (అని కొందఱు): చూ, సుర.2-౩;

అం. 2. (కఠినపదములు, దీర్ఘ సమాసములుగలది): చూ, కావ్యరీతులు; 3: చూ, రీతులు; 4: (చూ, భాష. 1): చూ, మాళవకైశికిజభాషలు; 5: (చూ, భాష. 1): చూ, హింవోళజ భాషలు; వా. 6. పొట్టి.

గాడిగేదె, దే. వి. పొట్టికొమ్ముల బఱ్ఱె: చూ, మహిషి.

గౌడబ్రాహ్మణులు, అం. బేహారునకు వంగదేశమునకు బంగ ళమునకు ముఖ్యపట్టణముగా నుండిన గౌడి యను పట్టణ మును బట్టి యా ప్రదేశ బ్రాహ్మణులకు గౌడిబ్రాహ్మణులను పేరు కలిగినది. వీరు మత్స్యములను మాంసమును మధు వును గూడ భక్షింతురు. వీరిలో (చూ) అగ్రదానీ బ్రాహ్మ ణులు, ఆచార్యబ్రాహ్మణులు, ఆదిగౌడ బ్రాహ్మణులు, కీర్తన్య గౌడబ్రాహ్మణులు, శ్రీగౌడబ్రాహ్మణులు, శుక్లవాలగౌడ బ్రాహ్మణులు అనువారు కలరు: చూ, బ్రాహ్మణులు. (వాచు గౌడబ్రాహ్మణులు.)

గౌణము, సం. విశే. ముఖ్యముకానిది.

గౌణవిధి, సం. వి. ఇ. పుం: చూ, అనుకల్పము.

గౌతమ, అం: చూ, స్మృతులు.

గౌతమము, సం. వి. అ. పుం. ఏనుగుతుమ్మి*: చూ, తుమికి

గౌతమసగోత్రము, అం: చూ, గోత్రము. 13.

గౌతమస్మృతి, అం: చూ, స్మృతులు. (త్రేతాయుగంబున గౌతమస్మృతి ప్రతిపాదిత ధర్మంబులను ప్రచురించినది.)

గౌతమి, సం. వి. ఈ. స్త్రీ. 1. గౌతమి యను (అఖండగౌత మితోఁ జేరినది): చూ, నది. 1; 2. గౌరి: చూ, పార్వతి. 1; అం. 3: చూ, గంగలు.

గౌతమీద్వారము, సం. వి. అ. న. కైలాసగిరి: చూ, పర్వతము.

గౌతముఁడు, సం. వి. అ. పుం. గౌతమఋషి: చూ, ముని. 1; 2. జినుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 3. సప్తఋషులలో నొకఁడు: చూ, మహర్షులు; 4: చూ, శాస్త్రప్రవర్తకులు.

గౌద, వై. వి. = గండ: చూ, రూ-గవుద (దేశ్యమని శబ్దరత్నా కరము.)

గౌధారము, సం. వి. అ. పుం. ఉడుముయొక్క పిల్ల: చూ, బిళేశయ (గోధ యనఁగా ఉడుము; దానిపిల్ల గనుక గౌధె రము-గౌధారము-గౌధేయము అనంబరఁగు.)

గౌధేయము, —పై.—

గౌధేరము, —పై.—

గౌపుచ్ఛికము, సం. వి. అ. పుం. రెండు త్రాటిమ్రాఁకులనుజేర్చి కట్టి నీరుదాఁటెడు సాధనము, సంగడి; చూ, హోడము.

గౌర, దే. వి: చూ, రూ-గవుర.

గౌరజీరకము, సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.

గౌరము, సం. వి. అ. న. 1. బ. అకరువు, కింజల్కములు: చూ, సహస్రపత్రము. 1-౧౦-(౨); పుం. 2. బ. తెల్లావలు (న. అని కొందఱు): చూ, సర్షపము; 3. తెలుపు: చూ, వర్ణము. 6; 4. పసుపుపచ్చ: చూ, వర్ణము. 6-౭; 5. పసుపుపచ్చరంగు అధికముగాఁ గలిగిన యెఱుపు: చూ, వర్ణము. 6-4-(౫); 6. నారింజ *: చూ, శర్కరాంకము; 7. నెమిలడుగుమ్రాను *; చూ, పూతికరజము; 8. ఒక రకము వస్తు: చూ, ధాన్యము; 9. = గవరన. ఎఱుపు: చూ, వర్ణము. 6-౪-(౧); 10. జింక: చూ, హరిణము; విశే. 11. ఎఱ్ఱనిది: చూ, వర్ణము. 6; 12 తెల్లనిది: చూ, వర్ణము. 6; 13. పసుపుపచ్చనిది: చూ, వర్ణము. 6-౭-(౧); 14. స్వచ్ఛమైనది: చూ, శుద్ధము. 3.

గౌరవం లాఘవంచాపి ధనాధననిబంధనమ్. న్యా. కలిమినిఁబట్టి గౌరవము, లేమినిఁబట్టి లాఘవము.

గౌరవము, సం. వి. అ. న. = గరువము-గారాము, మరియాద: చూ, సన్మానము.

గౌరవించు, సం. స. క్రి: చూ, సన్మానించు.

గౌరవితుఁడు, సం. వి. అ. పుం. ఆర్యమిత్రుఁడు: చూ, మర్యా ద ( ..

గౌరశాకము, సం. వి. అ. పుం. 1. నీరుఇప్ప *: చూ, మధూ కము; 2. వాగ *: చూ, స్రవ.

గౌరసర్షపము, సం. వి. అ. పుం. తెల్లావాలు: చూ, సర్షపము.

గౌరసువర్ణము, సం. వి. అ. పుం: చూ, నెల్లి*.

గౌరసౌవర్ణము, —పై.—

గౌరాత్మిక, సం. వి. ఆ. స్త్రీ. తదియశక్తి: చూ, తిథి. 1.

గౌరి, సం. వి. ఈ. స్త్రీ. 1. = గౌరు. దుర్గ: చూ, పార్వతి. 1; 2. సమర్తాడని కన్యక. పెండ్లిగాని పదేండ్లపడుచు, చీరకట్టని కన్నియ: చూ, స్త్రీ. 1-౪౭. 1-౧-(౨); 3. పసుపు: చూ, వర్ణము. 6-౭; 4. చేఁతరాని*: చూ, శకుల; 5. గోరోచ నము: చూ, రోచన; 6. ఇంగువ: చూ, హింగుపు. 2; 7. బ. కొఱ్ఱులు: చూ, ధాన్యము; 8. వరుణుని యిల్లాలు: చూ, భార్య. 1; 9: చూ, రాత్రి. 10. నేల: చూ, భూమి. 1. 11. ఏఱు: చూ, నది; 12. నలువరాణి: చూ, సర స్వతి. 1; 13. చూ, స్వరము. 2-౩౯; అం 14. యౌవన భేదములు గల స్త్రీలలో తొమ్మిది వత్సరముల లేఁత జవ్వనముగల కన్యక: చూ, యౌవనభేదములు; 15. చూ, భాషాంగములు: (చూ, భాష. 1.)

గౌరిక, సం. వి. ఆ. స్త్రీ. = గోరువంక: చూ, శారిక. 1.

గౌరికము, సం. వి. అ. పుం. తెల్లలావుపిట్ట: చూ, లావుక.

గౌరికుంకుమలు, దే. వి. బ. ఒకరకమువస్తు: చూ, ధాన్యము.

గౌరిపెండ, సం. వి. ఆ. స్త్రీ: చూ, గోరోచన.

గౌరీక, సం. వి. ఆ. స్త్రీ. = : చూ, రూ-గౌరిక.

గౌరీపోత్రి, సం. వి. ఈ. స్త్రీ బుద్ధునితల్లి: చూ, బుద్ధుఁడు. 1.

గౌరీవాసము, సం. వి. అ. పుం: చూ, మధూకము*.

గౌరు, దే. వి: చూ, రూ-గవురు. 1-2-3-4; వై. వి. 5 = గౌరి: చూ, రూ-గవురు. 5.

గౌరుఁడు, సం. వి. అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

గౌర్దాలికము, సం. వి. అ. న. గుద్దలికంటె సన్నపుగనుండు పని ముట్టు: చూ, గుద్దలి.

గౌలు, దే. వి: చూ, రూ-గవులు.

గౌలేయకము, సం. వి. అ. పుం. కొండపోఁక*: చూ పోఁక.

గౌష్ఠీనము, సం. వి. అ. న. మునుపావులున్న నాల: చూ, సద నము. 1.

గౌసెన, వై. వి. = కోశ. స్వా. 4, ఆ. 33: చూ, రూ-గవుసెన.
గౌళ, అం. 1: చూ, పురుషరాగములు; 2: చూ, స్త్రీరాగములు.
గౌళదేశస్త్రీ, అం: చూ, స్త్రీ: (చూ, దేశస్త్రీలు.)
గౌళము, సం. వి. అ. పుం: చూ, రూ-గౌడము.
గౌళి, దే. వి: చూ, రూ-గవుళి.

# గ్ర

గ్రంత, వై. వి. = కంథరము: చూ, రూ-క్రంత 2.
గ్రంథకర్త, సం. విణ. ఋ. గ్రంథకారుఁడు.
గ్రంథకుటి, సం వి. ఈ. స్త్రీ. వ్రాసెడి గది, కరణము లెక్కలు వ్రాసెడి చావడి (అని కొందఱు), గ్రంథములుగల గది, పుస్తకభాండాగారము (అని కొందఱు): చూ, సదనము. 1.
గ్రంథనము, సం. వి. అ. న. 1. కూర్పు, చంపూప్రబంధ రచన (అనియు): చూ, మాటలల్లుట; 2. పూలు మొదలగునవి గ్రుచ్చుట: రూ-గ్రథనము. (గ్రంథన అనియు.)
గ్రంథము, సం. వి. అ. పుం. 1. కావ్యము. (కవి కల్పితమైనది): చూ, పుస్తకము; 2. మాటలపొందిక; 3. ముప్పది రెండక్షరముల శ్లోకము, అనుష్టుప్పు: చూ, ఛందస్సులు; 4. నియమగ్రంథము: చూ, శాస్త్రము. 1: (చూ, కావ్యము); 5. ధనము: చూ, విత్తము 1.
గ్రంథసంధి, సం. వి. ఇ పుం. ప్రకరణము: చూ, సర్గము. 1.
గ్రంథి, సం. వి. ఇ. పుం. = కంతి: 1. వెదురు లోనగువాని బుడిపి: చూ, బుడిపి; 2. గడ్డవలెఁబుట్టెడు రోగము: చూ, దద్రువు; 3. పుంగుడు: చూ, బొప్పి; 4. దద్దు: చూ, దద్రువు; 5. చెట్టులోనగువాని ముడి: చూ, ముడి. 1; 6. దారము లోనగువాని ముడి: చూ, ముడి. 2; 7. వెండ్రుకల ముడి: చూ, ముడి. 3; 8. రూ-కలముడి: చూ, ముడి. 4; 9. కీళ్ళముడి; 10. గండివనము*: చూ, రాజార్హము. 1-3గా; 11. రథాభరణము: చూ, భూషణము. 2; 12. వంకర: చూ, వేల్లితము. 2; వా. వి 13. తలుపు అడ్డుగడియ: చూ, గడియ. 2; వా. 14. ఒకానొక గృహనామము.
గ్రంథిక, సం. వి. ఆ. స్త్రీ. 1. కట్లతీఁగె*: చూ, పర్యంకపాళిక; 2. పచ్చవస*: చూ, విష.
గ్రంథికము, సం. వి. అ. న. పిప్పలివేరు: చూ, పిప్పలి. 1; 2. గండివనము*: చూ, రాజార్హము. 1-3గా; పుం. 3. గుగ్గిలము*: చూ. మహిసాక్షి; 4. కరీరము*: చూ, వెణుతురు; 5. అగరుమ్రాను*: చూ, సుగంధము. 1; 6: చూ, మరువము*; 7: చూ, గ్రంథిక. 2.
గ్రంథికుఁడు, సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు; 2. యుధిష్ఠిరుని కడగొట్టు తమ్ముఁడు.
గ్రంథితము, సం. విణ. 1. రూ-గ్రథితము, దృబ్ధము, (కూర్పఁబడిన పుష్పమాలికాదులని అమరము) కూర్పఁబడినది: చూ, సంయోజితము; 2. హింసింపఁబడినది: చూ, హింసితము.
గ్రంథిపర్ణకము, సం. వి. అ. న. 1: చూ, మాచిపత్రి*; 2. స్థౌణేయమను గంధద్రవ్యము: చూ, రాజార్హము. 1-3గా.
గ్రంథిపర్ణము, సం. వి. అ. న. 1. = గండివనము. గ్రంథిపర్ణకము*: చూ, రాజార్హము. 1-3గా; 2. పచ్చాకు*: చూ, హరితపత్రిక.
గ్రంథిపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. గండదూర్వ*: చూ, తృణము. 1.
గ్రంథిపాత్తు, సం. వి. ద్. పుం. ఒంటె: చూ, లొట్టిపిట్ట.
గ్రంథిఫలము, సం వి. అ. పుం: చూ, వెలఁగ*.
గ్రంథిలము, సం. వి. అ. పుం. 1. పుల్లవెలఁగ: చూ, ములువెలఁగ; 2: చూ, వెణుఁతురు*; విణ. 3. గనుపులుగలది.
గ్రంథిహరుఁడు, సం. వి. అ. పుం: చూ, మంత్రి.
గ్రందె, వై. వి. = గ్రంథి. దారబంధము లోనగువాని నిలుపుల యందు బిగఁగొట్టిన చీలలకు తగిలించెడు తలుపులయందలి యినుపపట్టె; తలుపు అడ్డుగడియ (అనియు.)
గ్రక్కతిల్లు, దే. అ. క్రి: చూ, భయపడు.
గ్రక్కదలు, దే. అ. క్రి. (కదలు + కదలు) మిక్కిలి కదలు.
గ్రక్కున, దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ. పా. 1, ఆ. 23: చూ, స్యదము.
గ్రక్కున, —పై.—
గ్రగ్గులుకాఁడు, దే. వి. 1. పాఱిపోయినవాఁడు: చూ, పలాయితుఁడు; 2. భయముతోఁ గూడినవాఁడు: చూ, భయశీలుఁడు.
గ్రచ్చ, దే. వి: చూ, రూ-గచ్చ*.
గ్రచ్చకాయలు, దే. వి. బ. 1: చూ, బాలక్రీడ; 2. గచ్చచెట్టు కాయలు.
గ్రచ్చు, వై. విణ. = గ్రస్త. గ్రస్తోక్తి: చూ, శబ్దము. 2-3గ.
గ్రథనము, సం. వి. అ. న: చూ, రూ-గ్రంథనము.
గ్రథితము, సం. విణ. 1: చూ, గ్రంథితము. 1; 2. గుదివ్వఁబడినది.
గ్రద్ద, వై. వి. = గృధ్రము: చూ, రూ-గద్ద.
గ్రద్దగోరు, వై. వి. = గృధ్రనఖ. చోరసాధన విశేషము: చూ, రూ - గద్దగోరు.
గ్రద్దన, దే. ద్ర. క్రి. విణ: చూ, గ్రక్కున.
గ్రమ్మన, —పై.— జై. 3, ఆ. 5.
గ్రమ్మున, —పై.—
గ్రసించు, సం. స. క్రి. 1. కవ్వు: చూ, మ్రింగు; 2. తిను: చూ, సాపడు; 3. గుటకవేయు: చూ, మ్రింగు.
గ్రసిష్ణువు, సం. విణ. ఉ. 1. నమలితినువాఁడు: చూ, మ్రింగువాఁడు; 2. నమలకనే గుటకవేయువాఁడు: చూ, మ్రింగువాఁడు.
గ్రస్తము, సం. విణ. 1. రూ - గ్లస్తము. తినఁబడినది: చూ, భుక్తము. 2; 2. మ్రింగఁబడినది: చూ, భుక్తము. 2; 3: చూ, గచ్చు; 4. లోపించిన వర్ణములు పదములు గలవాక్యము. (వి. అనికొందఱు.)
గ్రస్తు, వై. వి. = గృహస్థః: చూ. ఇంటికాఁపు (రూ - గేస్తు. గేస్తుఁడు.)
గ్రహకల్లోలము, సం. వి. అ. పుం. రాహుగ్రహము: చూ, రాహువు.

4. పామరజనవాక్యము, అశ్లీలము: చూ, శబ్దము. 2; అం. 5. అశ్లీలము: చూ, అర్థదోషములు; 6. అశ్లీలము. (సిగ్గు గలిగించునది) పదదోషములలో నొకటి: చూ, పదదోషములు: (చూ, కావ్యదోషములు.) (వ్యాకరణ నిషిద్ధమైన పామరభాష అనఁగా సిగ్గు, ఏవగము, అమంగళము కలిగించు పదములు: (చూ, అర్థగ్రామ్యము). ఇత్యాది; న. 7. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధములు; 8. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము; 9. కోష్ఠ మొదలగువాని జాతి; 10. ఆంధ్రభాష = తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము అని చతుర్విధము. ఈ నాలుగురీతులలో గ్రామ్యమొకటి; విణ. 11. గ్రామమునఁ బుట్టినది; అం. 12: చూ, ఉత్తానకరణబంధములు; 13: చూ, అష్టాదశ పదార్థములు.

గ్రామాశ్వము, సం. వి. అ. పుం. గాడిద: చూ, రాసభము.

గ్రామ్యుఁడు, సం. విణ: చూ, గ్రామేయుఁడు.

గ్రావము, సం. వి న్. పుం. 1. = కరువ. కొండ: చూ, పర్వతము; 2. ఱాయి: చూ, రత్నములు. 1-౧౨-(౩).

గ్రావస్తుఁడు, అం: చూ, ఋత్విజుఁడు.

గ్రాసము, సం. వి. అ. పుం. = గాసము. కబళము: చూ, (సాపాటు): చూ, సాదము. (1) ౨౩.

గ్రాహకము, సం. వి. అ. పుం. 1. డేగ: చూ, శ్యేనము; విణ. 2. గ్రహించునది; పా. వి. 3. తీఁగెటపాను గ్రహించు యంత్రము.

గ్రాహకుఁడు, సం. విణ. = గాయకుఁడు: చూ, గ్రహీత.

గ్రాహణి, సం. వి. ఆ. స్త్రీ. తీఁటకసింద*: చూ, సముద్రాంత.

గ్రాహము, సం. వి. అ. పుం. 1: చూ, ప్రతిగ్రహము. 1; 2. పంది: చూ, సూకరము; 3. చెఱ: చూ, బంధనాలయము; 4. ఒకానొక నీరుపాము, మొసలి (అని కొందఱు): చూ, మత్స్యము. 1.

గ్రాహి, సం. వి. న్. పుం. 1: చూ, వెలఁగ*; 2. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము.

గ్రాహ్యము, సం. విణ. 1. గ్రహింపఁదగినది; 2. సంభోగబంధభేదము: చూ, రతిబంధములు.

## గ్రి

గ్రిక్కర, దే. వి. డోఁకు: చూ, వాంతి.

## గ్రీ

గ్రీటు, దే. వి: చూ, బలవంతము.

గ్రీవ, సం. వి. ఆ. స్త్రీ. 1. కంఠము: చూ, మెడ; 2. మెడనరము: చూ, మెడ.

గ్రీవము, సం. వి. అ. పుం. కిరణము: చూ, హాయనము.

గ్రీవాఘంట, సం. వి. ఆ స్త్రీ. ఘర్ఘర, గుఱ్ఱపుమెడగంట: చూ, హయము. 1-౫౦: (చూ, వీణ).

గ్రీవాభేదము, అం: చూ, నృత్యములు.

గ్రీవాభేదములు, అం. సుందరి, తిరశ్చీనము, పరివర్తితము, ప్రకంపితము. (4).

గ్రీష్మభవ, సం. వి. ఆ. స్త్రీ: చూ, గ్రీష్మి*.

గ్రీష్మము, సం. వి. అ. పుం. 1. వేఁడి: చూ, వేఁడిమి; 2. వేసంగి వెట్టకారు, గ్రీష్మఋతువు (జ్యేష్ఠము, ఆషాఢము): చూ, మాసద్వయము; అం. 3: చూ, త్రయము: (చూ, కాలము లు. 2.); 4: చూ, ఋతువులు.

గ్రీష్మసుందరి, సం. వి. ఈ. స్త్రీ: చూ, హంసపాది*.

గ్రీష్మహాసము, సం. వి. అ. న: చూ, దూదిప్రోగు.

గ్రీష్మాతిరీటము, సం. వి. అ. పుం: చూ, లొద్దుగు *.

గ్రీష్మి, సం. వి. ఈ. స్త్రీ: చూ, విరజాజి *.

గ్రీష్మోద్భవ, సం. వి. ఆ. స్త్రీ.—పై.—

## గ్రు

గ్రుక్క, దే. వి. 1. గ్రసనము. రూ - గుక్క. మ్రింగుట: చూ, మ్రింగుడు; 2. ఊపిరి, రూ- గుక్క: చూ, శ్వాసము.

గ్రుక్కకొను, ద్వ. అ. క్రి: చూ, మ్రింగు.

గ్రుక్కలుమ్రింగు, దే. అ. క్రి. 1. అపేక్షపడు; చూ, వాంఛించు; 2: చూ, రూ-గుటకలుమ్రింగు; 3: చూ, సంకోచించు.

గ్రుక్కిలి, దే. వి: చూ, గ్రుక్క.

గ్రుక్కిళ్లుమ్రింగు, దే. అ. క్రి. 1. అపేక్షపడు. కళా. ౫, ఆ. 137: చూ, వాంఛించు; 2: చూ, సంకోచించు.

గ్రుక్కిళ్లుమ్రింగుట, జా. ఆశపడియుండుట. "నేనిప్పుడు నీపొందునకే గ్రుక్కిళ్ళుమ్రింగుచుందును". (నీతిచంద్రి. విగ్రహము.)

గ్రుక్కుమిక్కను, దే. అ. క్రి: చూ, గ్రుక్కిళ్లుమ్రింగు.

గ్రుక్కుమిక్కుమను, — పై.— (సంకోచించు. —ప్రభా. 1, ఆ. 28.)

గ్రుక్కెఁడు, వా. వి: చూ, నోరెఁడు.

గ్రుచ్చు, దే. స. క్రి. 1. నాటు. అం, భా. తృ. 122; భాగ. 4, స్కం. 326: చూ, మొలవేయు (అ. క్రి. అసి. శ. ర); అం. ప్రే. 2. నాటించు: చూ, నాటు; 3. తూఁటజేయు, తూర్పు "సూదిని దారము గ్రుచ్చుము": చూ, తూఱుచు.

గ్రుడ్డి, దే. వి. 1. అంధకుఁడు: చూ, రేచీకు; 2. అంధభావము. అం. భా. ద్వి. 124: చూ, చీఁకు.

గ్రుడ్డింగిలాయి, దే. వి. (గ్రుడ్డి + ఇంగిలాయి) ఒకరకము ఇంగిలాయి: చూ, మత్స్యము. 1.

గ్రుడ్డికామంచి, దే. వి. గొడుగుగడ్డి*: చూ, తృణము 1.

గ్రుడ్డికొక్కరాయి, ద్వ వి కోయష్టికము: చూ, బకము.

గ్రుడ్డితనము, దే. వి: చూ, చీఁకు.

గ్రుడ్డిపాటు, దే. విణ. (గ్రుడ్డి + పాటు) దైవమువలనఁ గలిగినది. "వాని కీపని గ్రుడ్డిపాటుగా కలిగినది": చూ, దైవికము.

గ్రుడ్డు, దే. వి. 1. గ్రుడ్డితనము: చూ, చీఁకు; 2. రూ - గుడ్డు. కనుగ్రుడ్డు: చూ, లోచనము 1; 3. రూ-గుడ్డు. పక్షి

లోనగువాని అండము. అచ్చ. యు, కాం. 302: చూ, పేశీకోశము.
గ్రుడ్డుకానుపు, దే. వి. 1. పాము. అచ్చ. బాల, కాం. 3: చూ, సర్పము; 2. పిట్ట: చూ, పక్షి (దీనికి సరియైన సంస్కృత శబ్దము అండజము.)
గ్రుడ్లగూబ, ద్వ, వి. ఘూకము: చూ, సకినంపుఁ బులుగు.
గ్ర్రుద్దు, దే. వి. 1. పిడికిటి పోటు: చూ, యుద్ధము; స. క్రి. 2. పిడికిటితో పొడుచు: చూ, చదుము.
గ్ర్రుద్దులాట, దే. వి. ముష్టియుద్ధము. ఆం, భా. ద్వి. 222: చూ, యుద్ధము.
గ్ర్రుద్దులాడు, దే. అ. క్రి, స. క్రి. (అని కొందఱు) (గుద్దులు + ఆడు). రూ-గుద్దులాడు: చూ, పోట్లాడు.

## గ్రే

గ్రేటు, దే. వి. గద్గదకంఠసాధుధ్వని: చూ, స్వరము. 2-౪౬-౩౨).
గ్రేణి, దే. వి. పరిహాసము: చూ, విలాసము. 1.

## గ్రై

గ్రైవము, సం. వి. అ. న. మెడత్రాడు: చూ, భూషణము. 2-౬-(౫). మెడను బెట్టెడు సొమ్ము: చూ, సూత్రము. 1.—౩౨.
గ్రైవేయకము, — పై.—
గ్రైవేయము, — పై.—
గ్రైష్మి, సం. వి. ఈ. స్త్రీ: చూ, గ్రీష్మ*.

## గ్రొ

గ్రొచ్చు, దే. ప్రే. గుద్దలిలోనగువానితో పల్లముచేయు.
గ్రొయ్యు. దే. అ. క్రి. పల్లముపడు.

## గ్రో

గ్రోవులు, దే. వి. బ. భూషణవిశేషము. చూ, భూషణము. 2.

## గ్ల

గ్లస్తము, సం. విణ. తినఁబడినది; చూ, భక్షితము.
గ్లహము, సం. వి. అ పుం. జూదమునందలి పందెము; చూ, వ్యవహారము. 4.

## గ్లా

గ్లాన, అం: చూ, సంచారీభావముసఁ బుట్టిన దృష్టులు.
గ్లాని, సం. వి. ఇ. స్త్రీ. 1. శ్రమముచేతఁ గలిగిన దౌర్బల్యము: చూ, నిస్సత్తువ; అం. 2: చూ, సంచారీభావములు. (ఉదా— తొల్లి పూబంతులం జేఁబూనుటకైన నలపొందు నయ్యింధ్రుఁ వదన కొండకంటెను బరువగు నవ్వలపు నెట్లు సైరించుచుండు నోగదా.)
గ్లానుఁడు, సం. విణ: చూ, వ్యాధితుఁడు. 2.
గ్లాసు, వా. వి. అద్దపుపాత్ర: చూ, ముకురము.
గ్లాస్నుఁడు, సం. విణ. ఉ: చూ, రూ-గ్లానుఁడు.
గ్లాస్నువు, — పై.—

## గ్లౌ

గ్లౌ, సం. వి ఔ. పుం. 1. కర్పూరము: చూ, సిరము; 2. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

## ఘ

ఘ, ఒకయక్షరము, సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. వేఁడి: చూ, వేఁడిమి; 3. బ. చిఱుగజ్జెలు: చూ, భూషణము. 2; 4. చిఱుగంట: చూ, భూషణము. 2; 5. గట్టించుట: చూ, దట్టింపు; 6. ముక్కంటి: చూ, శివుఁడు; 7. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు; న. 8. వాద్యము (వీణె లోనగునది): చూ, వీణె; 9. అమృతము: చూ, సుధ. 1; అ స్త్రీ. 10. నేల: చూ, భూమి. 1; 11. కబురు: చూ, సమాచారము. 2; 12. గొల్లపల్లె: చూ, దేశము; 13 అమ్ము. (పుం. అని కొందఱు): చూ, బాణము. 1; అం. 14: చూ, కంఠ్యములు.
ఘంట, సం. వి. ఆ. స్త్రీ. 1.＝గంట: చూ, గంట. 1: (చూ, కాలపరిమాణము); 2. ఒకానొక రాగము: చూ, స్వరము. 2-౪౬-(౭౭; 3. ＝ గంట. పిడిగంట యను వాద్యము: చూ, వీణ. 1-౨౩; 4: చూ, మొక్కము*; 5. బదరి*: చూ, రేఁగు; 6. పూగము*: చూ, పోఁక; అం. 7: చూ, ప్రణవనాదములు.
ఘంటాపథము, సం. వి. అ. పుం 1. వంసరణము, ఘంటలతోఁ గూడిన యేనుఁగుల దారి: చూ, మార్గము. 1; న. 2. ముక్కువైపు కొలికి: చూ, ముక్కుకొలికి.
ఘంటాపాటలము, సం. వి. అ. పుం: చూ, మొక్కము*.
ఘంటాపాటలి, సం. వి. ఇ. పుం.రూ - —పై.—
ఘంటాభిద, సం. వి. ఆ. స్త్రీ: చూ, నాదాలాబువు*.
ఘంటారవ. సం. వి. అ. స్త్రీ. 1: చూ, గిలిగింత*; 2. బ. చిఱుగజ్జెలు: చూ, భూషణము. 2.
ఘంటారవము, సం. వి. అ. పుం: చూ, రాబందు.
ఘంటావధానము, అం: చూ, కళలు.
ఘంటాశీర్షుఁడు, సం. వి. అ. పుం: చూ, వైతాళికుఁడు.
ఘంటిక, సం. వి. ఆ. స్త్రీ. 1. గొంతుముడి: చూ, ముడి. 5; అం. 2: చూ, చక్రములు; 3: చూ, ఘనవాద్యములు.
ఘండము, సం. వి. అ. పుం: చూ, భ్రమరము.
ఘట, సం వి. ఆ. స్త్రీ. 1. గుంపు: చూ, సమూహము; 2. ఏనుఁగుల గుంపు: చూ, హస్తి. 1-(౫౨); 3. ఘటనము,

రెండు మూఁడు మాఱులు ఏనుగును దట్టుట (అని కొందఱు): చూ, సంధానము. 1; 4 గోష్ఠి: చూ, సభ. 2.

ఘటకుఁడు, సం. విణ. ఘటిల్లఁజేయువాఁడు.

ఘటచక్రము, సం. వి. అ. న. రతిబంధవిశేషము: చూ, రతిబంధములు.

ఘటప్పదము, సం. వి. అ. పుం. మునగ *: చూ, శిగ్రువు. 1.

ఘటదాసి, సం. వి. ఈ. స్త్రీ. విటీవిటులను తార్చెడియింతి: చూ, శంభళి.

ఘటన, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, ఘట. 3; 2. కూర్పు: చూ, సంధానము. 1.

ఘటము, సం. వి. అ. న. 1. ఎళనీరుకాయ, నారికడపుమొవ్వ (అని కొందఱు): చూ, ముక్కంటిపండు; పుం. 2. = కడవ. రూ-ఘటి: చూ, భాండము. 3; 3. ఏనుఁగు కుంభస్థలము: చూ, హస్తి. 1-(౬౩) 4. శిఖరము: చూ, సుద. 3; 5. పాడునుయ్యి: చూ, సరస్సు. 1-౧౫-(౧; 6: ఊపిరి లోనికిఁదీసి నిలుపుట: చూ, ధ్యానము; 7. నీలాటిరేవు: చూ, రేవు; 8. ఎగుమతిదిగుమతుల చోటు: చూ, రేవు; 9. గరగ. "నూకాలమ్మ ఘటము": చూ, పాత్రము. 6.

ఘటయంత్రము, సం. వి. అ. న. 1. నూతిగిలక: చూ, రాట్నము; 2: చూ, ఏతము. (1).

ఘటయోని, సం. వి. ఇ. పుం. అగస్త్యముని: చూ, సన్న్యాసి.1.

ఘటశాసి, సం. వి. న్. పుం; చూ, తార్కికుఁడు.

ఘటానాంనిర్మాతు త్రిభువనవిధాతుశ్చ కలహః, న్యా. కుండలను జేయు కుమ్మరికిని ముల్లోకములను సృజించు బ్రహ్మకును గలహము. అనఁగాఁ గుమ్మరి బ్రహ్మదేవునిపయి స్పర్థించుచున్నాఁడని.

ఘటి, సం. వి. ఈ. స్త్రీ 1. ఉల్లిపాషాణము: చూ, సౌవీరము. 2; 2. కుండ: చూ, భాండము. 3-౧౦; 3. పిడత: చూ, భాండము. 3; 4. నీలమండ బుడిపి: చూ, నీలమండ; 5. = గడియ. రూ - ఘటి: చూ, గడియ. 1; 6. ఢక్కయను వాద్యము: చూ, వీణ. 1-౬౦.

ఘటిక, సం. వి. ఆ. స్త్రీ. 1. = గడియ. రూ - ఘటి. ఇరువది నాలుగు నిమిషములకాలము; చూ, గడియ. 1; 2. = గడియ. గడెమాను: చూ, విష్కంభము. 2; 3: చూ, బలపము; 4. కుహళి: చూ, పోఁకపొత్తి; 5. పాలడాయి: చూ, రత్నములు. 1-౧౨-(౬౩); 6. నీలమండబుడిపి: చూ, నీలమండ; 7. తెప్ప: చూ, హోడము; 8. గోమేధసన్నిభము: చూ, రత్నములు. 1-౧౨-(౭౯.)

ఘటితము, సం. వి. అ. న. 1. ఏనుఁగులగుంపు: చూ, హస్తి; 1-(౩౨); విణ. 2. బద్ధలుచేయఁబడినది: చూ, పాటితము; 3. గ్రువ్వఁబడినది: చూ, స్యూతము; అం. 4: చూ, చుంబనములు.

ఘటికారము, సం. వి. అ. పుం. = : చూ, రూ- ఘటీకారము.

ఘటికాసిద్ధి, అం: చూ, కళలు.

ఘటిని, సం. వి. ఈ. స్త్రీ. ఉల్లిపాషాణము: చూ, సౌవీరము. 2.

ఘటిల్లు, సం. అ. క్రి. కలుగు: చూ, పుట్టు. 2.

ఘటీకారము, సం. వి. అ. పుం. = గడియారము. కాలసూచకయంత్రము: చూ, గడియారము.

ఘటీకారుఁడు, సం. వి. అ. పుం: చూ, మృత్కారుఁడు.

ఘటీయంత్రన్యాయము, న్యా. ఏతమువలె కార్యమగునంతవఱకు వంగియుండి కార్యము కాఁగానే మీఁదికి నిక్కురీతి.

ఘటీయంత్రము, సం. వి. అ. న: చూ, రూ - ఘటయంత్రము.

ఘటోత్కచాంతకుఁడు, సం. వి. అ. పుం. కర్ణుఁడు. చూ, రాధేయుఁడు.

ఘటోద్దిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఘటదాసి.

ఘటోదకము, సం. వి. అ. పుం. కొబ్బరి*: చూ, స్కంధఫలము.

ఘటోదరము, సం. వి. అ. న. దౌర్భాగ్యలక్షణము: చూ, లక్షణము. 1-౨౨.

ఘటోద్భవుఁడు, సం. వి. అ. పుం. అగస్త్యముని: చూ, సన్న్యాసి. 1.

ఘట్టకుటీప్రభాతన్యాయము, న్యా. ఒక వ్యవహారస్థుఁ డొక పట్టణము చేరి తనవ్యవహారము చేసికొని పోవునప్పుడా పట్టణములోని ఘాటీపాకదగ్గఱనుండి వెళ్ళినచో సుంకమీయవలసివచ్చునని యర్ధరాత్రివేళ మాఱుత్రోవను బోవలయునను తలంపుతోఁ బయలుదేరి యా పట్టణము సందులుగొందులు తిరిగి త్రోవ తెలియక తుదకు ఘాటీపాకదగ్గఱకుఁ జేరునప్పటికిఁ దెల్లవాఱినది. కనుక ఆయాసపడుటయు, సుంకమీయక తప్పక వచ్చెననుటయు నను విధము. (తప్పించుకొన నుద్దేశించిన కార్యము చేయవలసి వచ్చినయెడల నిది చెప్పఁబడును.)

ఘట్టిగ, సం. వి. ఆ. స్త్రీ 1. మాషపర్ణి *: చూ, మినుము; 2: చూ, రుద్రజడ*.

ఘట్టన, సం. వి. ఆ. స్త్రీ. = గట్టన. చూ, దిమ్మిస.

ఘట్టము, సం. వి. అ. పుం. 1. = గట్టు. తీరము: చూ, రోదస్సు; 2. సుంకము మొదలైనవి తీయుచోటు: చూ, సదనము, 1; 3. వనగిరిప్రాయదేశము; 4. రామాయణాదులలోని శ్రేష్ఠమగు కథాభాగము: చూ, పట్టు. 14; 5. స్నానముల రేవు: చూ, సరస్సు. 1-౧౧,

ఘట్టితము, సం. విణ. 1. గట్టింపఁబడినది; అం. 2; చూ, స్థితకరణబంధములు: (చూ, బంధములు.)

ఘతనుఁడు, సం. విణ: చూ, భక్షకుఁడు.

ఘన, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, మినుము*; 2: చూ, రుద్రజడ*; వా. 3. పనసయొక్క ఆవృత్తి: చూ, మరలు బాటు.

ఘనకాలము, సం. వి. అ. పుం. వర్షర్తువు (శ్రావణ భాద్రపద మాసములు): చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)

ఘనకుకము, సం. వి. అ. పుం: చూ, వడగల్లు.

ఘనచ్ఛాయ, సం. వి. ఆ. స్త్రీ. చింత *: చూ, తింత్రిణీ.

ఘనజంబాలము, సం. వి. అ. న. గొప్పబురద: చూ, బురద.

ఘనడిండిమము, సం. వి. అ. పుం. కాకిదొండ*: చూ, దొండ.

ఘనతాలము, సం. వి. అ. పుం: చూ, వానకోయిల.

ఘనత్వక్కు, సం. వి. చ్. పుం: చూ, లొద్దుగు*.

ఘననామకము, సం. వి. అ. పుం. చిట్టి*: చూ, భండీరము. 2.

ఘనపల్లవము, సం. వి. అ. పుం. చూ, శిగ్రువు. 1.
ఘనపుష్పము, సం. వి. అ. పుం.—పై.—
ఘనమగు, మి. అ. క్రి. దట్టమగు చూ, వ్యాపించు.
ఘనము, సం. వి. అ. న. 1. నృత్యాది మధ్యమానము (విలంబిత - ద్రుత - మధ్యంబులనెడి లయ విశేషములు వరుసగా తత్త్వ, ఓఘ, ఘనము లనంబడును): చూ, స్వరము. 2-౩౧; 2-౨౧. (2-౨-(౧)౹): (చూ, తాళము. 2); 2. కంచు తాళము లోనగు వాద్యము: చూ, వీణ. 1-౯౬; 3. నడిమి పెరుగు: చూ, స్తన్యము. 1-౨౦. పుం. 4. తుంగముస్తె*: చూ, ముస్తకము; 5: చూ, లొద్దుగు*; 6. దిటవు: చూ, శక్తి. 1; 7. రూ - ఘనాఘనము. మబ్బు: చూ, మేఘము. 1. (అగ్నివలనఁ బుట్టిన భయంకరమగు మేఘము); 8. = గసము పరివి: చూ, విస్తారము. 1; 9: చూ, సమ్మెట; 10. కుఱుచయినుపముద్దు: చూ, ముద్గరము; 11. వర్గ తిరిగి గుణించుట (ఘనపరిమాణము. = పొడవు × వెడల్పు × ఎత్తు): చూ, హెచ్చవేత; విణ. 12. దట్టమైనది: చూ, సాంద్రము. 2; 13. దిటవుగలది: చూ, వ్యాయతము. 1; అం. 14: చూ, గానశాస్త్ర పండితుఁడు; 5: చూ, ఆతోద్యము.
ఘనమూలము, సం. వి. అ. పుం. చెఱకు*: చూ, సుకుమారము. 1-౬.
ఘనరవము, సం. వి. అ. పుం: చూ, రాబందు.
ఘనరసము, సం. వి. అ. పుం. 1. నీరు: చూ, సలిలము; 2. కర్పూరము: చూ, సిరము: 3. గుళిక: చూ, పూస; 4. చెట్టుబంక: చూ, బంధన; 5. చల్ల: చూ, మజ్జిగ; 6. చాగ *: చూ, స్రవ; విణ. 7. దట్టమైనది: చూ, సాంద్రము. 2.
ఘనవల్లిక, సం. వి. ఆ. స్త్రీ. మెఱపు: చూ, విద్యుత్తు. 1.
ఘనవాతము, సం. వి. అ. పుం. నరకభేదము: చూ, నరకములు.
ఘనవాద్యములు, అం. కాంస్యతాళము, తాళిక, ఘంటిక, జయఘంట, క్షుద్రఘంట, కర్ర. (6).
ఘనవాసము, సం. వి. అ. పుం. గుమ్మడి *: చూ, మహాఫలము.
ఘనవాహనుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, వేలుపుతేఁడు.
ఘనశ్రోణి, సం. వి. ఈ. స్త్రీ. నేల: చూ, భూమి. 1.
ఘనసారతరువు, సం. వి. ఉ. పుం. కర్పూరపు అరఁటి*: చూ, రంభ. 1.
ఘనసారము, సం. వి. అ. పుం. 1. కర్పూరము: చూ, సిరము; 2. గాడిద: చూ, రాసభము; 3. నీరు: చూ, సలిలము.
ఘనస్వరము. సం. వి. అ. పుం. 1. చిట్టికూర *: చూ, భండీరము; 2. ఉఱుము: చూ, స్తనితము.
ఘనాకరము, సం. వి. అ. పుం: చూ, ఘనకాలము.
ఘనాఘనము, సం. వి. అ. పుం. 1. కురియునట్టి మేఘము, తొలుమొగులు: చూ, మేఘము. 1; 2. హింసించునట్టి మదపుటేనుఁగు: చూ, హస్తి. 1-(౭౪); 3. కొండ: చూ, పర్వతము; 4. ఐశ్వర్యము: చూ, సంపత్తి; 5. కవాటము: చూ, తలుపు; విణ. 6. దట్టము: చూ, సాంద్రము. 2.
ఘనాఘనుఁడు, సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు: చూ, వేలుపుతేఁడు; 2. దానశీలుఁడు: చూ, వదాన్యుఁడు; 3. దుర్మార్గుఁడు: చూ, వ్యాఘుఁడు. 2.
ఘనాత్యయము, సం. వి. అ. పుం. శరత్కాలము (ఆశ్వయుజము - కార్తికము): చూ, మాసద్వయము: (చూ, ఋతువులు.)
ఘనపాఠి, వా. వి. వేదాధ్యయనసంపన్నుఁడు.
ఘనాశ్రయము, సం. వి. అ. పుం: చూ, విన్ను.
ఘనీభవించు, సం. అ. క్రి: చూ, ముద్దకట్టు.
ఘనుఁడు, సం. విణ. గొప్పవాఁడు: చూ, హెచ్చుహేములు.
ఘనోదధి, సం. వి ఇ. పుం. నరకభేదము: చూ, నరకములు.
ఘనోపలము, సం. వి. అ. పుం. చూ, వడగల్లు.
ఘంటి, అం: చూ, స్వరము. 2-౪౪.
ఘరట్టన్యాయము, న్యా. తిరుగలిదిమ్మలు తిరుగునదియు తిరుగనిదియు రెండు నుండినఁగాని ఒక్కటిరిగేవానితో నేపని నెఱవేఱదను రీతి.
ఘరట్టము, సం: వి. అ. పుం: చూ, తిరుగలి.
ఘర్ఘటము. సం. వి. అ. పుం. ఘర్ఘటమను చేప: చూ, మత్స్యము. 1.
ఘర్ఘర, సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱపుమెడగంట: చూ, హయము. 1-౩౦: (చూ, గ్రీవాపుంట).
ఘర్ఘరకము, సం. వి. అ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.
ఘర్ఘరము, సం. వి. అ. పుం. 1. రూ - - పై-; 2. కొండవారి: చూ, మార్గము. 1; 3. గర్భమున్మ్రోఁత: చూ, స్వరము. 2. - ౪౬-(౫౨); 4. వాకిలి, ద్విత్రితలకవాటము (అని కొందఱు): చూ, సదనము. 1; 5. అమృతరసమువలనఁ బుట్టిననవ్వు: చూ, హాస్యము. 1; 6. వానకురియు చప్పుడు: చూ, స్వరము. 2.—౪౬-(౩౧; 7. ఉఱుము: చూ, స్తనితము; 8. వాద్యభేదము: చూ, వీణ. 1.-౨౪.
ఘర్ఘరి, సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుగంట: చూ, భూషణము. 2; 2. ఒకరకము వీణె: చూ, వీణ. 1-౨౪; 3. ఒకానొక స్వరము: చూ, స్వరము. 2.—౪౬-(౧౧౨).
ఘర్ఘరిక, సం. వి. ఆ. స్త్రీ. ఘర్ఘరికానది: చూ, నది.
ఘర్ఘర, సం. వి. ఆ. స్త్రీ: చూ, యమకీటకము.
ఘర్ఘరకము, సం. వి. అ. పుం: చూ, ఘర్ఘరకము.
ఘర్ఘరిక, సం. వి. ఆ. స్త్రీ. 1. వాయించెడికట్టె: చూ. కొమ్మువు. 1; 2. భేరీవాద్యము: చూ, వీణ. 1-౨౪; 3: చూ, ఘర్ఘరిక.
ఘర్మము, సం. వి. అ. పుం. 1. ఎండ: చూ, వెలుఁగు. 3; 2. చెమట: చూ, స్వేదము. 1; 3. ఏనుఁగు హృదయమునందలి మదము: చూ, మదము. 1; 4: చూ, వేఁడిమి; 5. వేసంగి, గ్రీష్మర్తువు (జ్యేష్ఠము, ఆషాఢము): చూ, మాసద్వయము: (చూ, ఋతువులు); అం. 6: చూ, గజమదములు.
ఘర్షణము, సం. వి. అ. న: చూ. పీడనము.
ఘర్షణాలము, సం. వి. అ. పుం. నూఱెడుగుండు: చూ, రత్నములు 1-౧౨-(౧౦).

ఘర్షణీ, సం. వి. ఈ. స్త్రీ. పసుపు: చూ, వర్ణము. 6.—ఇ.
ఘర్షించు, సం. స. క్రి: చూ, రాయిడిచేయు.
ఘల్లరీముఖము, అం. రతిబంధవిశేషము; చూ, రతిబంధములు.
ఘసి, సం. వి. ఇ. పుం. ఆహారము: చూ, సాపాటు.
ఘస్మరుఁడు, సం. విణ: చూ, భక్షకుఁడు.
ఘస్రము, సం. వి. అ. పుం. 1. దినము: చూ, రోజు; న. 2. అహము: చూ, పగలు; 3. కుంకుమము: చూ, వహ్నిశిఖము. 1; విణ. 4. కర్కశము, చంపునది: చూ, హింస్ర.
ఘస్రుఁడు, సం. విణ. హింసించువాఁడు.

## ఘా

ఘా. సం. వి. ఆ. స్త్రీ. గంట, లట్వ: చూ, వీణ. 1-౭౬-(౧).
ఘాంటికము, సం. వి. అ. పుం. ఉమ్మెత్త*: చూ, హాలా పుష్పము.
ఘాంటికుఁడు, సం. వి. అ.పుం. వేకువను రాజుల నిద్రమేల్కొలి పెడువాఁడు: చూ, వైతాళికుఁడు. (రూ-ఘాటికుఁడు).
ఘాట, సం. వి. ఆ. స్త్రీ: అవటువు: చూ, పెడతల.
ఘాటము, సం. వి. అ. పుం. —పై.—
ఘాటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, ఘాట.
ఘాటిక, సం. వి. ఆ. స్త్రీ. —పై.—
ఘాటికుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ - ఘాంటికుఁడు.
ఘాటియాబ్రాహ్మణులు, అం. వీరు కృష్ణశుక్ల యజుర్వేదులుగ నున్నారు. గంగావైతరణీ మొదలగు పుణ్యనదీ స్నానములకు వచ్చెడి వారలకు వైదికకర్మములను చేయించి జీవనము చేయుదురు: చూ, బ్రాహ్మణులు.
ఘాటీపాక, వా. మి. వి. సుంకము వసూలుచేయు యిల్లు (ఘాటీ అనియు): చూ, సదనము. 1.
ఘాతకుఁడు, సం. విణ: చూ, హింసకుఁడు.
ఘాతము, సం. వి. అ. పుం. 1. దెబ్బ: చూ, మొత్తు. 1; 2. అమ్ము: చూ, బాణము. 1; 3. చంపుట: చూ, వధము; 4. కొనేరు: చూ, సరస్సు. 1; వా. 5. శక్తి.
ఘాతి, సం. వి. న్. పుం. డేగ: చూ, శ్యేనము.
ఘాతించు, సం. స. క్రి. చంపు: చూ, సంహరించు.
ఘాతిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, పరిఖ.
ఘాతెని, సం. విణ. (ఈ). చంపునట్టిది: చూ, హింసని.
ఘాతుకుఁడు, సం. విణ. 1: చూ, రూ - ఘాతకుఁడు; 2: చూ, పాపుఁడు.
ఘామము, సం. వి. అ. పుం. ఆకసము: చూ, విన్ను.
ఘాముఁడు, సం. వి. అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.
ఘారిక, సం. వి. ఆ. స్త్రీ.＝గారె. అప్పాలు (అనికొందఱు) (ఘారి అనియు): చూ, భక్ష్యము.
ఘాసము, సం. వి. అ. పుం.＝కసవు: చూ, తృణము. 1.
ఘాసి, సం. వి. ఇ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

## ఘి

ఘిమిరియాబ్రాహ్మణులు, అం. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

## ఘీ

ఘీంకారము, సం వి. అ. పుం.＝గీఁక. ఏనుఁగు గీఁక: చూ, స్వరము. 2—౭౬—(౧౧౬).
ఘీంకృతము, సం. వి. అ. న. —పై.—
ఘీంకృతి, సం. వి. ఇ. స్త్రీ. —పై.—

## ఘు

ఘు, సం. వి. ఉ. పుం. చప్పుడు: చూ, స్వరము. 2.
ఘుంటకము, సం. వి. అ. పుం: చూ, నీలమండ.
ఘుంటము, సం. వి. అ. పుం.-రూ-—పై.—
ఘుండము, సం. వి. అ. పుం: చూ, భ్రమరము. 1.
ఘుటము, సం. వి. అ. పుం. రూ-ఘుటిక: చూ, నీలమండ.
ఘుటి, సం. వి. ఇ. స్త్రీ. 1. గుదికాలు: చూ, మడమ; 2: చూ, నీలమండ.
ఘుటిక, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, రూ-ఘుటము; 2.＝గుళిక: చూ, పూస; 3. చిన్నమందుంట: చూ, మాత్ర. (1).
ఘుణప్రియ, సం. వి. ఆ. స్త్రీ. అతివస*: చూ, విష.
ఘుణము, సం. వి. అ. పుం. మ్రానితొలుచు పురుగు: చూ, పురుగు.
ఘుణవల్లభ, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఘుణప్రియ.
ఘుణాక్షరన్యాయము, న్యా. మ్రానియందు మసిపురుగులు తొలువఁగా నేర్పడిన యక్షరముయొక్క న్యాయము. (ఇది యప్రయత్నముగా నేర్పడిన దిగాని పురుగుయొక్క ప్రయత్నము చేతఁగాదు, ఉద్దేశము లేక జరిగినదానియందిది చెప్పఁబడును.)
ఘుర్ఘురము, సం. వి. అ. పుం. 1.＝గురగుర. పందికూఁత: చూ, స్వరము. 2-౭౬—(౧౨౨); 2. ఘుర్ఘురమను పురుగు: చూ, యమకీటకము.
ఘుర్ఘురి, సం. వి. ఈ. స్త్రీ. 1. పంది. ఒకానొక జలజంతువు: చూ, మృత్కిర. సూకరము; 2. మండలియను వాద్యము: చూ, వీణ.
ఘుర్ఘురించు, సం. అ. క్రి. (పంది) కూయు: చూ, శబ్దించు. 1-౧౦.
ఘుర్మరము, సం. వి. అ. పుం. కుమ్మరపురుగు: చూ, యమకీటకము.
ఘులఘులారవము. సం. వి. అ. పుం. పారావతభేదము: చూ, పావురము.
ఘుష్టము, సం. విణ. చాటింపఁబడినది: చూ, వ్యాప్తము.
ఘుసృణము, సం. వి. అ. పుం. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము.

## ఘూ

ఘూకమార్జాలలోచనము, అం. ఎనమండ్ర మగండ్రను జంపెడు స్త్రీగుఱుతు. అనఁగా ఎనిమిది మనువులు పోవు మగువ, భర్తృహంత్రీలక్షణము : చూ, లక్షణము. 1-౩౨.
ఘూకము, సం. వి. అ. పుం. = గూబ: చూ, సకినంపుఁబులుఁగు.
ఘూకారి, సం. వి ఇ. పుం. కాకి: చూ, వాయసము. 1.
ఘూకావాసము, సం. వి. అ పుం. పెద్దపేఁకు*: చూ, శాకోటము.
ఘూర్జరబ్రాహ్మణులు, అం. ఉత్తరమున కచ్ఛ సింధుశాఖయు, పశ్చిమమున సముద్రమును, దక్షిణమున కాంబేసింధుశాఖయు, తూర్పున అంబా భవాని మొదలు నర్మదానదీవఱకుండు కనుమలవఱకును గల దేశము ఘూర్జరదేశము. వింధ్యపర్వతమునకును నర్మదానదమునకును ఉత్తరమునందుండు విస్తారప్రదేశము ఘూర్జరములోఁ జేరియుండినను ఇందలి బ్రాహ్మణులు ఘూర్జరులనంబడి పంచద్రావిడులలోఁ జేరినవారైయున్నారు. వీరిలో అగస్త్యులవారు అను బ్రాహ్మణులు, అక్షయమంగళులను బ్రాహ్మణులు, అనావలులను బ్రాహ్మణులు, ఔదీచ్యబ్రాహ్మణులు, కపిలబ్రాహ్మణులు, ఖదాయతీ బ్రాహ్మణులు, ఖేడావాలురను బ్రాహ్మణులు, గయావళీబ్రాహ్మణులు, గుగలీబ్రాహ్మణులు, గోమతీవాలురను బ్రాహ్మణులు, చావిషులనుబ్రాహ్మణులు, జంబుబ్రాహ్మణులు, ఝాలోరాబ్రాహ్మణులు, తపోధనులను బ్రాహ్మణులు, తలాజీయబ్రాహ్మణులు, దధీచిబ్రాహ్మణులు, నర్సిపదబ్రాహ్మణులు, పారాశర్యబ్రాహ్మణులు, ప్రేతవాలురను బ్రాహ్మణులు, భార్గవబ్రాహ్మణులు, మోతాలల్‌అనుబ్రాహ్మణులు, యాజ్ఞికవాలురనుబ్రాహ్మణులు, రజవాలురనుబ్రాహ్మణులు, వటులులనుబ్రాహ్మణులు, వళాందబ్రాహ్మణులు, వాల్మీకబ్రాహ్మణులు, శ్రీమాళిబ్రాహ్మణులు, సజూద్రాబ్రాహ్మణులు, ఇత్యాది : (చూ, బ్రాహ్మణులు).
ఘూర్జరము, సం. వి. అ. పుం. = గుజరి - గుజరాతి: చూ, దేశములు.
ఘూర్జరస్త్రీ, అం: చూ, దేశస్త్రీలు: చూ, స్త్రీ. 1-3.
ఘూర్జరి, అం. 1: స్త్రీ: చూ, స్త్రీరాగములు; 2: చూ, పంచమిజభాషలు: (చూ, భాష. 1.)
ఘూర్జర్యుపాంగములు, అం: (చూ, అంగము. 9) మహారాష్ట్రి ఘూర్జరి, సౌరాష్ట్రి, దక్షిణ, ద్రావిడ. (4).
ఘూర్ణనము, సం. వి. అ. న. తిరుగుట : చూ, మర.
ఘూర్ణి, సం. వి. ఇ. స్త్రీ. గిరగిరతిరగడము : చూ, విహారము. 1.
ఘూర్ణితము. సం. విణ. 1. తిరుగుడుపడినది: ఆఘూర్ణితము, ఆవృత్తము, ఉద్భ్రాంతము; 2. కూరుకుపాటుపడినది : చూ, స్వప్నము. 2.
ఘూర్ణితుఁడు, సం. విణ: చూ, ప్రచలాయితుఁడు.
ఘూర్ణిల్లు, సం. అ. క్రి. తిరుగుడుపడు: చూ, పరిభ్రమించు.

## ఘృ

ఘృణ, సం. వి. ఆ. స్త్రీ. 1. కనికరము : చూ, దయ: 2. అసహ్యత: చూ, రోఁత. 2.
ఘృణావాసము, సం. వి. అ. పుం. గుమ్మడి*: చూ, మహాఫలము.
ఘృణి, సం. వి. ఇ. పుం కిరణము : చూ, హాయనము. 2.
ఘృతకుమారి, సం. వి. ఈ. స్త్రీ. గృహకన్య.
ఘృతకోశాతకి, సం. వి. ఈ స్త్రీ. నేతిబీఱ*: చూ, బీఱ. 2.
ఘృతకోశాతకీన్యాయము, న్యా. నేతిబీఱకాయ యని పేరేగాని అందులో నేయిలేదు సరేకదా ఉప్పయినుండుననుక్తి.
ఘృతదీధితి, సం. వి. ఇ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.
ఘృతదీధితి, —పై.—
ఘృతధూపకము, సం. వి. అ. పుం: చూ, వృకధూమకము*.
ఘృతపత్రకము, సం. వి. అ. పుం: చూ, పూతికరజము*.
ఘృతపూర్ణకము, సం. వి. అ. పుం: చూ, రాజాన్నము. 1-౨౪.
ఘృతమండ, సం. వి. ఆ. స్త్రీ: చూ, వాయసోలి*.
ఘృతమండలిక. సం. వి. ఆ స్త్రీ: చూ, హంసపాది*.
ఘృతమంథ, —పై.—
ఘృతము, సం. వి. అ. న. 1. నెయ్యి: చూ, హవిస్సు. 2; 2. నీరు: చూ, సలిలము; 3. క్షీరము. పాలు: చూ, స్తన్యము. 1-౧; విణ. 4. వెలిఁగినది: చూ, దీప్తము. 1; అం 5: చూ, దానములు.
ఘృతాంకము, సం. వి. అ. న. పాలమడ్డి: చూ, సరళద్రవము.
ఘృతేళిక, సం. వి. ఆ స్త్రీ. ఎఱ్ఱచీమ: చూ, పిపీలిక.
ఘృతోదము, సం. వి. అ. పుం. నేతిసముద్రము: చూ, సముద్రము.
ఘృష్టకము, సం. వి. అ. న. 1. కౌఁగిలింత: చూ, సంశ్లేషము; అం. 2: చూ, అజాతస్మరాలింగనములు: (చూ, ఆలింగనములు.)
ఘృష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. పాఁచితీఁగ*: చూ, విష్వక్సేనప్రియ; 2. పోటీ: చూ, స్పర్ధ; 3. రాయిడి: చూ, పీడనము; 4. తొలియీఁతయావు, రూ - సృష్టి: చూ, ధేనువు. పుం. 5. కిరణము: చూ, హాయనము. 2; 6. = గూటి. పంది: చూ, సూకరము.

## ఘో

ఘోంట, సం. వి. ఆ స్త్రీ. 1. = గొంటు*: చూ. పోఁక; 2. = గొట్టె. రూ - ఘోటు*: చూ, రేఁగు; 3. రేఁగుపండు : చూ, రేఁగు*.
ఘోంటా ఘుటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రేఁగు*.
ఘోంటాఫలము, సం. వి. అ. న: చూ, పోక*.
ఘోటకబ్రహ్మచర్యము, న్యా. గుఱ్ఱము బ్రహ్మచర్యము సేయుట. అనఁగాఁ జేయదనుట. (ఘోటక బ్రహ్మచర్యము-అజగరోపవాసము-పింగళాజపము-పిల్లిశీలము - బకధ్యానము - నక్కవినయము. ఇవి యన్నియు నసత్యములనుట. వైజ. 2, ఆ. 19.
ఘోటకము, సం. వి. అ. పుం. = గోడా: చూ, హయము.
ఘోటకముఖము, అం: చూ, సప్తాధికరణములు: (చూ, ఔపనిషదికము - కామశాస్త్రము.)
ఘోటజటి, సం. వి. న్. పుం. = గొట్టె*: చూ, రేఁగు.
ఘోటి, సం. వి. ఈ. స్త్రీ. = గోడిగ: చూ, హయము. 1—౧.

ఘోటిక, సం. వి. ఆ. స్త్రీ. = —పై.—
ఘోట్టాణము, సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. ఘోట్టాణమను దేశము: చూ, దేశములు.
ఘోటావుకుఁడు, సం. వి. అ. పుం. (రూ - ఘోటావుక్కుఁడు) అశ్వవిక్రయికుఁడు: చూ, హేలావుకుఁడు.
ఘోణ, సం. వి. ఆ. స్త్రీ. 1. నాసిక: చూ, ముక్కు; 2. గుఱ్ఱపుముక్కు, ప్రోథము: చూ, ముక్కు.
ఘోణము, సం. వి. అ. పుం. గోంతి: చూ, వృషభము. 1.
ఘోణి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఏనికదోమ: చూ, మశకము. 1; 2. నీరుపట్టుయీఁగ: చూ, మక్షిక. 1—౨; న. పుం. 3. = గూటి. పంది: చూ, సూకరము.
ఘోణికాపుత్రము, అం: చూ, ఘోటకముఖము.
ఘోణికాపుత్రుఁడు, సం. వి. అ. పుం. కణాశాస్త్రము చేసిన వాఁడు.
ఘోర, సం. వి. ఆ. స్త్రీ: చూ, రాత్రి.
ఘోరకుఁడు, సం. వి. అ. పుం: చూ, ప్రాతకాఁడు.
ఘోరచర్మనము, సం. వి. అ. పుం 1. పులి: చూ, శార్దూలము; పుం, న. 2. గూబ: చూ, సకినంపుఁబులుఁగు.
ఘోరధ్వని, సం. వి. ఇ. పుం. బడబాగ్ని: చూ, వహ్ని. 1—౨౮.
ఘోరపటము, సం. వి. అ. న. = గోరుపడము. కంబడి: చూ, రల్లకము.
ఘోరపుష్పము, సం. వి. అ. న. కంచు: చూ, లోహము. 1.
ఘోరము, సం. వి. అ. పుం. 1. నక్క: చూ, సృగాలము; 2. జింక: చూ, హరిణము. 1; విణ. 3. = గోరము. భయంకరము: చూ, రౌరవము. 2. (భయానకరసము.)
ఘోరవాసనము, సం. వి. అ. పుం. నక్క: చూ, సృగాలము.
ఘోరరాని, సం. వి. న్. పుం—పై.—
ఘోరరూపిణి, సం. వి. ఈ. స్త్రీ బొమ్మదేవుని విల్లు; చూ, బాణము. 1—౬౦.
ఘోరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; విణ. 2: చూ, భయంకరుఁడు.
ఘోలము, సం. వి. అ. న. రూ - ఘోళము: చూ, మజ్జిగ.
ఘోలి, సం. వి. ఈ. స్త్రీ. 1. రూ - ఘోళి. = గోళి*. చేతరాని: చూ, శకుల; 2. రూ. - ఘోళి. = గోళి. పావలి*: చూ, విచిల్లిక.
ఘోష, సం. వి. ఆ. స్త్రీ 1: చూ, సదావ*; 2. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.—౧; 3. చిట్టికూర *: చూ, భండీరము; 4. చప్పుడు: చూ, స్వరము. 2.
ఘోషకము, సం. వి. అ. పుం. చేఁతిబీఱ *: చూ, బీఱ. 2.
ఘోషకాకృతి, సం. వి. అ. పుం. —.పై.—
ఘోషణ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఉచ్చైర్ఘుష్టము: చూ, బెట్టుసరి; 2. = గోసు: చూ, సాటింపు.
ఘోషము, సం. వి. అ. పుం. 1. గొల్లపల్లె: చూ, దేశము: 2. ఆవులమంద: చూ, ధేనువు; 3. ఉఱుము: చూ, స్తనితము; 4. కంచు: చూ, లోహము. 1; 5: చూ, ఘోషకము*; 6. దోమ: చూ, మశకము. 1.
ఘోషయిత్నువు, సం. వి. ఉ. పుం. 1. బాపఁడు: చూ, బ్రాహ్మణుఁడు; 2. కోయిల: చూ, పికము.
ఘోషవతి, సం. వి. ఈ. స్త్రీ. వల్లకి: చూ, వీణ. 1, (వీణమీఁద పాడుట అని కొందఱు.)
ఘోషాప్రకాశము, సం. వి. అ. న. కంచు: చూ, లోహము. 1.
ఘోషించు, సం. అ. క్రి. మ్రోయు: చూ, శబ్దించు.
ఘోషికము, సం. వి. అ. పుం. నీరుపంది: చూ, సూకరము. 1-౩.
ఘోషుఁడు, సం. వి. అ. పుం. గొల్లవాఁడు: మహాశూద్రుఁడు.
ఘోళము, సం. వి. అ. న: చూ, రూ - ఘోలము.
ఘోళి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ - ఘోలి.

## ఘ్రా

ఘ్రాణతర్పణము, సం. విణ. ఇష్టగంధము. మంచివాసన అది; చూ, వాసన. 1-౧౧. (1-౧౯): చూ, రాజార్హము. 1-౯.
ఘ్రాణము, సం. వి. అ. న. (పుం. అని కొందఱు) 1. నాసిక; చూ, ముక్కు; విణ. 2. రూ-ఘ్రాతము. మూర్కొనఁబడినది: చూ, వాసన. 1-౧౮; 3. నేత్రాది దశేంద్రియములలో నైదవ యింద్రియము: చూ, హృషీకము: (చూ, ఇంద్రియములు.)
ఘ్రాణరంధ్రములు. అం. బ. రంధ్రములు తొమ్మిదింటిలోని యొకతెగలో నొకజత: చూ, రంధ్రములు.
ఘ్రాణించు. సం. స. క్రి: చూ, మూర్కొను.
ఘ్రాతము, సం. విణ: చూ, ఘ్రాణము. 2.
ఘ్రాతి. సం. వి. ఇ. స్త్రీ. నాసిక: చూ, ముక్కు.

## ఙ

ఙ. ఒక యక్షరము, సం. వి. అ. పుం. 1. భైరవుఁడు. చూ, శివుఁడు; 2. భయము: చూ, వెఱపు; 3: చూ, ఏనుఁగు; 4. మాట: చూ, శబ్దము. 2; 5. జనము: చూ, ప్రజ. 2; 6. విషయవాంఛ: చూ, వాంఛ.
ఙమ్, సం. వి. అ. న. 1. కాటుక: చూ, చాఁదు; 2. పిల్లనగ్రోవి శబ్దము: చూ, స్వరము. 2-౬౬-(రాగ); 3. తిరము: చూ, స్థిరము.

## చ

చ. ఒక యక్షరము. సం. అవ్య. 1. పాదపూరణమందు వచ్చెడి అవ్యయము. ('సచ ప్రాహచ రాజానమ్') (తు-హి-చ-స్మ-హ - వై ఈ అఱును పాదపూరణమందు వర్తింపును); 2. అయ్యేవే; 3. అదిఉండగా యిదిన్ని; 4. అవయవములకు ప్రాధాన్యము లేక సమూహప్రాధాన్యము; 5. అన్నిటికిన్ని పరస్పరప్రాధాన్యము; 6. అదిన్ని యిదిన్ని; 7. భేదర్థకము, అట్టాయెనా; 8. అవధారణార్థకము: చూ, సత్యము. 1; 9. అతిశయము: చూ, హేరాళము. 1; 10. కారణము: చూ, హేతువు; 11. తుల్యయోగము; 12. ఆజ్ఞ: చూ, సెలవు; 13. పౌనరుక్త్యార్థకము; 14. దీప్తి: చూ, వెలుతురు. 1; సం. వి. అ. పుం. 15: చూ, శివుఁడు; 16: చూ, వెన్నెల

పులుఁగు;17: చూ, మ్లేచ్ఛుఁడు; 18: చూ, హిమాంశువు; 19: చూ, సూర్యుఁడు; 20: చూ, ద్రుమ్చు. 1; అం. 21: చూ, తాలవ్యములు; 22: చూ, పరుషములు.

చమ్, సం. వి. అ. న. నెత్తురు: చూ, రక్తము. 1.

చంకరము, సం. వి అ. పుం. 1. = కంచరము. తేరు: చూ, శకటము. 1; 2. చెట్టు : చూ, వృక్షము. రూ - చంకురము.

చంకురము, సం. వి. అ. పుం. 1. = : చూ, రూ-చంకరము; 2: చూ, రూ - చంకరము; 3. ఘోరణము: చూ, హయము. 1—౪౬—(౧౩).

చంక్రమణము, సం. వి. అ. న: చూ, లంపు.

చంగము, సం. విశ. = చక్కని, చక్కనిది: చూ, హృద్యము.

చంగలము, సం. వి. అ. పుం. 1. పన్ను లేని అంగడివీథి: చూ, మార్గము. 1; 2. నల్లబట్ట: చూ, 1—౬౭.

చంగుఁడు, సం. విశ: చూ, సమర్థుఁడు.

చంచ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, చాఁప; 2. కసవుతోఁ జేసిన బొమ్మ: చూ, హరిణి 3—౬.

చంచత్పుటము, అం: చూ, తాళకళలు: (చూ, తాళము. 2.) (ముఖ్యకళాప్రాణము.)

చంచభృత్తు, సం. వి. ద్. పుం. స్త్రీ: చూ, పక్షి. (చంచుభృత్తు అనియు.)

చంచరీకము, సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, భ్రమరము.

చంచరీకావళి, అం. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమునందు మ, మ, ర, ర, గురువులు గలిగి ఏడవ యింట యతిగల త్రయోదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా. — "కంబుగ్రీవా సత్యా - కామినీప్రాణనాథా": చూ, వృత్తము. 1.

చంచల, సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 2: చూ, లక్ష్మి; 3: చూ, పిప్పలి. 1. *; 4. ములువెంపలి *: చూ, వెంపలి.

చంచలము, సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; 2. మందపిచ్చుక; చూ, పిచ్చుక; విశ. 3. చలించునది: చూ, చలితము. 3; అం. 4: చూ, విద్యుత్తులు (విద్యుత్తు. 1.)

చంచలించు, సం. అ. క్రి: చూ, చలించు.

చంచలుఁడు, సం. విశ. 1: చూ, వలపుకాఁడు; 2: చూ, విటుఁడు; 3. గాలి: చూ, వాయువు.

చంచుసూచి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మహాపక్షము.

చంచుఁడు, సం. వి. అ. పుం. = చెంచు: చూ, వ్యాధుఁడు. 2.

చంచువు, సం. వి. ఉ. స్త్రీ. 1. పక్షిముక్కు: చూ, ముక్కు; పుం. 2. ఆముదము*: చూ, వ్యడంబకము; 3. బొలము బచ్చలి*: చూ, బచ్చలి; 4. = చెంచు: చూ, వ్యాధుఁడు. 2.

చండ, సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లకచోరము *: చూ, రాజార్హము; 1—౧౦; (1—౧౩); 2: చూ, జలురక్కసి *; 3. లింగిదొండ*: చూ, దొండ; 4. కొండబెండ *: చూ, షడ్గ్రంథ.

చండకము, సం. వి. అ. పుం. 1. పులి: చూ, శార్దూలము; 2. సన్నపాకుల ఎఱ్ఱగన్నేరు *: చూ, హయమారకము.

చండము, సం. వి. అ. పుం. చింత *: చూ, తింత్రిణి.

చండముండ, సం. వి. ఆ. స్త్రీ. రూ-చండముండి. దుర్గ: చూ, పార్వతి. 1.

చండముండి, సం. వి. ఈ. స్త్రీ. — పై. —

చండవాయువు, సం. వి. ఉ. పుం. వడిగాలి: చూ, వాయువు 1—౪—(౫).

చండశూకము, సం. వి. అ. పుం. 1. సాలము *: చూ, మద్ది; 2: చూ, నీరుమద్ది*.

చండసూచికము, అం : చూ, ఏకవింశతి స్థానకములు.

చండాంశువు, సం. వి. ఉ. పుం: చూ, సూర్యుఁడు.

చండాకరి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మంజిష్ఠ*.

చండాతకము, సం. వి. అ. పుం, న. = చెడ్డి. జోగముదానలు సగము తొడవఱకుఁ దొడిగికొనెడు గుడిగి: చూ, వస్త్రము. 1—౯—(౯).

చండాతము, సం. వి. అ. పుం. గన్నేరు వాడగన్నేరు (అని కొందఱు) *: చూ, హయమారకము.

చండాల బ్రాహ్మణులు, అం. శస్త్రాస్త్ర ధనుర్ధరులై ధనాపహారులగు విప్రులును, పరులను హింసింపుచు క్రూరత్వముఁ గలిగి పరదారాగమనపరాయణులై పరద్రవ్యాపహారణాభిలాషు లగువారును చండాలబ్రాహ్మణులు: చూ, బ్రాహ్మణులు. (వీరు దశవిధబ్రాహ్మణులలోనివారు.)

చండాల వల్లకి, సం. వి. ఈ. స్త్రీ. చండాలవీణె: చూ, వీణ. 1—౧౪.

చండాలి, సం. వి. ఈ. స్త్రీ. 1. మాలది: చూ, మాల. (1); 2. నీలి*: చూ, రంజని.

చండాలిక, సం. వి. ఆ. స్త్రీ. 1. వీణ: చూ, వీణ. 1; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. పిన్ననీలి*: చూ, రంజని.

చండాలుఁడు, సం. వి. అ. పుం. రూ - చాండాలుఁడు. 1. మాలవాఁడు: చూ, మాల. 1; 2: చూ, మంగలి; అం. 3: చూ, జాతులు.

చండి, సం. వి. ఈ. స్త్రీ. 1. = చెండి: చూ, పార్వతి. 1; 2. కోపముగల ఆఁడుది: చూ, స్త్రీ. 1-౩౯; 3. మిక్కిలి ప్రేమగల ఆఁడుది: చూ, స్త్రీ. 1-౫౪; 4. చంపునట్టి ఆఁడుది: చూ, స్త్రీ. 1-౫౫.

చండించు, సం. అ. క్రి: చూ, రోషించు.

చండిక, సం. వి. ఆ. స్త్రీ. = : చూ, చండి.

చండిమ, సం. వి. న్. పుం. వాఁడిమి: చూ, క్రౌర్యము. 1.

చండిల, సం. వి. ఆ. స్త్రీ. చండిలమను నది : * చూ, నది.

చండిలము, సం. వి అ. పుం. చక్రవర్తమను కూరాకు.

చండిలుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2. చంద్రుఁడు : చూ, హిమాంశువు; 3: చూ, మంగలి.

చండుఁడు, సం. వి. అ. పుం. 1. చండుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1-౪; 2. యమకింకరుఁడు; చూ, హరి. ౯-(౧); విశ. 3. మిక్కిలి కోపము గలవాఁడు; చూ, రోషణుఁడు; 4. వాఁడిమిగలవాఁడు: చూ, హింసకుఁడు. 2.

చండువు, సం. వి. ఉ. పుం. ఎలుక: చూ, మూషికము.

చందన, సం. వి. ఆ. స్త్రీ: చూ, శారిబ*.

చందనద్రుమము, సం. వి. అ. పుం: చూ, గంధపుమ్రాను*.

చందనపుష్పకము, సం. వి. అ. పుం: చూ, లవంగపుష్పము*.
చందనము. సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; పుం, న. 2. మంచిగంధము: చూ, వాసన; పుం. 3: చూ, సుగంధము*. 1. (చందనాసవము చేయుదురు.)
చందనాచలము, సం. వి. అ. పుం. మలయపర్వతము; చూ, పర్వతము (ఇట్లు చందనాద్రి-చందనాలయము.)
చందని, సం. వి. ఈ. స్త్రీ. చందని యను నది; చూ, నది.
చందనుఁడు, సం. వి. అ. పుం. చందనుఁడను కోఁతి: చూ, వానరము. 1-౧౪.
చందినీ అత్తరు, మి. వి. చందన తైలము, మంచిగంధపు నూనె. (సెగ, తెల్లకుసుమ మాన్పును); చూ, ప్రబోధము: (చూ, స్నేహము. 1-౧౧.)
చందియుఁడు, సం. వి. అ. పుం. 1.=చందమామ. రూ-చంద్రుఁడు-చంద్రమసుఁడు: చూ, హిమాంశువు; 2. ఏనుఁగు: చూ, హస్తి.
చంద్రకము, సం. వి. అ. పుం. 1. నెమలిపురికన్ను: చూ, పింఛెము; 2: చూ, వితానము.
చంద్రకళ, అం. 1. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్క పాదమున ర, స, స, త, జ, జ, గురువులుండి పదునొకండవ యింట యతిగల ఏకోనవింశచ్ఛందస్సునందుఁ బుట్టినవృత్తము: చూ, వృత్తము. 1; 2. చంద్రునికళ: చూ, శశికళ.
చంద్రకాంతము, సం. వి. అ. న. 1. కపటము: చూ, వ్యాజము. 1; పుం, న. 2. తెల్లకలువ*: చూ, సహస్ర పత్రము. 1-౧౨-(౩); పుం. 3.చలువరాయి: చూ, రత్నములు. 1-౧౨-(౧౮); 4. ఒక రకము పిండివంట: చూ, భక్ష్యము; 5. దుంపజాతి చెట్టు (దీని ఆకులు ఆముదమున వెచ్చచేసి నెత్తురు గడ్డలపైన వేయుదురు. దుంప సెగ రోగములలో వాడెదరు.)
చంద్రకి, సం. వి. న్. పుం. 1. నెమిలి: చూ, మయూరము; 2. కపుఁజు: చూ, కౌఁజు; 3. కోడి: చూ, పుంజు.
చంద్రగణములు, అం. బ: చూ, గణము. 4.
చంద్రగోళస్థులు, సం. వి. అ. పుం. (ప్ర-బ). పితృదేవతలు: చూ, హరి. 5-౪.
చంద్రగ్రహణము, వా: చూ, గ్రహణము. 1.
చంద్రచంచల, సం. వి. అ. స్త్రీ. చంద్రకమను చేఁప: చూ, మత్స్యము. 1.
చంద్రచంద్రికాన్యాయము, న్యా. చంద్రుని వదలి వెన్నెల యుండదను రీతి.
చంద్రచకోరన్యాయము, న్యా. చకోరములు చంద్రకిరణములను భక్షించును. కావునఁ జంద్రుఁ డెన్నఁడుదయించునా యని చకోరములు వేచియుండును. ఒక గొప్పవాని దర్శనార్థము ప్రతీక్షించుచున్నవానినిగూర్చి దీనిని బ్రశంసింతురు.
చంద్రచ్ఛందము. సం. వి. అ. పుం. వేయిపేటలుగల హారము: చూ, భూషణము. 2-౬(౪౧).
చంద్రజ్ఞానతంత్రము, అం: చూ, తంత్రములు.
చంద్రజ్ఞానము, అం: చూ, ఆగమములు: (చూ, ఉపవిద్యలు. 11-౪.)
చంద్రజ్యోతి, సం. వి. ష్. న.=చందురజోతి: చూ, బాణసంచు (ఇట్లు చంద్రద్యోతి—చంద్రద్యుతి.)
చంద్రబాల, సం. వి. అ. స్త్రీ. పెద్ద యేలకి*: చూ, పత్రల.
చంద్రబీజము, సం. వి. అ. న. వెండి: చూ, లోహము. 1.
చంద్రభస్మము, సం. వి. న్. న. కర్పూరము: చూ, సిరము.
చంద్రభాగ, సం. వి. అ. స్త్రీ. చంద్రభాగ అను నది: చూ, నది. (రూ-చంద్రభాగి-చాంద్రభాగ-చాంద్రభాగి.)
చంద్రభాగి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—
చంద్రమసుఁడు, సం. వి. స్. పుం: చూ, చందురుఁడు. 1.
చంద్రము, సం. వి. అ. పుం. 1.=సిరము: చూ, చంద్రభస్మము; 2. నీరు: చూ, సలిలము; 3. బంగారు: చూ, లోహము. 1; 4. కంపిల్లము*: చూ, రోచన.
చంద్రమౌళి, సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు.
చంద్రరేఖ, సం. వి. అ స్త్రీ. 1. ఇందురేఖ: చూ, శశికళ; 2: చూ, సోమరాజి*; అం. 3. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు మ, ర, మ, య, యగణములు గలిగి యెనిమిదింట యతిగల పంచదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:— "మత్తేభక్రాంతిచే ర - మ్యంబౌ మహిం జంద్రరేఖా, వృత్తం.": చూ, వృత్తము. 1.
చంద్రరేణువు, సం. విణ. కావ్యచౌరుఁడు: చూ, హారకుఁడు.
చంద్రవదన, అం. ఒకానొక వృత్తము. ఇది యొక్కొక్క పాదమునకు ఒక భగణము, ఒక యగణము గలదై యాఱవ ఛందస్సునందు బుట్టినవృత్తము. ఉదా :— "చంద్రవదనన్ దేవేంద్రవినుతా ని, స్తంద్రతభయంబుల్, సాంద్రముగఁ జెప్పన్.": చూ, వృత్తము. 1.
చంద్రవర్త్మ, అం. ఒకానొకవృత్తము. ఇది యొక్కొక్క పాదమునందు ర, న, భ, స గణములుగలిగి ఏడింటయతిగల ద్వాదశచ్ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:— "ఇంద్రవంద్య జగ-దీశ ఘనయశ, స్సాంద్రకామే పలి - సద్మ యదువరా.": చూ, వృత్తము. 1.
చంద్రవల్లి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మాతులుంగము*.
చంద్రవాంగమము. సం. వి. అ. పుం. వాలుకొంగ : చూ, బకము.
చంద్రవ్రతము, సం. వి. అ. న: చూ, చాంద్రాయణవ్రతము.
చంద్రవ్యాకరణము, అం: చూ, వ్యాకరణములు.
చంద్రశాల, సం. వి. అ. స్త్రీ. 1. పై మేడ : చూ, సదనము. 1; 2: చూ, వెన్నెల.
చంద్రశాలి, సం. వి. అ. స్త్రీ. పైమేడ : చూ, సదనము. 1.
చంద్రశేఖరుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
చంద్రశ్రీ, అం. ఒకానొక వృత్తము. ఇది ఒక్కొక్కపాదమునందు య, మ, న, స, ర, గురువులు గలిగి పండ్రెండవ యింట యతిగలిగి పదునాఱవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా:— "క్షమం జంద్రశ్రీతో యమనసర - గల్పానువిశ్రా, మముఞ్ సంబంధించున్నరహరి ర - మాచిత్త చోరా.": చూ, వృత్తము. 1.
చంద్రసంజ్ఞము, సం. వి. అ. పుం: చూ, సిరము.
చంద్రసూర్యాగ్నిలోచనుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
చంద్రహాసకము, సం. వి. అం. పుం. వెండి: చూ, లోహము. 1.

చక్రభ్రమిన్యాయము, న్యా. చక్రపు అంచు మీఁదిది క్రిందికి, క్రిందిది మీఁదికి వచ్చుచుండునను రీతి.

చక్రమండలము, అం: చూ, కరణములు.

చక్రమండలి, సం. వి. న్. పుం. కొండచిలువ: చూ, సర్పము. 1-౪-(౨౦).

చక్రమర్దకము, సం. వి. అ. పుం: చూ, ప్రపున్నాటము.

చక్రమర్దనము, —పై.—

చక్రమర్దము, సం. వి. అ. పుం: చూ, జిల్లేడు*.

చక్రము, సం. వి. అ. న. 1. సుదర్శనమను బాణము: చూ, బాణము. 1.౧౫; (1-30); 2. గాలిగుడి: చూ, వఱదగుడి; 3. గుంపు: చూ, సమూహము; 4. దండు. చదరంగపుసేన (అని కొందఱు): చూ, సేన; 5. రాష్ట్రము: చూ, దేశము; 6 గ్రామసమూహము; 7: చూ, కుమ్మర సారె; 8. నీటి సుడి: చూ, సుడి. 1; 9. చిన్ననాణెము: చూ, లోహము. 1; 10. బండిని లాగు గుండ్రని చట్రము. అ, అరి, ఓ, అక్ష ధరము, అక్షము: చూ, శకటము. 1-౨౫; పుం. 11. జక్కవ. రూ-చక్రవాకము: చూ, బటువు గువ్వ; అం. 12: చూ, విష్ణ్వాయుధములు: 13: చూ, సంయుత హస్తములు; 14: చూ, బాణము. 1; అం. 15: చూ, స్త్రీలక్షణాంగములు.

చక్రముఖము, సం. వి. అ. పుం. పంది: చూ, సూకరము.

చక్రములు, అం. 1. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, హంక్షము. (6) (అయ్యు) మూలాధారము, స్వాధిష్ఠానము, నాభి, హృదయము, కంఠము, ఘంటిక, భ్రూవు, బ్రహ్మరంధ్రము, గగనము (9) (అనియు) రెండు విధములు; 2. రాశిచక్రము, అంశచక్రము, ఆరూఢ చక్రము మొ. (చక్రములోని రాసులు:— మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.)

చక్రరదము, సం. వి. అ పుం: చూ, చక్రముఖము.

చక్రరేఖ, సం. వి. ఆ. స్త్రీ. రాజపత్నిలక్షణము: చూ, లక్షణము. 1-౪౦.

చక్రల, సం. వి. ఆ. స్త్రీ. వట్రువము సె*: చూ, తృణము. 1.

చక్రలక్షణ, సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగె*: చూ, సోమవల్లి.

చక్రవక్త్రము, సం. వి. అ. న. దరిద్రవతిలక్షణము: చూ, లక్షణము. 1-౧౫.

చక్రవర్త, సం. వి. ఆ. స్త్రీ. రూ-చక్రవర్తము-చక్రవర్తిని. ఒక రకము కూరాకు*: చూ, వాస్తూకము-వాస్తుకము. (ఇది తెల్ల రకము, ఎఱ్ఱరకము అని రెండువిధములు. దీనితైలము కొంకి పురుగు వ్యాధిలోపనిచేయును. ఈకూర మలమును భేదించును.)

చక్రవర్తము, సం. వి. అ. పుం. —పై.—

చక్రవర్తి సం. వి. న్. పుం. = చక్రవర్తి: చూ, రాజు. 1. (ఇ. పుం. అని కొందఱు.)

చక్రవర్తిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సార్వభౌమురాలు, రాణి: చూ, రాజు. 1-౮; 2. కోరింద*: చూ, ముచపత్ర; 3: చూ, చక్రవర్త.

చక్రవర్తులు, అం. హరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురుకుత్సుఁడు, పురూరవుఁడు, సగరుఁడు, కార్తవీర్యార్జునుఁడు. (6): చూ, మహారాజులు.

చక్రవాకము, సం. వి. అ. పుం. = జక్కవ: చూ, బటువుగువ్వ.

చక్రవాకముఖప్రియము, సం. వి. అ. పుం. కంచెయీఁడ*: చూ, శర్కరాంకము. 1-౨.

చక్రవాటము, సం. వి. అ. పుం. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. దీపపుకుందె: చూ, ప్రమిదె: (చూ, పాత్రము. 6.)

చక్రవాటుఁడు, సం. వి. అ. పుం. పరిబూనినవాఁడు.

చక్రవాస్తుకము, సం. వి. అ. పుం. చక్రవర్తికూర*: చూ, వాస్తుకము.

చక్రవాళ, అం. క్షుద్రప్రబంధము.

చక్రవాళకము, సం. వి. అ. న: చూ, సమూహము.

చక్రవాళము, 1. —పై.—; 2 గాలిగుడి: చూ, వఱదగుడి; పుం. 3. చుట్టుగొండ (రూ-చక్రవాడము): చూ, పర్వతము; అం. 4. ఒకానొకవృత్తము. 1.

చక్రవృద్ధి, సం. వి. ఇ. స్త్రీ. 1. వడ్డీకివడ్డీ: చూ, వడ్డీ; అం. 2: చూ, ధనవృద్ధులు.

చక్రశ్రేష్ఠకము, సం. వి. అ. పుం. తగిరిస*: చూ, ప్రపున్నాటము.

చక్రసంజ్ఞము, సం. వి. అ. న. వంగము, తగరము: చూ, లోహము. 1.

చక్రసంవరుఁడు, సం. వి. అ. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

చక్రాంకితము, సం. విణ. గుండ్రని గుఱుతిడఁబడినది: (చూ, అంకితము.)

చక్రాంగము, సం. వి. అ. పుం. 1. = జక్కవ: చూ, బటువు గువ్వ; 2. అంచ: చూ, హంస; 3. గొడుగు: చూ, వారిత్ర.

చక్రాంగి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఅంచ: చూ, హంస; 2. రూ-శక్రాంగి. కటుకరోహిణి*: చూ, కటుకాదని. 1; 3. దూసరి*: చూ, పత్పాదని.

చక్రాంతము, అం: చూ, కరణములు.

చక్రాటము, సం. వి. అ. పుం. ముప్పదిరెండు గురిగింజల యెత్తు బంగారునాణెము: చూ, లోహము 1.

చక్రాటుఁడు, సం. వి. అ. పుం. 1. పాములవాఁడు: చూ, వ్యాళగ్రాహి; 2: చూ, వంచకుఁడు.

చక్రాణి, సం. వి. అ. న. బ. ఏటివంపు, భూమిని ప్రక్కలించి నీళ్ళారివచ్చెడు బుగ్గ (అని కొందఱు): చూ, పుటభేదము. (ఏ. చక్రము.) (అమ-వారివర్గము.)

చక్రాధివాసి, సం. వి. న్. పుం: నారింజ*: చూ, శర్కరాంకము. ౧-౧౧.

చక్రాయుధప్రయోగము. అం: చూ, తంత్రములు.

చక్రాయుధము, సం. వి. ధ్. స్త్రీ, అ. న. ఆయుధము: చూ, బాణము. 1-౩౦.

చక్రాలత్రిప్పుడు. అం: చూ, బాలక్రీడ.

చక్రి, సం. వి. న్. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. = జక్కవ: చూ, బటువుగువ్వ; 3: చూ, సర్పము; 4. రారాజు: చూ, రాజు. 1-౩; కుమ్మరి: చూ, మృత్కారుఁడు; 6. తేరు: చూ, శకటము. 1; 7. కప్ప: చూ, హరి. 12: 8: చూ, తెలుకులవాఁడు; 9. పురోహితుఁడు: చూ, యాజ్ఞికుఁడు; 10. గ్రామమునకధికారి: చూ, రాజు. 1.

చక్రికాయంత్రము, సం. వి. అ. న: చూ, తిరుగలి.

చక్రీవంతము, సం. వి. త్. పుం. గాడిద: చూ, రాసభము.

చక్రోఘుఁడు, సం. వి. అ. పుం. జక్కులఱేఁడు, కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

చక్షుఃప్రీతి, అం: చూ, ద్వాదశావస్థలు.

చక్షువు, సం. వి. స్. న. 1. కన్ను: చూ, లోచనము. 1; 2: చూ, వహ్ని. 1-౩— 1; అం. 2: చూ, ఇంద్రియములు: (చూ, హృషీకము.)

చక్షుశ్శ్రవణన్యాయము, న్యా. పామునకు వినికి యున్నప్పుడు చూపును, చూపున్నప్పుడు వినికియు నుండదను రీతి.

చక్షుశ్శ్రవము, సం. వి. స్. పుం: చూ, సర్పము.

చక్షుష్య, సం. వి. ఆ. స్త్రీ. 1. అందకత్తె: చూ, స్త్రీ; 2. పాలకూర*: చూ, మనుపాల; 3: చూ, వద్ది*; 4. పొడిపిండి: చూ, సాదము. 1-౩౪; 5. రూ-చక్షుష్యము. అడవి యులవలు; చూ, సరటి.

చక్షుష్యము, సం. వి. అ. పుం, న. 1: చూ, మొగలి*; 2: చూ, శ్రీపుష్పము*; పుం. 3. చిల్ల*: చూ, సల్లకి; 4. మునుగ*: చూ, శిగ్రువు. 1; 5: చూ, రసాంజనము; 6: చూ, రూ-చక్షుష్య. 5; విణ. 7. హితమైనది: చూ, హితవు.

చటక, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుపిచ్చుక (చటకక అనియు): చూ, పిచ్చుక; 2. ఆఁడుపిచ్చుక పిల్ల: చూ, పిచ్చుక; 3. పిప్పలివేరు: చూ, పిప్పలి. 1; అం. 4. (చటకగతి): చూ, గతులు.

చటకగతి, అం: చూ, చటక. 4.

చటకము, సం. వి. అ. పుం. 1: చూ, పిచ్చుక; 2. కోడి: చూ, పుంజు.

చటకవిలసితము, అం: (చూ, అదూషితము): చూ, వ్యాసకరణబంధములు.

చటకారి, వా. వి. 1. హిందూదేశమునఁ బుట్టిన ఆంగ్లేయసంతతివాఁడు; 2: చూ, నిష్ప్రయోజకుఁడు.

చటకాశిరము, సం. వి. స్. న: పిచ్చుక తలవలె నుండునది. (చటకా-శిరః అని రెండుపేళ్ళుగాఁ గొందఱు. అప్పుడు శిరశ్శబ్దము అ. పుం.)

చటకోత్తమ, సం. వి. ఆ. స్త్రీ. ఆఁడు ఊరఁబిచ్చుక: చూ, పిచ్చుక.

చటాకము, సం. వి. అ. పుం: చూ, రూ-చటకము. 1.

చటాకు, వా. వి. $\frac{1}{16}$ సేరు. 5 తులములు. ఒకగిద్ద (తెనుఁగున వాడుక.)

చటుచాటుని, సం. వి. ఇ పుం. ప్రియవాక్యము: చూ, శబ్దము. 2.

చటులము, సం. విణ. చలించునది: చూ, చలితము. 3.

చటుల్లోలుఁడు, సం. విణ. ప్రియోక్తులం దాసక్తి గలవాఁడు: చూ, చాటులోలుఁడు.

చటువు, సం. వి. ఉ. పుం. 1: చూ, ఉదుపు; 2. రూ-చాటువు: చూ, చటుచాటుని; 3. యోగుల ఆసనవిశేషము: (చూ, ఆసనములు.): చూ, స్వస్తికాసనము.

చణకపుష్పి, సం. వి. ఈ. స్త్రీ. : చూ, కలభకర్ణిక *.

చణకము, సం. వి. అ. పుం. 1. = సెనగ *: చూ, సెనగలు. (త్రి అని శ, ర.); 2. గాలి: చూ, వాయువు.

చణకాత్మజుఁడు, సం. వి. అ. పుం. వాత్స్యాయనముని: చూ, ముని. 1.

చణపుష్పి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చణకపుష్పి *.

చణిక, సం. వి. ఆ. స్త్రీ. అంటిస *: చూ, తృణము. 1.

చతురంగము, సం. వి. అ. న. 1. = చదరంగము. ఒకయాట. (ఇందు రాజు, 1. మంత్రి 1, ఏనుఁగులు 2, గుఱ్ఱములు 2, శకటములు 2, బంట్లు 8, ఒకవైపునను, ఇవ్విధంబుననె రెండవవైపునను ఉండి రెండుబలములును నడక లారంభించును.); అం. 2: చూ, అవధానములు.

చతురంగములు, అం. ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బంట్లు (4.)

చతురంగులము, సం. వి. అ. పుం. 1: చూ, రేల *; 2. అపరకర్మమందలి పిండివంట: చూ, మల్లకము.

చతురంత, సం. వి. ఆ. స్త్రీ. నేల: చూ, భూమి. 1.

చతురంతయానము, సం. వి. అ. న: చూ, పాలకి.

చతురబ్ద, సం. వి. ఆ. స్త్రీ. నాలుగేండ్ల (ఆవు) పెయ్య: చూ, ధేనువు. (చతుర్హాయని.)

చతురము, సం. వి. అ. న. 1. గజశాల: చూ, సదనము. 1; పుం. 2. అభినయహస్తవిశేషము: చూ, వ్యంజకము. 1; 3. = చదరము. పొడవు × వెడల్పు = చతురము: చూ, వైశాల్యము; 4. = చదరము. సమమైన నాలుగు మూలలు కలది, చౌకము: చూ, వైశాల్యము; అం. 5: చూ, సంయుతహస్తములు; 6: చూ, అసంయుతహస్తములు; 7: చూ, భ్రూక్రియలు; 8: చూ, కరణములు.

చతురశ్రి, సం. వి. ఆ. స్త్రీ. టమ్మ*: చూ, విట్ఖదిరము.

చతురశ్రము, అం: తాళజాతులు (జాతిక్రియలు): చూ, తాళజాతులు: (చూ, జాతిక్రియలు: చూ, తాళము. 2.)

చతురశ్రికము, సం. వి. అ. పుం: 1: చూ, ములువెలఁగ *; 2: చూ, దాఁగలి.

చతురస్రము, సం. విణ. = చదరము: చూ, చతురము. 3-4.

చతురాననుఁడు, సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

చతురిక, అం. దూతీచతుష్టయములో రెండవది. (ఇందు ప్రహిత, ఉప్వహిత, ప్రతిహారి, భావన, పత్రిక, మూక, స్వయం, భావదూతిక గలవు): చూ, దూతీచతుష్టయము.

చతురిమ, సం. వి. న్. పుం. నేరుపు: చూ, సామర్థ్యము. 1.

చతురుఁడు, సం. విణ. = చదుర. రూ - చాతురుఁడు: చూ, సమర్థుఁడు. 1.

చతురుమొన, అం: చూ, మొనలు.

చతుర్గతి, సం. వి. ఇ. పుం. 1: చూ, తాఁబేలు; పా. 2. సింహము శార్దూలము గజము వృషభములవలె నడచుట.

చతుర్థము, అం. 1. లగ్నకారకత్వములు పండ్రెండింటిలో నొకటి: చూ, లగ్నకారకత్వములు. (వాహనము, వంశము, మాత, సింహాసనము, గృహము, భూమి, సుఖము, మిత్రులు, బాహువులు, విశ్వాసము, కృషి, గుఱ్ఱములు, ఏనుఁగులు, విద్య, ప్రయాణము, రాజ్యము, స్థానభ్రంశము, సౌధము, చెఱువులు, నూతులు, తోఁటలు.); స. 2. చతుష్కము, చతుష్టయము: చూ, నాలుగు.

చతుర్థి, సం. వి. ఈ. స్త్రీ. 1. = చవుతి: చూ, తిథి. 1: వి.౫. 2. నాలుగవది; 3: చూ, తిథులు.

చతుర్దంతము, సం. వి. అ. పుం. = చవుదంతి. ఇంద్రుని యేనుఁగు: చూ, హస్తి. 1-(౭౬).

చతుర్దశకము, సం. వి. అ. న: చూ, పదునాలుగు.

చతుర్దశి, సం. వి. ఈ. స్త్రీ. 1. కలిదెవత్య: చూ, తిథి. 1; 2. పదునాలుగు తంతులుగల పరివాదిని యను వీణె: చూ, వీణె; విణ 3. పదునాలుగవది; అం. 4. తిథులపదునేఁటిలో నొకటి: చూ, తిథులు; 5: చూ, సింహాసనములు: (చూ, షడ్దానములు); 6: చూ, తతవాద్యములు.

చతుర్దళ, సం. వి. ఆ. స్త్రీ. నీరుచెంచలి*: చూ, స్వస్తికము.

చతుర్భద్రము, సం. వి. అ. న. 1. బలయుక్తములైన ధర్మార్థకామమోక్షములు: చూ, చతుర్వర్గము; అం. 2.

చతుర్భాగము, అం: చూ, కాలప్రాణములు.

చతుర్భుజుఁడు, సం. వి. అ. పుం. 1. నలువ: చూ, బ్రహ్మ. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

చతుర్ముఖము, అం: చూ, జన్యతాళములు; అం. 2. రోహిణి: చూ, రిక్క. 1-౪.

చతుర్మాన. అం: చూ, మొనలు.

చతుర్లవణములు, అం. సైంధవ, సౌవర్చ, బిడా, సముద్ర లవణములు.

చతుర్వర్గము, సం. వి. అ. పుం. ధర్మార్థకామమోక్షములు: చూ, చతుర్భద్రము. 1.

చతుర్విధకందము, అప్ప. 4, ఆ. 412-413 : చూ, వృత్తము. 1.

చతుర్విధప్రీతులు, అం. అభిమానప్రీతి, విభవప్రీతి, సదృశప్రీతి, విషయప్రీతి (4).

చతుర్హాయని, సం. వి. ఈ. స్త్రీ: చూ, చతురబ్ద.

చతుశ్శాలము, సం. వి. అ న. = చవుసాల. నాలుగిండ్లకూటమి, నాలుగిండ్లబవంతి: చూ, సదనము. 1. (చతుశ్శాలఅనియు.)

చతుశ్శృంగము, సం. వి. అ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

చతుష్కంటకిని, సం. వి. ఈ. స్త్రీ. ఉప్పి*: చూ, లవణి.

చతుష్కము, సం. వి. అ. న. 1. = చవుకము, నాలుగుదారుల కూడలి: చూ, మార్గము. 1; 2. చవికె, మంటపము: (చూ, మెల్లా): చూ, సదనము. 1; 3. = చవు; చూ, నాలుగు.

చతుష్కి, సం. వి ఈ. స్త్రీ. 1. పెద్దకోనేఱు: చూ, సరస్సు. 1.—౩; 2. దోమతెర. కప్పుకొనుబట్ట (అనికొందఱు): చూ, వస్త్రము. 1—౫౩; 3. నాలుగుపేటలు గల ముత్యాల హారము: చూ, భూషణము. 2—౬—౪౨.

చతుష్టయము, పా: చూ, చతుర్థము. 2.

చతుష్పథము, సం. వి. అ. న. 1. = చవుపదము: చూ, మార్గము. 1; పుం. 2. ఒకరకము మంచము: చూ, శయ్య. 1—౫—(౫).

చతుష్పథుఁడు, స. వి. అ. పుం. బాపఁడు: చూ, బ్రాహ్మణుఁడు.

చతుష్పద, అం. ఒకానొకవృత్తము. ఇందు పాదమునకు పదునాలులఘువు లుండవలయును. ఒకప్పుడు రెండుగురువులకు లొకొక గురువును ఉండవచ్చును. యతి యెనిమిదవ అక్షరము నందుండును: చూ, వృత్తము. 1.

చతుష్పదము, సం. వి. అ. పుం. 1: చూ, చతుష్పాత్తు; 2. నాలుగుకాళ్ళజంతువు. (ఇట్లు చతుష్పాదము).

చతుష్పాటి, సం. వి. ఈ. స్త్రీ. చతుష్పాటియనునది: చూ, నది.

చతుష్పాణి, సం. వి. ఈ. స్త్రీ. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

చతుష్పాత్తు, అం: చూ, కరణము. 14: (చూ, కరణములు)

చతుష్షష్టి, సం. స. ఇ. స్త్రీ. రూ-చతుష్షష్టి 1. = చవుసట్టి (వా). చవుషట్టి (పురు-కవీయము), అఱువదినాలుగు; 2. ఋగ్వేదము: (చూ, ఉపవిద్యలు): చూ, వేదము; అం. 3. (64): చూ, కళలు (కళలు = విద్యలు): చూ, కల.

చతుష్షష్ఠి.—పై.—

చతుస్తాళి, అం: చూ, జన్యతాళములు.

చతుస్స్వరయుక్తరాగములు, అం. (స్వరాంతములు): చూ, రాగములు.

చత్వరము, సం. వి. అ. న. 1: చూ, ముంగిలి; 2. వ్రతము పూనినవానికి పండుకొనుటకు చక్కఁబఱచిన భూమి, అగ్నిహోత్రమునుంచుటకై సంస్కరించిన స్థానము (అని అమరము): చూ, స్థండిలము; చూ, భూమి. 1; 3: చూ, చతుష్పథము. 1; 4. పొదరిల్లు: చూ, సదనము. 1; 5. నారచీర: చూ, వస్త్రము. 1—౭౫.

చత్వరి, సం. వి. ఈ. స్త్రీ. శ్రవణక్షమమైనబుద్ధి: చూ, బుద్ధి.

చత్వరిక, సం. వి. ఆ. స్త్రీ. బాలవిధవ: చూ, స్త్రీ. 1—౪—(౧).

చన, సం. అవ్య: చూ, చిత్. 1.

చపటము, సం. వి. అ. పుం: చూ, రూ-చపేటము.

చపల, సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు: చూ, విద్యుత్తు. 1; 2. అచ్చి: చూ, లక్ష్మి; 3: చూ, జంకులాఁడి; 4: చూ, పిప్పలి. 1*; పా. 5. కందపద్యభేదము లాఱింటిలో నొకటి. ఉదా:— "సమపదముల మొదలంజగ, ణముంగడయుఁగ నను ద్విగ-ణలఘువుపై, సమకొనువిరతియు పదియేన్, లముల్ ముకుంద చప-లకు నమరుఁగా": (చూ, కందము. 3): చూ, వృత్తము. 1.

చపలత, సం. వి. ఆ. స్త్రీ. రాగద్వేషాదులచే పనులయందుఁ గలుగు తబ్బిబ్బు: చూ, వ్యత్యయము.

చపము, సం. వి. అ. పుం. 1. మగగుఱి: చూ, శిశ్నము; 2. వెదురు: చూ, వేణువు.

చపలతాళయము, సం. వి. అ. పుం. అజీర్ణరోగము: చూ, రోగము. 1.

చపలము, సం. వి. అ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. చేఁప: చూ, మత్స్యము. 1; 3. చలువఱాయి: చూ, రత్నములు. 1-౧౨-(౩౦); 4: చూ, పాదరసము; 5. చోరకమను గంధద్రవ్యము, చండ (అని కొందఱు): చూ, రాజార్హము 1-౧౦-(1-౧౩); 6. కామంచిగడ్డి*: చూ, తృణము. 1; క్రి. విణ. అ. న. 7. రూ-చాపలము. శీఘ్రము: చూ, స్యదము; విణ. 8. కదలునది: చూ, వలితము. 3; 8. నిలుకడలేనిది; 9. వడిగలది: చూ, వేగము 3; అం. 10: చూ, విద్యుత్తులు: (చూ, విద్యుత్తు. 1.)

చపలాంగము, సం. వి. అ. పుం. జలజంతువిశేషము: చూ, మత్స్యము. 1.

చపలాతిశయోక్తి, అం. అలంకారవిశేషము: చూ, అలంకారము.3.
చపలుఁడు, సం. విణ. 1. వేగముగలవాఁడు: చూ, వేగిరకాఁడు; 2. చంచలస్వభావము గలవాఁడు: చూ, చలపుకాఁడు; 3. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 4. అల్పుఁడు: చూ, హీనుఁడు; 5. దోషము విచారింపక వధబంధనాదులఁ జేయు వాఁడు: చూ, చిమురుఁడు.
చపిటము, సం. వి. అ. పుం: చూ, రూ-చిపిటకము.
చపుటము, —పై.—
చపేటము, సం. వి. అ. పుం. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి. రూ-చపటము: చూ, హస్తము. 1-౫ (1-౭).
చపేటార్యము, సం. వి. అ. పుం. కాకిదొండ*: చూ, దొండ.
చబుకము, సం. వి. అ. న. గెడ్డము: చూ, రూ-చుబుకము.
చబూకము, సం. వి. అ. న. —పై.—
చమత్కారము, సం. వి. అ. పుం. నేర్పు: చూ, సామర్థ్యము.1.
చమత్కృతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, చమత్కారము.
చమనము, సం. వి. అ. న. పిష్టవర్తి. సోమపానము త్రాగు పాత్రము: చూ, పాత్రము. 6.
చమరము, సం. వి. అ. న. 1. వింజామరము: చూ, సురఁటి; పుం. 2. = సవరపుమెకము: చూ, సవరపుమెకము; 3. = సవరము. చమరమృగముతోఁక: చూ, సవరము; 4: చూ, రూ-చమరి. 3.
చమరి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుసవరపు మెకము: చూ, సవరపుమెకము; 2. చిగురుకొమ్మ: చూ, శాఖ. 1-౩; ఇ. స్త్రీ. 3: చూ, పూగుత్తి.
చమరిక, సం. వి. ఆ. స్త్రీ. రూ-చమరికము. ఎఱ్ఱకాంచనము*: చూ, యుగపత్రికము.
చమరికము, సం. వి. అ. పుం. —పై.—
చములుఁడు, సం. విణ: చూ, భక్షకుఁడు.
చమసము, సం. వి. అ. పుం, న. 1. రూ-చమసి. చతురస్రమైన యజ్ఞపాత్రము: చూ, పాత్రము. 6; పుం. 2. పక్షి పిల్ల; చూ, పక్షి.
చమసి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రూ-చమసము. 1; 2. సోఁపుపిండి: చూ, సాదము. (1)-౩౯.
చమువు, సం. వి. ఊ. స్త్రీ. 1. రూ-చమూవు. ఏన్నూటయిరువది తొమ్మిది రథములు, అన్ని యేనుఁగులు, రెండువేల నూట యెనుబదియేడు గుఱ్ఱములు, మూఁడువేల నార్నూట నలువది యేవురు కాల్బురు గలసేన: చూ, సేన. 1. ౧. 2. దండు: చూ, సేన. 1.
చమూముఖము, సం. వి. అ. న. 1. సేనాముఖము: చూ, సేన. 1-౨; అం. 2: చూ, దండవ్యూహములు.
చమూరువు, సం. వి. ఉ. పుం. రూ-సమూరువు. కలదు లేదను తోఁకకలిగి తెల్లగానైనను, నల్లగానైనను, నానావర్ణములు కలదిగానైనను నుండెడి యిఱ్ఱిజాతివిశేషము (దీని తోలు జను లుపయోగింపుకొందురు): (చూ, రామము.): చూ, హరిణము 1-౧౪-(౫).
చమూవు, సం. వి. ఊ. స్త్రీ: చూ, రూ-చమువు.
చయనము, సం. వి. అ. న. అగ్నిని స్థాపించుటకై ఇటుకరాళ్లమొ. వానిచేతఁ జేయఁబడిన జంతువుయొక్క యాకారము గల తిన్నె-ఆతిన్నెయందుంచు అగ్ని (ఒకానొక యాగము): చూ, వహ్ని. 1-౪.-(వహ్ని. 1-౬.)
చయము, సం. వి. అ. పుం. 1: చూ, సమూహము; 2. కోట కొఱడు: చూ, వప్రము. 2; 3: చూ, సంగ్రహము. 2.
చరకము, సం. వి. అ. పుం, న. 1. వైద్యశాస్త్రము: చూ, శాస్త్రము. 1: (చూ, శాస్త్రములు); 2. దుప్పటి: చూ,వస్త్రము. 1-౧౦౬.
చరచ్ఛద, సం. వి. ఆ. స్త్రీ: చూ, బిరివెంక *.
చరటము, సం. వి. అ. పుం. కాటుకపిట్ట: చూ, పిచ్చుక.
చరణక్రియలు, అం. అంచితము, కుంచితము, సూచి, అగ్రతల సంచరము, ఉద్ఘట్టితము, సమము (6).
చరణగ్రంథి, సం. వి. ఇ. పుం: చూ, సీలమండ.
చరణపర్వము, సం. వి. న్. న. ఏనుఁగుకాలి కణుపు. ప్రోహము: చూ, హస్తి. 1-(౩౩).
చరణము, సం. వి. అ. న. 1. తిండితినుట: చూ, భక్షణము; 2. తిరుగుట: చూ, విహారము. 1; 3. మంచినడత: చూ, వర్తనము. 1; న. 4. విష్ణుచక్రము: చూ, బాణము. 1-౪౮; 5. సంస్కారముచేసిన నేల: చూ, భూమి. 1—౩౩; 6. ప్రాంగణము: చూ, ముంగిలి; పుం, న. 7. అంఘ్రి: చూ, పాదము. 1; 8. మూలము: చూ, వేరు. 1; 9. ఋగ్యజుశ్శాఖాదులు (వేదభాగము): చూ, వేదము; 10. కులము: చూ, వంగడము; అం. 11: చూ, శరీరాంగములు: (చూ, అంగము. 9.)
చరణములు, అం: చూ, అంగము. 9.
చరణామల, సం. వి. ఆ. స్త్రీ. పిన్నముల్లంగి *: చూ, ముల్లంగి.
చరణాయుధము, సం. వి. అ. పుం. అజ్జవాలు: చూ, పుంజు.
చరణుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2. వేద శాఖాధ్యయనము చేసినవాఁడు: బహ్వృక్‌శాఖాధ్యేత (అనియు); 3. నాట్య పరిభాషాదులయందుఁ గడపట చేర్చునపుడు పూజ్యుఁడు.
చరణ్యువు, సం. వి. ఉ. పుం. గాలి: చూ, వాయువు.
చరమక్రియ, అం. అంత్యకర్మము, అపరక్రియ, అనర్ధాహము, ఉత్తరక్రియ, ఔర్ధ్వదైహికము, శ్రాద్ధము: చూ, కర్మములు: (చూ, శ్రాద్ధము. 1.)
చరమక్ష్మాభృత్తు, సం. వి. త్. పుం. పడమటికొండ: చూ, పర్వతము. (ఇట్లు చరమాచలము, చరమాద్రి.)
చరమము, సం. విణ. 1. కడపటిది: చూ, వెనుక. 2; 2. పడమటిది : చూ, పశ్చిమము. 1.
చరము, సం. వి. అ. పుం. 1. ఒకానొక జూదము : చూ, వ్యవహారము. 4; 2. జంతువర్గము: చూ, రూ - చరాచరము; విణ. 3. కదలునది: చూ, చలితము. 3; 4. తిరుగునది: చూ, త్రసము.
చరయువు, సం. వి. ఉ. పుం. 1. మబ్బు : చూ, మేఘము. 1; 2. గాలి: చూ, వాయువు.
చరవాయువు, సం. వి. ఉ. పుం. వేసఁగిగాలి: చూ, వాయువు. 1-౪-(౩).

చరాచరము, సం. వి. అ. న. 1. జగము : చూ, లోకము ; 2: చూ, రూ - చరము. 1; విణ. 3. తిరుగునది: చూ, త్రసము; 4. తిరుగునదియుఁ దిరుగనిదియునైనది.

చరి, సం. వి. ఇ. పుం. గాడిద: చూ, రాసభము.

చరించు, సం. అ. క్రి. 1. తిరుగు : చూ, సంచరించు ; స. క్రి. 2. చేయు: చూ, సలుపు.

చరిత, సం. వి. ఆ. స్త్రీ. నడవడి, మంచినడవడి (అని కొందఱు) ; చూ, వర్తనము. 1; 2. వృత్తాంతము : చూ, సమాచారము. 2. (రూ - చరితము - చరిత్ర - చరిత్రము - చారిత్రము.)

చరితము, సం. వి. అ. న. —పై.—

చరిత్ర, సం. వి. ఆ. స్త్రీ. —పై.—

చరిత్రము, సం. వి. అ. న. —పై—

చరిష్ణువు, సం. విణ. ఉ. తిరుగునది : చూ, చలమానము. 1.

చరుఁడు, సం. వి. అ. పుం. 1. రూ - చారుఁడు : చూ, వేగువాఁడు; 2. అంగారకుఁడు : చూ, వక్రుఁడు. 1.

చరువు, సం. వి. ఉ. పుం. 1. = చరవ. హవ్యము, అగ్నిలో వేల్వఁదగిన పక్వాన్నము: చూ, సాదము. (1) —ఆ; 2. హవ్యమువండెడు కుండ : చూ, భాండము. 3. ——ఆం; అం. 3: చూ, ఖండములు.

చరువ్రణము, సం. వి. అ. పుం. చిత్రాపూపమను పెండివంట : చూ, భక్ష్యము.

చర్చ, సం. వి. ఆ. స్త్రీ. 1. విచారణము: చూ, వెదకుట ; 2. చింత: చూ, పశ్చాత్తాపము ; 3. చేతనిడిన కుంకుమము లోనగునది, చర్చిక, కుంకుమము లోనగువానిపూఁత (అని కొందఱు): చూ, బచ్చెన; 4. దుర్గ: చూ, పార్వతి. 1; 5. చర్చ యనునది : చూ, నది. 6: చూ, నిధులు; (చూ, లిబ్బి. 1.)

చర్చరి, సం. వి. ఈ. స్త్రీ. 1. చప్పట, చాఁచిన వ్రేళ్ళుగల అఱచేయి : చూ, హస్తము. 1—ఆ; అం. 2: చూ, ఉద్ధతము. 2; 3: చూ, జన్యతాళములు.

చర్చించు, సం. స. క్రి. 1. అరయు: చూ, విచారించు. 1; 2. అన్వేషించు: చూ, వెదకు.

చర్చిక, సం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గ: చూ, పార్వతి. 1; 2: చూ, చర్చ. 3; 3. శివపరిచారికలలో నొకతె: చూ, పరిచారిక.

చర్చిక్యము, సం. వి. అ. న. రూ - చార్చిక్యము. గందము మొదలగువానిపూఁతద : చూ, చర్చ. 3.

చర్చితము, అం: చూ, రదక్షతములు.

చర్పటము, సం. వి. అ. పుం. 1: చూ, చర్చరి. 1; 2. ఒకానొకమందుచెట్టు: చూ, వృక్షము; 3. అప్పడము: చూ, భక్ష్యము.

చర్పటి, సం. వి. ఈ. స్త్రీ. ఒబ్బట్టు, పోలీ : చూ, భక్ష్యము.

చర్మకష, సం. వి. ఆ. స్త్రీ. = : చూ, సంబరేను*.

చర్మకారము, సం. వి. అ. పుం: చూ, చర్మకష.

చర్మకారుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, మాదిగ; అం. 2: చూ, జాతులు.

చర్మచటక, సం. వి. ఆ. స్త్రీ: చూ. చీఁకురువాయి.

చర్మచటి, సం. వి. ఈ. స్త్రీ. —పై.—

చర్మచోర, సం. వి. ఆ. స్త్రీ. కొండబెండ*: చూ, షడ్గ్రంథ.

చర్మణ్వతి, సం. వి. ఈ. స్త్రీ. 1. చర్మణ్వతీనది : చూ, నది; 2. అరఁటి*: చూ, రంభ. 2.

చర్మతంతౌ మహిషీం హంతి, న్యా. తోలుసంచి కావలసినవాఁడు గేదెను చంపునట్లు చిన్నవస్తువుకావలసినవాఁడు పెద్దవస్తువు లను పాడుచేసికొనుట.

చర్మప్రవేశిక, సం. వి. ఆ. స్త్రీ. కొలిమితిత్తి: భస్త్ర.

చర్మఫలకము, సం. వి. అ. న. ఫలకము: చూ, హరిగ. 1.

చర్మభేదిక, సం. వి. ఆ. స్త్రీ. ఆరె : చూ, సూది. 1—ఆ.

చర్మము, సం. వి. న్. పుం. 1; చూ, తోలు 1; 2. కేడెము: చూ, హరిగ ; అం. 3. ధాతువు లేడింటిలో నొకటి: చూ, ధాతువులు.

చర్మముండ, సం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గ: చూ, పార్వతి. 1; 2. అం: చూ, పరిచారిక.

చర్మయష్టి, సం. వి. ఈ. స్త్రీ: చూ, సమ్మెట.

చర్మరంగ, సం. వి. ఆ. స్త్రీ. నులితడ*: చూ, మహాబల.

చర్మవసు, సం. వి. ఉ. పుం: చూ, చర్మకారుఁడు.

చర్మశము, సం. వి. అ. పుం. చదర : చూ, చాప.

చర్మారము, సం. వి. అ. పుం: చూ, చెప్పుకట్టు*.

చర్మి, సం. వి. న్. పుం. 1. కేడెము ధరించినవాఁడు ; చూ, డాలుకాఁడు ; 2. బుజపత్తిరి *: చూ, భూర్జము; 3 మూఁడు కాళ్లుగల భృంగియను శివభక్తుఁడు ; 4. అలంబుషుఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు 1.—ఆ.

చర్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఈర్య. 1-2-3; 4. నడత: చూ, వర్తనము. 1.

చర్వ, సం. వి. ఆ. స్త్రీ. చెంపదెబ్బ : చూ, లెంపకాయ.

చర్వణ, సం. వి ఆ. స్త్రీ. 1. ఈఁగ, నల్లయీఁగ (అని కొందఱు): చూ, మక్షిక ; 2. దిగువకుఁ బాఱిం చంద్రికళ. (చర్విత అనియు).

చర్వణము, సం. వి. అ. న: చూ, నమలుట; 2. నోరు : చూ, వదనము. 1; 3. స్నేహితునియిల్లు: చూ, సదనము. 1.

చర్వితచర్వణన్యాయము, న్యా. నమలినదే మరల నమలిన రీతి.

చర్వితచర్వణము, సం. వి. అ. న. నెమరువేయుట : చూ, రోమంథము; జా. 2. చేసినదియే మరలఁ జేయుట. (పిష్టపేషణము) "పోయినదాని మరలఁ ద్రవ్వుట చర్వితచర్వణము." (నీతిచంద్రిక - విగ్రహము).

చర్వితపాత్రము, సం. వి. అ. న. తమ్మతనుకు : చూ, పీఁకెదాను: (చూ, పాత్రము. 6.)

చర్వితము, సం. వి. అ. న. 1. ముక్కువైపుకొలికి; చూ, ముక్కుకొలికి. విణ. 2. నమలఁబడినది. తినఁబడ్డది (అని కొందఱు): చూ, భుక్తము. 1.

చర్షణి, సం. వి. ఈ. స్త్రీ చూ, అంకులాఁడి.

చల, సం. వి. ఆ. స్త్రీ : చూ, లక్ష్మి.

చలత్తైలాఖ్యము, సం. వి. అ. పుం. సిల్లమనుధూపద్రవ్యము*: చూ, సల్లకి.

చలదళము, సం. వి. అ. పుం. 1: చూ, రావి *; 2. గుండ్రతుంగ*: చూ, తృణము. 1.

చలద్రుమము, సం. వి. అ. పుం: చూ, జయద్రుమువు*.

చలననాడులు, అం. చలించునాడులు : చూ, నాడులు.
చలనము, సం. వి. అ. న. 1. కదయిట : చూ, లోలము; 2. తిరుగుట: చూ, విహారము. 1; 3. = చల్లడము. లా.పు: చూ, వస్త్రము. 1-౭-(౯); 4. భయము : చూ, వెఱపు; విశ. 5. కదలునది: చూ, వలితము. 3; అం. 6 : చూ, తారాక్రియలు.
చలపత్రకము, సం. వి. అ. పుం. ఉమ్మెత్త*: చూ, హాలా పుష్పము.
చలపత్రము, సం. వి. అ. పుం: చూ, రావి*.
చలము, సం. వి. అ. పుం. 1. రూ. చంచలము. వణఁకు: చూ, లోలము; 2. వణఁకుగలది: చూ, లోల. (వలితము 3.)
చలసంహతము, అం: చూ, ఓుక్రియలు.
చలసర్పశిరము, అం: చూ, అసంయుతహస్తములు.
చలాచలము, సం. విశ. కదలునది: చూ, వలితము. 3.
చలి, సం. వి. ఇ. స్త్రీ. రూ-చాల-చాలి. పదునాలుగంగములు గల నర్తనవిశేషము: చూ, నాటకము. 1.
చలించు, సం. అ. క్రి. = సలించు: చూ, సలించు.
చలితము, సం. విశ. కదలింపఁబడినది: చూ, వేల్లితము. 1.
చలుఁడు, సం. వి. అ. పుం. దుష్టుఁడు: చూ, వ్యాఘుఁడు. 2.
చవర్గము, అం: చ ఛ జ ఝ ఞ: చూ, కవర్గము.
చవలాగాయి బ్రాహ్మణులు, అం. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.
చవి, సం. వి. ఇ. స్త్రీ. = సేవ్యము, చవ్యము*: చూ, రాజార్హము. 1-౧౧.
చవిక, సం. వి. ఆ. స్త్రీ, అ. న. = : చూ, చవి.
చవికము, సం. వి. అ. న. = —పై.—
చవికాఫల, సం. వి. ఆ. స్త్రీ. గజపిప్పలి*: చూ, పిప్పలి. 1.
చవితి, అం. 1. తిథులలో నాలవది: చూ, తిథులు; 2: చూ, తిథులు; 3: చూ, తిథులు: (చూ, పక్షము.)
చవీనాహి, సం. వి. ఈ. స్త్రీ. బావి: చూ, సరస్సు. 1-౧౩, (1-౧౫.)
చవ్య, సం. వి. ఆ. స్త్రీ. రూ-చవికము-చవిక. = సేవ్యము*: చూ, రాజార్హము. 1-౧౧.
చవ్యకము, సం. వి. అ. న. = —పై.—
చవ్యము, = —పై.—
చషకము, సం. వి. అ. పుం, న. 1. కల్లుత్రాగెడుగిన్నె: చూ, పాత్రము. 6; 2. కల్లు: చూ, 2; 3. గిన్నె: చూ, పాత్రము.6; 4. గిండి: చూ, పాత్రము. 6; 5. ఒకదినుసుకల్లు: చూ, సుర. 2-౧౩; న. 6. మబ్బు: చూ, మేఘము. 1.
చషాలము, సం. వి. అ. పుం. యూపస్తంభ శిరోభాగమునందలి దారుమయమైన కడియము, రాజసూయమునందు యూపస్తంభమున కడుగువఁ దగిల్చెడి యినుపకడియము (అని కొందఱు.)

## చా

చాంగము, సం. వి. అ. పుం: చూ, పులిచింత*.
చాంగేరి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పులిచింత*; 2. ముస్తె*: చూ, ముస్తకము.
చాంచల్యము, సం. వి. అ. న. చపలత్వము, చాపలము, చాపల్యము.
చాండాలిక, సం. వి. ఆ. స్త్రీ. మాంపీణ: చూ, వీణ. 1-౧౪.
చాండాలుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-చండాలుఁడు.
చాండిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-చండిక. 1.
చాంద్రభాగ, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-చంద్రభాగ.
చాంద్రభాగి, సం. వి. ఈ. స్త్రీ. —పై.—
చాంద్రమసము, సం. వి. అ. న. మృగశిర: చూ, రిక్క. 1-౫.
చాంద్రమసాయనము, సం. వి. అ. పుం. బుధగ్రహము: చూ, రాహువు. 2.
చాంద్రాయణము, అం. చాంద్రాయణవ్రతము. భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములతో చంద్రునియొక్క క్షయవృద్ధుల ననుసరించి క్రమమున కృష్ణపక్షమందు ఒక్కొక్కకడిగా తగ్గించుచు శుక్లపక్షమందు ఒక్కొక్కకడిగా హెచ్చించుచు భుజించి యాచరించెడి యొకానొకవ్రతము. రూ-చాంద్రాయణము; తద్విశేషము.— ఋషిచాంద్రాయణము.
చాంద్రి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వెన్నెల; 2: చూ, చాంద్రమసాయనము.
చాంపిల, సం. వి. ఆ. స్త్రీ. చాంపిలానది: చూ, నది.
చాంపేయము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. అరకుపు: చూ, సహస్రపత్రము. 1-౧౦.(౨); 3: చూ, నాగకేసరము*; 4: చూ, సంపెఁగ*; 5. సుర పొన్న*: చూ, పొన్న.
చాకోరము, సం. వి. అ. న. చకోరపక్షులగుంపు: చూ, వెన్నెలపులుఁగు.
చాక్రికుఁడు, సం. వి. అ. పుం. 1. వేకువను రాజుల నిద్ర మేల్కొలుపువాఁడు : చూ, ఘంటికుఁడు ; 2: చూ, తెలుకుల వాఁడు.
చాక్షుషుఁడు, అం. రూ-చాక్షుషుఁడు. వైవస్వతాది పదు నలుగురు మనువులలో నొకఁడు : చూ, మనువులు.
చాచప్పుటము, అం. (చాచుపుటము): చూ, తాళకళలు.
చాటకైరము, సం. వి. అ. పుం. 1. ఏట్రింత: చూ, వ్యాఘ్రాటము; 2. పిచ్చుక మగపిల్ల: చూ, పిచ్చుక.
చాటుకారము, సం. వి. అ. పుం. బంగారుపూసలు గ్రుచ్చిన యొంటిపేట హారము: చూ, భూషణము. 2-౬-(౪౩).
చాటులోలుఁడు, సం. విశ: చూ, రూ-చటుల్లోలుఁడు.
చాటువు, సం. వి. ఉ. పుం, న. = చాటు. 1. ప్రియమైనమాట, ఉదాహరణము (అని కొందఱు) : చూ, శబ్దము. 2; 2. న. అప్పుడప్పుడు కవి ఆశువుగ చెప్పిన పద్యములు. (గ్రంథస్థముకానివి).
చాటూక్తి, సం. వి. ఇ. స్త్రీ. సేవ: చూ, శుశ్రూష. 2.
చాణకీనము, సం. విశ. సెనగలుపండు మంచి నేల: చూ, భూమి. 1-౩౪.
చాణము, సం. వి. అ. న: చూ, పిరక.
చాణక్యుఁడు, సం. వి. అ. పుం: చూ, వాత్స్యాయనుఁడు.
చాణూరసూదనుఁడు, సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

చాతకజీమూతన్యాయము, న్యా. (రూ - మేఘచాతకన్యాయము) చాతకపక్షి మేఘోదకమును భూపతితము గాకుండనే త్రావును. కావున వర్షాకాలమున నీరు ద్రావి మరల వర్షాకాలము దనుక మేఘునికై యెదురుచూచుచుండును.

చాతకము, సం. వి. అ. పుం: చూ, వానకోయిల.

చాతురి, సం. వి. ఈ. స్త్రీ. రూ-చాతుర్యము నేర్పు: చూ, సామర్థ్యము. 1.

చాతురుఁడు, సం. విశే. =: చూ, రూ-చతురుఁడు.

చాతుర్మాస్యేష్టి, అం: చూ, హవిర్యజ్ఞములు.

చాతుర్మాస్యము, అం. ప్రతివత్సరము ఆషాఢశుద్ధము మొదలు కార్తికశుద్ధము వఱకు నాలుగునెలలు చేసెడి యొకానొక యజ్ఞము: చూ, యజ్ఞము; అం. 2: చూ, నిహీనతానములు: (చూ, శుద్ధతానములు).

చాతుర్యము, సం. వి. అ. న. = చెతురు: చూ, చాతురి.

చాతుర్వర్ణ్యము, సం. వి. అ. న. బ్రాహ్మణులు. క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు.

చాదస్తము, వా. వి. చెప్పినదే చెప్పుట, చేసినదే చేయుట.

చాపబంధము, అం: చూ, శబ్దాలంకారములు.

చాపము, సం. వి అ. పుం. ధనుస్సు: చూ, బాణము. 1-3౭.

చాపముష్టి ప్రేరణవివరము, అం: చూ, ధనుర్విద్యాప్రమేయములు.

చాపలము, సం. వి. అ. న. 1: చూ, చాంచల్యము; అం. 2: (ఆముద్దులాఁడి యమ్మనోనాయకుఁగాంచి హారముల దిద్దుచుఁ జూపు మరలించుచుఁ బలుక గమకించుచు మరల నూరకుండెను): చూ, సంచారిభావములు.

చాపలేపము, అం: చూ, తంత్రములు.

చాపల్యము, సం వి అ. న: చూ, చాపలము.

చాపోచ్చరణలక్షణము, అం: చూ, ధనుర్విద్యాప్రమేయములు.

చాబుకము, సం. వి. అ. న: చూ, రూ-చంబుకము.

చాబూకము, —పై.—

చామరద్వంద్వము, అం: చూ, తంత్రములు.

చామరపుష్పము, సం. వి. అ. పుం. 1: చూ, పోఁక*; 2: చూ, మామిడి*; 3: చూ, మొగలి *; 4. తెల్లు*: చూ, తృణము. 1.

చామరము, సం. వి. అ. న. 1. = వింజామరము (రూ-చామర-చామరి-చమరము): చూ, సురఁటి; అం. 2: చూ, ఉద్ధతము. 2.

చామరి, సం. వి. ఈ. స్త్రీ. 1. =: చూ, రూ-చామరము. 1; 2. గుఱ్ఱము: చూ, హయము 1.

చామీకరము, సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. మేరుపర్వతము: చూ, పర్వతము; 3. గని: చూ, భూమి. 1; పుం. 4. సూర్యునివిల్లు: చూ, బాణము. 1-౮౬.

చామీరము, సం. వి. అ. పుం. సూర్యునివిల్లు: చూ, బాణము. 1-౮౬.

చాముండ, సం. వి. ఆ. స్త్రీ. రూ-చాముండి. 1. ఒక మాతృక: చూ, మాతృకలు; 2. శివపరిచారికలలో నొకతె: చూ, పరిచారిక; 3. మాత లేడుగురిలో నొకతె: చూ, మాతలు.

చాముండాతంత్రము, అం: చూ, తంత్రములు.

చాముండి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-చాముండ.

చామ్యము, సం. వి. అ. న. (సేమ్య అని వాడుక) పాయసము వంటి భక్ష్యము: చూ, భక్ష్యము.

చారకము, సం. వి. అ. పుం = చాఱు*: చూ, ప్రవ.

చారటి, సం. వి. ఈ స్త్రీ. 1. మెట్టదామర*: చూ, సహస్రపత్రము. 1-౧; 2. నీలిని*: చూ, వెంపలి; 3. తంగేడు*: చూ, హేమపుష్పకము; 4. స్థాణేయమను గంధద్రవ్యము*: చూ, రాజార్హము. 1-౩౯.

చారటిక, సం. వి. ఆ. స్త్రీ. నలి యను గంధద్రవ్యము: చూ, రాజార్హము. 1-౮; 1-౩౯.

చారణము, సం. వి. అ న. రూ-చరణము. తిరుగుట: చూ, విహారము. 1.

చారణుఁడు, సం. వి. అ. పుం. 1. నానాదేశ సంచారకుఁడైన నట్టువుఁడు: చూ, సీకారి; 2. నానాదేశ సంచారకుఁడైన బట్టువాఁడు: చూ, బట్టువాఁడు; 3. ఒకానొక ఖేచరుఁడు: చూ, ఖేచరుఁడు. 3.

చారము, సం. వి. అ. పుం. 1. = చెఱ. బొండ, సంకెల (అని కొందఱు): చూ, బంధనాలయము; 2. నడ, పయనము: చూ, ప్రయాణము; 3. = చాఱు. జీడిమామిడి*: చూ, ప్రవ; 4. పాట, గానము: చూ, స్వరము 2-౧౭; 5. పాము: చూ, సర్పము; అం. 6: చూ, వాయువు 1-౪—(3) (పడమటిగాలి).

చారవాయువు, సం. వి. ఉ. పుం. పడమటిగాలి: చూ, చారము. 6.

చారాయణ, అం. కామశాస్త్రమును రచియించినవారిలో నొకడు: చూ, కామము. 8.

చారిణి, సం. వి. ఈ. స్త్రీ. తెల్లవిష్ణుక్రాంత*: చూ, విష్ణుక్రాంత.

చారితము, సం. వి. అ. న. రతిబంధభేదము: చూ, రతిబంధములు.

చారిత్ర, సం. వి. ఆ. స్త్రీ. చింత *: చూ, తింత్రిణి.

చారిత్రము, సం. వి. అ. న: చూ, రూ-చరిత.

చారిపుష్ప, సం. వి. ఆ. స్త్రీ. తంగేడు *: చూ, హేమపుష్పకము.

చారిమము, స. వి. న్. పుం. ఒప్పిదము: చూ, సౌందర్యము.

చారీనృత్యము, అం: చూ, ఉద్ధతము. 2.

చారుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-చరుఁడు.

చారుకాంతి, సం. వి. ఇ స్త్రీ. చారుమతి, చంద్రునిభార్య: చూ, భార్య.

చారుగర్భుఁడు, సం. వి. అ. పుం. శ్రీకృష్ణుని పుత్రుఁడు: చూ, సూనుఁడు. 1-౪౫.

చారుగుప్తుఁడు, —పై.—

చారుదర్శనము, సం. వి. అ. పుం. జువ్వి *: చూ, ప్లక్షము.

చారుధార, సం వి. ఆ. స్త్రీ. ఇంద్రునిభార్య, శచి: చూ, భార్య. 1-౭.

చారుఫల, సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష *: చూ, స్వాదుఫల.

చారుబాహువు, సం. వి. ఉ. పుం.: చూ, చారుగర్భుఁడు.

చారుపత్త్రి, సం. వి. ఈ. స్త్రీ: చూ, లంజె సవరము *.

చారుపుష్ప, సం. వి. ఆ స్త్రీ. —పై.—

చారుపుష్పము, సం. వి. అ. పుం, న. బంగారు: చూ, లోహము. 1.

చారుమతి, సం. వి. ఈ. స్త్రీ: చూ, చారుకాంతి.

చారుపిండువు, సం. విశే: చూ, చారుగర్భుఁడు.

చిందఱగొను. దే. అ. క్రి. (చిందరన్ + కొను): చూ, విజృంభించు.

చిందరేఁగు, దే. అ. క్రి. ఆవేశమెత్తు: రూ - చీఁదఱరేఁగు - చీఁదఱగొను.

చిందఱలుసేయు, ద్వ. స. క్రి: చూ, చిందఱసేయు.

చిందఱవందఱ, దే. వి. 1. తునుక. కళా 8, ఆ. 121: చూ, శకలము. 4; 2. కలగుండు: చూ, సంతాపము; విణ. 3. కలగుండువడినది: చూ, సంతాపితము; అవ్య. 4. కణశోర్థము. ఆం. భా. త్య. 67: చూ, పరిపరి.

చిందఱవందఱచేయు, దే. స. క్రి. ఖండించు: చూ, నెఱుగు.

చిందఱవోవు, ద్వ. అ. క్రి. (చిందఱ + పోవు) తూఁటువోవు. కళా. 7, ఆ. 19: చూ, తొఱఁటలువాఱు.

చిందఱసేయు, ద్వ. స. క్రి. (చిందఱ + చేయు) ఛేదించు. సా. 1, ఆ. 93: చూ, భేదిల్లు. 1.

చిందాడు, దే. అ. క్రి. (చిందు + ఆడు) చిందులుద్రొక్కు. నర్తించు: చూ, మలఁపుగొను.

చిందియ, దే. వి. జెట్టికుళ్లాయ. రూ-చిందె: చూ, వస్త్రము. 1-ౘా—(౨).

చిందిలి, దే. విణ. చలించినది. లక్ష్మి. 2, ఆ. 53: చూ, వలితము. 3.

చిందిలిపడు, ద్వ. అ. క్రి: చూ, సంభ్రమించు.

చిందిలిపాటు, ద్వ. వి: చూ, సంభ్రమము. 1.

చిందిలు, దే. అ. క్రి. చలించు: చూ, సలించు.

చిందు, దే. వి. 1. = స్యందః. (బహుత్వమున) నటనము, నాట్యము: చూ, వ్యంజకము. 1; 2. = స్యందః. బ. మాతంగ నాట్యము, చిందువాలు: చూ, వ్యంజకము. 1; 3. కోపము: చూ, రోషము; 4. గీతప్రబంధవిశేషము: చూ, పుస్తకము; విణ. 5. చెదరినది: చూ, వ్యాకీర్ణము; అ. క్రి. 6: చూ, వ్యాపించు, స్వా. 4, ఆ. 53; 7: చూ, రాలు. స్వా. 2, ఆ. 67; 8. నీళ్ళు పాత్రమునుండి తొనఁకిపడు: చూ, తొలఁకు; స. క్రి. 9. వెచ్చపెట్టు: చూ, వెచ్చించు.

చిందుగ, దే. వి. రూ-చిందువ. 1. చిందుగ అను చెట్టు. హంస. 4, ఆ. 11; వా. వి. 2. చిందువ అను జంతువు: చిందువ.

చిందుద్రొక్కు, దే. అ. క్రి. (చిందు + త్రొక్కు) రూ-చిందులుద్రొక్కు: చూ, మలఁపుగొను.

చిందుపరువు, దే. వి: చూ, బాలక్రీడ. హంస, 3, ఆ. 146.

చిందులుద్రొక్కు, దే. అ. క్రి: చూ, రూ-చిందుద్రొక్కు.

చిందువ, దే. వి. 1: చూ, రూ- చిందుగ. 1; 2: చూ, రూ-చిందుగ. 2; 3. అల్పపేటిక: చూ, సురుగు.

చిందువందు, దే. వి. చెదరినది. స్వా. 3, ఆ. 28: చూ, వ్యాకీర్ణము.

చిందువందుచేయు, దే. స. క్రి. చెదరఁగొట్టు. జై. 5, ఆ. 192.

చిందువాలు, దే. వి: చూ, చిందు. 2.

చిందె, దే. వి: చూ, రూ-చిందియ.

చింపి, దే. వి. 1. జీర్ణవస్త్రము. ఆం, భా. ద్వి. 157: చూ, వస్త్రము. 1-ఉ—౨; విణ. 2. చినిఁగినది. జై. 5, ఆ. 192: చూ, ఛేదితము.

చింపిగుడ్డ, దే. వి: చూ, చింపి. 1.

చింపిటి, దే. వి. నిప్పుసోఁకినట్లుండు కొనలుగలిగి బిరుసెక్కిన చిన్నపంకెర వెంట్రుకలు. జుంజురు, బరికె: చూ, వెంట్రుక. 1.

చింపు, దే. ప్రే: చూ, రూ-చించు. 1.

చింబు, దే. వి. మేఁక: చూ, మేషము. 1.

చింబోతు, దే. వి. (చింబు + పోతు) మేఁకపోతు: చూ, మేషము. 1.

చికటారి, దే. వి. రూ-చిక్కటారి. శశాం. 2, ఆ. 17: చూ, చింగోటి.

చికమక, దే. వి. చికుకు: చూ, మ్రుక్కు. 3.

చికలీలము, సం. వి. అ. పుం: చూ, బురద.

చికిచికి, దే. విణ. చిన్న, అల్పము: చూ, స్వల్పము.

చికిత్స, సం. వి. ఆ. స్త్రీ. 1. (రోగమునకుఁ జేయు) ప్రతిక్రియ: చూ, వైద్యము; అం. 2. వైద్యశాస్త్రముయొక్క స్కంధములు మూఁడింటిలో నొకటి: చూ, స్కంధములు.

చికిత్సకుఁడు, సం. వి. అ. పుం. వెజ్జు: చూ, వైద్యుఁడు.

చికిత్సితము, సం. వి. అ. న: చూ, చికిత్స.

చికినము, వై. వి. = చిక్కణమ్. చికిస. చాయవక్క: చూ, పోఁక.

చికిని, వై. వి. = —పై.—

చికిలి, దే. వి. తుడిచిచక్కఁజేయుట: చూ, సాపు. 4.

చికిలికాఁడు, దే. వి. (కత్తులు మొదలైనవానిని) చికిలిచేయువాఁడు: చూ, సాపుచేయువాఁడు.

చికిలు, దే. అ. క్రి. చనవుచేనేడ్చు: చూ, రోదించు.

చికీర్ష, సం. వి. ఆ. స్త్రీ. చేయనిచ్ఛ: చూ, వాంఛ.

చికీర్షితము, సం. విణ. చేయ నిచ్ఛింపఁబడినది: చూ, వాంఛ. 1-ఇ—౨.

చికీర్షువు, సం. విణ. ఉ. చేయ నిచ్ఛగలవాఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

చికురము, సం. వి. అ. పుం. 1. బ. రూ-చకురము-చిహురము: చూ, వెంట్రుక. 1; 2. కొండ: చూ, పర్వతము; 3. చికురపక్షి: చూ, పక్షి; 4. పాము: చూ, సర్పము; 5: చూ, ముంగిస; 6: చూ, బల్లి; 7. ఒకానొక చెట్టు: చూ, వృక్షము; విణ. 8. కదలునది: చూ, లోలము. 4; 9. చలించునది: చూ, త్రసము.

చికురుఁడు, సం. విణ: చూ, చపలుఁడు. 5.

చిక్క, సం. వి. ఆ. స్త్రీ. చూ, పోఁక*.

చిక్కంటు, దే. వి. తల చిక్కుదీసికొనెడి విడుపు దువ్వెన. రూ-చిక్కంటె: చూ, ప్రసాధని.

చిక్కంటె, దే. వి. —పై.—

చిక్కటారి, ద్వ. వి. (చికి + కటారి): చూ, రూ-చికటారి.

చిక్కణబిళ్ల, ద్వ. వి: చూ, బాలక్రీడ.

చిక్కణము, సం. వి. అ. న 1. = చికినము-చికిని: చూ, చికినము; 2. ఏనుఁగుయొక్క హృదయమదము: చూ, మదము. 1; పుం, న. 3: చూ, పోఁక*; విణ. 4. = చిక్కన. తఱచైనది; చూ, మొత్తము. 4; 5. నునుపైనది: చూ, స్నిగ్ధము. 2.

చిక్కణి, సం. వి. ఈ. స్త్రీ. పోఁకపండు: చూ, పోఁక.

చిక్కఁదనము, ద్వ. వి 1. = చిక్కణ: చూ, సాంద్రము. 2; 2. మృదువు: చూ, సుకుమారము.

చిక్కన, వై. వి. 1. = చిక్కణ: చూ, సాంద్రము. 2; 2. మృదువు: చూ, సుకుమారము; 3. తఱచు. "చిక్కనిపాలు": చూ, మొత్తము. 4; 4. బలము: చూ, శక్తి. 1; 5. దార్ఢ్యము: చూ, స్థైర్యము. 1; 6. జిడ్డు: చూ, స్నిగ్ధము. 3.

చిక్కనాబిల్లలు, దే. వి. బ: చూ, బాలక్రీడ. కాశ. 3, ఆ. 33.

చిక్కపట్టు, దే. వి. (చిక్కని + పట్టు) స్థైర్యము: చూ, సత్యము. 1.

చిక్కమన్ను, ద్వి. వి. కుంభకరమృత్తిక: చూ, భూమి. 1-౨౫.

చిక్యము, సం. వి. అ. న. 1. = చికిని. చాయవక్క: చూ, పోఁక; పుం. 2. చుంచు: చూ, మూషికము; వై. వి. (1) తీఁగలు లోనగువానితో నల్లి పసులమూతికిఁ దగిలించెడు బుట్ట: చూ, సజ్జ. 1; (2). = శిక్యము. ఉట్టి: చూ, శిక్యము. 1; (3) దారముతో నల్లిన సంచి: చూ, సంచి; (4) ఉచ్చు: చూ, వాగుర.

చిక్కసము, సం. వి. అ. న. 1. నలుఁగుఁబిండి. యవలపిండి (అని కొందఱు) (పుం, న. అని కొందఱు): చూ, సాదము. (1)-౪౩; 2. హరిద్ర: చూ, వర్ణము. 6-౭

చిక్కా, సం. వి. ఆ. స్త్రీ. పోఁకపండు: చూ, పోఁక.

చిక్కినవాఁడు, దే. వి. శుష్కాంగుఁడు: చూ, బక్కవాఁడు.

చిక్కిపోవుట, అం: చూ, మన్మథావస్థలు.

చిక్కు, దే. వి. 1. కష్టము: చూ, శోకము; 2. సంకటము: చూ, శోకము; 3. మెలి: చూ, లంకె; అ. క్రి. 4. కృశించు: చూ, సొటసొటవోవు; 5. దొరకు: చూ, లోఁబడు; 6. తక్కు: చూ, మిడివోవు; 7. తగులు: చూ, లంకించు. 1; 8. మిగులు: చూ, శేషించు.

చిక్కుఁజేయు, దే. స. క్రి: చూ, బంధించు.

చిక్కుట, అం. (కార్శ్యము): చూ, దశావస్థలు.

చిక్కుడు, దే. వి. క్షుద్రశింబి *: చూ, మట్టిక.

చిక్కుతాళము, దే. వి. ఒకరకము బీగము: చూ, బీగము.

చిక్కుపడు, ద్వి. అ. క్రి. 1. చిక్కగు: చూ, రూ-చిక్కువడు; 2. సంకటపడు: చూ, రూ-చిక్కువడు.

చిక్కుపాటు, ద్వి. వి. సంకటపాటు: చూ, శోకము.

చిక్కులు, వా. వి. బ. 1. కష్టములు; 2. లంకెలు; 3. అల్లికలు; 4. ముగ్గులు.

చిక్కువడు, ద్వి. అ. క్రి. (చిక్కు + పడు): చూ, రూ-చిక్కుపడు.

చికొట్టు, దే. స. క్రి. (చీ + కొట్టు) చీచీయను.

చికోల, దే. వి. (చిక్కు + కోల): చూ, చికిలింటు.

చిక్రోడము, సం. వి. అ. పుం. ఆలిందకి-రూ- ఆలిందకి, కాల శారము. (తె. ప.):—ఉడత-రూ-ఉడుత-ఉఱుత.

చిగిరించు, దే. అ. క్రి: చూ, పల్లవించు.

చిగిరింత, దే. వి. అంటింతగడ్డి *: చూ, తృణము. 1.

చిగిరింత యైశ్వర్యము, జా. చిగిలింతగడ్డి మిక్కిలి యేపుగా నెదిగి అతిశీఘ్రముగా నెండిపోవును. దానివలె పెరిగి నశించు నైశ్వర్యములు. "ఈ చిగిరింత యైశ్వర్యమునకై యింత పొంగనేల."

చిగిలికాఁడు, దే. వి: చూ, సౌందర్యవంతుఁడు.

చిగురాకు, దే. వి. (చిగురు + ఆకు) రూ-చిగురుటాకు: చూ, విద్రుమము.

చిగురాకుదిండి, దే. వి. (చిగురు + ఆకు + తిండి) కోకిలము: చూ, పికము.

చిగురాకువిలుకాఁడు, దే. వి. (చిగురు + ఆకు + విలుకాఁడు): చూ, మన్మథుఁడు, శకాం. 3, ఆ. 20.

చిగురు. దే. వి. రూ-చివురు. 1. కిసలయము: చూ, విద్రుమము; 2. లేఁత. "చిగురుఁ గొమ్మ." (హల్లు పరమగుచో దీని కడపటి యుకారము వికల్పముగ లోపించెడి. "చిగు ర్నగు మోవి"): చూ, సుకుమారము; 3. దంతములకుఁ జుట్టు కొని యుండెడి సూక్ష్మమాంసము: చూ, శుక్తము. 2-౧౧.

చిగురుఁగొమ్మ. దే. వి. (చిగురు + కొమ్మ) చిగిరించిన లేఁత కొమ్మ, పూచిన లేఁతకొమ్మ (అని కొందఱు): చూ, శాఖ.

చిగురుఁబోఁడి, దే. వి. (చిగురు + పోఁడి) 1. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది: 1: చూ, స్త్రీ; 1.-౨౪; 2. ఆఁడుది: చూ, స్త్రీ. 1. (రూ-చిగురుఁబోణి.)

చిగురుకొను, దే. అ. క్రి. చిగిరించు (కొను = పుట్టు): చూ, పల్లవించు.

చిగురుచు, రూ-చిగుర్చు. 1.—వై.—; 2. ఎత్తునగు. జై. 4, ఆ. 101: చూ, వల్లటిల్లు.

చిగురుటల్లె, దే. వి: చూ, చిగురువిల్లు.

చిగురుటాకు, దే. వి: చూ, రూ-చిగురాకు.

చిగురువిలుకాఁడు, దే. వి: చూ, మన్మథుఁడు. (రూ-చిగురు విలాకాఁడు.)

చిగురువిల్లు, దే. వి. మన్మథుని మూఁడవదియగు వింటియొక్క నారి. (దీని బాణములు.—నల్లకలువ, అరఁటి, మొల్లపూలు: చూ, తుమ్మెదయల్లె): చూ, మౌర్వి. 1: (చూ, బాణము. 1.)

చిగురొత్తు, దే. అ. క్రి. (చిగురు + ఒత్తు) 1: చూ, చిగురుచు; 2. అనురాగము గలదియగు: చూ, ప్రియపడు.

చిగుర్చు, దే. అ. క్రి. 1: చూ, రూ-చిగురుచు; వి. 2. నిప్పుల గుంపు: చూ, వహ్ని. 1-౧౩.

చిచ్చఱ, వై. విశ. = శుచి. (చిచ్చు + అఱ) అగ్నిమయము. రూ-చిచ్చుఱ: చూ, వహ్ని. 1.-౧౩.

చిచ్చఱకంటి, ద్వి. వి. (చిచ్చఱ + కన్ను): చూ, శివుఁడు.

చిచ్చఱకోల, ద్వి. వి. ఆగ్నేయాస్త్రము: చూ, బాణము. 1-౧౩.

చిచ్చఱపిడుగు, జా. దిట్టముగా బాధించునది. "కం. వచ్చెఁగద విటులపాలిటి చిచ్చఱపిడు గింక నేమిసేయుదు ననుచున్." (నిరంకుశోపాఖ్యానము.)

చిచ్చి. దే. అవ్య. బిడ్డలకు జోలలుపాడునపుడు పీడా పరిహారార్థము చెప్పఁబడు మాట. రూ-చిచ్చీ: చూ, శబ్దము. 2.-౩౩.

చిచ్చికుఁడు సం. వి. అ. పుం. 1. రూ- చికిత్సకుఁడు: చూ, వైద్యుఁడు; 2. నాట్యపరిభాషయందు పూజ్యుఁడు: చూ, మారిషుఁడు.

చిచ్చీ, దే. అవ్య: చూ, రూ-చిచ్చి.

చెంచెడము, దే. వి: చూ, రూ - చెంచడము.
చెంచెత, వై. వి. శబరకాంత : చూ, స్త్రీ.
చెంచడము, దే. వి. రూ - చెంచెడము. ఒకానొక డేగ : చూ, శ్యేనము.
చెంచలి, దే. వి. చెంచలికూర, కుబుంజము *: చూ, వనవాస్తుకము.
చెంచు, వై. వి. 1. = చుందరి. గంధమూషికము ఆంధ్ర. వ. 5-24: చూ, మూషికము ; 2. = చంచః. శబరుఁడు : చూ, వ్యాధుఁడు. 1.
చెంచువాఁడు, ద్వ. వి. శబరుఁడు : చూ, వ్యాధుఁడు. 1.
చెండాడు, దే. స. క్రి. (చెండి + ఆడు) ఖండించు : చూ, సెలగు.
చెండి, వై. వి. = చండికా. గౌరి: చూ, పార్వతి. 1.
చెండు, దే. వి. 1. కందుకము : చూ, బంతి. 3; 2. పూలబంతి: చూ, పూబంతి ; 3: చూ, బాలక్రీడ ; స. క్రి. 4. ఖండించు : చూ, సెలగు.
చెండుదానిమ్మ, ద్వ. వి. కాయలులేక పూవులుమాత్రము చెండువలెఁ బూచెడి యొకరకము దానిమ్మ *: చూ, దానిమ్మ (నోటివెంట కారెడు రక్తము కట్టును.)
చెండుబెండాడు, దే. స. క్రి. (చెండుబెండు + ఆడు) ఖండించు. రాఘ. 3, ఆ. 72: చూ. సెలగు.
చెండుబెండాడుట, జా. ఖండించుట, బంతితో, బెండుతో నాడుట. "ఉ. ఈడితశక్తి నంగ జగతీశ్వరు సైనికులల్ల చెండ్లుబెండాడఁగ," కళా. 8, ఆ. 58.
చెంత, దే. వి. చేరువ: చూ, సమీపము. 1.
చెందమ్మి, దే. వి. (చెన్ను + తమ్మి) ఎఱ్ఱతామర, కోకనదము: చూ, సహస్రపత్రము. 1-౩.
చెందామర, (చెన్ను + తామర) —పై.—
చెందిరము, వై. వి. 1. = సింధూరము. రూ-చెంద్రము-చెందిరిక-చెంద్రిమ-చెంద్రిమము-చంద్రము-చందురము: చూ, సిందూరము. 1; 2. అగ్నిశిఖము: చూ, వహ్నిశిఖము. 1.
చెందిరిక, దే. వి. రూ-చెంద్రిక. 1. కమ్మపైదుద్దు. స్వా. 5, ఆ. 58: చూ, భూషణము. 2- ౮-(౧౫); వై. వి. 2. = సిందూరమ్. కుసుంభపుష్పము: చూ, వహ్నిశిఖము. 2; 3. కుసుంభవర్ణము. వసు. 5, ఆ. 81: చూ, వర్ణము. 6-౪-(౮.)
చెందు, దే. స. క్రి. 1. పొందు: చూ, ప్రాపించు; అ. క్రి. 2. కలుగు: చూ, పుట్టు. 2.
చెందుప్పు, ద్వ. వి. = సింధు. (చెందు + ఉప్పు) ఇందుప్పు, సైంధవము: చూ, లవణము. 1.
చెందొగ, దే. వి. (చెన్ను + తొగ) ఎఱ్ఱగలువ, హల్లకము. రూ-చెందొవ: చూ, సహస్రపత్రము. 1-౧౨-(౧).
చెందొవ, దే. వి. —పై.—
చెంద్రము, వై. వి. = సిందూరమ్: చూ, రూ-చెందిరము. (వృత్తియం దంత్యవర్ణలోపము. చెంద్రకావి మొ.)
చెంద్రవంకలు, వై. వి. బ. = చంద్రవక్ర చెంద్రవంక లను వడ్లు: చూ, ధాన్యము.

చెంద్రిక, చూ, రూ-చెందిరిక. (కమ్మపైదుద్దు.—విజ. 3, ఆ. 142; కుసుంభపుష్పము.—వసు. 6, ఆ 74; కుసుంభవర్ణము. —స్వా. 5, ఆ. 68.)
చెంద్రిమ, వై. వి. = సిందూరమ్: చూ, రూ-చెందిరము.
చెంద్రిమము, వై. వి. = —పై.—
చెంప, దే. వి. రూ-చెరఁప. కపోలము: చూ, లెంప. 2; 2. లెంప: చూ, పార్శ్వము. 2.
చెంపకల్లీ, దే. వి. స్త్రీభూషావిశేషము: చూ, భూషణము. 2.-౮-(౧౪).
చెంపకాయ, దే. వి: చూ, లెంపకాయ.
చెంపకొప్పు, దే. వి. ప్రక్కకొఱగించివేసిన కొప్పు: చూ, వేనలి.
చెంపదెబ్బ, దే. వి: చూ, చెంపకాయ.
చెంపసరులు, ద్వ. వి. బ. స్త్రీకర్ణభూషావిశేషము: చూ, భూషణము. 2.-౮-(౧౪).
చెంబట్టిక, వా. వి. ఏరుగడము. "శిశువు ఉయ్యాలలో చెంబట్టిక వెళ్లినాఁడు.": చూ, మలము. 1. (గోదావరీ, విశాఖమండల ప్రాంతములలో వాడుక.)
చెంబట్టికి, వా. వి. —పై.— "చెంబట్టికి తీయుము."
చెంబడివాఁడు, వా. వి. నావికుఁడు: చూ, సరఁగు.
చెంబు, వై. వి. = కల్బ. రాగి మొదలైన వానితోఁ జేసిన చిన్న నోరుగల చిన్న పాత్రము: చూ, పాత్రము. 6.
చెంబుతల, ద్వ. వి. బట్టగట్టినతల: చూ, బట్టతల.
చెకచెకలాడు, దే. స. క్రి. సంతోషముతో చెలరేఁగు,
చెకడా, వై. వి. = శకట. సరకులుతెచ్చెడి రెండెడ్లబండి: చూ, శకటము. 1.
చెకపికలాడు, దే. స. క్రి. తొందరపెట్టు. సా. 1, ఆ. 74: చూ, బాధించు.
చెకము, దే. వి. వస్త్రము మొదటిబద్దె: చూ, వస్తి. 1.
చెకముకి, దే. వి. రూ-చెకుముకి. నిప్పు కలుగుటకై యొక రకము ఱాతితోఁ దాఁకించెడి యుక్కుతునుక: చూ, (స్థూలోచ్చయము. 1-2.) (రత్నములు. 1-౧౨-(౧).
చెకుముకి, —పై.—
చెకుముకిఱాయి, —పై.—
చెక్క, వై. వి. 1. మ్రాను లోనగువాని పలుచని ఖండము: చూ, శకలము. 4; 2. = త్వక్కు: చూ, తోలు. 1; 3. దారుభేదము: చూ, గడు; 4. = శకల. తునుక: చూ, శకలము. 4; 5. పూగభాగము: చూ, పోఁక; 6: చూ, చెక్కతావి.
చెక్కకొఱుజు, ద్వ. వి. పశువులమేని రక్తముఁ బీల్చెడి యొక రకము పిడుఁజు: చూ, బుడ్డపిడుఁదు.
చెక్కకొఱుదురు, ద్వ. వి. —పై.—
చెక్కచెట్టు, ద్వ. వి. ఎఱ్ఱచాయవేయుట కుపయోగించెడు చెక్కగల యొకానొక చెట్టు: చూ, వృక్షము.
చెక్కడము, దే. వి. (రత్నములను) పొదుగుట. చెక్కు: చూ, చెరువు. 1.

చెక్కుతాపి, వై. వి. బేలుదారి గోడ మొదలగు వానిమీఁద పూసిన గాఱను దాచి మట్టపఱచెడి వీఁపున పిడియమర్చిన గుండ్రనిడుపు జేనెఁడు చిన్నపలక. చెక్కు-రూ-చెక్కు, తాపి. రూ-తాపీ.

చెక్కపిసుఁజు, ద్వ. వి: చూ, చెక్కకొణుజు.

చెక్కి, వై. వి. = శంఖ. రూ - చెక్కిలి - చెక్కుకపోలము: చూ, లెంప. 2.

చెక్కియము, దే. వి. రూ- చెక్కెము. 1. ఎముకలలోని నెయ్యి: చూ, స్నేహము. ౬—౨; 2. మస్తిష్కము: చూ, మెదడు.

చెక్కిలి, వై. వి. = శంఖ: చూ, రూ - చెక్కి. (దేశ్యమని శబ్దరత్నాకరము) (దీనికి ఉపమానములు.— అద్దము, కర్పూరము, చంద్రశకలము.)

చెక్కు, దే. వి. 1: చూ, చెక్కుతాపి; 2: చూ, చెక్కడము. రా. వి. 2, ఆ. 39; 3. గడ్డితోఁగూడిన మట్టిపెల్ల: చూ, భూమి. 1; 4. సొమ్ముతెచ్చుటకు ఆజ్ఞాపత్రిక: చూ, హుండీ; వై. వి. 5. = శంఖ: చూ, రూ - చెక్కిలి; దే. స. క్రి. 6. ఖచించు, (రత్నములను) పొదుగు: చూ, వారు. 1; 7. చెక్కులుచేయు (వై. అని కొందఱు.)

చెక్కు చెమర్చకుండుట, జా. కసుగందకుండుట. "ఎలతుమ్మెదలు చెక్కు చెమరింపకున్నవా చిగురుఁబోఁడి" విజ. 4, ఆ. 62; "జయాంగనాసంగమంబును బొసంగియుఁ జెక్కు చెమర్పక యక్కురువీరుండు." విజ. 3, ఆ. 160.

చెక్కు చెమర్పు, ద్వ. వి: చూ, శ్రమము. 1.

చెక్కుటద్దము, వై. వి. అద్దమువంటి కపోలము. నై. 6, ఆ, 103: చూ, లెంప. 2.

చెక్కుడుపాఱ, ద్వ. వి: చూ, కోఱుడుపాఱ.

చెక్కులు, ఆం. 1: చూ, చుంబనస్థానములు; 2: చూ, కళాస్థానములు.

చెక్కెము, దే. వి: చూ, రూ - చెక్కియము.

చెచ్చెర, దే. ద్ర. క్రి. విశ. 1. శీఘ్రముగ: చూ, వేగము. 3; 2: చూ, సులభము.

చెట్ట, వై. వి. 1. = చేష్టా. కీడు: చూ, హాని. 2; 2. చేయి: చూ, హస్తము; 3. ఆపద: చూ, విపత్తు; విశ. 4. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

చెట్టపుమెకము, ద్వ. వి. ఒత్తెడుపిల్లి. సాంబ. తిర్య. 12: చూ, మార్జాలము.

చెట్టవట్టు, దే. వి. (చెట్ట + పట్టు) 1. పెండ్లి: చూ, వివాహము; స. క్రి. 2: చూ, వివాహము; స. క్రి. 2: చూ, పెండ్లియాడు.

చెట్టు, దే. వి. 1: చూ, వృక్షము; 2. గుల్మము: చూ, పొద. 2; 3. ఓషధి: చూ, వృక్షము.

చెట్టుఁగొట్టి పైవేసికొనుట, జా. వ్యర్థముగా బాధ తెచ్చికొనుట.

చెట్టుఁగట్టుట, చెట్లపాలుసేయుట. జా. కష్టపెట్టుట. "సీ. అతనినే చెట్టఁగట్టితి వీకఁ దేచోట లంకించుకొనియె నలంఘ్యమయిన" కళా. 3, ఆ. 254.

చెట్టుఁద్రిమ్మరి, దే. వి. (చెట్టు + త్రిమ్మరి) వృక్షచరము. అప్ప. యు, కాం. 177: చూ, వావరము.

చెట్టుగట్టు, దే. అ. క్రి. (చెట్టు + కట్టు) చెట్టుగానేర్పడు.

చెట్టుచెడుకాలమునకుఁ గుక్కమూతిపిందె, లో. ఉదా.— "చెట్టుచెడు కాలమునకుఁ గుక్కమూతిపిందె యన్నట్లు చేటుకాలంబు కడునికటంబైన వీని కీ దుస్బుద్ధి ఘటిల్లెఁగాఁబోలును." (నీతి చంద్రిక - విగ్రహము.)

చెట్టునట్టు, దే. వి: చూ, చెడుఁద్రిమ్మరి.

చెట్టుప, దే. వి. రూ - చట్టుప: చూ, జెక్కు. 1.

చెట్టుపడు, ద్వ. అ. క్రి: చూ, స్తంభించు.

చెట్టుమొదలు, ద్వ. వి. అంఘ్రినామము: చూ, వేరు. 1.

చెట్టొక పిట్టయగుట, జా. చెల్లాచెదరగుట. "సీ. తరుణి నీనడలతో సరిరాక యంచలు చెట్టొకపిట్టయై చెదరిపారె." (కవిచకోర చంద్రోదయము); "ఉ. చెట్టొక పిట్టయై చనిరి సేనలవారలు." (శశిరేఖా నాటకము.)

చెట్లకట్టియ, వై. వి. = శఠ. మూర్ఖుఁడు, కోపి: చూ, రూ - చిట్లికట్టియ (దేశ్యమని శ. ర.)

చెట్లకట్టె, వై. వి. = శఠ.—వై.—

చెట్లకరివి, దే. వి. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

చెట్లపాలై గట్లపాలై, జా. చెల్లాచెదరై. "వారు చెట్లపాలై గట్లపాలై పోవఁజొచ్చిరి." (ధర్మజరాజసూయము.)

చెడగరము, దే. విశ. 1. క్రూరము: చూ, రౌరవము. 2; 2. క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

చెడనాడు, దే. స. క్రి. (చెడన్ + ఆడు) ఆడిపోసికొను: చూ, నిందించు.

చెడనివాఁడు, దే. వి. స్థిరుఁడు: చూ, సదాతనుఁడు.

చెడావు, వా. వి. అదనము, హెచ్చు.

చెడిది, దే. వి. 1. అశుభము: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు.

చెడిప, దే. వి. (చెడిన + అప) రూ - చెడిపె: చూ, అంకులాఁడి.

చెడిపె, —వై.—

చెడీ, వై. వి. = చండాతక. రూ - చెడ్డీ. చల్లడము: చూ, గుడిగి: (చూ, వస్త్రము. !—ణ—(ణ.).

చెడు, దే. అ. క్రి. 1: చూ, నశించు; 2. కొల్లపోవు: చూ, పతివోవు; 3. కనఁబడకపోవు; చూ, వమ్ముపోవు.

చెడుకంపు, దే. వి. పూతిగంధము: చూ, వాసన. 1—౪.

చెడుగఁడు, దే. వి. (చెడుగు + అఁడు) క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

చెడుగు, దే. వి. 1. అశుభకార్యము: చూ, హాని. 2; 2. ధూర్తుఁడు, కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; విశ. 3. దుష్టురాలు, కుత్సితస్త్రీ (అని కొందఱు): చూ, స్త్రీ. 1—౪ణ; 1—౪ణ—(౨); 4. క్రూరము; చూ, రౌరవము. 2.

చెడుగుడు, వా. వి: చూ, రూ - చిడుగుడు.

చెడుజాతి, వా. వి: చూ, అరుజాతి.

చెడుతలఁపు, దే. వి: చూ, దుర్గుణము.

చెడుదుమ్ము, దే. వి: చూ, కరణము. 4.

చెడుప్రత్తి, దే. వి: చూ, అడవిప్రత్తి *.

చెడ్డ, వై. వి. 1. = చేష్టా. రూ - చెట్ట. కీడు: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు; విణ. 3; చూ, దుష్టము. "చెడ్డపని."

చెడ్డతొయ్యలి, ద్వ. వి. కులట: చూ, అంకులాఁడి.

చెడ్డపని, ద్వ. వి. కానిపని: చూ, వ్యతీకము. 2.

చెడ్డమాట, ద్వ. వి. చెడ్డపలుకు: చూ, శబ్దము. 2—४.

చెడ్డయిల్లు, ద్వ. వి. కాగారము: చూ, సదనము. 1.

చెడ్డి, దే. వి: చూ, రూ - చెడీ;

చెడ్డీ, దే. వి.—పై.—

చెడ్డు, దే. స. క్రి. తొడచఱచు.

చెణగరము, దే. వి: చూ, వ్యాధుఁడు. 2.

చెణుకు, దే. వి. అల్పము: చూ, స్వల్పము.

చెతురు, వై. వి. = చాతుర్యమ్: చూ, సామర్థ్యము. 1.

చెత్త, దే. వి. 1. తుక్కు: చూ, పెంట. 1; 2. గడ్డి: చూ, తృణము. 1.

చెద, వై. వి. పుట్టపెట్టు చీమ, శిథిలి. తెల్లని చీమలగుంపు (అనికొండలు): చూ, పిపీలిక (రూ - చెదలు.)

చెదపుపుగు, ద్వ. వి.—పై.—

చెదరఁబడు, ద్వ. అ. క్రి. (చెదరన్ + పడు) సీటిపొట్టు లోనగు నవి యెగిరిపడు: చూ, వెల్లివిరియు.

చెదరు, దే. వి. 1. చెదరుట, నీటిపొట్టు లోనగునని యెగిరి పడుట; 2. కలఁత: చూ, సంతాపము; అ. క్రి. 3: చూ, చెదరఁబడు; 4: చూ, ఆపులపడు.

చెదలు, వై. వి. = శిథిలీ: చూ, రూ - చెద.

చెదపట్టు, ద్వ. అ. క్రి. (చెదలు + పట్టు) చెదలుపట్టు.

చెనారము, దే. వి. 1. తృణలేశము: చూ, పెంట. 1; 2. గడ్డి: చూ, తృణము. 1.

చెనఁగి, దే. వి. రూ - చెన్నంగి - చెన్నఁగి. 1. పొట్టిపెంకాయ చెట్టు, అఖండకము*: చూ, స్కంధఫలము. 1—౧; ఐ. 2. ధాన్యవిశేషము. హంస, 4, ఆ. 128: చూ, ధాన్యము.

చెనఁటి, దే. విణ: రూ - చెన్నఁటి. 1. కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. కుత్సితము: చూ, హీనము. 1; 3. వమ్ము: చూ, వ్యర్థము; 4: చూ, శూన్యము. 1; 5. అల్పము: చూ, స్వల్పము.

చెనకు, దే. వి. 1. ఎదిరించుట, తలపాటు: చూ, లూటీ 4; 2. తాఁకుట. పాండు. 8, ఆ. 27: చూ, స్పర్శము. 1; 3. (గోటి) నొక్కు: చూ, నఖక్షతము; స. క్రి. 4. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; 5. తాఁకు: చూ, స్పృశించు.

చెనయు, దే. స. క్రి. 1. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; 2. తాఁకు: చూ, స్పృశించు; 3: చూ, సోలు.

చెనుపరి, దే. విణ. గ్రామ్యము (మాట): చూ, శబ్దము. 2—४

చెన్నంగి, దే. వి: చూ, రూ - చెనఁగి.

చెన్నఁగి, —పై.—

చెన్నఁటి, దే. విణ: చూ, రూ - చెనఁటి.

చెన్నఁటిపోవు, దే. అ. క్రి. (చెన్నఁటి + పోవు): చూ, వ్యర్థమగు.

చెన్నచెర్ల, దే. వి. తరిగొఱ్ఱు*: చూ, హలిని; 2. వెన్న వెదురుకూర*: చూ, హలిని.

చెన్నచెఱుకు, —పై.—

చెన్ను, దే. వి. 1. కాంతి. ఆం, భా. ప్ర. 80: చూ, వెలుఁగు. 1; 2. రీతి: చూ, విధము. 1; 3. అందము. స్వా. 5, ఆ. 70, పంచ. వేం. 4, ఆ. 546: చూ, సౌందర్యము; 4. మంజులము. ఆంధ్ర, సం. మా. 52: చూ, హృద్యము.

చెన్నుఁడు, దే. విణ. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

చెప్పకచెప్పెడు, జా. ఒకరు చెప్పక తెలియఁబడుట. "చ. ప్రాయపుం, జిలుతతసంబు మీ మొగము చెప్పకచెప్పెడు సద్దిరయ్య." స్వా. 1, ఆ. 73.

చెపాయించు, రా. అ. క్రి. లేచిపోవు, పాఱిపోవు: చూ, సహకరించు.

చెప్పు, దే. వి. 1: చూ, పాదుక; స. క్రి. 2. అను: చూ, శబ్దించు. 1—౧౮. (దీనికిఁ బ్రార్థనాద్యర్థమునందు ద్విత్వము వికల్పముగ లోపించును. చెపుము, చెవుడు లోనగునవి.)

చెప్పుట, దే. వి. అనుట: చూ, ప్రస్తావము. 2.

చెప్పుటట్ట, దే. వి. రూ - చెప్పుకట్ట: (సం. ప.)— ఈ క్షితప్రియము, ఉపనక్రము, కాంక్షితప్రియము, కాకాండము, గోధాపది, చర్మారము.* (పిచ్చికుక్క కాటు విషము హరించును.)

చెప్పుడుమాట, దే. వి. నిదేశము, ఒకరు చెప్పునట్టి మాట: చూ, శబ్దము. 2—౩౦.

చెప్పుతట్ట, దే. వి: చూ, రూ - చెప్పుటట్ట*.

చెప్పువాఁడు, దే. వి: చూ, వక్త. 1.

చెమట, వై. వి. = శ్రమ. రూ - చెమర - చెమరు - చెమ్మట: చూ, స్వేదము. 1. (దేశ్యమని శ. ర.)

చెమటకాయ, ద్వ. వి. ఎండవేఁడిమిచేత దేహమునందుగలిగెడు చిన్నగుల్ల: చూ, చెమరకాయ.

చెమటగొట్టు, దే. విణ. చెమట పట్టినవాఁడు: చెమరుఁబోతు.

చెమటపట్టు, దే. అ. క్రి. అవిరిల్లు, చెమటపోయు, చెమరించు. రూ - చెమరుచు - చెమర్చు - చెమ్మరించు.

చెమటపోయు, —పై.—

చెమటియావు, దే. వి. చిత్రగవము. రూ - చేమటియావు. ఆం, భా. ద్వి. 263: చూ, ధేనువు

చెమర, వై. వి. = శ్రమ: చూ, రూ - చెమట.

చెమరకాయ, దే. వి: చూ, రూ - చెమటకాయ.

చెమరించు, దే. అ. క్రి: చూ, చెమటపట్టు. పా. 2, ఆ. 9.

చెమరు, వై. వి. 1. = శ్రమ: చూ, రూ - చెమర. పాండు. 5, ఆ. 201 (దేశ్యమని శబ్దరత్నాకరము); 2. = సింహాండ**: చూ, చెముడు. 1; 3: చూ, రూ - చెమరుఁగాకి.

చెమరుఁగాకి, దే. వి. రూ - చెమర్కాకి: చూ, వాయసము. 1.

చెమరుఁబోతు, దే విణ: చూ, చెమటగొట్టు.

చెమరుచు, దే. అ. క్రి. రూ - చెమర్చు. 1: చూ, చెమటపట్టు; 2. చెమ్మగిల్లు: చూ, పదనుకొను.

చెమర్కాకి, దే. వి: చూ, రూ - చెమరుఁగాకి.

చెమర్చు, దే. అ. క్రి: చూ, రూ - చెమరుచు.

చెఱపనచేట, దే. విణ. 1: చూ, నాశకుఁడు. జై. 4, ఆ. 69; 2: చూ, నాశకురాలు: చూ, స్త్రీ. 1—౩౧; జై. 4, ఆ. 69; 3: చూ, రూ - చెరపంజాట. ఆం, భా. తృ. వి. 6.

చెఱపు, దే. వి. 1. కీడు: చూ, హాని. 2: ప్రే. 2: చూ, చెఱచు. 1-2.

చెఱపోవు, దే. అ. క్రి: చూ, వాలాయించు.

చెఱబడ్డవాఁడు, దే. విణ: చూ, బందెకాఁడు.

చెఱమ, దే. వి: చూ, రూ - చెరమ.

చెఱలాట, దే. వి: చూ, విహారము. 1.

చెఱవడు, దే. అ. క్రి: చూ, చెఱపోవు.

చెఱసాల, వై. వి: చూ, బంధనాలయము.

చెఱి, దే. వి. 1: చూ, రూ - చెరి. 1; అవ్య. 2: చూ, రూ - చెరి. 2; 3. ఒక్కొక్కనికి: చెఱుక.

చెఱిసగము, వా. వి. పరస్పరము సమభాగము.

చెఱుక, దే. అవ్య: చూ, చెఱి. 3.

చెఱుకు, దే. వి: చూ, రూ - చెఱకు.

చెఱుకుపందెము, వా. వి. పన్నిదములలోని భేదము: చూ, వ్యవహారము. 4.

చెఱుచువాఁడు, దే. విణ: చూ, నాశకుఁడు.

చెఱుపరి, (చెఱుపు + అరి) —పై.—

చెఱుపు, దే. వి. 1. కీడు. భంగము (అని కొందఱు): చూ, హాని. 2; ప్రే. 2: చూ, చెఱచు.

చెఱుము, దే స. క్రి: చూ, ఊచు.

చెఱువు, దే. వి. 1. తటాకము: చూ, సరస్సు. 1; 2. సత్రము: చూ, సదనము. 1.

చెలఁగు, దే. అ. క్రి. 1. ఒప్పు: చూ, సమ్మతించు; 2. అలరు: చూ, వికసించు; 3. అంగవించు: చూ, యత్నించు; 4. ఉగ్గడించు: చూ, శబ్దించు. 1—౧౭; 5. బొబ్బరించు. జై. 7, ఆ. 32: చూ, వచించు: 6. అలరారు: చూ, ప్రకాశించు; 7: చూ, సంతోషించు.

చెలఁది, దే. వి: చూ, చెలగము. కళా. 3, ఆ. 83.

చెలఁదితెర, ద్వ. వి. సాలెపురుగు నేసిననేత: చూ, సాలెగూఁడు.

చెలఁదిబల్లి, వై. వి: చూ, చెలగము. వేం. ఆం. 95.

చెలక, దే. వి. రూ - చెలిక - చెల్క. 1. క్షేత్రము: చూ, భూమి 1; 2. బీటినేల: చూ, భూమి.1.—౭౦; 3. పరిమడి: చూ, భూమి. 1—౪౨.

చెలగము, వై. వి. = శలకః: చూ, సాలెపురుగు.

చెలగాటము, దే. వి: చూ, విహారము. 1.

చెలగు, దే. స. క్రి. ఖండించు: చూ, నెలగు.

చెలది, దే. వి. రూ - చెలిది - చెల్ది. 1. త్వగ్గతవ్యాధి: చూ రోగము. 1; 2. మేహరోగము: చూ, రోగము. 1.

చెలమ, దే. వి. ఎండిపోయిన యేఱు లోనగు వానియందు నీటికొఱకు త్రవ్వెడు పల్లము: చూ, సరస్సు. 1.—౧౩—(౮).

చెలయు, దే. అ. క్రి. 1: చూ. విజృంభించు; స. క్రి. 2. రూ - చెలవు - సెలయు: చూ, విసరు. 8.

చెలరేఁగు, దే. అ. క్రి. (చెలగు + రేఁగు) —పై.—

చెలవు, దే. స. క్రి: చూ, చెలయు. 2.

చెలామణి, వా. వి. చెల్లుబడి.

చెలి, దే. వి. 1. ఆఁడుది: చూ, స్త్రీ; విణ. 2. రూ - చెలికత్తియ - చెలికత్తె - చెలిమికత్తియ - చెలిమికత్తె. సఖి: చూ, స్త్రీ. 1—౮౮; 3. రూ - చెలికాఁడు - చెలిమరి - చెలువుఁడు, హితుఁడు: చూ, స్నేహితుఁడు. 2; అం. 4. (సుహృదులు): చూ, రాజ్యాంగములు.

చెలిక, దే. వి: చూ, రూ - చెలక.

చెలికత్తియ, ద్వ. వి. రూ - చెలికత్తె. 1: చూ, రూ - చెలి. 2; అం. 2: చూ, దూతీచతుష్టయము. (స్వార్థమున కత్తియ - కత్తె.)

చెలికత్తె, —పై.—

చెలికవెలుఁగు, దే. వి: చూ, వెలమసంది *.

చెలికాఁడు, దే. విణ: చూ, స్నేహితుఁడు. 2. (స్వార్థమున కాఁడు.)

చెలికారము, దే. వి: చూ, స్నేహము. 1.

చెలికె, దే. వి. పరిగనేరిన పొలము: చూ, భూమి. 1.—౪౪.

చెలిది, దే. వి: చూ, రూ - చెలది.

చెలిపి, దే. వి: చూ, లెంప. 2.

చెలిమరి, దే. విణ. (చెలిమి + అరి): చూ, స్నేహితుఁడు; 2. సఖి: చూ, చెలి. 2.

చెలిమి, దే. వి. రూ - చెలికారము - చెల్మి. ప్రేమము, మిత్రభావము (అని కొందఱు) చూ, స్నేహము. 1. ౨.

చెలిమికత్తియ, ద్వ. విణ: చూ, రూ - చెలికత్తియ. (ఇట్లు రూ - చెలిమికత్తె).

చెలిమికాఁడు, దే. విణ: చూ, చెలికాఁడు.

చెలిమిచుక్క, ద్వ. వి. అనూరాధానక్షత్రము, దోరణపుసాటి రిక్క: చూ, రిక్క. 1- ౧౭.

చెలిమిడి, దే. వి: చూ, జలతంతులీయము *.

చెలిమినిఁ జేదు మేపింపవచ్చునుగాని బలిమిం బాలు ద్రాగింపలేము, లో. ఉదా.—"చెలిమిమైఁ జేదుమేపింపవచ్చుంగాని బలిమిమైఁ బాలు ద్రావింపరాదు అను లోకోక్తి వినలేదా." (నీతిచంద్రిక - విగ్రహము.)

చెలియ, దే. వి. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. సఖి: చూ, స్త్రీ.

చెలియలికట్ట, దే. వి. సముద్రపుగట్టు, వేల: చూ, రోధస్సు.

చెలియలు, దే. వి. రూ - చెల్లియలు - చెల్లెలు - చెల్లె - చెలెలు. చిన్నసోదరి: చూ, సహోదరి.

చెలువ, దే. వి. (చెలువు + అ) - రూ చెల్వ. 1. అందముగల ఆఁడుది: చూ, స్త్రీ. 1—౨౪౦; 2. ఆఁడుది: చూ, స్త్రీ. 1.

చెలువము, దే. వి. 1. కాంతి: చూ, వెలుతురు. 1; 2. అందము: చూ, సౌందర్యము. (రూ - చెలువు - చెల్వు.)

చెలువు, దే. వి.—1-2.—పై.—; 3. రూ - చెల్వు. మంజులము. ఆంధ్ర, సం. మా. 52: చూ, హృద్యము.

చెలువుఁడు, దే. వి. 1. ధవుఁడు. ఆం, భా. ద్వి. 115: చూ, ధర్త. 1; 2: చూ, విటుఁడు; 3. సుందరపురుషుఁడు: చూ, సౌందర్యవంతుఁడు; 4. ప్రియుఁడు. కళా. 1, ఆ. 174: చూ, స్నేహితుఁడు. 1.

చెలో, వా. వి. బండితోలుట లోనగువానియందగు ననుకరణము: చూ, హూహూ.

చెల్కి, దే. వి; చూ, రూ-చెలక.

చెల్గు, దే. స. క్రి; చూ, రూ-చెలగు.

చెల్ది, దే. వి: చూ, రూ- చెలది.

చెల్మి, దే. వి: చూ, రూ-చెలిమి.

చెల్ల, దే. ధ్రి. ఐతార్థకము. సంతాపమును దెలుపునది: చూ, సంతాపము.

చెల్లఁబో, దే. అవ్య. (చెల్లన్ + పో)—పై.—

చెల్లచెదరు, దే. విణ. (చెదరు + చెదరు) రూ-చెల్లాచెదరు. మిక్కిలి చెదరినది: చూ, యథాయథా.

చెల్లాచెదరు, —పై.—

చెల్లించు, దే. స. క్రి, అం, భా, తృ. 124: చూ, అచ్చు. 23.

చెల్లియ, దే. వి: చూ, రూ-చెలియలు- చెల్లెలు.

చెల్లియలు, —పై.—

చెల్లు, దే. వి. 1. బాకీదారు యిచ్చిన సొమ్మును తనబాకీపత్రము వెనుక తట్టున వ్రాయు జమ: చూ, వసూలు; విణ. 2.చేరినది "చెల్లురూపాయిలు ముప్పది"; అ. క్రి. 3. చచ్చు: చూ, సమయు; 4. వెచ్చమై తీఱు: అయిపోవు- రూ-ఐపోవు; 5. కడచు: చూ, సను. 3; 6. కొనసాగు. జై. 6, ఆ. 46: చూ, సిద్ధించు; 7. తగు, యుక్తమగు; చూ, సరిపడు. 2; 8. శక్యమగు: చూ, వనపోవు; 9. దీర్ఘమగు: చూ, సాఁగు. 2; 10. చేరు. "నాకు రూకలు చెల్లెను.": చూ, బేరము.

చెల్లుబడి, దే. వి. 1. అధికారము, ప్రాజాపత్యము: చూ, రపము. 1; విణ. 2. సిద్ధిఁబొందినది: చూ, రపము.

చెల్లె, దే. వి: చూ, రూ-చెల్లియ.

చెల్లెలికట్ట, దే. వి: చూ, రూ- చెలియలికట్ట.

చెల్లెలు, దే. వి; చూ, రూ- చెల్లియలు.

చెల్వ, దే. వి: చూ, రూ- చెలువ.

చెల్వు, దే. వి: చూ, రూ-చెలువు (కాంతి.- ఆ., భా. ప్రి. 30: మంజులము.- వేం. ఆం. 56.)

చెవల, వా. వి: చూ, చవట.

చెవాకు, ద్వ. వి; చూ, రూ- చెవియాకు.

చెవి, వై. వి.= శ్రవః. 1. శ్రవణము: చూ, శ్రోత్రము: 2. రాట్నము లోనగుయంత్రముల యందుఁ గల తదవయవ విశేషము; 3. తాళపుచెవి: చూ, బీగము.

చెవికిచేఁదు, జా. వినుట కసహ్యమైనది. "చెవికిఁ జేఁదుగా నున్నను దనకుఁ దోఁచిన హితము నిశ్శంకముగ వాకుప్రివ్వ వలయును." (నీతిచంద్రిక-విగ్రహము.)

చెవికెలు, దే. వి. గట్టినూలుపోచలు: చూ, సూత్రము. 1-౧౪.

చెవికొణక, ద్వ. వి: చూ, కొనచెవి.

చెవిగఱచుట, జా. రహస్యము చెప్పుట. "చేరువంజేరి యెవ్వరో చెవిగఱచెదరు." (నీతిచంద్రిక.)

చెవిగూబ, ద్వ. వి: చెవిబొక్క, గూబ; (సం. ప).— బుషభము, కర్ణజాహము, కర్ణమూలము, కర్ణరంధ్రము (చెవి మొదలు అని కొందఱు.)

చెవిబొరుపాము, ద్వ. వి. కర్ణజలూకః చూ, సర్పము.1-౪-(౪౧).

చెవిటి, ద్వ. విణ. (చెవి + అవిటి) చెవిటివాఁడు: చూ, బధిరుఁడు.

చెవిటిమూగ, ద్వ. విణ. చెవుడును మూఁగతనమును గలవాఁడు; (సం. ప.) అనేడమూకుఁడు, ఏడమూకుఁడు: (చూ, బధిరుఁడు.)

చెవితమ్మె, ద్వ. వి. పోఁగులుంచుకొను తావు.

చెవిదోరనబెట్టు, ద్వ. స. క్రి. ఆలకించు: చూ, విను. 2.

చెవిబొక్క, ద్వ. వి: చూ, చెవిగూబ.

చెవియొగ్గు, ద్వ. స. క్రి: చూ, చెవిదోరఁబెట్టు.

చెవినిల్లుగట్టుకొనుట, జా. తఱుచుగాఁజెప్పుట. "మేమెల్లఁ బలు దెఱఁగులఁ జెవినిల్లుకట్టుకొని పోరిన మా మాటలు పాటిగాఁ గొనక." (నీతిచంద్రిక-విగ్రహము.)

చెవి మొదలు, ద్వ. వి: చూ, చెవిగూబ.

చెవియాకు, ద్వ. వి. (చెవి + ఆకు) 1. లక్కాకు: చూ, భూషణము. 2; 2. తాటంకము: (చూ, కమ్మ. 2.): చూ, భూషణము. 2.

చెవిలో సొంటికొమ్మూఁదుట, జా. "ఉ. మీ దొర మేదురాగ్రహ సమేతుఁడు సూర్యసుతుండు దేవతా, సూదన బాణవేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటికొ, మ్మూదినవాఁడ వైతివె యమో యిటువంటివె భృత్యకృత్యముల్." (రామాభ్యుదయము.)

చెవివాలఁబెట్టు, ద్వ. స. క్రి; చూ, చెవి దోరఁబెట్టు.

చెవివేయుట, జా. చెప్పుట. "ఎప్పటికప్పుడు మన చెవులవేసి చనుచుండవలయును." (నీతిచంద్రిక- విగ్రహము.)

చెవుడు, వై. వి. = శ్వేడః. చెవులు వినని రోగము, బాధిర్యము: చూ, బధిరితము.

చెవుడుపడు, వై. అ. క్రి. చెవుడుగలదియగు: రూ-చెవుడ్పడు (ప్రే-చెవుడుపఱచు.)

చెవుడుపాటు, వై. వి. చెవుడుపడుట, చెవిటితనము: చూ. చెవుడ్పాటు.

చెవుడ్పడు, వై. అ. క్రి: చూ, రూ-చెవుడుపడు.

చెవుడ్పాటు, వై. వి: చూ; రూ- చెవుడుపాటు.

చెవులపిల్లి, వై. వి: చూ, చెవులపోతు

చెవులపూవులు, వై. వి. బ. కర్ణభూష. కళా. 7, ఆ. 66: చూ, భూషణము. 2.

చెవులపోతు, ద్వ. వి. కుందేలు: చూ, శశము.

చెవులుబట్టియాడించుట. జా. లోఁకువచేయుట. "భూవిభుండారంభ రహితుండైనచోఁ బగవారు తలమీఁది వానినయినం జెవులు బట్టి యాడింతురు." (ధర్మజ రాజసూయము); "నిను గీతి సాహితీమో, హనవాణులు చెవులుబట్టి యాడింపంగా." విజ. 1, ఆ. 156; "సీ. చిన్నప్రాయపు లేడిఁజెవులు పట్టాడించు గతినున్న దీ రామ కన్నుదోయి." విల. 2, ఆ. 104.

చెవ్వ, దే. వి. శిశువులకు పుట్టినతోడనే కలుగు తెవులు, చెవ్వకాయలు: చూ, రోగము. 1.

చెవ్వకాయలు, —పై.—

చెవ్వాకు, ద్వ. వి: చూ, రూ- చెవియాకు 1.2; బ. 3. వ్యర్థోక్తులు. "అవ్వాకులు చెవ్వాకులు ప్రేలుచున్నాఁడు.": చూ, శబ్దము. 2-౩౫.

చెళ్ళు, వా. వి. చెంపదెబ్బధ్వని: చూ, హూహూ.

# చే

చే, వై. అవ. 1. తృతీయావిభక్తియందు వచ్చు ప్రత్యయము: చే, చేత, తో, తోడ; వి. 2. = కయ. రూ- చెయ్యి-చేయి: చూ, హస్తము; 3: చూ. రూ-చెయి.

చేఁజాచియడుగుట, అం: చూ, అష్టకష్టములు.

చేఁత, వై. వి. = చేష్ట. 1. చేయుట; 2. పని, కృత్యము. స్వా. 3, ఆ. 33: చూ, వ్యాపారము. 1; విణ. 3. కృత్రిమము. "చేఁతగట్టు."

చేఁతకాఁడు, ద్వ. విణ. క్రియావంతుఁడు. ఆచ్చ. ఆ, కాం. 33: చూ, సమర్థుఁడు.

చేఁతకాఱితనము, వా. వి. అశక్తి: చూ, శక్తి. 1-౩.

చేఁతగట్టు, వై. వి. కృతకాద్రి: చూ, పర్వతము.

చేఁతపెయ్య, ద్వ. వి. చనిపోయిన పెయ్యయొక్కతోలును గడ్డిపెకప్పి దూడయాకారముగ చేయఁబడిన కుత్సితరూపము: చూ, ధేనువు.

చేఁతరాసి, వై. వి. = ఝరసి. రూ - చేఁతలాసి: చూ, శకుల

చేఁతఱికము, దే. వి. రూ. చేఁతటికము. 1. వైరము: చూ, విరోధము. 1; 2. కీడు: చూ, హాని. 2.

చేఁతటికము, —వై.—

చేఁతలాసి, వై. వి. =: చూ, చేఁతరాసి.

చేఁతిదొండ, ద్వ. వి. చేఁదుగలదొండ*: చూ, దొండ.

చేఁతిదోస, దే. వి. చేఁదుగలదోస*: చూ, హరివాలుకము 1-౩.

చేఁతినీరు, ద్వ. వి. తిక్తోదకము: చూ, సలిలము.

చేఁతిపాదువ, అం: చూ, మల్లశాస్త్రము.

చేతిపుచ్చ, దే. వి. తిక్తకాళింగి*. (గాఢవిరేచనకారి, గర్భిణీ స్త్రీల కియ్యరాదు.): చూ, పుచ్చ.

చేఁతిపొట్ల, ద్వ. వి. పటోలిక*: చూ, పొట్ల.

చేఁతిబీఱ, దే. వి. చేఁదుగలబీఱ*: చూ, బీఱ.

చేఁతియానుగు, దే. వి. చేఁతిసొఱ*: చూ, సొఱ.

చేఁతిసొఱ, —వై.—

చేఁత్రాడు, దే. వి. (చేఁదు + త్రాడు) నీరు చేఁదునట్టి త్రాడు: చూ, సూత్రము. 1.

చేఁద, దే. వి. (చేఁదు + అ) నీరుతోడుపాత్రము. బొక్కెన: చూ, పాత్రము. 6. బొక్కెన. 4—౧.

చేఁదబావి, ద్వ. వి. నుయ్యి: చూ, సరస్సు. 1—౧౩. (రూ - చేఁదుడుబావి.)

చేఁదు, దే. వి. 1: చూ, తిక్తము; 2. వికటగంధము. అం, భా. ప్ర. 107: చూ, వాసన. 1—౧౩; అ. క్రి. 3. ఆకర్షించు: చూ, రెమ్ము; అం. 4: చూ, రసములు.

చేఁదుమేపుట, జా. ఇష్టములేని పనిచేయించుట.

చేఁప, దే. వి. 1. ఝషము: చూ, మత్స్యము. 1; 2. శుష్కమత్స్యము: చూ, మత్స్యము. 1.

చేఁపనూనె, ద్వ. వి: చూ, స్నేహము. 2—౩.

చేఁపరాసి, ద్వ. వి. మీనరాశి: చూ, రాశి.

చేఁపలబుట్ట, ద్వ. వి. కువేణి: చూ, వల. 1.

చేఁపు, దే. వి. 1. పాలద్రవనము; అ. క్రి. 2. పాలుద్రవించు, "ఎగచేఁపు": చూ, స్రవించు.

చేఁపుడు, దే. వి. చేఁపుట.

చేకట్లు, ద్వ. వి. బ. హస్తభూషావిశేషము, (ఇక్కడ ముఖియొక యర్థము చేతికట్లు) వసు. 2, ఆ. 44: చూ, భూషణము. 2.

చేకత్తి, ద్వ. వి. కరవాలము, చేతికత్తి: చూ, రిష్టి. 2—౧౩.

చేకము, దే. వి. వస్త్రముయొక్కదశ, బద్దె: చూ, పతె.

చేకానుక, ద్వ. వి. రాజులలోనగువారినిఁ జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము: చూ, సిస్తు. 1—౪.

చేకుఱు, దే. అ. క్రి. రూ - చేకూఱు, లభించు: చూ, సిద్ధించు.

చేకూర్చు, ద్వ. అ. క్రి. 1.—వై.—; ప్రే. 2. చేకూర్చు.

చేకూరు, దే. అ. క్రి: చూ, రూ - చేకుఱు.

చేకూఱు, దే. అ. క్రి.—వై.—అం, భా. తృ. 39.

చేకొఁజద, దే. వి. రూ - చేకొఁజిది. క్షీరమోరట*: చూ, మోరట.

చేకొఁజిది, —వై.—

చేకొఁఱుఁజు, దే. వి. శిధిలి, పచ్చరంగుగల చెదపురుగు: చూ, పిపీలిక.

చేకొఁఱుడు, —వై.—

చేకొను, ద్వ. స. క్రి. 1. గ్రహించు: చూ, పుచ్చుకొను; 2. అవరించు: చూ, సంభాళించు; 3. గెలుచు: చూ, జయించు; ప్రే. 4. చేకొలుపు.

ఛేకోక్తి, అం. అర్థాలంకారములలో నొకటి: లోకోక్తియన్యార్థగర్భితమగుట. ఉదా.—"పాముకాళ్లు పాము యెఱుంగును.": చూ, అలంకారములు. 3. (ఛేకోక్తి అని కొందఱు.)

చేగ, దే. వి. 1. రూ - చేవ: చూ, సారము. 5; 2. దృఢము: చూ, స్థిరము; 3. చాఁగి*: చూ, స్రవ.

చేగలమెకము, ద్వ. వి. (చె + కలమెకము) ఏనుఁగు: చూ, హస్తి.

చేగలవాఁడు ద్వ. వి. (చే + కలవాఁడు) ఈవికలవాఁడు: చూ, వదాన్యుఁడు.

చేగోడి, దే. వి. (చే + కోడి) కోడివడ: చూ, భక్ష్యము.

చేఁమురు, ద్వ. వి. నెయ్యి. సాంబ. మాన. 47: చూ, హవిస్సు. 2.

చేట, దే. వి. 1. చెరిగెడు సాధనము: చూ, శూర్పము; 2. కీడు: చూ, హాని. 2; అం. 3: చూ, మల్లశాస్త్రము.

చేటకుఁడు, సం. వి. అ. పుం. 1. దాసుఁడు: చూ, సేవకుఁడు; 2: చూ, నాయకనర్మసచివులు (నాయకసఖులు) (రూ - చేటుఁడు.)

చేటకొల్లారు, దే. వి. మూఁడు ప్రక్కలను చేరిక కట్టడముగల యిల్లు: చూ, సదనము. 1.

చేటగాలి, వా. వి. నిష్పావము: చూ, వాయువు. 1—౩౧.

చేటగోళ్లబోటి, ద్వ. వి. (చేటగోరు + బోటి) చుప్పనాక. అచ్చ. ఆర, కాం. 11: (చూ, శూర్పణఖ): చూ, రాక్షసి. 1.

చేటచెవులమెకము, ద్వ. వి. ఏనుఁగు: చూ, హస్తి.

చేటచెవులవేలుపు, ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.

చేటచేఱు, దే. వి. ఆఁడువారియొక్క యొకవిధమైన కోకకట్టు.

చేటపెయ్య. వా. వి: చూ, చేఁతపెయ్య.

చేటరిక్క, ద్వ. వి. కుమ్మరసారెచుక్క, విశాఖానక్షత్రము: చూ, రిక్క. 1.

చేటరిక్కనెల, ద్వ. వి. వైశాఖమాసము: చూ, మాసము. 1.

చేటవీనులదణి, ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.

చేటనవతురిక్క, ద్వ. వి: చూ, చేటరిక్క.

చేటి, సం. వి. ఈ. స్త్రీ. = చేడె. 1. అఁకుది: చూ, స్త్రీ. 1; 2. పనికత్తె, తొత్తు: చూ, స్త్రీ. 1—౫౩.

చేటిక, సం. వి. ఆ. స్త్రీ. = చేడె—పై.—; అం. 3: చూ, అభిసారిక.

చేటు, వై. వి. 1 = చేష్టా. రూ - చేట్పాటు - చేడి - చేడిచి, కీడు: చూ, హాని. 2; దే. వి. 2. ఆపద: చూ, విపత్తు; 3. నాశము: చూ, రుత్త.

చేటుఁడు, సం. వి. అ. పుం. 1. పనివాఁడు: చూ, సమస్థుఁడు; విజ. 2. నికృష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2: అం. 3: చూ, చేటకుఁడు: (చూ, నాయకనర్మసచివులు - నాయకసఖులు.)

చేటుపాటు, దే. వి. 1. అశుభము: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు. (రూ - చేట్పాటు.)

చేట్పాటు, —పై.—

చేట్లకొలవి, దే. విజ: చూ, వ్యాధుఁడు. 2.

చేడకుఁడు, సం. వి. అ. పుం. దాసుఁడు: చూ, సేవకుఁడు.

చేడి. సం. వి. ఈ. స్త్రీ. 1. దాసి. తొత్తు: చూ, స్త్రీ. 1—౫౩; దే. వి. (1) అశుభము. కీడు: చూ, హాని. 2.

చేడిక, సం. వి. ఆ. స్త్రీ. దాసిక, తొత్తు: చూ, స్త్రీ. 1—౫౩.

చేడిది, దే. వి. 1. అశుభము; చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు.

చేడియ, వై. వి. = చేటికా. రూ - చేడె. అఁకుది: చూ, స్త్రీ. 1—౫౩.

చేడుఁడు, సం. వి. అ. పుం. దాసుఁడు: చూ, సేవకుఁడు.

చేడె. వై. వి. =: చూ, రూ - చేడియ.

చేడ్పడు, ద్వ. అ. క్రి. 1. గాసిల్లు: చూ, బాధపడు; 2. చలించు: చూ, సలించు.

చేడ్పాటు, ద్వ. వి. చేడ్పడుట. బాధ, వ్యథ: చూ, శోకము. 2.

చేత్. సం. అవ్య. పక్షాంతరము, అయితే. అట్లాయెనా, ఇటువలెనైన.

చేత, వై. అప: చూ, మా-చే. 1.

చేతకి, సం. వి. ఈ. స్త్రీ. కరక*: చూ, హరీతకి.

చేతన, సం. వి. ఆ. స్త్రీ. తెలివి: చూ, బుద్ధి.

చేతనకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, చేతకి*.

చేతనము, సం. విజ. ప్రాణముకలది, జంతువు: చూ, ప్రాణి.

చేతనరత్నములు, అం. బ్రహ్మ- క్షత్రియ-వైశ్య- శూద్ర-స్త్రీ-గృహ-వన-అశ్వ- గోరత్నములు. (9).

చేతముకు, ద్వ. వి. చిన్నతముకు, (చేతితుడుము అనియు): చూ, వీణ. 1-౨౦.

చేతవులు, ద్వ. అ. క్రి. 1. లభించు: చూ, సిద్ధించు; 2. నష్టి వచ్చు: చూ, వన్నుమోవు.

చేతస్సు, సం. వి. స్. న. మానసము, మది, మనసు: చూ, హృదయము.

చేతాఁకు, ద్వ. వి: చూ, సాహసము.

చేతికఱ్ఱ, వై. వి: చూ, వేత్రము. 1.

చేతిబిడ్డ, ద్వ. వి. (చేయి + బిడ్డ) పసిబిడ్డ: చూ, శిశువు.

చేతివట్టము. దే. వి. చేతిసొమ్ము దండుగ.

చేతివ్రాలు, ద్వ. వి. బ. (చేయి + వ్రాలు) మా-చేవ్రాలు: చూ, సంతకము.

చేతుకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మా-చేతకి.

చేతులప్పళించు, ద్వ. అ. క్రి. లోపఱచు. ఆం, భా. తృ. 160: చూ, మస్తరించు.

చేతులు, అం. (హస్తములు) 1. శరీరాంగముల లోనివి. (రెండు చేతులు): చూ, అంగము. 9; 2: చూ, నఖక్షతస్థానములు; 3: చూ, కళలుండుస్థలములు.

చేతులుచేయుచు, నోరుతినదు, లో. ఉదా.— "క. ఆడుగకయుం, దినఁదగువర, మిడు, సేనిపాకరణంబు యూక్షఁకుఁడైనం బుడమిం జేయును చేతులు, కుడువదు నోరనెడు మాటకును దప్పగునే." (కుచేలోపాఖ్యానము.)

చేతెఁడు, ద్వ. వి. హస్తప్రమాణము.

చేతోభవుఁడు, సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు.

చేత్రాపు, దే. వి. 1 సిద్ధరోహునష్టి బ్రాపు: చూ, సూత్రము. 1-౫౪; 2. మల్లయుద్ధాయుధము. ఆం, భా. ద్వి. 207: చూ, బాణము. 1: (చూ-మల్లశాస్త్రము.)

చేదంత, ద్వ. వి. కయిదండ: చూ, భూషణము. 2.

చేదర్పనము, వై. వి: చూ. చేకానుక. జై. 3, ఆ. 76.

చేదస్తము, వై. వి. = చాందసము. (చాదస్తమనియు వాడుక.)

చేవాటము, అం. 1: చూ, హిందూదేశజభాషలు: (చూ, భాష. 1.); 2: చూ, టక్కజభాషలు: (చూ, భాష. 1.)

చేది, సం. వి. ఇ. పుం: చూ, దేశములు. (చేదిదేశము.— చైద్యము, డాహాలము.)

చేదిరాజు, సం. వి. అ. పుం. శిశుపాలకుఁడు - శిశుపాలుఁడు, చేదిరాట్టు, చైద్యుఁడు, దమఘోషసుతుఁడు: చూ, రాజు. 1,—౫౨.

చేదిరాట్టు, సం. వి. జ్. పుం: చూ, చేదిరాజు.

చేదివియ, వై. వి. = కయుదివె, దివ్వటి: చూ, స్నేహాశము. 1—౩.

చేదోడు, ద్వ. విజ. (చే + తోడు) రూ - చేయిదోడు. 1. కార్యసహాయుఁడు; 2. కార్యసహాయురాలు.

చేదోడు వాదోడు, జా. పనికి సహాయము, మాటకుసహాయము. "చేదోడు వాదోడుగన్."

చేను, దే. వి. 1. బ. చేలు. పంటనేల. కళా. 8, ఆ. 12: చూ, భూమి. 1.—౪౫: (1—౪౨); 2. అడవి: చూ, విపినము. (వైకృతమని కొందఱు.)

చేపట్టు, దే. వి. 1. అనుగ్రహము: చూ, సాకతము. 2; 2. చోటు. పాండు. 4, ఆ. 163: చూ, స్థానము. 1; 3. ఆశ్రయము: చూ, ప్రాపు. 2; 4. పెండ్లి: చూ, వివాహము; 5: చూ, హస్తగ్రహణము; ద్వ. స. క్రి. 6. అవలంబించు: చూ, ప్రాపుగొను. 7. గ్రహించు: చూ, పుచ్చుకొను; 8; చూ, పెండ్లియాడు. హరిశ్చ. 2, ఆ. 175.

చేపట్టుకుంచము, ద్వ. విణ. ఎవ్వరేదికోరినను దానినే నెఱ వేర్చువాఁడు.
చేపడవ, ద్వ. వి. చిన్నపడవ: చూ, హోడము.
చేపడు, వై. అ. క్రి. 1. చిక్కు. పంచ. వేం. 4, ఆ. 517: చూ, లోఁబడు; 2. లభించు: చూ, సిద్ధించు.
చేపల్లటీ, ద్వ. వి. ఒకానొకపావురాయి, వేం. అం. 98: చూ, సురటీ.
చేపాటికఱ్ఱ, వా. వి. నడుము లోఁతులేనిది. చేతికి యూఁతగా నుండెడి చేతికఱ్ఱ.
చేపెట్టియ, వై. వి. = కరపేటి. రూ - చేపెట్టె: చూ, మందసము.
చేబ, దే. వి: చూ, విన్నాణములు.
చేబదులు, దే. వి. చేతిఅప్పు, అల్పకాలమునకుఁ దీసినఅప్పు: చూ, బాకి. 2.
చేబాడిస, ద్వ. వి. చిన్నబాడిస.
చేబియ్యము, వా. వి: చూ, చేరుడుబియ్యము.
చేబోడి, ద్వ. విణ: చూ, నిర్ధనుఁడు.
చేమ, దే. వి. దుంపజాతికూర, ఆలుకము, అలువు — రూ — ఆలూవు*: చూ, శకుటము (చేమకూర పాకమునఁబడెను.)
చేమకూర, వా. వి. 1. ఒకానొకశాకము; 2. ఈ శాకనామము ఒకానొక యింటిపేరు; "చేమకూర" వారు; "విజయ విలాస కర్త" "చేమకూర వేంకటకవి" "తోఁటకూరవారు" "పొన్నగంటివారు" "చింతకూరవారు" ఇత్యాది.
చేమంతి, వై. వి. = సేవంత: చూ, రూ - సేమంతి* (ఒకానొక పూఁజెట్టు.)
చేమంతిపువ్వు, వై. వి. 1. జడయందును, కొప్పునను ధరించు ఆఁడుదానినగ: చూ, భూషణము. 2.—౮—(౧౬); 2. చేమంతి చెట్టున పూచిన పూవు.
చేమటియావు, దే. వి. రూ - చెమటియావు. చిత్రవర్ణముగల గోవు: చూ, ధేనువు.
చేమపూరాజనములు, ద్వ. వి. బ. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.
చేమరి, దే. వి. ఆతంచనము. తోడంటు: చూ, తోడు. 4.
చేమిరి, —వై.— (పేరుటకై పాలలో మజ్జిగమిడుచుట.)
చేమోడుచు, ద్వ. అ. క్రి: రూ-చేమోడ్చు: చూ, మొక్కు. 2.
చేమోడ్చు, —వై.—
చేమోడుపు, ద్వ. వి. రూ - చేమోడ్పు: చూ, మొక్కు. 1.
చేమోడ్పు, —వై.—
చేయము, సం. వి. అ. న. 1. పరువడము: చూ, చయనము; 2. చయనాగ్ని: చూ, వహ్ని. 1—౪: వా. దే. క్రి. (1) కావింపము.
చేయమ్మ, వై. వి. = కరయాంబిక. (చేయి + అమ్మ) చేతితో ప్రయోగించెడు బాణము, జోడము: చూ, బాణము. 1.
చేయలఁతి, ద్వ. వి. విణ. (చే + అలఁతి) దగ్గఱ: చూ, సమీపము. 1.
చేయి, వై. వి. 1. = కర. రూ - చే - చెయి: చూ, హస్తము; 2 = కర. తొండము: చూ, శుండము; 3. కిరణము. అచ్చ. అ, కాం. 43: చూ, మయూఖము. 1; 4. పక్షము, వైపు "ఈవ్యవహారమునందు వాఁడు నాకు ఎదుటిచేయిగా నున్నాడు.": చూ, పార్శ్వము. 2; 5. పట్టు. హరిశ్చ. 2, ఆ. 49: చూ, ప్రతిగ్రహము. 1; 6. రెండుమూరల కొలఁది: చూ, చెయి. 3.
చేయిక్రిందగుట, జా. పుచ్చుకొనుట. "అపిఞ్ఛ శ్రీపతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపై, పాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమర్యాదంజెందు కరంబు క్రిందగుట నా హస్తంబు మీఁదౌట మే, ల్గాదే రాజ్యము గీజ్యము స్సతతమే కాయం బనాపాయమే." (భాగవతము.)
చేయిదోడు, ద్వ. విణ. (చేయి + తోడు): చూ, రూ-చేదోడు.
చేయిమీఁదగుట, జా. దాతలక్షణము, ఇచ్చువానిచేయి మీఁదుగా నుండుట, ఇచ్చుట.
చేయు, వై. స. క్రి. 1. = కృ. కావించు, ఒనర్చు, పన్ను: చూ, సమకట్టు; 2. నిర్వహించు: చూ, సలుపు; 3. కల్పించు: చూ, సృజించు.
చేర, దే. వి. రూ-చెఱ-చారె. ఇంచుక వంచఁబడిన చేయి. విజ. 1, ఆ. 132: చూ, హస్తము. 1-౧౩.
చేరి, అం: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1.)
చేరిక, దే. వి. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. కూడిక: చూ, సంయోగము; 3. రతి: చూ, సంయోగము.
చేరు, వై. వి. 1. = సరము. కళా. 7, ఆ. 121: చూ, భూషణము. 2.-౬(౩౩); 2. రూ-చేఱు. త్రాడు, దారము, పగ్గము - రూ - ప్రగ్గము, బొందు. పా. 2, ఆ. 39: చూ, సూత్రము. 1—౨౪; 3. గొలుసు. "ఉయ్యాలచేరులు": చూ, శృంఖలము. 3; వై. వి. 4. = సార. రూ-చేఱు-చారు. మిరియము లోనగు సంబారము చేర్చి కాఁచిన చింతపండురసము: చూ, యూషము (దేశ్యమని శబ్దరత్నాకరము); దే. వి. 5. దగ్గఱ: చూ, సమీపము. 1; అ. క్రి. 6. ఒఱగు: చూ, వ్రాలు. 3; 7. అంటనిట్లు. జై. 7, ఆ. 43: చూ, సమీపించు; 8. లభించు: చూ, సిద్ధించు; స. క్రి. 9. పొందు: చూ, ప్రాపించు.
చేరుకోల, వై. వి. కశ, రూ-చేర్కోల - చేఱుకోల: చూ, మునికోల. (బండిగుఱ్ఱములు, దుక్కిటెద్దు లోనగువానిఁ గొట్టెడి కొరడా) (ద్వయమని కొందఱు.)
చేరుగడ, దే. వి. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; 2. రక్షణము, దిక్కు: చూ, శరణము 2; విణ. 3. సమీపమైనది: చూ, సమీపము. 1.
చేరుగొండి, దే. వి. 1. చేరివచ్చిన పెండ్లాము: చూ, భార్య. 1; విణ. 2. చేరివచ్చినది: చూ, సహితము; 3. చెడ్డది: "ఇది చేరుగొండి ఆవు.": చూ, దుష్టము.
చేరుచు, దే. ప్రే. 1. చేరఁజేయు. అందించు. 3; 2. కూడఁబెట్టు: చూ, బంధించు. (రూ-చేర్చు.)
చేరుచుక్క, వై. వి. 1. పాపటబొట్టు: చూ, లలాటిక; 2. జడబిళ్ళ: చూ, భూషణము. 2. (రూ-చేఱుచుక్క.)

చేరుడుబియ్యము, దే. వి. మెఱుఁగుపోటులేని బియ్యము, చేప డులు - రూ - చేరుళ్లు, దంగుడులు - రూ-దంగుళ్లు: చూ, బియ్యము.
చేరుడులు, —పై.—
చేరువు, దే. వి. రూ-చేర్వు. దగ్గఱ: చూ, సమీపము. 1.
చేరుబడి, —పై.—
చేరుళ్ళు, దే. వి. బ: చూ, చేరుడుబియ్యము.
చేరువ, దే. వి. 1. రూ-చేర్వ. గుంపు: చూ, సమూహము; 2. దండు: చూ, సేన. 1; 3. రూ-చేరువు - చేరుబడి - చేరు గడ: చూ, సమీపము. 1; విణ. 4. సమీపమైనది: చూ, సమీపము. 1.
చేరువకాఁడు, దే. వి.1. ఒక సమూహమున కధిపతి; 2. సేనాధి పతి: చూ, సైనికుఁడు: 3. కావలివాఁడు: చూ, తలారి.
చేరువరాజు, (సన్నిహితపురాజు). అం: చూ. ఈతిబాధలు.
చేరెడు, వా. వి: చూ, రూ-చేర.
చేర్కోల, వై. వి: చూ, రూ-చేరుకోల.
చేర్చు, దే. ప్రే: చూ, రూ-చేయుచు.
చేర్చుక్క, వై. వి: చూ, రూ-చేరుచుక్క. స్వా. 1, ఆ. 5.
చేర్పు, దే. వి: చూ, రూ-చేరువు.
చేర్లకోల, ద్వ. వి: చూ, రూ-చేరుకోల.
చేర్వ, దే. వి: చూ, రూ-చేరువ. 1.
చేఱ, వై. వి: చూ, రూ-చేర.
చేఱు: చూ, రూ-చేరు. 1-2-3-4-5.
చేఱుకోల, వై. వి: చూ, రూ-చేరుకోల.
చేఱుచుక్క, వై. వి: చూ, రూ-చేరుచుక్క. (జడబిళ్ళకు అం. భా. ద్వి. 147.)
చేఱుబొందు, ద్వ. వి. కొల్పెడు తోలుపట్టెడ.
చేఱులకోల, వై. వి: చూ, రూ-చేరుకోల.
చేల, సం. విణ. 1. తక్కువైనది: చూ, హీనము. 1; వై. వి. (1). = చేలమ్. బట్ట: చూ, వస్త్రము. 1-౧.
చేలని, సం. వి. ఈ. స్త్రీ. జూదమునందలి సారె : చూ, వ్యవహారము. 4.
చేలము, సం. వి. అ. న. 1. = చీర - చేల - సెల్లా - సేల. రూ-చేలి: చూ, వస్త్రము. 1-౧; 2. తోఁకలోనుండు నెమలి కన్ను; విణ. 3. అధమము: చూ, హీనము. 1.
చేలి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రూ-చేలము. 1; 2: చూ, సర్పాక్షి*.
చేలిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, చేలి. 1.
చేలుఁడు, సం. విణ. అధముఁడు : చూ, హీనుఁడు.
చేలుకుఁడు, సం. విణ. 1. భృత్యుఁడు: చూ, సేవకుఁడు ; 2. బుద్ధభిక్షుకశిష్యుఁడు: చూ, బుద్ధుఁడు. 1.
చేల్లి, అం: చూ. భిన్నషడ్జకభాషలు: (చూ, భాష. 1.)
చేవ, దే. వి. 1. రూ - చేగ: చూ, సారము. 5; 2. బలిమి. పంచ. వేం. 4, ఆ. 469: చూ, శక్తి; 3. ధైర్యము: చూ, స్థైర్యము. 1; విణ 4. దృఢము. అం, సం. మా. 55: చూ, స్థిరము; అం. 5: చూ, విన్నాణములు.
చేవట్టికాలుద్రొక్కు, దే. వి. పెండ్లి: చూ, వివాహము.
చేవలంతి, ద్వ. విణ. అధీనము: చూ, వశము. 1.
చేవాఁడి, ద్వ. వి. చౌర్యము: చూ, ముచ్చిలి.
చేవాఁడికాఁడు, ద్వ. వి. దొంగ: చూ, ముచ్చు. 1.
చేవాటు, వై. వి. విణ. దగ్గఱ: చూ, సమీపము. 1.
చేవిచ్చు, ద్వ. అ. క్రి: చూ, మ్రొక్కు. 2.
చేవిప్పు, ద్వ. వి. 1. నతి: చూ, మ్రొక్కు. 1; 2. నతివిశేషము: చూ, మ్రొక్కు. 1.
చేవెలుఁగు, ద్వ. వి: చూ, చేదివియ.
చేవ్రాలు, ద్వ. వి. బ: చూ, రూ-చేతివ్రాలు.
చేష్ట, సం. వి. ఆ. స్త్రీ. 1. = చేఁత, వ్యాపారము: చూ, పని. 2; 2. స్త్రీపురుషుల వేఁడుకపనులు; [illegible]. అవయవములఁ గదలించుట, భావమును దెలిపెడి ముఖవిలాసాది: చూ, వ్యంజకము. 1.
చేష్టకము, సం. వి. అ. పుం. ఒకో రతిబంధము; చూ, రతి బంధములు.
చేష్టలుడుగు, మి. అ. క్రి. చేష్టలుడిగి యేమియుతోఁచక అట్టె నిలుచు : చూ, వెఱఁగుపడు.
చేష్టించు, సం. అ. క్రి. చేష్టలుచేయు.
చేష్టితము, సం. వి. అ. న. 1. గతి: అమల్: చూ, వర్తనము. 1; 2. చేష్ట: చూ, వ్యంజకము. 1.
చేసన్న, వై. వి. చేతితోఁజేయుసంజ్ఞ: చూ, సన్న; 2. అభినయము : చూ, వ్యంజకము. 1.
చేసన్నాయి, ద్వ. వి: ఊఁదువాద్యము : చూ, వీణె.
చేసికొను, కా. అ. క్రి. అవధరించు.
చేసేతన్, వై. అవ్య. 1. (చేతన్ + చేతన్) ఒకరొకరి చేతి మీఁదుగా; 2. అప్పుడే.

## చై

చైతన్యము, సం. వి. అ. న. 1. తెలివి : చూ, బుద్ధి; 2. ఉసురు : చూ, ప్రాణము. 6; పుం. 3. భగవదవతార విశేషము; తద్వి - ౧ విణ. అంతస్సంజ్ఞకు.
చైత్యద్రుమము, సం. వి. ఉ. పుం: చూ, రావి*.
చైత్యము, సం. వి. అ. న. 1. కట్టడము ; 2. యజ్ఞశాల : చూ, సదనము. 1; 3. ముని యిల్లు : చూ, సదనము. 1; 4. గుడి; చూ, సదనము 1: 5. బౌద్ధాలయము, వినాముఖము, ఆయతనము : చూ, సదనము. 1; 6. మనస్సు : చూ, హృదయము. 2; 7. ఓలగము : చూ, సభ. 2; 8. సొద : చూ, శ్మశానము; పుం. 9. ఉద్యానవనమందలి మ్రాను, రచ్చమ్రాను* : చూ, రచ్చ; 10: చూ, చైత్యద్రుమము*.
చైత్యముఖము, సం. వి. అ. పుం. కమండలువు : చూ, పాత్రము. 6.
చైత్యవందనము, అం: చూ, బౌద్ధధర్మములు.
చైత్యవృక్షము, సం. వి. అ. పుం: చూ, చైత్యద్రుమము*.
చైత్యాలయము, సం. వి. అ. పుం. పాతాళలోకము : చూ, లోకము. 1.

చైత్యుఁడు, సం. వి. అ. పుం. బుద్ధుఁడు: చూ, బుద్ధుఁడు. 1; 2. బౌద్ధబ్రాహ్మణుఁడు : చూ, బుద్ధుఁడు. 1.

చైత్రకము, సం. వి. అ. పుం. చైత్రమాసము: చూ, మాసము. 1.

చైత్రగంధ, సం. వి. అ. స్త్రీ. 1. చింకిగుడ్డ : చూ, వస్త్రము ; 1.—౬౨; 2. చైత్రమాసియొక్క బొంత; చూ, వస్త్రము. 1.—౭౫.

చైత్రపాదము, సం. వి. అ. పుం: చూ, చైత్యద్రుమము*.

చైత్రము, సం. వి.అ. న.1. గుడి: చూ, సదనము. 1; 2.చావు, మృత్యువు : చూ, మరణము ; 3. గోరీ: చూ, సమాధి. 1; పుం. 4. చైత్రకము, మేషమాసము, మధువు. (చిత్తానక్షత్రముతోఁ గూడియున్న పున్నమ దీనియందుఁగలదు కనుక చైత్రము.దీనియందు మన్మథుఁ డుండును. మకరందము కూడ నుండును.): చూ, మాసము. 1; అం. 5: చూ, మాసములు; 6. చైత్రపర్వతము: చూ, పర్వతము:(చూ, వర్షపర్వతములు.)

చైత్రరథము, సం. వి. అ. న. కుబేరునితోఁట. (చిత్రరథుఁడను గంధర్వునిచే నిర్మింపఁబడినది): చూ, వనము. 2.

చైత్రరథుఁడు, సం. వి. అ. పుం. శశిబిందుఁడనురాజు : చూ, రాజు. 1—౫౩.

చైత్రసఖుఁడు, సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు.

చైత్రసారథి, సం. వి. ఇ. పుం.—పై.—

చైత్రావళి, సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుద్ధపూర్ణిమ : చూ, పున్నమ.

చైత్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. పూర్ణచంద్రుఁడుగల రాత్రి; 2. చైత్ర శుద్ధపూర్ణిమ: చూ, చైత్రావళి; న్. పుం. 3: చూ, చైత్రకము.

చైత్రికము, సం. వి. ఇ. పుం: చూ, చైత్రకము.

చైత్రుఁడు, సం. వి. అ. పుం, బుద్ధభిక్షుకుఁడు: చూ, బుద్ధుడు. 1.

చైదము, వై. వి. = చేష్టా. రూ - చైది. వ్యాపారము: చూ, పని. 2.

చైది, —పై.—

చైద్య, సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్కాసః: చూ, వెక్కుడు.

చైద్యము, సం. వి. అ. పుం: చూ, చేది.

చైద్యుఁడు, సం. వి. అ. పుం: చూ, చేదిరాజు.

చైను, వా. వి: చూ, గొలుసు. 7. (100 లింకులు) (22 గజములు.)

## చో

చోక్షతరము, సం. విశే. = చొక్కటతరము. మిగుల స్వచ్ఛమైనది: చూ, హృద్యము.

చోక్షము, సం. విశే. 1. తీక్ష్ణము: చూ, తీంద్రము; 2. = చొక్కము, పరిశుద్ధము, నిర్మలమైనది; చూ, హృద్యము ; 4: చూ, సమర్థము ; 5. = సొప్పెము. మిగిలినది : చూ, శేషము. 1.

చోచ, సం. వి. ఆ. స్త్రీ. వరకోణి, నారికేళపుబొండము : చూ, ముక్కంటిపండు.

చోచకము, సం. వి. అ. న. నార, పట్ట: చూ, బెరడు.

చోచము, సం. వి. అ. న. 1. టెంకాయ : చూ, ముక్కంటిపండు; 2. తాటిపండు : చూ, శ్రీతాళము; 3. అరటిపండు : చూ, రంభ. 2; 4. పట్ట : చూ, బెరడు ; 5. లవంగపుపట్ట*: చూ, వరాంగకము; విశే. 6. = సొప్పెము. మిగిలినది) (భుజించి విడిచిన యన్నము లోనగునది): చూ, చోక్షము. 5.

చోటి, సం. వి. ఈ. స్త్రీ. కాటి, దుప్పటి : చూ, వస్త్రము.

చోడము, సం. వి. అ. పుం. 1. చొక్కా : చూ, వస్త్రము; 2. ఉత్తరీయము : చూ, వస్త్రము. 1—౧౧; 3. చోడదేశము : చూ, దేశములు.

చోదకుఁడు, సం. విశే. 1. తోలువాఁడు: చూ, ప్రేరేపకుఁడు.

చోదనము, సం. వి. అ. న. 1: చూ, త్రోలుట; 2. నాన: చూ, ఎగ్గు; 3. ఉసికొలుపుట. ప్రేరేపించుట.

చోదనహారి, సం. వి. ఈ. స్త్రీ : చూ, బలురక్కెస*.

చోదనాగుడము, సం. వి. అ. పుం. కందుకము : చూ, బంతి 3.

చోదని, సం. వి. ఈ. స్త్రీ. పెన్నేరుగటి దూలగొండి*: చూ, స్వల్పదురాలభ.

చోదము, సం. వి. అ. న. లవంగపుపట్ట*: చూ, వరాంగకము.

చోదసంజ్ఞకము, సం. వి. అ. పుం. మునగ: చూ, శిగ్రువు.

చోద్యము, సం. వి. అ. న 1. = సొజ్జము. ఆశ్చర్యము: చూ, వింత. 1; 2. అడుగుట : చూ, ప్రశ్నము; 3. తిట్టు: చూ, శాపము. 1; 4. అమృతరసము కలది : చూ, రసములు; విశే. 5. త్రోలఁదగినది; 6 = సోదె ముందు శుభము తెలుపునది; సొద్దెము ఆశ్చర్యకరము : చూ, సొద్దెము.

చోర, సం. వి. ఆ. స్త్రీ. కట్ల*: చూ, శంకిని (పర్యంకపాళిక): (చూ, పద్మపు తీఁగ*) (చూడయను గ్రంథద్రవ్యమని కొందఱు)

చోరకము, సం. వి. అ. పుం. కచోరము* : చూ, షడ్గ్రంథ.

చోరతుండువు, సం. వి. ఉ. పుం. అగిసి*:చూ, శుకనాసము. 1.

చోరపుష్పి, సం. వి. ఈ స్త్రీ : చూ, చోర*.

చోరపుష్పిక, సం. వి ఆ. స్త్రీ.—పై.—

చోరము, సం. వి. అ. పుం. 1. చూడయను గంధద్రవ్యము : చూ, రాజార్హము. 1—౧౩; 2. = మూఅదోఁపుడు, కొల్ల: చూ, లూటీ. 4.

చోరసంజ్ఞకము, సం. వి. అ. పుం. మునగ* చూ, శిగ్రువు. 1.

చోరి, సం. వి. ఈ. స్త్రీ. కట్ల* : చూ, చోర.

చోరితము. సం. విశే. దొంగిలింపఁబడినది : చూ, ముచ్చిలి.

చోరీ, వా. వి. దొంగతనము : చూ, ముచ్చిలి.

చోరుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ, పగటిదొంగ (అని కొందఱు) : చూ, హారకుఁడు. 1. 2. మరుఁడు : చూ, మన్మథుఁడు.

చోరౌషధము, సం. వి. అ. న : చూ, లొద్దుగు*.

చోలండుకము, సం. వి. అ. పుం. తలపాగ : చూ, సీసకము (1)-౧; (1)-౩.

చోలకము, సం. వి. అ. పుం. 1. చెట్టు పట్ట : చూ, బెరడు; 2. దూదిబొంతచొక్కా (కవచము అనియు) : చూ, వారవారణము: (చూ, వస్త్రము. 1—౭—(౨).

చోలము, సం. వి. అ. పుం. రూ-చోళము, 1. కుప్పసము. చొక్కా, నిడు చట్ట : చూ, వస్త్రము; 2. అవిక: చూ,వస్త్రము; 3. చోళదేశము: చూ, దేశములు: (చూ, చోడము. 3.)

చోలోంతుకము, సం. వి. అ. పుం: చూ,రూ-చోలంతుకము.

చోషము, సం. వి. అ. పుం. పీల్చుట. ఊపిరి లోనికిఁదీయుట: చూ, వాయువు.

చోష్యము, సం. విశే. 1. పీల్చఁదగినది; అం. 2 : చూ, భక్ష్యములు.

చోస్కము, సం. వి. అ. పుం. సింధుదేశపు గుఱ్ఱము : చూ, హయము. 1—౨౧.

చోళకి. సం. వి. అ. పుం. 1. వెదురుమొలక : చూ, మొక్క, 1; 2. నారింజ* : చూ, శర్కరాంతము.1 —౧౧; 3. మోఁచేతికణుపు.

చోళము, సం. వి. అ. పుం : చూ, రూ-చోలము.

చోళవాండ్లు, తన్నాయిరము తిల్లమువ్వాయిరము అను బ్రాహ్మణులు. అం. వీరిలో శుక్లయజుర్వేదులు కృష్ణయజుర్వేదులు కలరు:చూ,బ్రాహ్మణులు. (వీరు ద్రావిడులలో నొకతెగవారు.)

# చౌ

చౌండాదికము, సం. వి. అ. పుం. పర్వతశిలల మధ్యభాగము : చూ, లోయ.

చౌక్షము, సం. విశే. మనోజ్ఞము : చూ, హృద్యము.

చౌరము, సం. వి. అ. పుం. 1 : చూ, చోర*; 2 : చూ, చోరము. 1 *.

చౌరి, సం. వి. ఈ. స్త్రీ. దొంగతనము : చూ, హరణము. 1.

చౌరిక, సం. వి. ఆ. స్త్రీ.—పై.—

చౌరుఁడు, సం. వి. అ. పుం. దొంగ: చూ, హారకుఁడు.

చౌర్యము, సం. వి. అ. న.= చూర: చూ, చౌరి.

చౌలము, అం. వడుగునకు ముందుఁ జేయు క్షౌరము. జుట్టుపెట్టి తలవెండ్రుకలు తీయుట యను షోడశకర్మములలోని యొకానొక యాయుష్కర్మము : చూ, కర్మములు.

# చ్య

చ్యవనుఁడు. సం. వి. అ. పుం. 1. రసాతలమునకు క్రిందిలోకమునుండు ముని:చూ,ముని. 1; 2: చూ, శాస్త్రప్రవర్తకుఁడు.

# చ్యు

చ్యుతమగు, సం. అ. క్రి. వీడు. వదలు : చూ, వీడుకొను.

చ్యుతము, సం. విశే. 1. జాఱినది : చూ, ప్రస్తుతము; అం. 2 : చూ, అర్థదోషములు.

చ్యుతసంస్కారదోషము, అం. గ్రామ్యపదదోషములం దొకటి ఇది పెక్కురీతులనగు. అందు సంధిదోషములు పదునాల్గు : చూ, సంధిదోషములు: (చూ, గ్రామ్యము. 6.)

చ్యుతసంస్కారము, అం. (వ్యాకరణదూష్యము) (వ్యాకరణదుష్టమైనపదము. ఉదా.-శ్రీ కమలకాంత పదసేవానర్మదుఁడు. ఇచటఁ గమలాశబ్దము స్త్రీలింగము గావునఁ గమలాకాంత యని యుండవలెను.) : చూ, పదదోషములు.

చ్యుతి, సం. వి. ఇ. స్త్రీ. 1. గళనము : చూ, జాఱుట; 2.విడుపు: చూ, వితరణము.

చ్యుసము, సం. వి. అ. పుం. ముఖము : చూ, వదనము. 2.

# ఛ

ఛ, ఒక యక్షరము. సం. వి. అ. పుం. 1. ఆచ్ఛాదనము : చూ, వ్యవధానము. 3; 2. వత్సరము : చూ, సంవత్సరము; 3. (ఊరు మొదలగువాని చుట్టునుండు) కంచె : చూ, వివీతము; 4. తెక్కలచప్పుడు: చూ, స్వనము. 2.—౪౬. (౫౫); 5. బరిణె : చూ, పాత్రము. 6; విశే. 6. నిర్మలము: చూ, సమీచీనము. 2; 7. నాశములేనిది: చూ, ఘని. 10; అం. 8 : చూ, తాలవ్యములు; 9. చవర్గములో నొక యక్కరము : చూ, కవర్గము.

ఛందము, సం. వి. అ. పుం. 1. అభిప్రాయము : చూ, స్మృతి. 1; 2. లోఁకువ : చూ, వశము. 1; 3 : చూ,ఛందస్సు. 1: (చూ, వృత్తము. 1.)

ఛందశ్చిత్తు, సం. వి. త్. పుం. చందశ్చయనమునుచేయువాఁడు.

ఛందస్సు, సం. వి. స్. న. 1. పద్యలక్షణము చెప్పెడు శాస్త్రము. ఛందము : చూ, ఛందస్సులు: (చూ, వృత్తము. 1);

శ్లో. "ఆదిమధ్యావసానేతి యరతా యాంతి లాఘవం
భజసా గౌరవం యాంతి మనౌతు గురులాఘవౌ."

శ్లో. "సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్తపరశ్చ యః
గురుమేతం విజానీయా దన్యో లఘు హ్యదాహృతిః."

2. తొలిచదువు, నిగమము : చూ, వేదము; 3. యథేచ్ఛమైన నడవడిక: చూ, వర్తనము.1;4. కోరిక : చూ, వాంఛ; అం. 5 : చూ, శాస్త్రములు; 6 : చూ, విద్యలు; 7 : చూ, వేదాంగములు.

ఛందస్సులు, అం. ఛందస్సు.- అన్ని వేదములయం దుండెడు నన్ని మంత్రములకు పాదవిభజనమును ఆపాదములకు గురులఘ్వక్షరసంఖ్యలను బోధించెడి శాస్త్రము. ఇది సర్వవిద్యేశ్వరుఁడైన శివునివలన నందీశ్వరుఁడు ఆయనవలన సనత్కుమార అగస్త్య, బృహస్పతి, ఇంద్ర, వాసుకి, పింగళు లనెడివారును సంప్రదాయక్రమమున నేర్చుకొనిరి. ఇందుపుట్టిన గ్రంథములు.—ఛందోవిచితి (వాసుకి, పింగళుఁడు), మృతసంజీవనీ వృత్తి (భట్టి, హలాయుధుఁడు), వృత్తరత్నాకరము (కేదారకవి), లలితము, సేతువు (కనకసభాపతి మొదలగువారు), ధీకోదిని (శ్రీనాథుఁడు), మఱియు ఛందశ్శేఖరము, ఛందోకౌస్తుభము, పాణీభూషణము మొదలగు విశేషగ్రంథములు పుట్టియున్నవి. పిదప కవిజనాశ్రయమను నాంధ్రఛందోలక్షణశాస్త్రము (వేములవాడ భీమకవి), సులక్షణసారము, కావ్యాలంకార చూడామణి, కవిలోకసంజీవని, కవిగజాంకుశము మొదలగు ననేకగ్రంథములు పుట్టియున్నవి. ఈ లక్షణగ్రంథముల సారాంశమని యెన్నఁదగిన అప్పకవీయమందును పూర్వగ్రంథములందును సమవృత్త సంఖ్యాదులను దెలియఁజేయు ప్రస్తారప్రత్యయము మొదలగు

షట్ప్రత్యయముల వలన నిరువదాఱు ఛందము లయ్యెను. అందుల వివరణము.— 1. ఉక్త. 2, 2. అత్యుక్త. 4, 3. మధ్య. 8, 4. ప్రతిష్ఠ. 16, 5. సుప్రతిష్ఠ. 32, 6. గాయత్రి. 64, 7. ఉష్ణిక్కు. 128, 8. అనుష్టుప్పు. 256, 9. బృహతి. 512, 10. పఙ్క్తి. 1024, 11. త్రిష్టుప్పు. 2048, 12. జగతి. 4096, 13. అతిజగతి. 8192, 14. శక్వరి. 16384, 15. అతిశక్వరి. 32768, 16. అష్టి. 65536. 17. అత్యష్టి. 131072, 18. ధృతి. 262144, 19. అతిధృతి. 524288, 20. కృతి. 1048576, 21. ప్రకృతి. 2097152, 22. ఆకృతి. 4194304, 23. వికృతి. 8388608, 24. సంకృతి. 16777216, 25. అభికృతి. 33554432, 26. ఉత్కృతి. 67108864. (కేదారకవి చెప్పిన షట్ప్రత్యయాధ్యాయములో నున్నప్రస్తారములవల్లపుట్టిన యీఇరువదియాఱుఛందస్సులకును సర్వసమవృత్త సంఖ్యలమొత్తము (13,42,17726) పుట్టెను. ఇందుక్త మొదలు బృహతిదనుక తొమ్మిది ఛందంబులకు యతిలేదు. ప్రాసమాత్రమే కలదు. (ఇందు త్రిభంగి, ఆర్యా, లయవిభాతి, ఉత్సాహ, వైతాళి మొదలగు వృత్తములఁ జేరి యుండలేదు.) [పద్యలక్ష్యోపయోగసంజ్ఞలు.— ఇందుగల ఛందస్సంఖ్యలు వృత్తసంఖ్యలు మున్నగు వివరములు వృత్తము అను శబ్దముకడఁ జూచుకొనవలెను.) : చూ, వృత్తము. 1: (చూ, జాతులు 5): (చూ, పద్యములు.)

ఛందోభేదవివేకము, అం : చూ, సుగుణములు.

ఛందోవతి, అం: చూ, శ్రుతులు.

ఛందోవత్కవయఃకుర్వంతి, కవులు ఛందస్సు ననుసరించి కవిత్వము చెప్పెదరు. అట్లే ఏ మార్గము ననుసరించి వర్తింతుమో దాని కనుగుణముగానే మనము మన పనులను చేయుదుము.

ఛగణము, సం. వి. అ. న. కరీషము : చూ, పిడక.

ఛగల, సం. వి ఆ. స్త్రీ. బొద్ది*: చూ, వృద్ధదారకము.

ఛగలము, సం. వి. అ. న. 1. నీలికోక: చూ, వస్త్రము; పుం.2. మేఁకపోతు: చూ, మేషము. 1; 3. పిడకనిప్పు : చూ, వహ్ని. 1—౨౫; 4. బొగ్గు: చూ, వహ్ని. 1—30; అం. 5: చూ, అగ్నులు: (చూ, వహ్ని. 1.)

ఛగలాండి, సం. వి. ఈ. స్త్రీ. 1. బొద్దికూర* (గొఱ్ఱెవృషణములవంటి అవయవములు కలది): చూ, ఛగల; 2. గాడిదగడపర*: చూ, శ్వసనము. 2.

ఛట, సం. వి. ఆ. స్త్రీ. 1. గుంపు: చూ, సమూహము; 2. వరుస : చూ, పంక్తి. 1.

ఛటాంబ, సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు: చూ, విద్యుత్తు.

ఛటాఫలము, సం. వి. అ. పుం: చూ, పోఁక*.

ఛటాభ, సం. వి. ఆ. స్త్రీ: చూ, ఛటాంబ.

ఛడావు, వా. వి. హెచ్చు, చడావు, చెడావు.

ఛడి, వా. వి. బెత్తము : చూ, వేత్రము. 1.

ఛత్ర, సం. వి. ఆ. స్త్రీ. 1. గుఱ్ఱికామంచి*: చూ, తృణము. 1; 2. పాలఘ్నము, అడవిసదాప (భూమినిఁ గప్పియుండునది)*: చూ, సదాప; 3. కొత్తిమిరి*: చూ, వితున్నకము. 1; 4: చూ, పుట్టగొడుగు*: 5. నల్లజీలకఱ్ఱ*: చూ, సుషవి. 2.—౧; 6. శిలీంధ్రము *: చూ, నేలతాడు.

ఛత్రపర్ణము, సం. వి. అ. పుం. ఏడాకులరఁటి*: చూ, రంభ. 2.

ఛత్రబంధము, అం: చూ, హేతువు. 2.

ఛత్రభంగము, సం. వి. అ. పుం. 1. రాజ్యనాశము; 2 స్వాతంత్ర్యము : చూ, స్వామ్యము ; 3. ముండమోపితనము ; చూ, వైధవ్యము.

ఛత్రము, సం. వి. అ. న. 1. గొడుగు : చూ, వారిత్ర ; అం. 2. పురుషలక్షణాంగములలో నొకటగు పాదతలరేఖలలో నీ ఛత్రమొకటి : (చూ, లక్షణాంగములు) : చూ, పాదతలరేఖలు.

ఛత్రాకము, సం. వి. అ. న: చూ, పుట్టగొడుగు *.

ఛత్రాకి, సం. వి. ఈ. స్త్రీ : చూ, సర్పాక్షి* (గొడుగువంటి ఆకులను బొందియుండునది.)

ఛత్రాతిఛత్రము, సం. వి. అ. పుం. గడ్డిదుబ్బు: చూ, తృణము. 1.

ఛత్రారుణి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పుచ్ఛ*.

ఛత్రి, సం. వి. ఈ. స్త్రీ. చిన్నగొడుగు : చూ, వారిత్ర.

ఛత్రిన్యాయము, న్యా. ఎక్కువమంది గొడుగులు పట్టుకొని పోవుచుండ నందొకఁడూరకపోయినను గొడుగులు పట్టుకొని పోవువారనియే నిరూపింపఁబడుదురను రీతి. (సమష్టిమీఁదఁ జెప్పిన విషయ మేకదేశమున నన్వయింపక పోవచ్చును.)

ఛదనము, సం. వి. అ. న. 1. ఆకు: చూ, పర్ణము. 1; 2. ఈఁక : చూ, ఱెక్క. 1; 3. స్థౌణేయమను గంధద్రవ్యము, గండివనము*: చూ, రాజార్హము; 4. చీఁకటిమ్రాను*: చూ, తమాలము. 3; 5. కప్పు: చూ, వ్యవధానము. 3.

ఛదము, సం. వి. అ. పుం: చూ, ఛదనము.

ఛదస్సు, సం. వి. స్. న. ఇంటికప్పు, పటలము: చూ, సదనము. 1.

ఛది, సం. వి. ఇ. పుం. —పై.—

ఛదిని, సం. వి. ఈ. స్త్రీ. చేఁతిదోస*: చూ, హరివాలుకము. 1—౫.

ఛద్గువు, సం. వి. ఉ. పుం. 1. ఛద్గురోగము : చూ, రోగము. 1; 2. పిల్లిమొగము : చూ, మార్జాలము.

ఛద్మతాపసుఁడు, సం. వి. అ. పుం. కపటతపస్వి : చూ, ముని. 1.

ఛద్మము, సం. వి. న్. న. 1. నెపము: చూ, వ్యాజము. 1; 2. మోసము : చూ, వంచన ; 3. ఇల్లు: చూ, సదనము; 1; 4. వడ్లు: చూ, ధాన్యము.

ఛన్నము, సం. విణ. 1. ఏకాంతము : చూ, రహస్యము; 2. రూ - ఛాదితము. కప్పఁబడినది: చూ, స్థగితము.

ఛన్నవీరుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు. 1.

ఛర్దనము, సం. వి. అ. న. 1. రూ - ఛర్ది, వమనము: చూ, వాంతి; పుం. 2: చూ, వేము*: చూ, శ్వసనము. 2.

ఛర్దము, సం. వి. అ. న: చూ, వాంతి.

ఛర్ది, సం. వి. ఇ. స్త్రీ. 1.= చలది: చూ, వాంతి; 2. వీర్యము, శుక్లము: చూ, రేతస్సు. 1.

ఛిదురుఁడు, సం. వి. అ. పుం: చూ, విటుఁడు.
ఛిద్రపాదము, అం. బిడ్డలుగనని పడఁతుల గుఱుతు: చూ, లక్షణము. 1.
ఛిద్రము, సం. వి. అ. న. 1. = చిందఱ. బెజ్జము: చూ, రంధ్రము. 1; 2. తప్పు: చూ, నేరము.
ఛిద్రవైదేహీ, సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి*: చూ, పిప్పలి.
ఛిద్రితము, సం. విణ. బెజ్జము వేయఁబడినది: చూ, విద్ధము. 1.
ఛిద్రేష్వనర్థా బహూళీ భవంతి, న్యా. (రూ-విపద్విపద మనుధావతి) ఆపదలపై నాపదలు వచ్చును. దీనికి విరుద్ధమైనది పండు గులపై పండుగలు వచ్చును.
ఛిన్న, సం. వి. అ. స్త్రీ. 1 తిప్పతీఁగ*: చూ, సోమవల్లి; 2: చూ, అంకులాఁడి; విణ. 3. ఛేదింపఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.
ఛిన్నగ్రంధినిక, సం. వి. ఆ. స్త్రీ. పెద్దబోడతరము*: చూ, ముండిని.
ఛిన్నపుష్పకము, సం. వి. అ. పుం. తిల్వకమను గ్రంధ్యము*: చూ, రాజార్హము.
ఛిన్నము, సం. విణ. కోయఁబడిన తృణాదులు: చూ, వృక్ణము; 2. భాగహారము చేయునది, హారసంబంధమయినది: చూ, హారము. 3; అం. 3: చూ, కరణములు; 4: చూ, కటిక్రియలు.
ఛిన్నరుహా, సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగె*: చూ, సోమవల్లి; 2. అందుగు*: చూ, సల్లకి.
ఛిన్నరుహము, సం. వి. అ. పుం. తిలకము*: చూ, నువ్వులు.
ఛిల్లి, సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్తికూర*: చూ, ఖండీరము; 2. చెట్లు మొదలగువాని పట్ట: చూ, బెరడు.
ఛిల్లిక, సం. వి. ఆ. స్త్రీ. కొయ్యఁగూర*: చూ, మారిషము.

## ఛు

ఛుచుందరి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు: చూ, మూషికము.
ఛుపము, సం. వి. అ. పుం. 1. తాఁకుట: చూ, స్పర్శము. 1; 2. గాలి: చూ, వాయువు; 1. 3. పోరు: చూ, యుద్ధము. 1.
ఛుర, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సున్నము; 2. పొడి: చూ, సురుము.
ఛురి. సం. వి. ఈ. స్త్రీ. = చురియ - చూరి-సురె - సూరె, కత్తి, మొలనుంచుకొను సూరకత్తి: చూ, రిష్టి. 2. (రూ-ఛూరి.)
ఛురిక, సం. వి. ఆ. స్త్రీ. = —పై —
ఛురికాకూశ్మాండన్యాయము, న్యా. ఎంత గుమ్మడికాయనైనను చిన్న కత్తి కోసివైచునను రీతి.
ఛురితము, సం. వి. అ. న. శృంగారరసప్రధానక్రియలందు గిల్లుట: చూ, నఖక్షతము.
ఛుల్లి, సం. వి. ఈ. స్త్రీ. ప్రొయ్యి: చూ, హసంతి. 1-౧.

## ఛూ

ఛూరి. సం. వి. ఈ. స్త్రీ.=: చూ. రూ-ఛురి.
ఛూలము, సం. వి. అ. పుం: చూ, సురటి.

## ఛే

ఛేకము, సం. వి. అ. పుం రూ - స్తేకము - క్రీడార్థమై పెంచఁబడి యిల్లుమఱఁగిన చిలుక మొదలైన పక్షులకును ఇఱ్ఱి మొదలైన మృగములకును పేరు: చూ, దీమము.
ఛేకానుప్రాసము, అం. 1. రెండేసి యక్షరము లెడతెగక మరల మరల వచ్చుట. ఉదా.-"శీకర కరణీయపక్షనీ నైపుణ్య పుణ్యములు ప్రాకటకటకాధీశ్వరులెన్న విపుల పులకాంకురములు మేన నుల్లసిల్లు.";"ధరధర దోషవ్రజ సంహారహర": చూ, హేతువు. 2: (చూ, అలంకారము. 3.); 2. అనుప్రాసములు మూఁడింటిలో నొకటి (అనుప్రాసములు.— ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, లాటానుప్రాసము): చూ, అలంకారము. 3.
ఛేకాపహ్నుతి, అం. ఛేకాపహ్నుత్యలంకారము: చూ, అలంకారము. 3.
ఛేకుఁడు, సం. విణ. 1. ఉచ్ఛేత్త: చూ, నాశకుఁడు; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.
ఛేకోక్తి, అం: చూ, రూ - చేకోక్తి.
ఛేత్త, సం. విణ: చూ, నఱకువాఁడు.
ఛేత్తవ్యము, సం. విణ. ఛేదింపఁదగినది: ఛేదితవ్యము, ఛేద్యము.
ఛేదనము, సం. వి. అ. న. 1. నఱకుట: చూ, వర్ధనము. 2; అం. 2: చూ, హస్తక్రియలు.
ఛేదనీయము, సం. వి. అ. పుం. ఇందుగు*: చూ, సల్లకి.
ఛేదము, సం. వి. అ. పుం. 1. నఱకుడు: చూ, వర్ధనము. 2; 2. తునుక: చూ, శకలము. 4; 3. భిన్నాంకమునందు క్రింది సంఖ్య: చూ, హారము. 3.
ఛేదించు, సం. స. క్రి. 1. నఱకు: చూ, సెలగు; 2. త్రుంచు: చూ, విదారించు.
ఛేదితము, సం. విణ. ఛేదింపఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.
ఛేదితవ్యము, సం. విణ.: చూ, ఛేత్తవ్యము.
ఛేద్యము, —పై.—
ఛేలువు, సం. వి. ఉ. పుం. కారుగచ్చ*: చూ, సోమరాజి.

## ఛో

ఛోటీ, సం. వి. న్. పుం. కైవర్తుఁడు: చూ, వలఱేఁడు.
ఛోటిక, సం. వి. ఆ. స్త్రీ. చిటిక: చూ, వ్రేల్మిడి.
ఛోరణము, సం. వి. అ. న విడిచిపెట్టుట: చూ, పరిత్యాగము.
ఛోలంగము, సం. వి. అ. పుం: చూ, మాతులుంగము.*.

## ఛ్వా

ఛ్వాతుఁడు, సం. వి. అ. పుం. రూ - శాతుఁడు - ఛాతుఁడు - చిక్కినవాఁడు: చూ, బక్కవాఁడు.

# చె

చె, అచ్చ తెలుఁగు బాసలోని యొకానొక యక్కరము. ఎ ఒ చె జె అఁ అను నాఁటింటిలోను చె ఒక యక్కరము. ఇవి సంస్కృతమున లేవు. "ఇ ఈ ఎ ఏ" లం గూడిన చె జె లు తాలవ్యంబులు. అందు చె ఒకటి. "అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ" లం గూడిన చె జె లు దంత్యములు. అందు చె ఒకటి. దంత్యతాలవ్యంబులైన చె జె లు మిశ్రములు. ఉ. చవి, జత మొదలగునవి: (చూ, జె.)

చెంక, వై. వి = కక్ష. 1. రూ-చెంకిలి-చక్కిలి : చూ, హస్తము. 1—౧; 2. చంక : పార్శ్వము. 2.

చెంకతాళి, ద్వ. వి. చంకను తగిలించుకొను మూట: చూ, మూట.

చెంకలు, అం : చూ, కక్షాస్థానములు; 2 : చూ, నఖక్షతస్థానములు; 3 : చూ, చుంబనస్థానములు.

చెంకిలి, వై. వి: = చూ, రూ-చెంక.

చెంగలించు, దే. అ. క్రి. చలించు : చూ, సలించు.

చెంగు, దే. వి. దాటుటయందగు ననుకరణము. విజ. 1, ఆ. 183 : చూ, హూహూ. [99: చూ, శ్యేనము.

చెంచెడము, వై. వి. రూ - చెంచడము - చెంచెడము. వేం, ఆం.

చెంటిపాప, ద్వ. వి. (చన్నుపాప) అడ్డసట్టుపాప : చూ, శిశువు.

చెంటిపాపఁడు, ద్వ. వి. —పై.—ఆం, భా. ద్వి. 118.

చెంటిపిల్ల, ద్వ. వి.—పై.—

చెంటివాఁడు, ద్వ. వి. —పై.—ఆం, భా. ద్వి. 118.

చెండి, వై. వి. 1. = చండి, దుర్గ: చూ, పార్వతి. 1; విశ. 2: చూ, సోమరి ; 3. క్రూరుఁడు : చూ, వ్యాధుఁడు. 2; 4. తీరనికోపముగల ఆఁడుది : చూ, స్త్రీ.

చెండిపోతు, ద్వ. విశ : చూ, చెండి. 2.

చెండితనము, వై. వి. అలసత్వము: చూ, విలంబము. 1.

చెంద్ర, దే. వి. ఖదిరము * (దీనిభేదము — వెలిచంద్ర. దానినే ఉంద్ర యందురు): చూ, విట్ఖదిరము (దీనితో ఖదిరారిష్టము చేయుదురు. ఖదిరారిష్టము కుష్ఠురోగములను కుదుర్చును.)

చెందమామ, వై. వి. = చంద్రమస్. రూ - చెందురమామ - చెందురుఁడు - చెందు: చూ, హిమాంశువు.

చెందమామగ్రుక్కిళ్లు,ద్వ.వి.బ.అధరామృతము. శశాం.5,ఆ.137. (ఇట్లు చందమామగుటకలు. ఈ యర్థ మింకనువిచార్యము.)

చెందమామపక్కి, ద్వ. వి. ఒకరకము చేఁప: చూ, మత్స్యము.1.

చెందమామపులుఁగు, ద్వ. వి. చకోరము: చూ, వెన్నెలపులుఁగు.

చెందము, వై. వి. 1. = ఛంద. రీతి. కళా. 1, ఆ. 8: చూ, విధము. 1; 2. = ఛంద: చూ, ఛందస్సులు.

చెందా, దే. వి. 1. ఉపహారము: చూ, లంచము; వా. 2. పత్త్రికలుకొనగు వాని కిచ్చెడు ప్రతిఫలము.

చెందిరిక, వై. వి. = చంద్రిక : చూ, వెన్నెల.

చెందు, వై. వి. 1. = చంద్రః: చూ, చందమామ. 1; 2. నెల: చూ, మాసము. 1. 3. అందము: చూ, సౌందర్యము; విశ: 4. అందమైనది: చూ, యోగ్యము. 2.

చెందుకాపెట్టె, ద్వ. వి. రూ - చెందుగుపెట్టె: చూ, మంద సము. (రూ - చెందువాపెట్టె.)

చెందుగు, దే. వి. 1.—పై.—; 2. ఒకానొకచెట్టు : చూ, వృక్షము.

చెందుగుపెట్టె, ద్వ. వి: చూ, రూ - చెందుకాపెట్టె.

చెందునయ, వై. వి. సంద్రము. సాంబ. దే. 17: చూ, సముద్రము.

చెందురకావి, ద్వ. వి. (చెందురము + కావి) సింధూరవర్ణము. రూ - చెందురుకావి - చంద్రకావి : చూ, వర్ణము. 6.—౪—(౧౪.)

చెందురజోతి, వై. వి. = చంద్రద్యుతి : చూ, బాణసంచు (రూ - చెందురుజోతి.)

చెందురపూవు, వై. వి. = చంద్రపుష్ప (చెందురము + పూవు): చూ, కుసుంబపువ్వు.

చెందురమామ, వై. వి. = : చూ, రూ - చందమామ. 1.

చెందురము, వై. వి. = సింధూరమ్. రూ - చంద్రము - చెందిరము - చెంద్రము - చెంద్రిమము: చూ, సింధూరము. 1. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును. "చెందురకావి.")

చెందురా, ద్వ. వి. చంద్రకాంతము. రూ - బ. చెందురాలు : చూ, రత్నములు. 1—౧౨—(౧౮).

చెందురాలు. ద్వ. వి. బ. —పై.—

చెందురుకావి, ద్వ. వి: చూ, రూ - చెందురకావి.

చెందురుకావిపుట్టము, ద్వ. వి. అరుణవస్త్రము: చూ, వస్త్రము. 1—౭౨.

చెందురుకానలు, వై. వి. బ. 1. = చంద్రవక్ర : చూ, గోటి నాటులు; 2. = చంద్రవక్ర. రాగిడి క్రింది నగ : చూ, భూషణము. 2.

చెందురుఁడు, వై. వి. 1. = చంద్రః : చూ, హిమాంశువు ; 2. = సౌందర్య. చక్కనివాఁడు : చూ, సౌందర్యవంతుఁడు.

చెందురుజోతి, వై. వి. = : చూ, రూ - చెందురజోతి.

చెందురువంకలు, వై. వి. బ. 1. = చంద్రవక్ర : చూ, గోటి నాటులు; 2. = చంద్రవక్ర. రాగిడి క్రింది నగ: చూ, భూషణము. 2; 3. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము ; అం. 4: చూ, బాణాగ్రములు, (ఇదె అర్ధచంద్రము.)

చందువ, వై. వి. = చంద్రోదయః - రూ - చందువా: చూ, వితానము.

చందువా, —వై.—

చందువాచేఁప, ద్వ. వి. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1.

చంద్రకావి, ద్వ. వి: చూ, రూ - చందురకావి. (మిశ్రమమని కొందఱు.)

చంద్రము, వై. వి. =: చూ, రూ - చందురము.

చంద్రవంకలు, వై. వి. బ. =: చూ, రూ - చందురువంకలు,

చంద్రికవన్నె, వై. వి. = సింధూరవర్ణమ్. 6: చూ, వర్ణము. (కౌసుంభవస్త్రమని కొందఱు).

చంపు, దే. స. క్రి. 1. వధించు: చూ, సంహరించు; ప్రే. 2. చావఁజేయు: చూ, మరణించు.

చంపుడు, దే. వి. హింస: చూ, వధము.

చంపుడుగట్టు, ద్వ. వి. వధస్థానము: చూ, స్థానము. 1.

చంపువాఁడు, దే. వి: చూ, హింసకుఁడు.

చకచక, దే. వి. పర్వుట పాడుట లోనగు వానియందగు నను కరణము. వసు. 6, ఆ. 74: చూ, హూహూ.

చకాపికీ, వా. అవ్య. చుఱుకు. (చెకాపికీ.)

చక్క, వై. వి. = చంగ, రూ-చక్కప: చూ, సౌందర్యము; 2. చక్కనిది: చూ, హృద్యము.

చక్కగ, వై. వి: చూ, సరిగ.

చక్కఁగజూచు, వై. వి: చూ, పారువచూచు.

చక్కఁజేయు, వై. స. క్రి. (చక్క + చేయు) 1. దిద్దు: చూ, సవరించు; 2. పాడుచేయు; చూ, సరిపెట్టు; 3: చూ, ముగించు.

చక్కఁజేయుట, వై. వి. అధివాసము: చూ, సంస్కారము.

చక్కఁడగుట, ద్వ. వి. చచ్చుట. అం, భా. ద్వి. 225: చూ, సావు.

చక్కఁదనము, వై. వి. (చక్క + తనము) 1. అందము: చూ, సౌందర్యము; 2. తిన్నన, ఋజుభావము: చూ, హృద్యము.

చక్కఁబడు, వై. అ. క్రి. (చక్క + పడు) యుక్తమగు: చూ, సరిపడు. 2.

చక్కఁబఱచు, ద్వ. స. క్రి. దిద్దు: చూ, సవరించు.

చక్కఁబెట్టు, (చక్క + పెట్టు) 1.—వై.—; 2. నాశనము చేయు: చూ, సరిపెట్టు.

చక్కటి, దే. వి. 1. దిక్కు: చూ, హరిత్తు; 2. ఇక్క: చూ, స్థానము. 1; 3. కార్యము: చూ, పని. 2; వై. వి. 4: చూ, చక్కఁదనము. 2; 5. న్యాయము: చూ, సత్యము. 1; విణ. 6. చక్కన: చూ, సరి. 11: (చూ, హృద్యము).

చక్కట్టు, దే. వి: చూ, చక్కటి. 4.

చక్కట్లుదిద్దుట, జా. తగవుఁదీర్చుట. "ఔక్కవకవం ఔక్కట్టు దిద్దుం గుచా, హంకారంబు." విజ. 2, ఆ. 15.

చక్కడుచు, ద్వ. స. క్రి. (చక్కు + అడుచు) 1. ఖండించు: చూ, నెలగు; 2. చంపు : చూ, సంహరించు.

చక్కన, వై. వి. = చంగ. 1. అందము : చూ, సౌందర్యము; విణ. 2. దీటు : చూ, చక్కటి. 6.

చక్కనయ్య, వై. వి. (చక్కని + అయ్య) : చూ, మన్మథుఁడు. వసు. 3, ఆ. 177.

చక్కనిది, వై. విణ : చూ, చక్క. 2. (ఆం, భా. తృ. 19.)

చక్కనియెదురు, ద్వ. వి: చూ, ఎట్టయెదురు.

చక్కరవతి, వై. వి. చక్రవర్తి: చూ, రాజు. 1—౭.

చక్కాట, ద్వ. వి : చూ, వధము.

చక్కాడు, ద్వ. స. క్రి. (చక్కు + ఆడు) 1; చంపు : చూ, సంహరించు; 2. ఖండించు : చూ, నెలగు.

చక్కి, దే. వి. 1. ఇక్క : చూ, స్థానము. 1; 2. ఒకానొక వాద్యము : చూ, వీణ. 1—౪౫—(౧); 3. దగ్గఱ : చూ, సమీపము; వై. వి. 4. = కచ్ఛః. రూ-చక్కియ-బాము, వైపు: చూ, పార్శ్వము. 2.

చక్కియ, వై. వి =: చూ, రూ-చక్కి. 4.

చక్కిలము, వై. వి. = శిష్కులీ : చూ, భక్ష్యము.

చక్కిలి, వై. వి. = కక్ష: చూ, రూ-చంకిలి.

చక్కిలిగింత, ద్వ. వి. (చక్కిలి + గిలిగింత) అన్యకరస్పర్శనము చేతఁ గలిగెడు చంక మొదలైన యంగముల సంకోచము: కిత కిత, గిలిగిలింత-రూ- గిలిగిలింత-చక్కిలిగిలి; 2. సంతోష కరము: చూ, సంతోషము.

చక్కిలిగింతలువోవు, ద్వ. అ. క్రి. (చక్కిలిగింతలు + పోవు) అన్యకరస్పర్శనముచేత చంక మొదలగు యంగములు సంకోచపడు. కళా. 1, ఆ. 131: చూ, సంకోచించు.

చక్కిలిగిలి, ద్వ. వి : చూ, రూ- చక్కిలిగింత.

చక్కి, దే. వి. పల్లకిలోని యడుగుచట్టము : చూ, చట్టము. 2.

చక్కిపంచదార, వా. వి. గడ్డకట్టిన తెల్లపంచదార : చూ, శర్కర. 1.

చక్కు, వై. వి. 1. = శల్కమ్ ఖండము : చూ, శకలము. 4; 2. = షట్కమ్. ఆఱు : చూ, షట్కము.

చక్కుచేయు, వై. స. క్రి. ఖండించు : చూ, నెలగు.

చక్కుపగడ, వై. వి. సప్తసంఖ్య : చూ, సప్తకము.

చక్కెర, వై. వి. = శర్కరా : చూ, శర్కర.

చక్కెరతిండి, ద్వ. వి. చిలుక : చూ, శుకము.

చక్కెరతిండిపులుఁగు, —పై.— వేం. అం. 99.

చక్కెరబుడగ, ద్వ. వి : చూ, భక్ష్యము.

చక్కెరవిలుకాఁడు, ద్వ. వి : చూ, మన్మథుఁడు.

చక్రాలత్రిప్పుడు, వా. వి : చూ, బాలక్రీడ.

చగ, దే. వి. రూ- చగడు-చగుకు-చవదు-చవుడు- చవటినేల-చవుటినేల-చౌట-చౌడు : చూ, భూమి. 1—౯.

చగడు, —పై.—

చగుకు, —పై.—

చచ్చవుకము, వై. విణ. = సమచతుష్క. (చవుకము + చవుకము) సరియైన చౌకము : రూ-చచ్చౌకము.

చచ్చినవానికన్నులు చేరెఁడు, జా. అయినదానింగూర్చి ఆలోచింపఁదగదు.

చచ్చినవాని పెండ్లికి వచ్చినంతయే కట్నము చాలును. లో. ఉదా.-"తనగుట్టు బయలఁబెట్టి చచ్చినవాని పెండ్లికి వచ్చినంతయే కట్నము చాలునన్నటుల వచ్చినంత రాఁబట్టుకొనుచు. (ధర్మజరాజసూయము.)

చచ్చు, దే. అ. క్రి : చూ, మరణించు.

చచ్చుట, అం. (మరణించుట) : చూ, అవస్థలు-దశావస్థలు.

చచ్చుడి, దే. వి. చండాలజాతి భేదము : చూ, మాదిగ.

చచ్చుడు, దే. విణ. చచ్చినది. చచ్చుడుబాకి.

చచ్చౌకము, వై. విణ. = : చూ, రూ-చచ్చవుకము.

చటాలు, దే. వి. వ్రేయుటయందగు ధ్వన్యనుకరణము : చూ, హూహూ.

చటిల్లు, —పై.—

చటుకున, దే. ద్ర. క్రి. విణ : చూ, రూ-చట్టున.

చటుక్కున, దే. ద్ర. క్రి. విణ. రూ—పై.—.

చటులుపడు, ద్వ. అ. క్రి. (చటులు + పడు) : చూ, భంగపడు.

చట్ట, దే. వి. 1. కొంచెము వడ్లుపోసిన చిన్నగోనె: చూ, సంచి; 2. తొడకు వెలుపలిభాగము : చప్ప; వై. వి. 3. = శాటకః. చొక్కాయ : చూ, వస్త్రము. 1—౯; 4. కవచము : చూ, వస్త్రము: (చూ, వారవారణము); ౫. గచ్చు. పా. 2, ఆ. 38 : చూ, పూఁత. 3; దే. వి. 6. త్వక్కు : చూ, బెరడు; 7. పొగాకుచట్ట : తద్వి.—పొగాకుచట్టలో సగము-(తె. ప.) అరచట్ట.

చట్టన, దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ : చూ, వేగము. 3.

చట్టపు మెకము, ద్వ. వి. పునుఁగుపిల్లి ; చూ, మార్జాలము.

చట్టము, వై. వి. = స్పష్టమ్. శాస్త్రము. న్యాయశాస్త్రము : చూ, అత్తు. 1; 2. మంచములోనగువాని పట్టెల చేరిక : చక్కి-రూ-చక్కి; 3. పిండివంటలు యెత్తితీసెడి చిల్లులుగల యినుపగరిఁటె, బిత్తెడ : చూ, దర్వి. 1: (చూ, పాత్రము); 4 : చూ, చట్రము; దే. వి. పిల్లిగడ్డ : చూ, పునుఁగు చట్టము.

చట్టలుచీరు, ద్వ. స. క్రి. చంపు : చూ, సంహరించు.

చట్టలువాపు, ద్వ. స. క్రి. నాశనముచేయు : చూ, సరిపెట్టు.

చట్టి, దే. వి: చూ, అటిక.

చట్టిఫిరంగిగుండు, ద్వ. వి. బొటుగుండు : చూ, ఫిరంగిగుండు.

చట్టు, దే. వి. 1. కొండ : చూ, పర్వతము; 2. శిల : చూ, రత్నములు. 1—౧౨—(౫); 3. విశాలమయినరాయి. రూ-చట్రాయి : చూ, రత్నములు. 1—౧౨—(౩౧); 4. శ్మమగ్నశిల : చూ, రత్నములు. 1—౧౨—౩౨); వై. వి. 5.=ఛాత్రః : చూ, శిష్యుఁడు. పాండు. 5, ఆ. 187;

చట్టున, దే. ద్ర. క్రి. విణ. రూ- చటుకున : చూ, దబ్బాటు.

చట్టుప, దే. వి. పక్షము. పాండు. 5, ఆ. 246 : చూ, ఱెక్క. 1.

చట్టుపురుఁగు, ద్వ. వి. పాము. సాంబ. తిర్య. 10: చూ, సర్పము.

చట్టువ, దే. వి. కట్టితెడ్డు, లోహాదులతోఁ జేసిన గరిఁటె. (అని కొందఱు) రూ-చట్టువము: (చూ, దర్వి.1) చూ,పాత్రము. 6.

చట్టువము, దే. వి: చూ, రూ చట్టువ.

చట్రము, వా. వి. 1. : చూ, పట్టము: (చూ, చౌకట్టులు. 3.); 2. బిత్తెడ: చూ, హరివాణము. 1-౧౬.

చట్రాయి, దే. వి. (చట్టు + ఱాయి): చూ, చట్టు. 3.

చడావు, వా. వి. అదనము: (చెడావు అనియు.)

చడి, వా. వి. చప్పుడు: చూ, స్వదము. 2.

చడికి, దే. వి. మల్లబంధవిశేషము: చూ, మల్లశాస్త్రము. (రూ - చలికి).

చతికిలపడు, దే. అ. క్రి. పిఱ్ఱలు నేలనాను. రూ-చతికిలు-చదికిలపడు - చతుకుపడు - చదికిలు. (ఆం, భా. తృ. 98.)

చతికిలు, —పై.—

చతుకుపడు, —పై.—

చత్త, దే. వి. రూ - చత్తరి, బెత్త (తర్జని మొదలైన నాలుగు వ్రేళ్ళ అడ్డుకొలత): చూ, బెత్తిలి.

చత్తరి, —పై.— అం, పదా. నర. 85.

చదను, దే. వి. రూ-చదును. 1. సమప్రదేశము: చూ, భూమి. 1-1-౯౪; విణ. 2. మట్టము: చూ, సపాటము.

చదర, వై. వి. 1. చిన్నచౌకపుజాఁప, రూ-చదరిక: చూ, చాఁప; 2. చిన్న విస్తరాకు: చూ, విస్తరి.

చదరంగపు పలక, ద్వ. వి. అష్టాపదము: చూ, శారిఫలము.

చదరంగము, వై. వి. = చతురంగమ్. చదరంగమను ఆట.

చదరము, వై. వి. 1. = చతురస్రమ్. సమమైన నాలుగు మూలలు గలది. చవుకము - రూ - చౌకము: చూ, వైశాల్యము. 1-2; విణ. 2. సమానమైనది: చూ, సుషమ. 2; 3. కొఱతలేనిది.

చదరములు, వై. వి. బ. ఇంటి కురుజులమీఁది బిగువుపట్టెలు.

చదరు, దే. వి. 1. కొలువుకూటము: చూ, సభ. 2; 2. అశ్రద్ధ: చూ, మందెమేలము.

చదలతేజి, దే. వి. ఇంద్రుని గుఱ్ఱము: చూ, హయము. 1-౧౦.

చదళము, దే. వి. 1. దండువిడిసిన చోటు : చూ, స్కంధావారము. 1; 2. సైన్యము. జై. 3, ఆ. 81: చూ, సేన. 1.

చదలయేనుఁగు, ద్వ. వి. ఇంద్రుని యేనుఁగు: చూ, హస్తి. 1-(౭౬).

చదలు, దే. వి: చూ, వ్యోమము. 1.

చదలుకాఁపు, దే. వి. దివౌకసుఁడు: చూ, వేలుపు.

చదలుకెంపుటాయి, దే. వి. సూర్యకాంతశిల: చూ, రత్నములు. 1-౧౨-(౩౩).

చదలుఁదొడుకు, దే. వి. కామధేనువు: చూ, ధేనువు.

చదలుమానికము, ద్వ. వి. ద్యుమణి: చూ, సూర్యుఁడు.

చదలేఱు, దే. వి. (చదలు + ఏఱు) గంగ: చూ, నది.

చదికిలపడు, దే. అ. క్రి: చూ, రూ-చతికిలపడు.

చదికిలు, —పై.—

చదియ, దే. వి. నలఁగుడు: చూ, పీడనము.

చదియు, దే. అ. క్రి. నలఁగు: చూ, సదమదమగు.

చదిరిక, వై. వి: చూ, చదర. 1.

చదివించు, దే. ప్రే. 1. చదువఁజేయు: చూ, వల్లించు. 2; 2. వివాహాదులయందు కట్నమును చదివించు.

చదుకము, వై. వి. = చతుష్కమ్. నాలుగుమార్గములు కలియు దారి: చూ, మార్గము. 1.

చదుకు, దే. వి. అడుసు: చూ, బురద.

చదును: చూ, రూ-చదను. 1-2.

చదుపు, దే. స. క్రి. 1. అడుచు: చూ, మొత్తు. 2; ప్రే. 2. చదియఁజేయు; 3. చంపు: చూ, సంహరించు; 4. చావఁజేయు: చూ, సమయు.

చదుము, దే. స. క్రి. 1. చంపు: చూ, సంహరించు; 2. పిడికిటితో పొడుచు: చూ, గ్రుద్దు. 2.

చదుర, వై. విణ. = చతురా. రూ - చదురాలు, సమర్థురాలు. కళా. 1, ఆ. 81: చూ, స్త్రీ. 1-౭౫.

చదురడుచు, ద్వ. అ. క్రి. (చదుర + అడుచు) పరిహాసమాడు: చూ, పిసాళించు.

చదురపడుచు. —పై.—

చదురాలు, ద్వ. విణ. (చదుర + ఆలు): చూ, చదుర.

చదురు, వై. వి. 1. = చతురమ్, చతురోక్తి: చూ, శబ్దము. 2-౩౨; 2. = సదస్. కొలువుకూటము: చూ, సభ. 2; 3. వివాహాదులలో జరిగించు ఆటకచ్చేరి: చూ, సభ. 2; 4. నేర్పు: చూ, సామర్థ్యము. 1.

చదురుఁడు, వై. విణ. = చతురః: చూ, సమర్థుఁడు.

చదువరి, దే. విణ. (చదువు + అరి) చదువులయ్య: చూ, విద్యావంతుఁడు; 2: చూ, పాఠకుఁడు.

చదువరులు, దే. విణ. బ. క్రిక్కఱులు. 2. —పై.—

చదువు, దే. వి. 1. విద్దియ: చూ, విద్య; 2. బ్రహ్మయజ్ఞము: చూ, యజ్ఞము; 3. చదువుట: చూ, పఠనము; బ. 4: చూ, వేదము; స. క్రి. 5. అధికరించు: చూ, పఠించు.

చదువుట, అం: చూ, అవధానములు.

చదువుటకువేసిన సున్నమతియుఁబోయె, లో. ఉదా:— ఇన్నాళ్ళు సేవచేయుచు, సున్నదియుం బోయె నేఁడయో కౌఁగిలి యిమ్మన్నంతఁ జదువఁబెట్టగ, సున్న మతియుఁ బోయెనను టహో నిజమయ్యెఁ." (విజయవిలాసము).

చదువులపడఁతి, దే. వి. వాణి: చూ, సరస్వతి.

చదువులపులుఁగు, దే. వి. చిలుక: చూ, శుకము.

చదువులబడి, దే. వి. చూ, పాఠశాల.

చదువులముదుకఁడు, దే. వి. నలువ: చూ, బ్రహ్మ. 1.

చదువులయ్య, ద్వ. వి. (చదువుల + అయ్య) 1. ఉపాధ్యాయుఁడు: చూ, పంతులు. 1; 2. పండితుఁడు: చూ, విద్వాంసుఁడు.

చదువులవెలఁది, దే. వి: చూ, చదువులపడఁతి.

చదువులవేలుపు, దే. వి: చూ. చదువులముదుకఁడు.

చద్ది, దే. వి. రూ-చలిది-చల్ది. పర్యుషితాన్నము: చూ, సాదము 1-౧౭-(౧): (చూ, ప్రాతర్భోజనము).

చనవరి, దే. విణ. (చనవు + అరి): చూ, స్నేహితుఁడు.

చనవు, దే. వి. రూ-చనువు. 1. ప్రేమ. పా. 1, ఆ. 9: చూ, స్నేహము. 1; 2. కోరిక. జై. 4, ఆ. 117: చూ, వాంఛ; 3. చెల్లుబడి. జై. 1, ఆ. 72: చూ, రపము.

చనవురాలు. దే. విణ. (చనవు + ఆలు) చనవుగలది.

చనిపోయినవాఁడు, దే. వి. పీనుఁగు: చూ, శవము. 2.

చను, వై. వి. 1. = స్తన. (స్త్రీపురుషుల) స్తనము: రూ-చన్ను: చూ, స్తనము. 1-౨; 2. = స్తన. మొగలియూప, రూ-చన్ను: చూ, స్తనము. 1-౭; 3. = స్తన. తాటియూడ, రూ-చన్ను: చూ, స్తనము. 1-౮; అ. క్రి. 4. ఒప్పు :

చూ, సమ్మతించు; 5. పోవు: చూ, వెళ్లు. 3; 6. చావు: చూ, సమయు; 7. చెల్లు: చూ, సను. 6; 8. తగు: చూ, సరిపడు. 2; 9. కడచు: చూ, సను. 3; స. క్రి. 10. పొందు: చూ, ప్రాపించు.

చనుఁగప్పు, ద్వ. వి. రూ-చన్నుఁగప్పు, అవిక. హంళ్ళ 5, ఆ. 71: చూ, పత్రము.

చనుఁగుదురు, వా. వి. రూ- చన్నుఁగుదురు.చన్నుసంపుగోగము.

చనుఁగొనలు, ద్వ. వి. బ. చూచుకములు: చూ, స్తనము.

చనుఁబాల, వై. వి. (చను+పాల) ఒక ఓషధి: చూ, వృక్షము.

చనుఁబాలు, వా. వి: చూ, స్తన్యము.

చనుకట్టు, ద్వ. వి. రూ-చన్కట్టు: చూ. చనుగప్పు.

చనుట, ద్వ. వి. యాత్ర: చూ, ప్రయాణము.

చనుదెంచు, దే. అ. క్రి. (చను+ఎంచు) 1. పోవు: చూ, వెళ్ళు. 3; 2. అగపడుగు: చూ, వచ్చు. 3.

చనుదేరుట, ద్వ. వి: చూ, చనుట.

చనుదోయి, ద్వ. వి. కుచయుగళము: చూ, స్తనము. 1-౧. (రూ-చన్నుఁదోయి-చన్దోయి.)

చనునె, దే. వి. తగునా: రూ-చనునే-చన్నె-చన్నే.

చనునే, —పై.—

చనుప, దే. వి. 1. దారి: చూ, మార్గము. 1; 2. బిదాపు: చూ, అంబాడితండ. (బాటసారులగుంపు అందురు.)

చనువకము, వై. వి. = చంపకకః: చూ, సంపెఁగ.

చనుమఱి, ద్వ. వి. (చను+మఱికి) 1. జొమ్మ: చూ, వక్షము; 2. చనుమొనచుట్టు గల నల్లని చోటు (ఇది ఆవల లోనగు శబ్దమువంటిది:) చూ, స్తనము.

చనుమఱువు, ద్వ. వి: చూ, చనుఁగప్పు.

చనుముక్కు, ద్వ. వి. చూచుకము: రూ-చనుమొన-చనుమోము. కళా. 7, ఆ. 165: చూ, స్తనము. (బ. చనుముక్కులు.)

చనుమొన, ద్వ. వి. —పై.— (బ. చనుమొనలు.)

చనుమోము, వై. వి. = స్తనముఖ. —పై.—

చనులు, అం: చూ, నఖక్షతస్థానములు.

చనువాఁడు, దే. విణ. చెల్లుబడికలవాఁడు: చూ, సమర్థుఁడు.

చనువు, దే. వి: చూ, చనవు. 1.

చన్కట్టు, ద్వ. వి: చూ, రూ-చనుకట్టు.

చన్నీళ్ళు, దే. వి. బ. (చల్ల+నీళ్లు) శీతోదకము: చూ. సలిలము. 1-౫. (చలినీళ్లు అనియు.)

చన్ను, వై. వి: చూ, రూ-చను. 1-2-3; అం. 4: చూ, కళాస్థానములు.

చన్నుఁగప్పు, ద్వ. వి: చూ, రూ-చనుఁగప్పు.

చన్నుఁగుదురు, వా. వి: చూ, రూ - చనుఁగుదురు.

చన్నుఁగుడుచు, వా. అ. క్రి. పాలుఁద్రావు.

చన్నుఁదోయి, ద్వ. వి: చూ, రూ-చనుదోయి. పంచ. వేం. 243.

చన్నె, దే. వి. (చనును+ఎ): చూ, రూ-చనునె.

చన్నే, —పై.—

చన్దోయి, ద్వ. వి: చూ, రూ-చనుదోయి.

చపారము, దే. వి: చూ, కుటారము. 2.

చపుడు } దే. వి: చూ, రూ చప్పుడు.
చపు, }

చప్ప, దే. వి. 1. భుజము: చూ, స్కంధము. 1; 2. ముద్దర, అచ్చు: చూ, ముద్ర; 3: చూ, చట్ట. 2; విణ. 4. రస హీనము. "నీమాట చప్పగానున్నది." చప్పని, చప్పిడి, చప్పి.

చప్పఁదనము, దే. వి. విణ: చూ, చప్పిడి. 2.

చప్పట, వై. వి. = చర్పట. 1. చపేటము: చూ, చఱపు. 1; 2 చక్కఁగా చాచిన వ్రేళ్లతోఁ గూడిన యఱచేయి: చూ, హస్తము. 1—౫. (1-౭).

చప్పటముక్కు, ద్వ. వి: చూ, నతనాసిక.

చప్పటముక్కువాఁడు, ద్వ. వి: చూ, సద్దిముక్కువాఁడు.

చప్పటించు, వై. స. క్రి: చూ, పటితశించు.

చప్పట్లు, దే. వి. బ. సంతోషాదులయం దఱచేతులను తట్టుట. కేకిసలు: చూ, (వా) తప్పట్లు.

చప్పన, దే. వి. 1: చూ. చప్పఁదనము; విణ. 2: చూ, చప్ప. 4,

చప్పరమంచము, ద్వ. వి. (చప్పరము+మంచము) చప్పర కోళ్ళ మంచము: చూ, మంచము.

చప్పరము, దే. వి. రూ-చప్రము. 1: చూ, రూ-చపారము; 2. గుడారము: చూ, సదనము. 1; 3. మీఁద పందిరివలె నేర్పఱచిన నలుచదరపు మ్రాను; 4. చౌకముఁదీర్చి వేసిన పందిరి, (వృత్తియందు హల్లు పరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును.చప్పరమంచము మొ.): చూ, సదనము. 1.

చప్పరించు, దే. స. క్రి. నాలికపై నిడుకొని చవిచూచు: చూ, రుచిగొను.

చప్పరించుమెకము, ద్వ. పంది: చూ, సూకరము.

చప్పరింత, దే. వి. 1. —పై.—; 2. దవుడల తాటింపు.

చప్పలించు, దే. స. క్రి: చూ, రూ-చప్పరించు.

చప్పి, దే. వి. 1, దురదతోఁగూడిన పక్కుపరోగము: చూ, సప్పి; విణ. 2. లోపలికి అణఁగినిచి. "చప్పిదవడలు": చూ, రూ-చప్పిడి. 2.

చప్పిడి, దే. విణ. 1: చూ, చప్ప. 4; 2: చూ, చప్పి. 2; 3. చప్పనిది: (తె.ప.)ఉప్పిఁడి, చప్పఁదనము, చప్పని; (సం.ప.) అలవణము.

చెప్పుడించు, దే. అ. క్రి. చప్పుడుచేయు: చూ, శబ్దించు.

చెప్పుడు, దే. వి. రూ-చప్పు. 1. అచేతనవస్తువులు ఒకటితో నొకటి తాఁకుటచే కలుగు ధ్వని: చూ, స్వరము. 2; 2. శబ్దము: చూ, స్వరము. 2-౪౬-(౩౦).

చెప్పున, వా. అవ్య. చటుక్కున. (గోదావరిమండలమున వాడుక.)

చెప్రము, దే. వి: చూ, రూ-చప్పరము.

చెబుకు, దే. వి. కొరడా: చూ, మునికోల.

చెబుకుసేయు, దే. స. క్రి. (చబుకు + చేయు), చబుకుతోకొట్టు. జై. 6, ఆ. 53.

చెమక్కు, వా. అవ్య. తమాషా.

చెమరు, దే. స. క్రి. 1. అఱచేతకొట్టు: చూ, పటితశించు; 2. చంపు: చూ, సంహరించు.

చెమురు, దే. వి. 1. స్నేహము, నూనె నెయ్యి లోనగునది, మెఱుఁగు. జై. 4, ఆ. 110: చూ, స్నేహము. ౨-౧; స. క్రి. 2. రాచు: చూ, రుద్దు. 1; 3. లేపనముచేయు. చూ, పూయు.

చెమురువత్తి, ద్వ. వి. అన్వాసనము: చూ, వత్తి.

చెయ్యన, దే. ద్ర. క్రి. విణ: చూ, వేగము. 3.

చెరచెర, దే. వి. ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చెరలాట, దే. వి. రూ-చరలాటము. క్రీడ: చూ, విలాసము. 1.

చెరలాటము, —పై.—

చెరలాటమాడు, దే. అ. క్రి. (చెరలాటము + ఆడు): చూ, రూ-చరలాడు.

చెరలాడు, దే. అ. క్రి: రూ-చరలాటమాడు - చర్లాటమాడు - చర్లాడు, చిట్లాడు, ఆట్లాడు, ఆడు. (సం. ప.)—క్రీడించు.

చెరికుండ, ద్వ. వి. సాలెవాని గంజికుండ: చూ, భాండము. 3.-౨౦.

చెరుక, దే. వి: చూ, పశురోగము.

చెరుగుడు, దే. వి. ఈడిక: చూ, రూ-సరవడి.

చెరుము, దే. స. క్రి. 1. రాచు: చూ, రుద్దు. 1; 2. వాద్యమును చఱచు.

చెర్లాట, దే. వి: చూ, రూ-చరలాట.

చెర్లాటమాడు, దే. అ. క్రి: చూ, రూ-చరలాడు. పాండు. 3, ఆ. 63.

చెర్లాటము, దే. వి: చూ, రూ-చరలాట.

చెర్లాడు, దే. అ. క్రి: చూ, రూ-చరలాడు.

చెఱచు, దే. స. క్రి. 1. అఱచేతకొట్టు: చూ, పటితశించు; 2. అఱచేతతట్టు: చూ, జోకొట్టు; 3. కొట్టు, అడుచు: చూ, మొత్తు. 2; 4. ఆక్రమించు: చూ, మొగరించు; 5. తుడుచు, తడిపోవనొత్తు: చూ, ప్రామి. 4.

చెఱపు, దే. వి. 1. అప్పళము, రూ-అప్పళింత, చప్పట. (సం. ప.)—అస్ఫాలనము-రూ-ఆస్ఫాలము, ఆస్ఫోటనము-రూ-ఆస్ఫోటము; 2. అడ్డపాటు. కళా. 7, ఆ. 59: చూ, వ్యవధానము. 3.

చెఱపుఁబిడక, దే. వి. (చెఱపు + పిడక) గోడనుతట్టు పిడక: చూ, పిడక.

చెఱి, దే. వి. రూ-చఱియ. సంచరించుటకు అశక్యమైన పర్వత శిఖరము క్రిందిచోటు: చూ, పర్వతము.

చెఱియ, దే. వి: చూ, చఱి.

చెలచెలన, దే. వి. ద్రవరూపము: చూ, సలిలము.— 1-౨౦.

చెలది, దే. వి. = ఛర్ది. ఓకర: చూ, వాంతి.

చెలపకారము, దే. వి. చలము: చూ, మాత్సర్యము.

చెలపకారి, దే. విణ. (చలపకారము + ఇ): చూ, మాత్సర్యశీలుఁడు.

చెలపట్టు, దే. అ. క్రి. (చలము + పట్టు) మాత్సర్యముగొను. రూ-చలపొడుచు-చలముకొను-చలపోరు: చూ, మచ్చరించు. కళా 3, ఆ. 244. (కోపమర్థమని కొందఱు.)

చెలపాది, దే విణ: చూ, చలపకారి.

చెలపొడుచు, దే. అ. క్రి: చూ, రూ- చలపట్టు.

చెలపోరు, దే. అ. క్రి. (చలము + పోరు).—పై.—

చెలమరి, దే. విణ. (చలము + అరి): చూ, చలపకారి. వసు. 3, ఆ. 112.

చెలము, దే. వి: చూ, చలపకారము. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము లోపించును. చలపట్టు. మొ.

చెలముకొను, దే. అ. క్రి: చూ, చలపట్టు.

చెలవ, దే. వి: చూ, శైత్యము.

చెలవాది, దే. వి. చావుసహచారము చెప్పువాఁడు

చెలాడము, వై. వి. = చలనమ్. రూ-చల్లడము - చల్లాడము. లాఁగు: చూ, వస్త్రము. 1—౯—(౯.)

చెలి, దే. వి. రూ-చలిమిరి - చల్మిరి. 1. శీతము: చూ, శైత్యము; 2. శీతబాధ.

చెలికాఁపు, దే. వి. కప్ప: చూ, మండూకము. 1.

చెలికారు, ద్వ. వి. శిశిరఋతువు, (మాఘ,ఫాల్గున మాసములు): చూ, మాసద్వయము.

చెలికి, దే. వి: చూ, రూ-చడికి.

చెలిగరువు, ద్వ. వి. మీఁద యిసుకగల జాతిపాఱు నేల: చూ, భూమి. 1—౨౩.

చెలిగాలి, ద్వ. వి. శీతవాయువు: చూ, వాయువు. 1—౧౪.

చెలిగొండ, ద్వ. వి. (చలి + కొండ) హిమవత్పర్వతము (ఇట్లు చలిగట్టు-చలిమల): చూ, పర్వతము.

చలిచీమ, దే. వి. ఒకరకము నల్లచీమ : చూ, పిపీలిక.

చలితఱి, దే. వి : చూ, చలికారు.

చలిదాయ, ద్వ. వి : చూ, సూర్యుఁడు.

చలిది, దే. వి. (చలి + అది) : చూ, రూ- చద్ది.

చలిదిమూట, ద్వ. వి. చిట్టాముదాలనూనె. చిట్టాముదము : చూ, స్నేహము. 2—౪.

చలినట్టు, దే. వి. గాలి : చూ, వాయువు.

చలినెల, దే. వి. 1. మాఘమాసము, జన్నంపురిక్కనెల : చూ, మాసము. 1; 2. ఫాల్గున మాసము. ప్రొద్దురిక్కనెల: కళా. 7. ఆ. 181 : చూ, మాసము. 1.

చలిపందిరి, దే. వి. రూ-చలిపందిలి-చలిమిపందిలి-చలివిందల-చల్లవిందల. దాహమునకు నీళ్లుపోసెడు పందిలి : చూ, సదనము. 1.

చలిపందిలి, దే. వి. —పై.—

చలిపని. దే. వి. శైత్యోపచారము. చలువలు-రూ-చల్వలు.

చలిపిడుగు, ద్వ. వి. కొన్ని దేశములందు కాలవిశేషమున ఆకాశము నుండుండి పడెడు చెడగఱపు మంచుగడ్డ ; చూ, హిమము: (చూ, పిడుగు.)

చలిమిడి, దే. వి. 1. ఒకరకముకూర; బెల్లము కలిపిన పిండి. రూ- చలివిడి : చూ, సాదము (1).—౪౪.

చలిమిపందిలి. దే. వి : చూ, రూ-చలిపందిరి.

చలిమిరి, దే. వి: చూ, చలి. 1.

చలియుక్క, దే. వి : చూ, చలినట్టు.

చలియిసుక, దే. వి. (చలి + ఇసుక) కర్పూరము, వసు. 2, ఆ. 20 : చూ, సిరము.

చలివాపు, దే. స. క్రి. (చలి + పాపు) : చూ, బుజ్జగించు.

చలివాలు, ద్వ. వి. (చలి + పాలు) చిహ్నము : చూ, లక్షణము. 1.

చలివిందల, దే. వి : చూ, రూ-చలిపందిరి.

చలివిడి, దే. వి ; చూ, రూ-చలిమిడి. 2.

చలివెలుఁగు, దే. వి. శీతకరుఁడు, చంద్రుఁడు : చూ, హిమాంశువు.

చలివెల్గు, —పై.—

చలువ, దే. వి. 1, చాపతాయి. కళా. 1, ఆ. 109: చూ, చట్టు. 3; 2. శిల : చూ, రత్నములు. 1—౧౨—(౫).

చలుపు, దే. ప్రే. 1. చేయు : చూ, రూ-సలుపు; 2. కడపు : చూ, సలుపు.

చలువ, దే. వి. రూ-చల్వ. 1. జలుబు, రూ. చలువడి-చలవ-చల్వ-చలి-చలిమిరి-చల్మిరి-చల్ల-చల్లన-చల్లదనము. స్వా. 1, ఆ. 72 : చూ, శైత్యము; 2. జాడ్యమువలని శైత్యము. రూ-చలువడి; 3. ధౌతవస్త్రము. సా. 2, ఆ. 192 : చూ, వస్త్రము. 1—౧౭; 4. బ. శైత్యోపచారము : చూ, చలిపని.

చలువగట్టు, ద్వ. వి ; చూ, చలిగొండ.

చలువగుఱ్ఱము, ద్వ. వి. గాడిద : చూ, రాసభము.

చలువచేయు, దే. స. క్రి. చవుటినీళ్లలో నుడికించి యుదుకు : చూ, పులుము. 4.

చలువజోతి, ద్వ. వి : చూ, చలివెలుఁగు.

చలువడి, దే. వి. (చలువ + వడి) : చూ, చలువ. 1-2. (స్వార్థమున వడి.)

చలువబట్ట, దే. వి : చూ, చలువ. 3.

చలువమిరియము, ద్వ. వి. తోఁకమిరియము: చూ, మిరియము.

చలువవడాయి, దే. వి: చూ, చందురా.

చలువఱేఁడు, దే. వి: చూ, చలివెలుఁగు.

చలువలమల, ద్వ. వి: చూ, చలిగొండ.

చలువలఱేఁడు, దే. వి: చూ, రూ-చలువఱేఁడు.

చలో చలో, వా. వి. బండియెడ్లను తోలుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుహూ, (చెలోచెలో అనియు.)

చల్ది, దే. వి: చూ, రూ-చద్ది-చలిది.

చల్మిరి, దే. వి; చూ, రూ-చలిమిరి. లక్ష్మీ. 3, ఆ. 68.

చల్ల, దే. వి. 1: చూ, మజ్జిగ; విశ. 2. జలుబు: చూ, రూ-చలువ. 1.

చల్లకడి. దే. వి. మెంతిమజ్జిగ: చూ, మజ్జిగ.

చల్లకము, దే. వి. చల్లుట: చూ, ప్రోక్షణము. 1.

చల్లకుండ, ద్వ. వి. 1. మజ్జిగకుండ: చూ, భాండము. 3.—౨౨; వా. 2. అమ్మవారి చల్లఘటము: చూ, భాండము. 3.

చల్లగడ్డ, ద్వ. వి: చూ, శతమూలి*.

చల్లగాలి, దే. వి. చల్లనిగాలి: చూ, వాయువు. 1-౧౪.

చల్లగుత్తులు, ద్వ. వి. ఒకరకము భక్ష్యము: చూ, భక్ష్యము.

చల్లగుడులు, దే. వి. బ. చల్లత్రిప్పుత్రాళ్లు: (అఁకత్రాళ్లు): చూ, సూత్రము. 1.—౪౧.

చల్లచప్పుడు, దే. విశ. జడుఁడు: చూ, స్తబ్ధుఁడు.

చల్లజంపు, దే. విశ: చూ, వెఱపరి.

చల్లడము, వై. వి. = చలనమ్: చూ, రూ-చలాడము.

చల్లత్రాళ్ళు, దే. వి. బ: చూ, చల్లగుడులు.

చల్లన, దే. వి. 1. క్షేమము: చూ, శుభము. 1; విశ. 2. శీతము. "చల్లనిగాలి": చూ, శైత్యము.

చల్లనగు, దే. అ. క్రి. ఇపతళించు: చూ, శైత్యించు.

చల్లని తెలిదిబ్బ, ద్వ. వి: చూ, చలిగొండ.

చల్లపందిలి, దే. వి: చూ, రూ-చలిపందిరి.

చల్లపడు, ద్వ. అ. క్రి: చూ, చల్లనగు.

చల్లపిట్ట, ద్వ. వి. ఒకరకమువిట్ట: చూ, పక్షి.

చల్లపులుసు, వా. వి. పొగచిన మెంతి మజ్జిగ, తిమ్మనము: చూ, మజ్జిగ.

చల్లరాయి, దే. వి. తరిగంబము: చూ, దండ విష్కంభము. (స్తంభము. 1-౧౮.)

చల్లవడియము, ద్వ. వి. మజ్జిగ వడియము: చూ, వడియము.

చల్లసేయు, ద్వ. స. క్రి. (చల్ల+చేయు) చల్లఁజేయు; వా. 2. త్రచ్చు: చూ, మథించు.

చల్లాడము, వై. వి.=: చూ, రూ - చల్లడము.

చల్లాణము, దే. వి: చూ, రూ - చిల్లాడము.

చల్లారు, దే. అ. క్రి. (చల్ల+ఆరు) ఉపశమిల్లు: చూ, స్రుక్కు. 4.

చల్లు, దే. వి. 1. చల్లుట: చూ, చల్లకము; స. క్రి. 2. (నీళ్లు) చల్లు. (విత్తనములు) చల్లు: చూ, ప్రోక్షించు.

చల్లుట, దే. వి: చూ, చల్లకము.

చల్లుపోరాట, దే. వి. జలక్రీడ: చూ, విలాసము. 1.

చల్లుపోరు, దే. వి. కొలఁకులయందు దిగి యొకరిమీఁదనొకరు నీళ్లచల్లుకొనెడి యాట: చూ, విలాసము. 1. (చల్లుపోరాట.)

చల్లులాడు, దే. అ. క్రి.(చల్లులు+ఆడు) కొలఁకులయందు దిగి యొకరిమీఁద నొకరు నీళ్లచల్లుకొనియాడు.

చల్వ, దే. వి: చూ, రూ - చలువ.

చవకము, వై. వి. = చతుష్కము: చూ, రూ - చవిక.

చవట, వా. వి. వాజమ్మ: చూ, వ్యాధుఁడు.

చవటినేల, దే. వి. రూ - చవుటినేల: చూ, భూమి. 1—౭.

చవడు, దే. వి. రూ - చౌడు. —పై.—

చవళము, దే. వి. 1. వరహాలో నెనిమిదవభాగము.

చవి, దే. వి. అమృతము, వేలుపుబోనము: చూ, సాదము (1): 2. రసము: చూ, రూ - చవురు; 3. ఆస్వాదనము: చూ, రుచి. 1; 4. ఘోటీగర్భము: చూ, హయము. 1—౪౫; 5. మౌక్తికాదిభారము. ఆం, భా. ద్వి. 276: చూ, రత్నములు. 1—౧—(౧౭).

చవిక, వై. వి. = చతుష్కము. రూ - చవకము - చవికము - చవికె - చవిరె, మెల్లా: చూ, సదనము. 1.(మండపమనియు.)

చవికము, —పై.—

చవికె, —పై.—

చవిఁగొను, దే. స. క్రి. (చవి+కొను): చూ, రుచిఁగొను.

చవితి, వై. వి. = చతుర్థి. పక్షమందు నాల్గవతిథి, రూ - చవుతి: చూ, తిథి. 1.

చవిరె, వై. వి. =: చూ, రూ - చవిక.

చవిలివాఁడు, దే. వి. గర్భిణీహస్తగతశిశువు. రూ- చవిలెవాఁడు: చూ, శిశువు. 1—౧.

చవిలె, దే. వి. నాలుగుడబ్బులు: చూ, అణా.

చవిలెవాఁడు, దే. వి: చూ, రూ - చవిలివాఁడు.

చవు, వై. స. = చతుః. రూ - చౌ: చూ, నాలుగు.

చవుక, దే. విశ. రూ - చౌక. 1. అగ్గువ: చూ, వెల. 1; 2: తక్కువ: చూ, వెలితి. 2.

చవుకటులు, ద్వ. వి. బ. రూ - చవుకట్టులు - చవుకట్లు - చౌకటులు - చౌకట్లు. నాలుగు ముత్యములుచేర్చి కట్టినపోఁగులు: చూ, భూషణము. 2.—౮—(౧౩).

చవుకట్టులు, —పై.—

చవుకట్లు, —పై.—

చవుకము, వై. వి. రూ - చౌకము. 1. సమమైన నాలుగు మూలలుగలది: చూ, రూ - చదరము. 1; 2. పడుపు వెడల్పులు సరిగాగలతుంటుగుడ్డ: చూ, వస్త్రము. 1—౨౪; 3. వల్గితము, అశ్వగతిభేదము: చూ, హయము. 1—౬౪—(౪); స. 4 = చతుష్కము: చూ, చవు.

చవుకసేయు, దే. స. క్రి. (చవుక+చేయు) రూ - చౌకసేయు. 1. తక్కువపఱచు: చూ. వచించు; 2. ధరతగ్గించు. రూ - చౌకసేయు.

చవుకళి. ద్వ. వి. (చవు+కాళ్లు) ఆఁడువారికోకలనేఁతయందు నూలిపోఁగులచేత నేర్పడిన చచ్చౌకపుటిల్లు. రూ - చౌకళి: చూ, సదనము. 1.

చవుకళించు, ద్వ. అ. క్రి. (చవుకళి+ఇంచు) నాలుగు కాళ్లు పైకెత్తి దాఁటు. రూ - చౌకళించు. స్వా. 1, అ. 59: భో. 6, అ. 25: చూ, లంఘించు.

చవుకళింత, ద్వ. వి. 1. చౌకళించుట. రూ - చౌకళింత - చౌకళింపు: చూ, లంఘ; 2: చూ, చవుకము. 3.

చవుకళింపు, ద్వ. వి. —పై.—

చవుకాఁడిగుదియ, ద్వ. వి. నాలుగుప్రక్కలు తీరిన యినుపదండము. రూ - చౌకాఁడిగుదియ: చూ, బాణము.1 —౩౫.

చవుకారము, వై. వి. రూ - చౌకారము: చూ, సబ్బు.

చవుకాలిపీఁట, ద్వ. వి. నాలుగుకాళ్ళుగల యెత్తుపీట. రూ - చౌకాలిపీఁట: చూ, పీఁట.

చవుకి, వై. వి. కంచము. రూ - చౌకి: చూ, పాత్రము. 6.

చవుకీ, వై. వి. = చతుష్కము. కూడలిలోపన్నుతీయుతావు. రూ - చౌకీ, సుంకరిమెట్టు: చూ, సదనము. 1.

కచేరకము, కలింజకము - రూ - కలింజకము - కిలింజము, చంచ; తద్వి.— కొబ్బరిఆకుచాఁప. - (తె. ప). — కీతు; చిన్న చౌకపుచాఁప.— (తె. ప.) :— చదర-రూ-చదరిక ; (సం. ప.):— చర్మకము ; 2. ఓడకుఁగట్టెడు చాఁప : చూ, వస్త్రము. 1—౩౧; 3. గడ్డిచాఁప: తడక - తడిక - తడికె. అంతికె. (సం) అంతిక; 4. ఒకరకమువల. జై. 2, ఆ. 97: చూ, వల. 1.

చాఁపకట్టు, దే. వి. చాఁప పఱపువంటిపఱపు.

చాఁపకట్టువడు, ద్వ. అ. క్రి. (చాఁపకట్టు + పడు) చాఁపపఱచి నట్లగు (నేలతో నేలగానగు.)

చాఁపగద్ద, ద్వ. వి. కుందేళ్లనుబట్టెడి యొకరకము డేగ: చూ, శ్యేనము.

చాఁపచుట్టువడు, వా. అ. క్రి: చూ, గుదిగొను. 2.

చాఁపట్టు, దే. వి. (చాఁప + అట్టు) అప్పడమువంటి యొక నొక పిండివంట: చూ, భక్ష్యము.

చాఁపకాయి, దే. వి. విశాలమైనకాయి; చూ, రత్నములు. 1.—౧౨—(౩౧).

చాఁపల్లువాఁడు, దే. వి. కటకారుఁడు : చూ, మేదరి.

చాఁపలు, దే. వి. బ. 1. చిక్కులు (అప్ర.); 2. కటములు.

చాఁపు, దే. వి. 1. పడుగుకొలఁదిబట్ట: చూ, వస్త్రము. 1—౫; 2. చాఁచుట ; ప్రే. 3. చాఁగఁజేయు ఒగ్గు, ఒడ్డు,చాఁచు.

చాకట్టు, ద్వ. వి. ధనము : చూ, విత్తము. 1.

చాకల, దే. వి. వస్త్రములు ఉదికి జీవించునట్టి యొకజాతి. "చాకలవాఁడు - చాకలది."

చాకలత, దే. వి. 1: చూ, రజకి; అం. 2. దూతికలలోనొకతె: చూ, దూతీచతుష్టయము.

చాకలది, —పై.—

చాకలపిట్ట, ద్వ. వి: చూ, భరద్వాజము.

చాకలవాఁడు, దే. వి: చూ, రజకుఁడు.

చాకలి, దే. వి. 1. —పై.—; 2: చూ, రజకి ; అం. 3. శిల్పులు అయిదుగురిలో నొకఁడు : చూ, శిల్పులు.

చాకి. —పై.—

చాకిత, దే. వి: చూ, చాకలత.

చాకిబాన, దే. వి. 1: చూ, బాలక్రీడ ; 2. ఒకానొకపిట్ట : చూ, పక్షి ; వా. వి. 3. చాకలివాండ్రు బట్టలుడికించు గూన : చూ, భాండము. 3. —౨౩.

చాకిమూట, దే. వి: చూ, బాలక్రీడ.

చాకిరి, దే. వి. పరిచర్య : చూ, శుశ్రూష. 2.

చాకీ, దే. వి. కంథము: చూ, పాత్రము. 6.

చాకు, వా. వి. కత్తి : చూ, రిష్టి. 2—౧౧.

చాకె, దే వి: చూ, చాకలత.

చాకెత, —పై.—

చాగకాఁడు, ద్వ. వి. (చాగము + కాఁడు) 1. కుబేరుఁడు : చూ, శ్రీమంతుఁడు; విణ. 2. త్యాగశీలుఁడు : చూ, వదాన్యుఁడు.

చాగము, వై. వి. = త్యాగః: చూ, త్యాగము.

చాగరతనము, వై. వి. = త్యాగరత్న (చాగము + రతనము) చింతామణి: చూ, రత్నములు. 1—౧౧.

చాగరాడి, దే. వి. గంధపిండీతకము : చూ, శ్వసనము.

చాగరాడివెలికె, —పై.—(అం, భా. ద్వి. 65.)

చాగి, వై. విణ. = త్యాగి (చాగము + ఇ) : చూ, వదాన్యుఁడు.

చాగు, దే. అ. క్రి. 1. పోవు: చూ, వెళ్లు. 3; 2. ప్రవర్తిల్లు. జై. 1, ఆ. 105 : చూ, వర్తించు; 3 : చూ, యత్నించు.

చాగుబడిక, దే. వి. పూజ: చూ, సపర్య.

చాచి, దే. వి. చన్ను: చూ, స్తనము.

చాటడుగుమొన, అం: చూ, మొనలు: (చూ, మల్లశాస్త్రము.)

చాటించు, దే. స. క్రి. తుడుము లోనగునవి వాయించి ఊరి వారికందఱికి విషయమును తెలుపు : చాటు.

చాటింపు, దే. వి. చాటించుట-చాటువ, టంటం-టముకు-టముకు: చూ, హూహూ.

చాటు, దే. వి. 1. మఱుఁగు : చూ, వ్యవధానము. 3; స క్రి. 2: చూ, చాటించు; 3. విశదపఱచు: చూ, సూచించు. 2.

చాటుపడు, ద్వ అ. క్రి : చూ, మఱుఁగుపడు.

చాటుబోటులబావ, ద్వ. వి. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

చాటుమాట, వా. వి : చూ, జనాంతికము.

చాటువ, దే. వి. 1: చూ, చాటింపు; వై. వి. 2. = చాటు. ఉదాహరణము : చూ, నిదర్శనము. 1.

చాటువెట్టు, ద్వ. స. క్రి : చూ, మఱుఁగువెట్టు.

చాడి, దే. వి. రూ-చాడీ, కొండియము : చూ, తంటా.

చాడీ, —పై.—

చాడీకోరు, దే. విణ. రూ-చాడీగొట్టు. పిశునుఁడు : చూ, సూచకుఁడు. 1.

చాడీగొట్టు, —పై.—

చాడుపు, దే. వి. రూ-చాడ్పు : చూ, విధము. 1.

చాడ్పు, —పై.—

చాతనివాఁడు, దే. వి. శిఖయజ్ఞోపవీతములు ధరింపని వైష్ణవుఁడు : చూ, సాతాని.

చాతాని, —పై.— (రూ-సాతాని.)

**చాతు,** దే. స. క్రి. ధరించు : చూ, వహించు.

**చాదీవెండి,** వా. వి. ఊదువెండి : చూ, లోహము. 1.

**చాన,** వై. వి = శ్యామా. ఇంతి : చూ, స్త్రీ. (దేశ్యమని శబ్ద రత్నాకరము.)

**చానపి,** దే. వి. పేన్నీళ్లు : చూ, నలిలము. 1—౩౩.

**చానరి,** దే. వి. నాట్యవిశేషము: చూ, నృత్యము: (చూ, వ్యంజకము. 1.)

**చావరువు,** దే. వి. (చావు + పరువు) చచ్చునంతటి పరుగు. స్వా. 4, ఆ. 45 : చూ, పఱుగు. 2.

**చామ,** వై. వి. 1. = శ్యామల. నలుపు : చూ, వర్ణము. 6-౬; 2. = శ్యామా. ఆఁడుది: చూ, స్త్రీ; 3. = శ్యామా. యువతి: చూ, స్త్రీ. 1—౨౬; 4. = శ్యామాకః. సస్య విశేషము: చూ, సస్యము. 1; దే. వి. 5. ఒకరకముపదవ: చూ, హోడము.

**చామనచాయ,** వై. వి. = శ్యామలవర్ణమ్. నల్లఁదనము : చూ, వర్ణము. 6-౬.

**చామనము,** వై. వి. 1. శ్యామలః. నలుపు: చూ, వర్ణము. 6-౬; విణ. 2. నల్లనిది : చూ, వర్ణము. 6.

**చామలు,** వై. వి. బ. = : చూ, చామ. 4.

**చాయ,** వై. వి = ఛాయా: చూ, ఛాయ. 1-2; 3-4-5-6-7-8; 9. వైపు: చూ, పార్శ్వము. 2; 10. పోలిక, ఉపమ. వసు 1, ఆ. 101: చూ, సమానము. 2; 11. జాడ: చూ, సూచన. 1. 12. దగ్గఱ: చూ, సమీపము. 1; 13. తిన్నన, ఋజుభావము: చూ, హృద్యము; బ. 14. క్షత్రియో ... కొంతులు.

**చాయకొడుకు,** ద్వి. వి. శనిగ్రహము: చూ, శని, ఇట్లు చాయపట్టి.

**చాయచెక్క చెట్టు,** ద్వి. వి: చాయవేయుటకు ఉపయుక్తమైన చెక్కగల ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

**చాయపెనిమిటి,** ద్వి. వి: చూ, సూర్యుఁడు.

**చాయమేకు,** వా. వి : చూ, బందికన్ను.

**చాయలాపాయలా,** వా. వి : చూ, టాలాటోలి. 2.

**చాయవాఱు,** ద్వి. అ. క్రి. (చాయ + పాఱు) పోలు : చూ సరిపోవు. 1.

**చార,** వై. వి: చూ, రూ-చేర.

**చారిక,** దే. వి. ఒకరకము బొట్టు. రూ-చాతిక. పత్త్రిరి బొట్టు: చూ, బొట్టు. 1.

**చారు,** వై. వి. 1. = సార. స్థిరరసము, కట్టుచారు. రూ-చేరు - చేఱు: చూ, యూషము; 2. సున్నముకలిసిన కల్లు చూ, సుర. 2-౧౫; దే. స. క్రి. 3. పొరకట్టయను గుతో నుఱిచిన కళ్ళము నూడ్చు: చూ, సమ్మార్జించు.

**చారె,** వై. వి. రూ-చేర-చేఱ: చూ, హస్తము. 1-౧౩.

**చాఱ,** వై. వి. 1. = చారః. జీడిమామిడి. స్వా. 4, ఆ. 14: చూ, చాఁగ. 4; దే. వి. 2. గీఁత: చూ, రేఖ. 3; 3. ఒక రకము చేప: చూ, మత్స్యము. 1; 4. పులిరంగు: చూ, వర్ణము. 6-౬-(౧౧).

**చాఱకంద,** ద్వి. వి. పిండాలువు: చూ, సూరణము.

**చాఱగలాపు,** ద్వి. స. క్రి. చంపు: చూ, సంహరించు.

**చాఱపప్పు,** ద్వి. వి. జీడిమామిడిగింజలోని పప్పు: చాఱబియ్యము.

**చాఱబియ్యము,** —పై.—

**చాఱమీను,** ద్వి. వి: చూ, చాఱ. 3.

**చాఱలమెకము,** ద్వి. వి. పులి: చూ, శార్దూలము. 1.

**చాఱిక,** దే. వి. 1: చూ, రూ-చాఱ. 1; 2: చూ, రూ చారిక; 3: చూ, చాఱ. 2; 4: చూ, చాఱ. 4.

**చాఱికె,** దే. వి: చూ, చాఱ. 2, 4.

**చాల,** వా. వి. రూ-చాలా. బహుళము: చూ, విస్తారము. 1.

**చాలఁడు,** వా. వి. అసమర్థుఁడు, అపాత్రుఁడు, తగనివాఁడు.

**చాలమి,** వా. వి. అశక్తి.

**చాలా,** వా. వి: చూ, రూ-చాల.

**చాలించు,** దే. ప్రే. 1. నిలుపుదలచేయు; 2. శక్తముగఁజేయు.

**చాలిక,** దే. వి. నేరుపు: చూ, సామర్థ్యము. 1.

**చాలియుండు,** ద్వి. అ. క్రి: చూ, సమర్థమగు.

**చాలు,** దే. వి. 1. వరుస: చూ, పంక్తి. 1; 2. దున్నునపుడు కఱుచే నేర్పడిన రేఖ. వరజు: చూ, సీత. 2; 3. పైనుండి పడు నీరు లోనగువాని చాలు శశాం. 2, ఆ. 17: చూ, ధార. 1; 4. చాలుననెడి బుద్ధి. పర్యాప్తి. పంచ. వేం. 4, ఆ. 507: చూ, హృల్లేఖము. 2; అ. క్రి. 5. కావలసినంత యగు: చూ, పర్యాప్తమగు; 6. నేర్చు: చూ, నేరుచు.

**చాలుపు,** దే. వి. రూ-చాల్పు: చూ, శ్రేణి. 1.

**చాలుపేరింటి పూఁబోడి,** ద్వి. వి. సీతాదేవి: చూ, సీత.

**చాలుబడి,** దే. వి. చాలిక: చూ, సామర్థ్యము. 1.

**చాలుమానిసి,** ద్వి. విణ. 1. శూరుఁడు: చూ, హంవీరుఁడు. 2; 2. ఆనువరి: చూ, సమర్థుఁడు.

**చాలుమాసి,** ద్వి. విణ. పనుపరి-రూ-పన్పరి. ఒకరికి లోఁబడిన వాఁడు: చూ, పరాధీనుఁడు.

**చాలుమూల-వీలు చాలు,** జా. సంగతి సందర్భము "చాలుమూల లేని జాలున నాచే నాలాగున వాగించితివి." (ధర్మజరాజు సూయము.)

**చాలువాఁడు,** దే. విణ శక్తుఁడు: చూ, సమర్థుఁడు.

**చాలువాఱు,** దే. అ. క్రి. (చాలు + పాఱు) వరుసతీరు.

చాల్పు, దే. వి: చూ, రూ-చాలుపు.

చాల్పుకుత్తుకలవాఁడు, దే. వి. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1-3.

చావఁజూచు, దే. స. క్రి. (చావన్ + చూచు) చంపు: చూ, సంహరించు.

చావడి, దే. వి. 1. కొలువుకూటము: చూ, సభ. 2; 2. చవికె, మండపము: చూ, సదనము. 1; 3. సత్రము: చూ, సదనము. 1.

చావంవారు, దే. వి. బ. దేవతలు: చూ, వేలుపు.

చావు, దే. వి. మృతి: చూ, సావు.

చావుగుఱుతు, దే. వి. అశుభము: చూ, లక్షణము. 1-౧౩.

చావుమునుక, దే. వి. అపస్నానము: చూ, స్నానము. 1.

చావుమయిల, దే. వి. అస్పృశ్యత్వము: చూ, మృతాశౌచము.

చావుమైల, రూ-పై.—

చాళియ, దే.వి.రూ-చాళే. మల్లబంధవిశేషము. చూ, మల్లశాస్త్రము.

చాళె, —పై.—

## చు

చుంగు, వై. వి. రూ-చెంగు. 1. అంచు: చూ, మైజాలు; 2. వెనుకకుఁ జెక్కుకొనెడి దోవతికొంగు. చూ, వళి 2.

చుంగుడు, దే. వి. నిలువయగు చిల్లరద్రవ్యము.

చుంచు, వై. వి. 1. = చుచుందరీ. రూ-చుండు: చూ, మూషికము; దే. వి. 2. నెమలిసిగ: చూ, సిక. 1; 3. పిల్లజుట్టు: చూ, సిక. 1-౧.

చుంచెలుక, ద్వ. వి. (చుంచు + ఎలుక) కంపెలుక: చూ, మూషికము.

చుంచుమిద్దె, ద్వ. వి. గోపురమువలె పొడవుగాకట్టిన కట్టడము: చూ, సదనము. 1.

చుంచుఱాయి, దే. వి. మేడలమీఁద కప్పెడు ఱాతిపలకవంటి యొకరకము ఱాయి: చూ, రత్నములు. 1-౧-౨- ౩౪).

చుండి, దే. అవ్య. బ. నిశ్చయార్థక బహువచనము: చూ, సత్యము.

చుండీ, —పై.—

చుండు, దే. వి. 1. కంపెలుక: చూ, మూషికము. 2. తలమీఁద ఉప్పు పూచినట్లు పూచెడువ్యాధి: చూ, రోగము. 1; అ. క్రి. 3. ఆకు లోనగునది పెగచే శుష్కించు: చూ, శోషించు.

చుండెలుక, దే. వి. (చుండు + ఎలుక): చూ, చుంచెలుక.

చుంద్రాళ్లు, దే. వి: చూ, బాలక్రీడ.

చుంయి, దే. వి. నిప్పు నీళ్లు చేరునపుడు కలుగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చుఁడి, వై. వి. (రూ-చుఁడు- చుఁడీ- సుఁడి- సుండీ.) 1: చూ, రూ-చుండి; 2: చూ, చుమి. 1.

చుఁడీ, —పై.—

చుఁడు, —పై.—

చుక్క, వై. వి. 1. = శుక్ర. (అశ్విన్యాది) రిక్క, గగనేచరము: చూ, రిక్క. 1; 2. = శుక్రగ్రహము: చూ, శుక్రుఁడు; 3. చుక్క కాఁడ, పుల్లప్రబ్బలి*: చూ, ప్రబ్బలి; 4. మండలాకారమైన తిలకము: చూ, బొట్టు: 1; 5. నీటిబొట్టు: చూ, బొట్టు. 1.

చుక్కకాఁడ, వై. వి: చూ, చుక్క. 3*.

చుక్కకార, ద్వ. వి. ఒకానొక చేఁప: చూ, మత్స్యము. 1.

చుక్కకూర, వై. వి. ఒకరకము కూరాకు. చుక్కకాఁడ (అని కొందఱు): చూ, వృక్షము: (చూ, ప్రబ్బలి.)

చుక్కచేఱు, వై. వి. 1. చేరుచుక్క: చూ, లలాటిక; 2. చుక్కలచాలు, వసు. 5, ఆ. 116: చూ, శ్రేణి. 1.

చుక్కనుదుటిపిట్ట, ద్వ. వి. గరుత్మంతుఁడు. వేం, అం. 18: చూ, హరివాహనుఁడు.

చుక్కపిల్ల, వై. వి. ఒకరకము చేఁప: చూ, మత్స్యము. 1.

చుక్కపిల్లి, వై. వి. ఒకరకముపిల్లి (అప్ర.): చూ, మార్జాలము.

చుక్కబొట్టు, ద్వ. వి: చూ, చుక్క. 4.

చుక్కయెదురు, ద్వ. విశ. (చుక్క + ఎదురు) చుక్కవాలు. హరిశ్చ. 4, ఆ. 179: చూ, ఎదురుచుక్క.

చుక్కలగమికాఁడు, ద్వ. విశ. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

చుక్కలతెరువు, ద్వ. వి. ఆకాశము: చూ, సురవర్త్మము.

చుక్కలదొర, ద్వ. వి: చూ, చుక్కలగమికాఁడు.

చుక్కలతేరు, —పై.—

చుక్కలి, దే. వి. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

చుక్కవాలు, ద్వ. వి: చూ, చుక్కయెదురు. పా. 2, ఆ. 40.

చుక్కాని, దే. వి. అరిత్రము. రూ-చుక్కాను. చూ, పీలి. 2.

చుక్కాను, —పై.—

చుచ్చు, దే. వి. 1. మేఁక: చూ, మేషము 1; 2. సంతాపము వలన కలిగెడు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చుచ్చుకొట్టు, దే. అ. క్రి. సంతాపము లేక చుచ్చు అను.

చుచ్చుఱుకు, దే. విశ. (చుఱుకు + చుఱుకు) మిక్కిలి తీక్ష్ణము: చూ, వేఁడిమి.

చుట్ట, దే.వి. 1. మిత్రుఁడు: చూ, స్నేహితుఁడు; 2. గుండ్రముగా చుట్టినచుట్ట: చూ, మట్టు. 2; 3. మోపుక్రింద తలమీఁద నుంచుకొనెడు చుట్ట: చూ, మట్టు. 3; 4. పొగాకు చుట్ట: చూ, పొగచుట్ట.

చుట్టకుదురు, దే. వి. కుండలు కుదిరికగా నిలుచుటకై వానిక్రింద నుంచెడు వెంటిలోనగువాని చుట్ట: చూ, మట్టు. 3.

చుట్టచుట్టుకొనెడుదిట్ట, దే. వి. పాము: చూ, సర్పము.

చుట్టపీకె, వా. వి. కాల్చినచుట్ట, మొదటిముక్క: చూ, పొగచుట్ట.

చుట్టము, దే. వి. 1: చూ, బంధువు; 2. సంబంధము చేసిన వాఁడు: చూ, సంబంధి. 1; 3: చూ, స్నేహితుఁడు; 4. బంధుత్వము: చూ, వావి. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును. చుట్టతనము, చుట్టపక్కములు.)

చుట్టములులేని యూరు, అం: చూ, అప్రకాశములు.

చుట్టరికము, దే. వి. (చుట్టము + రికము) రూ- చుట్టఱికము. 1. చుట్టము: చూ, వావి; 2. చెలిమి: చూ, స్నేహము. 1; 3. కూడిక, సంబంధము: చూ, సంయోగము.

చుట్టఱికము, —పై.— పంచ. 4, ఆ. 465.

చుట్టఱికమునుదెల్పుట, అం: చూ, సామములు.

చుట్టలు, దే. వి. బ. రూ - చుట్టములు - చుట్టాలు : చూ, బంధువు.

చుట్టలుఁగు, దే. వి. (చుట్టు + అలుఁగు) రూ - చుట్టల్గు. చక్రాయుధము : చూ, బాణము. 1. —ఇం.

చుట్టల్గు, —పై.—

చుట్టాలసురభి, జా. బంధువులనాదరించునది." సీ. చుట్టాలసురభియై సొబగునొందెనెగాని వెనరైన చుట్టంబు దనకుఁగీర్తి" (పాండురంగ.)

చుట్టాలు, దే వి. బ: చూ, బంధువు.

చుట్టిలు, దే. వి. రూ - చుట్టిల్లు, చుట్టును గుండ్రముగా గోడపెట్టినకుమ విట్టాటనాటి దూలములులేక కట్టినయిల్లు: చూ, సదనము. 1.

చుట్టిల్లు, —పై.—(చుట్టు + ఇల్లు.)

చుట్టివచ్చు, దే. స. క్రి. 1. పరివేష్టించు: చూ, వేష్టించు; 2. ప్రదక్షిణించు: చూ, వలగొను.

చుట్టు, దే. వి. 1. చుట్టిరాఁజేయుట: చూ, సంవృతము; 2. ఆఁడుదానికాలి జుట్టనవ్రేలియుంగరము: చూ, భూషణము. 2; విణ. 3. చక్కఁగాఁగాక తిరిగి తిరిగి పోదగిన మార్గము: చూ, మార్గము. 1; స. క్రి. 4: చూ, వేష్టించు; 5. చుట్టగాఁజుట్టు; 6. తిరిగిరాఁజేయు; దే. ద్ర. 7. నాలుగు ప్రక్కలను.

చుట్టుఁగైదువజోదు, ద్వ. వి. వెన్నుఁడు: చూ, విష్ణువు 1.

చుట్టుఁగైదువు, దే. వి. (చుట్టు + కైదువు): చూ, చుట్టలుఁగు.

చుట్టుఁగొండ, ద్వ. వి. (చుట్టు + కొండ) చక్రవాళపర్వతము: చూ, పర్వతము (ఇట్లు చుట్టుగట్టు).

చుట్టుఁబట్టు, దే. వి. (చుట్టు + పట్టు) నలుప్రక్క. (శ.ర.) కళా. 3, ఆ. 82.

చుట్టుఁబులుగు, దే. వి. (చుట్టు + పులుఁగు) చక్రవాక పక్షి. రూ - చుట్టుఁబుల్గు: చూ, బటువు గువ్వ.

చుట్టుకుదురు, ద్వ. వి. గడ్డిబొద్దు: చూ, బొద్దు. 2.

చుట్టుకొను, దే. స. క్రి: చూ, వేష్టించు.

చుట్టుకొల్లారము, దే. వి. రూ - చుట్టుకొల్లారు. కొలారము: చూ, సదనము. 1.

చుట్టుకొల్లారు, రూ—పై.—

చుట్టుగుల్ల, ద్వ. వి. వలయాకారపుశంఖము: చూ, సంకు. 1.

చుట్టుట, దే. వి. చుట్టుదల: చూ, వ్యాపనము.

చుట్టుపుగుల్ల, ద్వ. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.

చుట్టుదల, దే. వి: చూ, చుట్టుట.

చుట్టుదారి, ద్వ. వి: చూ, చుట్టు. 3.

చుట్టుమాలియ, ద్వ. వి: చూ, చుట్టుకొల్లారము.

చుట్టుమాలె, —రూ—పై.—(వావుక.)

చుట్టువాఱు, దే. స. క్రి. (చుట్టు + పాఱు): చూ, వేష్టించు స్వా. 3, ఆ. 62.

చుట్టువాఱుకొను, —పై.—

చుట్టువాలు, ద్వ. వి: చూ, చుట్టలుఁగు.

చుట్టువాల్జోదు, ద్వ. వి. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. శంఖము: చూ, సంకు. 1.

చుట్టువాలుదారి, ద్వ. వి: చూ, విష్ణువు. 1.

చుట్టువు, దే. వి. గొడుగు: చూ, వారిత్ర.

చుట్టువేడెము, ద్వ. వి. గుఱ్ఱముయొక్క మండలగతి: చూ, హయము.

చునాయించు, దే. స. క్రి. బట్టలుమడతపెట్టు.

చుప్పనక, వై. వి. = శూర్పణఖ: చూ, రాక్షసి. (అసహనము గల ఆఁడుదానియందీ శబ్దము వాడెదరు.)

చుప్పనాక, —పై.—

చుప్పనాతి, ద్వ. వి. —పై.— (శ. ర.) (శూర్పణఖాశబ్ద తద్భవమని కొందఱు.)

చుబ్బనచూఱ, వై. వి. (చూఱ + చూఱ) మిక్కిలిచూఱ, పెద్దకొల్ల యనుట.

చుమి, వై. వి. 1. = సం. చూడుమి. రూ - చుమా - చుమ్మా - చుము - చుమ్మ - చుమ్మా - చుమీ - చుమ్మి - చుమ్మీ -

చమ్మ - చవ్వే - చవ్వే-చూవె-చూవే-చూ- చూరె-చూరే; వై. అవ్య. 2. రూ - చమీ - చమ్మి - చమ్మీ. నిశ్చయార్థకము: చూ, సత్యము. (బ. చుండి - చుండీ.)

చమీ, —వై.—

చము, —వై.—

చమ్ము, 1. —వై.—; దే. వి. 2. దుఃఖము: చూ, శోకము; 3. నొప్పి: చూ, వేదన. 1.

చమ్మచుట్లు, దే. వి. బ. కడుపులోఁ గలుగు వేదన: చూ, వేదన. 1.

చమ్మలుచుట్టు, దే. అ. క్రి. వేదనపడు, కలఁగు విజ. 3, ఆ. 136: చూ, సంక్షోభించు.

చమ్మలువాఱు, —వై.—

చమ్మా, వై. వి.=స్మ: చూ, చమి. 1.

చమ్మి. చూ, రూ - చమి.

చమ్మీ, —వై.—

చమ్ము, వై. వి. =స్మ: చూ, చమి. 1.

చయ్యంకి, దే. వి. వాద్యవిశేషము. తాళము: చూ, వీణె.

చుర, వై. వి. =క్షుర. కఠారము: చూ, రిష్టి. 2.

చురకత్తి, వై. వి.=ఛురిక. —వై.—

చురచురవోవు, దే. అ. క్రి. (చురచుర + పోవు) జ్వలించు: చూ, మండు.

చురి, వై. వి.=ఛురిక: చూ, రూ - చుర.

చురియ, —వై.—

చుఱచుఱ, దే. వి. కాలుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుూహూ.

చుఱకగు, దే. అ. క్రి. 1. ధ్వనించు: చూ, శబ్దించు; వా. 2. ధాన్యముధర పెరుఁగు.

చుఱుకటీఁడు, దే. విశే. శూరుఁడు. అం, పదా. న. 39: చూ, హంవీరుఁడు. 2.

చుఱుకరి, వై. వి.=శూర (చుఱుకు + అరి) 1. —వై.—; 2. చొరవగలవాఁడు: చూ, సాహసికుఁడు.

చుఱుకు, దే. వి. 1. శీఘ్రము: చూ, స్యదము; 2. రూ - చుఱుక్కు-, తీక్షణము: చూ, మిడి. 4; 3. ఉష్ణము: చూ, వేఁడిమి; 4. వాఁడిమి: చూ, వాలు. 6; 5. వీరము: చూ, శౌర్యము. 1; 6. రూ - చుఱుక్కు-. నాటుట నిప్పుసోఁకుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హుూహూ, విశే. 7. వేఁడిమిగలది: చూ, వేఁడిమి; 8. వాఁడిగలది; చూ, శితము. 1.

చుఱుక్కు-, దే. వి: చూ, రూ - చుఱుకు. 2, 6.

చుఱుపుచ్చు, దే. స. క్రి. (చుఱుకు + పుచ్చు) కాల్చు: చూ, వెలుఁగు. 5.

చుఱ్ఱు, దే. వి: చూ, చుఱచుఱ.

చుఱ్ఱుకొను, దే. స. క్రి: చూ, చుఱుపుచ్చు.

చులకన, వై. విశే: చూ, రూ-చులకన.

చులుక, దే. ద్ర. క్రి. విశే. రూ-చుల్క-. 1. లాఘవముగా: చూ, లాఘవము. 1; 2. సులభముగా: చూ, సులభము.

చులుకఁజేయు, ద్వ. స. క్రి (చులుక + చేయు) లాఘవపఱుచు.

చులుకన, వై. వి. =సులభ. రూ-చుల్కన. 1. తేలిక: చూ, లాఘవము. 1; 2. సౌలభ్యము: చూ, సులభము. విశే. రూ-చుల్కన; 3. లఘువు: చూ, లాఘవము. 1; 4. సులువు: చూ, సులభము.

చులుకపాటు, ద్వ. వి: చూ, చులుకన. 1.

చుల్క-, దే. ద్ర. క్రి. విశే: చూ, రూ-చులుక.

చుల్కన: చూ, రూ-చులుకన.

చుల్కపాటు, ద్వ. వి: చూ, రూ-చులుకపాటు.

చుల్లజుంకు, దే. వి. మొటిమవంటి చిన్న నెత్తురుగడ్డ: చూ, వ్రణము. 1-౩.

చుల్లరము, దే. వి. కోడెవయసుగల పంది: చూ, సూకరము, ౨-౮.

చుల్లి, దే. వి. మగగుఱి: చూ, శిశ్నము. (రూ-చుల్ల.)

చువక, దే. వి. రూ-చువ్వ-చివర-చివ్వ. 1. ఉపశాఖ: చూ, శాఖ. 1-౨; 2. బెత్తము: చూ, వేత్రము. 1.

చువ్వ, —వై.—

చువ్వె, వై. వి. రూ-చువ్వే (మూడవు + ఎ): చూ, రూ - చమి. 1.

చువ్వే, —వై.—

# చూ

చూ, వై. చూడుము, చూడుఁడు, ప్రభా. 3, ఆ. 64: చూ, చమి. 1; అవ్య. 2. సత్యము: చూ, చమి. 2.

చూఁడి, దే. వి. చూలు, గర్భము; పశుగర్భము. "చూఁడియావు, చూడిపంది" మొ: చూ, భ్రూణము. 1. (చివుడు అనియు వాడుక.)

చూఁడు, దే. స. క్రి. కాల్చు. జై. 5, ఆ. 138: చూ, దహించు.

చూడుగొడుపు, దే. వి. (చూడు + కొడుపు) పసరములకు వాఁతవేసెడి యినుపకోల: చూ, కఱుగోల. 1.

చూకుజు, వై. వి.=శోకః: చూ, శోకము.

**చూకురుపడు**, వై. అ. క్రి: చూ, శోకించు.

**చూచాయ**, వై. వి. (చూపు + చాయ) 1. జాడ: చూ, సూచన. 1; 2. తేలిక: చూ, లాఘవము. 1; చూచిరమ్మన్న చో కాల్చివచ్చువాఁడు. లో. చెప్పిన పనికంటెను అధికముగను చేయుటకు సమర్థుఁడు అనుటయందు వాడుదురు.

**చూచు**, వై. అ. క్రి. 1: చూ, యత్నించు. నిర్వ. 3, ఆ. 67; వై. స. క్రి. 2. = సూచ్. కనుగొను: చూ, వీక్షించు.

**చూచుట**, వై. వి. 1: చూ, వీక్షణము; అం. 2: చూ, దశావస్థలు.

**చూట్కి**, వై. వి. దృష్టి: చూ, వీక్షణము. (వా).

**చూడగలవాఁడు**, ద్వ. వి: చూ, సౌందర్యవంతుఁడు.

**చూడికి**, వై. వి: చూ, రూ-చూట్కి.

**చూడ్కి**, —పై.—

**చూపట్టు**, ద్వ. అ. క్రి. (చూపు + పట్టు): చూ, ప్రత్యక్షమగు.

**చూపరి**, ద్వ. విశ. (చూపు + అరి): చూ, చూడగలవాఁడు.

**చూపఱి**, ద్వ. విశ. బ. చూచువారు: చూపఱు - చూపఱులు.

**చూపఱు**, —పై.—

**చూపఱులు**, —పై.—

**చూపు**, వై. వి. 1. చూచుట: చూ, వీక్షణము; ప్రే. 2. చూపించు: చూ, వీక్షించు. (దీనికి ఉపమానము—బాణము.)

**చూపుగుఱ్ఱము**, వై. విశ. పనికి ఉపయోగముకానివాఁడు: చూ, వ్రాజె.

**చూపుతుగుఱ్ఱము**, రూ—పై.—

**చూపుఁగొడువు**, వా. వి: చూ, కఱుకోల.

**చూపుఁబూఁట**, ద్వ. విశ. (చూపుు + పూఁట) చూపనొప్పకొన్న పూఁటకాఁపు.

**చూపుడువ్రేలు**, ద్వ. వి. తర్జని: చూ, హస్తము. 1-అ.-(అ).

**చూపెట్టు**, ద్వ. స. క్రి. (చూపు + పెట్టు) కనుపెట్టు: చూ, ప్రతీక్షించు.

**చూపోపమి**, ద్వ. వి: చూడసహింపమి.

**చూపోపు**, ద్వ. అ. క్రి. (చూపు + ఓపు) చూడసహించు.

**చూర**, వై. వి. = క్షుర - చురిక: చూ, రూ - చురి.

**చూరకత్తి**, వై. వి. ఛురిక. —పై.—

**చూరణనఖుకు**, అం. (ఖడ్గయుద్ధములోని వ్రేటుభేదము): చూ, నఖుకులు.

**చూరి**, వై. వి. = చురికా: చూ, రూ-చురి. (కృపాణికాగ్రమని - కొందఱు.)

**చూరియావు**, దే. వి. (చూరి + ఆవు) ఒకవిధమైన వన్నెగల యావు, (అప్ర): చూ, ధేనువు.

**చూరీ**, వై. వి. = ఛురికా: చూ, రూ-చురి.

**చూరు**, వై. వి. 1. = చూడా. వలీకము: చూ, వెలినె: (చూ, సదనము. 1.); 2. = చూర్ణము: చూ, సున్నము; అ. క్రి. 3. తగులు: చూ. అంకించు. 1.

**చూరుకమ్మి**, వై. వి. చూరుపట్టె: చూ, వలభి.

**చూరుకట్టు**, ద్వ. వి. ఇంటిమీఁద కప్పువేయునప్పుడు పూరిపఱచి యీఁతమెల్లె లోనగువానిని పెండెవలె మీఁదనుంచి కట్టుకట్టె నారతోఁగాని లేక తీఁగెతోఁగాని కుట్టెడు కుట్టు.

**చూరుకట్టుదబ్బ**, ద్వ. వి. చూరుకట్టునకు నారగుచ్చెడు దబ్బనమువంటి కొయ్యదబ్బ (బద్ద) లోనగునది. (చూరుకట్టుబద్ద అనియు వాడుక.)

**చూరుపట్టె**, వై. వి: చూ, చూరుకమ్మి.

**చూరుమొగ్గ**, వై. వి. చూరుకమ్మియందు వాసమునకు సరిగా మొగ్గవలె చేర్పఱచినది. జై. ౫, ఆ. 157.

**చూరె**, వై. వి. (చూడరు + ఎ) రూ-చూరే: చూ, చుమి. 1.

**చూరెలుక**, ద్వ. వి. ఒకరకము చిన్నయెలుక: చూ, మూషికము.

**చూరే**, వై. వి. (చూడరు + ఏ): చూ, రూ-చూరె.

**చూర్పు**, దే. వి. ఇంటికప్పు, క్రిందికప్పు: చూ, సదనము. 1.

**చూఱ**, వై. వి. = చౌర్య. రూ-చోఱ. కొల్ల: చూ, లూటీ. 4.

**చూఱకాఁడు**, మి. వా. విశ. కొల్లపెట్టినవాఁడు (ఇది బిరుదు పేరు. బిరుదుపేళ్ళు లక్షణమునకు కట్టుపడియుండవు): చూ, హారకుఁడు. 1.

**చూఱకొను**, ద్వ. స. క్రి. రూ-చూఱలాడు-చూఱాడు. కొల్లపెట్టు: చూ, ముచ్చిలించు.

**చూఱకోలు**, ద్వ. వి: చూ, చూఱ.

**చూఱలాడు**, ద్వ. స. క్రి. (చూఱలు + ఆడు): చూ, చూఱకొను.

**చూఱలాడుట**, జా. అంతయు హరించుట. "సీ. పీఁదకేయుల యించి శ్వేతలమానంబు చూఱలాడిన లోకసుందరుఁడు." (భాగవతము); "ఉ. లే, నవ్వు దొలంగు నీదు నయనంబుల నామది చూఱలాడెడిన్" (కవికర్ణరసాయనము.)

**చూఱపోవు**, ద్వ. అ. క్రి. (చూఱ + పోవు) కొల్లపోవు: చూ, పఱిపోవు.

**చూఱాడు**, ద్వ. స. క్రి. (చూఱ + ఆడు): చూ, చూఱకొను

**చూలాలు**, దే. వి. (చూలు + ఆలు): చూ, గ్రావా.

**చూలి**, దే. వి. బిడ్డ: చూ, శిశువు.

**చూలు**, దే. వి. 1. గర్భము: చూ, భ్రూణము. 1; 2. బిడ్డ: చూ, శిశువు; 3. గర్భస్థపిండము: చూ, భ్రూణము. 2; 4. గోమహిష్యాది ప్రథమగర్భము, గర్భగ్రహణము (అని కొందఱు): చూ, ప్రజననము. 1; 5. చూలగునట్టి కాలము: చూ, ప్రజనము. 2.

చూలుకొను, దే. అ. క్రి. చూలుగలదియగు: చూ. చూలువడు.

చూలువడు, ద్వ. అ. క్రి. (చూలు + పడు) —పై.—

చూవె, ద్వ. వి. (చూడవు + ఎ) రూ - చూవే: చూ, చుమి. 1.

చూవే, —పై.—

# చౌ

చౌంగ, దే. వి. చొల్లు: చూ, లాల.

చౌంగణ, అం: చూ, రూ - చాంగణ.

చౌంగణము, —పై.—

చౌంగిణి, —పై.—

చౌక, వై. వి. = చోక్ష: చూ, రూ - చొక్కము. 2-3.

చౌకా, వై. వి. 1. = కంచుకా. రూ - చౌక్కా: చూ. వస్త్రము; విణ. 2. స్వచ్ఛమైనది: చూ, రూ - చొక్కము. 2.

చౌకాటము, వై. విణ. = శృంగార: చూ, రూ - చొక్కము. 2.

చౌకాయ, వై. వి. = కంచుకా. రూ - చొక్కాయ-చొక్కాయి - చౌకాయి - చొక్కా - చౌకా - చౌగా - చౌలా: చూ, వస్త్రము. 1—ౚ.

చౌకాయి, —పై.—

చౌకారము, వై. వి. = శృంగార. 1. మిక్కిలి స్వచ్ఛత: చూ, రూ - చొక్కము. 2; విణ. 2. మిక్కిలి స్వచ్ఛమైనది: చూ, రూ - చొక్కము. 2.

చొక్క, వై. విణ. =: చూ, రూ - చొక్కము. 2. (వృత్తియందు చొక్కమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము) "చొక్కసంగతులు" మొ.

చొక్కటము, =—పై.—1.

చొక్కడము, =—పై.—

చొక్కణ, దే. వి: చూ, శీతల*.

చొక్కతరము, వై. విణ. =: చూ, రూ - చొక్కము. 2.

చొక్కపుబంగారు, ద్వ. వి. అపరంజి: చూ, లోహము. 1.

చొక్కము, వై. విణ. 1. అధికకాంతిగలరత్నము: చూ, రత్నములు. 1—౧౦—(౫); 2. = చోక్షమ్. స్వచ్ఛమైనది (రూ - చౌక - చౌకా - చొక్క - చొక్కా - చొక్కటము - చొక్కడము - చౌకాటము - చొక్కాటము - చౌకారము - చొక్కారము): చూ, హృద్యము; 3. అందము: చూ, సౌందర్యము.

చొక్కా, వై. వి. 1. = కంచుకా. రూ - చొక్కాయ: చూ, వస్త్రము; విణ. 2: చూ, రూ - చొక్కము. 2. (వృత్తియందు చొక్కాటమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము "చొక్కాపొత్తము." మొ.)

చొక్కాకు, ద్వ. వి. (చొక్కు + ఆకు) ఎండాకు: చూ, పత్రము. 1. (శుష్కశబ్దతద్భవమని పురుషోత్తమకవీయము.)

చొక్కాటము, వై. విణ. = శృంగార: చూ, చొక్కము. 2. (వృత్తియందు అంత్యోపాంత్యవర్ణములకు లోపము.)

చొక్కాయ, వై. వి. = కంచుకా: చూ, చొక్కా. 1.

చొక్కాయి, —పై—

చొక్కారము: చూ, రూ - చౌకారము.

చొక్కిడు, దే. స. క్రి. (చొక్కు + ఇడు): చూ. వంచించు.

చొక్కిలి, దే. వి. 1. చెంబు లోనగునవి క్రిందఁబడుట లోనగు వానిచే నగు నొక్కు, చొట్ట: చూ, సొట్ట; 2. దేహమునందు రోగముచేత గలిగిన పల్లము అనఁగా వంకర: చూ, వెల్లితము. 2; విణ. 3. రోగముచే వంకరైనది. చొట్ట: చూ, సొట్ట.

చొక్కిల్లపోవు, దే. అ. క్రి. (చొక్కిల్ల + పోవు): చూ, వంకరవోవు.

చొక్కు, వై. విణ. 1. ఎండినది. "చొక్కాకు": చూ, విశీర్ణము. 2; దే. వి. 2. యువయువతి సంభృతప్రేమ: చూ, వలపు. 2; 3. మూర్ఛ: చూ, రోగము. 1; 4. మీఁదఁజల్లినచో పరవశముచేయు భస్మవిశేషము: చూ, మైదు; 5. పారవశ్యము: చూ, విస్మృతి:

చొక్కునీరు, ద్వ. వి. కల్లు: చూ, సుర. 1.

చొక్కుపెట్టు, దే. స. క్రి: చూ, చొక్కిడు.

చొక్కుపొడి, దే. వి: చూ, చొక్కు. 4.

చొక్కుమందు, —పై.—లక్ష్మీ. 1, ఆ. 47.

చొగా, వై. వి. = కంచుకా. రూ - చొక్కా: చూ, వస్త్రము.

చొచ్చినయిల్లు, ద్వ. వి. 1. ప్రవేశించినయిల్లు. రూ - చొచ్చి నిల్లు: చూ, సదనము. 1; వా. 2. అత్తిల్లు. రూ - చొచ్చి నిల్లు: చూ, సదనము. 1.

చొచ్చినిల్లు, —పై.—

చొచ్చిలు, దే. అ. క్రి. రూ - చొచ్చిల్లు - చొచ్చు - చొత్తెంచు - చొరఁబడు - చొరఁబాఱు. ప్రవేశించు: చూ, సోఁకు. 4.

చొచ్చిల్లు, —పై.—

చొచ్చు, —పై.—

చొటచొట, దే. వి. కాఱుట వడియుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చొట్ట, దే. వి: చూ, చొక్కిలి.

చొడచొడ, దే. వి. చిప్పిల్లుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చొత్తెంచు, దే. అ. క్రి. (చొచ్చు + తెంచు): చూ, రూ - చొచ్చిలు (స్వార్థమున తెంచు.)

చొదుగు, దే. వి. తడి: చూ, పదను. 2.

చొదుము, దే. వి. ఎండిన అరఁటిపట్ట: చూ, బెరడు.

చొనుపు, దే. స. క్రి. 1. చెక్కు: చూ, వారు. 1; ప్రే. 2. రూ- చొన్పు - చొప్పరించు - చొప్పపఱచు - చొప్పఱచు - చొప్పించు: చూ, దోఁపు. 5.

చొన్పు, దే. ప్రే. రూ - చొనుపు : చూ, దోఁపు. 5.

చొప్ప, దే. వి. జొన్న లోనగువాని దంటు.

చొప్పకాఁడి, దే. వి. రెండెడ్లనుకట్టి తోలెడు డింకువంటి చొప్ప మోపు.

చొప్పడు, ద్వ. అ. క్రి. (చొప్పు + పడు) 1. అత్తు: చూ, సరిపడు. 2; 2. కలుగు: చూ, పుట్టు. 2; 3. లభించు: చూ, సిద్ధించు.

చొప్పరి, దే. విశే. (చొప్పు + అరి) బాటసారి: చూ, పాంథుఁడు.

చొప్పరించు, దే. ప్రే. చొప్పించు: చూ, దోఁపు. 5.

చొప్పపఱచు, —పై.—

చొప్పించు, —పై.—

చొప్పిల్లు, దే. అ. క్రి. తగు: చూ, సరిపడు. 2.

చొప్పు, దే. వి. 1. త్రోవ: చూ, మార్గము. 1; 2. రీతి: చూ, విధము. 1; 3. జాడ: చూ, సూచన. 1.

చొప్పున, దే. అవ్య. ఏసి: చూ, వంతున.

చొబలము, దే. వి. గుజ్జము గర్భమందుండుపిండము: చూ, భ్రూణము. 1.

చొరఁబడు, ద్వ. అ. క్రి. (చొరన్ + పడు): చూ, చొచ్చిలు. (స్వార్థమునపడు.)

చొరఁబాఱు, దే. అ. క్రి. —పై.—

చొరపోఁత, దే. విశే. (చొరవ + పోఁత) ఎడములేనిది. "వానికి అమ్మవారు చొరపోఁతగా పోసినది.": చూ, సర్వము.

చొరవ, దే. వి. 1. అభినివేశము: చూ, ప్రవేశము; 2. బుద్ధి కుశలత : చూ, బుద్ధి; 3. అన్నముమీఁది యిచ్ఛ : చూ, వాంఛ. 1—౨౮.

చొరవకత్తియ, ద్వ. విశే. రూ - చొరవకత్తె. చొరవగలది: చూ, స్త్రీ. 1—౨౦౩.

చొరవకాఁడు, దే. విశే. చుఱుకరి: చూ, సాహసికుఁడు.

చొరుగు, దే. వి. రూ - చొరువు: చూ, చొక్కాకు.

చొరువు, —పై.—

చొఱ, దే. వి. 1. రూ - చొఱ్ఱ - చోఱ - రాజీవమనుచేఁప: చూ, మత్స్యము, 1; విశే. 2. బాలుఁడు: చూ, శిశువు. 1—౫.

చొఱచోఱ, దే. వి. వడియుటయందును జొబ్బిలుటయందును నగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

చొఱమీను, ద్వ. వి: చూ, చొఱ. 1.

చొఱిగాఁడు, దే. వి. కిరాతుఁడు: చూ, వ్యాధుఁడు. 1.

చొఱుగు, వా. వి. (దసుర్కి-పెట్టె) అఱ: చూ, రూ - సొఱుగు.

చొఱ్ఱ, దే. వి: చూ, రూ - చొఱ. 1.

చొలయు, దే. అ. క్రి. 1. మూర్ఛపోవు: చూ, సొమ్మసిల్లు; 2. యుద్ధమునఁబాఱు: చూ, వెనుదీయు. 1; 3. వైముఖ్యత నొందు: చూ, రూ - సొలయు; 4. వైరస్యమునొందు: చూ, రూ - సొలయు.

చొలా, వై. వి. = కంచుకా. అంగరకా: చూ, వస్త్రము. 1—౯.

చొల్లు, దే. వి. చొల్లు: చూ, చొంగ.

చొల్లియము, దే. వి. జడతో చుట్టినచుట్ట. కబరీవిశేషము, రూ - చొల్లెము

చొల్లెము, —పై.— స్కా. 4, ఆ. 30: చూ, వేనలి.

## చో

చో, దే. వి. 1. కాలము: చూ, సమయము. 1; 2. చోటు: చూ, స్థానము. 1.

చోన్, దే. వి. అచ్చోటన్, ఇచ్చోటన్, కానిచోటన్, లేని చోటన్, ఇత్యాది సమాసపదములయందు ఉత్తరపదమైన 'చోటు' శబ్దముయొక్క సప్తమీ విభక్తిరూపమునందు టవర్ణము లోపింపఁగా మిగిలినది. ఉదా.—"అచ్చోన్, ఇచ్చోన్ కానిచోన్, లేనిచోన్" మొ. ఇది కొన్నియెడల అప్పుడు అనునర్థము నిచ్చుచున్నది. "ప్రాణహాని తప్పించుచో" ఇత్యాదులు. (శ. ర.)

చోటు, దే. వి. తానము: చూ, స్థానము. 1.

చోడి, దే. వి. 1. సస్యవిశేషము. వి, పు. 4, ఆ. 16: చూ, సస్యము. 1; 2. ధాన్యవిశేషము: చూ, ధాన్యము. (బ. చోళ్లు): చూ, (స్తంబకరి. 1—౨౬—(౧).

చోడు, దే. వి. రూ - సోడు. బ్రహ్మరంధ్రము: చూ, మాడపట్టు.

చోడుమ, దే. వి. రూ - చోద. కష్టము: చూ, శోకము.

చోద, —పై.—

చోద్యము, వా. వి. రూ - సోద్దెము; చూ, వింత. 1.

చోపు, వై. వి. 1 = క్షోభమ్. కలఁత: చూ, సంతాపము; స. క్రి. 2. = క్షుభ్. కలఁచు: చూ, కలఁచియాడు; 3. నడపించు, తోలు - రూ - త్రోలు: చూ, పరిభవించు. 1; 4. వెంబడించి పరుగెత్తు: చూ, పాఱఁదోలు.

చోపుడు, వై. వి. = : చూ, చోపు. 1.

చోపుడుఁగట్టె, ద్వ. వి. చోపు పెట్టుకోల, చోపుడుఁగోల.

చోపుడుఁగోల, —పై.—

చోపుదారుఁడు, వా. వి. చూ, వేత్రధరుఁడు.

## డూ

డూడూ, వా. అవ్య. గంగిరెద్దును పిలుచుటయందగు ధ్వన్యనుకరణము. "డూ-డూ-అప్పన్న": చూ, హహాహూ.

డూయు: చూ, రూ-డుయ్యి. 1—2—3—4.

## డె

డెంకణము, వా. వి. నమస్కారము: చూ, హజీగలు.

డెంకిక, అం: చూ, జన్యతాళములు.

డెందము, దే. వి. ఉల్లము: చూ, హృదయము.

డెందమ్ముమూలి, ద్వ. వి: చూ, మన్మథుడు. ఆం, భా. ప్ర. 45.

డెక్క, దే. వి గిట్ట. పాండు. 5, ఆ. 240: చూ, వింఖము.

డెక్కి, వా. వి. ఒకరకము తలపాగ: చూ, సీసకము. 1-3: (చూ, వస్త్రము.)

డెక్కు, దే. స. క్రి అడ్డగించు: చూ, వారించు.

డెక్కొను, దే. స. క్రి. (డెక్క+కొను) నెలకొను: చూ, స్థిరపడు.

డెప్ప, దే. వి. కొండమీఁది సమమైనచోటు, నెత్తము: చూ, పర్వతము.

డెప్పరము, దే. వి. రూ-దెప్పరము. 1. కష్టము: చూ, శోకము; 2. ఆపద: చూ, విపత్తు; విణ. 3. అశక్యము: చూ, లావు. 7; 4. దుస్సహము: చూ, వెక్కసము. 4; 5. అసాధ్యము: చూ, ముగ్గొయ్య; 6. దుర్లభము: చూ, రూ-దెప్పరము.

డెప్పరించు, దే. అ. క్రి. అశక్యమగు: చూ, తలమునప్పు.

డెప్పు, దే. స. క్రి. ఎత్తిపొడుచు: చూ, రూ-దెప్పు.

డెబ్బండ్రు, ద్వ. స. డెబ్బదిమంది. (డెబ్బదికి మహన్మహత్యర్థకరూపము.)

డెబ్బడి, ద్వ. స. (ఏడు × పది = 7 × 10 = 70) ఏడుపదులు: చూ, సప్తతి. (డెబ్బదిమూఁడు.— భార. కర్ణ. 1, ఆ. 127; డెబ్బదిరెండు.— హంస. 1, ఆ 52; డెబ్బదేను,— భార. ద్రోణ. 4, ఆ. 213.)

డెస్సరు, వా. వి: చూ, డ్రెస్సరు.

## డే

డేక, వా. అ. క్రి. చేతులు నేలనాని ముడ్డితో గెంతు.

డేగ, దే. వి: చూ, శ్యేనము.

డేగాట, దే. వి. పెండ్లి అయిదవనాఁడు పెండ్లికొడుకును పెండ్లికూఁతురును మూఁపులమీఁద నెత్తికొని వారిచే మాలలు మార్పింప దేగ్గలవలె ఎగిరియాడెడు ఆట, ఆడుచు బుక్కాబగ్గుండల (జల్లుకొనుట అని కొందఱు): దండాట, దండడింపు.

డేగిస, వా. వి పెద్దకాఁగు: చూ, పాత్రము. 6.

డేర, దే. వి. రూ-డేరా. గుడారము: చూ, సదనము. 1.

డేరా, —పై.—

## డై

డైమాను, వా. వి. చీట్లపేకలోని యొకానొక మెట్టునిరంగు: చూ, పేక. 2.

డైరీ, వా. వి. దినచర్య పొత్తము.

## డొ

డొంక, దే. వి. నడచుటవలన పల్లముగా నేర్పడిన కాలిదారి: చూ, మార్గము. 1. (గుంటూరు ప్రాంతమున వాడుక); 2. ఈరము. స్వా. 4, ఆ. 42: చూ, పొద. 2; 3. కోన. స్వా. 4, ఆ. 37: చూ, విపినము; వా. 4 బ్రహ్మచెముడు లోనగు ముండ్లకంపలతో నిండి మనుష్యులు పోవుట కసాధ్యముగ నుండెడు చోటు. (గోదావరీమండల ప్రాంతమున వాడుక.)

డొంకతిరుగుడుమేళము, లో. విప్పు శక్యముకానిది.

డొంకవల, దే. వి. ఒకరకము వల: చూ, వల. 1.

డొంకు, దే. వి. 1. వంకర: చూ, వేల్లితము. 2; అ. క్రి. 2. అడఁగు. స్వా. 3, ఆ. 53: చూ, ముడుఁగు. 4; 3. ఇంకు. నిర్వ. 3, ఆ. 72: చూ, శోషించు; 4. ఎండు, నీరింకు: చూ, ఎండు. ?.

డొంకెన, దే. వి. వంకర అలుఁగుగల యీఁటె. కళా. 8, ఆ. 57: చూ, బాణము. 1-౧౫-(౧). (1-౨౦).

డొంగ, దే. వి. రూ-దొంగ: చూ, హారకుఁడు.

డొంగు, దే. వి. రూ-దొంగు. 1. చెట్టుతొఱ్ఱ: చూ, రంధ్రము. 1-౩; అ. క్రి. రూ దొంగు. 1; 2. దాఁగు: చూ, మఱుఁగుపడు.

డొందు, దే. అ క్రి. ఇంకు: చూ, శోషించు.

డొకారము, దే. వి. ఎల్లదిక్కులకు నడిమిచోటు: చూ, మండపము. 1.

డొకారముసొచ్చు, దే. అ. క్రి. (డొకారము+చొచ్చు): చూ, లోఁబడు.

డొక్క, దే. వి. 1. ముసలివాఁడు. ఆం, భా. ద్వి. 119: చూ, వృద్ధుఁడు. 1; 2. ఒడలి యెముకలగూఁడు: చూ, శల్యము. 1; 3. కొంకాయ బొండపుచెక్క; 4. కడుపు: చూ, భ్రూణము. 1.

డొక్కబుఱ్ఱ, దే. వి. తేగపాతి వీకిన తాటివిత్తు: చూ, వితనము.

డొక్కర, వై. వి. = డోకర: చూ, డొక్కస.

డొక్కరము, వై. వి. = —పై.—

డొక్కలోమెదలుట, జా. పగవీర్చుకొనువలకు జ్ఞాపకమునకు వచ్చుట. "మేమనఁగా నిఁక నీడొక్కలో నొకప్రక్క మెదలువారము." (ధర్మజ రాజసూయము.)

డొక్కశుద్ధి, వా. వి. కొద్దిచదువు.

డొక్కస, అం. (డొక్కర-రూ - డొక్కరము - డొక్కారము) విన్నాణముల ముప్పదిరెండింటిలో నొకటి: చూ, విన్నాణములు.

డొక్కి, వా. వి. అగప: చూ, రూ-డోకి.

డొక్క, దే. వి. 1: చూ, రూ-డొక్క. 1. ఆం, భా. ద్వి. 119; విణ. 2. ముదిసినది; తె. ఉత్తరది; అ. క్రి. 4. ముదిమిపొందు; చూ, ముదియు.

డొక్కారము, అం: చూ, డొక్కన.

డొగరు, దే. వి. 1. అపరాధము: చూ, నేరము; 2. దూఱు: చూ, నింద. 1.

డొప్ప, దే. వి. రూ-దొప్ప. నై. 7, ఆ. 93; చూ, పాత్రము. 6: చూ, (డిప్ప).

డొబ్బముక్కు, వా. వి. బుబ్బముక్కు.

డొబ్బముక్కువాఁడు, వా. వి. బుబ్బముక్కువాఁడు.

డొలక, వా. వి. గుళక: చూ, బోలు.

డొలుచు, దే. ప్రే. డొల్లఁజేయు. రూ, డొల్చు.

డొల్చు, దే. ప్రే. —పై.— కాశీ. 1, ఆ. 77.

డొల్ల, దే. వి. 1. చేటవలె మూఁడు ప్రక్కలయందు అడ్డు పలక గల బల్ల లోనగునది; 2: చూ, డొలక.

డొల్లు, దే. అ. క్రి: చూ, రూ-దుల్లు (పొర్లు.-కాశీ. 1, ఆ. 77.)

## డో

డోఁకు, దే. వి. 1. ఓకరు: చూ, వాంతి; అ. క్రి. 2. ఓకిలించు: చూ, వెళ్ళగొట్టు; స. క్రి. 3. గడ్డి లోనగుదాని నెమరుగాఁ జెక్కు: చూ, రూ-దోఁకు.

డోఁగాడు, దే. అ. క్రి. (డోఁగి + ఆడు): రూ-డోఁగియాడు-డోఁగు, తడవాడు - రూ - తడవు - తడవియాడు, దోఁగాడు-దోఁగు-దోఁగియాడు.

డోఁగియాడు, దే. అ. క్రి. —పై.—

డోఁగు, దే. అ. క్రి. 1. —పై.—; 2. మేనితో లోలియు: చూ, రూ-దోఁగు.

డోకడాలు, దే. వి. బ. 1. అసలుసొమ్మును నెలలచే గుణించఁగా వచ్చిన సంఖ్య; 2. నూఱవపాలు.

డోకి, వా. వి. రూ-డొక్క: అగప-రూ-అపక-అబక, కొయ్య గరిఁటె.

డోరము, సం. వి. అ. న. రూ-తోరము. చేతఁ గట్టుకొనెడు వ్రతసూత్రము: చూ, సూత్రము. 1-౧౭.

డోరములు, దే. వి. బ. కత్తిమీఁది చాలలు.

డోరియములు, వా. వి. బ. 1. బట్టయొక్క పడుగు పేకల యొక్క గళ్ళు; 2. సత్తురేకుపై నుండు పల్లములు; 3. బెజ్జములు.

డోల, సం. వి అ. స్త్రీ. 1. = డోలా. రూ-డోలిక-దోల-దోలిక. ఉయ్యాలవంటి అందలము, డోలి: చూ, సవారి; 2. తొట్ల, ఉయ్యాల: చూ, శయ్య. 1; 3. నీలి*: చూ, రంజని; అం. 4: చూ, సంయుతహస్తములు.

డోలనము, సం. వి. అ. న. ఊఁచుట, ఊఁపు.

డోలము, సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము: చూ, వ్యంజకము. 1.

డోలా, వై. వి. 1. = డోల: చూ, డోల. 1; 2. చర్మవాద్య విశేషము, డోలు: చూ, వీణె.

డోలాపాదము, అం: చూ, కరణములు.

డోలాఫలము, సం. వి అ పుం. ఇప్ప*: చూ, మధూకము.

డోలాబ్జము, సం. వి. అ. న. కలువపువ్వు: చూ, సహస్రపత్రము. 1-౧౨-౯).

డోలి, వై. వి. = డోలిక: చూ, డోల. 1—2.

డోలిక, సం. వి. అ. స్త్రీ. = డోలి.—పై.—

డోలు, వై. వి: చూ, రూ-డోలా. 2. అచ్చ. యు, కాం. 205.

డోసు, వా. వి. 1. త్రాఁగెడుమందు. మోతాదు; విణ. 2. త్రాఁగునది.

## డౌ

డౌలు, దే. వి: చూ, రూ-దవులు.

డ్రయివరు, వా. వి. బండినడపువాఁడు.

డ్రెస్సరు, వా. వి. వైద్యుఁడు, డెస్సరు.

డ్రెస్సు, వా. వి. ధరించిన పరిశుభ్రమైన వస్త్రాదికము.

## ఢ

ఢ, ఒక యక్షరము. సం. వి. అ. పుం. 1. దయ్యము: చూ, భూతము; 2. భయము: చూ, సాధ్వసము; 3. కాలము: చూ, సమయము. 1; 4. ప్రేమ: చూ, స్నేహము. 1; 5. బాటసారి: చూ, పాంథుఁడు; 6. ధ్వని: చూ, స్వరము. 2-౪౯-(౩); పుం 7. కొడుకు: చూ, సూనుఁడు. 1; స్త్రీ. 8. జయభేరి: చూ, స్వరము. 2; న. 9. జ్ఞానము: చూ, హృల్లేఖము. 2; విణ. 10. గుణములేనివాఁడు: చూ, నిర్గుణుఁడు. 1; 11. గూఢుఁడు: చూ, దాఁగినవాఁడు; 12. పోలిక: చూ, సమానము. 2; 13. కుడి: చూ, సవ్యము. 2. (కుడి ప్రక్క అనియు); 14. ఎడమ: చూ, సవ్యము. 2. (ఎడమ ప్రక్క అనియు); 15. వాద్యము: చూ, వీణ 1-౬౦; 16. ఢ అను ధ్వని: చూ, స్వరము. 2. (వీణ. 1-౬౬). అం. 17: చూ, మూర్ధన్యములు; 18 టవర్గములోని యక్షరము: చూ, కవర్గము.

ఢంకము, సం. వి. అ. పుం. అచ్చుఁబోడచిన యాఁబోతు: చూ, వృషభము. 1.

ఢక్క, సం. వి. అ. స్త్రీ. 1. = ఢంకా. యశఃపటహము, రాజులు బయలు దేరునపుడు ముందుప్రక్కను వాయించెడి వాద్యము: చూ, వీణ. 1-౬౦; అం. 2: చూ, ఆనద్ధవాద్యములు.

ఢక్కాముక్కీలు, వా. మి. వి. బ. అరిందా, ప్రయోజకత్వము. "ఢక్కాముక్కీలు తీటినాఁడు."

ఢమామిక, సం. వి. అ. స్త్రీ. = ఢమాయి: చూ, వీణ.

ఢమ్మను, వా. మి. అ. క్రి: చూ, ఢమ్మను.

## ఢా

ఢాక, వా. వి. దెబ్బ. "నీ ఢాకకు ఆగుట కష్టము".

ఢాము, వా. వి: చూ, తారు. (ఢాం అనియు.)

ఢామ్మను, వా. మి. అ. క్రి: చూ, ఢమ్మను.

ఢాలము, సం. వి. అ. న. = ఢాలు: చూ, హరిగ.

## ఢు

ఢుంఢి, సం. వి. ఇ. పుం. గణేశుఁడు: చూ, వినాయకుఁడు. 1.

ఢులి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. = దులి. రూ-ఢులి, ఆఁడుతాఁబేలు, కమఠి: చూ, వృత్తము. 4.

## ఢో

ఢోలము, సం. వి. అ. పుం. = డోలు: చూ, వీణ.

## ణ

ణ, ఒక యక్షరము. సం. వి. అ. పుం. 1. జారుఁడు: చూ, అంకుముఁడు; 2. భయంకరరసము, చూ, రసములు; 3. ముల్లు: చూ, సితాగ్రము; 4. గగురుపాటు: చూ, రోమాంచము; 5. చప్పుడు: చూ, స్వరము. 2; 6. శూరుఁడు: చూ, హంవీరుఁడు. 2; 7. కాపాడుట: చూ, రక్షణము; స్త్రీ. 8. రేయి: చూ, రాత్రి; 9. పానుపు: చూ, శయ్య. 1; 10. ఆవు: చూ, ధేనువు; 11. నాసిక: చూ, ముక్కు; 12. కృప: చూ, దయ; న. 13. తామరతేకు: చూ, పద్మము. 1; 14. తెలివి: చూ, హృల్లేఖము. 2; విణ. 15. ఉమకలేని వస్తువు; 16. కంకణము: చూ, భూషణము. 2; 17. కన్ను: చూ, లోచనము. 1; 18. రమ్యము: చూ, హృద్యము; 19. విశాలము, విస్తారము: చూ, విపులము; అం. 20: చూ, మూర్ధన్యములు; 21. అనునాసికములలో నొకటి: చూ, అనునాసికములు; 22. టవర్గమునందలి యక్షరము: చూ, కవర్గము; వా. వి. 23. (ఉచ్చారణ లోపముచే వాడఁబడెడు) అణానాణెము; అం. 24: చూ, ణా; 25. కొన్నిచోట్ల 'న' యొక్క రూపాంతరము.

